# సంపూర్ణ భారతదేశ
# యాత్రా మార్గదర్శిని

సేకరణ కర్త :

**K. రాధాకృష్ణమూర్తి, B. A.,**

పబ్లిషర్స్ :


**బాలాజి బుక్ డిపో.,**

పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్

మెయిన్ బజార్ * విజయవాడ 520 001.


 1989 [వెల : 120-00

# సంపూర్ణ భారతదేశ యాత్రా మార్గదర్శిని

సేకరణ కర్త :

K. రాధాకృష్ణమూర్తి, B. A.,

పబ్లిషర్స్ :

బాలాజి బుక్ డిపో.,
పబ్లిషర్స్ & బుక్‌సెల్లర్స్
మెయిన్ బజార్ * విజయవాడ-520 001.

 1989 [ వెల : 120-00

# సంపూర్ణ భారతదేశ యాత్రా మార్గదర్శిని

సేకరణ కర్త :

K. రాధాకృష్ణమూర్తి, B. A.,



ప్రథమ ముద్రణ :

శ్రీ శుక్ల ఉగాది

ముఖ చిత్రం :

V. S. ప్రకాష్

ముద్రణ :

అనూరాధా ప్రింటర్స్,
విజయవాడ—520 001.

# అంకితం



శ్లో॥ నిరుపమగుణసింధు ర్నిత్యలక్ష్మీ సమేతో
నిఖిలనిగమవేద్యో నిస్తులో వేంకటేశః
నిజచరణ సమర్చాసక్త భక్తాఘరక్షీ
నివసతు హృదయేమే స్వాంఘ్రిభక్తిం వితన్వన్.

కలియుగ దైవం
తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారి
పాద పద్మములకు భక్తితో

-ధూళిపాళ్ళ రామగోపాలరావు
సంపాదకులు

# భారతదేశం యాత్రిక స్వర్గం

'భారతదేశం యాత్రిక స్వర్గం' అని అభివర్ణించబడింది. ఇది అక్షర సత్యం. ఎంతో చరిత్ర. పురాతన వైభవం, ఎన్నో విభిన్నతలు, విలక్షణ్యాలు, వైప రీత్యాలు, వైవిధ్యాలు కలగలిసి ఈ అఖండ భూ మండలంలో అతి పురాతన కాలం నుండి కలగలపి భిన్నత్వంలో రూపొందిన ఏకత్వానికి దారి తీసిన విషయం మనకు కనపడుతోంది.

అసలు మనిషి ఎప్పుడు పుట్టాడు, ఎక్కడ పుట్టాడు అని- ఆది నుంచి ఏ కాలానికి ఆ కాలం తన పూర్వులను గురించి తెలుసుకోవడానికి, తెలుసుకొని భవిష్యత్ నిర్మాణంలో పునాదిగా చేసుకోవడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే వున్నాడు. అయితే, ఎంతవరకూ కృతకృత్యు దయ్యాడనేదానికి సమాధానం లేని ఒక చిక్కు సమస్య ! నేటికీ అది విప్పలేని పజిల్ !

"ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం ? నరజాతి చరిత్ర సమస్తం పర పీడన పరాయణత్వం" అన్న మహాకవి శ్రీశ్రీ వెలిబుచ్చిన ఆవేదనలో మానవ కోటి చరిత్ర మొత్తం రెండు వాక్యాల్లో దర్పణం పట్టాడు. దీని అంతరార్థం మానవుడైన ప్రతివాడు అంతర్ముఖుడై తన అంతరంగాన్ని పరిశీలించుకోవలసిన అగత్యం నేడు ఎంతైనా వుంది. ఈ పర పీడన పరాయణత్వంలో దాగి ఉన్న శ్రామిక శక్తి దోపిడీకి నరజాతి ఎంత బలైనా చరిత్ర మనకు మిగిల్చిన అఖండ శిల్ప సంపద, ప్రాచీన కళావైశిష్ట్యం, నిర్మాణ నైపుణ్యతా దక్షతలు గీటురాళ్ళుగా మన కెన్నో జ్ఞాపికలను మిగిల్చి వెళ్ళింది. ఎన్నో దండయాత్రలు జరిగాయి. ఎంతో జన నష్టం జరిగింది. డొక్కలంటుకుపోయిన కూలీలు ఎందరో ఈ కట్టడాల కింద నుగ్గునూచయైనారు. అయినా ఆనాటి జ్ఞాపకాలు ఇంకా తెరమరుగు కాలేదు. కాలచక్రం తన గర్భంలో ఎన్నో సంస్కృతులను కప్పివేసుకొన్నా నేటి మానవుడు వాటి పురాతన వైభవాల వెలుగు జిలుగులను బయటకు తెస్తున్నాడు. అవి శిథిలావ శేషాలే ! కాని మానవకోటి మనుగడలో మహత్తర జ్ఞాన దీపికలు. బహుశా మనిషి తనను తాను తెలుసుకోవడానికి ఇక్కడ ఈ గడ్డ మీద జరిగినంత ప్రయత్నం మరెక్కడా జరగలేదనుకోవచ్చు. జీవన విలువలను నిర్దేశించి జీవన కారుణ్యాన్ని బోధించి, సకల చరాచర సృష్టి ఆ భగవంతుని స్వరూపంగా భావించే ఐక్యతా సూత్రాన్ని మహా మానవతకు జోడి చేసి అదే తమ మతంగా ప్రబోధించిన మానవ మనీషులు, మహర్షులు విశిష్ట చరిత్రను సృష్టించి నిత్య ప్రాతఃస్మరణీయులై చరిత్రలో సుచిర స్థానాన్ని పొందారు. మహత్తర దివ్య భూమి మనది; వేద భూమి మనది.

ప్రపంచ నాగరికతకు తొలినాడే అక్షరాలు దిద్దిన దేవగురు భూమి. మనిషి తనను తాను తెలుసుకోవడానికి అనాది నుంచీ ప్రయత్నం జరుగుతోంది. 2500 సంవత్సరాల క్రితమే హిందూ సాధుపుంగవుడు ఏథెన్సు నగరానికి వెళ్ళాడు. గ్రీకు తత్వవేత్త సోక్రటీసు మహాశయుణ్ణి కలుసుకొన్నాడు. అణకువగా అడిగాడు "మీ తత్త్వ రహస్య మేమిటి ?" అని. అందుకు సోక్రటీసు మహాశయుడు "మనిషిని గురించి పరిశోధిస్తున్నాను" అని అన్నాడు. సాధుపుంగవునికి అనుమానం వచ్చింది. "భగవంతుని గురించి ఆలోచించావా- భగవత్తత్వాన్ని గురించి తెలుసుకోకుండా మనిషిని గురించి ఎలా తెలుస్తుంది ?" అని అడిగాడట చిరునవ్వు నవ్వుతూ. వేదాలు, ఉపనిషత్తులు మనిషి జీవన సరళిని నిర్దేశించే సూత్రాలుగా ఆనాడే పరబ్రహ్మ తత్వాన్ని చాటేయి. అంతటి మహత్తరమైన విజ్ఞానం- మానవకోటి మనుగడలో ప్రముఖపాత్ర వహించిన ఘనత ఆనాడే వుంది మనకు- అదే గత కాలపు మనకీర్తి. అపౌరుషేయాలుగా వున్న ఈ వేద సంస్కృతి, సంప్రదాయం ఈ దేశం మొత్తాన్ని ఒకే దారంలో గుదిగుచ్చింది. ఈ దేశంలో పారే పవిత్ర నదీ నదాలు, ఉద్భవించిన దేవ భూములయిన హిమాలయాలు మన సంస్కృతీ సంప్రదాయ వాహికలు. శిలలలో శిల్పాలు చెక్కి సృష్టికే సరికొత్త అందాలు పొదిగిన వైనాలు, అవి మనకు వినిపించే కోటి కోటి కథలు- ఎన్నిసార్లు చూచినా తనివి తీరని ప్రకృతి అందాలు అన్నీ ఈ దేశపు సాంప్రదాయక వారసత్వపు సొత్తు. ఇది అంతా నాదే ! నాదే ! అని ప్రతి ఒక్కరూ గర్వించదగిన పావన మాతృదేశం. ఈ దేశంలో ఇది చూడండి, అది చూడండి అని ఎక్కడ వేలు పెట్టి చూపించగలం ? ఎక్కడ చూసినా ఏదో ఒక ప్రత్యేకత, విశిష్టత నాట్యమాడుతూనే వుంది. ప్రతి అణువూ సృష్టికర్త తన సమస్త మేధస్సునూ మథించి సృష్టించిన అందాల ప్రోవులు. ఇటు కాశ్మీరం నుంచి కన్యాకుమారి వరకూ విస్తరించిన ఇది ఒక దేశం- కాదు కాదు పలుదేశాల కూటమి. అయినా అంతా మనదే ! మన మంతా ఒక్కటే !

పూర్వకాలంలో మనకు ప్రయాణ సౌకర్యాలు అంతగా లేవు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసేవరకూ ఒక ఎత్తుగా జరిగింది. అక్కడి నుంచి యంత్ర యుగ ప్రభావం జాస్తి అయి అభివృద్ధి గమనంలో చురుకుతనం, వేగం అనంతంగా పెరిగింది. ఇటీవల ఈ వేగం వాయు వేగాన్ని మించిన జెట్ స్పీడులో వుంది. విజ్ఞానం ఎన్నెన్నో అధునాతన సౌకర్యాలను సమకూర్చింది. ఈ సౌకర్యాలను ఎవరికి వారు స్వంతం చేసుకోవటానికి పోటీ ప్రారంభమయింది. ఆలోచనా రీతుల్లో కూడా గణనీయమైన మార్పు చోటు చేసుకుంది. మనస్సులు వ్యాపారపరమైపోయాయి.

ఈ నేపథ్యంలో మనిషి మనుగడకు తాపత్రయపడటంలో ఏర్పడే పోటీతో అంతర్ముఖుడై తనను తాను చూసుకోవటం మరిచాడు. వ్యవస్థలు మారాయి. అయినా మనసుల్లో విశాలత్వం నానాటికి తరిగిపోతోంది. "జాతస్య మరణం ధ్రువం" అనేది మరిచిపోయి తోటి మనిషికి- కాదు కాదు, మానవకోటి మొత్తం మనుగడకే ఎసరుపెట్టి కూర్చున్నాడు. సంకుచితత్వం చరిత్ర కాలగమనంలో పుట్టి గిట్టిన వైభవాల సంస్మరణ సైతం కాలగతి మర్మాన్ని మరిచిపోతున్నాడు. ఈ చరిత్రలు మరల శిథిలాల మీదనే పునరుజ్జీవింపజేసుకోవాలనుకుంటున్నాడా ? ఒక్కసారి తిరిగి ఆలోచించండి. రాజకీయ వ్యవస్థల్లో వచ్చిన మార్పుల వల్ల దేశంలో ప్రాంతీయతా విభేదాలు తలలెత్తడం దురదృష్టకర పరిణామం. దీనికి వెంటనే పెట్టాలి ఫుల్‌స్టాప్. అదిగో అందుకనే కావాలి సమైక్యత. పెరగాలి మనిషి మనిషికి మధ్య అవగాహన. ఈ అవగాహనకు తోడుపడేవే పర్యటనలు, యాత్రలూ. తెలుగులో దేశ పటాన్ని మొత్తం ఒకచోట చూపించే ప్రయత్నం చేయటానికి ప్రేరణ ఇదే ! ఈ ప్రయత్నంలో మేము సమీకరించి మీ కందించిన సమాచారం సమగ్రంగా వుందనే మా నమ్మకం. అయితే తెలిసో తెలియకో, తొందరపాటునో, మరే కారణం చేతనో ఈ పుస్తకంలో చోటు చేసుకోలేని స్థలాలు, వివరాలు విజ్ఞులు, సహృదయులు గమనించి వ్రాస్తే వచ్చే ముద్రణకైనా సమగ్ర స్వరూపం సాధించటానికి రాజీ లేని ప్రయత్నం జరుగుతుందని సవినయంగా మనవి చేస్తున్నాము.

ఈ సమాచార సేకరణంలో, మీకు నచ్చే విధంగా (మే మనుకుంటున్నాం) మీ ముందుంచటానికి తోడుపడిన మిత్రులు, శ్రేయోభిలాషులు, అనేక గ్రంధకర్తలకూ అందరికీ మా కృతజ్ఞతాభివందనాలు. ఈ పుస్తక ప్రచురణలో ప్రత్యేక శ్రద్ధ కనబరిచి నిర్విరామంగా కృషిచేసిన ప్రింటర్ మహాశయులకు, అందంగా తీర్చిదిద్దటానికి తమ కాయశక్తులా చిత్తశుద్ధితో తమ వంతు కర్తవ్యాన్ని ఎంతో ఉత్సాహంగా నిర్వర్తించిన ప్రకాశకులకు హృదయపూర్వక నమస్సులు చెల్లిస్తూ "ఏ దేశమేగినా, ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని" అనే ప్రబోధాన్ని మరోసారి గుర్తుకు తెచ్చుకుని, గుర్తు చేస్తూ జాతీయ సమైక్యతకు మా వంతు చిరు కానుకగా సమర్పిస్తూ సెలవు తీసికొంటున్నాము. అనుమతివ్వండి- మీ

సేకరణ కర్త,
**K. రాధాకృష్ణమూర్తి,**
జయశ్రీ పబ్లిసిటీస్,
భరద్వాజ వీధి, గాంధీనగర్,
విజయవాడ-520 008.

# ద్వాదశ జ్యోతిర్లింగాలు

భారతదేశంలో పేరెన్నికగన్న శైవక్షేత్రాలు మహిమోపేతమైనవిగా భావించ బడే ద్వాదశ జ్యోతిర్లింగాలు దర్శించుట మహా పుణ్యప్రదము. అక్కడ దక్కడా ఉన్నవానిని ఒకే శ్లోకంలో చెప్పటం జరిగింది. ఆ శ్లోకం పఠిస్తేనే సప్త జన్మల సంచిత పాపాలు భస్మీపటలం అవుతా యంటారు. అంతటి మహత్తు గల జ్యోతి ర్లింగాలు అమరియున్న విధానం ఏ రాష్ట్రంలో ఏది వుందో కరతలామలకంగా వుండేందుకు ఆస్తికమ్మన్యులకు తెలియపరుస్తున్నాము. జ్యోతిర్లింగాలను గూర్చి పూర్తిగా తెలియనివారికి పరిమితం :

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథం చ । శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాళం । ఓంకారే త్వమలేశ్వమ్
పరల్యాం వైద్యనాథం చ । ఢాకిన్యాం భీమశంకరమ్
సేతుబంధేతు రామేశం । నాగేశం దారుకావనే
వారాణస్యాంతు విశ్వేశం । త్ర్యంబకం గౌతమీ తటే
హిమాలయే తు కేదారం । ఘృష్ణేశం చ విశాలకే
ఏతాని జ్యోతిర్లింగాని । సాయం ప్రాతః పఠేన్నరః
సప్తజన్మకృతం పాపం । స్మరణేన వినశ్యతి.

1) సోమనాథం - సోమనాథేశ్వరుడు :- గుజరాతు రాష్ట్రంలోని సోమనాథం-ప్రభాస పట్టణం-గిర్‌కి ?? కి.మీ. దూరం. ద్వారక, పోరుబందరు, రాజకోట, అహమ్మదాబాదు నుండి నిత్యం బస్సు లున్నాయి.

2) శ్రీశైలం- శ్రీమల్లికార్జునస్వామి :- ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీశైలం-మార్కాపురం నుండి దోర్నాల-అక్కడి నుండి శ్రీశైలం-APSRTC వారి బస్సులు అన్ని ప్రధాన నగరాల నుండి వున్నాయి.

3) ఉజ్జయిని - మహాకాళేశ్వరుడు :- క్షిప్రా నదీ తీరం. మధ్యప్రదేశ్‌లోని ఇండోర్‌కి 53 కి.మీ. దూరం వుంది. బస్సులో వెళ్ళాల్సి వుంటుంది.

4) ఓంకారేశ్వర్ - ఓంకారేశ్వరుడు :- మహారాష్ట్రంలో నర్మదా తీరంలో ఖండ్వా-అజ్మీర్ లైనులో ఓంకారేశ్వర్ రోడ్డు దిగితే అక్కడి నుండి 10 కి.మీ. దూరం బస్సులో చేరవచ్చు.

5) పర్లీ - వైద్యనాథేశ్వర్ :- మహారాష్ట్రంలో పర్భనిజంక్షన్ దగ్గర నుండి 40 కి. మీ. దూరంలోని పర్లీ వైద్యనాథ్ రైలులో చేరవచ్చు.

6) ద్రాక్షారామం — భీమశంకరం :- ఆంధ్రప్రదేశ్‌లో కాకినాడకు 32 కి. మీ. దూరం. గోదావరీ తీరం. రామచంద్రపురానికి 10 కి మీ. బస్సు లున్నాయి.

7) రామేశ్వరం - శ్రీ రామలింగేశ్వరస్వామి :- తమిళనాడులో- మదరాసు నగరం నుండి నేరుగా రైలు మార్గం వుంది. మానామదురై జంక్షనుకి 92 కి.మీ. దూరం.

8) నాగనాథ్ - శ్రీ నాగేశ్వరుడు :- గుజరాతు రాష్ట్రంలో వున్నది. ద్వారక నుండి బేట్‌ద్వారక నుండి సముద్రం మీద ప్రయాణించి గోపీతలావ్ వెళ్ళి బస్సులో నాగనాథ్ వద్ద దిగి వెళ్ళవలెను. చాలా చిన్న వూరు.

9) వారణాసి -కాశి — శ్రీ విశ్వేశ్వరస్వామి :- అన్ని చోట్ల నుండి నేరుగా రైలు మార్గం వుంది. విమాన సౌకర్యం వుంది. నేరుగా వెళ్ళవచ్చు.

10) నాసికా త్ర్యంబకం - త్ర్యంబకేశ్వరస్వామి :- మహారాష్ట్ర- బొంబాయి నుండి నాసిక్ 184 కి.మీ. నాసిక్ నుండి 30 కి. మీ. దూరం బస్సులో వెళ్ళాల్సి వుంటుంది.

11) కేదారనాథ్ – కేదారేశ్వరుడు :- ఉత్తరప్రదేశ్-ఋషికేశ్. ఋషికేశ్ నుండి సోన్‌ప్రయాగ్ వరకు బస్సు. అక్కడి నుండి దాదాపు 8 కి.మీ. దూరం కొండ లెక్కి వెళ్ళవలసి వుంటుంది. హిమాలయ పర్వత ప్రాంతం. చలి ఎక్కువ. కావలసిన సరంజామాతో వెళ్ళవలసి వుంటుంది.

12) ఘుష్ణేశ్వరం- ఘృష్ణేశ్వరుడు :- మహారాష్ట్రంలో- దౌలతాబాదుకు 20 కి.మీ. లోపు వుంటుంది. బస్సు లున్నాయి.

మోక్షదాయకములైన సప్తపురులు :- అయోధ్య, మధుర, హరిద్వారము, వారణాసి, కాంచీపురము, ఉజ్జయిని, ద్వారకలు.

సప్తనదులు :- గంగ, యమున, గోదావరి, సరస్వతి, నర్మద, సింధు, కావేరి.

# యాత్రా కాలంలో ఆయా భాషలవారితో మాట్లాడుటకుగాను మచ్చుకు కొన్ని భాషలలో ముఖ్య పదములు

| తెలుగు | ఇంగ్లీషు | హిందీ | తమిళము | మళయాళము | కన్నడం | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| 1. దుకాణము | షాప్ | దుకాన్ | కడై | కడై | అంగడి | దుఖాణో |
| 2. బియ్యము | రైస్ | చావల్ | అరిసి | అరి | అక్కి | బత్తో |
| 3. పప్పు | దాల్ | దాల్ | పరుప్పు | పరుప్ | బేడ | దల్లి |
| 4. కందిపప్పు | తూర్‌దాల్ | తూరకేదాల్ | తొరంపరుప్పు | తొరంపరుప్ | తుగరిబేళె | హారోదోదల్లి |
| 5. గోధుమపిండి | వీట్‌ఫ్లోర్ | గెహూకాఅట | గోధుమైమావు | గోధుమమావే | గోధుముహిట్టు | గొహూమచున్న |
| 6. చింతపండు | టామరిండ్ | అమేలీ | పుళి | పుళి | హుణసహణ్ణు | తెంతులి |
| 7. మిరియాలు | పెప్పర్ | కాలిమిర్చి | మెళగు | కొరుమెళకు | మెణసు | కళయెరిచో |
| 8. మిర్చి | చిల్లీస్ | మిర్చా | మిళగాయె | మెళకు | మెళసినకాయ | మెర్చో |
| 9. కారము | చిల్లీస్‌పౌడర్ | ప్యారు | మిళగాయేతుళ్ | మిళగుపొడి | కారా | రగ్గో |
| 10. ఉప్పు | సాల్టు | నమక్ | ఉప్పు | ఉప్పు | ఉప్పు | సోరిసో |
| 11. పాలు | మిల్క్ | దూద్ | పాల్ | పాలు | హాలు | ఖీరో |
| 12. పెరుగు | కర్డ్ | దహీ | తైర్ | తైర్ | మొసరు | దొసదోయి |
| 13. బెల్లము | జాగరీ | గూడే | వెల్లం | చక్కెరి | బెల్ల | గుడో |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 14. అన్నము | రైస్ | ఖానా | సాదం | చోరు | అన్న | భత్తొ |
| 15. పొయ్యి | ఓవెన్ | ఛుల్లా | అడుప్పు | అడుప్పు | ఒలె | ఛుల్లీ |
| 16. వంటచెఱకు | ఫైర్‌వుడ్ | లకడీ | వెరగు | వెరకె | కట్టిగె | కట్టో |
| 17. చీపుర | బ్రూమ్‌స్టిక్స్ | ఝాడో | తొడప్పం | వరియల్ | పొరక్కె | చన్‌మని |
| 18. అగ్గిపెట్టె | మేచ్‌బాక్స్ | మేచెస్ | నెరుప్పుపెట్టి | తీపెట్టి | బెంకిపెట్టిగె | నియ్యాపెది |
| 19. మంచినీరు | ఫ్రెష్‌వాటర్ | పానీ | నల్లతణ్ణి | నల్లవెళ్ళం | సినీరు | పాణ్ణిప |
| 20. నెయ్యి | ఘీ | ఘీ | నెయ్ | నెయ్యి | తుప్ప | ఘియొ |
| 21. మజ్జిగ | బటర్‌మిల్క్ | ఛాచి | మోర్ | మోర్ | మజ్జిగె | చొల్లి |
| 22. ఆకుకూరలు | వెజిటెబుల్స్ | తర్కారి | కీరై | కాయకరి | | సగ్గో |
| 23. కూరలు | వెజిటెబుల్స్ | తర్కారి | కాయగిరిగళ్ | కాయకరి | తర్కారి | తొర్కారి |
| 24. బీరకాయ | | తొరయ | పీర్కింకాయ్ | పిచ్చింగాయ్ | జీరిగె | జొన్ని |
| 25. పంచదార | సుగర్ | తురై షక్కర్ | షర్కరై | పంచసార | చక్కెరె | చెన్ని |
| 26. వేడి | హీట్ | గరమి | సూడు | చూడు | సెఖె | |
| 27. మరుగుదొడ్డి | టాయిలెట్ | పాయిఖానా | కక్కూసు | కక్కూసు | కక్కూసు | పయిఖానీ |
| 28. సముద్రం | సీ | సముందర్ | కడల్ | సముద్రమే | సముద్ర | సొముద్రొ |
| 29. నది | రివర్ | నది | ఆరు | ఆరు | నది | నొది |
| 30. కాలువ | కెనాల్ | నాలా | కావాయ్ | తోడె | కాలువే | నళా |
| 31. చెరువు కొలను | టాంక్ | తాలాబ్ | కుళం | కొళం | కెరె | పొక్రి (బొంధొ) |
| 32. పసుపు | టర్మరిక్ | హల్ది | మంజళ్ | మంజల్ | అరసినా | హొళొది |

| తెలుగు | ఇంగ్లీషు | హిందీ | తమిళం | మళయాళం | కన్నడం | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| 70. యాత్రికుడు | పిల్‌గ్రిమ్ | యాత్రిక్ | యాత్తిరైపోహన్ | యాత్రకారన్ | యాత్రస్థను | — |
| 71. నేడు | టుడే | ఆజ్ | ఇంన్రు | ఇన్నె | ఈహొత్తు | ఆజి |
| 72. తలనొప్పి | హెడేక్ | శిర్‌కాదర్ద్ | తలై వలి | తలవేదన | తలనోవు | ముందొబొత్తా |
| 73. రేపు | టుమారో | కల్ | నాళై | నాళే | నాళె | కల్లికి |
| 74. నిన్న | ఎస్టర్‌డే | కల్ | నేట్రు | ఇనెలె | నిన్నె | కల్లి |
| 75. గంట | అవర్ | గంటా | మణి | మణి | ఘంటే | గొంటొ |
| 76. చిల్లర | ఛేంజ్ | చిల్లర్ | చిల్లరై | చిల్లరె | చిల్లరె | రెజ |
| 77. ఎక్కడ | వేర్ | కహా | ఎంగే | ఎవ్విడే | ఎల్లి | కోఠె |
| 78. ఎంత | హౌమచ్ | కిత్‌నా | ఎవ్వళవు | ఎత్రాయ్ | యేస్టు | కేతె |
| 79. దర్శనంచేయు | విజిట్ | దర్శన్‌కరనా | కండుకొళ్ | దరికాన్ | దర్శనమాడు | — |

సీ. కలకత్త బొంబాయి కాశ్మీరుగాంచిన
పురదర్శనంబున మురియవచ్చు
కాశీ ప్రయాగలు గయ హరిద్వారముల్
తీర్థముల్ సేవింప తీరదింక
గంగయమునలలోన కావేరితపతుల
మునుగగా బోలెదు పుణ్యమబ్బు
విశ్వేశ భైరవ బిందుమాధవులను
దర్శింప జన్మతాదాత్మ్య మబ్బు

గీ. తీర్థ సేవలు సేయగా తీరు కోర్క
మంచిచెడ్డలు జనముల మంచితనము
తెలియు నన్నియు; లోకులతీరు తెలియు
యాత్ర, విజ్ఞానయాత్ర, విహారయాత్ర
ఏమిపేరున చెప్పిన నిదియె సుమ్మి
సకల విషయాలు మనసున చక్కగాను
హత్తు; గావున యాత్రల కరుగవలయు.

# విషయసూచిక





# ఆంధ్రప్రదేశ్

సువిశాల సుందర భారతంలో ఆంధ్రప్రదేశ్ భారతలక్ష్మికి బంగారు ఒడ్డాణంగా అనవొప్పినది. అక్షరక్రమంలో ప్రథమ స్థానమును ఆక్రమించిన రాష్ట్రము.

జనాభా :

1981 లెక్కల ప్రకారం. 5,34,00,000.

వైశాల్యము :

2,76,754 చ. కి.మీ.

రాజధాని :

హైదరాబాదు.

అక్షర క్రమంలో మొదటిదిగా ఉన్న ఈ రాష్ట్రం దేశం మొత్తం మీద రాశిలో 5 వ స్థానాన్ని అలంకరించింది.

ఇక్కడి ప్రజల ముఖ్య జీవనోపాధి :

వ్యవసాయం.

రాష్ట్రానికి ఉత్తర సరిహద్దుల్లో ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు; పడమర మహారాష్ట్ర, కర్నాటకలు; దక్షిణాన తమిళనాడు రాష్ట్రం, తూర్పున బంగాళఖాతం తీరం 966 కి. మీ. పొడవున ఆవరించుకుని ఉన్నది.

**రాష్ట్రంలో ముఖ్యమైన పెద్ద నదులు :**

గోదావరి, కృష్ణ, పెన్న, తుంగభద్ర.

గోదావరి, కృష్ణా నదులు జీవనదులై బంగాళాఖాతం సముద్రంలో కలిసే ముందు సారవంతమైన డెల్టా ప్రదేశాలుగా ఏర్పడి రాష్ట్రాన్ని సస్యశ్యామలంగా తీర్చి దిద్దుతున్నాయి.

**రాష్ట్ర ప్రజల ముఖ్య భాషలు :**

తెలుగు, ఉర్దూ.

జాతిపరంగా ఆంధ్రులు ఆర్యజాతికి చెందినవారు. మొట్టమొదట పశ్చిమాసియానుండి వలస వచ్చిన ఆర్యులు క్రమంగా వింధ్య పర్వతాలకు దక్షిణంగా చొచ్చుకుని వచ్చి, ఇక్కడ స్థానికంగా ఉన్న ద్రవిడ జాతులతో మంచి సంబంధ బాంధవ్యాల నేర్పరుచుకొని, వారు వీరనే భేదం తెలియనంతగా కలిసిపోయారు.

మన పురాణాల్లో ఆంధ్రుల ప్రసక్తివుంది, ఆంధ్ర ప్రశస్తివుంది. అశోకుని కాలంలో ఈ ప్రదేశాల్లో బౌద్ధ మతం మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లింది. అందుకు నిదర్శనంగా అనేక శాసనాలు, స్థూపాలు ఇప్పటికీ, ఎప్పటికీ చెరగని చరిత్రను వల్లిస్తూ సాక్షాత్కారమిస్తున్నాయి.

'ఆంధ్ర' అనే శబ్దం ఈ ప్రదేశానికీ, మాట్లాడే భాషకూ సమన్వయంగా ఒప్పుతుంది. తరవాత్తర్వాత 'తెలుగు' భాషా పరమైన రూపాంతరం చెందిందో లేక ప్రదేశ మాహాత్మ్యంగా వచ్చిందోగాని ఎలా వచ్చినా 'ఆంధ్ర' శబ్ద ఔచిత్యం మాత్రం తగ్గలేదని చెప్పకోవచ్చు.

'ఆంధ్రప్రదేశ్' మౌర్య సామ్రాజ్యంలో భాగంగా మొట్టమొదట చరిత్ర పుటల్లో చోటుచేసుకుంది. 7 వ శతాబ్దం వచ్చేటప్పటికి చాళుక్యులు, 10 వ శతాబ్దం ప్రాంతంలో చోళరాజులు పరిపాలించారు. 14 వ శతాబ్దం వచ్చేసరికి మహమ్మదీయులు చొచ్చుకుని వచ్చారు. ఇక హిందూ ముస్లిముల పెనుగులాటలకు ఒకటి రెండు శతాబ్దాలు యుద్ధరంగంగా తయారయింది. చివరికి 1713లో ఔరంగజేబు సేనాని వశమైంది ప్రాంతం. వారి వారసులు హైదరాబాదు నిజాములుగా ప్రసిద్ధి చెంది దేశానికి స్వతంత్రం వచ్చేవరకూ కొంత భాగాన్ని పరిపాలించారు.

అసలు 'తెలుగు' అనే పదం 'త్రిలింగ' శబ్దంనించి వచ్చిందనేది ఒక స్థిరమైన

వాదం. కాళహస్తి, శ్రీశైలము, ద్రాక్షారామం అనే మూడు స్వయంభూ శివలింగ క్షేత్రాల మధ్య ఉన్న ప్రదేశం కాబట్టి దీనిని త్రిలింగ దేశమనీ, ప్రజలు త్రిలింగులని, అది క్రమంగా రూపాంతరం జెంది తెలుంగు 'తెలుగు'గా మారినదని సిద్ధాంతీకరణ జరిగింది. ఇక్కడి ప్రజలు వ్యవసాయంలో ఆరితేరినవారు. తిల్ అంటే కృషీవలురు అనే అర్థం వుందనీ, కృషి ప్రధానంగా వృత్తిగా గలవారు ఇందున్నారు గనుక ఈ ప్రజలనందరినీ తిలింగులు, తెలుంగులు, తెలుగు వారుగా మారారని కొంత మంది పండితుల వాదం. ఏది ఎలా వున్నా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు తెలుగు వారుగా చరిత్రలో స్థిరమైన గుర్తింపు కలిగింది. వారు మాట్లాడే భాష తెలుగు అయింది.

ఈ ప్రదేశాన్ని పూర్వం శాతవాహనులు, పల్లవులు, చోళులు, చాళుక్యులు పాలించి చారిత్రక సార్థక్యాన్ని గూర్చి చెరగని యశో ముద్రికలు చిరస్మరణీయతా ఏర్పరచారు.

ఆంధ్రుల స్వర్ణయుగం అని పేర్కొనదగినది. తెలుగువారి చరిత్రలో సువర్ణాధ్యాయం మాత్రం ఆంధ్రభోజుడయిన శ్రీ కృష్ణదేవరాయల కాలం మాత్రమే. అది క్రీ. శ. 1509 నుండి 1529 వరకు. ఈయన హంపీ విజయనగరాన్ని రాజధానిగా చేసికొని విజయనగరసామ్రాజ్యంగా ప్రఖ్యాతిచెంది దక్షిణ భారతం మొత్తాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించి ఒకే గొడుగు క్రిందకు తీసుకుని వచ్చాడు.

మనకు బ్రిటిషుపాలన నుండి, స్వతంత్రం వచ్చాక శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మత్యాగ ఫలితంగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంనుండి 11 ఆంధ్ర జిల్లాలను వేరు చేసి అక్టోబరు; 1953 న ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంగా రూపుదిద్దుకుంది. అప్పుడు కర్నూలు రాష్ట్రరాజధాని. తరువాత హైదరాబాదు సంస్థానంగా పేరొందిన నిజాము రాజ్యంలోని 9 తెలంగాణా జిల్లాలను కలిపి నవంబరు 1, 1956 న మొట్టమొదటి భాషా ప్రయుక్తరాష్ట్రంగా ఇండియన్ యూనియన్‌లో 'ఆంధ్రప్రదేశ్' గా ఏర్పాటు జరిగింది.

భారతీయ సంప్రదాయ సంగీతం మొత్తం రెండు స్రవంతులుగా పేర్కొన బడ్డాయి. ఒకటి హిందూస్థాని, రెండు కర్ణాటక సంగీతం - అని. ఆంధ్రులు కర్ణాటక సంగీతంలో విశేషమైన ప్రజ్ఞ వెలార్చి,విశ్వవిఖ్యాతి నొందేటట్టుగా తోడుపడ్డారు. ఆంధ్రప్రదేశ్ లలితకళలకు కాణాచి. వీరి కూచిపూడి యక్షగానం (సంగీతనృత్య నాటికలు, నాటకములు) జగత్ప్రసిద్ధం. సాంస్కృతిక సాంప్రదాయాల్లో బొమ్మలాట, తోలు బొమ్మలాట ఒకప్పుడు ప్రపంచఖ్యాతి నొందిన కళా రూపాలు.

ఆనాటి పూర్వుల ఔన్నత్యాన్ని చాటే చిరస్మరణీయ స్థాపికలు ఈ రాష్ట్ర ప్రజల చరిత్రలో చెరగని, మాయని, మారని అధ్యాయాలుగా మిగిలిపోయినవి ఎన్నో వున్నాయి. ఒక్కో ప్రదేశంలో ప్రతి అడుగూ, ప్రతి రాయి కదిలిస్తే కథలు చెప్తూనే వుంటాయి-శిలలపై చెక్కిన శిల్పాలు పాలువార్చిన సంస్కృతీ సంప్రదాయాల వెన్నెలల వెల్లువలు.

"యాత్రామార్గ దర్శనం" రాష్ట్రరాజధానియైన హైదరాబాదులో మొదలు పెట్టటం ఎంతయినా సముచితం.

ఆంధ్రప్రదేశ్ దేశానికి నడిబొడ్డు- రాష్ట్రానికి విజయవాడ నడిబొడ్డు. దక్షిణం నుండి ఉత్తరరాష్ట్రాలు వెళ్లాలన్నా, ఉత్తరరాష్ట్రాలనుండి దక్షిణాది రాష్ట్రాలకు రావాలన్నా విజయవాడ సింహద్వారం లాంటిది. విజయవాడ నుండి హైదరాబాదుకు 274 కి. మీ. చక్కటి రోడ్డు మార్గం వుంది. రైలుమార్గం వుంది. రోడ్డు మార్గం గుండా వెళితే షుమారు 5½ గం. నుండి 6 గంటల ప్రయాణం. రు. 38/= నుండి 43 రూ. వరకూ హైదరాబాదులోని A.P.S. R.T.C. బస్టాండు, అమీర్‌పేట, బాలానగర్ మొదలగు వివిధ గమ్యాలకు నేరుగా బస్సులున్నవి. సికిందరాబాదు, హైదరాబాదు ముఖ్యమైన రైలు స్టేషనులు. ఈ మధ్య తెలుగుదేశం ప్రభుత్వం రాష్ట్ర అధికారాన్ని చేపట్టిన తరువాత జనసౌకర్యం దృష్ట్యా APSRTC వారు కాంట్రాక్టు పద్ధతిమీద కొన్ని బస్సులు డీలక్సు, సూపర్‌డీలక్సు బస్సులు చాలా సౌకర్యవంతంగా నడుపుతున్నారు. రోజంతా ఎప్పుడు కావాలంటే అప్పుడు బస్సు సౌకర్యం వుంది. రాత్రి 9 గం. నుండి 12 గం. వరకు హైదరాబాదు బస్సులు కోలాహలంగా వుంటాయి. తెల్లవారే సరికి నగరంలో వుండవచ్చు.

## హై ద రా బా దు

**ఆంధ్రప్రదేశ్ కు రాష్ట్ర రాజధాని :**

హైదరాబాదు-సికిందరాబాదు రెండు మహానగరాల కలయిక-జంటనగరాలని ప్రతీతి

**జనాభా :**

1981 లెక్కల ప్రకారం అయితే 25,00,000. ప్రస్తుతం 30,00,000 పైనే సంయుక్తంగా.

స్వతంత్ర భారతంలో మహానగరాలలో 5 వ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

పూర్వము దీనికి భాగ్యనగరమని పేరు.

స్వతంత్రానికి పూర్వము నిజాము రాజ్యాంగాను, హైదరాబాదు సంస్థానానికి ముఖ్య పట్టణంగా శోభిల్లిన ఈ పట్టణానికి చరిత్రలో ఎంతో ప్రాధాన్యం ఉంది. ఇప్పుడు దిన దినాభివృద్ధి చెందుతూ అనేక పారిశ్రామిక వాడలతో, ఎత్తైన భవనాలతో నిత్యనూతనంగా వర్ధిల్లుతూంది. ఉత్తర, దక్షిణ భారతదేశాల సంస్కృత సంప్రదాయాల మేలికలయికగా మొగలాయి సాంప్రదాయపు కట్టడాల శోభల గుబాళింపులతో యాత్రికులకు నేత్ర పర్వంచేసే ఈ సుందరమైన జంట నగరాలకు మంచి చరిత్ర కూడా వుంది.

నగర నిర్మాణం :

మహమ్మద్ కులీ వంశీయుల నాలుగవ తరం వారైన కుతుబ్ షాహీలు 1590 లో నిర్మించారు. అంతకు పూర్వం ఇక్కడికి 11 కిలోమీటర్ల దూరంలో వున్న గోల్కొండకోట కోట పట్టణంగా నిర్మించుకుని అక్కడి నుండి రాజ్యాన్ని పరిపాలించేవారు. ఈ సుందర మహానగరాన్ని నిర్మించుకున్న తరువాత 1687 వరకూ అవిచ్ఛిన్నంగా పరిపాలించారు.

## గోల్కొండ

ప్రత్యేక ఆకర్షణ :

ఎంతో శిథిలమైపోయినా ఇప్పటికీ గోల్కొండకోట చూపరులను ఆకర్షిస్తూనే వుంది. ఇక్కడే ఒక ప్రక్కగా కుతుబ్‌షాహీల సమాధులున్నాయి.

చూడదగినవి :

తానీషా ప్రభువు భద్రాచల రామదాసును బంధించిన కారాగారము చూడవలయును. శ్రీరామచంద్రుడు తానీషా ప్రభువునకు దర్శనమిచ్చిన పవిత్రమైన స్థలంగా చెప్పబడింది. ఈ కోట శిథిలాలు ముఖ్యంగా 17, 18 శతాబ్దాల ప్రాంతపువైనా అసలు కోట పునాదులు మాత్రం దక్కను సామ్రాజ్యాన్ని పరిపాలించిన హిందూ రాజులయిన యాదవ వంశీయులు, తరువాత కాకతీయుల నాటి ప్రాభవానికి తీసికెళుతుంది. 1512లో పెర్షియా నుండి వచ్చిన కుతుబ్‌షా అనే యుద్ధవీరుడు

బహమనీ సుల్తానుల గవర్నరుగా వచ్చినవాడు తరువాత తనకుతానుగా స్వతంత్రాన్ని ప్రకటించుకుని గోల్కొండను ముఖ్య పట్టణంగా ప్రకటించుకున్నాడు. అంతవరకూ గోల్కొండ రాజధానిగా వున్నదాన్ని 1590లో కొత్త నగరానికి అంటే హైదరాబాదుకు మార్చాడు కుతుబ్‌షాహి. కాని రెండు సందర్భాల్లో మాత్రం మళ్లా గోల్కొండకు వెళ్లాల్సివచ్చింది. ఢిల్లీ సుల్తాను కుతుబ్‌షాహీలను కప్పం గట్టమని 1600లో నిర్బంధించటానికి ఢిల్లీ సైన్యాలను పంపి వత్తిడి చేసిన సందర్భమున కుతుబ్‌షాహీల్లో ఆఖరివాడైన అబుల్‌హసన్‌ను 1687లో ఔరంగజేబు సైన్యాలు మోసంతో గెలిచినప్పుడు. 1707లో ఔరంగజేబు మరణించాడు. ఆయన మరణం తరువాత అతని ప్రతినిధులు తరువాత నిజాములై హైదరాబాదును ముఖ్య రాజధానిగా చేసికొని గోల్కొండను విడిచిపెట్టారు.

ఈ కొండకోట 120 మీటర్ల ఎత్తునగల కొండమీద పెద్ద పెద్ద బండ రాళ్ళతో ముట్టడికి వీలులేకుండా దుర్భేద్యమైన ప్రాకారాల్తో కట్టబడింది. కోట ద్వారాలకు వాడి మొనగల ఇనప బల్లాలను అమర్చి ఏనుగులు సైతం దగ్గరికి చేరకుండా వుండే విధంగాను, దీనికి తోడు డైరెక్టు అటాకింగుకు వీలులేని ఎత్తైన మదురులు ఏర్పాటుచేశారు. బయటి ప్రాకారం చుట్టుకొలత కనీసం 11 కి. మీ. ఉంటుంది. కోటగోడలు శతాబ్దాలయినా ఇంకా చెక్కు చెదరకుండా వున్నాయి.

కోటలోపల అంతఃపురాలు, సభా భవనాలు, మంటపాలు వగైరాలు ముట్టడులకు బలై, కాలగమనంలో జరిగే మార్పులకులోనై చాలా భాగం శిధిలాలుగా మిగిలినా పూర్వ వైభవాన్ని చాటడంలో ఏ మాత్రం తీసిపోలేదు. అయితే వీటన్నిటినీ వైభవానికి తార్కాణాలుగా, చారిత్రక స్థలాలుగా వీలున్నంత వరకూ ప్రాచీన రూపాల్ని తిరిగి సంతరింపజేయటానికి కావలసిన మరమ్మతులు విరివిగా జరుగుతూనేవున్నాయి.

ఈ కోటలోని వింత ఏమిటంటే శబ్ద విద్యలోని ప్రావీణ్యం. మొదటి ద్వారం ఫ్లోర్టికోలో నిలబడి ఒక చిన్న శబ్దం చేస్తేచాలు- 61 మీటర్ల ఎత్తు కొండకొమ్మున వున్న దర్బారు హాలులోకి స్పష్టంగా వినబడుతుంది. అందువలన మొదటి ద్వారంనుండి నేరుగా రహస్యసమాచారం వెంటనే కింద వున్నవారు పైకి తెలియపరచవచ్చు. మరి ఇదెక్కడి విద్యా ప్రావీణ్యం!! అంతుబట్టకుండా వుంది ॥

అసలు ఈ గోల్కొండ ఒక వజ్రాలగని అని ప్రతీతి. ప్రపంచం మొత్తం మీద వున్న పాలకవంశాలయిన రష్యా జారు ప్రభువుల దగ్గరనుండి బ్రిటిషువారైన

ఆంగ్లేయ రాజ వంశీకుల వరకూ అందరికీ దీనిపైనే కన్ను. దాన్ని స్వంతం చేసుకోవాలనే పేరాశతో కొట్టుమిట్టాడుతుండేవారు. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూరు ఈమె 'జడలోని పూవే' అంటే ఆశ్చర్యపోనక్కరలేదు. కోట పైనున్న తోటలకు నీరు తోడుకుపోయే విధానం చాలు ముక్కున వేలువేసుకోటానికి; దర్బారు హాలునుంచి కొండ కిందనవున్న భవనాల్లోకి సొరంగ మార్గముందంటారు. కాని ఇదిమటుకు చూడటానికి వీలులేదు.

బయట ప్రాకారానికి ఒక కిలోమీటరు దూరంలో కుతుబ్‌షాహీల సమాధులున్నాయి. అలంకార ప్రాయమైన ఈ కట్టడాల చుట్టూ చక్కని లాండ్‌స్కేప్ గార్డెన్సున్నాయి. శిలాశిల్ప చాతురి అనేకచోట్ల కనబడుతుంది. ప్రవేశానికి మామూలుగా వట్టి మనిషిగా వెళితే ప్రవేశరుసుం 0–25 పైసలు, తోడుగా కెమేరా ఉంటే (మామూలుది) రు. 2/=. అదే మూవీకెమేరాతో అయితే రు. 10/= పుచ్చుకుంటారు. గోల్కొండ చరిత్రను చాటి చెప్పే వింతలు విశేషాలు గల పుస్తకం– 2/=

ఇదంతా చూడటానికి కనీసం ఒకపూట పైనే పడతుంది. నాంపల్లి హైదరాబాదునుండి అంటే హైదరాబాదు స్టేషను ఎదురుగా. నం. 142 లేక 119 సిటీబస్సు ఎక్కితేచాలు– రు. 2/= లతో కోట ముంగిటగల బాలహిస్సార్‌గేటు దగ్గరికి వెళ్ళవచ్చు. ఆటో అయితే 10/=.

ఇక్కడ ఇంకా చూడదగినవి:– నెహ్రూ జూలాజికల్‌పార్కు, పబ్లిక్‌గార్డెన్స్, సాలార్‌జంగ్ మ్యూజియం, మక్కామసీదు, జుమామసీదు, చార్మినార్ కట్టడం, బిర్లామందిరం, ఆర్కియాలాజికల్ మ్యూజియం, అసెంబ్లీ భవనాలు, బిర్లా మందిరం, బిర్లా ప్లానెటోరియం, హుస్సేన్‌సాగర్–టాంక్‌బండ్–తెలుగు తేజము విస్తరింపజేసిన మహామహుల విగ్రహాలు కూర్చిన తోరణంగా తయారయినది. ఇటీవల ప్రభుత్వ కృషిలో కనువిందుగా తయారు అయినది, లాల్ బహదూర్ స్టేడియం. అందులోని లలిత కళా తోరణం, రవీంద్ర భారతి మొదలైనవి ఎన్నో ఉన్నాయి. వీటన్నిటినీ గురించి యాత్రికులకు, పర్యాటకులకు తెలియ జెప్పటానికి సికింద్రాబాదు, హైదరాబాదు రైలు స్టేషనులలోను, అక్కడక్కడ సమాచార దర్శనంగా కొన్ని బోర్డులు వగయిరాలు వున్నాయి. కాని అవి అంత సమగ్రంగా లేవు.

## చార్మినార్ :

ప్రతి సిగరెట్టు ప్యాకెట్టుమీద దర్శనమిచ్చేది ఈ చరిత్ర ప్రసిద్ధమైన కట్ట

డమే. ఇది 1597లో మహమ్మదీకులీ కుతుబ్‌షాహిచే ప్లేగు జ్ఞాపకార్థంగా నిర్మించారు. నాలుగు వైపులా తెరచియున్నది. 186 అడుగుల ఎత్తు. 55 మీటర్ల ఎత్తుగల నాలుగు స్తంభాల కట్టడము. పేరులోనే నాలుగు స్థంబాల కట్టడము అని తెలుస్తుంది. చార్ (నాలుగు) మినార్స్ (స్థంభములు) చూడదగినది. ఈ స్థంబాలపైకి వెళ్ళటానికి మెట్లున్నాయి. మెట్లెక్కి పైకి వెళితే నగరమంతా దర్శనీయంగా కనబడుతుంది.

**జామా మసీదు :**

చార్మినార్‌కి ఈశాన్య భాగంలో హైదరాబాదు నగరంలో కట్టబడిన అతి పురాతన కట్టడం. 1598 లో దీని నిర్మాణం జరిగింది.

**మక్కా మసీదు :**

చార్మినారుకు పడమరగా ఉన్నది. 1612 లో గోల్కొండ నవాబు ప్రారంభించబడినది. 1612 లో ఔరంగజేబు చక్రవర్తిచేత పూర్తిచేయబడింది. సమున్నతమైన స్థంబాలు ఆర్చీలు, ఏకశిలతో నిర్మించబడటం గొప్ప విశేషం. ఒకేసారి షుమారు 10 వేలమంది నమాజుకు హాజరవవచ్చు. అంతటి విశాలమైనది. దక్షిణ భారతదేశంలోనే తలమానికమైనదని శ్లాఘించబడినది.

**ఫలక్‌నామా పాలెస్ :**

కొండపైన కట్టబడిన ఈ కట్టడం చూడాలంటే పర్యాటకులు ముందుగా అనుమతిని పొందాలి. ఇది నవాబ్ సర్‌వికార్‌చే నిర్మించబడింది. ఆ రోజుల్లోనే 35 లక్షలు వ్యయం అయింది. ఇది ఐదవ జార్జి చక్రవర్తి మొదలైన వారు విడిదిగా దిగిన భవనము. అంటే దీని విశిష్టతను గూర్చి వేరే చెప్పనక్కరలేదు. ఇందులో నిజాము నవాబులు సేకరించి పెట్టిన అనేక అరుదైన వస్తు సముదాయాలున్నాయి. చాల అందమైన భవనం.

**ఉస్మాన్‌సాగర్ - హిమాయత్‌సాగర్ :**

ఉస్మాన్‌సాగర్ సరస్సు : హైదరాబాదు నుండి 22 కి.మీ. మూసీనది నీరంతా ఇందులోకివచ్చేట్లుగా ఒక ఆనకట్టకట్టి 45 చ.కి.మీ. సరస్సుగా నేర్పరచారు. ఒకప్పుడు మూసీనది వరదలు హైదరాబాదుపట్టణాన్ని ముంచేత్తేవి. ఆ వరదల తాకిడినుండి పట్టణ రక్షణకుగాను ఆనకట్ట కట్టబడింది. దీనినే గండిపేట చెరువు అని అంటారు. ఇక్కడి నుండే హైదరాబాదు నగరానికి తాగే నీరు సరఫరా అవుతుంది. ఇదిగో ఇక్కడ

చక్కటి లాండ్‌స్కేప్ గార్డెన్స్, అందంగా తీర్చిదిద్దబడిన పచ్చిక బయళ్ళు నేత్ర పర్వంగా ఉంటాయి. నేటి తెలుగుదేశం పార్టీ పెద్దలు నిర్మాణాత్మకమైన నిర్ణయాలు తీసికొనే 'తెలుగువిజయం' తెలుగుదేశం పార్టీ ముఖ్య కార్యాలయం కూడా ఈ గండి పేటలోనే వుంది. ముఖ్యమంత్రి కీలక సమావేశాలు ఇక్కడ జరుగుతుంటాయి. ఇక్కడి ప్రకృతి అంతా విరిసిన విరిబోణి వలె నేత్రపర్వం చేస్తుంది.

హిమాయత్‌సాగర్ మరో సరస్సు. ఉస్మాన్‌సాగర్ నుండి 10 కిలోమీటర్ల దూరం. 85 చ. కి. మీటర్లు ఆక్రమించిన ఈ సరస్సు మంచి పిక్నిక్‌స్పాట్.

రెండు తటాకాల వద్ద రెస్టుహౌస్‌లు, బంగళాలు విడిదికి ఉన్నాయి.

## సాలార్ జంగ్ మ్యూజియం :

నిజామువారి ప్రధానామాత్యులు సర్ సాలార్ జంగ్ I, 1876లో రోము నగరాన్ని దర్శించినపుడు ఒక శిల్ప విశేషాన్ని కొనుక్కొని వచ్చారు ఇదీ అసలు మొదలు– ప్రపంచ ప్రఖ్యాతిని గన్న వస్తుప్రదర్శనశాలకు నాంది. అయితే మీర్ యూసఫ్ అలీఖాన్ సాలార్ జంగ్ III అద్భుతమైన సాలార్‌జంగ్ మ్యూజియం ఏర్పాటుకు కష్టపడినవాడు, కట్టించినవాడు. 1968లో 36 విశాలమైన హాలుల్తో కొత్త భవనాలనుకట్టి మ్యూజియం మొత్తాన్ని ఆ భవనాల్లోకి మార్చారు. ఈ సాలార్ జంగ్ మ్యూజియం లండన్‌లోని విక్టోరియా & ఆల్బర్టు మ్యూజియంకు సరియైనదిగా పేర్కొనబడింది. 35, వేల రకాలైన అరుదైన వస్తువులు ప్రపంచం నలు మూలలనించి సేకరించబడ్డాయి. శిలాశిల్పాలు, దారు శిల్పాలు, రాజులు వాడిన సర్వవస్తువులు, పెయింటింగులు, ఆయుధ విశేషాలు, రాజకృపాణాలు, కత్తులు, బల్లేలు, వజ్రాలు పొదిగిన పిడిగల బాకులు, అరుదైన దంతపు సామానులు వగైరాలు అనేకం. వీటితోపాటు ప్రపంచ ప్రసిద్ధి చెందిన యూరోపియన్ పెయింటింగులు–లాండ్‌సేర్, వాట్స్, హైటన్ కూపర్ మొదలగు మహాశయులు స్వయంగా వేసిన పెయింటింగులు మొదలైనవి ఎన్నో వున్నాయి. ఆనాడు లూయిస్ 14, లూయిస్ 15 వాడిన వస్తువులు, మేరియా ఆంటోనియెట్స్ వాడిన డ్రస్సింగు టేబిలు కూడా ఇందులోఉన్న వస్తు విశేషాల్లో కొన్ని.

## మరికొన్ని విచిత్రాలు :

1–1/4 అంగుళములో ముద్రించబడిన ఖురాన్ గ్రంథము, విచిత్రమైన గడి

యారం- విషము పెడితే రంగుమారే పళ్ళెం, ముందు మగవేషం, వెనుక ఆడవేషం గల విగ్రహం, మొదలైన వింతలు ఎన్నో ఉన్నాయి.

పబ్లిక్ గార్డెన్సు :

రాష్ట్ర అసెంబ్లీ భవన సముదాయాన్ని చుట్టుకొని పబ్లిక్‌గార్డెన్సు ఉన్నాయి. అసెంబ్లీ భవనాలు ఒక ప్రక్కన అయితే మరో ప్రక్క ఆర్కియాలాజికల్ మ్యూజియం, హెల్త్ మ్యూజియం, అజంతా శిల్పాలకు కొన్ని నమూనాలు, నగిషీలు వగయిరాలు ప్రదర్శించబడుతున్నాయి. సోమవారాలు తప్ప ప్రతిరోజూ ఉదయం పదినుండి సాయంత్రం 5-30 వరకూ తెరచి యుంచబడుతుంది మ్యూజియం. ప్రవేశరుసుం 0-25 పై. ప్రతిమనిషికీ. ఇందులోనే జవ్హార్ బాలభవన్ ఉంది. అందులో ఎక్వేరియమ్ ఉదయం గం. 10-30 నుండి మధ్యాహ్నం 1 గంటవరకు. మరల 1-30 నుండి 5-30 గం ల వరకు తెరిచిఉంచే సమయం చూడవచ్చు.

బిర్లా మందిరం :

ఇది నూతనంగా కట్టబడిన సుందరమైన పాలరాతి హిందూ దేవాలయం. అద్భుతమైనది. హిందూ దేవాలయమైనా అన్ని మతాలవారూ దర్శించవచ్చు. మామూలు రోజుల్లో అయితే సా॥ 4 గం. నుండి 9 గం. వరకు. శని, ఆదివారాలు మాత్రం ఉదయం 7 గం. నుండి 11 వరకు. సా. 3 నుండి 9 గం. వరకు. దీనికి దగ్గర్లోనే బిర్లా ప్లానిటోరియం (నక్షత్రశాల) ఉంది. ఇంగ్లీషు, హిందీ, తెలుగు భాషల్లో వివిధ సమయాల్లో ప్రదర్శన వుంది. టిక్కెట్టు. 5/= మాత్రం.

నెహ్రూ జూలాజికల్ పార్కు :

హైదరాబాదు పొలిమేరల్లో 120 హెక్టార్ల స్థలంలో 1100 జంతువులతో అందమైన లాండ్‌స్కేప్ గార్డెన్స్‌తో ఇండియాలో వున్న పెద్ద పార్కు- జంతు ప్రదర్శనశాలగా తీర్చిదిద్దబడింది. ఎన్నో ఇతర జంతు ప్రదర్శనశాలల కన్నా విభిన్నంగా కనపడడానికి చేసిన గొప్ప ప్రయత్నానికి ప్రతీకగా నిలుస్తుంది. ఈ పార్కు ఉదయం 9 గం. నుండి 6 గం. వరకు దర్శనీయం.

దానిలో భాగంగానే లయన్ సఫారి ఒకటుంది. చూడటానికి మినీబస్సు, టాయ్‌ట్రెయిన్ వున్నాయి. పిల్లలకు మంచి కాలక్షేపం. ఎప్పుడూ పుర ప్రజలతోటి సందడిగా ఉంటుంది. ఒక పిక్నిక్ స్పాట్‌గా కూడా చెప్పుకోవచ్చు.

సికింద్రాబాదు :

పోలో గ్రౌండ్సు, రేస్‌కోర్సు ఉన్నాయి. ఒకప్పుడు సర్ రోనాల్డ్ రాస్ మహాశయుడు నివసించిన భవనాన్ని చూడవచ్చు. ఇక్కడే మలేరియా రావడానికి ముఖ్య కారణం కనుక్కోబడిందంటారు. సికింద్రాబాదు, హైదరాబాదు కలుపుతూ సుమారు 18 కి. మీ. చుట్టుకొలతతో హుస్సేన్‌సాగరు సరస్సు వుంది. ఇందులో విహారానికి చేపలు పట్టడం వగయిరాలు చేయవచ్చు- అందుకు వసతులున్నాయి. సరస్సు ఒడ్డును సుమారు 1-1/2 కి. మీటరు, పొడవున రోడ్డు జంటనగరాలను కలుపుతుంది. ఇది టాంక్‌బండ్‌గా ప్రసిద్ధి చెందింది. రోడ్డుకు ఒక ప్రక్క తెలుగువారి ప్రముఖుల శిలా విగ్రహాలు ప్రతిష్టించి శోభాయమానంగా తీర్చిదిద్దబడింది. ఇందుకు కారణమైన తెలుగుదేశం ప్రభుత్వానికి జేజేలు చెప్పుకోవచ్చు.

ఇక ఉండటానికి — తినటానికి

YMCA, YWCA, యూత్ హాస్టల్ కాకుండా యి తరంగా చౌకగా వుండే హోటళ్ళు ఎన్నో నాంపల్లి స్టేషను ఎదురగా నాంపల్లి హైరోడ్డులో వున్నాయి. కొన్ని చార్మినార్ పరిసరాల్లో వున్నాయి. వసతి సౌకర్యం YWCA ఓల్డ్‌వింగు అయితే రు. 15-20 పైసలు రోజు 1కి, న్యూవింగ్ అయితే రు. 25-30 పైసలు.

సికింద్రాబాదు బోటు క్లబ్ వెనుకవున్న యూత్ హోటల్‌లో పడకకు రోజుకు 5 రు. మాత్రం. YMCAలో రోజుకి పడకకు రు. 8/- ఇవికాక చౌకలో వసతి సౌకర్యం లభ్యమయ్యేవి మున్సిపల్ సరాయి- నాంపల్లి, ధర్మశాల, గ్రెయిన్‌బజారు ధర్మశాల, సికింద్రాబాదు, రాంప్రతాప్ ధర్మశాల, నాంపల్లి మొదలయినవి. రూముకి 1 రు. నుండి 7 రు. వరకు చార్జి వుంటుంది.

ఇవికాక వున్నవారికి వున్నట్లుగా, అంటే సంపన్నులకు సంపన్నంగానూ, మధ్య తరగతి వారికి మధ్యే మార్గంగా ఉండే హోటళ్ళు వాని యడ్రసులు ఈ క్రింద యిస్తున్నాం.

ముందు ఉండటానికి అనువైనవి :

వెస్టరన్ స్టైలు హోటళ్ళు.

(భారతప్రభుత్వపు టూరిజమ్ శాఖవారిచే గుర్తింపు పొందినవి.)

వెల్కం హోటల్ బంజారా

18, బంజారాహిల్స్, ఫోన్: 221616.

గ్రామ్స్ : WELCOTEL. Telex : 0115-329

రిట్జ్ హోటల్.
హిల్‌ఫోర్ట్ పాలెస్
ఫోన్ : 38571 (7 లైను)
గ్రామ్స్ : **RITZ, Telex** : 0155-215

బ్లూ మూన్ హోటల్
రాజ్ భవన్‌రోడ్డు, బేగంపేట,
ఫోన్ : 30136 (6 లైను)
గ్రామ్స్ : **BLUEMOON. Telex** : 0155-315.

హోటల్ డెక్కన్ కాంటినెంటల్,
మినిస్టర్‌రోడ్, సికింద్రాబాదు.
ఫోన్స్ : 70981-5, 70944.
గ్రామ్స్ : **HOTDELON, Telex** : 0155-655

హోటల్ అన్నపూర్ణ,
నాంపల్లి స్టేషను రోడ్డు,
ఫోన్ : 57431, గ్రామ్స్ : **HOTEL PURNA.**

హోటల్ పార్క్‌లేన్.
115, పార్కులేన్, సికింద్రాబాదు.
ఫోన్ : 70148, గ్రామ్స్ : **HIARCHES, Telex** : 0155-679.

హోటల్ అస్రాని.
1-7-179 మహాత్మాగాంధీరోడ్డు, సికింద్రాబాదు.
ఫోన్: 822267.

హోటల్ అశోకా,
29/11, లక్డికాపూల్, ఫోన్: 22077-11
గ్రామ్స్: **PROHOTEL.**

హోటల్ నాగార్జున
బషీర్‌బాగ్, ఫోన్: 37201 (10 లైన్లు)
గ్రామ్స్: **MAGNIKIQUE.**

హోటల్ సరోవర్,
5-9-22, సెక్రటేరియట్ రోడ్,
ఫోన్: 30691.

హోటల్ ఎమరాల్డ్.
చిరాగ్ అలీ లేన్, అబిడ్‌రోడ్, ఫోన్: 30171.
గ్రామ్స్ : STAYFINE.
Telex: 0155-578.

హోటల్ రాజధాని,
సిద్ధియం బజారు, ఫోన్: 57571,
గ్రామ్స్: RAJDHANI.

పెర్సిస్ హోటల్,
సర్దార్‌పటేల్ రోడ్డు, ఫోన్: 72106 (4 lines)
గ్రామ్స్: PERCYS

రాక్ కాజిల్ హోటల్,
బంజారా హిల్స్, ఫోన్: 33541 (3 Lines),
గ్రామ్స్: ROCKCASTLE.

హోటల్ సిద్ధార్థ,
4-1-465, ట్రూప్ బజారు,
ఫోన్: 46863, గ్రామ్స్: HOMELY.

ఇతర హోటళ్ళు :

అనేకం. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవి.

ఎమరాల్డ్ హోటల్,
చిరాగ్అలీ లేన్,
ఫోన్: 237835- (6 Lines)

హోటల్ జయా ఇంటర్నేషనల్
నైపాల్ రోడ్ (G. P. O. పరిసరాల్లో)
ఫోన్: 223444.

హోటల్ సంపూర్ణ ఇంటర్నేషనల్
ముక్తరంజాహి రోడ్,
ఫోన్: 40165- 6 Lines.

హోటల్ హైడ్ ఇన్
లేక్‌హిల్ రోడ్,
ఫోన్: 38481.

హోటల్ ద్వారక
లక్డికా పూల్, ఫోన్: 30561
గ్రామ్స్: DWARAKA.

శ్రీ వెంకటేశ్వర లాడ్జ్.
లక్డికాపూల్,
ఫోన్: 36871.

హోటల్ క్రిష్ణా.
లక్డికాపూల్,
ఫోన్: 30151.

శ్రీ బృందావన్ హోటల్,
స్టేషన్‌రోడ్డు,
ఫోన్: 220280, గ్రామ్స్: BRINDAVAN,

తాజ్‌మహల్ గ్రూప్ ఆఫ్ హోటల్స్,
సరోజినీదేవి రోడ్, సికింద్రాబాదు,
ఫోన్: 73171 గ్రామ్స్: CURTESY,
కింగ్‌కోఠీ రోడ్, హైదరాబాదు,
ఫోన్: 221167, గ్రామ్స్: CURTESY.

ట్విన్ సిటీస్ హోటల్,
హోటల్ హరిద్వార్, ఇసామియాబజార్,
టూరిస్టు హోటల్, కాచిగూడ, ఫోన్: 44491.

రాయల్ హోటల్స్,
నాంపల్లి హైరోడ్డు.

ఇంకా ఎన్నెన్నో. ఎవరెవరి తాహతునుబట్టి వారు ఎన్నుకోవచ్చు. పై హోటళ్ళలో మాన్యులు, సంపన్నులకేగాక, సాధారణ మధ్యతరగతి వారికున్నూ అందుబాటులో వుండేవి వున్నాయి.

**తింటానికి**

| హైదరాబాదు | సికింద్రాబాదు |
|---|---|
| **శాకాహారం** | **శాకాహారం** |
| బృందావన్, ద్వారక, కామెత్, సరోవర్, తాజ్‌మహల్, టూరిస్టు హోటల్స్. | ఆనందభవన్, తాజ్‌మహల్, కామెత్. |
| **మాంసాహారం** | **మాంసాహారం** |
| బ్లూ డైమెండ్, ప్రాడ్‌వేస్, క్రిస్టల్, హైకింగ్. | గార్డెన్ రెస్టారెంట్లు, క్వాలిటీ, ఆల్ఫా, లిడో, నాంకింగ్ వగైరాలు. |

## ట్రావల్ రిజర్వేషన్లు

**బస్సు :**

హైదరాబాదు బస్టాండు, ఫోన్: 46647. APSRTC వారి డిపో మేనేజరు కార్యాలయం, ముషీరాబాదులో విచారణలు చేయవచ్చు.

**రైలు :**

హైదరాబాదు, రైల్వే రిజర్వేషను కౌంటరు, రైల్వేస్టేషను, సికిందరాబాదు, రైల్వే రిజర్వేషను కౌంటరు, రైల్వేస్టేషను.

**ఎయిర్ :**

ఎయిర్ ఇండియా, సైఫాబాదు, ఫోన్: 222747.

ఇండియన్ ఎయిర్‌లైన్సు, సైఫాబాదు, ఫోన్స్ : 36902, 72910.

కువైట్ ఎయిర్‌వేస్ : పబ్లిగార్డెన్ రోడ్డు, ఫోన్ : 36042.

లుఫ్తాన్సా ; నవీన్‌నగర్, బంజారాహిల్స్; ఫోన్ : 38816.

ఎవిమేషన్ ట్రావల్స్ : అశోకా హోటల్, లక్డీకా పూల్ ఫోన్ : 221325.

టూరిస్టులకు సమాచార కేంద్రాలు :

పర్యాటకులకు తగిన సమాచారాన్నందించేందుకు అక్కడక్కడా సమాచారం తాలూకు పోస్టర్లు వగయిరాలు బస్ స్టేషనుల్లోను, రైలు స్టేషనుల్లోను, ఆ పరిసర ప్రాంతాల్లో వున్నా సమగ్రంగా వుండవు. వున్నా చినిగిపోయి, మాసిపోయిఉంటాయి. కనుక ఈ క్రింది కేంద్రాలు పర్యాటక సమాచారం పూర్తిగా అందించటానికి తోడ్పడతాయి.

(1) రాష్ట్ర సమాచార కేంద్రం, సమాచార విభాగం, ప్రజాసంబంధశాఖ, గృహకల్ప, ఫోన్ : 45701.

(2) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పర్యాటకశాఖ, టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో డైమండ్‌హౌస్, హిమాయత్‌నగర్. ఫోన్ : 223484 & 223385.

(3) ప్రెస్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, అబిద్ రోడ్డు. ఫోన్ : 42356.

(4) టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ కౌంటర్లు-నాంపల్లి, సికింద్రాబాదురైల్వేస్టేషన్స్

(5) " " ఎయిర్‌పోర్టు, బేగంపేట.

(6) T. T. D. ఇన్‌ఫర్మేషన్ సెంటర్, లిబర్టీరోడ్డు. ఫోన్: 62910.

(7) టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ సెంటరు, జమ్మూ & కాశ్మీర్ గవర్నమెంటు, 30, లాల్ బహాదూర్ స్టేడియం.

హైదరాబాదు నుండి దేశంలో చాల ముఖ్య కేంద్రాలకు మంచి రోడ్లు, బస్సు సౌకర్యం వున్నది.

| | | |
|---|---|---|
| సూర్యాపేట – 131, | విజయవాడ – 148 | గమ్యం : అమరావతి. |
| గుంటూరు – 34, | అమరావతి – 26 | మొత్తం దూరం – 384 కి.మీ. |
| షోలాపూర్ – 306, | బీర్ – 175 | గమ్యం : ఔరంగాబాదు. |
| ఔరంగాబాదు – 125 | | మొత్తం దూరం – 606 కి.మీ. |
| కర్నూలు – 218, | అనంతపురం – 142 | గమ్యం : బెంగుళూరు. |
| హిందుపూర్ – 128 | బెంగుళూరు – 112 | మొత్తం దూరం – 590 కి.మీ. |
| సూర్యాపేట – 131, | ఖమ్మం – 63, | గమ్యం – భద్రాచలం. |
| కొత్తగూడెం – 80, | భద్రాచలం – 37 | మొత్తం దూరం – 311 కి.మీ. |

| | |
|---|---|
| షోలాపూరు-306, పూనే - 243 బొంబాయి. 164 | గమ్యం : బొంబాయి. మొత్తందూరం: 713 కి. మీ. |
| రాయచూర్-201, హుంగుండ్-154, బెల్గాం-185, పానాజి. (గోవా)-158 | గమ్యం: గోవా. మొత్తందూరం: 698 కి. మీ. |
| కర్నూలు-213, అనంతపూర్-142, కదిరి-95, మదనపల్లి-80 హార్స్లీ హిల్స్:27. | గమ్యం: హార్స్లీ హిల్స్ మొత్తందూరం: 557 కి. మీ. |
| కర్నూలు-213, అనంతపూరు-142, హిందుపూర్ - 122, లేపాక్షి - 16. | గమ్యం: లేపాక్షి దూరం: 494 కి.మీ. |
| కోదాడ్-175, విజయవాడ-96. గుంటూరు-34, నెల్లూరు-182, మద్రాసు-184 | గమ్యం: మద్రాసు. దూరం: 671 కి.మీ. |
| కామారెడ్డి-117, అదిలాబాద్-183, వార్ధా-117-నాగపూరు-78. | గమ్యం: నాగపూరు దూరం: 565 కి:మీ. |
| దండి-122, నన్ననూరు-38, శ్రీశైలం-59. | గమ్యం: శ్రీశైలం దూరం: 219 కి మీ. |
| కర్నూలు-213, కడప-205, తిరుపతి-162. | గమ్యం: తిరుపతి దూరం: 580 కి. మీ. |
| విజయవాడ-274, రాజమండ్రి-190, తుని-100, విశాఖ పట్నం-103. | గమ్యం: విశాఖపట్నం. దూరం: 667 కి.మీ. |
| జనగాన్-85, వరంగల్-72. | గమ్యం: వరంగల్ దూరం: 157 కి.మీ. |

# వరంగల్లు

హైదరాబాదు నుండి 157 కి. మీ. దూరం.

**ఈ పట్టణం జనాభా :**

1,60,000.

దీనికి పూర్వపు పేర్లు ఓరుగల్లు, ఏకశిలానగరం, ఏకోపలపురం అనే పేర్లు కూడా ఉన్నాయి.

ఆంధ్రరాజులు కాకతీయులు రాజధానిగా చేసుకొని దక్షిణ రాజ్యాన్ని పాలించారు. 12వ శతాబ్దం ఉత్తరభాగం నుండి 14వ శతాబ్దం మొదటి వరకూ ఎదురు లేకుండా పాలించారు. కాని ఢిల్లీ సుల్తానులైన తుగ్లకులు దండయాత్రచేసి వీరిని ఓడించారు. కాకతీయులు కళలను పోషించినవారు, మంచి నిర్మాణ కుశలురు. వీరి కాలంలోనే చాళుక్యరీతిలో శిల్పాలు, సుందరమైన ఆలయకట్టడాలు మహోన్నతంగా తీర్చిదిద్దారు ఇది 1164 క్రీ.శ. లో నిర్మించినట్లు తెలుగు, కన్నడ శాసనాల ద్వారా తెలుస్తుంది. ఈ విషయము మీకు బాదామి, ఐహోళె, పట్టదకల్ పోయగునేవున్న కర్నాటక రాష్ట్రంలోని 7వ శతాబ్దానికి పూర్వమేవున్న కట్టడాలు చూస్తే తెలుస్తుంది. అవి చూచిన తరువాత వరంగల్లు చూడటం ఎంతయినా సముచితం, న్యాయం ఆలోచిస్తే.

వరంగల్లులో ముఖ్యమయిన ఆకర్షణ వరంగల్లు కోట. దీని నిర్మాణం మొత్తం ఇటుకలతో నిర్మించబడింది. శిల్పాలు తొలిచిన పెద్ద పెద్ద రాళ్ళు మధ్యలో పొదిగి కట్టారు గోడలు. మట్టిగోడల ప్రాకారమునకు ఒక కిలోమీటరు లోపట్టున రాతి గోడలు కట్టబడ్డాయి శత్రువు కోటలోకి చొరకుండా దుర్భేధ్యంగా వుండటానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకోబడ్డాయి బహువైభవోపేతంగా రాజ్యపాలన చేశారు కాకతీయరాజులు. కవులు, గాయకులు వారి శౌర్యాన్ని వేనోళ్ళ ప్రశంసించారు - 'ఆంధ్రపౌరుషము' 'ఆంధ్రప్రశస్తి' లలో.

క్రీ.శ. 1310లో అల్లా ఉద్దీన్ సర్వసేనాని మాలిక్‌కాఫర్ ఈ నగరంపై దండెత్తి 2వ ప్రతాపరుద్రుని ఓడించాడు నగర శిల్పాలను ధ్వంసం చేశాడు. అక్కడి సంపదలన్నిటినీ వెయ్యి ఒంటెల మీద ఢిల్లీకి తరలించినట్లు చరిత్రకారులు

చెప్తున్నారు. ఇంకా ఇప్పటికీ ఆనాటి వైభవాల అవశేషాలు చెల్లా చెదురుగాపడి మనకు ఒకవైపు పూర్వపు ఔన్నత్యానికి సంతోషం ఉప్పొంగుతూ, మరోవైపు శిధిలాలవంక చూసి కండ్లనీరు రాకమానదు. ఇక్కడి నేతపనివారు నేసిన వలిపములు ప్రపంచ ప్రసిద్ధాలు. ఈ విషయం 'మార్కోపోలో' అనే పాశ్చాత్య సంచారి తన వ్రాతల్లో ఉగ్గడించారు.

## హనుమకొండ

వరంగల్లు నుంచి షుమారు 7 కిలో మీటర్లుంటుంది. అక్కడి వేయి స్తంభాల మంటపం, ఆలయం అద్భుత శిల్పసంపదతో నిర్మించబడ్డాయి. ఇది 1162లో పాలించిన రుద్రదేవుని కాలంనాటిది. ఇది చాళుక్య శిల్ప సంపదను సంతరించుకున్న ఆలయం. నిర్మాణం మాత్రం పూర్తికాలేదు. మూడు ద్వారాల్తో ఉన్న శివాలయం. స్తంభాలమీద, దర్వాజాలమీద చూడ చక్కని శిల్పాలున్నాయి. ఆనాటి ఆహారవిహారాదులను కళ్ళకు కట్టినట్లు కనిపించే జానపదుల బొమ్మలు, తరుణతాగుల్మాదులు స్తంభాల కలంకారముబుగా శోభిల్లాయి. పువ్వురేకుల మడతల్లోనించి సన్ననితీగ, లేక దారంకూడా దూర్చి తీయవచ్చు. ఈ ఆలయంలో నంది నల్లరాతిలో సొంపుగ చెక్కబడింది. మెడ పట్టెడలు వగయిరాలు బహుసున్నితంగా చెక్కబడ్డాయి. శిల్పములు ఒక ఎత్తయితే రెండోవంక ఆలయం గర్భ గుడిలోకి డబల్ వాల్ సిస్టములో ఎయిర్ కండిషన్డ్ చేయబడినట్లు చల్లటిగాలి మాత్రము తగినంత మేరకు వచ్చునట్లు ఏర్పాటు చేయబడింది. ఇదే ఆనాటి నిర్మాణ కౌశల్యానికి మచ్చుతునక.

వరంగల్లు చేరటానికి హైదరాబాదునుండి వారానికి మూడు మార్లు వాయుదూత్ విమానమార్గముంది. రైలు మీదయితే కాకతీయ ఎక్స్‌ప్రెస్ రైలు ప్రతిరోజూ వుంది. 4 గం. ల ప్రయాణం. విజయవాడ నుంచి అయితే కాజీపేట దగ్గిర దిగి కొద్ది కి.మీ.దూరంలో వరంగల్లును చూడవచ్చు. హైదరాబాదు, నిజామాబాదుల నుండి మంచి బస్సు సౌకర్యం కూడా వుంది.

## రామప్పగుడి

వరంగల్లుకి 77 కి.మీ. దూరంలో పాలంపేట వద్ద రామప్ప సరస్సువుంది. అక్కడే రామప్పగుడి కూడా ఉంది. శిల్పరీతుల్లో బాదామి చాళుక్య సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొన్న శిల్పాలు హొయసలుల రీతిని మిళాయించి చరిత్ర

ప్రసిద్ధి గాంచినయి. ఇవి కాకతీయుల శిల్పకళాభిరుచికి తార్కాణంగా చెప్పుతుంటారు. ఆలయనిర్మాణం హనుమకొండ దేవాలయాన్ని పోలివుంటుంది. ఇది దాక్షిణాత్యుల శిల్పకళా వైశిష్ట్యానికి మచ్చుతునక.

వరంగల్లులో వసతికి టూరిస్ట్‌రెస్ట్ హౌస్, స్టేషను రోడ్డులో గల విజయా లాడ్జి, రవీంద్రనాథటాగూర్ రోడులో కొన్ని హోటళ్ళు, లాడ్జీలున్నాయి. రోజుకి రూము 15 20రూ. ల నుండి 80 రూ. ల వరకూ రేట్లున్నాయి. నచ్చిన దానిలో బస చేయవచ్చు.

ఇక్కడికి రావటానికి వారానికి మూడుసార్లు వాయుదూత విమాన సౌకర్యం వుంది. ప్రతిరోజూ హైదరాబాదు నుండి కాకతీయ ఎక్స్‌ప్రెస్ రైలు వుంది. సుమారు 4 గం. ల ప్రయాణం.

## యాదగిరిగుట్ట

విజయవాడ-హైదరాబాదు రైలు మార్గంలో రాయగిర్ స్టేషనుకు సుమారు 7 కి.మీ. దూరంలో వుంది. స్టేషను నుండి బస్సులు, గుర్రాంగాబండ్లు చాలా వున్నాయి. ఇది యాదగిరికొండ మీద నున్న శ్రీలక్ష్మీనృసింహ క్షేత్రము. ఆంధ్రప్రదేశ్‌లో ఒక ప్రధానమైన యాత్రాస్థలం. ఎప్పుడూ రద్దీగా ఉంటుంది. 315 మెట్లు ఎక్కి స్వామి దర్శనం చేసుకోవచ్చు. కాని కొండమీదికి నేరుగా బస్సులు కూడా ఉన్నాయి. తిరుమల-తిరుపతి, శ్రీశైలంలలో మాదిరిగా కొండమీద అనేక సత్రాలున్నాయి. ఇక్కడి విశేషము ఏమంటే కొండమీద పుష్కరిణిలో స్నానంచేసి, నియమంగా ఒక మండలం రోజులు స్వామికి ప్రదక్షిణలు చేస్తే సర్వబాధలు తొలగి ప్రశాంతతను పొందగలరని గట్టి నమ్మకం. స్వామివారు 16 రోజులకు స్వప్న సాక్షాత్కారంలో దీక్షాపరులయిన భక్తుల సమస్యలకు పరిష్కారం సూచించునని కూడ చెప్పుకుంటారు.

స్వామివారి బ్రహ్మోత్సవాలు ఫాల్గుణ తదియ నుండి ప్రారంభమై ద్వాదశి వరకు కోలాహలంగా జరుగుతాయి.

**చూడదగినవి :**

శివాలయము, సంస్కృత కళాశాల, అద్దాల మంటపం, పాంచరాత్ర పద్ధతిని అర్చనాదుల్లో శిక్షణ యిచ్చే పాఠశాలలు ముఖ్యములు.

**ఈ ప్రాంతల్లో ఇంకా చూడదగినవి :**

బీదర్‌లో కోట, మాణిక్యనగర్, హుమ్నాబాదు సమీపంలో ఉన్నది- ఒక గొప్ప మహానీయుని సమాధి- పెద్ద నగరంలాగా భవనాలు, సత్రాలు నిర్మించ బడ్డాయి. చూడదగిన ప్రదేశం.

# భ ద్రా చ లం

వరంగల్లు నుండి డోర్నకల్ చేరి బండి మారి భద్రాచలం రోడ్డు స్టేషను చేర వచ్చును. అక్కడినుండి బస్సులలో భద్రాచలం చేరవచ్చును. భద్రాచలం చాలా చిన్న ఊరు. సుమారు 10 నుండి 15 వేలలోపు జనాభా. క్షేత్ర పాశస్త్యము చాల విశేషం. ఇక్కడి క్షేత్రం జాతీయ ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. పావన గోదావరి వొడ్డున శ్రీ సీతారామచంద్ర స్వామి వేంచేసియున్న ఆలయము చరిత్ర ప్రసిద్ధము.

వేదకాలం నుండి నేటివరకూ ముముక్షు జన సేవితమై యున్నది. ఇందుకు తార్కాణం బ్రహ్మాండ పురాణంలో గౌతమీ మాహాత్మ్యము నందు భద్రాద్రి క్షేత్ర మహిమ గూడ వర్ణింపబడి యుండటమే।

మేరుపుడు భద్రుడనే కొడుకున్నాడు. ఈయన ఒక పర్వతరాజు. ఇతడు గౌతమీ తీరంలోగల దండకారణ్యంలో ఘోరమైన తపస్సుచేసి శ్రీరామచంద్రుని సాక్షాత్కారాన్ని పొందాడు. శ్రీరాములవారు వరం కోరుకొమ్మని అడిగితే కైలాసగిరి మీద శివుడలంకరించునట్లు తన శిఖరముమీద శ్రీసీతారామలక్ష్మణ సమేతులైన రామ ప్రభువును తన శిఖరము నలంకరించి జీవులకు మోక్షసామ్రాజ్య మందించవలయునని కోరుకొన్నాడట భద్రుడు. అతని కోరిక ప్రకారం అక్కడకు సీతాలక్ష్మణ సహితు లైన రామప్రభువు వేంచేసి కొలువుదీరి యున్నాడు. ఇది సంగ్రహంగా పురాణ కథ.

కంచర్ల గోపన్న గొప్ప రామభక్తుడు. ఆనాటి తానీషా ప్రభువు దక్కను సామ్రాజ్యాన్ని ఏలుచున్నవాడు. ఆయనకు అక్కన్న, మాదన్న యను మంత్రు లున్నారు. వీరు కంచర్ల గోపన్నకు దగ్గర బంధువులు. వారి ప్రాపకంవల్ల కంచర్ల గోపన్న 1670లో పరగణాధికారము పొందాడు. 1674 వరకు శ్రీ రామాలయము నిర్మాణం చేయించినాడు. సర్కారుకు కట్టవలసిన పన్నుడబ్బును ఆలయ నిర్మాణానికి వెచ్చించినందుకు 1686 వరకు కారాగారబద్ధుడైనాడు. శ్రీ సీతారామస్వామి లక్ష్మణ

సమేతుడైవచ్చి గోల్కొండ కోట పట్టణంలో వున్న తానీషా ప్రభువుకు బాకీని చెల్లించి మహా భక్తుడైన శ్రీ గోపన్నను కారాగార విముక్తుని చేసినట్లుగా చెప్పుకుంటారు.

భద్రాచల ఆలయమున గోపన్నగారు చేయించిన బంగారు ఆభరణములన్నీ అద్దాల బీరువాల్లో ఇప్పటికీ భద్రంగా వుంచబడినవి. వాటిని కూడా దర్శించవచ్చు.

స్వామివారికి నిత్యోత్సవాలు: ప్రభాతసేవ, దంత ధావనోత్సవం, బాల భోగాది ఆరాధనలు, పవళింపు సేవ వరకు చూడవచ్చును. పునర్వసు నక్షత్రముగల రోజులు, ఏకాదశి, పూర్ణిమ తిథులయందు, సంక్రమణముల యందు స్వామివారికి అభిషేక, సహస్ర నామార్చన, గ్రామోత్సవాదులు చేయబడును.

## శ్రీరామ నవమి కళ్యాణోత్సవము :

ప్రతి సంవత్సరం శ్రీరామనవమినాడు కళ్యాణోత్సవము చాలా విశేషము. జాతీయ ప్రాముఖ్యతను సంతరించుకున్నది. కళ్యాణోత్సవమును తిలకించటానికి లక్షల మంది యాత్రికులు వస్తారు. వసతి సౌకర్యాలు భారీఎత్తున ఏర్పాటు చేస్తారు. రాష్ట్ర ప్రభుత్వం విశేషమైన శ్రద్ధాసక్తులతో ఏర్పాట్లు దగ్గరవుండి పర్యవేక్షిస్తారు. ఉత్సవంలో రాష్ట్ర ముఖ్యమంత్రి మొదలయిన ప్రముఖులు, ప్రభుత్వ అధినేతలు, అధికారులు గూడ పాల్గొంటారు. ఇక్కడ జరిగే కళ్యాణోత్సవ కార్యక్రమాలు ఆలిండియా రేడియో; టి.వి.ల్లో ప్రసారం చేయబడతాయి.

## పరిసర ప్రాంతాలు :

### ఉష్ణగుండం :-

కూనవరం రోడ్డుమీద గల గుండాల గ్రామం దగ్గర గోదావరి నదిలో ఉంది. బండ్లు, బస్సు సౌకర్యాలున్నాయి. భద్రాచలం నుండి 5 లేక 6 కి.మీ. దూరం వుంటుంది.

### పర్ణశాల :-

భద్రాచలం నుండి సుమారు 38 కి.మీ. వుంది. R.T.C. బస్సు సౌకర్యం వుంది. ఉండటానికి సత్రాలు వగయిరాలు ఉన్నాయి. అన్నీ దొరుకుతాయి. శ్రీ సీతారాములు వనవాస సమయంలో ఇక్కడ పర్ణశాల నిర్మించుకుని విడిది చేశారని ప్రచారంలో వున్న విశేషం. అక్కడ కొన్ని గుర్తులు– సీతమ్మవారు చీర లారేసుకున్న

చోటు, శూర్పణఖ రాములవారిని, లక్ష్మణున్ని కవ్వించిన చోటు అంటూ చూపిస్తారు. ప్రకృతి శోభతో గోదావరి విశాలంగా పరుచుకుని పారుతున్న నదీతీరం చూడటానికి నేత్రపర్వంగా ఉంటుంది.

## నాగార్జున సాగర్ - నాగార్జున కొండ

నాగార్జున సాగర్ :-

కృష్ణానదిపైన కట్టబడిన ఒక పెద్ద ఆనకట్ట. ఇది ప్రపంచంలో ఎత్తయిన ఆనకట్టల్లో ఒకటిగా గుర్తించబడింది. కృష్ణానది ఇక్కడ రెండు కొండలను ఒరుసుకుని ప్రవహిస్తుంది. ఈ రెండింటినీ కలుపుతూ ప్రకృతి శోభతో విలసిల్లే ఒక చక్కనైన ప్రదేశం. సాగర్ కుడి, ఎడమల కాల్వలు షుమారు 20 లక్షల ఎకరాలకుపైగా ఆయకట్టుగా నిలుస్తుంది. ఇక్కడనే ఒక జలవిద్యుత్తు ప్రాజెక్టుకూడా నిర్మించబడింది. ఈ ఆనకట్టను ఆనుకునే విజయపురి అనే పట్టణవాసమేర్పడి అభివృద్ధి పథంలో భాగాన్ని పంచుకుంటుంది.

ఇది ఒకప్పుడు ఆంధ్ర బౌద్ధ భిక్షువు, ఆచార్య నాగార్జునుని నివాసం. ఒక విశ్వవిద్యాలయమే వెలసిందిచోట. మహాయాన తెగ బౌద్ధుల సంప్రదాయానికి బద్ధుడైన నాగార్జునుడు క్రీ.శ. 2వ శతాబ్దివాడు. అయన ఇక్కడ వున్న రాళ్ళను బంగారంగా మార్చే పరసవేది విద్యను తెలిసినవాడై అనాటి ఆంధ్రరాజులు- శాతవాహనులకు బాసగా నిలిచాడని చరిత్రకారులు చెప్తున్నారు. ఇక్కడ ఒక మహానగర ప్రాభవం విలసిల్లి అనేక బౌద్ధారామములు, చైత్యాలు, విహారాలు నిర్మాణం జరిగి శోభాయమానంగా తెలుగువారి వెలుగులను దిగ్దంతాల వెదజల్లిన ప్రదేశం. కాలక్రమేణా ఈ పట్టణం భూస్థాపితమై పోయింది. ఒక చిన్న కుగ్రామంగా వున్న పుల్లారెడ్డిగూడెం అనే పేరుతో పుష్పగిరి పీఠాధిపతుల అగ్రహారంగా ఉండేది. అన్నీ మట్టి దిబ్బలు. ఒకటి రెండుచోట్ల మాత్రం ఏవో శిలాశాసనాలు పైకి పొడుచుకుని వచ్చినట్లుండేవి. 1926 సంIIలో ఈ ప్రదేశాన్ని పురాతత్వ శాఖవారు కొని త్రవ్వకాలు సాగించగా చాలా విశేషమైన మహానగర అవశేషాలు బయటపడ్డాయి. కొన్నిటిని అనాడే మద్రాసు మ్యూజియంకి తరలించారు.

ఆనకట్ట కట్టేటప్పుడు నీటిముంపుకు గురయ్యే ఈ ప్రాంతంలో ప్రాచీన శిల్ప కళా వస్తుసంపద సంతటినీ భద్రంగా కొండమీద ఒక మ్యూజియం ఏర్పరచి

అందంగా పర్యాటకులకు ఆకర్షణగాను, ఆనాటి వైభవాలకు తార్కాణంగాను చూప బడుతున్నాయి.

యాత్రికుల కేంద్రంగా అనేకమందిని ఆకర్షించే ఈ ప్రదేశంలో చూడదగినవి :

1. కొండమీద భద్రపరచబడిన ప్రాచీన శిలా శిల్ప శిథిలాలు—అక్కడ పున రుద్ధరించబడిన విహారములు, అశ్వమేధయాగ వాటిక, మహారాణిగారి స్నానఘట్టం మొదలయినవి.

2. ఆనకట్ట పనిచేసే తీరుని తెలియజెప్పే నమూనా.

3. కుడికాలువ. (ప్రియతమ నాయకుడైన జవహర్‌లాల్ పేరున) జవహర్ కాలువ.

4. ఎడమ కాలువ (అతికొద్ది కాలంలోనే దేశవిదేశాల్లో ప్రజాభిమానం చూర గొన్న లాల్‌బహదూర్ మరణానంతరం – ఆయన పేరు మీదున్న) లాల్‌బహదూర్ కాలువ.

5. మ్యూజియం.

6. ఇక్కడికి 11 కి.మీ. దూరంలోవున్న ఎత్తిపోతల జలపాతం—చంద్రవంక నది నీరు పైనుండి క్రిందకు పడుతుంది. శ్రీ రంగనాయక స్వామి ఆలయం కూడా వుంది, చాల రమణీయమైనది-

యీమొదలైన వాటితో పూర్వం విజ్ఞానభిక్ష నందించిన ఈ చోటు— ఈనాడు ఆంధ్రప్రదేశ్ మొత్తాన్ని ధాన్యాగారంగా మార్చి అన్నంపెట్టే అన్నపూర్ణగా వెలసిన ఈ ప్రదేశం ప్రకృతి రామణీయకతతో చూపరులను ఆకర్షిస్తూ ప్రముఖ పర్యాటక స్థలంగా తయారైంది.

## ఆహార—విహారాలు

**వసతి సౌకర్యాలు :-**

1. A.P.T.T.D C. వారి ఆధ్వర్యంలో సౌందర్యా గెస్టుహౌస్ దగ్గరనే కాటేజీలు.
2. కుడిఒడ్డునగల A.P.T T.D.C. వారి ఆధ్వర్యంలోనేగల హిల్‌కాలనీ కాటేజీలు సేతుసదన్, సౌందర్య గెస్టుహౌస్, హిల్‌కాలనీ.

3. ఆర్కిలాజికల్ గెస్టుహౌస్.
4. ఎత్తిపోతల గెస్టుహౌస్.
5. మిగ్ రెస్టు హౌస్, నాగార్జునకొండ.
6. రివర్ వ్యూ గెస్టు హౌస్.
7. విజయ్ విహార్, హిల్‌కాలనీ.
8. యూత్ హాస్టల్
9. జలదర్శిని, నాగార్జునకొండ.
10. చంద్రవాక టూరిస్టు రెస్టు హౌస్.

గమనిక :—

విజయ్ విహార్, రివర్‌వ్యూ గెస్టుహౌస్, ప్రాజెక్టుహౌస్ (పై భాగము) R&B డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, నాగార్జునసాగర్ డామ్ వారి ఆధిపత్యంలో వున్నాయి.

విశేష సమాచారం :

టూరిస్టు ఇన్‌ఫర్మేషన్ ఆఫీసరు, ప్రాజెక్టు హౌస్, హిల్‌కాలనీ, నాగార్జున డామ్, ఇండియన్ టూరిజమ్ డెవలెప్‌మెంటు కార్పొరేషను వారు హైదరాబాదు నుండి సెలవు రోజుల్లోను, ఆదివారాల్లోను ఎక్స్‌కర్షన్ ట్రిప్స్‌ను నిర్వహిస్తున్నారు.

హైదరాబాదు నుండి హారిసన్ టూర్స్ & ట్రావెల్స్ వారు కూడా సెలవు దినాలు, ఆదివారాల్లో యాత్రలను నిర్వహిస్తున్నారు.

విజయవాడ నుండి ఆంధ్రప్రదేశ్ టూరిజమ్ డిపార్టుమెంటువారు ఒక మినీ బస్సును నడుపుతున్నారు, యాత్రికుల సౌకర్యంకోసం. మరింత సమాచారం విశేషాలకు సంప్రదించటానికి – అసిస్టెంటు డైరక్టరు, స్టేట్ ఇన్‌ఫర్మేషను సెంటరు, విజయవాడ. ఫోన్ నం. 75674 వారిని సంప్రదించవచ్చు.

## మాచర్ల

ఇక్కడికి, అతి సమీపంలోనే ఉన్న మాచర్ల లోని చెన్నకేశవ స్వామివారి ఆలయము చాల పురాతనమైనది. ఇక్కడి నాపరాళ్ళు, పలకల వ్యాపారం చాలా ప్రసిద్ధం. ఇక్కడ చంద్రవంక నదీస్నానం ముఖ్యం. వీరుల ఆలయాలు– మంటప స్తంభాలమీద గల పౌరాణిక చిత్రాలు చూడదగినవి.

# చేజెర్ల - కపోతేశ్వరాలయం

మాచర్ల-గుంటూరు మార్గంలో నర్సరావుపేటకు 20 కిలోమీటరుల దూరంలో బస్సు ప్రయాణంలో చేరవచ్చును. చేజెర్ల చాలా చిన్న గ్రామం. కాని చాల పురాతన మైన ఆలయం కపోతేశ్వరాలయం. సుమారు క్రీ.శ. 2-4 శతాబ్దాలకు చెందినది. ఒక బౌద్ధ చైత్యమును హిందూ దేవాలయంగా మార్చబడిందిగా తెలుస్తుంది. అయితే ఒక పూర్వగాధ మాత్రం చెప్పబడుతూ వుంది ఇక్కడ ఇంకా మరికొన్ని చిన్ని చిన్న ఆలయాలు కూడా ఉన్నాయి. ఒకప్పుడు దక్షిణ కాశిగా పేరుగాంచి మంచి వైభవంతో శోభిల్లిందని కొన్ని శాసనాలను బట్టి తెలుస్తుంది.

దీనికి చేజెర్ల అను పేరు రావటానికి కొంత పరిణామక్రమం ఉన్నట్లుగా తెలుస్తుంది. మొదట 'చేరుంజెర్ల'గా ఉండి కాలక్రమేణా 'చేజెర్ల'గా మారినట్లు చెప్పుతున్నారు.

శివక్షేత్రమయిన కపోతేశ్వరాలయంలో మూడు గజాల ఎత్తు గలిగిన సహస్ర లింగాకారమూర్తిగా వేంచేసియున్న ఈశ్వరుడు, మల్లికాపుష్కరణి ఓగేరు అనే నదీ ఉన్నాయి. జీర్ణావస్థలో ఉన్న దీ ప్రాచీన దేవాలయం.

మాంధాత చక్రవర్తి కుమారుడు శిబి చక్రవర్తి. ఆయనకు ఇద్దరు సోదరులు. వారు దక్షిణ దేశమునకువచ్చి ఇక్కడి ఋషీశ్వరులను చూచి వైరాగ్యాన్ని పొందారు. అందులో మేఘాడంబరుడు తపస్సుచేసి సిద్ధిని పొంది లింగాకారంగా వెలిసినట్లు ఒక కథ. తరువాత జీమూతవాహనుడనే రెండవ సోదరుడు కూడా చేజెర్ల చేరి మొదటివాని మాదిరిగానే వైరాగ్యాన్ని పొందాడట. అప్పుడు శిబిచక్రవర్తి బయలుదేరివచ్చి ఆ ప్రదేశంలో 100 యజ్ఞాలు చేయసంకల్పించారనిన్నీ, తొంభయి తొమ్మిదో యజ్ఞము సమాప్తం కాగానే 100వ యజ్ఞము ప్రారంభంలో శిబి చక్రవర్తి త్యాగమును గూర్చి మనకు యిప్పటికీ ప్రచారంలోవున్న కధాంశము - పావురము, వేటకాడు, శిబిచక్రవర్తి కథ మనకు సుపరిచితమే: ఇది పావురాన్ని కాపాడటానికని, జీవకారుణ్య భావంతో వేటకానికి కావలసిన మాంసమును పావుర ప్రమాణమునకు తన ఒంటి కండలు నుండి కోసి యిచ్చాడని ఆయన త్యాగనిరతికి మచ్చుతునకగా చెప్పుకొనే కథ బహుళ ప్రచారంలో వున్న సంగతి మనకు తెలిసిందే. ఈ కథ ఇక్కడ జరిగినట్లున్నూ, శిబి త్యాగమునకు మెచ్చిన త్రిమూర్తులు ప్రత్యక్షమై వరము లివ్వటం.. శిబి తన దేహం,

తన పరివారము అంతా శివాకారాలుగా మారి చేజెర్ల ప్రాంతములో ఉండేటట్లుగా వర మిచ్చారని పూర్వకథ చెప్తుంటారు.

ఈ ఆలయానికి సమీపంలో ఒక కొండమీద మల్లేశ్వరస్వామి ఆలయం, మరోకొండ మీద శ్రీకుమారస్వామి ఆలయం చూడదగినవి. తొలి యేకాదశికి, ప్రతి మాసశివరాత్రికి, దేవీ నవరాత్రులు, విజయదశమికి ఉత్సవాలు విశేషంగా జరుగుతాయి.

## కోటప్పకొండ

నర్సరావుపేట నుండి అతి సమీపంలో ఉన్న ఈ శివక్షేత్రంలో వేంచేసి యున్న శ్రీ కోటేశ్వరస్వామికి ప్రతి శివరాత్రికి గొప్ప తిరునాళ్ళ ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవాలు చూడటానికి ఆంధ్రదేశంలో అనేకచోట్ల నుండి తండోప తండాలుగా ప్రజలు వస్తారు. కొండమీదగల ఈ దేవాలయానికి దాదాపు 200 గ.లు ఎక్కవలసి వుంటుంది. పురాణాల్లో త్రికూటేశ్వరమని చెప్పబడి ఉంది. మూడు శిఖరాలుగల కొండ గనుక త్రికూటేశ్వరము, త్రికూటాచలమని పేర్లున్నాయి. శివ రాత్రికి జరిగే ఉత్సవాలకి ఆం. ప్ర. రో. ర. సంస్థవారు పలుచోట్లనుండి ప్రత్యేక బస్సులలో ప్రయాణ సౌకర్యాలు ఏర్పరుస్తారు. శివరాత్రికి నేత్రపర్వంగా ఉత్సవాలు జరుగుతాయి. ఆంధ్ర ప్రసిద్ధము– శివరాత్రి, అమావాస్య రోజుల్లో– కలప సంత కూడా జరుగుతుంది. ప్రక్కనేఉన్న గొల్లభామ గుడి కొన్ని కథలు చెబుతుంది. తెలుసుకోదలచినవారు వెళ్ళిచూసి తెలుసుకోవచ్చు.

## వినుకొండ

రామాయణంలో రావణాసురుడు సీతాపహరణం చేసి ఆకాశమార్గంలో వెళ్ళాడని, జటాయువువల్ల సీతమ్మజాడని శ్రీరాములవారు ఇక్కడ విన్నారట. అందుకని 'విన్నకొండ'గా ప్రతీతి చెందినది. కాలక్రమేణా వినుకొండగా మారింది. నరసరావు పేట నుండి షుమారు 38 కి.మీ. దూరం వుంటుంది.

కొండపైన దేవాలయము. అనేక పురాణ కథలను తెలిపే ఆలయాలు, జటాయువు రెక్కలు మొదలైన విశేషాలున్నాయి. ఇక్కడి గుంటి ఆంజనేయస్వామి చాల ప్రసిద్ధ దేవుడు. ఇక్కడి నుండి శ్రీశైలమునకు వెళ్ళేమార్గంలో (రోడ్డుకు పూర్వం)

త్రిపురాంతకం, ఎర్రగుంట్ల పాలెం, తెలుగురాయని చెరువు మీదగా చుక్కల పర్వతం మీదుగా శ్రీశైలం వెళ్ళేవారు పూర్వం. అయితే చాల శ్రమతో గూడిన పని.

త్రిపురాంతకం చూడవచ్చును. త్రిపురసంహార సమయంలో త్రిపురాసురుని రక్తం భూమిపైపడితే బొట్టుకు పదివందిచొప్పున రాక్షసులు పుడుతుండేవారు. అందు వలన శ్రీ అమ్మవారు తన నాలుకను జాపి ఆ రక్తబిందువులను భూమిమీద పడకుండ జేసింది. అప్పటినుండి పార్వతీ అమ్మవారికి 'త్రిపురసుందరి' అనే పేరు వచ్చింది. ఇది కూడ శైవక్షేత్రమే: కొండ దిగువన కొలను అందులో ఆలయము వుంది. అక్కడ కదంబ వృక్షాలు అనేకం వున్నాయి. మన మంత్రాల్లో 'కదంబ వనవాసిని' అనే పేరు ఇక్కడనే సార్థకమైందేమో అన్నట్లు– మరోచోట ఎక్కడా ఈ కదంబ వృక్షాలు అంతగా కనిపించవు.

# శ్రీ బ్రహ్మంగారి మఠము

విజయవాడ నుండి గుంతకల్ రైలుమార్గంలోగల వినుకొండ నుండి గిద్దలూరు సుమారు 120 కి.మీ. పైగా వుంటుంది. గిద్దలూరు నుండి బస్సులో బద్వేలు మీదగా వెళ్ళాలి. శ్రీ బ్రహ్మంగారి మఠము వున్నవూరు కందిమల్లయ్యపల్లె అంటారు.

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారు 16వ శతాబ్ది ప్రాంతము వారు. కాలజ్ఞాన తత్వాన్ని అందరికీ అర్థమయ్యే భాషలో వ్రాశారు. దానిలో భూత, భవిష్యత్ వర్తమాన కాలాలను గురించి సర్వవిషయాలు తెలిపే భావాలు అనేకం. స్వామివారు కందిమల్లయ్యపల్లె అనే గ్రామంలో క్రీ.శ. 1594 సం॥ మే నెలలో జీవసమాధిని పొందారు. అందువలన అక్కడే శ్రీ బ్రహ్మంగారి మఠము ఏర్పడింది.

ప్రతి సంవత్సరం శివరాత్రి పర్వదినాన గొప్ప రథోత్సవం జరుగుతుంది. వైశాఖ శుద్ధ దశమి రోజున స్వామివారికి ఆరాధన జరుగుతుంది. విశేషంగా ప్రజలు దర్శిస్తారు.

ఎగువమెట్ట స్టేషనునుండి గాజులపల్లి స్టేషను వరకు రైలుమార్గం కొండల్లో వేయబడింది. ఈ ప్రాంతము అంతా నల్లమల అడవులు. ప్రకృతి సౌందర్యం: చాలా రమణీయంగా వుంటుంది. ఒకకొండ నుండి మరొక కొండను కలుపుతూ కొండకొనల మీద వంతెనలగా వేయబడిన రైలుమార్గం అద్భుతంగా వుంటుంది.

# మ హా నం ది

గిద్దలూరు నుండి గాజులపల్లి స్టేషనులోదిగి వెళ్ళవచ్చు. గాజులపల్లికి సుమారు 6 కి.మీటర్లుంటుంది మహానంది. ఇది కూడా పేరెన్నికగన్న శైవక్షేత్రాల్లో ఒకటి. నంద్యాల నుండి 16 కిలోమీటర్లుంటుంది. ఇది ఒక మంచి పిక్నిక్ స్పాట్.

ఇక్కడ మహానందీశ్వరాలయం- ఆలయాని కెదురుగా కోనేరు. కోనేరులోకి నీరు ఒకనంది నోటిగుండా నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది. చాలా తేలికైన నీరు స్వచ్ఛంగా వుంటుంది. కోనేరు సుమారు 6 అడుగుల లోతుంటుంది. నీటి అడుగున ఎంత చిన్న వస్తువైనాసరే స్పష్టంగా పైకి కనబడుతుంది. కోనేటి నీటిమట్టం ఒకే విధంగా వుండటానికి కొన్ని తూములు కట్టబడినాయి. నీరంతా కాలువలద్వారా కొన్ని వందల ఎకరాలకు సాగునీటిని సరఫరా చేస్తూ విస్తారంగా అరటి తోటలు మొదలయినవి పెంచటానికి వినియోగపడుతుంది. ఇక్కడి అరటిపండ్లు చాల ప్రసిద్ధం. తిరిగి నంద్యాల వచ్చి అక్కడినుండి శ్రీశైలమునకు రావచ్చును.

# అ హో బి లం

నంద్యాల నుండి దక్షిణంగా సుమారు 60 కి.మీ. దూరంలో అహోబిల నరసింహస్వామి దేవాలయం వుంది. దశావతారాల్లో నాల్గవ అవతారమైన నరసింహస్వామి మూర్తిలో మిగతా తొమ్మిది అవతారాలు కూడా దర్శించవచ్చు. ఈ విధమైన విశేషం దేశంలో ఎక్కడాలేదు. చూడదగినది.

# పు ష్ప గి రి

అహోబిలం నుండి ఆళ్ళగడ్డ మీదుగా మరికొంత దక్షిణంగా ప్రయాణించితే కడపకు 16 కి.మీ. దూరంలోనున్న పుష్పగిరి చేరవచ్చు.

ఆది శంకరులు స్థాపించిన పీఠాల్లో ఇది కూడా ఒకటి. ఇక్కడ శైవ, వైష్ణవ దేవాలయాలున్నాయి. ముఖ్యంగా చూడదగినది ఆదిశంకరుల పీఠము, చెన్నకేశవ ఆలయం. ఈ ఆలయంలో శిల్పకళా చాతుర్యం అద్భుతంగా ఉంటుంది.

# శ్రీశైలం

కర్నూలు జిల్లాలో నల్లమల అడవులు- నల్లమల కొండలు. ప్రకృతి అందాలన్నిటినీ ఈ మహారణ్యంలో దాచుకున్నది. పర్వతారణ్య ప్రాంతంలో పదిలంగా సముద్రపు మట్టానికి 458 మీ. ఎత్తున కొండ కొమ్మున వెలసిన, పురాణ ప్రసిద్ధమైన అనాది శివక్షేత్రము. శ్రీశైల భ్రమరాంబికా మల్లికార్జున స్వామివారి ఆలయం. ఆంధ్రప్రదేశ్ అన్నిచోట్ల నుండి బస్సులు నడుస్తూవున్నాయి. కొన్నాళ్ళ క్రిందటి వరకు జీర్ణావస్థలోనున్నా ఇటీవల ఆలయం పునరుద్ధరించబడింది. కొండపైకి నేరుగా చక్కటి రోడ్ వేయబడి యాత్రికుల సందర్శనార్థం బహు రమణీయంగా తీర్చిదిద్దబడిన ఈ ఆలయ ప్రశస్తి అనేక విధాలుగా పురాణాల్లో సైతం ఉగ్గడించబడింది.

శ్లో॥ మైనాకం మంధరం మేరుం । శ్రీశైలం గంధమాదనమ్
పంచశైలా పఠేన్నిత్యం । మహాపాతక నాశనమ్॥

అని కేవల స్మరణ మాత్రంగానే మహాపాతకాలను నిర్మూలించ గలదని ప్రతీతి.

శ్లో॥ కేదారే హ్యుదకం పీత్వా । వారణాస్యాం మృతి స్తథా
శ్రీశైలే శిఖరం దృష్ట్వా । పునర్జన్మ నవిద్యతే.

కేదారక్షేత్రంలోని నీటిని త్రావినా, కాశీలో మరణించినా, శ్రీశైల శిఖరం దర్శించినా పునర్జన్మంలేదు-అని చెప్పబడింది. ఇంతటి మహత్తుగల పుణ్యక్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో మొట్టమొదటిది.

సుమారు 80 కి.మీ. పైగా ఘాటు రోడ్ నిర్మాణం జరిగింది. శిఖరేశ్వరం దగ్గర ఒక పాలరాతి సందినేర్పరచి దాని కొమ్మునుండి శిఖర దర్శనము చేయటానికి యాత్రికులకు సౌలభ్యం చేయబడింది.

ఎన్నో ధర్మశాలలు, దేవస్థానం కాటేజీలు, శైలవిహార్, టూరిస్టు రెస్టుహౌస్, T.T.D. గెస్టుహౌస్, జిల్లా పరిషత్తువారి గెస్టుహౌస్‌లతో కొండ మీదనే ఒక చక్కటి నగర నిర్మాణంగా అభివృద్ధి చేయబడింది. ఇంకా ఎంతో పని జరుగుతోంది.

ఈ క్షేత్రానికి 110 కి. మీ. దూరంలో ఉన్న, ఆధునిక దేవాలయం అని కీర్తించబడిన ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ జనజీవన పథంలో ఉత్కృష్ట స్థానాన్ని ఆక్రమించుకున్న నాగార్జునసాగర్ నుండి జూన్ నించి ఫిబ్రవరి వరకు మోటారు బోటులో రావటానికి వీలుకూడా కల్పించబడింది. ఈ మధ్యలో ఒక WILD LIFE SANCTUARY పెద్ద పులులు, చిరుతలు, అడవి కుక్కలు, నక్కలు, తోడేళ్ళు మొదలయిన అడవి జంతువులతో చూడ ముచ్చటగా సహజ వాతావరణంలో ఆ యా జంతువులు విహరిస్తుండగా చూడటానికి వీలుగా ఏర్పాటు చేయబడింది. ఈ ప్రాంతమంతా అనేక పక్షుల కిలకిల రవకలలో నిండివుంటుంది.

ఆలయ దర్శనానికి స్వామి దర్శనంతో పాటుగా మనిషి 1కి. రు. 2-00 టికెట్టుంది.

ముఖ్య ఉత్సవాలు :

మహాశివరాత్రికి, ఉగాదికి, చైత్రమాసంలో జరిగే చండీయాగము, కుంభోత్సవము ప్రధానములు.

శివరాత్రినాటి రాత్రి స్వామివారి ఆలయంపైన ఉన్న శిఖర కలశం నుండి నాలుగువైపుల ఉండేట్లుగా మూరెడు వెడల్పు గలిగి- 360 మూరల గుడ్డను కడతారు. దీనినే పాగ చుట్టటం అని అంటారు- మంగళపాగా అని అంటారు. ఈ వస్త్రాన్ని రోజుకొక మూర చొ॥ 360 రోజులూ నేస్తారని చెప్పుకుంటారు. మంగళపాగా రాత్రి వేళ లింగోద్భవ సమయానికి కరెక్టుగా ముగుస్తుంది. పాగాకట్టే మనిషి దిగంబరుడై యుండి ఎవరికీ కానరాకుండా వుంటాడట. తరవాత ఈ మంగళపాగాను చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి ప్రసాదంగా ఇస్తారు.

మల్లికార్జునస్వామి వారిని కులమత వివక్షలేకుండా అందరూ స్పృశించి అర్చించవచ్చు. ఇది ఇక్కడి ప్రత్యేకత.

శ్రీశైలం పీఠభూమి సుమారు 85 చ. మై. వైశాల్యం గలిగివుంది ఆలయమంతో ఎత్తైన గోపుర ప్రాకారాదులతో మంటపాలతో శోభాయమానంగా చూచేవారికి ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంటుంది. ఇక్కడకు ఒక 3 కి. మీ. దూరంలో కృష్ణానది ఉత్తరవాహినియై ప్రవహిస్తూ వుంది. దీనిని పాతాళగంగ అని అంటారు.

శ్రీశైలం జల విద్యుదుత్పాదక కేంద్రం కట్టిన తరువాత పాతాళగంగకు వెళ్ళేం

దుకు గల మెట్లు చాల వరకు నీటిలో మునిగిపోయాయి. అయినా యాత్రికులు పాతాళగంగ-దగ్గరలో వున్న 'లింగాల గట్టు' వగైరాలను దర్శించుకుని గాని మరలరు.

ఆలయంచుట్టూ ప్రాకారం గోడలు చాల ఎత్తుగాను వివిధ గోపురాల్తో శోభిల్లు తున్నాయి ప్రాకారనిర్మాణానికి వినియోగించబడిన రాళ్ళు సుమారు 20 అ.వైశాల్యం లో దీర్ఘ చతురస్రాకారంలో ఉండి వాని మీద చతురంగ బలాల చిత్రాలు, రామాయణ, మహాభారత కధా చిత్రాలు- భక్త చరిత్రలు-భవగల్లీలలు చెక్కబడి విశిష్టంగా గోచరిస్తాయి. మల్లికార్జునస్వామివారి ఆలయానికి సరిగ్గా వెనుకభాగంలో భ్రమరాంబా అమ్మవారి ఆలయంలోని అమ్మవారి దృష్టి నేరుగా శివలింగముపై ఉండేటట్లుగా నిర్మించబడింది. ఆదిశంకరాచార్యులవారు ఆలయమునకు శ్రీ చక్రప్రతిష్ఠ చేశారని ప్రతీతి. చైత్రమాసంలో 'అంబ తిరునాళ్ళ' అని గొప్ప ఉత్సవం జరుగుతుంది.

వెనుక వైపున భ్రమరాంబికాలయంతోపాటు- ఎడమ వైపున పార్వతీదేవి ఆలయం ఉంది. సంక్రాంతికి పార్వతిదేవి కళ్యాణోత్సవం, శివరాత్రినాడు శ్రీభ్రమ రాంబా కళ్యాణోత్సవం జరుగుతాయి. ఈ రకంగా ఒకే సంవత్సరం రెండు కల్యాణో త్సవాలు జరిగే విశేషం దేశం మొత్తం మీద శైవక్షేత్రాల్లో ఇక్కడే.

ఆలయ సమీపంలో మొత్తం 8 ఆలయాలున్నాయి. ఆంధ్రప్రదేశాన్ని ఏలిన తెలుగు రాజులు కాకతీయుల కాలంలో వీర రుద్రమదేవి కట్టించిన కట్టడాలు, విజయ నగరసామ్రాజ్య రాజులు కట్టించిన గోపుర మంటపాదులు, భవాని భక్తుడైన వీర శివాజీ మహారాజు వారు కట్టించిన గోపురము, తదుపరి గోల్కొండ ఆక్రమణలలోకి వెళ్ళి అక్కన్న, మాదన్నల పరిపాలనలోని అవశేషాలు చక్కగా కాన వస్తాయి. ప్రభువులు ప్రదానించిన 68 గ్రామాలు- శివాజీ మహారాజు కట్టించిన ఆలయాలు- మొన్నటివరకూ ఉన్న ఆలయప్రాకారాల బంగారు రేకుల తొడుగులు- అన్నీ మాయం-మటుమాయం అయినాయి.

అనాదినించీ ప్రకృతి విలయాలెన్ని వచ్చినా, ప్రాచీనంగా అనాది కాలం నించీ అన్నిటికీ తట్టుకొని సమున్నతంగా నిలిచిన యీ పుణ్యక్షేత్రం ఇప్పటికీ శైవల్యోప నిషత్తులో చెప్పబడినట్లు—

"శ్రీశైల దర్శనాన్ముక్తిః" అనే ఆర్యోక్తికి ప్రతీకగా భక్తజనుల మనోభీష్టంగా, యాత్రికుల ఆకర్షణ మిక్కుటంగా పొంది సమున్నతంగా నిత్యనూతనంగా, ఆంధ్రుల గర్వ కారణంగా నిలిచివున్న శ్రీశైలం ఎంతయినా చూడవలసిన విశేషం

దర్శనీయ స్థలాలు :

1. సహస్ర లింగాలయము. 2. వృద్ధమల్లికార్జునస్వామి 3. చంద్రకుండము. 4. సారంగమంటపము. 5. రుద్రాక్ష మంటపము. 6. పంచాక్షరీమంటపము 7. గోగర్భం. 8. ఘంటామఠము. 9. చంద్రపుష్కరిణి-ఏనుగుల చెరువు, 10. పాతాళగంగ. 11. నృసింహబిలము. 12. లింగాలగట్టు. 13. శ్రీశైల జలవిద్యుదుత్పాదక కేంద్రం.

## అలంపూరు

డోర్నాల వచ్చి, ఆత్మకూరు మీదుగా కర్నూలు చేరవచ్చును. కర్నూలు నుండి సుమారు 72 కి.మీ. వుంటుంది. రైల్వేస్టేషను అలంపూరు రోడ్. తుంగభద్రా నదీతీరంలో వున్న ఈ వూరు హైదరాబాదు నుండి 2003. మీటర్లు వుంటుంది.

ఇక్కడ పూర్వపు చాళుక్యుల కాలంనాటి కోట. కోటలో చాళుక్య శిల్పకళా వైభవాన్ని చాటే దేవాలయాలు ఉన్నాయి. వానిలో ముఖ్యంగా చూడదగినవి. తారక బ్రహ్మాలయము, కూలక బ్రహ్మాలయము, అర్క బ్రహ్మాలయము, బాలబ్రహ్మాలయము ఒక మసీదు వున్నాయి. అన్నిటికంటె ముఖ్యం బాలబ్రహ్మాలయం. వసతికి వందన టూరిస్టురెస్టు హౌస్ వుంది.

ప్రాచీన శిల్పకళాధ్యయన పరులు విశేషంగా చూడదగినది. చరిత్రకారులకు ఎన్నో విశేషాలు.

## మంత్రాలయం

కర్నూలు నుండి ఎమ్మిగనూరు ద్వారా తుంగభద్రానదీ తీరంలో సిద్ధ సన్యాసులైన శ్రీరాఘవేంద్రస్వామి సమాధి నొందిన బృందావనం ముఖ్య విశేషం.

(3)

మంత్రాలయ శ్రీరాఘవేంద్రస్వామి సమాధి దేవాలయం మంత్రాలయం రోడ్ రైల్వే స్టేషనుకు సుమారు 15 కి.మీ. దూరం వుంది. ఇక్కడకు రాష్ట్రంలో పలుచోట్ల నుండి టూరిస్టు బస్సులు, R.T.C. బస్సులు నడపబడుతున్నాయి.

భారతీయాత్మ, ఆధ్యాత్మిక విద్య 'ద్వైతవేదాంతము'నకు విశిష్టసేవ చేసిన మహామహులు. ఉపనిషత్తులకు భంగార్థులు, అనేక ఆధ్యాత్మిక గ్రంథాలకు వ్యాఖ్యానములు వ్రాసి జ్ఞానభక్తిని ప్రబోధించిన సద్గురువు శ్రీ మంత్రాలయ రాఘవేంద్రస్వామి వారు. వారు ఇక్కడనే జీవసమాధి పొందారు.

వీరు మహాభక్తుడు, పురాణ పురుషుడు, హిరణ్యకశిపుని కుమారుడు, నరసింహావతార కారకుడైన ప్రహ్లాదుని అవతార విశేషమయి భక్తులకు కల్పవృక్షమై క్రీ. శ. 1671 నుండి 700 సంవత్సరములు ఆశ్రితులను అనుగ్రహిస్తుండ గలనని అభయమిచ్చారు. ఇప్పుడు గూడ అనేకమంది హృదయాల్లో భక్తకల్పవృక్షమై వెలసి కృపాకటాక్ష వీక్షణాలను ప్రసరింప చేస్తున్నారు. ఇక్కడ కులమత వివక్ష లేకుండా నిత్యమూ జనసందోహ భరితమై ప్రార్థనల నిలయమై శోభిల్లుతున్నది. స్వామివారి సమాధిని చూడబోయే ముందుగా గ్రామదేవతయైన మంచాలమ్మను విధిగా దర్శించాలనేది స్వామివారి అభీష్టంగా చెప్పుతుంటారు.

స్వామివారికి భాద్రపద మాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. భక్తులు విశేషంగా వస్తారు.

## పుట్టపర్తి

మంత్రాలయం రోడ్డు స్టేషనునుండి రైలుద్వారా ఆదోని మీదుగా గుంతకల్లు స్టేషనుతో అనంతపురం జిల్లా ప్రవేశించవచ్చు. అనంతపురం జిల్లాలోని ప్రతిఊరూ ప్రతిరాయి దేనిని కదల్చినా రాయలవారి కాలంలోని రతనాల కథలెన్నో చెప్తాయి. అటువంటి అనంతపురం జిల్లాలో పుట్టపర్తి-శ్రీ భగవాన్ సత్యసాయి బాబాగారి ఆశ్రమం చిత్రావతీ నదీతటాన సత్యం, సుందరమై శివంగా నిత్యం భాసించే పుణ్యస్థలిగా సర్వమానవ సమానత్వానికి ప్రతీకగా అంతర్జాతీయతను సంతరించుకున్న శ్రీ సత్యసాయి ఆశ్రమం ప్రశాంతి నిలయానికి ఆలయంగా వున్నది.

బెంగుళూరు నుంచి అయితే 250 కి.మీ. దూరం వుంది. గుంటకల్లు నుండి బెంగుళూరు వెళ్ళేదారిలో ధర్మవరానికి 30 కి.మీ. వుంటుంది.

శ్రీ భగవాన్ సత్యసాయిబాబాకు దేశం మొత్తం మీదనేగాక విదేశాల్లో కూడా అనేక అనుచర, భక్తవర్గంవుంది. భక్తులు ప్రశాంతి నిలయానికివచ్చి బాబాను దర్శించి పునీతులవుతారు. ఆయన దివ్య సందేశాలు బహుళ ప్రచారం పొందాయి. అసలు శ్రీ బాబా శ్రీ శిరిడి సాయిబాబా అవతారమయి అనేక అతీంద్రియ అద్భుత శక్తులు కలిగిన ఒక దివ్య మానవాతీత వ్యక్తి అని ప్రతీతి.

సాధారణంగా మహామహులు కొంతమంది అంటే చాలవరకు – వారి జీవిత కాలంలో వ్యతిరేకతల్నీ, కష్టనష్టాల్నీ ఎదుర్కొని ఇహలోక జీవితం చాలించి తరువాత వారి మహత్యాన్నీ, మహతత్వాలు చరిత్రలు చోటుచేసుకొని ఖ్యాతిని పొందటం పరిపాటి. అయితే శ్రీబాబాగారు వారు ఇహలోకంలో వుండి, భక్తుల పూజలందుకుంటూ ఆశ్రిత కొంగు బంగారమై భాసించటం ఒక ప్రత్యేకత. మాన్యులు, సామాన్యులు. విజ్ఞులు, అజ్ఞులు–బీద, గొప్ప కులమత వివక్షతలేని సర్వమానవతా వాదానికి పరిపుష్టిని చేకూర్చిన ఘనత శ్రీ బాబాగారిదే. అందుకు నిదర్శనం– ఇప్పుడు వారిని అనుసరిస్తున్న వారు యావత్ప్రపంచంలో విశేషమయిన భక్తి గౌరవాన్ని చూరగొంటున్న విషయమే।

ముఖ్యంగా అక్కడ విశేషంగా శ్రీబాబాగారి జన్మదినం ప్రతి నవంబరు 23వ తేదీన విశేష ప్రాభవముగా జరుగుతుంది. దసరా, శివరాత్రి, గురుపౌర్ణమి రోజుల్లో భక్తులు దేశవిదేశాల్లోనుండి తండోపతండాలుగా వస్తారు.

వుండటానికి కాటేజీలు, వసతి సౌకర్యంతో లభ్యమవుతాయి. భోజన భాజనాదులు అక్కడ క్యాంటిన్‌లో చాల తక్కువ ధరలో మంచి భోజనం దొరుకుతుంది. భక్తులు ముందుగా–

ఆఫీసర్ – ఇన్‌చార్జ్, ప్రశాంతి నిలయం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా వారికి వ్రాసి రిజర్వేషను పొందవచ్చును.

గమనిక :

బెంగుళూరు నుంచి వచ్చేటప్పుడయితే మార్గ మధ్యంలో వున్న లేపాక్షి, పెనుకొండలను కూడా చూసి పుట్టపర్తి చేరవచ్చు. అనంతపురం వైపునించి వచ్చేటట్లయితే ధర్మవరం, బుక్కపట్నం మీదుగా పుట్టపర్తిచేరి, పుట్టపర్తి చూచుకొని వెళ్ళవచ్చు లేపాక్షి, పెనుకొండలకు. పుట్టపర్తిలో శ్రీ బాబా వుండేది లేనిదీ వారి కార్యక్రమాలను

గురించి తెలిపే 'సనాతన సారథి' అనే పత్రిక వీలయితే చూచి రావటం ఎంతయినా సముచితం.

## లేపాక్షి

విజయనగర రాజుల కాలంలో నిర్మించబడిన ఈ దేవాలయం. వీరభద్రాలయం. గోడలమీద, పైకప్పుమీద అనేక కుడ్య చిత్రాలు మనోహరంగా వ్రాయబడి ఉన్నాయి. ఇక్కడ ముఖ్య విశేషం లేపాక్షి బసవయ్య నంది విగ్రహం. ఒకే రాతితో చెక్కబడిన ఈ విగ్రహం దేశం మొత్తంమీద పెద్దదిగా గుర్తించబడింది.

వసతికి- టూరిస్టు రెస్టుహౌస్ ఒకటి వుంది.

హిందూపురం నుండి ప్రతిగంటకు బస్సులు వున్నాయి.

## పెనుకొండ

అనంతపురం నుంచి 72 కి.మీ. దూరం. అనంతపురం నుండి బెంగుళూరు రోడ్డుమార్గంలో వుంది. విజయనగర రాజులు చంద్రగిరికి మారక ముందు ఇదియొక బలమైన కోట.

ఇప్పటికీ కోటగోడ, ద్వారం చూడగలం. ఇక్కడ అన్ని మతాలకు సంబంధించిన దేవాలయా లున్నాయి. శ్రీ కృష్ణదేవరాయలు వేసవికాలంలో విడిది చేసిన స్థలం, దర్బారు స్థలం వగయిరాలు కొండమీద ఇంకా వున్నాయి. మహమ్మదీయుల దాడులలో అనేక దేవాలయాలు ధ్వంసం చేయబడి, కొన్నిటిని దర్గాలుగా మార్చిన విశేషాలు గూడ చూడగలం. ఇక్కడ పచ్చరాయితో కట్టబడిన షేర్‌ఖాన్ మసీదు చూడదగింది. కుడ్యచిత్రాలు, శిల్పచాతుర్యం కమనీయం.

పూర్వపు వైభవాల శిధిలాలు కోకొల్లలు. కొన్నిటిని యధాతథాలుగా వుంచి చరిత్ర కానవాలుగా పురాతత్వ శాఖవారు వారి ఆధ్వర్యంలో వుంచి కాపాడుతున్నారు. ప్రతీచోటా తెలుగువారి విశిష్టతను తెలుపుతూ, మహమ్మదీయుల దాడుల గుర్తులు స్పష్టంగా చూడనగును.

# హార్సిలీ హిల్స్

పెనుగొండ నుండి బుక్కపట్నం – పాముదుర్తి మీదుగా ముదిగుబ్బచేరి అక్కడి నుండి హార్సిలీహిల్స్ చేరవచ్చు. మొత్తం సుమారు 140 కి.మీ. వుంటుంది. కమనీయమైన దృశ్యములతో హార్సిలీహిల్స్ సముద్రమట్టానికి సుమారు 1265 మీ. ఎత్తులోవుండి నేత్రపర్వంగా వుంటుంది. పర్యాటక కేంద్రము కూడా. కొన్ని తమిళ, కన్నడ భాషా చిత్రాలు షూటింగులు కూడా ఇక్కడ సుందర దృశ్యాల్లో కమనీయంగా చిత్రీకరించటం కద్దు.

# మదనపల్లి

ఇక్కడికి 27 కి.మీ. దూరంలోవున్న మదనపల్లి ఒక మంచి ఆరోగ్య కేంద్రం. టి.బి. శానిటోరియం వుంది. దీన్నే ఆరోగ్యపురం అని అంటారు. ఇక్కడికి దగ్గరలోనే అంటే 16 కి.మీ. దూరంలో ఋషివాలీ స్కూలు వగయిరా ఉన్నాయి. మదనపల్లి వచ్చామంటే చిత్తూరు జిల్లాలో ప్రవేశించినట్లే. ఈ జిల్లాలో దర్శించదగినవి ముఖ్యంగా– చంద్రగిరి, తిరుమల తిరుపతి, శ్రీకాళహస్తి మరియు అతి దగ్గరలోనే వున్న తిరుత్తని, శ్రీహరికోట రాకెట్ కేంద్రం, పులికాట్ సరస్సు ముఖ్యమైనవి.

# చంద్రగిరి

చంద్రగిరి చాలా చరిత్ర ప్రాధాన్యం గల ప్రదేశం. తిరుపతికి మదనపల్లి నుండి వెళ్ళేటప్పుడు ముందు చంద్రగిరి తరువాత తిరుపతి. చంద్రగిరి తిరుపతికి 11 కి.మీ. దూరం ఉంటుంది. విజయనగర రాజుల ఆఖరి రాజధానీ నగరం. కోట పెద్ద కొండమీద కట్టబడింది. క్రీ.శ. సుమారు 1000 సం॥ ప్రాంతము కట్టుబడి భవనాలు, దేవాలయాలు, శిథిలాలు కోట లోపల చూడవచ్చు. విజయనగర శైలి శిల్పాకృతులు పూర్వపు వైభవాన్ని చాటుతున్నాయి. రాజ ప్రాసాదాలుగా గుర్తించబడి అనాటి రాజ కుటుంబాలు నివసించిన మహల్‌లు రెండున్నాయి. ఈనాటికి కొన్ని చెక్కు చెదరలేదు.

వసతికి – ట్రావలర్సు బంగళా వుంది.

# తిరుమల - తిరుపతి

ఆంధ్రులకే కాదు భారతదేశంలో సకల జనావళికి ఆరాధ్యదైవమై వెలసిన ఉత్తరాది వారికి - బాలాజీగాను, దక్షిణాది వారికి శ్రీ వేంకటేశ్వరస్వామి గాను కొంగు బంగారమై కోరిన కోర్కెలు తీరుస్తూ వెలసియున్న కలియుగ వైకుంఠవాసు డయిన శ్రీ మహావిష్ణువు అవతారమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తన దేవేరులైన అలి వేలు మంగా, బీబీనాంచారమ్మలతో కొలువు దీరిన మహా సుందర ప్రదేశం.

'గోవిందా' అంటే పోతాయ్ పాపాలు అని విశ్వసించే భక్తుల గోవింద నామా లతో మార్మ్రోగి పోతుంటుంది ప్రదేశం. ఈ స్వామివారికి భక్తులు తను కోర్కెలు తీర్చినందుకు భక్తి పురస్సరంగా తలనీలాలు, భారీగా కానుకలు ఇవ్వడం పరిపాటి. ఆంధ్రదేశంలో ఎవరైనా తలమీది వెంట్రుకలు తీయించుకుని కనపడితే ఎదుటివారు వేసే మొదటి ప్రశ్న- తిరుపతి వెళ్ళొచ్చారా? అని. అంత సుప్రసిద్ధం.

దేశం నలుమూలల నుండి నిరంతరం రోజుకు కనీసం ６ వేలమంది భక్తులు సందర్శిస్తారని ప్రతీతి. భక్తులకు సర్వదర్శనంతో పాటు ５ రూ. నుండి కొన్ని వేల రూపాయల వరకు వివిధ దర్శనాలకు వివిధంగా దబ్బువసూళ్ళు కట్టడి కింద వసూలు చేస్తారు. భారతదేశం మొత్తంమీద ఎక్కువ ఆదాయాన్ని పొందుతున్న దేవాలయం ఇది. ఈ ధనమంతా కొన్ని ప్రజోపయోగ కార్యక్రమములకు, ధార్మిక కార్య క్రమ ములకు, సాంస్కృతిక ప్రయోజనాల కోసం, హిందూ ధర్మప్రచారానికి ఇతోధికంగా మళ్ళించబడుతుంది.

ఇది ఒక అపూర్వమైన అనాది దేవాలయం. చారిత్రక ప్రాధాన్యంతో పాటు, హైందవ ధార్మిక తత్త్వము ప్రాముఖ్యత వహించిన ఈ ఆలయానికి అనేకమంది రాజులు అనేక విధాలుగా అభివృద్ధికి తోడ్పడ్డారు. వారు కట్టించిన గాలి గోపురాలు సమున్నతంగా నిలిచి దర్శన మిస్తుంటాయి. తిరుమల దేవస్థానంలో ప్రతి అంగుళం ఎంతో పవిత్రంగా భావిస్తున్న భక్తులు అనేక విధాలుగా మొక్కులు మొక్కుకుని పెండ్లిండ్లు, అన్నప్రాశనలు, అక్షరాభ్యాసం, నూతన వ్యాపార ప్రారంభాలు, దస్తావేజులు, వగైరాలు నిర్వర్తించుకోటానికి కొండమీదకు వీలున్నంత అనుయాయులతో సహా వచ్చి భక్తి కొద్దీ స్వామివారిని సేవించి కానుకలు చెల్లించి మహా సంతృప్తులై వెళుతుంటారు. ఇది ఒక మహాసంస్థగా వెలసి అనేక అర్థ విద్యా

పరులకు, ఘనాపాటీలకు, ప్రతి రంగంలోను విశిష్టస్థానాన్ని పొందిన కళాకారుల విద్యా ప్రదర్శనాలకు ఆలవాలమై విలసిల్లుతుంది. వారికి అనేక విధాలుగా చేయూత, జీవనోపాధి కలిగి, భగవంతుని ఆరాధనలో మునిగి తేలుతుంటారు. అష్టాది వర్ణముల వారున్నూ హిందూ దేవాలయమైనా అన్ని వర్ణములవారు, కులమత విచక్షణ లేకుండా వచ్చి దర్శించుకుని పోతుంటారు భక్తజనులు.

పిలిస్తే పలికే ఈ దైవానికి ప్రతిరోజు నిత్యకళ్యాణం పచ్చతోరణ వైభవంగా ఉత్సవాదులు అనేకం. భక్తులు స్వామివారికి మొక్కుబడుల రూపంలో చేయించే కళ్యాణోత్సవాలు, ఇతర తిరుమంజన పవిత్రోత్సవాలు మొదలైనవి ఒక వంక జరుగుతుంటే స్వామివారికి ఆలయ నిర్వాహకులు సంవత్సరం పొడుగునా నిర్వర్తించే మహోత్సవాలు మరొక వైపు కన్నుల పండువగా జరగడం గొప్ప విశేషం. అందు వలన అప్పుడు ఇప్పుడు అనక ప్రతిక్షణం స్వామి సందర్శనార్థం వచ్చే భక్త కోటి, సంవత్సరం మొత్తంమీద కొన్ని కోట్లాది మంది భక్తులతోపాటు, సుందర కమనీయ ప్రకృతి దృశ్యాలను కనుల పండువగా దర్శించటానికి వచ్చే పర్యాటకులు సైతం లెక్కకు మిక్కుటం. ఈ అనంత శేషశయనంగా చెప్పబడే ఏడుకొండలు పరమ రమణీయమై గొప్ప ఆకర్షక కేంద్రమై భాసిస్తుంది.

కొండమీది దేవాలయ విమానమునకు, కలశములకు బంగారు తొడుగులు అలంకార ప్రాయమై భక్తితోపాటు స్వామివారి సంపన్నతకు ఆశ్చర్యం కొలుపుతూ వుంటుంది.

ఇది మూలవిరాట్టుని గురించి చెప్పాలంటే అయన మాహాత్మ్యాన్ని గురించి పొగడ్డానికి ఆదిశేషనకైనా అలవిగాదు. స్వామివారి కనులు చాల శక్తివంత మయినవి. ఆ దృష్టి సోకినమేర ప్రపంచం దహించుకుని పోతుందేమో అని, ఆయన కనులు మూసివుంచే విధంగా పట్టెనామాలు దీర్చి దిద్దబడి ఒంటినిండా నిలువెత్తుగా ఆభరణాలు, పూలదండలతో ముంచెత్తి కేవలం పద్మాసులవాని పాదాలు మాత్రం దర్శనీయంగా చేయటం జరుగుతుందని విశిష్టాదార పరమైన నమ్మకం. ఈ విగ్రహం ముందు మనం అనుకొనే సర్వకోరికలు నిరాటంకంగా నెరవేరగలవని గట్టి నమ్మిక. అందుకే దేశం నలుమూలల నుండి భక్తులు వచ్చి తమ జీవిత సాఫల్యాలను పండించుకుంటూ ఉంటారు.

అసలు సూక్ష్మంగా ఈ దేవునికథ ఇది పూర్వం ఋషులంతా ఒక సభ చేసి

కొని త్రిమూర్తులలో ఎవరు పూజనీయులు అని తెలుసుకోవాలనే జిజ్ఞాసతో 'భృగు మహర్షి'ని పెద్దగా నిర్ణయించి త్రిమూర్తులలో ఎవరు పూజనీయులో పరీక్షించే భారం ఆయన మీద మోపారు. అప్పుడు సత్యలోకంలోని బ్రహ్మ, కైలాసగిరిలోని శివుడు పనికిరారని తేల్చుకుని చివరకు వైకుంఠం చేరి సరాసరి విష్ణుమూర్తి వద్దకు వచ్చాడు మహర్షి. అప్పుడు శ్రీ మహావిష్ణువు ఉదరభాగాన కూర్చుని శ్రీమహాలక్ష్మి సపర్యలు చేస్తుండగా భృగుమహర్షి ఆయన ఎదురు రొమ్ము మీద కాలితో తన్నాడట. అందుకు శ్రీ మహావిష్ణువు చిర్నవ్వులేచి లేశమంత కూడా కోపించక ఆ మహర్షి అరికాలును పట్టుకుని కాలికి దెబ్బతగిలిందా యని ఓదార్చుతూ అనునయ వాక్యాలతో పరామర్శించ దొడగాడట. అంత లక్ష్మీదేవి కుపితురాలై తన నివాసస్థలమైన శ్రీ మహావిష్ణువు ఉదరమును అపవిత్రపరిచి, మర్యాదమన్ననలేవి విధంగా కించపరచిన మనిషిని పట్టుకుని ఓదార్పు వచనాలతో అనునయించటం అవమానకరంగా భావించి ఎన్నివిధాలుగా సమాధాన పరచటానికి ప్రయత్నించినా వినకుండా వైకుంఠమును, వదలిపెట్టి ఎక్కడనో ముక్కు మూసుకుని తపస్సు చేసికొనటానికి వెళ్ళి రూపాంతరం చెంది కానరాకుండా వెళ్ళిపోయింది. ఒకరకంగా భృగుమహర్షికి గర్వకారణమైన అరికాలులో గల అదృశ్యనేత్రాన్ని ఛిద్రంజేసి గర్వాపహరణం జరిగిన సంగతి సరేసరి. అంత విష్ణువే ముల్లోకాల్లో పూజనీయుడని మునిలోకంలో చాటాడు భృగుమహర్షి.

అయితే శ్రీమహాలక్ష్మి లేని వైకుంఠపురము శ్రీ మహావిష్ణువునకు అరణ్యప్రాయమై దుఃఖితుడై లక్ష్మీదేవిని వెతుకుతూ పిచ్చివాడై తిరగటం మొదలెట్టాడు.

ఆ రకంగా వైకుంఠము కొన్నాళ్ళు శూన్యంగా వుంది. దేవతలందరూ భీతి చెందారు. తదుపరి కొన్నాళ్ళకు ఆకాశరాజు కుమార్తె పద్మావతిదేవిగాను, అరణ్యంలో ద్రిమ్మరుచున్న శ్రీ మహావిష్ణువు శ్రీనివాసుడుగాను జననమంది వారి వివాహము లోకోత్తరంగా జరిగి కలియుగమున మానవాళికి కొంగుబంగారమై కోరిన కోర్కెలు తీర్చే శ్రీ పద్మావతి, వేంకటేశ్వరులై తిరుమలవాసులైనారని పురాణ కథ. కనుక శ్రీవారి నివాసమునకు ఆదిశేషువు అనంతశయనంగా ఏడుకొండలుగా వెలసి స్వామి వారిని నిరంతరం వైకుంఠములో మాదిరిగా శయనీయమై వెలసినాడని ప్రతీతి. ఈ ప్రదేశం మొత్తం పర్వతప్రాంతమయమై ఏడుకొండల వేల్పు నివాసమై, దేవతలకు సైతం నిత్యారాధనా కేంద్రమై చూచువారలకు శ్రీ మహావిష్ణువుని వైకుంఠమును భూలోకంలోనే దర్శనీయ ప్రాంతంగా విలసిల్లిన ఈ ప్రదేశం దినదినాభివృద్ధి చెందుతూ ఎంతమంది వచ్చినా తరగకుండా పెరుగుతున్న సౌకర్యాలతో సంపత్సమృ

రమై యాత్రికుల, భక్తకోటికి స్వర్గమై విరాజిల్లుతోంది. ఈ స్థల పురాణాలు గాని స్థల మహాత్మ్యమును గురించి గాని, దేవదేవుని మహాత్మ్యాన్ని గురించి గాని వ్రాయాలంటే ఎన్ని గ్రంధాలైనా చాలవు. స్వామివారిని గురించి తాళ్ళపాక అన్నమాచార్యులు భక్తి శృంగార గీతాలతో అర్చించి పునీతులైనారు. వారి రచనా విశేషముల గురించి ఒక పెద్ద అధ్యయన పీఠమేర్పరచినారు. ఇట్లు సాహితీ రంగంలో కూడా విశిష్టమైన స్థానాన్ని పొందిన ఈ దేవదేవుని మహిమను కొలవ మనతరమా.

తిరుమలలో ప్రతిరోజూ పర్వదినమై అనేక ఉత్సవములు జరుగుతున్నా విశేష పరవడి ఉత్సవములుగా చైత్రమాసంలోను, భాద్రపదమాసంలోను స్వామివారికి విశేషంగా జరిగే బ్రహ్మోత్సవాలు ముఖ్యం. వైభవోపేతంగా జరుగుతాయి.

తిరుమలలోనే ఒకవైపున పాపనాశనం జలపాతం, మరోవైపు గోగర్భం నీటియూట మొదలయినవి మరియు ఆంజనేయస్వామి తల్లియైన అంజనాదేవి పుత్రార్థియై తపమాచరించిన చోటు- తిరుమలలో శ్రీవేంకటేశుని దర్శించబోయే ముందు ముఖ్యంగా చూడవలసిన వరాహ నరసింహస్వామి దేవాలయము, పవిత్ర పుష్కరిణీ స్నానంచేసి స్వామి దర్శనానికి భక్తులు తేలికగా స్వామిదర్శనానికి వరుసగా వెళ్ళటానికి ఏర్పరిచిన క్యూలలో ప్రవేశించి దర్శనోత్సాహులై ఎన్ని గంటలయినా నిరీక్షించి క్యూల్లో కదలి వెళ్ళి స్వామిని దర్శించి పునీతులవుతారు.

తిరుమలపై నూతనంగా అభివృద్ధి పరచబడిన ఎన్నో ఉద్యానవనాలున్నాయి. తిరుమలకొండపై ఎక్కడ వున్నా భగవన్నామ స్మరణ నిత్యం జరుగుతూ మన చెవులకు శ్రావ్యంగా వినపడటానికి స్పీకర్లు అన్నిచోట్లా అమర్చారు. అక్కడ వున్నంతసేపు తనువూ, మనసూ మైమరచి భక్తిభావంతో పులకించిపోతారు భక్తులు ఆ దివ్యానుభూతిని కలకాలం మనసులో దాచుకుని మరచిపోలేరు కూడా.

ఆధ్యాత్మిక తత్వానికి తోడుగా ప్రకృతి రమణీయమై, నేత్రపర్వంగా మనోహర దృశ్యాలు దృగ్గోచర మవుతాయి.

తిరుమల నుండి క్రిందికిదిగితే తిరుపతి పట్టణం చూడముచ్చటగా సాక్షాత్కారమవుతుంది.

ఒక వంక విజ్ఞానభాండారమైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ భవనాలు, పద్మావతీ కళాశాలం- అనేక శాఖోపశాఖలుగా విలసిల్లిన కళాశాల భవనాలు ఒకవంక,

మరోప్రక్క కపిలతీర్థమనే ఎత్తునుండి నీరు ధారగా పడే జలపాతం రమణీయంగా కనబడతాయి.

తిరుపతి నుండి పట్టణాన్ని అనుకునే తిరుచానూరు, అలివేలు మంగాపురం. పద్మావతి అమ్మవారి దేవాలయం, కళ్యాణ మండపం, శ్రీ వరదరాజస్వామి వారి ఆలయం, గోవిందరాజులస్వామివారి ఆలయం మొదలయిన దేవాలయాలు ఎంతో చూడదగినవి.

ఆహార విహారాలు :

దిగువ తిరుపతిలో అడుగడుగునా హోటళ్ళు, లాడ్జిలు కోకొల్లలు. వానిలో తాహతునుబట్టి ఎక్కడైనా మకాం చేయవచ్చు. టెలిఫోన్ నం 2794 కి రింగుచేస్తే రూము 1కి 20-25 రూపాయల్లో టూరిస్టు రెస్టు హౌసులో దొరుకుతుంది. కలవారు విడిది చేయటానికి భీమాస్ డీలక్స్ హోటల్ (టెలిఫోన్ నం: 2501-4 లైన్లు) లో మంచి డబుల్ రూము 1కి రోజుకి 90/-లో లభ్యమవుతాయి. చక్కగా చలువ రాళ్ళు పరచిన రూములు వెల్‌ఫర్నిష్డ్ రూములు మంచి వసతిగా దొరుకుతాయి. సాదాసీదా మనుషులకు ఉచిత వసతి సౌకర్యంగా టి. టి. డి. వారి సత్రములు కూడ రైల్వే స్టేషనుకు దగ్గరలో వున్నాయి. వున్నవారికి వున్నట్లుగా, లేనివారికి సౌకర్యలోపాలు లేకుండా తగిన వసతులు అన్ని విధాలుగా ఏర్పరుచబడినాయి.

తిరుమలలో :-

ప్రభుత్వంవారు ఏర్పరుస్తున్న అనేక వసతి భవన సౌకర్యాలు, వదాన్యుల విరాళాల్తో కట్టించే భవన సముదాయము, కాటేజీలు, వచ్చివెళ్ళే ప్రజానీకం వుండటానికి అనేక సత్రాలు, ఉచిత సౌకర్యాన్ని కలిగించే వాటికి తోడుగా అన్ని సౌకర్యాలతో అనేక ఏర్పాటులు విస్తృతంగా ప్రభుత్వంవారి చేయూతతో దేవస్థానంవారి ఆధ్వర్యంలో ఏర్పాట్లు ఇంతవరకూ జరిగినవే కాక ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చోటుచేసుకుంటున్నాయి. వచ్చేపోయే యాత్రికుల సౌకర్యార్థం ఇంకా ఎంతో చేయవలసింది ఎప్పుడూ మిగిలిపోయే వుంటుంది.

షాపింగుకి ముఖ్యంగా విగ్రహాలు, సవరాలు, అలంకరణ సామాగ్రి, వివిధ రకాలైన పూజా సామాగ్రులు, ఇత్తడి, కంచు పాత్రలు, నగిషీలు చెక్కిన కర్రసామానులు వగయిరాలు. వీటికితోడు దేవస్థానంవారు ప్రసాదాలు విక్రయించే విక్రయ శాలలు-

పులిహోర, పొంగల్, దద్ధ్యోజనం, లడ్డు- పగయిరాలు ఆలయం చుట్టూ ఉన్నాయి. లడ్డు ప్రసాదపు రుచి జగత్ప్రసిద్ధం. తిరుపతి లడ్డు సార్థకనామం.

ఇండియాలో 'వాటికన్' సిటీగా తిరుమలను వెలయించాలని బృహత్తర పథకాలు ఎన్నో ఆలోచనల్లో చోటు చేసుకుంటున్నాయి.

దేశం నలుమూలలనించి వచ్చే యాత్రికుల సౌకర్యార్థం ఇటు తమిళనాడు నుంచి ప్రభుత్వంవారి టూరిజం డెవలెప్‌మెంటువారు, అటు కర్నాటక నుంచి కర్నాటక ప్రభుత్వము. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున టూరిజం డెవలప్‌మెంటు వారు, మద్రాసు, బెంగుళూరు, ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ముఖ్య కేంద్రాలనుండి బస్సు సౌకర్యాలు, స్పెషల్ టూర్‌ల ఏర్పాట్లు అనేకం వున్నాయి. మద్రాసు నుండి విమాన సౌకర్యం కూడా వుంది. రోజులో సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు తిరుపతి-తిరుమలకు దేవస్థానం వారు పైకి క్రిందకు అనేకబస్సులు నిర్వహిస్తున్నారు. అతి త్వరలో రెండు కొండల మధ్యగా 'రోప్‌వే' వేయటానికి పథకాలు గూడా రచనలు చేస్తున్నారు.

## శ్రీ కాళహస్తి

తిరుపతికి తూర్పున సువర్ణముఖి నది ఒడ్డునగల కొండల మధ్య అమరివున్నది శ్రీ కాళహస్తీశ్వర దేవాలయం.

శ్రీ అనగా సాలెపురుగు, కాళము అనగా పాము, హస్తి అనగా ఏనుగు. ఈ ప్రాంతంలో స్వయం భూలింగముగా వెలసిన శివలింగం పై మూడున్నూ అర్చించి భక్తినిరూపణలో పోటాపోటీగా సంచరించి చివరికి మోక్షమును పొందాయని ఒకకథ. కనుకనే ఈ స్వామి శ్రీ కాళహస్తీశ్వరుడనేది సార్థకనామంగా వున్నదని ప్రతీతి. నురో విశేషం ఏమిటంటే భక్తకన్నప్ప చరిత్ర కూడా ఇచ్చోటనే జరిగి భక్తిలోని గొప్పదనాన్ని చాటిన దివ్య ప్రదేశంగా పేరొందింది. ఈ స్వామి మాహాత్మ్యాన్ని ఉగ్గడిస్తూ శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒకరైన మధురకవి ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకంగా రూపొందించి ధన్యతను పొందాడు, చిరస్మరణీయుడైనాడు.

పెద్దపెద్ద ప్రాకారాలు గలిగిన ఆలయం రమణీయమైన శిల్పచమత్కృతులతో విలసిల్లుతున్న ఈ ఆలయం పురాతన వైభవానికి ప్రతీకగా నిలిచిందనటంలో సందే

హం లేదు. ఇక్కడగల కొండలమీద కూడా కొన్ని ఆలయాలున్నాయి. మహా శివరాత్రికి స్వామివారికి ఉత్సవ విశేషాదులు బహాధా జరుగుతుంటాయి. చుట్టు ప్రక్కలనున్న గ్రామాలనుంచి ప్రజలు తండోపతండాలుగా వచ్చి స్వామిని దర్శించి పోతుంటారు. ఇక్కడే శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి పవిత్రాశ్రమం నెలకొని వుంది. ఆయన ఒక సిద్ధయోగి. స్వామివారి బోధనలు అమృత తుల్యములు. చాల ప్రసిద్ధము.

## కైలాసనాధ కోన జలపాతం

ప్రకృతి రమణీయతను తిలకించగోరేవారు తిరుపతి నుండి ఉత్తుకోట ద్వారా మద్రాసుకు వెళ్ళే త్రోవలోగల నాగలాపురం అవతల నారాయణవనం దగ్గర బస్సు దిగి రెండు కిలోమీటర్ల దూరంలో గల జలపాతాన్ని దర్శించవచ్చు. ఎక్కడో పుట్టి కొండకోనల్లోగల అడవుల వనమూలికల సారాన్ని మోసుకునివచ్చే ఈ స్వచ్ఛమైన జలంలో కొన్ని వ్యాధులను సైతం నిర్మూలించే గుణాలు గలిగిన మినరల్సు వున్నాయని ప్రతీతి. జలపాతపు ఉధృతిని చూడాలను కుంటే ఋతుపవనాలు బలంగా వున్నప్పుడు అంటే అక్టోబరు నుండి జనవరి మాసాల్లో దర్శించవచ్చును. వారాంతాల్లో అయితే మద్రాసు నుంచి తండలు తండలుగా జనం వస్తుంటారు. కనుక ఇతరరోజుల్లో అయితే మంచిది. వుండటానికి చిన్న చిన్న కాటేజీలుగూడా లభ్యమవుతాయి.

## నా గ లా పు ర ం

కోనజలపాతంకు వెళ్ళే త్రోవలోనేవున్న నాగలాపురంలో శ్రీకృష్ణదేవరాయలు తమ మాతృమూర్తియైన నాగలాదేవి పేరున కట్టించిన దేవాలయం శిధిలావస్థలోవున్నా చూడదగినది. విజయనగర రాజుల వైభవానికి ప్రతీకగా ఇప్పటికీ తలయెత్తుకొని నిలిచియున్నది. పురాతత్వ అధ్యయనపరులకు అవశ్యం దర్శనీయం– చారిత్రక విశేషాలు త్రవ్వుకొనటానికి, పదిలపరచుకోటానికి.

## పులికాట్ సరస్సు

శ్రీకాళహస్తి నుండి 27 కి.మీటర్లలో ఉన్న నాయుడుపేటచేరి దక్షిణంగా గల సూళ్ళూరుపేటను కలుపుతూ ఆగ్నేయ మూలగా పరచుకొని వున్న మంచినీటి

సరస్సు పులికాట్ సరస్సు. మంచి పిక్నిక్‌స్పాట్. చాల పెద్దచెరువు. తెలుగుగంగ పథకంలో మంచినీటి సరఫరా మద్రాసుకు ఒప్పందం కాకముందు పులికాట్ సరస్సు నుండి మద్రాసుకు మంచినీటిని చౌకగా రప్పించుకోవచ్చని కొంతమంది రాజకీయ వాదులు వాదించారు. దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. ఎంత పెద్ద మంచినీటి సరస్సో.

ప్రక్కనేవున్న శ్రీహరికోటలోగల 'షార్' రాకెట్ కేంద్రాన్ని ముందుగా అనుమతి పొంది చూడుకుని (ఇది సముద్రంలో ఒకదీవిలా వున్నదాన్ని ఈ కేంద్ర మునకు వినియోగించారు) సూళ్ళూరు పేటలోగాని, నాయుడు పేటలోగాని రైలెక్కి విజయవాడవైపు ప్రయాణంచేస్తూ-

## నెల్లూరు

పెన్నానదీ సముత్పన్న కైరవదళశ్రేణిలో తెన్గువాసించునాడు- అని ఆంధ్ర పౌరుషంలో కవిసామ్రాట్ ఉగ్గడించి నెల్లూరు సీమకు ముఖ్యమయిన పురాతనంగా సింహపురి నామధేయంగల నెల్లూరులో దిగితే పెన్నానది మీద నెల్లూరు దగ్గర కట్టె బ్రిడ్జి. పెన్నానదీ స్నానం, శ్రీరంగనాథాలయంలో వున్న శ్రీరంగనాయకస్వామిని దర్శించి పట్టణం అభివృద్ధిని కొంత తిలకించి అతిచేరువులోనే వున్న-

## మైపాడు

బీచి. ప్రకృతి సిద్ధంగా ఉన్న అందమైన సముద్రతీర సౌందర్యాన్ని గ్రోల వచ్చు. ఇక్కడకూడా ఒకమంచి పిక్నిక్‌స్పాట్‌గా చెప్పుకోవచ్చు. ఇక్కడ విశ్రాంతికి సాగర్‌విల్లా టూరిస్టు రెస్టు హౌస్ వుంది.

మళ్ళీ నెల్లూరువచ్చి రైలెక్కితే ఒంగోలు-వేటపాలెం తరువాత వచ్చే చీరాలకు దగ్గరలో సుమారు 5 కి.మీ. దూరంలో-

## వాడరేవు

బీచ్ వున్నది. ఇక్కడ కొన్ని ప్రత్యేక సందర్భాలలో అనగా మహాలయ అమావాస్య సందర్భంగాను మరికొన్ని పండుగల సందర్భంలోను సముద్రస్నానాలు చేయడానికి చుట్టుప్రక్కల 30, 40 కి.మీ. దూరంనుండి కూడా ప్రజలు తండోప

తండాలుగా వస్తూంటారు. చీరాల నుండి సిటీబస్సులు విరివిగా తిరుగుతుంటాయి కూడా. ఇది కూడా మంచి పిక్నిక్ స్పాట్- అందంగా అమరిన సముద్రతీరం. వుండటానికి విశ్రాంతి సిప్ అండ్ డిప్ బీచ్ రిసార్ట్ వుంది.

వాడరేవు నుండి చీరాలవచ్చి, తెనాలితో బండిమారి బస్సులోగాని, రైలులో గాని గుంటూరు చేరితే. గుంటూరు కేంద్రంగా పెట్టుకుని కొన్ని క్షేత్రాలు చూడ నగును.

## గుంటూరు

గుంటూరు జిల్లాకు ముఖ్య పట్టణం. దాదాపు 2 లక్షల పైచిలుకుగా జనాభా గలిగి ఆంధ్రులకు గర్వ కారణమైన అనేక విద్యాలయాలతో శోభిల్లుతూ పురాతనంగా స్థాపించబడిన కళాశాలలకు తోడుగా మరెన్నో నూతన కళాశాలలతో ఒప్పి గొప్ప విద్యాకేంద్రంగా విలుసిల్లుతున్న ఈ పట్టణం ప్రముఖ పారిశ్రామికకేంద్రంగా కూడా గణుతి కెక్కింది. మహానగర ప్రతిపత్తికి అతి చేరువలో వున్న పట్టణం.

ఇక్కడ వ్యవసాయక సంబంధమైన వాణిజ్య పంటలకు తత్సంబంధమయిన పరిశ్రమలకు కాణి. చెప్పకోదగినవి ప్రత్తి, పుగాకు కేంద్రాలయమై విదేశ ఎగుమతు లకు గూడా విశేష ప్రాధాన్యం గలిగిన వ్యాపార క్షేంద్రంగా సుప్రసిద్ధం. రాజకీయంగా గూడా గొప్ప ప్రాధాన్యంగల పట్టణంగా ప్రాచుర్యాన్ని పొందింది. ఆంధ్ర మహాభారతమును తెనుగున కసువదించిన కవిత్రయములలో నొకరైన ఉభయకవి మిత్రుడు— మనుమసిద్ధి మహారాజాస్థాన కవియైన తిక్కన సోమయాజి గుంటూరు వాస్తవ్యుడని ప్రతీతి.

ఇక్కడ అగ్రహారంలోని ప్రసిద్ధిగాంచిన శ్రీరామనామక్షేత్రం కృష్ణ తటాక తీరమునకు (నల్లచెర్వు) ఉత్తరభాగంలో నెంకొల్పబడింది. క్షేత్ర మధ్యంలో శ్రీకోదండరామ ప్రభుమందిరం దానికెదురుగా శ్రీ ఆంజనేయమందిరం నడుమగా రెండు మందిరాలను కలుపుతూ అడిటోరియం-రామాయణ చిత్ర శిల్పములు కడు రమణీయంగా వెలయింప అద్భుతంగా వుంటుంది. ఉత్తరంవైపున శ్రీరామకోటి మందిరము కూడా ఉన్నది. క్షేత్రసారమనే పేరుతో ఆసేతు హిమాచలము వరకుగల పవిత్ర క్షేత్రములందలి మృత్తికలను తెచ్చి భద్రపరచబడినవి. క్షేత్రానికి దక్షిణంగా

"శ్రీరామతీర్థ"మనే కోనేరు, ఒక బావి. (శివకూపమని పేరు) వానికి దగ్గరలో భక్తులు జపతప ధ్యానాదులకు అనువుగా కొన్ని కుటీరాలు వున్నాయి. మందిరం వెనుక స్టోరు గదులు, గెస్టు హౌస్‌లుకూడా వున్నాయి. దర్శించదగిన మహాపుణ్యక్షేత్రం. ప్రతి మార్గశిరమాసంలోను పునర్వసు వచ్చే రోజు మొదలు అయిదురోజులు. (అనగా డిశంబరు మాసంలో) శ్రీరామకోటి మహోత్సవం జరుగుతుంది. ఉత్సవంలో సీతారామకళ్యాణోత్సవం, తెప్పోత్సవం. రామకోటి గ్రంథముల పూజ విరామం లేకుండా అనేక సాంస్కృతిక కార్యక్రమాలు మహా సంరంభంగా జరుగుతుంటాయి.

ఇందుకుతోడు అనాది ప్రసిద్ధమైన నృసింహాలయము, శివాలయము, శ్రీసత్యనారాయణస్వామి వారి ఆలయం, కొత్తపేటలోని ఆంజనేయస్వామి వారి ఆలయం, శ్రీకన్యకాపరమేశ్వరి అమ్మవారి దేవాలయం. శ్రీకుసుమహరనాథాలయం, గౌడియా మఠశాఖ మొదలయినవి దర్శించదగిన ఆలయాలు.

వసతికి :

హోటళ్ళు, సత్రములు, రహదారి బంగాళాలున్నాయి. వీటన్నింటిలో తలమానికంగా హోటల్ సుదర్శన్ మంచి వసతి సౌకర్యాలున్న హోటలు- ఎయిర్ కండిషను.

దగ్గరలో కొన్ని ప్రదేశాలు చూడటానికి. రిక్షాలు, టాక్సీలు, ఆటోలు సహజమయిన సౌకర్యాలు.

## అ మ రా వ తి

గుంటూరునుండి. 27 కి.మీ. వున్న అమరావతికి ప్రతి అరగంటకు బస్సులు తిరుగుతూవుంటాయి. ఇక్కడ ఒకనాడు బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించి, మహోన్నతమైన చరిత్ర సృష్టించారు. విశ్వవిఖ్యాతిని వెలయించారు. ఆనాటి వైభవాల చిహ్నాలు చరిత్రలో ఈ నాటికీ సాక్ష్యం పలుకుతున్నాయి. పంచా రామాలయిన అమరారామము, కొమరారామము, భీమారామము, ద్రాక్షారామము, క్షీరారామములలో మొదటిది. పావన కృష్ణానదీ తీరమున నెలకొనియున్న ఈ క్షేత్రము క్రీస్తుపూర్వ కాలమునుండి సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రముగా పేరుగాంచి యున్నది. ఇక్కడి ప్రాచీన బౌద్ధ స్థూపములు, శిల్పములు లెక్కకు మిక్కుటంగా వుండి పూర్వపు ఔన్న

త్యమును చాటుతూ శిల్పకళా విశేషములను ప్రస్ఫుటిస్తుంది. ఇది శాతవాహనుల కాలంనాటి వరకూ ఒక గొప్ప రాజధానీ నగరంగా అభివృద్ధి చెందిన చిహ్నాలు కన బడుతున్నాయి. ఇక్కడి అమూల్య బౌద్ధ శిల్పాలు చాల వరకు కొన్నిటిని లండన్ తీసికొని వెళ్లిపోయారు, మిరికొన్ని కలకత్తా, మద్రాసు నగరాల్లోని మ్యూజియంలకు చేర్చారు. నాగార్జునకొండ వద్ద గల బౌద్ధ శిల్పాలకంటే గూడ ఇక్కడి శిల్పాలు ఎంతో నాజూకుగ నున్నాయి.

ఈ నగరం ఆంధ్రరాజులు పరిపాలించిన క్రీ.శ. 6వ శతాబ్ది కాలంలో సుమారు. 12 మైళ్ళ విస్తీర్ణముగల మహానగరం. శాతవాహనులు వైదికులైనా బౌద్ధ మతమును నిరసించలేదు. అందువలన బౌద్ధులు ఇక్కడ చేరారు. ఇక్కడ నిర్మించ బడిన బౌద్ధ మహాచైత్యంశాల స్తూపం ప్రఖ్యాతిగాంచిన సాంచీ స్తూపం కంటే ఎంతో గొప్పది. పెద్దది. శాతవాహనుల పతనంతో మహానగర ప్రాభవం క్షీణించింది. కొండవీటి రెడ్డిరాజుల కాలంలో పునరుద్ధరింపబడింది. బౌద్ధం క్షీణించగానే హిందు వులు బౌద్ధస్తూప స్థానంలోనే అమరేశ్వరాలయం ఏర్పరచారు. ఆలయకుడ్యాల మీద, చుట్టు ప్రక్కల గూడ బౌద్ధ విగ్రహములుండుట చూడవచ్చు. ఈనాడు అమరావతి నగర ప్రాభవాన్ని కోల్పోయి. కేవలం ఒక గ్రామంగా మాత్రం మిగిలింది.

ఇక్కడ ముఖ్యంగా చూడదగినది అమరేశ్వరాలయము. వెలసిన దేవుడు అమరేశ్వరస్వామి. దేవేరి రాజ్యలక్ష్మి అమ్మవారు. పంచ ప్రాకారాల మధ్య ఆల యం ఎత్తుగ నిర్మించబడింది.

ఇక్కడ లింగము సుమారు. 15 అడుగుల ఎత్తున వుంటుంది. 8 అడుగుల కైవారంతో తెల్లగా వుంటుంది. ఈ లింగమును గూర్చి ఒక వింత ప్రచారంలో ఉంది. ఈ శివలింగము దినదినము పెరుగుతూందనిన్నీ, ఆలయం ఎంత పెంచినప్ప టికీ చాలక పోవటంతో ఆలయనిర్మాతలు లింగము పెరగకుండా నివారించాలనే ఉద్దే శ్యంతో లింగం నెత్తిపై ఒక మేకుని కొట్టారని- అంతటితో పెరుగుదల ఆగి పోయిందని, సమాచారం. దీన్ని బుజువు పరుస్తున్నట్లుగా- లింగం చాలా ఎత్తుగా ఉండి నెత్తిపైని మేకు- మేకు కొట్టినపుడు స్రవించిన రుధిర ధారల చారలు- గుర్తు లున్నాయి. స్వామికి అభిషేకము చేయాలన్నా పైకెక్కి- వెళ్లి చేయాల్సివుంది.

ఈ అమరావతికి ఒక పురాణకథ కూడా వుంది. దేవేంద్రుడు అహల్యా జారుడై తత్పాప పరిహారార్థం ఇక్కడ శివలింగమును ప్రతిష్ఠించాడని దేవతల ప్రగు

వైన సురేంద్రుని చేత ప్రతిష్టించబడినది గాబట్టి 'అమరావతి' నామము సార్థకంగా ప్రసిద్ధమయింది అని అంటారు

ఇక్కడ దగ్గరలోనే దీపాల దిన్నె అనే ప్రదేశం వుంది. బౌద్ధ విగ్రహాలు, స్థూపాలు గలిగిన దీ చోటు. ఇది ఆర్కిలాజికల్ డిపార్టుమెంటు వారు ఆనాటి ఔన్నత్యపు చిహ్నాలను తమ అధీనంలో వుంచుకుని ప్రాచీన కళా సంపదను కాపాడుతూ ఉన్నారు. చరిత్ర అధ్యయన పరులకు ఇవి యెంతో ఉపయోగకరంగా కూడా ఉంటాయి.

ఇక్కడికి 2 కి. మీటర్ల దూరంలో ప్రాచీన ధరణికోట– లేక ధాన్యకటకం– ఉంది.

క్రీ.శ. 90 సం. కాలంలో ఆంధ్ర ప్రభువు 'గౌతమీపుత్ర శాతకర్ణి' ఈ ధరణికోటను రాజధానిగా చేసికొని రాజ్యపాలన చేశాడని ప్రతీతి. ఇక్కడ ఒక బౌద్ధ విశ్వవిద్యాలయము వెలసి ఆనాడు విశ్వవిఖ్యాతి గాంచినది. పూర్వపు ఆంధ్రుల ఔన్నత్యాన్ని ప్రశంసిస్తూ ఒక ఆధునిక కవి శ్రేష్టులు 'అమరావతీ నగరాన బౌద్ధులు, విశ్వవిద్యాలయములు స్థాపించునాడు—' అని, ఆనాటి ఔన్నత్యం క్షీణించి ఈనాటి తెలుగువారు చలిచీమల పుట్టయినారు– అని వాపోతూ 'దిద్దుకోవమ్మ బిడ్డల తెలుగు తల్లీ' అని ప్రబోధిస్తూ వాపోయారు. అమరావతిలో మతవ్యాప్తి, ధాన్య కటకంలో విద్యావ్యాప్తి చేసినది చరిత్ర చాటిచెప్పిన సత్యం. ఏదీ మరి ఆనాటి ప్రాభవం ?!– ఎక్కడ ఆ తెలుగు వెలుగుల దీధితులు! కనీసం చూచి అయినా తరించవచ్చునే !

## వై కుం ఠ పు ర ము

అమరావతి నుండి సుమారు 6 కి.మీ. దూరంలో కృష్ణానది ఉత్తరవాహినియై ప్రవహిస్తుండగా ఒక కొండ కొమ్మున శ్రీ వెంకటేశ్వర స్వామి వారి దేవాలయం ఉంది. చూడదగినది.

ఇక్కడి నుండి అంటే అమరావతి నుండి నేరుగా కృష్ణానదిలో లాంచీలమీద విజయవాడ చేరవచ్చును. ఇది నౌకా విహార యోగ్యమయినదిగా భావించనగును

అయితే మరల గుంటూరు వచ్చి, గుంటూరునుండి విజయవాడ మార్గంలో గల పెదకాకాని ఒక దర్శనీయమైన స్థలము. గుంటూరుకు సుమారు 10 కి.మీ దూరం. ఉంది. సిటీబస్సులు నిరంతరం తిరుగుతూంటాయి.

## పెదకాకాని

కాకానిలో సాంబశివాలయము మహా మహిమాన్వితమై యున్నది. ఈ స్వామి వారి ప్రతిభ అనేక రకాలు. ప్రతి ఆదివారం భక్తులు తండోపతండాలుగా వచ్చి మొక్కుబడులు చెల్లించుకొంటూ ఉంటారు. ఇక్కడ సత్రాలున్నాయి. అన్ని వస్తువులూ దొరకుతాయి ప్రభలు, బండ్లు గట్టుకొనివచ్చి మొక్కుబడులు చెల్లించుకుంటూ ఉంటారు. వివాహ ఉపనయనాదులు నిర్వహించుకుంటూ స్వామి దయకు పాత్రులవుతారు. వ్యాధిగ్రస్తులు, సంతానహీనులు అక్కడనే వుండి ఆలయంచుట్టూ ప్రదక్షిణలు చేసి వారికోర్కెలను సాఫల్యం చేసికొంటూఉంటారు ఇక్కడకు దగ్గరలోనే నంబూరు స్టేషన్ కెదురుగా రేడియో బ్రాడ్ కాస్టింగ్ స్టేషను, హేమలతా టెక్స్టైల్సు మిల్లు ఉన్నాయి.

## మంగళగిరి

ఇటు విజయవాడ నుండి సిటీబస్సులు, అటు కాకాని నుండి విజయవాడ వచ్చే బస్సులలోను మంగళగిరి రావచ్చు.

మంగళగిరి కొండమీద, కొండక్రింద రెండు నృసింహాలయము లున్నాయి. కొండ క్రింద వున్నది శ్రీలక్ష్మీ నృసింహస్వామి ఆలయము. పెద్ద గాలి గోపురములు నాలుగు వైపులా వుండి విశాలంగా వుంటుంది. కొండమీద శ్రీ పానకాల లక్ష్మీ నృసింహస్వామి ఆలయం ఉన్నది. దీనిని ఉత్తరాదివారు 'పన్నా నరసింగ' అని అంటారుట.

క్షేత్ర మహాత్మ్యాన్ని గురించి బ్రహ్మవైవర్త పురాణంలో వివరించ బడింది. ఈ స్వామివారికి అమృత తుల్యమయిన బెల్లము పానకము నైవేద్యంగా సమర్పిస్తారు. సగము తాను తీసికొని మిగిలిన సగము భక్తులకు ఇస్తారు. ఇదీ ఈనాటి యుగ ధర్మానుసారలగా జరుగుతూంది.

దిగువ నృసింహస్వామి ప్రతిష్ట పాండవాగ్రజుడయిన ధర్మరాజుచే జరుప బడినదని బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పబడింది. మొత్తంమీద ఈ పురాతనాలయాలు రెండు ఆనాటి ప్రసిద్ధమైనవిగా పేర్కొనవచ్చు.

కొండ క్రింది ఆలయం గోపురం పదకొండు అంతస్తులుగా రాష్ట్రములో పెద్దదైన గాలి గోపురాల్లో ఒకటిగా పరిగణించబడుతూంది.

ముక్కోటికి,ఫాల్గుణ శుద్ధపంచమి మొదలు పూర్ణిమవరకు బ్రహ్మోత్సవాలు విశేషంగా జరిగి చుట్టుప్రక్కల అనేకమంది భక్తులను, యాత్రికులను ఆకర్షిస్తూంటాయి.

ఎగువ కొండమీది ఆలయంలో నిరంతరం బెల్లం పానకంతో ఆలయమంతా జింకలు సాగుతున్నా ఈ చోటమాత్రం ఈగలు, చీమలు మచ్చుకైనా కనిపించవు-చిత్రం గదా!

ఆలయ అభివృద్ధి పరంగా 1783 ప్రాంతలో శ్రీరాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు బహద్దురువారు, ఆలయ గోపురములకు శిఖరములు నిర్మించి కలశాలకు బంగారుపూత పూయించి ధన్యులైనారు. 40 సం॥ క్రిందట శ్రీ మల్లాది సుబ్బదాసు గారు మరలా బంగారుపూత పూయించారు.

## ఉండవల్లి

మంగళగిరి నుండి విజయవాడ చేరటానికి కృష్ణానది ఒడ్డునే ఆనుకుని ఉన్న గుహాలయము. కొండలో తొలిచిన నాలుగంతస్తుల ఆలయం. ఐదవ అంతస్తు అసంపూర్తిగ వదలి వేయబడింది. ఇది వైష్ణవాలయము.

శ్రీ రంగంలోని అనంతశయన స్వామిని బోలిన స్వామి దర్శనీయము విగ్రహం చాల పెద్దది. 14, 16 శతాబ్దాలనాటి రెడ్డిరాజుల శాసనాలున్నాయి. రెడ్డిరాజుల ప్రాశస్త్యమును తెలుపుతాయి ఈ శాసనాలు.

ఇక్కడ ఒక చిన్న సత్రం, నీటివసతి ఉన్నాయి. దగ్గరలో ఉండవల్లి సెంటరులో తినుబండారములు దొరుకుతాయి. వచ్చేటప్పుడు ఎడమ ప్రక్కన ఉన్న ఉండవల్లి గుహాలయమయితే కొంచెం ముందుకు రాగానే కుడివైపున కొండ, కొండ ప్రక్కనే సీతానగర మున్నది.

## సీతానగరం

ఇక్కడ కొండప్రక్కనే శివ, కోదండరామ, ఆంజనేయాలయములున్నవి. విశాలమైన సత్రంకూడా వుంది. ఇక్కడ అద్దాలమేడ అనే పవరింపు సేవాగృహము చూడదగినది. ఎదురుగా విశాలంగా పడుచుకుని పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించే

కృష్ణానదీ, ఆవలితీరంలోగల విజయవాడ పట్టణ సౌందర్యం - బహుళరమణీయంగా వుంటుంది. ఇటీవలే కృష్ణానదిమీద రెండు రైల్వు బ్రిడ్జిలు, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి స్మరణ చిహ్నంగా నిర్మించబడిన ప్రకాశం బ్యారేజి కానవస్తుంది. మంగళగిరి నుండి వచ్చే మార్గంలో తాడేపల్లిలో గల సిమెంటు కర్మాగారం, స్టాండర్డ్ కంపెనీవారి మిక్సింగు కర్మాగారం వగైరాలు పారిశ్రామిక ప్రాశస్త్యాన్ని తెలియ పరుస్తున్నాయి. ఇటీవల సీతానగరం వద్దగల కొండమీద త్రిదండి శ్రీ రామానుజ చిన జీయరుస్వామి వారి ఆధ్వర్యంలో వేదపాఠశాల దర్శనీయమైనది. ఆర్ష విద్యల కాణ వాలమై శోభిల్లుతూంది.

## విజయవాడ

సీతానగరం నుండి రోడ్డుమీదకు రాగానే ప్రకాశంబ్యారేజి దక్షిణాగభాగంతో మొదలయి కృష్ణానది ఈవలి యొడ్డునగల విజయవాడ పట్టణ ప్రవేశం చేయవచ్చును.

విజయవాడ విశేష ప్రాధాన్యం సంతరించుకున్న నగరం. ఇటీవలే మహానగర ప్రతిపత్తిని పొంది అనేక రీతుల నూతన సోయగాలను సంతరించుకుంటున్న మహా నగరం.

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదైతే- ఆంధ్ర రాజకీయాలకు రాజకీయ రాజధానిగా నడిబొడ్డయి విరాజిల్లుతున్నది. వాణిజ్యపరంగా విశేష ప్రాధాన్యాన్ని సంతరించుకున్న అనాది నుండి గొప్ప మహాత్మ్యంగల క్షేత్రంగా కూడా ప్రసిద్ధి గాంచినది. దక్షిణాదికి – ఉత్తరాదికి సింహద్వార మనదగిన రైల్వేకూడలి. దినదినమూ విపరీతమైన జనసమ్మర్దంతో కిటకిటలాడుతూ నగరం రోజంతా సందడిగా ఉంటుంది. ఇక్కడికి అనేక పనులమీద ప్రతిరోజూ వచ్చేపోయే జనాలే కనీసం లక్షల సంఖ్యలో వుంటారని అంచనా. నగరం నడిబొడ్డులో పాతనగరాన్ని పశ్చిమోత్తర నగరాన్ని కలుపుతూ పెద్ద మెయిన్ రైల్వేస్టేషనున్నది. ఇక్కడనే సర్ ఆర్థర్ కాటన్ మహా శయుడు 1850 జనవరిలో ప్రారంభించి 1858 అక్టోబరులో ముగించిన కృష్ణానదిపై కట్టిన ఆనకట్ట కాలానికతీతంగా నిలిచి దర్శనమిస్తూంది. ఇక్కడి నుండి మొదలయిన కృష్ణకాలువలు సుమారు 300 మైళ్ళ పొడవునా పారుతూ సస్యశ్యామలం చేస్తు న్నాయి. వాణిజ్య ప్రాముఖ్యమేగాక ఇప్పుడిప్పుడు అనేక పారిశ్రామిక వాడలు కూడా వెలుస్తూ ప్రాధాన్యతను సంతరించుకుంటూంది. ఇటువంటి విజయవాడ పట్టణానికి

పురాణకాలం నుండే విశేష ప్రాధాన్యత వుంది. ఒక మహాచరిత్ర గలిగి దేశ నగర చరిత్ర పుటల్లో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది.

పూర్వం మహాభారత కాలంలో పాండవ మధ్యముడు పాశుపతాస్త్రమును సంపాదించటానికి ఇంద్రకీలాద్రిపై తపమొనరించి నాడట. అందుచేత విజయము సాధించిన అర్జునుడి నామములలో విజయుని పేర సార్థకనామంగా విజయవాడగా రూపొందినదని భావము.

ఇది అనాది నుండి గొప్ప తీర్థయాత్రా స్థలంగా పేరు గాంచింది. ప్రతి పన్నెండు సంవత్సరాలకి జరిగే కృష్ణా పుష్కరోత్సవములను లక్షలాదిమంది యాత్రికులు సందర్శిస్తారు. నదీతీరంలో పిండ ప్రదానాలు చేయువారు, నదీగర్భంలో అస్థి నిమజ్జనం చేసేవారూ, కాశీ, రామేశ్వరాలకు వెళ్ళే యాత్రికులు, చుట్టు ప్రక్కలనించి టూరిస్టు బస్సులమీద అనేకమంది యాత్రికులు నిరంతరం దర్శనార్థమై వస్తుంటారు. ఇక్కడ ముఖ్యంగా చూడదగిన ప్రదేశాలు:—

## కనకదుర్గమ్మ ఆలయం :

ఇంద్రకీలాద్రిపై వెలసిన కనకదుర్గాలయం కొండ మధ్యభాగంలో వున్నది. కొండ క్రిందనే విజయేశ్వరాలయము, ప్రక్కనే శంకరమఠం ముందుగా దుర్గాలయం చేరటానికి మెట్లున్నాయి. ఇప్పుడు నూతనంగా కొండమీదికి సరాసరి రోడ్డుమార్గమును నిర్మించి మినీబస్సు సౌకర్యంకూడా ఏర్పరిచారు. ఈ మినీ బస్సు నగర ప్రధాన కూడలులను స్పృశిస్తూ సత్యనారాయణ పురం రైల్వే క్వార్టర్సు వరకు వున్నది.

అమ్మవారు మహా తేజోమహిమతో అలరారుతుంది. నిత్యమూ యాత్రికులు సందర్శించటానికి వీలుగా ఉదయం ప్రాతఃకాలంలో 5 గం.ల నుండి 12 గం.ల వరకు, మరల సాయంత్రం 2 గం.ల నుండి రాత్రి 9 గం.ల వరకూ పూజలు జరుగుతూ వుంటాయి. శుక్రవారములు విశేషంగా అలంకరణలు, పూజలు, అర్చనలు జరుగు తుంటాయి. విద్యుద్దీపాలంకరణ చూడముచ్చటగా చేయబడుతుంది. దుర్గమ్మ వారి ఆలయము ఆనుకునే మల్లేశ్వరాలయం కూడా వుంది. శ్రీ దుర్గా మల్లేశ్వరాలయాల మధ్య విద్యుత్ జల ప్రసార వైచిత్రితో రాసలీల, గంగావతరణ దృశ్యాలు కడు రమణీయంగా అమర్చబడినాయి. కొండమీది అమ్మవారి దర్శనం చేయగానే సుందరమైన నగరమంతా కృష్ణానదీతీర రమ్యతలతో మేళవించి నగరదర్శనం మహాద్భుతమైన అనుభూతి. అలాగే అక్కడనే త్రోవనే కొన్ని మెట్లు దిగి మరికొన్ని మెట్లు ఎక్కిన

శ్రీ మల్లేశ్వరాలయం చేరవచ్చును. ఇది కూడా ఒక అనాది దేవాలయము. శ్రీ మల్లే శ్వరుని దర్శించి మెట్లుదిగి కొంత దూరం నడిస్తే క్రొత్తగుళ్ళు అని ప్రసిద్ధి గాంచిన కొన్ని దేవాలయాల సముదాయమును ఒకేచోట కాంచనగును.

ఇక్కడ శ్రీ వెంకటేశ్వర, కోదండరామ, శివాలములు ఒకే ఆవరణలో స్ఫురించుటం చూడగా శివకేశవుల అబేధత్వము దర్శనీయ భావన కలుగుతుంది.

ఇక్కడికి దక్షిణంగా సుమారు 100 లేక 120 మీటర్ల దూరంలో శ్రీ కన్యకా పరమేశ్వరి అన్నసత్రం, ధర్మశాల దానికి ప్రక్కనే అనాదిగా నున్న పెద్ద పాత శివాలయము ఉన్నాయి.

అటు స్టేషనుకు పడమరగా దగ్గరలోనే జాతిపిత గాంధీగారి స్మారకచిహ్నంగా గాంధీకొండ, అక్కడొక నక్షత్ర వేధశాల గలవు. ఇకపోతే ఇటీవల ప్రాచుర్యాన్ని పొందిన మరికొన్ని ఆలయాలను గురించి ముఖ్యంగా చెప్పుకోవాలి.

బందరురోడ్డు మీద లబ్బీపేటలోని శ్రీవెంకటేశ్వరస్వామి ఆలయం, కళ్యాణ మంటపములు-సత్యనారాయణపురంలో రైల్వేస్టేషను ఎదురుగా నూతనంగా వెలసి అభి వృద్ధి పథంలో ముందడుగ్గా వున్న శివరామకృష్ణ క్షేత్రము గొప్ప ఆధ్యాత్మిక కేంద్రంగా రూపుదిద్దుకుంటున్నది. ఆపైన అనాదిగా నున్న శరభయ్య గుళ్ళు, ఏలూరు రోడ్డులో ప్రభుత్వకళాశాల అవతలగా అమరియున్న శ్రీ ఆంజనేయస్వామి వారి దేవాలయం, మరి కొంచం ముందుకు వెళ్ళి రింగురోడ్ మీద అమరిన షిర్డీ సాయిబాబా మందిరం, పడమటలో వెలసిన శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమం మొదలయినవి ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు దర్శనీయాలు. వీటికి తోడుగా ఇటీవలి కాలంలోనే నిర్మాణ మయిన ఇబ్రహీంపట్నం దగ్గర నిర్మించబడిన సూపర్‌థర్మల్ విద్యుత్ కేంద్రం, అచటి ఉద్యోగులచే 'A'- కాలనీలో నిర్మింపబడిన శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం చూడ ముచ్చటైనవి. దారిలోని రాయణపాడు వాగన్ వర్కుషాపు, గొల్లపూడిలో వెల సిన శ్రీ అయ్యప్పస్వామి దేవాలయం నగర ప్రాముఖ్యాన్ని ఇనుమడింప చేస్తున్నాయి.

ఇక ఈ పట్టణంకు అనేక అవసరార్థము వచ్చే ప్రజలకు వసతులు అనేకం. దిన దినాభివృద్ధి చెందుతున్నా పట్టణావసరాల కనుగుణంగా పెద్ద పెద్ద స్టారు హోటళ్ళు ఇప్పుడిప్పుడే వెలస్తున్నాయి. వాటిలో ముఖ్యంగా హోటల్ కాంధారి, స్టార్ హోటల్, హోటల్ మమత, మనోరమ, తిలోత్తమ, హోటల్ రాజదర్బారు మొదల

యిన అనేక హోటళ్ళు ఎయిర్ కండిషన్డ్, నాన్ఎయిర్ కండిషన్డ్ గదులు రు. 30 నుంచి 230 వరకు సింగిల్ డబుల్‌రూములు లభ్యమవుతాయి. అతి చౌకలో కొన్ని హోటళ్ళల్లో పడకసౌకర్యంతోరాత్రి 8 నుండి. 10 రు. లోపుగా సౌకర్యం వుంది.

నగరాన్ని యాత్రిక ఆకర్షణ కేంద్రంగా తీర్చి దిద్దటానికి అనేక నూతన పథకాలు రచించ బడుతున్నాయి. వానిలో ముఖ్యంగా చెప్పుకోదగిందిగా 'భవానీ ఐలెండ్స్' పథకం. కృష్ణానదిలో బోటు విహారానికి సౌకర్యం ఏర్పాటుతో కృష్ణవేణి మోటెల్ నొక దానిని కట్టి అందులో ఆంధ్రప్రదేశ్ టూరిజం శాఖ నొకదానిని కూడ ఏర్పరచి విశేష సమాచారం అందించటానికి తగు ఏర్పాట్లు చేయబడ్డాయి. నగరం దిన దినాభివృద్ధి చెందుతూ నూతన అందాలను సంతరించుకుంటూ మూడు నగరాల మహాపట్టణంగా రూపుదిద్దుకోటానికి బృహత్తర పట్టణాభివృద్ధి పథకాలు తయారవుతున్నాయి. అతి సుదూర భవిష్యత్తులో ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డున సుందర నగర సాక్షాత్కారం జరుగబోతోంది. వేచి చూద్దాం. మనమే చూడగలమని ఆశిద్దాం.

## కొండపల్లి

కొండపల్లి విజయవాడకి సుమారు 16 కి. మీ.

14వ శతాబ్దంలో కొండవీటి ప్రభువు అనవేమారెడ్డి నిర్మించిన ఖిల్లా ఒకటి అరణ్యావృతమైన కొండ శిఖరంమీద ఉంది. అడవులు చాల దట్టంగా ఉంటవి. కొండముచ్చులు ఎక్కువగా కనబడుతూ ఉంటాయి. ఈ కొండల మీద అడవుల్లో పొనుగుచెట్లు, జామ, రేగుపండ్లు చెట్లు చాల ప్రసిద్ధం. కొండమీద ఒక కోనేరు ఉంది. దాని లోతెంతో ఇంతవరకూ ఎవరూ నిర్ధారించలేదు. ప్రస్తుతం కొండమీద గల కుతుబ్‌షా భవనం రెస్టు హౌస్‌గా ఉపయోగపడుతోంది. ఆనాటి రెడ్డిరాజుల వైభవాల చిహ్నాలు ఇంకా పూర్తిగా మాసిపోలేదు.

ఇక్కడ అతి ముఖ్యమైనది, లోకప్రసిద్ధమైనది కొండపల్లి బొమ్మల పరిశ్రమ. ఇది వంశపారంపర్యంగా వస్తున్న గృహ పరిశ్రమ. ఈ బొమ్మలకు వేసిన రంగు లెన్నటికి మాసి పోకుండుట వీటి ప్రత్యేకత.

ప్రస్తుతము ప్రభుత్వము వారు ఈ కొండపల్లి కొండమీదనే దూరదర్శన ప్రసార కేంద్రమును ఏర్పాటుచేసి విజయవాడ పరిసర ప్రాంతాలకు రిలే కేంద్రంగా

అభివృద్ధి చేయబడింది. ఇదికూడా దర్శనీయం. ఇది కొండపల్లికి ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించిపెట్టింది.

## వే దా ద్రి

కృష్ణా తీరంలోవున్న గొప్ప మహిమానిత్వమయిన నృసింహక్షేత్రం. కృష్ణ ఉత్తరవాహిని. యాత్రికులు తమ కోర్కెల సాఫల్యంకోసం ప్రదక్షిణలు చేస్తారు ఆలయానికి కొద్దిగా పైన ఎత్తుగా యోగానంద నృసింహాలయము - సత్రములు ఉన్నాయి. నదీ గర్భంలో లింగాకారంలో సాలగ్రామ నృసింహస్వామి గలదు నీటిలోకి దిగటానికి చక్కటి మెట్లున్నాయి. విజయవాడ నుండి జగ్గయ్యపేట వచ్చి అక్కడి నుండి వేదాద్రి బస్సుమీద వెళ్ళవచ్చు. మార్గమధ్యంలో చిల్లకల్లు దగ్గరనుండి గల చిలిక ప్రయాణంలో గల కొండల్లో విశేషమైన మేలిరకం సున్నపురాయి గనులుండటంతో ఇక్కడ కొన్ని చిన్న పెద్ద తరహా సిమెంటు ఫ్యాక్టరీలు వెలిశాయి. అలా వెలిసిన వాటిలో విష్ణు సిమెంట్సు, హేమాద్రి సిమెంట్సు మొదలయినవి పారిశ్రామిక ప్రాధాన్యతను సంతరించిపెట్టాయి. ఇక్కడి నుండి మరల విజయవాడ చేరాలి.

విజయవాడకు దగ్గరిలో 20 కి.మీ. దూరంలో గన్నవరం విమానాశ్రయం, అభివృద్ధి పథంలో నిశాగంగా ఎలక్ట్రానిక్స్ పరిశ్రమల కేంద్రం ఉన్నాయి.

## కొ ల్లే రు

విజయవాడ నుండి 95 కి.మీ. దూరంలో వున్న మంచినీటి సరస్సు. ఇక్కడ ఒక బర్డ్ శాంక్చుయరీ వుంది. ఎక్కడెక్కడ నుండి వచ్చిన పక్షులు చూడటానికి ఆహ్లాదంగా ఉంటుంది. ఈ సరస్సులలో చేపల పెంపకం ఒక పరిశ్రమగా అభివృద్ధి చేస్తున్నారు. పక్షులకు సీజన్ ఏప్రియల్ నుండి నవంబరు వరకు.

## మ చి లీ ప ట్న ము
## చి ల క ల పూ డి

మచిలీపట్నము కృష్ణాజిల్లాకు ముఖ్య పట్టణం. విజయవాడ నుండి నిరంతరం బస్సులున్నాయి. రైలు మార్గం కూడా వుంది. దీనికి బందరు అని నామాంతరం

కూడా వుంది. మొదటి నుండి బందరు ఆంధ్ర సాహితీరంగంలో కాకలుతీరిన మహా మహులకు నిలయమైనది. కృష్ణాపత్రిక వ్యవస్థాపకులు శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులుగారు, స్వాతంత్ర్య సమర శంఖరావమును ఈచోట నుండే పూరించారు. అనేక సాహితీ చర్చలు తమ పత్రిక ద్వారా ఆంధ్ర సాహితీరంగానికి ఎనలేని సేవ చేసిన మహానుభావులు సంస్మరణీయులు.

మచిలీపట్నం సముద్రతీరం- సుందరమైన మంగినపూడి బీచ్ వున్నది. బీచ్ విహారానికి చక్కని మనోజ్ఞమైన ప్రకృతి దృశ్య పరంగా ఉంటుంది. కొన్ని పరవడి దినాల్లో సముద్ర స్నానానికి జనాలు వస్తుంటారు, జిల్లా నలుమూలల నుంచి. పూర్వము నుండి బందరు కలంకారీ వస్త్రాలకు ప్రతీతి. ప్రస్తుత కాలంలో గిరాకీ లేమిచేత వాని పౌలకువ అంతగా కానరావటం లేదు.

బందరును ఆనుకునే పట్నంలోని భాగంగా స్టేషను నుండి అరమైలు దూరంలో చిలకలపూడి పాండురంగాలయమున్నది. దీనిని 'కీరపండరి' అని వ్యవహరిస్తారు. బందరులో మొత్తం 26 దేవాలయాలు పైనే వున్నాయి. అన్నిటిలోను నాగేశ్వరస్వామి ఆలయందర్శనీయం. విశేషించి చెప్పుకోదగింది, శ్రీపాండురంగాలయము ను గురించి—— పాండురంగని సన్నిధికెదురుగ శ్రీరుక్మిణి అమ్మవారి ఆలయమున్నది. పాండురంగస్వామిని ఆలింగనం చేసుకోవచ్చును. ఇక్కడ చుట్టూ పాండు రంగస్వామి భక్తులయిన నామదేవ, భక్తతుకారాం, జ్ఞానదేవ్, సతీసక్కుబాయి, జనాబాయి మందిరములు నిర్మించి పాలరాతి విగ్రహాలు ప్రతిష్ఠించారు. ఆలయం మాత్రం జీర్ణావస్థలో వున్నదనే చెప్పుకోవచ్చు. ఆషాఢ కార్తీక మాసములలో శుక్ల ఏకాదశులలో గొప్ప ఉత్సవం జరిగి అనేక మంది యాత్రికులు వస్తారు.

## శ్రీ కా కు ళ ము

ఇది కృష్ణాజిల్లాలోనిది మాత్రమే. కృష్ణఒడ్డునే ఉన్నది దివిసీమలో నున్నది. ఇక్కడ రెండు ప్రసిద్ధ దేవాలయాలున్నాయి. ఒకటి కాశేశ్వరస్వామి ఆలయం రెండు ఆంధ్ర మహావిష్ణు ఆలయం. శిల్పరీతుల్లో గొప్ప వైభవంగా ఉంది చూడదగినవి. ఇక్కడ శ్రీకాకేశ్వరుడు స్వయంవ్యక్తము. పురాణములు బట్టి చూస్తే అత్రి మహాముని ప్రతిష్ఠ చేసినట్లు చెప్పబడుతుంది. శ్రీకృష్ణ దేవారాయలకు స్వామి స్వప్నంలో కనిపించి మహాకావ్యమయిన 'ఆముక్తమాల్యద' వ్రాయి ప్రేరణ కలి పించెనని అనుకుంటారు.

## హంసలదీవి

నాగాయిలంక నుండి హంసలదీవికి నడచియైనా వెళ్ళవచ్చు. ఇక్కడనే జీవ నది కృష్ణానది సాగరసంగమం చేసే పవిత్రస్థలము. ఇక్కడ శ్రీ వేణుగోపాలస్వామి వారి ఆలయం కూడా వున్నది.

## మోపిదేవి

చల్లపల్లికి 5 కి. మీటర్లు దూరంలో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాలయం చాల ప్రసిద్ధి చెందింది. అనేకమంది భక్తులు తమ కోర్కెల సాఫల్యత కొరకు మొక్కుబడులు తీర్చుకొంటుంటారు. స్వామి చాల మహిమోపేతుడని ప్రతీతి. ప్రక్కనే సకిలేశ్వరాలయము కూడా వుంది. ఈ లింగము పాతాళము వరకు ఉన్నదని ప్రతీతి.

## ద్వారకా తిరుమల

విజయవాడ నుండి ఏలూరు బస్సులోగాని, రైలులోగాని వెళ్ళవచ్చును. మద్రాసు, హౌరా రైలు మార్గంలో ఏలూరు ఎక్స్‌ప్రెస్ రైళ్ళకు మొదటి స్టాపింగు అవుతుంది. నిరంతరం ఏలూరుకు విజయవాడ నుండి నాన్‌స్టాపు బస్సులు గలవు. ఏలూరు నుండి భీమడోలు, తడికలపూడి ద్వారా ద్వారకా తిరుమల చేరవచ్చును.

ఇక్కడ ఒక చిన్న గుట్టమీద శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం వుంది. గుట్ట కింది గ్రామాన్ని తిరుపతి అంటారు. తిరుమల తిరుపతి వేంకటేశ్వరునికి చెల్లించాలనుకున్న మొక్కుబడులు కూడా ఒక్కొక్క సమయంలో అంతదూరం వెళ్ళలేని భక్తులు ఇక్కడనే స్వామివారికి మొక్కుబడులు తీర్చుకొంటూంటారు. భక్తులు విశేషంగా వస్తారు. దీనినే చిన్న తిరుపతి అనికూడా అంటుంటారు. ఇక్కడ వివాహ, ఉపనయనాది కార్యక్రమములు, అన్నప్రాశనలు వగయిరాలు, తలనీలాల మొక్కుబడులు చెల్లించుకుంటూంటారు.

శేషాచలము, అనంతగిరి అని పిలువబడే ఈ ద్వారకా తిరుమల క్షేత్ర మహాత్మ్యం బ్రహ్మాండ పురాణంలో చెప్పబడింది. ఇక్కడ ఒక కుంకుడు చెట్టుంది. ఆ చెట్టుమీద గరుడపక్షి కొన్ని సమయాల్లో వచ్చి వ్రాలుతుందట. ఆనాడు శ్రీ వేంకటేశుడు తిరుపతి నుండి ద్వారకా తిరుమలకి వస్తారని ప్రతీతి. అక్కడ ద్వారకమహర్షి

స్వామివారి నర్సిస్తుంటే ఒక వల్మీకం-(పుట్ట) పెరిగిందని, ఆ పుట్టలో స్వామి వున్న ట్లున్ను ఇప్పటికీ స్వామి పాద ముద్రికలు కన్పడుతున్నాయట. ఇక్కడ దొరికే ప్రతి శిలయందు సుదర్శన ముద్ర కన్పిస్తుంది. ఇది చాలా గొప్ప విశేషమయిన సంగతి. ఆలయ సింహద్వారములు వేసినా, మబ్బుపట్టి చీకట్లు కమ్ముకొన్నా ఆలయగోపురము నుండి ఒక దివ్యమైన జ్యోతి దర్శనమిస్తుంది. దగ్గరనుంచి అయితే చిన్న దీపంగాను 200 మీటర్ల దూరం నించిచూస్తే పెద్ద వెలుగుగాను చూడవచ్చు. అందుకు కారణం ఈ పర్వతంలో తేజోమణి ఉన్నదని భక్తులభావన. స్వామి వారికి లక్షణమైన సువర్ణా భరణాలు చాలా వున్నాయి. అనేక ఉత్సవాలు అతివైభవంగా జరుగుతాయి.

ఈ విధంగా గోదావరి జిల్లాలు రెండిటిలో విశేషమైన ప్రాభవంగల పురాణ ప్రసిద్ధమైన ఎన్నో ఆలయాలున్నాయి. ప్రతి అడుగూ పావనోదారమై గోదావరీవారీ పూపురంతో పునీతమైన ప్రదేశంగానే కనబడుతుంది.గోదావరి జల్లాల్లోనే ఒక రకమైన జ్ఞానదాన మహత్యంవుందని ప్రతీతి. ఇక ఇక్కడినుండి ఒక్కొక్క క్షేత్రాన్ని దర్శి ద్దాం. అన్నికాకపోయినా కొన్ని ముఖ్యమయిన మహత్యపూర్ణము, విశేష ప్రాభవంగల ప్రదేశాలను దర్శించుదాం.

ద్వారకా తిరుమల నుండి భీమడోలు ద్వారా తాడేపల్లిగూడెం నుండి తణుకు వచ్చి తణుకు నుండి నర్సపూరు మార్గంలో పాలకొల్లు రావచ్చును పాలకొల్లును కేంద్రంగా చేసుకుని గోదావరి ఈవలి తీరంలోనున్న క్షేత్రాలను దర్శించవచ్చు.

# పాలకొల్లు (క్షీరారామము)

ఒకరకంగా ఇది సార్థకనామం. పరమశివుడు తన త్రిశూలంతో ఒక సరస్సును నిర్మించి క్షీరసాగరము నుండి పాల నాకర్షించి సరస్సును పాలకొలనుగా నింపెనట. కాలక్రమేణా పాలకొలను, పాలకొల్లుగా ప్రసిద్ధి చెందింది.

క్షీరం అంటే పాలు. క్షీరమున కారామము పాలకొలను. క్షీరారామము పంచా రామాల్లో ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడి స్వామి రామలింగేశ్వరుడు. లింగము 18 అంగుళముల యెత్తుండి పాలరాతితో స్వయంభువు. స్వామికి వెనుక భాగంలో మూడు చారలున్నాయి. ఇవి జటలని ప్రతీతి. తారకాసురుడు పూజించిన అమృత లింగానికి శిరోభాగమని కూడా కొందరంటారు. 11 అంతస్థుల గాలిగోపురం 1777లో నిర్మించబడింది ఆంధ్రలో ఎత్తైనగాలిగోపురాల్లో నాల్గో స్థానాన్ని ఆక్రమిస్తుంది.

# పెనుగొండ

పాలకొల్లు నుండి సుమారు 12 కి.మీ. వుంటుంది. తణుకు నుండి నిడదవోలు నుండి బస్సులున్నాయి. ఇక్కడ ఆర్యవైశ్యులకు ఇలవేలుపైన శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయం ప్రధానం. శ్రీ కన్యకాపరమేశ్వరి పార్వతీదేవి అవతారంగా భావించబడు తుంది. పూర్వము సమాధియను మునిశ్రేష్ఠుని తపస్సుకు ఫలంగా వైశ్యరాజు అయిన కుసుమశ్రేష్ఠి పుత్రికగా జన్మించి తన జీవితమును పరమేశ్వరుని కంకితము గావించి తనువు మనస్సు పరాధీనం గావించటాని కిష్టపడక ఆత్మార్పణ గావించుకొని అమ్మ వారికి ప్రతిరూపంగా వెలసెనని గాథకలదు. ఇక్కడికి అనేకమంది యాత్రికులు వచ్చి దర్శిస్తుంటారు. ఇక్కడి నుండి రేవుదాటితే పలివెలి చేరవచ్చు. ఈ గ్రామం శృంగార నైషధకర్త, ఆంధ్ర సారస్వత రంగంలో విశిష్టస్థానాన్ని అలంకరించిన శ్రీనాథకవి సార్వభౌముని జన్మస్థలమని చెప్తుంటారు.

# మందపల్లి

కొత్తపేట మీదుగా మందపల్లి చేరవచ్చు. దక్షిణ భారతదేశంలోనే కాక మరెక్కడా లేనటువంటి శనీశ్వరాలయం వుంది. దీనికి విశేష ప్రాధాన్యం కలదు. శనీశ్వరుని దృష్టి సరిగాలేని జాతకులు. ఈ ఆలయానికి వచ్చి స్వామిని సంద ర్శించి తైలాభిషేకాదుల నిర్వర్తించిన యెడల శనిగ్రహ బాధనుండి ముక్తిని పొంద గలరని గాథవిశ్వాస ముంది. ప్రతి శనిత్రయోదశికి, మాసశివరాత్రుల్లోను విశేషంగా పూజలు, అభిషేకాలు జరుగుతుంటాయి. దక్షిణ భారతంలోని అనేక మంది ఈ స్వామిని దర్శించటానికి యాత్రికులుగా వస్తూంటారు.

# అంతర్వేది

పాలకొల్లు నుండి నర్సాపురం సుమారు 10 కి.మీ. నర్సాపురం నుండి గోదా వరి నదిమీద నావపై ప్రయాణంచేసి అంతర్వేది చేరవచ్చును. గోదావరిలో పడవ ప్రయాణం చాలా ఉల్లాసంగా వుంటుంది. అంతర్వేదిలో మామూలు సత్రాలుగాని, ధర్మశాలలుగాని లేవనే చెప్పవచ్చు. ఇక్కడ శ్రీ లక్ష్మీనృసింహస్వామి స్వయంభూ మూర్తి. ఆలయం చాలా ప్రాచీనమైనది. వసిష్ఠుని తపోబలంవల్ల సీతారామచంద్ర

ప్రభువుల పాదధూళి ప్రసారంచేత పునీతమైన పావన ప్రదేశం. ఇక్కడ గోదావరి సాగర సంగమం చేస్తుంది. ఈ దృశ్యం చాలా మనోహరంగా ఉంటుంది. సాగర సంగమం జరిగేచోట చాల స్పష్టంగా చూడవచ్చు. గోదావరి నీరు - సముద్రం నీరు విడివిడిగా ఉండి అన్నా చెల్లెళ్ళ గట్టు అని పిలువబడే ఈ ప్రదేశంలో నదీజలాలు - సాగరజలాలు వేనికవిగా చెలియలికట్ట స్పష్టంగా కనబడుతూ విశిష్టంగా గోచరమవుతూంది.

తూర్పు సముద్రపు హోరు, ప్రకృతి రమణీయతలు సౌకర్యాలు లేవేమి ? అనే భావన రానీయదు.

భీష్మైకాదశి నుండి పూర్ణిమ వరకు మహావైభవంగా ఉత్సవాలు జరుగుతాయి. వేలకొలది యాత్రికులు ఉత్సవాల్ని దర్శించటానికి వస్తూంటారు. ఆలయ ధర్మకర్తలు జమీందారులు. వారి వంశస్థులలో నెవరైనావచ్చి ఏటేటా జరుగు రథోత్సవాలను ప్రారంభిస్తారు. వారి చేయి తాకనిదే రథము కదలదటగూడాను. మాఘ శుద్ధ ఏకాదశికి కళ్యాణ రథోత్సవాలు జరుగుతాయి. యాత్రికులు లక్షల్లో వస్తారు.

## న ర్సా పు రం

తిరిగి వచ్చే త్రోవలో సర్సాపురంలోని ఎంబెరుమానారు కోవెల చూడదగినది, చాలా పురాతనమైన ఆలయం. విశిష్టంగా నున్నది. గోదావరి సాగర సంగమం చేయబోయే ముందు ఏడుపాయలుగా చీలి సప్తగోదావరి సంగమ స్థానము లేర్పడ్డాయి. వీలుంటే అన్నిటినీ చూడవచ్చు.

## భీ మ వ రం

సర్సాపూరు, సికింద్రాబాదు రైల్వేలైనులో భీమవరం టౌనుస్టేషనులో దిగవచ్చును. ఇది పంచారామాల్లో ఒకటైన భీమారామము. ఇక్కడ వేంచేసియున్న స్వామి సోమేశ్వరస్వామి. సోముడనగా చంద్రుడు. చంద్రునిచే ప్రతిష్ఠించబడిన లింగము గనుక సోమేశ్వరక్షేత్రమని పేరు గలిగింది. దీనివైశిష్ట్యము పద్మపురాణంలో చెప్పబడింది. చంద్రుడు తన గురువగు బృహస్పతి భార్యయైన తారను కామించిన పాపమును బోగొట్టుకొనటానికి అమృతలింగ భాగాన్నొక దానిని తెచ్చి ప్రతిష్ఠించాడట.

అందువలననే గాబోలు చంద్రునిషోడశ కళలు లింగము మీద దర్శించవచ్చు. అమావాస్యనాడు లింగము నల్లగ ఉండి పూర్ణిమను తెల్లగా స్ఫటిక సదృశమై వుంటుంది. సోమకుండ స్నానము పంచమహా పాపముల పరిహరిస్తుందని ప్రతీతి.

# రా జ మ హే ం ద్ర వ ర ము

పూర్వము చాళుక్య వంశపు రాజైన రాజరాజ నరేంద్రుడు రాజధానిగా చేసి కొని ఈ ప్రదేశమును పాలించాడు. క్రీ.శ. 11వ శతాబ్దం పూర్వపు చరిత్ర. గానట వినటగానున్న తెలుగు భాషకు శాసనకర్తయై సంస్కృతాంధ్ర సమ్మిశ్రితంగావించి ఒక ఒరవడి దిద్దిన వాగను శాసనుడు, ఆదికవి నన్నయ్య భట్టారకుడీ రాజాస్థానమున ఆస్థానకవి. ఇమ్మహారాజు ప్రేరితంగానే మహాభారతమును ఆంధ్రీకరించ నడుకట్టి, ఆది సభాపర్వములు, ఆరణ్య పర్వ శేషమును పూరించి చరితార్థుడయినాడు. తదుపరి మరో రెండు మూడు వందల సంవత్సరాల వరకు భారతాంధ్రీకరణము చేయబడిన కవి వరేణ్యులు లేకపోయిరి. అటువంటి మహానుభావుడు, తెలుగువారికి ప్రాతఃస్మర ణీయుడు అయిన మహాకవి సంచరించిన పావన ప్రదేశము. ఈ వూరు కూడ ఆ మహాకవికి ఆశ్రయమిచ్చిన రాజరాజ నరేంద్రుని పేర రాజమహేంద్రవర మని ఆయన పేరనే విఖ్యాతమయినది.

నాసికాత్ర్యంబకేశ్వరము వద్ద పుట్టిన పావన గోదావరి ఇక్కడకి వచ్చేటప్ప డికి విశాలమై ధవళేశ్వరము వద్ద ఆనకట్ట కట్టబడింది. కొవ్వూరు, పశ్చిమ గోదావరి ఒడ్డయితే తూర్పుగోదావరి ఒడ్డు రాజమహేంద్రవరము. ఇక్కడ సుమారు లక్షన్నర జనాభా వుంటుంది.

ప్రతి పన్నెండు సంవత్సరాలకు గోదావరీ పుష్కరం జరుగుతుంది. లక్ష లాది మంది యాత్రికులు వస్తారు పవిత్ర గోదావరీ స్నానం చేసి పునీతులవుతారు.

**ముఖ్యంగా చూడదగినవి :**

మార్కండేయాలయము, సారంగధరమెట్ట, కోటిలింగాల రేవు, కోటి లింగే శ్వర స్వామి ఆలయం, ఆంధ్ర పేపరు మిల్సు, ధవళేశ్వరం వద్దనున్న ఆనకట్ట మొదలయినవి. చారిత్రక ప్రాధాన్యము గలిగినది. ఇక్కడికి దగ్గరలో నున్న విహారయాత్రా స్థలములు, ర్యాలి 24 కి.మీ. దూరంలో వున్నది— ద్రాక్షారామం, కోటిపల్లి, మదనపల్లి.

ఉండటానికి :

మహాలక్ష్మి, పంచవటి, బృందావనం, శ్రీదుర్గ చందన్, కోటగుమ్మం, గోదావరి రైల్వే స్టేషను దగ్గరలో ఉన్నాయి. గోదావరి ఉత్తరం వైపున హోటల్ అప్సర కూడా ఉన్నది.

## ర్యాలి

ఇక్కడ జగన్మోహిని, కేశవస్వామి ఆలయం ఉన్నది. విగ్రహం చాల సొంపుగ తీర్చి దిద్దబడింది. ముందు చూస్తే విష్ణువు, వెనుక చూస్తే జగన్మోహిని. స్వామివారి పాదాల చెంత ఎప్పుడూ సంతతం నీటిబొట్లు పడుతున్నా ఆ నీరంతా ఎటుపోతుందో కనిపెట్టిన వారింతవరకూ ఎవరూ లేదు. ఇక్కడ ఈ ఆలయం వెలసిన కారణంగా ఒక కథకూడా ప్రచారంలో ఉంది. సంక్షిప్తంగా— రాజా విక్రమ్‌దేవ్ వేటకువచ్చి అలసిపోయి నిద్రించారట. స్వప్నంలో స్వామి సాక్షాత్కరించి రథ చక్రములోని చీల ఎక్కడయితే పడుతుందో అక్కడ తనకాలయం నిర్మించమని ఆదేశించారట. అక్కడ స్వప్నంలో సాక్షాత్కరించిన విధంగానే అక్కడ త్రవ్వితే ఈ విగ్రహం దొరకగా ప్రతిష్ఠించి ఆలయ నిర్మాణం చేసి 'ర్యాలి' అని నామకరణం చేశారట.

## ద్రాక్షారామం

రాజమహేంద్రవరం నుండి బస్సులున్నాయి. కాకినాడ నుండి కూడా బస్సులున్నాయి. ఈ క్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఆఖరిది. చాలా పురాతనమైన ఆలయం. ఇక్కడి స్వామి భీమేశ్వరస్వామి. ఈ వాటిక యందు దక్షప్రజాపతి అనేక యజ్ఞాలు చేసిన పవిత్ర స్థలమయినందున ద్రాక్షారామమని పేరు వచ్చిందట. భీమేశ్వర స్వామి లింగము స్ఫటిక లింగము. సుమారు 16 అడుగులు పైగా ఎత్తుంటుంది. అభిషేకాదులు చేయటానికి పైన రెండవ అంతస్తునుంచి చేయవలసిందే. పంచారామాల్లో ఒకటిగాను, జ్యోతిర్లింగాల్లో ఆఖరిదిగాను చెప్పబడే ఈ శైవక్షేత్రం చాల మహిమాన్వితమైనదని చెప్పకోవచ్చు. 12వ శతాబ్దం చివరన వేములవాడ భీమకవి స్వామి నారాధించి వాక్శుద్ధి కలిగిన వాడయ్యాడని ప్రతీతి. 15వ శతాబ్దంలోని ప్రౌఢ కవి మల్లన, రుక్మాంగద చరిత్రమును, కవిసార్వభౌముడు, ఆంధ్ర నైషధకర్త

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణమున, మరియింకా మల్లికార్జున పండితుడు, సూరన కవి మొదలగు ప్రాచీన కవులెందరో స్వామి మహాత్మ్యమును వేనోళ్ళ ప్రశంసించటం జరిగింది. వేయేల! క్షేత్రమహాత్మ్యము స్కాంద, బ్రహ్మాండ పురాణాల్లో ప్రస్తుతించ బడింది. 'భీమసభ' అనే 108 లింగములు గల ఏక లింగము చూడదగినవి.

ఆలయ ప్రాకారాలు, గోపురాలు చాళుక్య భీముడు నిర్మించినవనీ, అందుచేత ఈ స్వామి భీమేశ్వరస్వామి అని పేరు సార్థకమయిందని మరో కథ.

## కోటిఫలి లేక కోటిపల్లి

ద్రాక్షారామానికి సుమారు 10 కి.మీ. ఇక్కడి స్వామి సోమేశ్వరుడు. ఇది కూడా గోదావరీ తీరముననే ఉన్నది. ఇక్కడి సోమేశ్వర లింగమున కోటి లింగాలు తొలప బడినవి, క్షేత్ర ప్రసక్తి బ్రహ్మాండ పురాణంలో ఉటంకించబడింది. ఇక్కడ చేసే తపో, దాన, యజ్ఞ, యాగాదులు కోటిరెట్లు ఫలమధికంగా ఇస్తాయట. అందుకే దీనికి 'కోటిఫలి' అని పేరు గలిగింది.

ఇంద్ర ప్రతిష్ఠితమైన కోటేశ్వరాలయం ఒక ప్రక్కన ఉంది. ఇక్కడి లింగము నీటిలో మునిగి ఉంటుంది. గర్భాలయములో నీరున్నపుడు స్వామి పైకి కని పించడు. నీరు నేలమట్టం కాగానే స్వామిపైకి కనిపిస్తుంటాడు. శివరాత్రికి గొప్ప దీపోత్సవం ఇంకా అనేక ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి.

## పి ఠా పు ర ము

దేవీ ఆలయము. అష్టాదశ శక్తి పీఠాల్లో 18 వది. దేవుడు కుక్కుటేశ్వ రుడు. దేవి పురుహూతిక. లింగము కోడి ఆకారంలో వుండటాన ఈ పేరు స్వామికి వచ్చిందని అంటారు. కోడిముక్కు నుండి నిరంతరము నీరూరుతూ వుంటుంది. ఆలయ ప్రాంగణంలో విష్ణు పాదము ఉంది. అందుకే దీన్ని పాద గయ అంటారు.

## కుమారారామ క్షేత్రం

సామర్లకోట స్టేషను దగ్గరలో పెద్దాపురం తాలూకాలో ఉంది. పంచారామ క్షేత్రాల్లో ఒకటిగా నెన్నబడినది. స్వామి సామర్లకోట భీమేశ్వరుడు. ఇక్కడి శివ లింగం కూడా చాల యెత్తైనది. పూజలు, అభిషేకాలకు మూడంతస్తు లెక్కవల సిందే!

ఇక్కడి విశేషం :

'ఊయలమంటపం' నల్లరాతి చెక్కడం. క్రింద నుండి 15 అ. యెత్తున నాలుగు స్తంభాల మీద ఈ మంటపం ఉన్నది. చాల బరువైనది కూడ. అయినా చిన్న పిల్లలు కదల్చినా ఉయ్యాలవలె ఊగుతుందట. స్వామిని ఇందులో ఉంచి ఊయలసేవ జేస్తారు.

చూడదగినవి :

చీకటి కోణము, బాలా త్రిపురసుందరి. మాఘమాసంలో బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుగుతాయి.

పెద్దాపురము నుండి బయలుదేరి బస్సులో సామర్లకోట వచ్చి, రైలు మీద అన్నవరము రావచ్చును. ఈ మార్గమంతా కూడా ఆంధ్ర కోస్తా తీరమునకు అతిదగ్గరలో నున్నవియే. రైలు మద్రాసు హౌరా మార్గము. దక్షిణమధ్య రైల్వే జోనులోది. అనగా మన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పడిన సరికొత్త రైల్వే జోన్.

## అన్నవరం

తూర్పుగోదావరి జిల్లాలో అన్నవరం స్టేషను నుండి 3 కి.మీ. దూరంలో పంపానదీ తీరంలో వున్న కొండ రత్నగిరి మీద వేంచేసియున్న శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి వారి ఆలయం వుంది. కొండ క్రింద నుండి పైకి నేరుగా దేవస్థానం తరపున బస్సులున్నాయి. ఓపిక వుంటే మెట్లెక్కి కూడా వెళ్ళ వచ్చును. క్రింద నుండి పైకి చేరటానికి నడిచి మెట్లెక్కి వెళితే సుమారు 20 నిమిషాలు పట్టవచ్చు. ఆంధ్రదేశం హైందవులు కుల విచక్షణ లేకుండా తమ యింట ఏ శుభ కార్యము జరిగినా — వివాహం, గృహనిర్మాణం జరిగినా, గృహ ప్రవేశ మహోత్సవము లేక మరేదైనా శుభ సందర్భాలన్నింటికి శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం ఒక ముఖ్య భాగంగా ఆచరించుతారు. అది ఈ స్వామి వ్రతమే, అంటే తెలుగువారికి ఎంత ప్రియాతిప్రియమైన దేవుడో అర్థం చేసుకోవచ్చు. కొండక్రింద దేవస్థానం సత్రములు, హోటళ్ళు వున్నాయి. కొండపైన కూడ విడిదికి సత్రాలు దేవస్థానం తరపున గదులతో కూడినవి ఉన్నాయి.

వైశాఖ శుద్ధ దశమికి విశేషంగా కళ్యాణోత్సవం జరుగుతుంది. ఈ ప్రాంతంలో గల సంపన్న ఆలయాల్లో ఇది ఒకటిగా చెప్పుకోవచ్చును. నిరంతరం భక్తులు యాత్రికులు వస్తూ సందడిగా వుంటుం దీ దేవస్థానం. దేవస్థానం అమరియున్న గుట్ట పేరు రత్నగిరి. పంపానదీ తీరాన ఉన్న రత్నగిరికి విశేష ప్రాభవం వుందని తెలుస్తుంది. పురాణకథల్లో– మేరువు ఇద్దరు కుమారులు భద్రుడు, రత్నాకరుడుగా పేర్కొనబడింది. భద్రుడు పెద్దవాడు. రత్నాకరుడు చిన్నవాడు. ఇద్దరు కూడా తమ పేరుచిరస్థాయిగా ఉండాలని తపస్సుచేయ సంకల్పించినవారు. భద్రుడే–భద్రగిరి,భద్రాచలంగాను– రత్నాకరుడు–రత్నగిరిగాను శాశ్వతత్వాన్ని పొందారు. రెండు కొండల మీద విష్ణు స్వరూపాలే ప్రతిష్ఠిత మవటం గమనార్హం.

ఇక్కడి స్వామి త్రిపాద్విభూతి మహానారాయణుడు. నారాయణాస్త్రంతో అలంకరించబడినవాడై, హిరణ్య గర్భాత్మకుడై తనదేవేరి శ్రీ అనంతలక్ష్మి సత్యవతీ అమ్మవారి సమేతుడై శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి వెలసి భక్తులకనుగ్రహం ప్రసాదిస్తున్నాడు– భక్త జన శరణ్యుడిగా సాక్షాత్కరిస్తున్నాడు.

ఆలయం కూడా రెండతస్తులుగా వుంటుంది. ఆగమశాస్త్ర విధిగా క్రింది భాగంలో యంత్ర ప్రతిష్ఠ జరిగింది. స్వామివారి దివ్య మంగళమూర్తిని రెండవ అంతస్థులో దర్శించగలము. రెండింటికీ నడుమ పానవట్టం మాదిరిగా నిర్మించబడి సృష్టి, స్థితి, లయకారులయిన త్రిమూర్తుల ఏకాకృతిగా వెలసిన దనేవి నేటి పెద్దల అభివర్ణన, సాధు స్వభావనం.

సత్యదేవవ్రత సంకల్పం స్కాంద పురాణం రేవాఖండంలో అయిదు అధ్యాయాలుగా వున్నది. కల్పోక్త విధానంగా వ్రతంచేసి ప్రసాదం స్వీకరించిన ఆపన్న శరణ్యులు అభీష్ట సిద్ధులు పొందిన వైనం ఈ గాథల్లో వివరించబడినది. ఇది సర్వజన విదితం.

**సన్ డయల్ :**

రత్నగిరి మీద స్వామి సన్నిధిలో నిర్మించబడిన ఒకానొక ఎండ గడియారం యంత్రం. పగటివేళ సూర్యరశ్మి ఆధారంగా కాల నిర్ణయం చేయటానికి ఏర్పాటు చేయబడిన కాలనిర్ణయ, నిర్దేశక యంత్రం. దీనిని జ్యోతిశ్శాస్త్రవేత్త శ్రీ పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు 1958 సం॥లో పునర్నిర్మించారు. ఇటువంటిది దేశంలో మన రాజధాని ఢిల్లీ నగరంలో జంతర్‌మంతర్‌లో మాత్రమే చూడగలం.

శ్రీవారి దివ్యకళ్యాణోత్సవాలు వైశాఖ శుద్ధ దశమి విశేషోత్సవాలకుతోడు, ఉగాది, శ్రీరామనవమి, వినాయకచతుర్థి-గణపతి నవరాత్రోత్సవాలు, శరన్నవ రాత్రులు, సంక్రాంతి, శుద్ధ ఏకాదశి, భీష్మైకాదశి వగయిరా పర్వదినోత్సవాలు వైభవంగా జరుగుతాయి. ప్రతినిత్యమూ జరిగే అర్చనలు, పూజలు, భక్తుల సామూహిక వ్రతాలు నిత్య కళ్యాణం పచ్చతోరణ వైభవాలు శ్రీవారి దేవస్థానం యందలి వసతి సౌకర్యాలు రిజర్వేషన్లు ద్వారా పొందవచ్చును. పంపాసత్రం, అనంతలక్ష్మి సత్యవతీ సత్రం, పేయింగు రెస్ట్ హౌస్, చంద్రమౌళి కాటేజిలలో వసతులు రిజర్వేషనులు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారితో సంప్రతించి పొందవచ్చును.

స్వామివారి కళ్యాణ మండపంలో వివాహము జరిపించుకొన దలచిన వారికి 1/4 వంతు మండపం రు. 75/- లతో రిజర్వేషను చేయబడుతుంది. వివాహము టిక్కెట్టు వేరుగా 75/- చెల్లించి పొందాలి.

వివిధ పూజలు, అర్చనలు, శుభకార్యాలు జరిపించు కొనదలచిన వారికి కట్టడులు వేరుగా ప్రకటించబడిన విధంగా చెల్లించవలసి వుంటుంది.

## శాంతి ఆశ్రమం

విజయవాడ హౌరా మార్గంలోనే తుని స్టేషనులో దిగి కట్టిపూడి అను గ్రామం బస్సులో వెళ్ళవచ్చును. కట్టిపూడి 12 కి.మీ. ఉంటుంది. 80 ఎకరముల విస్తీర్ణంలో పర్వతారణ్య మధ్యగా ఒక చక్కటి ఆశ్రమం వెలసింది— స్వామి ఓంకార్ మహాశయుల అధ్వర్యంలో. ఇక్కడ ప్రకృతి సౌందర్యంలో మైమరిచి తాదాత్మ్యం చెందటానికి, మానసిక ప్రశాంతతకు దోహద పరిచే కుటీరాలు, ధ్యానాలయములు, రీడింగుహూమ్సు, చక్కటి మంచినీటి బావులతో కళకళలాడుతూ వుంటుంది. మానసిక ప్రశాంతిని వెతుక్కుంటూ విదేశాల నుండి-చైనా, అమెరికా, జపాన్ మొ॥ దేశాలనుండి, దేశం నలుమూలల నుండి ఎంతోమంది వచ్చి దర్శించి వెళుతూంటారు.

## వాల్తేరు - విశాఖపట్టణం

ఇటీవలెనే మహానగర ప్రతిప్రత్తిని పొందిన నగరం—విశాఖపట్టణం. ఆంధ్రప్రదేశ్ బంగాళాఖాత తీర ప్రాంతంలో ఒక ముఖ్య కేంద్రమై దేశం మొత్తానికే

గర్వకారణంగా తలమానికంగా నిలుస్తున్న - తూర్పుతీర నౌకాదళ కేంద్రం, హిందూస్థాన్ షిప్ బిల్డింగుయార్డు, అనేక నూనెశుద్ధి కర్మాగారములతోపాటు ఇటీవల ఆంధ్రుల హక్కుగా సాధించుకున్న ఉక్కు కర్మాగార నిర్మాణం, హిందూస్థాన్ జింకు కర్మాగారం వగయిరాలు మరెన్నో, పరిశ్రమల కేంద్రంగా దిన దినాభివృద్ధి పొందుతున్న ఈ నగరం స్వతహాగా రెండు పట్టణాల కలయికగా ఏర్పడిన ఒకే పట్టణము. అవి వాల్తేరు–విశాఖపట్టణములు. హ్రస్వంగా వైజాగ్ అని కూడా అంటారు. సుందరతరమైన బీచ్ ఒక ప్రత్యేకత, అన్నిటా విద్యా విజ్ఞాన రంగాల్లో సుజ్ఞాన వీచికలను ప్రసరింపజేస్తూ ఆంధ్రుల ముద్దుబిడ్డ ఆంధ్ర విశ్వవిద్యాలయ భవన సముదాయం మరోవంక వింత సోయగాలను సంతరించుకున్న విశాఖ చూడదగినది - చూచి ఆనందించదగిన ప్రదేశం.

**ఈ నగరం జనాభా :**

1981 లెక్కల ప్రకారం సుమారు 4 లక్షలు. ప్రస్తుతానికి 6 లక్షలుపైగానే వుండవచ్చు.

హైదరాబాదు నుండి 666 కి.మీ. ఉంటుంది. విజయవాద నుండి 349 కి.మీ. వుంటుంది. విశాఖపట్నం తరచుగా రూర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా కొనియాడబడుతుంది.

వాల్తేరు దగ్గరవున్న 'వాసన్స్ బే' స్విమ్మింగ్ హాబీగా ఉన్న వారికి ఒకస్వర్గము. సముద్రపు అందాలను చూడటానికి డాల్ఫిన్స్ నోస్ లైట్ హౌస్ వద్ద నుండి చూస్తే పట్టణ సౌందర్యం, సముద్రం ఎంతో మనోహరంగా కనబడుతుంది. ఇది ఒక సహజరేవు పట్టణం.

భారతదేశానికే గర్వ కారణంగా వున్న తూర్పు తీర నౌకానిర్మాణ కేంద్రం దర్శించటానికి వారం రోజులు సోమవారం నుండి శనివారం వరకు 4 నుండి 6 గం. వరకు. ఓడరేవును చూడాలంటే మంగళ, బుధ, గురువారాలు 4 నుండి 6 గం. వరకు. నూనెశుద్ధి కర్మాగారము సోమవారం నుండి శుక్రవారము వరకు మధ్యాహ్నం 1.30 నుండి 8 గం. వరకు. విశాఖపట్నం కేంద్రముగా చేసికొని ఇక్కడ దగ్గరలో వున్న సింహాచలము, బొర్రా గుహలు, మాచ్‌ఖండ్ డుడుమా జలపాతం వగైరాలు చూడవచ్చు.

విశాఖలో వుండటానికి అనేకమైన మంచి హోటళ్ళున్నాయి. చౌకగా అమ రిటైరింగ్ రూములు విశాఖ బస్సు స్టేషన్‌లో కూడ దొరుకుతాయి. హోటల్ పూర్ణ

హోటల్ ప్రశాంత మొదలయినవి సామాన్యులకు అందుబాటులో వున్నాయి. మరి కొంచెం ఖరీదు పెట్టగలిగే వారికి హోటల్ అప్సర. మెయిన్ రోడ్డులోనే వున్నాయి.

ఇకపోతే మాన్యులకు అంటే ధనవంతులకు సన్-యన్-సీ- (SUN-N-SAE) పార్కు, బీచ్‌రోడ్, ఫోన్ నం. 4856, 4333, బీచ్‌కి ఉత్తరాన కిర్లంపూడి దగ్గర ఓషన్ వ్యూ ఇన్-కిర్లంపూడి, ఫోన్: 64828. మరియింకా

డాల్ఫిన్, దాబాగార్డెన్స్. ఫోన్. 64861.

పామ్‌బీచ్, బీచ్‌రోడ్, వాల్తేరు ఫోన్: 63006-8, సీ పెరల్, 15,8,20. మహారాణిపేట ఫోన్: 66257. పూటి, దాబాగార్డెన్స్ ఫోన్ నం. 64251, విక్రమ్, 756. రోడ్, ఫోన్: 64281, మెరినాబీచ్‌రోడ్, ఫోన్ నం. 4347 వగైరాలు.

ప్రత్యేక సమాచారం కోసం :

1. టూరిస్టు ఇన్‌ఫర్మేషన్ ఆఫీసరు. వైజాగ్ ఫోన్ నం. 3016.
2. ఇండియన్ ఎయిర్‌లైన్స్ హర్యామ్‌శాస్త్రివీధి, క్రిష్ణనగర్, వైజాగ్. ఫోన్ : 2678 &4 665.
3. స్థల సందర్శనం టూర్స్ నిర్వాహకులు- టూరిస్టు ఇన్ ఫర్మేషన్ ఆఫీసరు వైజాగ్.

## సింహాచలం

విశాఖకు ఉత్తరంగా సుమారు 20 కి.మీ, దూరంలో సముద్రమట్టానికి 248 మీటర్ల ఎత్తులో సమున్నతంగా ఒక కొండమీద వెలసిన శ్రీ మహావిష్ణువు యొక్క అవతారమైన వరాహ నృసింహస్వామి క్షేత్రం. ఈ ప్రాంతంవారికి ఈ స్వామి అంటే ఎంతో గురి. విశాఖజిల్లాలోని వారంతా ఈ స్వామిని భక్తితో, ఆపాయ్యంగా సింహాద్రి అప్పన్నగా పిలుచుకుంటూ ఈ స్వామిపేరే ఎక్కడచూచినా పెట్టుకుంటూ వుంటారు. ఇక్కడి సుప్రసిద్ధుల నుండి పూరిపాకల్లో వుండేవారు సైతం ఈ స్వామి వారి పేరులేకుండా వుండరు. కొండమీద గంగ, గోదావరి, కూర్మ, మాధవ, ఆకాశ ధారలను హనుమద్వారము వరకూ చూడవచ్చు. సింహాద్రి అప్పన్న దేవాలయం 11వ శతాబ్దపుది అని అంటున్నా ఆలయం ఇంకా పురాతన కాలానికి చెందినదిగా భావించ

బడుతుంది. హిరణ్య కశిపుని వధానంతరం భక్తశ్రేష్ఠుడైన ప్రహ్లాదునిచేత ప్రతిష్ఠిత మైనదిగా చెప్పుకుంటారు. స్వామి ఉగ్రత్వమును శాంతింప జేయటానికి విగ్రహానికి ప్రతి నిత్యమూ చందనపు పూత పూస్తుంటారుట.

స్వామికి వైశాఖ శుద్ధ తదియనాడు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. సంవత్సర మంతా చందనంతో మెత్తివేయబడి వున్న స్వామి నిజరూప దర్శనం ఆనాడే జరుగు తుంది. దీన్నే గంధవలుపు ఉత్సవం అని కూడా అంటారు. స్వామిని ఈ రోజున దర్శించటానికి లక్షలాది యాత్రికులు వస్తారు. కొన్ని వ్యాధులు సైతం నయంకాగలవని ఒక గట్టి నమ్మిక. ఆ రోజున స్వామివారి దివ్యానుభూతి భక్తులకు వెచ్చగా స్పృశ్య మవుతుందట. చాళుక్యరీతి శిల్ప వైభవం ఆలయమంతా కొట్టవచ్చినట్టు కనబడుతూ ఉంటుంది. శ్రీ కృష్ణదేవరాయలు సైతం ఈ క్షేత్రాన్ని దర్శించి పునీతుడై, సంతు ష్టాంతరంగంతో కొన్ని గ్రామాలు స్వామివారి భోగముల నిమిత్తం భక్తితో సమర్పిం చారట, మరెన్నో సువర్ణాభరణాలు భక్తిమీర చేయించారట. చైత్రమాసంలో రథోత్స వాదులు జరుగుతాయి. విశాఖనుండి నేరుగా కొండమీదికి బస్సులున్నాయి. వుండ టానికి కొండమీద చందన రెస్టు హౌస్, A.P.T.T.D.C. వారి కాటేజీలు, దేవస్థానం కాటేజీలు, జిల్లా పరిషత్తువారి గెస్టుహోమ్ మొదలయినవి ఉన్నాయి. ప్రకృతి రమణీ యంగా కన్నులు పండువుగా కనబడుతూంది. స్వామి దర్శనార్థం ప్రతిరోజూ భక్తులు యాత్రికులు కోకొల్లలు వస్తూనే వుంటారు. ఎప్పుడూ జనసందోహంతోటి కిటకిట లాడుతూంటుంది.

## మాచ్ఖండ్ - డుడుమా జలపాతం

విశాఖపట్నం నించి గుణుపురం చేరాలి. అక్కడనుండి బస్సులో ఈ జలపాతం చేరవచ్చు. ఇక్కడ సమీపంలోనే మాచ్ఖండ్ విద్యుదుత్పాదక కేంద్రం చూడగలము. మాచ్ఖండ్ దాదాపు అరకులోయకు సింహద్వారం అని చెప్పకోవచ్చు. మాచ్ఖండ్‌ను దర్శించిన తదుపరి అరకులోయలో ప్రవేశించవచ్చు. అరకులోయ అందాలు ప్రకృతి సోయగాలు కడురమణీయంగా ఉంటుంది. ఎత్తైన పర్వతాలతో చూడటానికి రెండు కళ్ళు చాలవు. ఇక్కడి కమనీయమైన ప్రకృతి దృశ్యాలు చూడటానికి అనేకమంది యాత్రికులు వస్తుంటారు. కొన్ని కమనీయ దృశ్యాలు, ఎత్తైన పర్వతాలు, అగాధమైన లోయలు వళ్ళు గగుర్పొడిచే దృశ్యాలున్నందున కొన్ని రకాల సినిమా షూటింగులు జరగటం కూడా కద్దు. అరకువేలి సముద్రమట్టానికి 975 కి మీటర్లుంటుంది. ఇక్కడ

అనేక గిరిజన జాతులు స్థిరనివాసం చేసికొని ఉన్నాయి. అడవితల్లి ఒళ్లో హాయిగా జీవనం వెళ్ళబుచ్చుతున్న ఈ జాతులు ముఖ్యంగా సవర, గదబ జాతులవారు. వీరి ఆచార వ్యవహారాలు నాగరికుల కంటే భిన్నంగా వుంటాయి. అయితే వీరి అమాయకత్వాన్ని ఆసరాగా దీసికొని పట్నవాసపువారు అనేక విధాలుగా వీరిని దోపిడీ చేస్తున్నారు. ఇటీవలి మన ప్రభుత్వాలు చొరవ తీసుకొని ఎన్ని పథకాలు అమలులో పెడుతున్నా అవి వీరిదాకా చేరనీయకుండా మధ్య దళారులు మింగుతున్నారు. ఇది చాలా శోచనీయమైన పరిస్థితి. మానవతా వాదులు మరింత శ్రద్ధ కనబరచవలసిన విషయాలు.

విశాఖపట్నానికి 127 కి.మీ. దూరం వున్న ఈ అందాల పసందులలో విడిది చేయటానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ టూరిజం & ట్రావెల్ డెవలెప్‌మెంటు కార్పోరేషను వారు ఏర్పరిచిన టూరిస్టు రెస్ట్ హౌస్, పి.డబ్ల్యు.డి. ఇన్‌స్పెక్షను బంగళాలు మాత్రం వున్నాయి.

## వి జ య న గ ర ం

ఇక్కడ రాయపూర్ వెళ్ళటానికి బండి మారవలసిన కూడలి. ఇక్కడ విజయనగరం సంస్థానాధీశుల పురాతనపు కోటలోగల రాజభవనాలు చూడదగినవి. ఈ రాజుల దాతృత్వంతో అనేక లలితకళలు అభివృద్ధి చెందాయి. సుప్రసిద్ధ వయోలిన్ విద్వాంసులు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారు మొదలుకొని అనేకమంది గాయక కళాకారులు ఈ సంస్థాన సంగీత కళాశాల నుండి వచ్చిన వారవటం గమనార్హం.

## బొ బ్బి లి

విజయనగరం నుండి 60 కి. మీటర్లలో బొబ్బిలి స్టేషనుంది. ఇదే తెలుగు వీరుల శౌర్యప్రతాప గాథలకు పుట్టినిల్లు. తాండ్రపాపయ్య తళత్తళల బాకు తెగమెరిసి శౌర్య ప్రతాపాల చరిత్రను సృష్టించిన వీ ప్రదేశమే. తెలుగువారి చరిత్రలో చిరస్థాయిగా నిల్చి వీరగాథలకు హారతులద్దిన సోయగాలు నిండి నిబిడీకృతమైన చారిత్రక సత్యాలను చాటుతూ ఇంకా ప్రాచీన శిథిలాలు అక్కడే వున్నాయి. మధ్య యుగాలనాటి హిందూ మహ్మదీయుల సంప్రదాయాల మేళవింపునకు చక్కటి ఉదాహరణగా నిలిచిందిక్కడి శ్రీవేణుగోపాలస్వామి ఆలయం.

వుండటానికి – P.W.D. గెస్టుహౌసు వుంది.

# అరసవిల్లి

శ్రీకాకుళం రోడ్డు స్టేషనులోదిగి శ్రీకాకుళం నుండి 3 కి.మీ. దూరంలోనున్న గాయత్రీ మంత్రాధీశుడైన సూర్యనారాయణస్వామి ఆలయం చూడదగినది. ఇది దేశం మొత్తంలోగల అతికొద్ది సూర్యదేవాలయాల్లో ఒకటి. ఈ క్షేత్రం పేరు హర్ష వలియట. అది క్రమముగా అరసవిల్లి అయిందని విజ్ఞుల అభిప్రాయం. శ్రీకాకుళం ఉత్తరంగా వంశధారా నదీ తరంలో వున్న ముఖలింగేశ్వరాలయము కూడా చూద దగినది. ఈ క్షేత్రంలోని శివుడు కోటిలింగాలలో వుండి ముఖలింగేశ్వరస్వామిగా ప్రసిద్ధి చెందాడు.

# శ్రీ కూర్మం

శ్రీకాకుళంకి దగ్గరలోనే శ్రీ కూర్మనాథస్వామి ఆలయం దర్శించ దగినది. ఇందుకు తోడు శ్రీ రామానుజాచార్యులు, శ్రీ వరదరాజస్వామి, శ్రీ మధ్వాచార్యులు, శ్రీ కోదండరామస్వామి ఆలయాలు కూడా ఉన్నాయి. అయితే శ్రీ కూర్మావతారము విష్ణ్వంశదశావతారాల్లో ఒకటయి మొదటి ఇది శివక్షేత్రంగా వెలసిఉన్నా శ్రీరామానునాజాచార్యులు వారివలన ఇదివైష్ణవక్షేత్రంగాను, దివ్యప్రదేశంగాను మలచారని చెప్తున్నారు. ఆలయం అతి ప్రాచీనమయినది చుట్టూ మండపాదుల స్తంభాలమీది శిల్ప చాతుర్యం వేనోళ్ళ కొనియాడ దగినది. గోపురాలమీద కూడ విశాలమైన స్థల మున్నది. ఇక్కడ అనేక పుష్కరిణిలు కూడా వున్నాయి.

ఇక ఇక్కడినుండి ఉత్తర సరిహద్దు రాష్ట్రమయి, పొరుగునేఉన్న ఒరిస్సాలో కాలు పెడుతున్నట్లే. అలా వెళ్ళబోయే ముందు 'మహేంద్రగిరి' ఒక్కసారి చూచి పోదాము. ఇది ఒక ఎత్తయిన పర్వతం. సుమారు 1,600 మీటర్లు ఎత్తుంటుంది. బంగాళాఖాత సముద్రతీరానికి 25 కి.మీ. దూరంలో వున్నది. ఇచటనే పరశురాముడు తపస్సు చేశాడట. మన రామాయణ, మహాభారతాల్లో ఈ పర్వత ప్రసక్తి వుంది. ఇక్కడ పురాతనమైన శాసనాలు కూడా కొన్ని దొరికాయి. ఇక్కడ ముఖ్యంగా పాండవులయిన భీమాలయము, యుధిష్ఠిరాలయము, గోకర్ణేశ్వరాయము చూడదగినవి.

ఇక బహుముఖంగా ప్రఖ్యాతి చెందిన ఒరిస్సా రాష్ట్రానికి వెళ్దాము. ఇది

ఆంధ్రప్రదేశ్‌కి ఉత్తరతీరాల కలకత్తా పోయే మార్గంలో, ఈశాన్య మార్గానికి విస్తరించుకొని పోయి పశ్చిమ బెంగాల్‌కి తీసికెళ్తుంది.

యాత్రికులకు ముఖ్య గమనిక :

స్వరాష్ట్రంలోని వారయితే ఫరవాలేదు- ఎందుకంటే వాతావరణ మార్పులు వగయిరాల్తో పూర్తి పరిచయం వుంటుందీ గనుక. ఇతరచోట్లనించి వచ్చే వారయితే ముఖ్యంగా జూన్‌మధ్య నుండి లేక జూలై మొదటినుండి ఆగస్టు, సెప్టెంబరుల వరకు ఋతుపవనాల ప్రభావం ఒకప్రక్క, అల్పపీడనాలవల్ల మరోవంక వర్షావృతమై యుండి, కృష్ణా, గోదావరి నదులకు వరదలు వచ్చేస్తుంటాయి గనుక ఈ సమయంలో రాకపోకలకు రోడ్డు, రైలుమార్గాలు అంతగా అనుకూలించవు. కనుక ఈ రెండు మాసాలు తప్పించి ముందుగాని, తరువాతగాని రాష్ట్ర సందర్శనం బాగా అనుకూలంగా వుంటుంది. నవంబరు నుంచి జూన్‌వరకు ప్రకృతి ఆహ్లాదంగా వుంటుంది. ముఖ్యంగా నవంబరు నుండి ఫిబ్రవరి, మార్చి లోపులయితే భూమి అంతా పచ్చటి చేలతో నయనానందకరంగా వుంటుంది. తనువు పులకించే వింత సోయగాలు సంతరించుకుని వుంటుం దీ ప్రదేశం అంతా.



# ఒరిస్సా



## ప్రస్తుత రాష్ట్ర ఉనికి :

తూర్పున బంగాళాఖాత తీరప్రాంతంలో ఉన్న ఈ రాష్ట్రానికి ఉత్తరాన బీహారు, ఈశాన్యంగా వెస్టు బెంగాల్, తూర్పున బంగాళాఖాత సముద్రం, ఆగ్నేయ దిశగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు సరిహద్దు రాష్ట్రాలుగా ఆవరించబడియున్న ప్రదేశం. ముచ్చటగా మూడు ముఖ్య నదులు- మహానది, బ్రహ్మణి, వైతరణి. మరెన్నో చిన్ననదులు ఈ ప్రవాహంలో జలసంపన్నం చేస్తున్నాయి. మూడు మహాసరస్సులు పేర్కొన దగినవి. మొదటిగా చిల్కాసరస్సు, రెండవది అన్సుప, మూడవదిగా సారా సరస్సులు. వీనిలో చిల్కా సరస్సు ఆసియా ఖండంలోనే పెద్దదిగా చెప్పుకోవచ్చు. అసలు ఇది బంగాళాఖాతంలో ఒకభాగం. అయితే మధ్యలో ఏర్పడిన ఇసుక మేటలు పర్వతాలుగా ఏర్పడి సముద్రం నించి వేరుచేయబడుతూ 64 కి.మీ. పొడవు, 20 కి. మీ. వెడల్పుగల మహా సరస్సుగా ఏర్పడింది.

ఒరిస్సా మహాభారతాది పురాణాల్లో కళింగరాజ్యంగా పేర్కొన బడింది. అయితే ఇక్కడవున్న ప్రాచీన అవశేషాలవల్ల క్రొత్తరాతియుగం మానవులు కొన్ని జాతులున్నట్లుగా కనుగొనబడింది. వీటిలో ఆఖరిజాతి- జువాంగ్ జాతిగా పేర్కొన బడింది.

పురాణేతిహాసాల్లో వివరించిన వర్ణనలు ప్రకారం అయితే ఈ ప్రదేశం మౌని

శేషులవాసమైన పవిత్రస్థలంగా కీర్తించబడింది. ఇటువంటి పవిత్రస్థలానికి విమలమైన చరిత్ర వుంది.

## రాష్ట్ర వైశాల్యం :

1,55,707 చ. కి.మీ.

## జనాభా :

2,63,70,000 పైమాట.

## మాతృభాష :

ఒరియా.

## అక్షరాస్యత :

34.12%.

## శీతోష్ణస్థితి :

సమ శీతోష్ణస్థితి.

## సంగ్రహంగా రాష్ట్ర చరిత్ర :

ప్రాచీనకాలంలో కళింగరాజ్యంగా పేర్కొనబడింది. మహాసామ్రాజ్య నిర్మాతలు, మౌర్య చక్రవర్తులు సైతం కళింగుల్ని జయించలేక పోయారు. కాని క్రీ. పూర్వం 268 సంవత్సరంలో చండ ప్రచండుడైన అశోక చక్రవర్తి కళింగుల్ని జయించటానికి మహాభీకరమైన పోరు సాగించి యుద్ధంచేసి జయించ గలిగాడు. కాని ఆయుద్ధంలో జరిగిన బీభత్సకాండ, పారిన రక్తపుటేరులు చూసిన అశోకుని మనస్సు చెదిరింది. చరిత్రలో కళింగయుద్ధానికి ఒక ప్రత్యేక ప్రయోజనం, ప్రతిపత్తిని సాధించి పెట్టింది. ఈ యుద్ధ కారణంగా చండప్రచండుడై, అరివీర భయంకరుడైన కరుడు గట్టిన సామ్రాజ్యవాదిని సైతం కదిలించి శాంతిమార్గంవైపు పయనింప చేసింది. యుద్ధంలో 1 లక్షమంది సైనికులు హతులయ్యారు. కళింగ సామ్రాజ్యం వల్లకాడుగా మారింది. ఆ యుద్ధం కారణంగానే అశోకుని శాంతిని, జీవ కారుణ్యాన్ని ప్రేరేపించే బౌద్ధమతంవైపు మరలింపజేసి శమదమాదుల కాలవాలమైన కారుణ్యమూర్తి ధర్మ ప్రభువు అశోకునిగా చరిత్రలో ఒక ఉన్నతస్థానం పొందటానికి దోహదపడింది. బౌద్ధ

మతాన్ని స్వీకరించి, అహింసా మార్గమును ప్రచారంచేసిన మహాచక్రవర్తి నిర్మించిన బౌద్ధస్థూపాల్లోని అశోకుని ధర్మచక్రం మన జాతీయ పతాకంమీద చోటు చేసుకుని అజరామర కీర్తి ప్రతిష్ఠలకు ఆలవాలమయింది.

అశోకుని మరణం తరువాత కళింగసామ్రాజ్యం మరల స్వతంత్రం పొందింది. ఒక శతాబ్దంలోనే మరల కళింగరాజ్యం శక్తివంతమైనదిగా రూపొందింది. ఈ ఘనత రాజాధిరాజు ఖరవేలునికి దక్కుతుంది. ఈతని పరిపాలనలో సుస్థిరతను సాధించుకున్న కళింగ సామ్రాజ్యం ఖరవేలుని మరణానంతరం మళ్ళా కకావికలై పూర్వస్థితికి చేరుకొని ముక్కలై పోయింది. క్రీ.శ. 4వ శతాబ్దంలో సముద్రగుప్తుడు మగధ నుంచి దండెత్తి వచ్చి ఎదిరించి నిలచిన 5 గురు రాజులను జయించి మగధ సామ్రాజ్యంలో కలిపి సామంతులుగా చేసి కొన్నారు. క్రీ.శ. 610లో శశాంకుడు, తరువాత హర్షుడు పరిపాలించారు.

7వ శతాబ్దంలో తిరిగి శక్తిని పుంజుకుని పునరుజ్జీవనం పొంది స్వతంత్రమైన ఈ ప్రదేశం కళింగరాజుల వశమైంది. పరిపాలన కళింగ గాంగవంశము స్థాపించింది. గాంగవంశజుడైన కెంరవ మహాశివ గుప్తయయాతి సింహాసనాన్నధిష్ఠించిన పిదప ఈ ప్రదేశచరిత్రలో ఒక తేజోవంతమయిన వెలుగు సొరికలు చోటుచేసుకున్నాయి. కళింగ, కెన్గోధ, ఉత్కళ, కోసల దేశాలన్నిటినీ ఏకంచేసి ఒకే గొడుగు క్రిందకు తీసుకుని వచ్చాడు. పూరీలోని జగన్నాధాలయాన్ని ఈయనే నిర్మించారని చెప్పకొంటారు. ఈ వంశపు రాజుల కాలంలోనే ఒరిస్సా పరిపూర్ణమైన అభివృద్ధి పథం వరవైపు సాగిందని చరిత్ర చెప్తుంది. నరసింహదేవ్ నృపతి అతిలోక ప్రసిద్ధిచెందిన కళాఖండమైన కోణార్క దేవాలయాన్ని నిర్మించారు.

14వ శతాబ్దం నుండి 1592 వరకు మహమ్మదీయుల పాలనలో వున్నది. మొగలుల పతనం తరువాత మహారాష్ట్రీలు ఆక్రమించారు. 1803లో బ్రిటిష్ పాలన క్రిందకు వచ్చేంతవరకు మహారాష్ట్రీల పాలనలోనే ఉంది.

1936లో ఒరిస్సా ప్రత్యేక పరగణాగా ఏర్పరచబడింది. స్వతంత్రం వచ్చిన తరువాత ఇండియన్ యూనియన్ ఏకీకరణలో భాగంగా 1949లో సమైక్యభారతంలో విలీనం చేయబడింది.

స్వతంత్ర భారతంలో ఒక భాగమైన ఈ ఒరిస్సా రాష్ట్రం మొత్తం 13 జిల్లాలుగా విభజించబడి ఉత్తర మధ్య, దక్షిణ రెవిన్యూ డివిజనులుగా ఏర్పాటు చేయబడింది.

బలేశ్వర్, పూల్‌బని, బాలంగిర్, కటక్. ఢెంకనాల్, గంజాము, కలాహంది, కెందుఝార్, కోరాపుట్, మయూర్‌భంజ్, పూరి, సంబల్‌పూర్, సుందర్‌ఘడ్ అనేవి జిల్లాలు.

రాష్ట్రం మొత్తం సమశీతోష్ణ మండలంలో ఇమిడివున్నా కొన్ని మాత్రం ఇందుకు విరుద్ధంగా ఉన్నాయి సహజమైన పర్వతారణ్యాలతో విలసిల్లే ఈ రాష్ట్రం ప్రజలు చాలావరకు షెడ్యూల్డు కులాలు, తెగలు, గిరిజనజాతులు గణనీయమైన సంఖ్యలో వున్నారు. సుమారు మూడుకోట్ల జనాభాలో మూడవవంతు వరకువున్నారు. బొలాంగిర్, సంబల్‌పూర్ జిల్లాలు విరుద్ధ సమశీతోష్ణ స్థితుల ప్రదేశాలకు ప్రతీకలుగా నిలుస్తాయి. అయితే ఎడారులు మాత్రం లేవు.

రాష్ట్ర ప్రజల ముఖ్య జీవనోపాధి - వ్యవసాయం.

సాధారణంగా రాష్ట్ర ఆర్థికస్థితిని, ప్రజాజీవన సరళిని ప్రకృతిలో సంభవించే వైపరీత్యాలు- తుఫానులు, అతివృష్టి, అనావృష్టి, ఉప్పెనలు చాలవరకు దెబ్బ తీస్తుంటాయి. దాదాపు 76% ప్రజలు కేవలం వ్యవసాయం మీద ఆధారం. ముఖ్య పంటలు వరి, పప్పుధాన్యాలు, నార, చెరకు, కొబ్బరి, నూనెగింజలు, పసుపు మొదలైనవి. ఈ రాష్ట్రంలో దేశం మొత్తంలో పండే వరి పంటలో సుమారు 10 శాతం ఇక్కడ పండుతుంది.

రాష్ట్రం విస్తృతమైన ఖనిజసంపద, అటవీ సంపదలతో అలరారుతూ పరిశ్రమల స్థాపనకెంతో సహాయకారిగా ఉంటుంది. సమృద్ధమైన వనరులు కూడా ఉన్నాయి. ముఖ్యంగా రూర్కెలా స్టీల్‌ప్లాంట్, రాత్రపూర్‌లోని సోడ్ కాంప్లెక్సు, తల్చేరులోని వాటర్ ప్రాజెక్టు, అల్యూమినియం స్మెల్టర్, రైల్వేకోచ్ రిపేరు వర్క్‌షాపు మంచేశ్వర్‌లోను, అల్యూమినియం కాంప్లెక్సు కోరాపుట్‌లోను, పారదీప్ ఎరువుల కర్మాగారం మొదలైన భారీపరిశ్రమలతో తోడు చిన్నతరహా మధ్యతరహా పరిశ్రమలు 170పైగా అమరివున్నాయి.

ఒరిస్సా పెద్దపెద్ద దేవాలయాలకు కాణాచి. ఇది దేవతలగృహంగా అభివర్ణించవచ్చు. హైందవాయ్యల శిల్ప సంప్రదాయాలు విశుద్ధంగా సంకరంకాకుండా స్పష్టంగా కానవస్తాయి.

పూర్వకాలంలో ప్రస్తుత రాజధానియైన భువనేశ్వర్ మరియు కటక్, పూరీ, ఒరియా రాజ్యాల వివిధ కాలాల్లోని ముఖ్య పట్టణాలు.

ఈ గడ్డమీద మొట్టమొదట కాలుపెట్టిన పాశ్చాత్యులు పోర్చుగీసు వారు. తరువాత డచ్చివారు తరువాత 19వ శతాబ్దపు తొలిభాగంలో బ్రిటిషువారు వశపరచు కున్నారు

ఒరిస్సాలో చూడదగిన యాత్రిక కేంద్రాలు :

ఇక్కడ ఒకనాడు జైన, బౌద్ధ మతాలు సరిసమానంగా వర్ధిల్లాయి. ఆనాది సంస్కృత సంప్రదాయాలు, హైందవార్య శిల్పరీతులు ప్రత్యక్షంగా కానవస్తాయి.

7వ శతాబ్దంలో చైనా యాత్రికుడు హ్యూయాన్‌సాంగ్ ఈ ప్రదేశాన్ని సందర్శించాడు.

ముఖ్యంగా చూడదగిన నగరాలు :

భువనేశ్వర్ :

చుట్టు ప్రక్కగల ధావులి, ఖాండగిరి, ఉదయగిరి గుహలు, శిరుపాతగర్, నందన్‌కావన్- సోరోన్ లేక వరాహక్షేత్రం.

పూరి_పరిసరాలు :

స్వర్గ ద్వారము- గుండేచ ఆలయం, ఇంద్రద్యుమ్న సరస్సు, నరేంద్ర సరస్సు, లోకనాథ ఆలయం, సోనార్ గౌరాంగా ఆలయాలు, దగ్గరలోనే ఉన్న సాక్షి గోపాల్ ఆలయం.

కటక్_పరిసరాలు :

రత్నగిరి, లలితగిరి, ఉదయగిరి.

బౌద్ధ గ్రామాలు :

మణిబంధ, సువాపట్నం, టికార్‌పార, చిల్కా సరస్సు.

గోపాల్‌పూర్ :

సముద్రతీరం, వేసవి కేంద్రం-ఆహటకేశ్వర దేవాలయము, ఖుర్దారోడ్డు దగ్గిరవున్న 'బాఘదూర్' అనే గ్రామంలో వున్న 'తప్తపాని' అనే వేడినీటి ఉష్ణ కుండం.

కోణార్క్ :

సూర్య దేవాలయం.

సంబల్ పూర్ జిల్లాలోని :

ఉషాకోటి వైల్డ్‌లైఫ్ శాంక్చురీ.

హీరాకుడ్ —ఆనకట్ట :

సంబల్‌పూర్ నుండి 16 కి.మీ. దూరంలో ప్రపంచం మొత్తంమీదనే అతి పొడవైన ఆనకట్టగా పేర్కొనబడింది. ఇక్కడ ఏర్పడిన మానవ నిర్మిత సరస్సు 964 చ.కి. మీటర్లు విస్తీర్ణం వుంది. ఆసియాలోకెల్ల పెద్ద జలాశయంగా మన్నన లందుకున్నది.

వైతరణీ నదితీరంలో అమరియున్న జాజ్‌పూర్:

# భు వ నే శ్వ ర్

పూరి, భువనేశ్వర్, కోణార్క్ ఈ మూడు ప్రదేశాలు ఒరిస్సా రాష్ట్రంలో ఒక చక్కని త్రిభుజాకార వలయంగా అమరివున్నాయి.

భువనేశ్వర్ మద్రాసు-కలకత్తా మెయిన్ రైల్వేలైనులో వున్నది.

ఆంధ్రప్రదేశ నించి వెళ్ళేవారు మద్రాసు-హౌరా లైనులో ప్రయాణిస్తూ శ్రీకాకుళం వద్దనున్న శ్రీకూర్మం వగైరా క్షేత్రాలు సందర్శించి మరల రైలెక్కి బర్హాంపూర్ స్టేషనులో దిగినయెడల అక్కడికి దగ్గిరలో ఉన్న గోపాల్‌పూర్ సముద్రపు వేసవి విడిదిగా చూడవచ్చును.

# గో పా ల్ పూ ర్

గంజాము జిల్లాలో వున్నది గోపాల్‌పూర్. మద్రాసు కలకత్తా మెయిన్ లైనులో బర్హాంపూరు స్టేషను దగ్గర దిగి బస్సులో వెళ్ళవచ్చును. చక్కటి సముద్ర తీరం. మంచి వేసవి విడిది. బర్హాంపురానికి సుమారు 18 కి.మీ. ఉంటుంది. ఇక్కడి నుండి విహారయాత్రగా 'తప్తపాని' అనే వేడినేటి ఉష్ణ కుండమునకు వెళ్ళవచ్చును. దారి పొడుగునా ప్రకృతి విశృంఖలంగా పరచిన అందాల సుమసౌరభాన్ని ఆస్వాదిస్తూ పర్వతారణ్యాల మధ్యగా ప్రయాణం సాగుతుంది. మరింకో విశేషం ఏమిటంటే

ఈ ఉష్ణకుండం ఉండే వూరు బాలీదూర్ ఖుర్దారోడ్ స్టేషనుకు అతి సమీపంలోకి చేరుస్తుంది. గోపాల్‌పూర్ నుండి 'తప్తపాని'కి 45 కి.మీ. మాత్రం ఉంటుంది—ఇక్కడే ఆహుటేశ్వరాలయం కూడా వుంది. గోపాల్‌పూర్‌లో వుండటానికి మాన్యులకూ, సామాన్యులకూ అందుబాటులో వున్న వసతి సౌకర్యాలు కూడా బాగా అమరి ఉన్నాయి-వేసవి విడిది గనుక.

అన్నిటికంటే ఖరీదైన హోటలు-ఒబెరాయ్ పామ్‌బీచ్ హోటలు. దీనికితోడు మధ్య మార్గంలో వుండే హోటల్ సీ బ్రీజ్, హోటల్ హాలీడే హోమ్ లాంటివి—మోటెల్ మెర్మెయిడ్ మరొకటి బాగా ఉండేవాటిలో ఒకటి.

యూత్‌హాస్టలు, బ్రోక్సహామ్ హౌస్ టూరిస్టు బాడ్జిల్లో చౌకలో దొరుకుతాయి రూములు.

అక్కడి నుండి ఖుర్దారోడ్ స్టేషను చేరి అక్కడి నుండి పూరీ, కోణార్క దేవాలయములను దర్శించ వచ్చును.

# పూ రి

ఆంధ్రప్రదేశ్ నుండి బయలుదేరి వెళ్ళే వారికి ప్రత్యేకంగా తిరుపతి—పూరి ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కి నేరుగా పూరి చేరవచ్చును. లేదా నేరుగా ఎన్నో రైళ్ళు గలిగిన మద్రాసు-కలకత్తా మయిను రైసులో మొదట భువనేశ్వర్ చేరి అక్కడి నుండి వసతిగా సౌకర్యంగా చూసుకుని రైలెక్కి వచ్చు. అదీగాక అనేక బస్సులు కూడా లభ్యమవుతాయి.

పూరి బంగాళాఖాతం తీరములో వున్న ఒక పట్టణం. శక్తి పీఠములలో ఇది 17వది. ఇక్కడ వేంచేసియున్న శ్రీ జగన్నాథస్వామి దర్శనం కోరి వచ్చినవారు జాతి, కుల, మత భేధాలు లేకుండా ఆరాధించి స్వామి ప్రసాదాన్ని స్వీకరిస్తారు. ఇక్కడి అమ్మవారు విమలాదేవి.

శ్రీ జగన్నాధాలయము హైందవులందరికి దర్శనీయం. జగన్నాధాలయం చుట్టూ నగరం నిర్మాణం జరిగివున్నది.

ఒకానొకప్పుడు ఈ ప్రదేశాన్ని సందర్శించటానికి ప్రజలు తండోపతండాలుగా కొన్ని వందల మైళ్ళ నుండి అనేక వ్యయ ప్రయాసలకోర్చి కూడా దుర్గమ

పర్వతారణ్యాలను, పొంగి పారే నదుల్ని దాటుకుంటూ ఉత్సాహంగా వచ్చేవారు యాత్రాగమనాభిలాషులయి వస్తుండేవారు. కానిఇప్పుడా శ్రమేం అక్కరలేదు. దేశంలో అతి పవిత్రస్థలాల్లో ఒకటిగా పరిగణించబడుతోంది. అనేక పురాణాల్లోపుస్తకాల్లో మత గ్రంధాల్లో ఈ దేవాలయం యొక్క, ఇందున్న శ్రీ జగన్నాథస్వామి మహాత్యాన్ని గురించి ప్రశంసిస్తూ ఉటంకించబడింది. శ్రీ జగన్నాధునికి తోడుగా ఈ ఆలయంలో స్వామివారికి అన్నగారైన బలరాముడు, చెల్లెలు సుభద్ర విగ్రహాలు ఈ బ్రహ్మాండమైన దేవాలయంలో ప్రతిష్టించబడినవి. ఎత్తు సుమారు 214 అ. వుంటుంది. దీనిని మొదట 8వ శతాబ్దం చివరన ఏలిన గాంగ వంశపు రాజు రెండవ మహాశివ గుప్త యయాతి కట్టించాడని ప్రతీతి. కాని కొంతమంది చరిత్ర కారుల నిర్ణయం ప్రకారం 12వ శతాబ్దంలో ఇదే వంశావళికి చెందిన చోడ గంగదేవ నిర్మించాడని చెప్పు కొంటారు.

మొత్తం మీద ఈ దేవాలయ నిర్మాణం ఎలా జరిగింది అనే దానికి ఒకకధ ప్రచారంలో వుంది.

ఇందు ఆలయంలో ప్రతిష్ఠించబడిన విగ్రహాలు అంతకు ముందు నుండే వున్నాయి. ఎప్పటివో. మొట్టమొదట ఈ ఆలయ నిర్మాణం ఇంద్ర ద్యుమ్న మహా రాజు నిర్మించాడని అంటారు. ఆయనకు స్వామివారి వునికి విస్పష్టంగా ఎక్కడో వున్నట్లు అనిపించడం మొదలు పెట్టింది. అక్కడ దగ్గరలోనే ఎక్కడో నివాసం ఏర్పరుచుకుని వుంటాడనే భావంతో కనుక్కోవటానికి కొంతమందిని వినియోగిం చాడు. వారిలో ఒకరు విద్యాపతి అనే యువ బ్రాహ్మణుడు. ఆయన అన్వేషణలో కొన్నాళ్ళు ఒక తెగకు రాజైన విశ్వావసు వద్ద అడవిలో అతిథిగా వున్నాడు. విశ్వా వసుకు లలిత అనే అందమైన కుమార్తె ఉంది. విద్యాపతీ, లలిత ప్రేమించుకుని దగ్గర య్యారు. ఫలితంగా వారిద్దరికి వివాహం కూడా అయింది. కొంత కాలానికి విశ్వావసు రహస్యంగా ఒక దేవుని ఆరాధించే విశేషం కనుగొన్నాడు విద్యాపతి. భార్య లలిత ద్వారా ఆ గుహను కనుక్కోగలిగి అక్కడికి చేరాడు విద్యాపతి ఆ గుహలోచేరి భగవానుని చూసేటప్పటికి ఇన్నేళ్ళ తన అన్వేషణ ఫలించినట్లు, ఆ దేవదేవుని అక్కడే కనుగొన్నట్లుగా ఆతనికి స్ఫురించింది. తన అన్వేషణ పూర్తయింది. ఒకా నొక రోజు ఆ మూర్తిని దొంగిలించి పరారయి పూరీ చేరాడు.

తరువాత ఇది రాజాజ్ఞ ప్రకారం జరిగిందని ఇంద్రద్యుమ్న మహారాజే విశ్వా

వసునికి క్షమాపణ చెప్పుకున్నాడు. మూర్తిని అతను కట్టించిన ఆలయంలో ప్రతిష్ఠించటానికి విశ్వావసు కూడా ఒప్పుకొన్నాడు. కాని స్వామి స్వప్నంలో కనిపించి తన మూర్తి వేరు విధంగా కొయ్యలో మలచమని ఆనతిచ్చాడు. విగ్రహాన్ని మలచటానికి ఒక వృద్ధమూర్తి తనంత తానుగా రాజ సమ్ముఖానికి వచ్చాడు. కలలో స్వామివారు సెలవిచ్చిన శిల్పరూపం ఆయనలో చూచి రాజు ఒప్పుకున్నాడు. అయితే ఒక షరతు పెట్టాడు వృద్ధమూర్తి— ఒక గది తలుపులుమూసి తను తెరవమనేంతవరకూ తెరిచి చూడకూడదనే నియమం విధించాడు శిల్పి. అందుకు ఒప్పుకున్నారు.

కొన్నాళ్ళ తరువాత ఇంద్రద్యుమ్న మహారాజు గారి పట్టమహిషి రాణి గుండీచ ఓర్పు వహించలేక పోయింది. అసలు ఈ ముసలాయన ఏం చేస్తున్నాడు, ఎలా వున్నాడు చూడాలనే ఉత్కంఠ ఆమెను నిలవనీయలేదు. హఠాత్తుగా ఆమె తటాలున తలుపు తీసింది. శిల్పి అదృశ్యుడయ్యాడు. అసంపూర్తిగా వదిలివేసిన విగ్రహాలు అక్కడ వున్నాయి ప్రస్తుతం ఆలయంలో మనకు కనిపించే విగ్రహ సమూనాలు అవే.

అయితే దీనిని గురించి, దీని ప్రభావం గురించి అనేక రకాలయిన కథలున్నాయి. ఆ సంగతి యాత్రికులు స్వయంగా విని ఆనందించే భాగ్యం వారికే వదిలివేస్తున్నాం.

ఆగమ, జ్యోతిష, గ్రహగతుల లెక్కల ప్రకారం ఈ మూర్తులను ఖననంచేసి అలాంటివే కొత్తవి వాటిస్థానే చేర్చటం జరుగుతుంది. అయితే జగన్నాథుని నాభిపద్మం మాత్రం పాతవాటి నుండి కొత్త విగ్రహాలకు మార్చబడుతుంది కాని తీసి వేయటం జరుగదు. మరి అందులోని మహాత్మ్యం ఏమిటి? రహస్యం। కొంతమంది చరిత్రకారుల వూహాలు, ఆలోచనల ప్రకారం ఆ నాభి పద్మంలో బుద్ధుని దంతం ఉందని చెప్తారు. కాని ఒక రకంగా చూస్తే శ్రీ జగన్నాథుడంటే దశావతారల్లోని కృష్ణుని అవతారమునకు మూల కారణమైన శ్రీ మహావిష్ణువే కదా. జగాలన్నిటికీ నాథుడు గనుక శ్రీ జగన్నాథుడుగా పేరు సార్థకంగా వుంటుంది కూడా.

అయితే ఇది హిందువులకు కుల వివక్షత లేకుండా దర్శనీయం. ఇతర మతస్థులు విశేషయాలను లోనికి రానీయరు. అటువంటివారు దగ్గరనే వున్న రఘునందన లైబ్రరీ భవనాలపై నుండి ఆలయమును చూడవచ్చు. ఆలయమంతా కనబడుతుంది.

## ఆలయ నిర్మాణ విశేషాలు :

ఆలయం చతురస్రంగా వుంది. ఒక్కొక్క భుజము సుమారు 200 మీ. ఉంటుంది. చుట్టూ వున్న ప్రహరీ గోడలు ఆరు మీటర్ల ఎత్తుంటాయి. ఈ విధంగా రెండు గోడలు ప్రహరీలుగా వున్నాయి. శంఖాకారంగా వున్న ఆలయ గోపురం గగన చుంబితంగా 58 మీ. ఎత్తుంటుంది. ఆ గోపురం మీద ఒక జండా వుంటుంది. జండామీద సుదర్శన చక్రం వుంటుంది. ఇది కొన్ని మైళ్ళ దూరం పర్యంతం కాన వస్తూ పూరీకి యాత్రికులను ఆహ్వానిస్తూన్నట్లుంటుంది. సింహద్వారం ముందు ఒక గరుడ స్తంభం వుంది. ప్రధాన ద్వారం అక్షరాల సింహద్వారం-ద్వారానికి రెండు ప్రక్కల రెండు రాతి సింహాలున్నాయి. అవి ద్వార పాలకులుగా భావించబడు తున్నాయి. మధ్యలో గర్భగుడిని జగ్‌మోహన్ అని అంటారు. గర్భగుడిలో బల భద్రుడు, జగన్నాథస్వామి-సుభద్రల విగ్రహాలను దర్శించవచ్చు. ఇద్దరన్నలకు చేతులున్నాయి. కాని మధ్యలో చిన్న విగ్రహంగా అమరివున్న సుభద్రమూర్తికి మాత్రం హస్తాలు వుండవు. ఇది ఆ అసంపూర్తిగా వదిలివేసిన దానికి తార్కాణంగా భావించవచ్చు. ఈ మూర్తులు ఆయా పర్వదినాలలో విశేషాలంకారాలతో ఒప్పుతూ ఎప్పుడూ వాడని పూలదండలతో అలంకరించబడి సాక్షాత్కరిస్తూ కనబడతాయి. ఈ ఆలయం నిర్వాహణంలో 20,000 వేల మంది తమ జీవనభృతిని పొందుతున్నా రట. ఆలయ నిర్వాహకులను, 36 శ్రేణులుగా విభజించి 97 తరగతులుగా విభజించ బడింది.

## రథయాత్ర :

పూరి జగన్నాథుని రథయాత్ర లోక ప్రసిద్ధం. ఈ ఉత్సవం ఆషాఢ మాసంలో జరుగుతుంది. ఈ రథోత్సవాన్ని చూడటానికి కొన్నిలక్షల మంది యాత్రి కులు వస్తారు. చాల విశేషంగా జరుగుతోంది. హిందూదేశంలో జరిగే గొప్ప కమ నీయమైన ఉత్సవాలలో ఒకటిగా పరిగణించబడుతుంది. ఈ రథయాత్ర శ్రీకృష్ణ భగవానుడు గోకులం నుండి మధుర యాత్రగా పరిగణించ బడుతూంది. ఆలయంలో బలభద్ర, జగన్నాథ, సుభద్రల విగ్రహాలను తెచ్చి ఈ రథమునందుపవిష్టించి రథ యాత్ర జరుపుతారు. ఆలయం ముందు నుంచి మొదలయిన ఈ రథయాత్ర ఒక కిలో మీటరు దూరంలో వున్న గుండీచ మందిరం వరకు సాగుతుంది.

జగన్నాథుని రథం 14 మీటర్ల ఎత్తుండి, 10 మీటర్ల చతురస్రంగా వుండి,

బ్రహ్మాండంగా వుంటుంది. ఆ రథానికి 16 చక్రాలుంటాయి. ఒక్కొక్క చక్రం రెండు మీటర్లు వెడల్పుగా గుండ్రంగా వుంటాయి. ఈ జగన్నాథ రథం చాలా గొప్పది. ఈ బ్రహ్మాండమైన రథచక్రాలు కాలచక్రంతో పోలుస్తారు. ఏది ఎలా వున్నా రథం మాత్రం ఆగటానికి వీలులేదు. కొంత మంది భక్తులు స్వామివారి రథ చక్రాలు క్రింద ఆత్మార్పణ చేసికొంటే మోక్షప్రదమని భావించి ఆ చక్రాల క్రింద ఆత్మార్పణ చేసికోవటం కూడా కద్దు. ఈ రథాన్ని లాగటానికి బలిష్ఠులయిన 4000 మంది యోధానయోధులు వృత్తి పరంగా వున్నారు. ఈ బ్రహ్మాండమైన దృశ్యాన్ని తిలకించటానికి దేశం నలుమూలలనుండి యాత్రికులు వస్తారు. ఒకసారి కదిలిన ఈ బ్రహ్మాండ రథం ఆపటానికి ఎవరికీ శక్తి చాలదు। గమ్యం చేరాక ఒక వారం రోజులు అక్కడ విశ్రాంతి నిస్తారు. తరువాత మరల జగన్నాధాలయానికి చేరుస్తారు. ఆ తరువాత ఆ రథాన్ని విరిచివేస్తారు. మరుసటి సంవత్సరానికి కొత్త రథం కావాల్సిందే। సంవత్సరం పొడుగునా తయారు చేస్తుంటారు.

ఈ జగన్నాధాలయంలోనే అనేక మందిరాలున్నాయి. అక్కడి పండాలు మనకు అన్నీ వివరిస్తారు.

హరిదాస్ ఠాకూర్ శ్రీ చైతన్య మహాప్రభు యొక్క మహమ్మదీయ శిష్యుడు. సముద్ర తీరంలో ఈయన సమాధి ఉంది. కొత్త గౌడియా మఠము, పూరీ శంకరాచార్యుల మఠము, నీలాచలాశ్రమం (చటక్‌పార్.) శ్రీబాగ్ బజారు, గౌడియా మఠము, తోట గోపీనాథాలయము, స్వర్గద్వార్, సిద్ధ బకుల్, శ్రీగంభీర్, శ్రీగంగా మఠము, సేతుగంగ, శ్రీజగన్నాధవల్లభ మఠం, శ్రీగుండీచా మందిరం, చక్ర తీర్థము, శ్రీరామకృష్ణ మఠము మొదలయినవి.

ఇక్కడే పంచ తీర్థాలున్నాయి. ఆలయంలోనే బలేకృష్ణ, రోహిణి తీర్థాలు అమరి ఉన్నాయి. ఇక్కడికి దగ్గరలోనే మార్కండేయ తీర్థం వుంది. సుమారు అర కిలో మీటరుంటుంది. మహోదధి అనబడే స్వర్గద్వార్ సముద్ర తీరంలో వున్నది. ఇంద్రద్యుమ్న తీర్థం, పిటికితోడు నరేంద్ర తీర్థము అనే స్వచ్ఛ జలాలతో అలరారియున్నవి. దీనిలో తప్పకుండా స్నానం చేస్తే మంచిది.

**సముద్ర తీరంలో ఉన్న పూరి పట్టణాలలో ఆహారవిహారాలకు :**

తూర్పు విభాగంలో సముద్రపు ఒడ్డునే చక్రతీర్థ రోడ్‌లో ఉత్తమ మధ్యమ రక హోటళ్ళున్నాయి. విడిది చేయవచ్చును.

బంగారు రంగులీనే బీచి సైకతాల్లో విహరించే విదేశీయులు స్వదేశీయులతో కళ కళలాడే బీచ్ నిజంగా నేత్ర పర్వం చేస్తుంటుంది. ఇక్కడి యాత్రికుల సంతడి సంవత్సరమంతా వుంటుంది. ఇక్కడి జాలరులు తమాషాఅయిన శంఖాకారపు టోపీలతో ఉవ్వెత్తున ఎగసిపడే తరంగాలలో స్నానం చేయగోరే వారికి చేదోడుగా వుండి సూచనలిస్తూ ఒంటరితనాన్ని దరి చేరనీయకుండా సాయపడుతుంటారు. మీరు లోపలికి వెళ్లి స్నానం చేస్తుంటే మీ వస్తువులకు, బట్టలకు నమ్మకంగా కాపలా కాస్తారు కూడా. మీరు మునిగిపోకుండా కాపాడే తెగువ, చొరవ చూపుతారు. తూర్పువైపున ఇంకొంచం ముందుకువస్తే సముద్రం ఎదురుగానే హోటల్ Z, శంకర్ ఇంటర్ నేషనల్ హోటల్ మరెన్నో హోటళ్ళు ఒకేచోట వున్నాయి. దీనికవతల జాలరులు నివసించే ఒక చిన్న గ్రామం కూడా వుంది. అక్కడ చెట్ల బోదెలను రెండుగా చీల్చి దొన్నెగా చేసిన బోట్లు అనేకం కనబడతాయి. అడవిలోని పెద్ద పెద్ద బోదెలు, మానులు ఈ విధంగా ఒక రకంగా చెప్పాలంటే వ్యర్థ ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారని చెప్పవచ్చు పూరీలో.

శ్రీమంతులయిన వారికి పత్నివాస టూరిస్టు బంగళా, హోటల్ విజోయ్ ఇంటర్ నేషనల్- ఎయిర్ కండిషన్డ్ రూములు, బీచిలో వున్న హోటల్ సముద్ర, బీచికి కొంచెం వెనుకగా ఉన్న మెయిన్‌రోడ్డులో సౌత్ యీస్టరన్ రైల్వే హోటలు, ఇదే రోడ్డులో ఇంకొంచెం ముందుకు సాగితే హోటల్ హాలిడే రిసార్ట్. వీటికి తోడు I.T.D.C. వారి నిర్మాణాలు నీలాచ అశోక్, హోటల్ ప్రాచిపూరి మొదలయినవి.

ఇక్కడ పై వానిలో చాలవరకు కొన్ని హోటళ్ళలో అన్నిటితో కలిపి అంటే పడక, భోజనం, టిఫిను వగైరాలన్నీ కలిసిన రేట్లుతో వుంటాయి. ఎక్కడ నచ్చితే అక్కడ వుండవచ్చు.

పూరి పాతబస్తీలో శాకాహారులకు లెక్కలేనన్ని హోటళ్ళున్నాయి.

## సాక్షిగోపాల్ ఆలయం

పూరీనుండి సుమారు 17 కి. మీటర్లుంటుంది బాలగోపాల దేవాలయము. మధ్యయుగాల నిర్మాణ కౌశలానికి ప్రతీక. ఆలయంచుట్టూ కమనీయంగా కొబ్బరితోటలతో నిండియున్న దీ ప్రదేశం. ఈ ఆలయం చుట్టూ అనేక ఇతర దేవాలయాలు కూడా

ఏర్పడ్డాయి. ఇక్కడ కృష్ణుని మనోమోహనమూర్తి అంటారు. ఇక్కడికి భువనేశ్వరం విమానాశ్రయం 67 కి.మీ. దూరం. పూరి నుండి హైదరాబాదు, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాదు, మద్రాసు, తిరుపతిలకు రైళ్ళు నడుపబడుతున్నాయి. మందిరంచుట్టూ ప్రదక్షిణం చేసిన యాత్రికులు నిజమందిరంలోని జగన్మోహన మందిరమును ప్రవేశిస్తారు. ఇక్కడ ఒక గరుడస్థంభం కూడా వుంది. ఇక్కడి నుండి శ్రీచైతన్య మహాప్రభువులు జగన్నాథస్వామి దర్శనం చేసేవారని ప్రతీతి. ప్రభువు యొక్క కన్నీటితో తడిసిన గద్దె యిక్కడున్నది.

# కోణార్క్

పూరి నుండి కోణార్క్‌కు సముద్రపు ఒడ్డునే రోడ్డు నిర్మాణం జరిగినది. నిరంతరం బస్సులు తిరుగాడుతూనే వుంటాయి. I.T.D.C. వారు కొన్ని యాత్రలను నిర్వహిస్తున్నారు.

కోణార్క్‌లోని సూర్యదేవాలయము క్రీ. శ. 13వ శతాబ్దంలో నరసింహదేవ నృపతిచేత నిర్మించబడింది. సూర్యభగవానుడు సప్తాశ్వరథారూఢుడై ఆకాశమార్గావలంబంతో గగనతలంలోకి చండప్రచండ తీక్షణవేగంతో చొచ్చుకుని పోతున్నట్లు నిర్మించబడిన ఒక గొప్ప రథాకృతి ఈ దేవాలయము. ఆ రథంలో సూర్య భగవానుడు నిలుచుని ఉంటాడు. ఈ ఆలయ శిల్పము వర్ణనాతీతము. ఆనాటి శిల్ప కళా నైపుణ్యానికి జోహారు లర్పించకుండా ఉండలేము. కాని ప్రస్తుత పరిస్థితిలో శిథిలావస్థలో ఉన్న ఆలయాన్ని చూస్తే కంటివెంట నీరు రాకమానదు. అణువణువునా అందాలను పుణికిపుచ్చుకుని శిల్పాకృతులు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. అయితే అవన్నీ శిథిల రూపాలు. అయినా ఇంకా మెచ్చుకో తగినవిగానే మన ముందు నిలుస్తున్నాయి. ఆలయపు పునాది మట్టంలో 24 గొప్ప రథచక్రాలు చెక్కబడ్డాయి. ప్రతి అంగుళం అద్భుత శిల్పవైచిత్రి. ఏడు ఉత్తమాశ్వాలు బలిష్ఠమైనవి రథాన్ని లాగుతున్నట్లుగా శిల్పీకరించబడింది. అసలు ఈ దేవాలయం పూర్తి కాలేదేమోనన్న సందేహం కూడా కలుగుతుంటుంది. పూర్తిచేయబడి నట్లయితే గోపురం 70 మీ. ఎత్తు వుండేది. పురాతత్వ శాస్త్రపరిశోధకుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తే విషయం ఏమిటంటే, ఈ ఇసుక నేలల్లో ఇంత పెద్దకట్టడం కూలకుండా నిలబడటం. 1869లో కొంత గోపుర భాగం కూలిపోయింది. ఇప్పుడు ఆ శిథిలాలను కాపాడటానికి మాత్రం చర్యలు తీసుకున్నారు.

ముఖ ద్వారం టూరిస్టు బంగ్లావైపున వున్నది. ద్వారం రెండు వైపులా రెండు సింహాలు రెండు మత్తేభాల మీదకెక్కి వాటి పీచమణస్తున్నట్లుగా మలచబడ్డాయి. ప్రవేశ ద్వారందగ్గర వసారా మాత్రం ఇంకా నిలిచేవుంది. సూర్యోదయం, మధ్యాహ్నపు మార్తాండుడు, అస్తమిస్తున్న సూర్యభగవానుడు ముచ్చటగా కానవచ్చేట్టున్నాయి. ప్రవేశద్వారంలో అమరియున్న మెట్లుచుట్టూ ఉన్న ప్రహరీకి మధ్య నట మందిరం ఒకటున్నది. దీనికి ఉత్తరంగా ఏనుగుల గుంపు- దక్షిణంగా ఒక గుర్రాల గుంపు వెనుక కాళ్ళమీద నిలుచుని మనుషుల్ని తొక్కుతున్న విధాన్ని చిత్రీకరించబడింది. ఆలయం గోడలు, పైకప్పు, గోడల క్రిందభాగం అంతా సన్నని నగిషీలతో బాటుగా ఖజురాహో శిల్ప సుందరుల మైమరిపించు శృంగార భామలు, ప్రేముడివడ పెనవేసుకున్న జంటలు, విరహార్తితో వున్న స్వైరిణిలు మొదలగు కొన్ని శృంగారోద్దీపమైన శిల్పాలు చెక్కబడివాయి.

ఆలయం ప్రాంగణంలో కాకుండా ప్రహరీ వెలుపల ఒక మ్యూజియం కూడా వున్నది. 10 గం. నుండి 5 గం.ల వరకు దర్శనీయం. అందులో ఆలయం శిధిలాలు భద్రపరచబడి వున్నాయి. 2 కి. మీటర్ల దూరంలో సముద్రం వుంది. అక్కడకి నడచి వెళ్ళవచ్చు లేదా రిక్షామీదనైన వెళ్ళవచ్చు. ఈ ఆలయమంతా నల్లగావుండేది. కాని పూరిలోని ఆలయాలన్నీ సున్నంవేసి తెల్లగా ఉంటాయి. ఒకనాడు తోవ తప్పిన నావికుల పడవలను ఆకర్షిస్తూండేదని, ఆలయమంతా కూడా నిర్మాణంలో ఎంతో ఇనుమును వాడినట్లుగా ప్రతీతి.

ఈ ఆలయ నిర్మాణ కౌశలం వెనుక కూడా కథవుంది. అయితే చాల విషాదాంతమైన దీ కథ.

సూర్యదేవాలయ నిర్మాణానికి నృసింహదేవ నృపతి 12 సంవత్సరాల కాలం వెచ్చిందాడట. 12 వందలమంది సాంకేతికులు, స్థపతులు, శిల్పులు, ఇంజనీర్లు నిరంతరం శ్రమించిన నిర్మాణం ఇది. 12 సంవత్సరాల రాజాదాయం దీనిమీద ధారపోశారట మహారాజు.

## కరిగిపోని కన్నీటి బొట్టు !

దీనికి ప్రధానశిల్పి బిషుమోహరాజా 12 సంవత్సరాల క్రితం గృహత్యాగం చేసి ఈ దేవాలయ నిర్మాణంలో ప్రధానపాత్ర వహించాడు. ఆయన కుమారుడు

ధర్మపాదుడు. ధర్మపాదుడు చిన్నతనంలోనే గృహాన్ని పరిత్యజించినందువల్ల తండ్రి ఎవరో తెలియదు. ఆయన్నెప్పుడూ చూడలేదు. ఎక్కడ వున్నాడో తెలియదు. కాని కట్టడాలు వాటి నిర్మాణపు విద్యలో నిష్ణాతుడై తండ్రిని మించినాడు. తండ్రిని కలవాలనే ఆత్రుత నానాటికీ పెరిగిపోయింది. కోణార్క్‌కు వెళ్ళాడు. తండ్రిని కలిశాడు. పుత్రుని చూచిన తండ్రీ కొడుకులకూ అమందానందం కలిగింది. కాని తండ్రి మొహంలో ఏదో నైరాశ్యం గమనించాడు ధర్మపాదుడు. మోహరాజా ఆలయగర్భ గుడిపైన విమానము నమర్చే విధానం మరచిపోయినందువల్ల ఆలయ నిర్మాణంలో అంతులేని జాప్యం జరిగింది. మహారాజు ఆను చిరాకు కగిలింది. దర్మపాదుని మనో మందిరంలో విమాన గోపురం అమర్చే విధానం నిక్షిప్తంగా ఉన్నది. తండ్రి వ్యాకులతను దూరంచేసే సదుద్దేశంతో గబగబా పైకిఎగబాకి తగినసూచనలిచ్చి విమానమును భద్రంగా నిలిపాడు. కాని ఇంతలోనే తనపాటవం, తన తండ్రికి, అనుయాయులకి అపకీర్తి తెచ్చిపెట్టటంగా భావించి తనకు తాను చంద్రభాగ నదీగర్భంలోకి దూకి ఆత్మత్యాగం చేసికొన్నాడు. ఇది చివరి ఘట్టంలో పడిన చెరగని విషాదముద్ర.

ఇది ఏ పాశ్చాత్య పురాతన నిర్మాణాలకీ తీసిపోని మహాద్భుత కట్టడమని ఎంతోమంది శ్లాఘించారు. ఈ ఆలయం పైభాగం గనుక పడిపోక పోయినట్లయితే దేశం మొత్తంమీదనే ఎత్తయిన దేవాలయంగా పరిగణించబడే దనటంలో సందేహం లేదు.

కోణార్క్ కూడా సముద్రపు ఒడ్డునే వున్నది. ఇక్కడి బీచ్ కూడా సముద్రుని గాంభీర్యతను, వింత సోయగాన్ని వెలారిస్తుంది.

ఇక్కడ వసతికి పాశ్చాత్య సాంప్రదాయలతో ఒక లాడ్జి, పి. డబ్ల్యు. డి. బంగళా, టూరిస్టు బంగళా (ఒరియాలో పాంథ నివాస్)ఉన్నాయి. ఇప్పుడు ఏర్పడిన బీచ్‌రోడ్డు కోణార్క్ నుంచి పూరీకి డైరక్టుగా ఉన్నందున అసలు ఇక్కడ ఉండాల్సినపని గూడ అట్టే కనపడదు. ఒక చిన్న పిక్నిక్, ఎక్సకర్షను అని వచ్చి చూచి చక్కాపోవచ్చు.

## కటక్

ఒరిస్సా చరిత్రలో మధ్యయుగాల్లో కటక్‌ని కొంతమంది రాజులు ప్రధాన నగరంగా చేసికొని రాజ్యపాలన సాగించగా కొన్నాళ్ళు ఒరిస్సా రాజధానిగా గూడా

వుంది. ఇది బ్రిటిష వారి ప్రవేశం వరకూ కొనసాగింది. మూడువైపుల మహానది, దాని పాయయే అయిన కత్‌జోరి నదులతో చుట్టబడి వున్నదీ పట్టణం. పూరీ, భువనేశ్వర్, కోణార్క హిందూ సాంప్రదాయ దేవాలయాలకు అలవాలమైతే- ఈ పురాతన పట్టణంలో చూడదగ్గవి అనేవి పెద్దగా లేకపోయినా మంచి షాపింగ్ సెంటర్‌గా చెప్పుకోవచ్చు. వెండి పాత్రలు, కొయ్యతో చేసినవి, ఇత్తడి విగ్రహాలు, సామానులు, లేసులు, బుటాలుతో వున్న చక్కని సిల్క్ చీరలు బేరమాడగలిగితే మంచి చౌకగా లభించవచ్చు. ఒక రకమయిన పూసల దండలు, అలంకార సామాగ్రి కూడా మంచి నగిషీల జిలుగులతో దొరుకుతాయి. పిటికి అనేక రంగులు కొట్టొచ్చినట్టు కనబడి చూపరులను ఇట్టే ఆకర్షిస్తాయనడంలో సందేహం లేదు.

పట్టణాన్ని వరదలనించి కాపాడటానికి 11వ శతాబ్దంలో కేసరి వంశీయులైన రాజులచే నిర్మించబడిన కరకట్ట ఇంతవరకూ కాపాడుతూనే వుంది. అలాగే మహానదివైపు కూడా ఒక కరకట్ట నిర్మించబడింది. ఈ రెండూ పురాతన కాలంనాటి నిర్మాణ కౌశల్యం, ధారుఢ్యానికి ప్రతీకలుగా నిలిచాయి. మరి ఈ 900 ఏళ్ళనుండి పట్టణాన్ని కాపుగాస్తున్నవి కదా! ఇంజనీరింగులో వీరెంత నిష్ణాతులో! మరి ఈనాడో ?!

18వ శతాబ్దంలో నిర్మించబడిన బారాబతి కోట శిధిలాలు-కోటతాలో ఒక పెద్ద ద్వారం, అగడ్తలా నిర్మించిన గోడలతో ఒక పెద్ద మసీదు ఉంది. ఇక్కడ ఒక పెద్దకోట ఉండేదనీ అది 9 ప్రహరీలతో పటిష్టమైన కోటగా వుందని 'అయిని అక్బరి' అనే పుస్తకంలో అక్బరు మంత్రి వరేణ్యుడు పేర్కొన్న దాఖలాలున్నాయి. ప్రస్తుతం కోట ద్వారం, అవశేషాలు మసీదు తప్ప ఇదేమీ కానరాదు.

పట్టణం నడిబొడ్డున కదమ్‌రసూల్ మసీదు వుంది. అందులో పవిత్రమైన మక్కానించి తెచ్చిన మహమ్మదు ప్రవక్త జ్ఞాపికలున్నాయి. చూడవచ్చు

ఇక్కడే కటక్‌లోని బారాబతి స్టేడియం ఉంది. ఎన్నో రకాల స్పోర్ట్సు, టోర్నమెంటులు వగయిరాలు ఇక్కడే జరుగుతాయి. కటక్ చుట్టు ప్రక్కలనే ఉన్నవి చూడదగినవి.

# రత్నగిరి, లలితగిరి, ఉదయగిరి

కటక్ నుండి 65 కి.మీ దూరంలో నలందా, తక్షశిలా విద్యాలయాల్ని పోలిన బౌద్ధ కేంద్రం పరిఢవిల్లిందని హ్యూయాన్‌సాంగ్ వ్రాతల్లో విదితమవుతుంది. రత్నగిరి ఇందులో ప్రముఖపాత్ర వహిస్తుంది. ఒకపెద్ద ప్రార్థనా మందిరం, స్థూపాలు, బుద్ధుని పెద్దపెద్ద విగ్రహాలు, ఇంకా అనేకరకాలైన బౌద్ధశిల్పాలు చెక్కబడినవి ఉన్నాయి. గుప్తుల కాలానికి ముందు కాలంలో బౌద్ధ శిల్పాలకు కాణాచిగా పరిఢవిల్లిన విషయం అవగతమవుతుంది.

ఇక్కడికి మరికొద్ది దూరంలోనే బౌద్ధ గ్రామాలు మణిబంధ, నువాపట్న బౌద్ధ శిల్పులు నివాసం ఏర్పరచుకున్న స్థలాలు. అద్భుతమైన నేతపని వారు, మరి ఇతర చేతి పనుల్ని వృత్తులుగా చేసికొని స్థిరనివాసం ఏర్పరచుకున్నారు- హాండీ క్రాఫ్స్‌లో విశేషమైన నైపుణ్యం వెలార్చే అనేక వస్తు సముదాయాల్ని, ఆభరణాల్ని అద్భుతంగా తయారు చేసేవారు.

## టికార్‌పారా

కటక్-సంపల్‌పూర్ రోడ్‌లో అంగూల్‌కి 58 కి.మీ. దూరంలో మహానది కంఠాభరణంలా పరుచుకుని ఉన్న విస్తృతారణ్య ప్రాంతంలో టికార్‌పార అమరి వున్నది. దీనికి ఒక ప్రత్యేక ఆకర్షణ ఘరియాల్ క్రొకోడైల్ శాంక్చ్యురి. ఇందులో మనదేశంలో దొరికే రకరకాల మొసళ్ళన్నింటినీ చూడగలగటం మరిచి పోలేని వింత।

## చిల్కా సరస్సు

ఒకానొక కవి వరేణ్యుడు ఆంధ్ర కళింగుల సన్నిహితత్వాన్ని తెలియజేస్తూన్నట్లుగా కళింగాంధ్ర సామ్రాజ్యాలు ఇరుగు పొరుగువై సత్సంబంధాలతో విలసిల్లుతూ 'చిల్క సరస్సులోన శృంగార నౌకల నడిపిరాంధ్రులు' అని చెప్పారు. మహోగ్రంగా గర్జించే సముద్రం నుండి వేరు చేయబడుతూ ఏర్పడిన ఇసుక పర్వతాలతో వేరు చేయబడుతూ అందాల లంకలతో ఏర్పడిన చీలిక కొన్ని మైళ్ళ పర్యంతం వ్యాపించి ఉన్న జలాశయం చిల్కా సరస్సు. ఇది దేశం మొత్తం మీద పెద్ద

త్రైనది—ఎన్నదగినది. ఈ ప్రశాంతమైన సుందర సరస్సు వాతావరణం కలత చెంది నప్పుడు భయంకర బీభత్స దృశ్యాలుగా గోచరమవుతుంది. వెన్నెల రాత్రుల్లో చక్కని వింత సోయగాన్ని సంతరించుకుని మధురానుభూతిని కలగజేస్తూంటుంది. ఇందులో ప్రేమికుల నౌకా విహారం ఒక మధురానుభూతి.

ఇంతే కాకుండా ఇక్కడికి మనదేశంలోని అన్ని ప్రదేశాల నుండి వింత వింత పక్షులే గాకుండా శీతాకాలంలో సైబీరియా వంటి సుదూర ప్రదేశాల నుంచి కూడ కొన్ని రకాల పక్షులు విహారం కోసం వచ్చి వెళ్తూంటాయి. పిక్నిక్‌కి ఒక మనోహరమైన ప్రదేశం.

ఉండటానికి సరస్సు దక్షిణపు కొనన రంభ టూరిస్టు బంగాళావుంది. నౌకా విహారానికి తగిన బోటు వసతి కూడా అమరివున్నది. సరస్సు తీరానవున్న ప్రకృతి అందాలు చెప్పలేని ఆనందాన్ని కలుగజేస్తుంటుంది. ఇది జీవితంలో ఒకసారి అయినా అనుభవించదగిన స్వర్గతుల్యపు ఆనందం.

విశేష సమాచారం కోసం టూరిస్టు ఆఫీసు, రంభా టూరిస్టు బంగ్లా, గంజాము జిల్లా వారి ద్వారా పొందవచ్చును.

సముద్రతీర విశ్రాంతి కేంద్రాలు గోపాల్‌పూర్‌కి తోడుగా బెర్హాంపూర్, చాందీపూర్ ఉన్నాయి.

## హిరాకుడ్

సంబల్‌పూర్ దాకా వెళ్లిన వాళ్ళంక సంబల్‌పూర్‌కి 16 కి.మీ. దూరంతో ఉన్న హిరాకుడ్ ఆనకట్టను చూడవచ్చు. దేశానికే గర్వకారణంగా, ఆసియాలోనే పెద్దదిగా పేర్కొనబడి ప్రపంచంలోని పెద్ద ఆనకట్టల్లో ఒకటిగా పరిగణించబడే ఈఆనకట్ట మహానదిమీద నిర్మించబడింది. ఈ మానవ నిర్మితమైన మహా జలాశయం 864 చ. కి. మీ. వైశాల్యం. పడమరగా ఉన్న జవహర్‌మినార్ స్తంభం మీద నుంచి చూస్తే ఈ విశాలమైన సరస్సు గంభీరంగా దర్శనమిస్తుంది. హిరాకుడ్ వెళ్ళే దారి లోనే హ్యూమ మహానది ఒడ్డునే అమరియున్న ప్రదేశం. ప్రకృతి అందాల నేపథ్యంలో ఇక్కడొక శివాలయం వుంది. చూడదగినది.

# ఉషాకోటి వైల్డ్ లైఫ్ శాంక్చ్యుయరీ

దట్టమైన కీకారణ్యం పచ్చ పరుచుకున్న ఉషాకోటి సంబల్‌పూరుకు తూర్పుగా 45 కి.మీ.లో వున్నది. ఇక్కడి అరణ్యం దాదాపు 134 చ.కి.మీ. వైశాల్యం వుంటుంది. ఇక్కడ యథేచ్ఛగా పెరిగిన వృక్ష జాతులమధ్య ఏనుగులు, పెద్దపులులు, కొండ చిలువలు, చిరుత పులులు, అనేక రకాలయిన తేళ్ళు, దుప్పులు యథేచ్ఛగా విహరించటం చూడవచ్చు. ఈ అటవీ దృశ్యాన్ని చూడటానికనుపగా అనేకచోట్ల ఎత్తుగా ఏర్పాటుచేయబడిన టవర్స్ అనుకూలంగా ఏర్పాటుచేయబడ్డాయి. దీన్ని దర్శించడానికి తగిన కాలం సంవత్సరంలో అక్టోబరు నుండి జూన్ వరకు మాత్రమే: అతి సమీపంలో ఉన్న రైల్వే స్టేషను సంబల్‌పూర్.

**ఉండటానికయితే :**

బద్రామ ఫారెస్టు బంగళా వుంది. కాని తినటానికయితే ఏ విధమయిన ఏర్పాటులు ఉండవు. ప్రయాణీకులు రాత్రిళ్ళు సంబల్‌పూర్‌లో మాత్రమే విడిది చేయవచ్చు.

వసతి సౌకర్యాలకోసం బద్రామ ఫారెస్టు రేంజ్ ఆఫీసరు గారి ద్వారా ప్రయత్నించి పొందవచ్చు.

ఇక ఇక్కడి నుండి తల్చేరు మీదుగా కటక్ చేరి అక్కడినుండి మరల భువనేశ్వర్ చేరదాం.

# భువనేశ్వర్

భువనేశ్వర్ ప్రస్తుత ఒరిస్సా రాష్ట్రానికి రాజధాని నగరం. ఈ పట్టణాన్ని రెండు ముఖ్య విభాలుగా విభజించవచ్చు- పాత, కొత్తలుగా రైల్వే స్టేషను ఇవతల పాత నగరం అమరియున్నది. రైల్వే స్టేషను అవతల నిత్య నూతనాలంకారములు సంతరించుకుంటూ ఆధునికత్వాన్ని పుణికి పుచ్చుకొన్న వసతులు, సౌకర్యాలు, భవన సముదాయాల్తో సర్వాంగ సుందరంగా అభివృద్ధి చెందుతూంది నూతన నగరం.

'శిశుపాల గ్రహ' గ్రామ సమీపంలో తవ్వకాల్లో బయల్పడిన శిథిలమైన

కోటను బట్టి భువనేశ్వర్ పట్టణాన్ని ఒక జైన చక్రవర్తి క్రీ.శ. 2వ శతాబ్దంలో పరి పాలించినట్లుగా చారిత్రిక అవశేషాల వలన తెలుస్తుంది.

ఈ పట్టణం ఆలయ సముదాయంగా అభివర్ణించబడింది. ఒకానొకప్పుడు ఇక్కడ 7000 ఆలయాలున్నాయని ప్రతీతి. ఇది ఒక గొప్ప పవిత్ర స్థలంగా ఎంచ బడుతోంది. అయితే ఇప్పుడు మాత్రం 500 ఆలయాలు శిథిలమై జీర్ణావస్థలో వున్నా ప్రాచీన కళావైదగ్ధ్యాన్ని చాటుతున్నాయి ఇన్ని ఆలయాలున్న పట్టణం దేవతలకు అత్యంత ప్రీతికరమై ఒప్పుతున్నదని భావించవచ్చు. ప్రస్తుతం మనకు దర్శనమిచ్చే 500 ఆలయాలున్న బిందు సరోవరం చుట్టూ కేంద్రీకృతమై ఉన్నవి. అన్ని పుణ్య నదుల్లోని నీరు, పవిత్ర సరస్సులలోని నీరు ఇక్కడొక్కచోట కలిసి బిందు సరో వరంగా ఏర్పడిందని భావన. రాష్ట్ర చరిత్రలో ఎక్కడా జైన బౌద్ధముల ప్రసక్తిలేని చోటు కానరాదు. ఇక్కడ అన్ని దేవాలయములకు మకుటంగా నిలిచేది, లింగ రాజాలయం.

లింగరాజాలయం :

పూరీలో మాదిరిగానే ఇక్కడ కూడా హిందువు లందరికీ కులమత విచక్షణ లేకుండా దర్శనీయం. విదేశస్తులకు, ఇతర మతస్తులకు ప్రవేశంలేదు. ఆలయం చాలా విశాలమైనది. ఉత్తరాన ప్రహరీకి ఆనుకునే ఒక పెద్ద ప్లాటుఫారము లాటిది కర్జను దొరగారి కోసం బ్రిటిష్‌వారు కట్టించారట. అక్కడినుండి అన్యులందరూ చూడ వచ్చు. ఇక్కడినుండి దేవాలయాన్ని స్పష్టంగా చూడాలంటే బైనాక్యులర్సుండటం ఎంతయినా అవశ్యకం.

ఇక్కడ వెంచేసియున్నది ముల్లోకాలకు అధిపతియైన త్రిభువనేశ్వరుడు. ప్రస్తు తం మనం చూడగలిగిన స్థాయి క్రీ.శ. 1090 నుండి 1104 మధ్యకాలంలో విస్తరణ జరిగినా అసలు పునాది షుమారు 1400 సంవత్సరాల క్రిందటే జరిగిందని చెప్తున్నారు.

ఇక్కడి శివలింగము స్వాభావిక మైన శిలారూపం. ప్రతిరోజూ శుద్ధజలాలతోను పాలతోను, భంగుకలపిన పాలతోను నిత్యాభిషేకం జరుగుతుంటుంది. ఇక్కడ గూడ హరిహర సమ్మేళనం వున్నది. కనుకనే జగన్నాథస్వామికి మాదిరిగానే ప్రసాద నివేదనం జరుగుతుంది.

ఆలయగోపురం సుమారు 40 మీటర్లు ఎత్తువుండి 150 మీటర్ల ప్రాకారంతో గంభీరంగా ఉంటుంది. ప్రతి అంగుళం హైందవార్యశిల్ప సంప్రదాయరీతుల్లో మలచిన శిల్ప కళావిశిష్టత కొట్టవచ్చినట్టు కనబడుతుంది. అన్యులు ఆలయ దర్శనం కొరకు నిర్మించబడిన ప్లాటుఫారం నుంచి మదించిన ఏనుగుల మీద సింహముల స్వైరవిహారం కనబడుతుంది. ఇది బౌద్ధముమీద హైందవ ఆధిక్యత పునరుద్ధరణ చిహ్నంగా భావింప బడుతుంది.

ఈ ప్రాచీన శిలా శిల్పసంపద, దేశం మొత్తానికే తలమానికమైనదిగా భావింప వచ్చు. ఇందులో ఎన్నో ఏళ్ళ శ్రమ, ఎందరో శిల్పుల ప్రతిభ, మరెందరో రాత్రనక పగలనక సంవత్సరాల తరబడి శ్రమించి నిర్మించుకున్న మహత్తరమైన కట్టడాలుగా గోచరిస్తాయి. ప్రధాన ఆలయం చుట్టూ అనేకమైన ప్రార్థనా మందిరాలు, ఆలయాలు భోగమందిరాలు, నాట్యశాలలు వగైరా వగైరా ఎన్నో ఏర్పాటు చేయబడియున్నాయి

ఇక్కడి స్వామివారికి నిత్యము 22 విధాలయిన సేవలు చేస్తారుట. ఇక అర్చనలు, అభిషేకాలు చెప్పనేఅక్కరలేదు.

రాజా రాణి ఆలయం :

కుడిప్రక్కన ఒక వంద మీటర్లు వెళితే పచ్చటి పచ్చిక మైదానంలో రాజారాణి ఆలయం దర్శనమిస్తుంది. ఇది 18వ శతాబ్దం ప్రారంభంలో నిర్మించబడింది. గోడల మీదను, స్థంభముల మీద చెక్కబడిన శిల్పాలు అద్భుతం. వీనిలో శృంగారకేళీ విలాసాల్లో మునిగిఉన్న జంటలు, మత్స్యకన్యలు, ఏనుగులు, గుర్రాల సముదాయాలు సజీవ చైతన్యంగా స్ఫురించటం– ఒరిస్సా శిల్పకళా విశిష్టతను అగ్రగామిత్వాన్ని చాటుతున్నాయి.

ముక్తేశ్వరాలయం :

అతి సన్ననిసగిషీం శిల్పంలో పరమాద్భుతాన్ని, ఆశ్చర్యాన్ని గొలిపే శిల్పం ఈ చిన్ని ఆలయ విశేషం. చూపరులను ఇట్టే ఆకర్షిస్తుంది. సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తుతుంది, రాతితో ఇటువంటి సృష్టి చేయవగునా అని.

ఇవి కాకుండా ముఖ్యమైనవి, చూడదగ్గవి, పరశురామేశ్వరాలయం, బ్రహ్మేశ్వరాలయం, అనంత వాసు దేవాలయం, ప్రాచీన శిల్పకళా తోరణాలకి పట్టుకొమ్మలై నిలిచాయనటంలో సందేహం లేదు.

మ్యూజియం :

హోటల్ అశోక కళింగ ఎదురుగా ఒరిస్సా సంస్కృతీ సంప్రదాయాలను కళ్ళకు కట్టినట్టు కనిపించేటట్లుగా ఉండే అనేక విశేషాల నిక్షిప్త భవనంగా చూడవచ్చు. అందులో ప్రాచీన శిలా శిల్పఖండాలు, తాళపత్ర గ్రంధాలు, మధ్యకాలాల నాటి ఆయుధ విశేషాలు, జానపద కళావిశేషాలు వగయిరాలు దర్శించవచ్చు. సోమవారం తప్ప మిగతా రోజుల్లో 10 గం. నుండి 1 గ వరకు 2 నుండి 4 వరకు తెరచి యుంచబడుతుంది.

భువనేశ్వర్ పరిసరాల్లో చూడదగిన విశేషాలు :-

ధావులి కొండలు :

అశోకుని కాలంనాటి కళింగయుద్ధానికి ప్రత్యక్షసాక్షిగా నిలిచింది. భువనేశ్వర్ నుండి 10 కి.మీ. దూరం. ఈ కొండమీద జపాను బౌద్ధ సంఘమువారి నేతృత్వంలో నూతనంగా నిర్మించబడిన స్థూపం ఒకటున్నది. దగ్గరిలోనే మరోకొండ రాతిమీద క్రీ. పూర్వం 3 శతాబ్దంనాటి అశోకుని శిలాశాసనాలు చెక్కబడి ఉన్నాయి. 2000 సంవత్సరాల నుండి 13 బౌద్ధధర్మ సూత్రాలు కాలాని కతీతంగా నిలిచాయి, జరిగిన చరిత్రకు నిదర్శనంగా.

ఇక్కడికి దగ్గిరలోవున్న ఖండగిరి, ఉదయగిరి జంట పర్వతాలు, కేవలం 5 కి.మీ. మాత్రం. ఈ గుహాలు జైనమునుల నివాసం కొరకు తొలచబడ్డాయి. ఇక్కడ ఎలిఫెంట్ కేవ్ అని పిలవబడే దానిలో చెక్కబడిన రాతలు క్రీ. పూర్వం ఖరవేలుని నాటి కళింగ చరిత్రకు అద్దం పట్టేవిగా ఉన్నాయి. ఖండగిరి కొండ 24 మంది జైన తీర్థంకరుల శిలా రూపాలతో కూడిన దృశ్యవిశేషము. రెండు కొండలూ తేలికగా ఎక్కి గుహలను చేరవచ్చు.

దగ్గరలో మరో అయిదు కి.మీ. దూరంలో మహాద్వారాలతో నిర్మించబడిన కోట తాలుకు అవశేషాలు శిశుపాలసాగర్‌లో సాక్షాత్కరిస్తుంది. ఈ కోట సుమారు క్రీ.పూ. 300 సంవత్సరాల క్రిందటిదని త్రవ్వకాల అవశేషాలు మనకు తెలుపుతున్నాయి.

# నందన్ కానన్

ఇది భువనేశ్వర నగరానికి 12 కి. మీటర్ల దూరంలో నున్న జులాజికల్ పార్కు. పురాణకథల ప్రకారం చూస్తే ఈ ప్రదేశమొక స్వర్గధామంగా అభివర్ణించ బడింది. ఈ పార్కు ప్రస్తుతం పురాతన కాలంలో దండకారణ్యంగా పిలవబడే ప్రదేశమంటారు. అనేక రకాలయిన జంతువులు ఇందులో ప్రదర్శించ బడుతున్నాయి. ఒక చిన్న సరస్సుంది. నౌకావిహారానికి పోట్లుగూడా లభ్యమవుతాయి. ఇది వేసవి కాలంలో ఉదయం 7-30 నుండి రా॥ 8 గం. వరకు, శీతాకాలంలో 8 గం. నుండి 7 గ.ల వరకు తెరచి యుంచబడుతులవి. వారంలో అన్ని రోజులలో చూడవచ్చు.

# చాంద్‌పూర్ & బాలసోర్

కలకత్తా వెళ్ళేటప్పుడు ఒరిస్సానుండి పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ముఖ్యద్వారంగా ఉండే బాలసోర్ రైల్వే స్టేషనుకు దగ్గర, చాంద్‌పూర్ రైల్వేస్టేషనుకు 16 కి. మి. దూరంలో ఉన్నటువంటి సముద్రతీర విశ్రాంతి క్షేత్రం. బాలసోర్ నించి ప్రతి రోజూ బస్సులున్నాయి. బాలసోర్ మద్రాసు కలకత్తా రైలులో బెంగాల్లో ప్రవేశించే ముందుగల ఆఖరి ప్రముఖమైన పట్టణంగా చెప్పవచ్చు. ఒకానొకప్పుడు డచ్చివారు, డేనిష్‌వారు, ఫ్రెంచివారు, బ్రిటిషువారు కొన్ని ఫ్యాక్టరీలు కట్టుకొని వ్యాపారాలు సాగించారు. ఇక్కడ యాత్రికుల నాకర్షించేది ముఖ్యంగా గోపీనాథ ఆలయం.

## భువనేశ్వరం నగరంలో సౌకర్యాలు :

### రాకపోకలకు :

ఢిల్లీ - వారణాసి - రాయపూర్, భువనేశ్వర్. మళ్ళీ వెనక్కి; ప్రతిరోజూ విమాన సౌకర్యం ఉంది.

కలకత్తా నుంచి భువనేశ్వరంకు- మళ్ళీ వెనక్కి వారంలో నాలుగుసార్లు హైదరాబాదు వరకు విస్తరించబడిన విమాన సౌకర్యం.

మద్రాసు నుండి కలకత్తాకు, మద్రాసు నుంచి పూరి, పూరి నుండి తిరుపతికి, ఢిల్లీ నుండి భువనేశ్వర్‌కు, భువనేశ్వర్ నుండి ఢిల్లీకి, పూరి నుండి ఢిల్లీ కి అనేక ఎక్స్‌ప్రెస్, సూపర్‌ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లు ఉన్నాయి. పూరీ నుండి బయలుదేరే అన్ని రైళ్ళు భువనేశ్వర్ మీదుగా రాకపోకలు సాగించవలసిందే ।

ముఖ్యంగా భువనేశ్వర్ నుండి అన్ని చోట్లకు రోడ్డు సౌకర్యం వున్నది.

| పట్నం | దూరం | మజిలీలు-మధ్యదూరం |
|---|---|---|
| కలకత్తా | 498 కి.మీ. | కటక్-24, బాలసోర్-170, ఖరగ్‌పూర్-172, కలకత్తా-132 కి.మీ. |
| కటక్ | 24 కి.మీ. | నేరుగా |
| కోణార్క్ | 64 కి.మీ. | పిప్లి-20, కోణార్క్-44 కి.మీ. |
| పూరి | 56 కి.మీ. | పిప్లి-20, సాక్షిగోపాల్-19, పూరి-17 |

## యాత్రిక సమాచార కేంద్రాలు

1. టూరిస్టు ఆఫీసు,
టూరిస్టు బంగళా, హాంటనివాస్.
ఉ. 8 గం. నుండి రాత్రి 9 గం. వరకు.

2. రైల్వే స్టేషనులో సమాచార కేంద్రం.
ఉ 6 గం. నుండి 10 గం. వరకు
మరల . . 4 గం. నుండి 11 గం. వరకు

3. భువనేశ్వరం విమానాశ్రయంలో.
విమానాలు వచ్చిపోయే వేళల్లో తెరచి ఉంచబడే యాత్రిక సమాచార కౌంటర్.

## రిజర్వేషన్లు - ప్రయాణాలకు

**విమానమయితే :**

1. ఇండియన్ ఎయిర్ లైన్సు
రాజపథ్, న్యూ కాపిటల్
బస్సుస్టాండు ఎదురుగా
ఫోన్: 50533

**రైలు :**

భువనేశ్వరం రైల్వే స్టేషను

**బస్సు :**

ఒరిస్సా గవర్నమెంటు స్టేటు ట్రాన్సుపోర్టు & ఒరిస్సా రోడ్డు ట్రాన్సుపోర్టు

## హాస్టళ్ళు — హోటళ్ళు

### శ్రీమంతులు - పాశ్చాత్యులకు :

టూరిజం శాఖవారు అప్రూవ్ చేసినవి.

1. కళింగ అశోక్,
   గౌతమ్‌నగర్, ఫోన్: 50745
   గ్రామ్స్: TOURISM

2. హోటల్ ప్రాచి
   6 జనపథ్, ఫోన్: 52689
   గ్రామ్స్: DESTINY

### ఇతరంగా - శ్రీమంతులకు :

పాంథ నివాస్, టూరిస్టు బంగళా
ఫోన్: 54515

హోటల్ కోణార్క్
ఫోన్: 53330

హోటల్ స్వస్తి
108, జనపథ్,

పూరికి కొంచెం దూరంగా కొత్తగా వెలసిన-
న్యూ ఒబెరాయ్, భువనేశ్వర్.
ఫోన్ నం: 54216

### సామాన్యులకు :

మ్యూజియం ఎదురుగా ఉన్న అనేక హోటళ్ళు, సత్రాలు.

### సత్రాలు :

బిర్లా ధర్మశాల, అతిధిభవన్, గౌతమనగర్.

### లింగరాజు దేవాలయం దగ్గరలో :

1. దాల్మియా ధర్మశాల, పతంగియా ధర్మశాల—హిందువులకు మాత్రమే।
   3 రోజుల వరకు మాత్రమే - ఉచిత సౌకర్యం.

2. దూద్‌వాలా ధర్మశాల — 3 రోజుల వరకు మాత్రమే - కరెంటు ఛార్జీ మాత్రం వసూలు చేయబడతాయి.

ఇతర సౌకర్యాలు :

స్టేటు గెస్ట్‌హౌస్, ఇన్‌స్పెక్షన్ బంగళా (ముఖ్యంగా ఆఫీసర్లకు ప్రాధాన్యం) టూరిస్టు బంగళా, సర్క్యూట్ హౌస్, ఖండగిరి యూత్ హోస్టలు వగైరాలు. రైలు ప్రయాణీకులకు - రైల్వేవారి విశ్రాంతి గదులు.

స్థానికంగా స్థల సందర్శనకు:

1) ఒరిస్సా ప్రభుత్వం టూరిజం డిపార్టుమెంటు వారిచే శనివారం, మంగళవారం ఉదయం 8 గం. నుండి 6 గం వరకు భువనేశ్వరం ఆలయ సముదాయం, ఖండగిరి, ధావులి కొండలకు- బస్సు యాత్రా సౌకర్యం నిర్వహిస్తారు. అందుకు చార్జి సుమారు 9-50.

2) కోణార్క్ నుండి పూరికి పైహరే ప్రతి బుధ, ఆదివారాలు ఉ. 8 గం నుండి 6 గం.ల వరకు స్థల సందర్శనా యాత్రా సౌకర్యం నిర్వహిస్తారు. ఇందుకు చార్జి సుమారు రు. 20/-
పై యాత్రలు- పాంథనివాస్ నుండి ప్రారంభమై మరల అక్కడే ముగుస్తాయి.

ఒరిస్సాలో మరికొన్ని చూడదగిన యాత్రా కేంద్రాలు :

హరిశంకర్ :

ఒక ముఖ్య యాత్రిక కేంద్రం. దృశ్యమానమైన అందాలను సంతరించుకున్న గంధమాదన పర్వత దక్షిణ సానువుల్లో అమరి ఉన్నది. ఉత్తర సానువుల్లో నృసింహ నాథ ఆలయం ఇమిడిఉంది. ఎవరైనా ఈ రెండు ప్రదేశాలను చూడాలనుకుంటే ప్రాచీన పీఠభూమి ఎక్కాల్సి వుంటుంది. సుమారు 16 కి.మీ. కష్టపడాలి- పొలా మొలొకిలి గుండా. ఇది అసలు పరిమళగిరి అని పురాతన బౌద్ధ విహారం.

శివకేశవులకు అభేదత్వాన్ని కల్పిస్తూ సంకేతంగా హరిశంకర్‌లను ఆరాధిస్తారు. ఇక్కడ ఒక జలపాతం కూడా వుంది. తప్పక స్నానం చేయవలసింది.

ఆహార విహార సౌకర్యాలకు- బాలాంగిర్‌లోని టూరిస్టు ఆఫీసరుగార్ని సంప్ర దించాల్సి వుంటుంది.

ఉత్తర ఒరిస్సాలో 200 కి.మీ. దూరంలో ఖిచింగ్ పురాతన రాజధాని నగరం వుంది. ఇక్కడ ఖిచకేశ్వరి ఆలయం ఉంది. మయూర్‌భంజ్ జిల్లాలో ఉన్న ఈ

ప్రదేశంలో జరిగిన త్రవ్వకాల్లో అనేక విశేషాలు బయటపడ్డాయి. ఇక్కడ బయట పడిన దేవాలయ అవశేషాలు, శిథిలాలు భద్రంగా ఇక్కడే ఒక మ్యూజియంలో ఉంచారు.

ఢెంకనాల్ పట్టణానికి 11 కి.మీ. దూరంలో సప్తశజ్యా అనే సుందర ప్రదేశం, బాగ్రాలోని జలపాతం మొదలయినవి చూడదగినవి.

ఆదిమజాతులు, తెగల పుట్టుపూర్వోత్తరాలు వారి సంస్కృతి, సంప్రదాయాలు అధ్యయనం చేయగోరేవారి అభినివేశాన్ని పెంపొందించే ఉత్కంఠభరిత ప్రాంతాలు కోరాపుట్, మల్కాన్‌గిరి. వీటిలో ఎక్కడయినా కొన్నాళ్ళు నివాసం ఏర్పరుచుకుంటే గిరిజనుల హృదయాల్లోకి తొంగిచూడవచ్చు. మల్కాన్‌గిరి అడవులు దండకారణ్యంగా పిలవబడుతున్నాయి.

జాజ్‌పూర్ :

హౌరా మద్రాసు రైలులోనే జాజ్‌పూర్ రోడ్డు స్టేషనుంది. బహుశా ఇది ఒరిస్సా ఉత్తరపు కొస అవుతుంది. స్టేషను నుండి వైతరణి 20 కి.మీ. ఇది చాల పురాతన పట్టణం. ఇక్కడ దుర్గమ్మవారి శక్తి పీఠముల్లో ఒకటిగా పరిగణిస్తారు. ఈమెను విరజాదేవి అంటారు. 7వ శతాబ్దంలో వచ్చిన హ్యూయన్‌త్సాంగ్ ఇక్కడ జరిగే బ్రహ్మాండ ఉత్సవాలను తిలకించినట్టుగా వ్రాసుకున్నాడు.

దగ్గరిలోనే ప్రసిద్ధిచెందిన అఖండలేశ్వర్, లింగేశ్వర్, త్రిలోచనేశ్వర్ ఆలయాలున్నాయి. ఒక చిన్నలంకలో వరాహ నృసింహ ఆలయం కూడా ఉన్నది. ఇక్కడే నాభిగయ ఉంది. వైతరణీ నదీతీరంలో బ్రహ్మకుండం దగ్గర యాత్రికులు తీర్థవిధులు పెట్టారు.

మొత్తం మీద ఒరిస్సా రాష్ట్రం పర్వతారణ్యాలతోను, జలసమృద్ధిగల నదీనదాలతోను, ప్రకృతి ప్రళయ స్వరూపంతోను, సముద్ర తీరంతోను, యాత్రికులకు అడుగడుగునా భగవత్తత్వ దర్శనీయమైన దేవాలయాలతోను, దేశంలోనే జాతీయ ప్రతిపత్తిని సాధించుకున్న ఉత్సవాదుల విశేషాలతోను, యాత్రికుల స్వర్గంగా భాసిస్తుంది. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు. కళింగులు, ఆంధ్రులు ఇరుగుపొరుగువారై సభ్యత నెరపిన దృష్టాంతాలతో చరిత్రలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించిన ఘనత శ్లాఘించదగినది.



# పశ్చిమ బెంగాల్



మన సువిశాల భారతంలో తూర్పుతీరం చివరి వరకూ వ్యాపించి ఉత్తరాన అమరియున్న పెట్టనికోట అయిన హిమాలయ పర్వతాల అంచులవరకు విస్తరించి ఉన్నదీ రాష్ట్రం. పురాణాల్లో వంగదేశంగాను, గౌడ దేశంగాను పేర్కొన బడింది. మహాభారతాది గ్రంధాల్లో కూడా ఈదేశాల ప్రసక్తి వున్నది. రాష్ట్ర దక్షిణభాగంలో బంగాళాఖాతం సముద్రం. ఉత్తరాన నూతనంగా ఏర్పడి హిందూ దేశంలో భాగంగా ఏర్పడిన సిక్కింం, భూటాన్ రాష్ట్రాలు. తూర్పున అస్సామ్, బంగ్లాదేశ్, (పూర్వపు తూర్పు బెంగాల్-పాకిస్తాన్‌లో భాగంవుండి, తరువాత స్వతంత్ర దేశంగా ఇటీవలనే రూపు దిద్దుకొన్నది) పడమరగా ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలు హద్దులుగా ఆవరించబడి యున్నదీ రాష్ట్రం. సహజంగా ఈ రాష్ట్రం రెండు విభాగాలుగా వుంది. ఉత్తర హిమాలయాలలో డార్జిలింగు, జల్పాయిగురి, కూచ్‌బీహార్ జిల్లాలు, మరోవంక సారవంతమైన మైదానాలు కలిగిన యితర జల్లాలు ఉత్తరాదిన డార్జిలింగు సముద్ర మట్టానికి ౮,౬౫౮ మీటర్ల ఎత్తున అమరిఉన్న ఉన్నతమైన పర్వతశ్రేణి. జల్పాయిగురి, కూచ్‌బీహార్ జిల్లాలు కొంచెం కిందుగా ఉండి కొండ చరియల నుండి వేగంగా ప్రవహించే తీస్తా, తోర్సా, జలధక, రంజిత్‌ఝురీ వంటి వేగంతో కూడిన నదులతో అమరి ఉన్నాయి. దక్షిణ ప్రాంతం అంతా అనేక నదీ ప్రవాహాలవలన చేరిన ఒండ్రుమట్టి కూడిన సారవంతమైన డెల్టాలతో అత్యధికమైన జలసాంద్రతతో నిండి వుంటుంది. పచ్చటి వరిచేలు, మామిడి తోటలు, అరటి తోటలు మొదలైన వాటితో మనకు ఆహ్వానం పలుకుతూ నేత్రపర్వంగా దర్శన మిస్తుంది. ఇందుకు కారణభూతమైన భాగీరథీ-

ఉపనదులు మయూరాక్షి, దామోదర్, కాంగ్సబతి, రూపానారాయణ్ మొదలయినవి. రాష్ట్రం మొత్తం విశేషమైన అధిక వర్షపాతంగల ప్రదేశం. వర్షపాతం 1066 మి. మీ. నుండి 2,933 మి. మీ. వరకు ఉంటుంది. ప్రధాన నగరం కలకత్తా మాత్రం సగటు వర్షపాతం 1600 మి. మీటర్లుంటుంది.

**రాష్ట్ర వైశాల్యం :**

87,853 కి. మీ.

**రాష్ట్ర రాజధాని నగరం :**

భారతదేశం మొత్తానికి తలమానికంగా నిలిచిన నాలుగు ప్రధాన నగరాలైన కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, మద్రాసుల్లోని మొదటిది కలకత్తా— అత్యధిక జనాభా, జనసాంద్రత కలిగిన దీ పట్టణం.

**జనాభా :**

5,45,90,000 సుమారు.

**మాట్లాడే భాష—మాతృ భాష :**

బెంగాలి.

**అక్షరాస్యత :**

41%

**సంగ్రహంగా రాష్ట్ర చరిత్ర :**

ప్రాచీన సంస్కృత వాఙ్మయంలో పురాణేతిహాసాల్లో పేర్కొనబడిన గౌడ దేశం, లేక వంగదేశం పురాణకాలం నుండే ప్రసిద్ధం. మహాభారత యుద్ధకాలంలో వంగదేశపు రాజు కౌరవపక్షం వహించి పాండవులతో యుద్ధం చేశాడట. ఆర్యులు పశ్చిమాసియా నుండి మనదేశంలో ప్రవేశించి తూర్పు దిక్కున పయనమైవచ్చి వంగ దేశంలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నవారై సంస్కృతీ సంప్రదాయాలకు, నాగరికతా భివృద్ధికి తోడ్పడిన వారైనారు.

క్రీ. పూర్వం 3వ శతాబ్దంలో శక్తివంతంగా తేజరిల్లిన మౌర్య సామ్రాజ్యం లోను, తదనంతరం క్రీ.శ. 4 నుండి 6 శతాబ్దం వరకు గుప్త సామ్రాజ్యంలోను

భాగంగా వున్న దీ ప్రదేశం. గుప్త సామ్రాజ్య పతనానంతరం క్రీ.శ. 800 సం. ప్రాంతంలో స్థానికులయిన పాలవంశపు రాజుల ఏలుబడిలో స్వతంత్ర్య రాజ్యంగా అభివృద్ధికి శ్రీకారం చుట్టబడింది. ఎన్నో నదీనదాల పుట్టుకకు ఆలవాలమైన హిమాలయ శృంగాల నుండి ప్రవహించే జీవజలాలతో పునీతమై, జలసమృద్ధమైన సశ్యశ్యామలమైన ఈ ప్రాంతం పాలరాజుల కాలంలో రాజ్యవిస్తరణ కూడా జరిగింది. పొరుగునేవున్న బీహారు, ఒరిస్సా, అస్సాం రాష్ట్రములలో గల ముఖ్య ప్రాంతాలకి విస్తరింపజేశారు- చాల శక్తివంతమైన రాజ్యంగా సుస్థిరతను సాధించిపెట్టారు. ఈ రాజులు దాదాపు నాలుగు శతాబ్దాలు అవిచ్ఛిన్నంగా రాజ్యం చేశారు.

క్రీ.శ. 13వ శతాబ్దంలో మొహమ్మద్ భక్తియార్ టర్కీ సైన్యాధిపతి దండయాత్రలో వంగ బౌద్ధులు విలువైన సంస్కృతీ చిహ్నాలుతోను, గ్రంథాలతోను నేపాలుకు వలసపోయారు. మహమ్మదీయులు చేసిన దారుణ మారణకాండలో నలిగిపోయింది. హింసా దౌర్జన్యంతో మహమ్మదీయులు చాలా కాలం వరకూ పరిపాలించారు.

ఈ కాలంలో ఇండొనియా రాజైన విజయునితో దౌత్య సంబంధాలు నెరిపారు. 11వ శతాబ్దంలో సేనావంశపు రాజులు పాలన సాగించారు. వీరి కాలంలో రాజధాని నాడియా. ఇక్కడి నుండి వీరిని ఢిల్లీ సుల్తాన్ కుతుబుద్దీన్ దండయాత్ర చేసి ఈ ప్రాంతాన్ని కైవసం చేసుకొని మొగలు సామ్రాజ్యంలో భాగంగా కలిపి వేయబడింది ఔరంగజేబు మరణానంతరం మొగలు రాజుల గవర్నర్ల పరిపాలనతో స్వతంత్రమైంది మరలా. వీరిలో ముఖ్యుడు సిరాజుద్దౌలా. అప్పటికే దేశంలో కాలు మోపిన ఈస్టిండియా కంపెనీ దొరలు లార్డ్‌క్లైవు నేతృత్వంలో క్రీ.శ. 1757 సంవత్సరంలో ప్లాసీయుద్ధంలో సిరాజుద్దౌలాను ఓడించారు. సిరాజుద్దౌలా యువకుడయిన బెంగాల్ నవాబు. హేయమయిన కంపెనీవారి ప్రవర్తనకు రోసిపోయి వారితో యుద్ధానికి దిగాడు. అయితే ఈయుద్ధంలో సిరాజుద్దౌలా ఈస్టిండియా కంపెనీ వారితో జరిగిన యుద్ధంలో అసమాన శౌర్య ప్రతాపాలు చూపి ఎదురొడ్డి నిలిచాడు. గెలుపు ఖాయంఅనే తరుణంలో నవాబుగారి సైన్యాధిపతి మీర్జాఫర్ చేసిన కుట్రవలన స్వామి ద్రోహం జరిగి సిరాజుద్దౌలా మరణానికి కారణమయ్యాడు. గెలుపు కంపెనీవారి పరమయింది. ఇది చరిత్ర. విస్మరించరాని కుట్ర. మనదేశ చరిత్రను ఒక ముఖ్య మలుపు త్రిప్పిన ఘటన కూడా ఈ యుద్ధమనే చెప్పవచ్చు. దీనితో ఈస్టిండియా కంపెనీ ఇంగ్లీషువారి కూటనీతి విభజించు-పాలించు తత్త్వానికి ఎనలేని శక్తినిచ్చివారి స్థిర పది

పాలనకు మిగతా భారతదేశ ఆక్రమణకు నాంది వాక్యం పలికిందని చెప్పవచ్చు. ఇటు వంటి కంపెనీవారి సహాయంతో గద్దెనెక్కిన మీర్ జాఫర్ కిరీటం కూడా ఎన్నాళ్లో నిలువలేదు. కొద్ది నెలల్లోనే వానిపతనం సంభవించింది. అతని తరువాత వచ్చినవారు కూడా అంతంత మాత్రపు వాళ్ళే గనుక కంపెనీవారు అధికారాన్ని మొత్తం హస్త గతం చేసికొని శాశ్వతపీఠం వేశారు. 1773లో అప్పటి నవాబుకి గుడ్‌బై చెప్పి బ్రిటిషువారి గవర్నర్ జనరల్‌గా పదవీ స్వీకారం చేశారు-వారన్ హేస్టింగ్స్.

ఆంగ్లేయులు కాలూని నిలవటానికి కారణమైన ఈ బెంగాలులో బ్రిటిషు వారు క్రమేణా బలపడి మన సువిశాల భారతం మీద పెత్తనం వహించటానికి అనువైన జమీందారీ పద్ధతికూడా ఇక్కడే శ్రీకారం చుట్టబడింది. మొదట బెంగాలు ప్రావిన్సుగా చేయబడినప్పుడు చాల విశాలమైన ప్రావిన్సుగా తయారయింది. అందులోని భాగంగా ప్రస్తుతపు బీహారు, ఒరిస్సా రాష్ట్రాలు కలియుటయేగాక పశ్చిమాన ఆగ్రావరకు విస్త రించి పోయింది. 1863లో ఆగ్రాను వేరుపరచి, 1874లో అస్సాం ప్రాంతాన్ని కలిపారు.

1905లో బెంగాలు రాష్ట్రం విభజించబడింది. అస్సాము, తూర్పు బెంగాల్. రెండింటిని కలిపి ఢాకా ముఖ్య పట్టణంగా సరికొత్త ప్రావిన్సు ఏర్పడింది. ఈ పని లార్డ్ కర్జన్ చేశారు. మనదేశ స్వతంత్ర పోరాట చరిత్రలో దీనికి బెంగాల్ విభజన పేరుతో పెద్ద అలజడిని సృష్టించిన ఘట్టముంది. బెంగాలు ప్రజల్లో ఉప్పొంగిన దేశభక్తి ఈ విభజనను ముక్తకంఠంతో నిరసించింది. దీనికి దేశం యావత్తు ఒక్కటై శృతి కలిపింది. దానితో అలజడులు చెలరేగాయి. ఈ పరిస్థితి 1911లో 5వ జార్జి ఢిల్లీదర్బారులో విభజనను రద్దుచేస్తూ చేసిన ప్రకటన అమలులోకి తీసికొని వచ్చి పరిస్థితిని చక్కదిద్దగలిగింది. దానితో కలకత్తా నుండి దర్బారు ఢిల్లీకి మార్చ బడింది.

దేశం దాస్య బంధనాల్నించి విముక్తం చెందిన సంవత్సరం 1947లో దేశం రెండు ముక్కలైంది. దేశవిభజనతోపాటు బెంగాలు కూడా రెండుగా విభజించవలసి వచ్చింది. భారతదేశంలో భాగంగా పశ్చిమ బెంగాల్, పాకిస్తాన్‌లో చేరిన భాగాన్ని ఈస్టు పాకిస్తానుగా రూపాంతరం చెందింది. ఈవిధంగా ఏర్పడిన పశ్చిమబెంగాల్‌లో 1950లో రాజపరగణా కూచ్‌బీహారు, ఫ్రెంచివారి ఆధీనంలో ఉన్న చంద్రనాగోర్ 1954 లోను, రాష్ట్ర పునర్నిర్మాణం కార్యక్రమంలో భాగంగా ప్రస్తుతపు పశ్చిమ బెంగాల్‌గా తయారయింది.

ఈ రాష్ట్రాన్ని 17 జిల్లాలుగా విభజించారు. అవి :—

బంకూరా, బీర్భూం, బర్ధమాన్, కలకత్తా, కూచ్‌బీహారు, డార్జిలింగ్, హుగ్లీ, హౌరా, జల్పాయిగురి, మాల్డా, మిడ్నపూర్, ముర్షిదాబాదు, నాడియా, పురూలియా, ఉత్తర 24 పరగణాలు, దక్షిణ 24 పరగణాలు.

రాష్ట్రానికి ప్రస్తుత ముఖ్యమంత్రి – శ్రీ జ్యోతిబసు. వామపక్ష కమ్యూనిస్టు పార్టీ వారు (C.P.M.)

ముఖ్యమైన పర్యాటక కేంద్రాలు – చూడదగిన విశేషాలు :

కలకత్తా :

విక్టోరియా మెమోరియల్, ఇండియన్ మ్యూజియం, జూలాజికల్ పార్కు, జైనదేవాలయం, కాళీఘాట్ దేవాలయం. బ్రిటిష్ వైస్రాయిలు కలకత్తా వచ్చినపుడు విడిదిచేసే బెల్‌వెడేర్ హౌస్– ప్రస్తుతం నేషనల్ లైబ్రరీ భవనంగా మార్చబడింది– నేషనల్ లైబ్రరీ, రాష్ట్ర గవర్నరుగారుండే రాజభవనం, మార్బుల్ పాలెస్, (పాల రాతి భవనం), ఈడెన్ గార్డెన్స్, డల్హౌసి స్క్వేర్. ప్రస్తుతం పేరు మార్చబడింది– బినయ్ – బాదల్ – దినేష్‌బాగ్‌గా – (హ్రస్వంగా B.B.D బాఘ్ అని అంటారు) దక్షిణేశ్వర్ ఆలయం, హౌరా బ్రిడ్జి, ప్రస్తుతం దేశం మొత్తంమీద మొట్ట మొదటగా పరిచయం చేయబడిన ట్యూబ్ లేక మెట్రో రైల్వే. ఇది ఆసియాలోనే ప్రథమం అని చెప్పవచ్చు.

డార్జిలింగ్ :

హిమాలయ పర్వత సానువుల్లో ఒరిగియున్న ఈపట్టణం దేశంలో పెద్ద వేసవి విశ్రాంతి కేంద్రంగా పేర్కొనబడింది. ఇక్కడ చూడదగినది– టౌన్‌హాల్, మ్యూజియం, అబ్జర్వేటరీ హిల్, బొటానికల్ గార్డెన్స్, బిర్చ్‌హిల్ పార్కు, టైగర్‌హిల్, సెంచాల్ సరస్సు, ఘూమ్ చర్చి.

శాంతి నికేతనం :

బీర్‌భమ్ జిల్లాలో ఉన్నది. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్‌చే స్థాపించబడిన విశ్వభారతి యూనివర్సిటీ.

**డీఘా :**

మిద్నపూర్ జిల్లాలో ప్రసిద్ధి చెందిన బీచ్.

**సతత హరితారణ్యాలు :**

సుందర్‌బాన్స్ - 24 పరగణాల జిల్లాలో విశాల మైదానంలా పరుచుకుని సంతతం పచ్చతోరణంగా భాసించే అటవీ ప్రాంతం.

ఇవి కాకుండా శ్రీరామకృష్ణ పరమహంస పుట్టిన వూరు- కామర్పుకూర్, వారి సతీమణి శారదాదేవి పుట్టిల్లు జయరాంబాటి, చిత్తరంజన్, వైద్యనాథ ధామ్, నవద్వీప ధామం, మాయాపూర్, తారకేశ్వరం మొదలైనవి హైందవాళి రుచులకు తగిన ప్రదేశాలు, దర్శనీయాలు. వీటన్నిటికి ఒరిస్సా నుండి నేరుగా కలకత్తాచేరి ప్రధాన నగరమైన కలకత్తానుండి ఆరంభిద్దాము.

# కలకత్తా

మన స్వతంత్ర భారతంలో కలకత్తా అతి జనసమ్మర్ధమైన మహా నగరం. ఢిల్లీలాగ పూర్వచరిత్ర పురాణ ప్రసక్తి ప్రాచీన వైభవం లేకపోవచ్చుగాక. ఈ మహానగర విస్తరణ అతి చిన్న ప్రదేశంలో షుమారు 300 సంవత్సరాలకు పూర్వం మాత్రమే అంకురార్పణ జరిగి, నేటి ప్రపంచం మొత్తంమీద అత్యధిక జనాభాగం పట్టణంగా రూపొందటానికి జరిగిన పరిస్థితులను ఒక్కసారి గుర్తుకు తెచ్చుకునేముందు ప్రస్తుతం మనం చూస్తున్న, చూడబోతున్న నేటి కలకత్తా గురించి ఈ క్రింద విశేషాలు గమనించండొకసారి.

1. దేశంలో అతిపెద్ద నగరం. వైశాల్యంలోను, జనాభాలోను, యునైటెడ్ కింగ్‌డంలోని లండను మహానగరానికున్న ప్రశస్తి ఈనాడు ప్రపంచంలో కలకత్తాకు ఉన్నది. జనాభా: సుమారు 1 కోటి.

2. ఈస్టిండియా కంపెనీగా ఆంగ్లేయులు కాలుపెట్టి, బలపడిన రోజునుండి దేశాన్ని వారి ఆధీనంలోకి పూర్తిగా తెచ్చుకునేంతవరకూ బ్రిటిష్ ఇండియా రాజధానిగా 1910 వరకూ ఉన్నది. తరువాత ఢిల్లీకి మార్చబడినది.

3. కలకత్తా అత్యున్నతం, అత్యల్పం ఒకేచోట దర్శనమిచ్చే వింత నగరం

4. అత్యధిక సంపన్నత – ప్రక్కనే పేదరికం.

5. జమీందారులు, అమీరులు, ఫకీరులు కలగాపులగంగా దర్శనమిచ్చే చోటు.

6. ఎంత దౌర్జన్యం వుందో అంత కారుణ్యం – ప్రశాంతము-అశాంతము.

7. నిర్లిప్తత – నియంత్రితం.

8. విప్లవం – ఉద్వేగం – ఉత్తేజం.

9. సస్యశ్యామలం– కాని నిరంతర క్షామపీడితం.

10. ఆకలి మంటలు– అన్నవరం.

11. పారిశ్రామికోన్నతి– ప్రక్కనే పేదరికం– దరిద్రాల విలయ తాండవం.

**కలకత్తా ఒక మహా నగరం :**

సువిశాలమైన స్వతంత్ర భారతంలో అత్యధిక జనాభా గలిగిన నగరం. జనాభా సుమారు 95 లక్షలు పైచిలుకు. యునైటెడ్ కింగ్‌డంలోని లండన్ మహా నగరానికి ధీటు రాగలిగిన నగరం. పశ్చిమ బెంగాలు రాష్ట్రానికి రాజధానీ నగరం.

ఇంత సువిశాలమైన జనసమ్మర్దం గలిగిన మహానగరానికి ఢిల్లీ మాదిరిగా పూర్వపు ఔన్నత్యంగాని, చరిత్రగాని లేవు. కేవలం 300 సంవత్సరాలలో విస్తృత మైన నగరవిస్తరణకి నాంది బ్రిటిషువారే కారణం అనిచెప్పుకోవాలి. ఈ నగరచరిత్రను పరిశీలిస్తే ఒక కుతూహలమైన వాస్తవకథ గోచరిస్తుంది. దీన్ని తెలుసుకోటానికి కాల గమనంలో 300 సం॥ వెనక్కి వెళదాం.

అది 1698 సం. నవంబరు తొమ్మిదోతేదీ. బ్రిటిషువారి ఈస్టిండియాకంపెనీ వారికోసం స్థానిక భూస్వామి అయిన సబర్నరాయ్ చౌదరి దగ్గర మూడుగ్రామాల్ని ఒక్కొక్కదానికి రు. 400/– చొ॥న మూడు గ్రామాలకు రు. 1200/– చెల్లించి మిస్టర్ జాబ్‌ఛార్నోక్ కొన్నాడు. ఆ మూడు గ్రామాలు కాళీఘాట్, గోవిందపూర్, సుతనాతి. ఈ ఛార్నోక్ మహాశయుడు అంతకు ముందు కొద్ది సంవత్సరాలక్రితమే వచ్చి ఆ ప్రదేశంలో స్థిరపడ్డాడు. సుతనాతిలో ఒక ఫ్యాక్టరీని కట్టుకొన్నాడు. అది కూడా 1690 లోనే.

చరిత్రలో ఛార్నోక్‌కి పెద్ద గుర్తింపు లేదు. కాని ఇక్కడికి వచ్చిన కొత్తల్లో ఒక సాహస ప్రదర్శన చేశాడు. ధీరోదాత్తత కనబరచిన హీరో– ధైర్యశాలిగా.

ఆరోజు అంత్యక్రియలు జరపటానికి ఒక శవాన్ని తీసుకొస్తున్న జన సమూహాన్ని చార్నోక్ చూడటం జరిగింది- ఏదో కతూహలంగా ఆ దోవనే వెళ్తూ. అది శ్మశానం. శవం యొక్క దహన సంస్కారాల కోసం చితిమంట ఏర్పాటు చేయబడింది. చనిపోయిన మనిషి యువకుడు- అతనికోస మొక్కటే కాకుండా అందాల భరిణె అయిన అతని భార్య బ్రతికుండగానే ఆమెకోసం కూడా ఒక చితిమంట ఏర్పాటు జరిగింది. ఆమె మూర్తీభవించిన దైన్యంలో శోకదేవతలాగా ఉన్నా చార్నోక్‌కి అంత విషాదంలోనూ ఒక అనిర్వచనీయమైన అందం పొడిగట్టింది. మనస్సు ద్రవించింది. ఆమె నెలాగైనా రక్షించాలని సమకట్టాడు. అక్కడికక్కడే క్షణంలోనే ధైర్యంగా ముందు కడిగేసి ఆమె చేయి పట్టుకుని- 'నీవిప్పుడు ఇలా దారుణంగా చావటానికి వీల్లేదు నాతో వచ్చేయ్' అని తనకు వచ్చీరాని బెంగాలీలో అన్నాడు. అతనేమన్నదీ ఆమెకు సరిగా అర్థం కాలేదు. తనను కేవలం మృత్యుముఖం నుంచి రక్షించటానికి వచ్చిన ఏ దేవుడో అయిఉంటాడని భావించింది. ప్రస్తుతం చనిపోయిన వ్యక్తి భర్తయినా అతనికోసం తన నిండు జీవితాన్ని బలి చేసుకోటానికి ఆమెకి ఇష్టం లేకుండా ఉండి ఉండవచ్చు. కాని తనని కాపాడింది దివ్యపురుషుడో, దేవదూతో కాదని ఈస్టిండియా కంపెనీ ఏజెంటు అని తెలియటానికి కొద్దిగా టైము పట్టింది.

ఆ క్షణంలో జరిగిన ఘటనను చూసి నిశ్చేష్టులై పోయారు బంధుజన సమూహం. సతీ సహగమనం ఆగిపోయిందని తెలిసేటప్పటికి ఓర్వలేక పోయారు. అందరిలోనూ ఆగ్రహం పెల్లుబికింది, మూకుమ్మడిగా ఛార్నోక్ మీద కలియబడటానికి సన్నద్ధులైనారు.

ఛార్నోక్‌లో ఆమె చేయి తాకిన క్షణం, ఆ వేళా విశేషమేమోగాని అతనిలో ఎనలేని సాహసం రగుల్కొన్నది. ధైర్యము, వివేకము ముప్పిరిగొన్నాయి. కత్తి దూశాడు. నిరాయుధులైన అందరి మీదికీ ఉరికాడు. కొంతమంది గాయపడ్డారు- ఆ 'సతి' నిర్వాహకులు పలాయనం చిత్తగించారు.

సతీ-సహగమనం ఆనాటి రోజుల్లో హిందూమతాన్ని పట్టిపీడిస్తున్న మూఢాచార జాడ్యం. దీనికోసం సంఘ సంస్కర్త శ్రీ రాజారామ్మోహనరాయ్ ఆనాటి బ్రిటిష పాలకులైన సర్ విలియం బెంటింకు మద్దతులో చట్ట పూర్వకంగా నిరోధించగలిగాడు స్త్రీల పాలిట దైవమైనాడు.

ఆనాడు హైందవ స్త్రీకి రక్షణ భర్త బ్రతికివుంటేనే. భర్త చనిపోయిన వెంటనే మానవత్వం మరచినవారై పైశాచికంగా ఆమె యిష్టంవున్నా లేకపోయినా అతనితో పాటే చితిమంటల్లో కాల్చే దారుణానికి 'సతి' అని పేరుపెట్టి సదాచార సంప్రదాయం పేరున మహిళలను మారణహోమానికి గురిచేశారు. ఇటీవల జరిగిన ఒక సంఘటన వలన ఈ దురాచారం మళ్ళీ వూపిరి పోసుకోవటం ఆరంభించింది. దానిని మొగ్గలోనే చట్టబద్ధమైన నిషేధంగా ప్రకటించింది మన ప్రభుత్వం. మానవుడు మనుగడలో ఎన్నో వినూతన పోకడలు పొడసూపుతున్న ఈ శతాబ్దపు అంచున పయనిస్తూ ఇంకా మూఢాచార మనస్కులై చీకటి కోణాల్లోకి జారిపోతున్నందుకు ఎంతయినా విచారించాల్సిందే। మతం మానవత్వాన్ని నేర్పితే- మానవుడు దానవుడై మరిస్తే- మరి నిష్కృతి వుందా- ఈ నరకానికి ?

ఈ బెంగాలీ మట్టిలో అనేక మంది భరతమాత ముద్దుబిడ్డలు పుట్టారు. దేశం దాస్యశృంఖలాబద్ధమై అతిహీనమైన దారిద్ర్యాన్ని అనుభవించే సమయంలో సముద్భవించిన మహామహులెందరో ప్రభవించారు. వారందరూ ప్రాతః స్మరణీయులే। సరే ఇక ప్రకృతానికి వద్దాం.

ముందు రాబోయే బ్రిటిష్ పాలనకు సూచికగా 1716లో అసలైన ఆంగ్లేయుల కోటబురుజు తలెత్తింది ఫోర్ట్ విలియం రూపంలో. తరువాత- ఇంకెంతో కాలం వ్యాపారులుగా వుండరు- పాలకులవుతారనే దానికి నాందీ సూచనగా భావించవచ్చు.

1717లో కంపెనీ వారు సంవత్సరానికి కేవలం మూడువేల రూపాయలు చెల్లించే షరతుమీద మొగలు చక్రవర్తి దగ్గర బెంగాల్ మొత్తంమీద స్వేచ్ఛా వ్యాపార విపణికి అనుమతిని పొందారు. అక్కడ వెలసిన కాళీఅమ్మవారి పేరున కాళీఘాట్ ఆంగ్లేయుల కలకత్తాగా మారింది. 1735 వచ్చేసరికి కలకత్తా ఒక మంచి వ్యాపార కేంద్రంగా లక్ష జనాభాతో విస్తరిల్లింది. ఆ రోజుల్లోనే 10 వేల టన్నులుపైగానే షిప్పింగ్ జరుగుతుండేది.

1756లో యువకుడైన బెంగాల్ నవాబు సిరాజుద్దౌలా కంపెనీవారి విస్తరణ కార్యక్రమాలు, సామ్రాజ్యవాదం, పెత్తనాలను అనకట్ట వేయాలని సమకట్టి కంపెనీ వారిమీద దండెత్తి సైన్యాన్ని ఓడించాడు. అయితే కలకత్తా నగరాన్ని మాత్రం అశ్రద్ధ చేసిన కారణంగా మరల 1757 జనవరిలో కంపెనీవారు లార్డ్ క్లైవు నేతృ

త్వంలో మళ్ళా యుద్ధంచేసి గెలిచి ఆ యుద్ధంలో సిరాజుద్దౌలాను ఓడించి నగరాన్ని హస్తగతం చేసికొన్నారు.

నవాబుకి—కంపెనీ వారికీ మధ్య రగిలిన తగాదా అంతటితో ఆగక అదే సంవత్సరంలో ప్లాసీవద్ద మరో యుద్ధానికి దారితీసి సిరాజుద్దౌలాను చంపివేశారు. నవాబు రాజధాని నగరం ముర్షిదాబాదుతో కంపెనీ తొత్తు నౌకర్ని నవాబుగా నిలబెట్టారు. కంపెనీవారి ముఖ్య కేంద్రం మాత్రం కలకత్తా నగరమే. క్రమంగా బలపడుతూ కొన్ని కొన్ని ఆక్రమణలు చేస్తూ విస్తరించు కుంటూపోయిన కంపెనీవారు, తమ ఆక్రమణ లన్నిటిమీద వారన్ హేస్టింగ్స్‌ను 1772లో గవర్నరు జనరలుగా నియమించింది. ఈ విధంగా కలకత్తా బ్రిటిషు ఇండియా రాజధానిగా రూపు దిద్దుకుంది.

'ఏదో అదృష్టం కలసొచ్చింది. పాలకులైనారు' అంటారు రూడియార్డు కిప్లింగు అనే ఆయన. అంతగాక పోతే ఈ కంపెనీ గ్రూపు ఎంత ? కొంతమందికి వుండే మహా ఒక రెండువందల మంది నౌకర్లు, దాకర్లు, మంగళ్ళు, వంటవాళ్ళు అందరూ కలిపి వుంటారేమో? కొంతమంది పంకాలు లాగేవాళ్ళు, అంగరక్షకులు, పల్లకీబోయీలు ప్రత్యేక మయిన సిగల శృంగారాలకు కావలసిన మంగళ్ళు, హెయిర్ డ్రస్సర్లు వీళ్ళందరికీ తోడుగా— ఒక డజనుమంది బలిష్ఠులు. ఇంతకంటె ఏముంటుంట— ఈ కంపెనీవారి పరివారం!

కలకత్తాను సాధించిన మొదట్లో వాళ్ళకు అట్టే పనికూడా ఏమీ వుండేది కాదు. ఇటువంటి కొన్ని గుంపులు కలిసి క్రమంగా సువిశాల భారతదేశాన్ని మొత్తం తమ గొడుగు క్రిందకు తెచ్చుకున్నారు బ్రిటిషు ఆంగ్లేయులు. ఈ కంపెనీవారు దేశం మొత్తాన్ని బ్రిటిషు సింహాసనానికి అప్పగించిన తరువాత గూడా కలకత్తా బ్రిటిషు ఇండియాకి రాజధానిగా ఉండేది 1912లో రాజధాని ఢిల్లీకి మార్చబడింది. అయినప్పటికీ కలకత్తా నగర విస్తరణకి ఏ మాత్రం గండిపడలేదు. శతాబ్దం చివరకి వచ్చేప్పటికి 1 లక్ష జనాభా— 80 లక్షలు, 90 లక్షలు— ప్రస్తుతం కోటి అంకెను మించుతుంది.

విశ్వకవి రవీంద్రనాథ టాగూరు కలకత్తాలో 1861లో జన్మించారు. ఆయన తన చిన్ననాటి జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ ఒక పుస్తకంలో ఇలా వర్ణించారు కూడా. కిరాయికి తోలే గుఱ్ఱపుబండ్లు, చల్‌చల్ గుఱ్ఱం అంటూ తోలేటప్పుడు గుఱ్ఱాలు పరిగెత్తేప్పుడు అప్పుడప్పుడు దుమ్ము లేస్తుండేది. ఈ బస్సులూ, కార్లూ,

ట్రాములు అప్పటి కింకా లేవు. రోజులు బహు బద్ధకంగా తేలిగ్గా గడుస్తూండేవి. ఈ తొందర — ఉద్వేగము లేవు. ప్రశాంతంగా గడిచిపోతుండేది. నిమ్మకు నీరెత్తినట్లుగా బాబు గార్లందరూ ఇంటి దగ్గర తీరిగ్గా హుక్కా పీల్చి, పాన్లు నములుతూ, పల్లకీల్లో కొంతమంది, బండ్ల మీద కొంతమంది తాపీగా ఆఫీసుల కెళ్తుండేవారు.

కలకత్తా ఇప్పటికీ అనేక వ్యత్యాసాలు, వైరుధ్యాలతో ఒక విభిన్నమైన నగరంగా, భిన్నత్వంలో ఏకత్వానికి నిదర్శనంగా గోచరిస్తుంది.

మహోన్నతమైన భవనాలు – మురికి కూపాలు ఒకదాని ప్రక్కన ఒకటి సాక్షాత్కరిస్తూ వింత అనుభూతిని కల్పిస్తుంది. అదే ఈ నగర విశిష్టత. అయితే ఇన్నింటిమీద కొట్టవచ్చినట్లు కనబడేది ఏమిటంటే కలకత్తా ఒక మహా నగరమన్న విషయం దీనంతటిలో అంతర్లీనమై యున్నది. ఒక ప్రత్యేకమయిన స్పందనాస్పదమైన ఆత్మ–పూసల్లో దారంలాగా అన్నిటినీ కలిపి కట్టేసింది. అరుదైన అందాలను పొదువుకుని ఉన్నది. వీటిని కూలంకషంగా తెలుసు కోవాలంటే ఆ నగర శోభలను తిలకించాలన్నా – ఆ ప్రజల్లోని ఉద్వేగభరితమైన విప్లవజ్వాలలను స్పృశించాలన్నా, వారిలో శమదమాదుల్ని – కారుణ్యాన్ని కండ్లారా చూడాలన్నా కొన్నాళ్ళు కలకత్తా నగరంలో వుంటేగాని అర్థంగావు. దూరంగా ఉంటే మనకు ఇవేమీ కనబడవు.

బెంగాలులో ఎన్నో మాణిక్యాలు ప్రభవించాయి. దేశచరిత్రలో సుస్థిరస్థానం సంపాదించుకుని అశేషమైన ప్రజాభిమానం పొందిన మహానాయకులు ఇక్కడ ఉద్భవించారు. వారందరూ ఆ యా రంగాల్లో నిష్ణాతులు. విశ్వకవి రవీంద్రుడు, హైందవ శంఖారావాన్ని ప్రపంచ మంతటా నినదించిన వివేకానందుడు, ఆయన గురువు–పరమ ధార్మిక తత్వదార్శనికుడు, సంఘ సంస్కర్త, రాజరామ్మోహన్ రాయ్, పరమహంస, ఆచార్య జగదీశ్ చంద్రబోస్. అసమాన దేశభక్తిని నిరూపించుకున్న సుభాష్ చంద్రబోసు, ఇండియన్ నైటింగేల్‌గా కీర్తిగాంచిన సరోజినీ నాయుడు మెట్టిన ప్రదేశం. దేశ స్వాతంత్ర్యంలో ప్రధాన పాత్ర వహించిన కాంగ్రెసు మహానాయకులు ఎంతోమంది ఇక్కడ ప్రభవించి భారతీయతకు– జాతీయతకు– బహుధా జీవచైతన్యా అను ప్రోది చేసిన మహామహు లెందరో ఉన్నారు. అసలు జాతీయ కాంగ్రెసు పుట్టుక యిక్కడ. వారందరినీ గురించి ముచ్చటించు కుంటూపోతే ఈ గ్రంథం చాలదు– మన ప్రస్తుత విషయానికి అవరోధంగా నిలుస్తుంది. సాహితీ రంగంలో సరికొత్త నూతన ప్రక్రియలకు– నవల– నవతకు నాంది పలికింది కూడా ఇక్కడేనని చెప్ప వచ్చు. ఇకరండి కలకత్తాలోని విశేషాలు చూద్దాం.

మానికంగా ఉన్నది. ప్రపంచంలో అందమైన కట్టడాల్లో ఒకటిగా పరిగణించబడుతూ కీర్తించబడింది. దేశంలో రెండవ తాజ్‌మహల్‌గా ప్రశస్తి కెక్కింది. కట్టడానికి ఉపయోగించిన చలవరాళ్ళు తాజ్‌మహల్ ఉపయోగించిన చలవరాళ్లు ఎక్కడైతే తవ్వితీశారో ఆ ప్రదేశాలయిన జోద్‌పూర్‌లోని మక్రానా, రాజస్థాన్ నుంచి త్రవ్వించి తెప్పించి కట్టారట. ఈ భవనం ఇటలీ సాంస్కృతిక పునరుజ్జీవనం తర్వాత నిర్మాణ రీతుల్లో మహమ్మదీయ నిర్మాణ చాతుర్యం కలగలిపి సర్ విలియం ఎమర్సన్ రూపొందించిన ప్లాన్ ప్రకారం నిర్మించబడింది.

ఇందులో థామస్ బ్రూక్ రూపొందించిన విక్టోరియ మహారాణి కంచు విగ్రహంతో సహా—సుమారు-3,500 పురాతన వస్తు సముదాయములు ప్రదర్శితమవుతున్నాయి. ఇందులో దేశ చరిత్రకి సంబంధించిన చిత్రములు, శిల్పాలు, డాక్యుమెంట్లు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. బౌద్ధ శిల్ప కళాఖండాలు కూడా ప్రదర్శితం. చక్కటి గార్డెన్, 7వ ఎడ్వర్డ్ చక్రవర్తి మెమోరియల్ ఆర్చ్, [illegible], లార్డ్ కర్జన్ విగ్రహాలు కూడా చూడవచ్చు. మొత్తం 25 గాలరీలున్నాయి.

రోజ్‌వుడ్‌తో తయారు చేయబడిన పియానో కూడా ఉంది. మహారాణి యువతిగా ఉన్నప్పుడు ఈ పియానో వాయిస్తూ ఉండేదట సంతోష సమయాల్లో. శుక్రవారాలు తప్ప అన్ని రోజుల్లోనూ చూడవచ్చు. సోమవారం సెలవు.

## ది మార్బుల్ పాలెస్ :

కలకత్తా మల్లిక్ వంశస్తులకు చెందిన ఈ భవనం చోరేబాగన్‌లో ముక్తారాంబాబు వీధిలోనున్నది. ఎప్పుడైన చూడవచ్చు. శిల్ప చాతుర్యం చాల అద్భుతం. చూడదగినది. ముఖ్యంగా ప్రముఖుడైన రూబెన్ రూపొందించిన 'ది మేరేజ్ ఆఫ్ సెయింట్ కాథరిన్- సర్ జోషువారేయనాల్డ్స్'. హెర్క్యులిస్ తన చిన్న తనంలో కొండ చిలువను పట్టి పల్లార్చటం వగయిరాలు కనువిందు చేస్తాయి. మొత్తంమీద ఈ భవనం కట్టడానికి దాదాపు 90 రకాల పాలరాళ్ళు ప్రపంచం నలుమూలలనుండి సేకరించి ఉపయోగించారు. దీనిలో సేకరించబడిన కళాఖండాలు కూడా అద్భుతమైనవే; కళాకారులకు, ఉత్తమ కళాభిరుచి గలిగిన వారు ప్రతివారూ చూడదగ్గ అభినందనీయ కట్టడం. సోమ గురువారాలు తప్ప ప్రతిరోజూ 10 గం. నుండి 5 గం.ల వరకూ దర్శించవచ్చు. కట్టడిలేదు.

## జైన దేవాలయం :

24 గురు తీర్థంకరులలో 10వ వారైన షీతల్‌నాథ్‌జీకి అంకితమైన దీ జైన దేవాలయం. 1867లో నిర్మించారు. దీన్నే పరాశ్‌నాథ్ మందిర్ అనికూడా అంటారు. ఒక ప్రత్యేక తరహాలో హైందవ శిల్పరీతుల్లో రంగు రంగుల గాజు పలకలతో విశిష్టంగా నిర్మించబడింది. ఒక చిన్న సరోవరము, మంచి ఉద్యానవనముతో శోభిల్లుతుంది. యాత్రికులకు మరువలేని అనుభూతిని కలిగిస్తుంది. ఈ దేవాలయం నగరానికి ఈశాన్య దిశలో నున్న బద్రిదాస్ టెంపుల్ స్ట్రీటులో వున్నది.

## ఇండియన్ మ్యూజియం :

చౌరంఘీ-సద్దర్‌స్ట్రీట్ మూలపైన మైదానానికెదురుగా చాల అనువుగా అమరివున్న దీ మ్యూజియం. అంతర్జాతీయ ప్రసిద్ధి చెందింది. దీని నిర్మాణం 1857 సం॥. ఈ సంవత్సరములోనే భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి నాందిగా శిపాయిల కలహము జరిగింది. ఈ మ్యూజియం ఇండియాలోనే కాక మొత్తం ఆసియా కెల్లా పెద్దదిగా పేర్కొనబడింది. సద్దర్ స్ట్రీటులో విడిది చేసేందుకుగల అనేక హోటళ్ళల్లో దిగే సామాన్యులకూ, మాన్యులకూ అందరికీ అనువుగా అందికలో వున్నదని చెప్పవచ్చు. దీన్నే కలకత్తా 'జాదూఘర్'గా చెప్పుకొంటారు. ఈ మ్యూజియంలో అనేక రకాలైన అరుదైన వస్తు ప్రదర్శన వుంది. చారిత్రక యుగానికి పూర్వపు అనేక జంతు కళేబరాలు, అస్థి పంజరాలు, పెద్ద పెద్ద సముద్రపు తాబేళ్ళు, అనేక జంతువులు చనిపోయిన వాటి చర్మాల్లో మాదిపీను వగయిరాలు కూరి మరల బ్రతికి వచ్చినట్టు కనిపించేరీతిలో అమర్చబడి వున్నాయి. ఒరిస్సా దేవాలయాల్లో పురాతన బౌద్ధ శిల్పాల కళాఖండాలు, తథాగతుని అనేక కీతుల విగ్రహాలు ... రాలు పురాతన చారిత్రక విశేషాలు ఎన్నో వున్నాయి. ప్రతిరోజు 10 గం. నుండి 5 గం. వరకూ ప్రదర్శితం, సోమవారాలు సెలవు దినం. చలికాలం అంటే డిశంబరు నుండి ఫిబ్రవరి నెలల్లో మాత్రం ఒక అర గంట ముందుగా మూసివేస్తారు. శుక్రవారం మాత్రం ఫ్రీ మిగతారోజుల్లో- టికెట్టు 0-50 మాత్రం.

## జూలాజికల్ గార్డెన్సు :

కలకత్తా రేసుకోర్సు కెదురుగా మైదానానికి దక్షిణంగా సుమారు 16 హెక్టార విస్తీర్ణంలో జూలాజికల్ గార్డెన్స్ అమరియున్నవి. దీనికి అంకురార్పణ జరిగింది

1876లో. చిత్రవిచిత్రములైన పక్షులు, జంతుజాలములు స్వాభావికంగా స్వేచ్ఛగా విహరించటానికి వీలుగా చేయబడ్డాయి. పొద్దు పొడిచిందగ్గరి నుండి పొద్దు క్రుంగే వరకూ ప్రవేశం ప్రదర్శితం. ప్రవేశ రుసుం 1 రు. మాత్రం, అలీపూర్ రోడ్‌లో బాకి దక్షిణంగా ఉల్లాసాన్ని కలిగించే విధంగా కమనీయమైన హార్టీ కల్చరల్ గార్డెన్సున్నాయి. ఉ. 6 గం. నుండి 10 గం. వరకు.. సా. 2 గం. నుండి 5 గం ల వరకు మాత్రం- ప్రవేశ రుసుం 0-50 పై. మాత్రం.

**కాళీఘాట్ ఆలయం :**

చాలా పురాతనమైంది. ఒకసారి పురాణ కాలంలోకి వెళ్ళి వద్దాం. ఆదిపరా శక్తి అవతారం. పార్వతీదేవి దక్ష ప్రజాపతి కుమార్తె సతిగా అవతరించిన కథకూ ఈ ప్రదేశానికీ ఎంతో సంబంధం వుంది. దక్ష ప్రజాపతి కుమార్తె సతి తండ్రి యిష్టానికి వ్యతిరేకంగా శివుని ఇల్లాలయింది. హరిద్వారం దగ్గర వున్న కంఖాల్ ముఖ్య పట్టణంగా మహా వైభవోపేతంగా ఏలుతున్న సామ్రాజ్యానికి చక్రవర్తి ఒక మహా యజ్ఞాన్ని తలపెట్టాడు. ఈ యజ్ఞానికి అందరినీ ఆహ్వానించాడు. కాని కక్ష కొద్దీ అల్లుడైన శివునిగానీ, కుమార్తె సతినిగానీ పిలవలేదు. కాని పుట్టింటివారి ఈవైభవో పేతమైన మహాయజ్ఞం వార్తవిని సతీదేవి భర్తయైన శివుని హెచ్చరికను గూడా పెడ చెవిని పెట్టి యజ్ఞాన్ని చూడాలనే ఆకాంక్షతో తండ్రి సదనానికి వెళ్ళింది. పిలవని పేరంటంగా ఆమెని చూడంగానే దక్షుని ముఖంలో చెప్పలేనంత ఆగ్రహం పొడ సూపి శివుని దుర్భాషలాడాడు, గర్వోన్నతుడైన తండ్రి తన కుమార్తె భర్తృదూషణ సహించలేదని కొంచం కూడా ఆలోచించలేకపోయాడు. ఆ తండ్రి కుమార్తెగా మహా దేవుని దూషణ ఆయన యిల్లాలుగా భరించలేకపోయింది. పట్టరాని శోకంతో అవ మాన భారంతో యజ్ఞ కుండంలో దూకి ఆత్మాహుతి చేసుకొంది. శివుడు కాలరుద్రుడై పోయాడు. రుద్ర గణాలను వెంట బెట్టుకొని, వీరభద్రుని సృజించి దక్షుని యాగాన్ని ధ్వంసం చేశాడు. సతీదేవి దేహాన్ని చేతిలోకి తీసుకొన్నాడు. శోకతప్తుడై ఆ సతీదేవి శవాన్ని భుజంమీది కెత్తుకుని భూనభూంతరాళాలు గిరగిర తిరిగేటట్లుగా శోకిస్తూ లోకాలన్నీ తల్లడిల్లేటట్లు తిరిగాడు. లోకాలన్నీ కంపించి పోయాయి.

అప్పుడు శ్రీ మహావిష్ణువు సుదర్శన చక్రాన్ని ఉపయోగించాడు. ఆ చక్రం దేహాన్ని ఖండ ఖండాలుగా నరికి వేసింది. గిరగిర తిరిగే సుదర్శన చక్రాయుధం పాలైన సతీదేవి దేహం అవయవాలన్నీ ఛిన్నమై అనేకచోట్ల పడిపోయాయట. ఆమె

పాదాలు మాత్రం భాగీరథిలో పడిపోయి ఆ ప్రదేశం పునీతమైంది. ఆ ప్రదేశమే కాళీఘాట్.

కొంతకాలం తరువాత ఒక బీద బ్రాహ్మణుడు, నిత్యకర్మానుష్ఠి. పావన గంగా తీరంలో నివసించే ఆయనకు ఒక దృశ్యం కానరాసాగింది. మహిమోపేతమైన అమ్మ వారి పాదాలు శిలాసదృశమయి అంతులేని వింత కాంతి పుంజాల్ని విరజిమ్ముతూ అక్కడ వున్నట్లుగా అనుభూతి పొందసాగాడు. ఆయన ఆ పాదాలను సేకరించి కాళీమాతగా ప్రతిష్ఠించి ఆరాధించసాగాడు. అది భాగీరథీ తీరాన ఒక దట్టమైన అడవి. మాతను విశ్వశించినదారందరూ అక్కడికి వచ్చి ఆమెని సేవించారు.

ఇలా కాలం దొర్లిపోతూంది. కొంతకాలం తరువాత ఒక స్వామి ప్రయాణిస్తుండగా అడవిలో అమ్మవారి భజనలు కీర్తనలు వినటం తటస్థించింది. ఆగాడు. మరలా మరలా విన్నాడు. చూడాలని మనస్సు తొందరించింది. చూచాడు. అమ్మవారి స్వరూపం దేదీప్యమానంగా తేజోవంతంగా కనిపించి మహా మహిమోపేతమైన శక్తిస్వరూపిణిగా గ్రహించాడు. ఆ మహానుభావుడు అమ్మవారికి ఒక ఆలయాన్ని నిర్మించాడు. ఆమె అక్కడి వారందరికీ ఆరాధ్యదైవమయింది. కోర్కెలు దీర్చే కొంగు బంగారమయింది. ఆ ప్రదేశం ఆమె పేరుమీదనే కాళీ-ఘాట్- లేక కాళీ-క్షేత్రంగా ప్రసిద్ధమైంది. అదే నాటి ఆంగ్లేయుల పాలబడి కలకత్తాగా మారి ఈనాడు ప్రపంచంలో సగర్వంగా తలెత్తుకుని నిలబడి, భారతదేశం మొత్తంమీద మహానగర ప్రతిపత్తిపొందిన కలకత్తా మహానగరంగా మనకు దర్శనమిస్తుంది.

ఈ కాళికాలయానికి ఇంగ్లీషువారు సైతం భక్తిమీరవచ్చి కోర్కెలు సాఫల్యం పొంది అర్చనలు, భారీ కానుకలు యిచ్చేవారని ప్రతీతి. పాశ్చాత్యులు సైతం ఆ చౌక రోజుల్లోనే దాదాపు రు. 10,000/- ఖర్చుచేసి ఆరాధనలు, కానుకలు కొల్లలుగా సమర్పించే వారంటే ఆలయమహాత్మ్యం, ప్రసిద్ధులను గురించి వేరుగా చెప్పాలా? బ్రిటిషు ఇండియాకి కలకత్తా నగరం రాజధానిగా ఉన్నంతకాలం వారిని కాపాడుతూనే వుందని చెప్పుకోవచ్చు అమ్మవారు.

హైందవప్రాశస్త్యంలో ఈ అమ్మవారికి విశేషమైన ప్రాచుర్యం వుంది. దేశం నలుమూలలనుండి యాత్రికులు వస్తారు. ఎప్పుడూ యాత్రికులతో క్రిక్కిరిసి వుంటుంది. విధిగా చైత్రమాసంలోను, ఆశ్వయుజ మాసంలోను నవరాత్రోత్సవాలు

మహావైభవంగా జరుగుతాయి. 52 శక్తిపీఠాల్లో ఒక శక్తి పీఠం. నిస్తుల మహిమాన్వితమైనది–కలకత్తా కాళిగా ప్రసిద్ధి చెందినది.

## డల్హౌసి స్క్వేర్ :

B. B. D. బాగ్. బ్రిటిషు ఇండియా అధికార కేంద్రం కలకత్తా. ఆనాడు ఈ చదరంలో ఉత్తరభాగాన ఒక పెద్ద బ్రహ్మాండమైన భవనం 1880లో కట్టించారు. దాన్నే WRITERS BUILDING గా వ్యవహరించేవారు. ఇక్కడ ఈ భవనంలోనే ఈస్టిండియా కంపెనీవారి రాతకోతలన్నీ జరిగేవి. ఇప్పుడు పశ్చిమబెంగాల్ రాష్ట్ర కార్యాలయంగా ఉన్నది. ఈ చదరంలోనే కలకత్తా G. P. O. కూడా వుంది. మరో ప్రక్కన వెస్ట్ బెంగాల్ టూరిస్టు డెవలప్‌మెంట్ కార్పొరేషను ఆఫీసు అమరి వుంది.

## బిర్లా ప్లానిటోరియం :

టూరిస్టు ఆఫీసుకు దగ్గరలోనే ప్రపంచంలోనే అతి పెద్దదైన ప్లానిటోరియంలలో ఒకటిగా పరిగణించబడే ఈ నక్షత్రవేధశాల చూడదగింది. టిక్కెట్టు 50 రూపాయలు మాత్రం, ఇంగ్లీషులోను, వివిధ భారతీయ భాషల్లోను కార్యక్రమాలుంటాయి. మనకు కావాల్సిన భాషను గురించి కార్యక్రమ వేళలు తెలిసికోవాలంటే దిన పత్రికలు చూడాల్సిందే- తప్పదు మరి ।

## ఫోర్టు విలియం :

కలకత్తాలోని ఫోర్టువిలియంకు ఒక ప్రత్యేక ప్రతిపత్తి వుంది. 1798–1805 లార్డ్‌వెల్లస్లీ గవర్నరు జనరల్‌గా ఇక్కడినుండే తన ఫర్మానాలు అధికారికంగా జారీ చేసేవారు. బ్రిటిషు ఇండియావారి అధికార సమయంలో ఈ కోట మహోన్నతంగా వెలిగింది. బ్రిటిషు రాచరిక పోకడలకు అనుగుణంగా ప్రత్యేక శ్రద్ధతో గ్రేషియన్ స్టైలుతో డెర్బీషైర్‌లోని లార్డ్‌కర్జన్‌గారి పురాతన భవనానికి ప్రతీకగా నిర్మించబడింది. చుట్టూ అగడ్తలు, పచ్చికబయళ్లు, కంకరతో పక్కా రోడ్డులు, పుష్పవనాలు చూడముచ్చటగా ఉంటాయి. 1912 వరకు రాచరిక కార్యకలాపాలు ఇక్కడినుండే జరిగేయి. రాజధానిని ఢిల్లీకి మార్చిన పిదప బెంగాల్ గవర్నరుగారి అధికార నివాసంగా మార్చబడింది. యుద్ధాల్లో వశపరచుకొన్న తుపాకులు వగయిరాలు కూడా భద్రంగా వుంచారు. ఇక్కడే ఈ ప్రదేశంలోనే కలకత్తా బ్లాక్‌హోల్ కూడా చూడ

వచ్చు. పోస్టాఫీసుకు ఈశాన్యంగా ఉన్నదిగా చెప్పుకుంటారు. అయితే స్వతంత్రం వచ్చిన తరువాత ఆ చిహ్నాలన్నీ తుడిచివేశారు.

ఇంకా ఈ దగ్గరలోనే సెయింట్ జాన్ చర్చి 1787 ప్రాంతమునాటి కట్టడం, దగ్గరలోనే కలకత్తా మూలపురుషుడయిన జాబ్‌చార్నోక్ స్మారక మందిరం, అడ్మిరల్ వాట్సన్ మొదలైనవారి సమాధులు వగైరాలు అభిరుచి కలిగినవారు చూడవచ్చు.

షహీద్‌మినార్ :

ఇది ఒక అపూర్వమైన కట్టడం. 78 మీటర్ల ఎత్తున మైదానంలో చౌరంఘీని చూస్తూ ఉన్నటువంటి ఒక జయస్తంభం. సర్ డేవిడ్ ఆక్టర్లోనీ నేపాల్ యుద్ధంలో గెలిచినందులకు ఆయన స్మృతి చిహ్నంగా కట్టబడింది. ఈ నిర్మాణం సిరియా ఈజిప్టుల శైలి కలయికగా రూపొందింది. పై భాగమంతా సిరియా శైలి. క్రింది భాగమంతా ఈజిప్షియన్. ఇది ఎక్కి చూడాలంటే డెప్యూటి కమీషనర్ ఆఫ్ పోలీసు, పోలీసు హెడ్‌క్వార్టర్స్, లాల్‌బజారు వారి పర్మిషను విధిగా కావాలి.

నఖోడా మసీదు :

B. B, D. బాగ్ ఉత్తరాన ముస్లిములకు ప్రధాన ఆరాధనీయమైన స్థలం. ఒక్కసారిగా 10, 000 మంది నమాజు చేయటానికి వీలుగా ఉంటుంది. ఆగ్రా దగ్గర సికింద్రలో గల అక్బరు మహాచక్రవర్తి సమాధిని పోలినది ఈ మసీదు. ఎర్ర తారు రాయితో కట్టిన 46 మీటర్లు ఎత్తుగల రెండు స్తంభాలు సగర్వంగా నింగిని చూస్తుంటాయి.

నేషనల్ లైబ్రరీ :

పూర్వం బెల్‌వెడేర్ భవనం అనబడే ఈ భవనం ఇటాలియన్ శైలిలో కట్టబడింది. ఒకప్పుడు బ్రిటిష్ వైస్రాయి వారన్‌హేస్టింగ్సు నివాసంగా ఉన్నది. ఇప్పుడు సింహద్వారంలో మూడు ఆర్చీలతో రాయల్ బెంగాల్ టైగర్ రాజసాన్ని ఒలికిస్తూ మూడు ఆర్చీలని చుట్టుకుని ఠీవిగా ఆహ్వానం పలుకుతుంది. ఇది భారత దేశం మొత్తానికి పెద్దదైన లైబ్రరీ. ఇక్కడ సుమారు కోటి గ్రంథాలకు పైగా వివిధ భాషల్లోను లభ్యమవుతాయి. ఇవేకాక అనేక పురాతన తాళపత్ర గ్రంథాలు, వ్రాతప్రతులు, డాక్యుమెంట్లు చూడవచ్చు. వాతావరణం కూడా చాలా ప్రశాంతంగా వుంటుంది.

రవీంద్ర సరోవరం :

ఇక్కడ ఒక సరోవరము మంచి పార్కు ఉన్నాయి. ముఖ్యంగా ఎత్తయిన తాటి చెట్లు ప్రశాంతవాతావరణంలో నిలిచిన సైనికుల్లా దర్శనమిస్తాయి. సరస్సుకు ఆగ్నేయదిశలో జపాను వారి బుద్ధదేవాలయం ఉంది. చూడవచ్చు. సరస్సుకు దక్షిణాన కలకత్తా రామకృష్ణ మిషను సాంస్కృతిక సంస్థ, లైబ్రరీ, రీడింగు రూము, లెక్చరు హాల్సు వగైరాలు ఉన్నాయి.

శ్రీ అరవింద భవనం :

షేక్స్పియర్ సరణిలో భారతీయ ఆధ్యాత్మిక తత్త్వదార్శనికులయిన శ్రీ అరవింద మహర్షి తత్త్వ గ్రంథములను ప్రదర్శిస్తూ, ఆధ్యాత్మిక తత్త్వాన్ని ప్రబోధించే జ్ఞాపికలతో ఒక పాలరాతి భవనం సాంస్కృతిక నిలయంగా తీర్చిదిద్దబడింది భవనంలో. ఇది ఇటీవలనే రూపొందించబడింది.

ఈడెన్ గార్డెన్స్ :

మైదానానికి ఉత్తరపు కోనల్లో ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని కలిగించే ఉద్యానవనాలు, 1856 లో నిర్మించబడిన బర్మావారి దేవాలయం ఈ పార్కుల్లోనే ఉన్నది. టౌన్ హాల్, ఇంపీరియల్ లైబ్రరీ వగైరాలు కూడా ఉన్నాయి. యువతరాన్ని ఉర్రూతలూగించే ప్రపంచ ప్రసిద్ధికెందిన క్రికెట్ మాచ్‌లెన్నో జరిగిన కలకత్తా క్రికెట్ గ్రౌండ్సు కూడా యిక్కడే ఉన్నాయి. బోట్‌క్లబ్, రేస్‌కోర్సు కూడా ఇక్కడే చూడవచ్చు.

కలకత్తా పరిసరాలలో చూడదగినవి :

బొటానికల్ గార్డెన్స్ :

హుగ్లీనదికి పశ్చిమతీరంలో శిబిపూర్‌లో ఉన్నాయి. ఈ బొటానికల్ గార్డెన్స్ సుమారు 1 కిలో మీటరు వరకు పరుచుకొని వున్నాయి. సుమారు 109 హెక్టార్ల విస్తీర్ణం కలిగి వున్నాయి. వీటికి 1786 లో నాంది జరిగింది. ఈ తోటల్లో విశేషించి పెంచి అభివృద్ధి చేసిన టీ (తేయాకు) మొక్కలనే ప్రస్తుతం విస్తృతంగా పెంచబడుతున్న అస్సాం, డార్జిలింగు టీ తోటల పెంపకానికి మొట్టమొదట ఉపయోగించటం జరిగింది. ఇక్కడ ముఖ్య ఆకర్షణ అతి పురాతనమైన మర్రిచెట్టు. సుమారు

400 మీటర్ల స్థలాన్ని ఆక్రమించిన ఈ మహావృక్షం చల్లటి నీడనిస్తుంది. 100 అడుగుల ఎత్తు పెరిగి సమున్నతంగా చూస్తుంది. ఈ ప్రాంతం చౌరంఘీకి సుమారు 19 కి. మీటర్లుంటుంది. నదిని దాటటానికి బోట్లు కూడా ఉంటాయి లేదా హౌరాబ్రిడ్జి మీదుగా గాని, హౌరా వెళ్ళి చేరవచ్చును. బస్సులు కూడా ఉన్నాయి.

బేలూరు మఠం :

నగరానికి ఉత్తరాన పడమటి తీరంలో నెలకొని ఉన్న ఈ ప్రదేశం అంత ర్జాతీయ ఖ్యాతినందిన శ్రీరామకృష్ణమిషను వారి ప్రధాన కేంద్రం. శ్రీరామకృష్ణ పరమహంస హైందవ తత్వవేత్త. గొప్ప దార్శనికుడు. సర్వమత సామరస్యాన్ని భగవంతుని ఏకత్వాన్ని, సర్వమానవ సమానత్వాన్ని చాటి చెప్పిన మహామహులు. సర్వసంగపరిత్యాగి. 1886లో శ్రీరామకృష్ణులు ఇహలోక యాత్ర చాలించిన పిదప ఆయన ప్రధాన శిష్యులైన శ్రీ వివేకానందస్వామి 1897లో శ్రీ రామకృష్ణ సేవా సంస్థను స్థాపించారు. 1899లో బేలూరు మఠమును ప్రధాన కేంద్రంగా స్థాపించడం జరిగింది. ఈ సంస్థసేవా కార్యక్రమాలు మన భారతదేశంలోనే కాక విదేశాల్లోకూడా ప్రశస్తినందాయి. సంస్థ శాఖలు దేశమంతటా అన్ని చోట్లా వ్యాపించి విస్తరిల్లాయి మానవసేవలోని పరమార్థాన్ని చాటుతూ ఎక్కడ ప్రకృతి వైపరీత్యాలు జరిగినా ముందుండి సేవాకార్యక్రమాలు నిస్వార్థంగా నిర్వహించబడుతున్నాయి. బేలూరు మఠంలో ఒక చర్చి, ఒక మసీదు, ఒక దేవాలయం అన్నీ మన మేధృష్టితో చూస్తే ఆ విధంగా కనబడుతుంది. సర్వమానవ సమానత్వానికి ప్రతీకగా మనకు దృగ్గోచర మవుతుంది. మఠము ఉదయం 6-30 నుండి మధ్యాహ్నం 12 గంటలవరకు- సాయంత్రం గం. 3-30 నుండి 7-30 వరకు తెరచియుంచబడుతుంది. అందరూ ఆహ్వానితులే- దర్శనం ఉచితం.

దక్షిణేశ్వరం :

బేలూరు మఠంనుండి దూరముగా గంగకవతల ఒడ్డున పెద్ద గోపురాలతో కనబడుతూ వుంటుంది. మహానగరానికి సుమారు 20 కి. మీటర్లు దూరంలో ఉంటుంది. చాలా ప్రశాంత వాతావరణంలో రాణీ రాసమణీదేవి నిర్మించిన గొప్ప ఆలయం. 1847లో నిర్మించబడింది. శ్రీరామకృష్ణుని దివ్యానుభూతులకు ఆధ్యాత్మి కోన్నతికి నిత్య నివాసంగా భాసిల్లిన ప్రదేశం. ఇక్కడ రాధాకృష్ణాలయం, కాళీమాత ఆలయం, శివాలయం చాలా ముఖ్యమయినవి. శ్రీరామకృష్ణ పరమహంసవారు నడ

యాడిన ఆ పవిత్రస్థలం. వాడిన వస్తువులు ఒక గదిలో భద్రపరచి పవిత్రముగ ఉంచబడినాయి. పరమహంస ధ్యానసమాధిలోనున్న ప్రదేశం పంచవటీవృక్షచ్ఛాయలు గంగా తరంగాలు మోసుకునివచ్చే పిల్లగాలులు మన మనస్సుల కెంతో హాయిని ఆనందాన్ని ఇస్తాయి.

ఇంకా-

1) ఇక్కడనేగల యెగోడా మఠము, లేక యెగోడా సత్సంగ సొసైటీ- 1939 స్థాపితమైనది. దీనికి వ్యవస్థాపకులు పరమహంసయోగానంద వారు. విదేశాల్లో కూడా శాఖోపశాఖలుగా వర్ధిల్లుతూ ప్రపంచ ప్రఖ్యాతి నందినది.

2) గౌడియామిషన్ : శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు వారి సంప్రదాయాన్ని ప్రచారం చేసే మఠము.

3) గౌడియామిషన్ (రిజిస్టర్డు)- గౌరాంగమహాప్రభు సంప్రదాయంలో భాగవత ప్రామాణ్యంగా సంకీర్తన ప్రధాన ఆశయంగా ఉన్న సంస్థ- గంగా పశ్చిమ తీరంలో నెలకొని ఉన్నది. చూడవచ్చును. ఇక్కడ ఒక చక్కని మందిరం ఉన్నది. చక్కని కృష్ణపరమాత్మని మందిరం, గౌరాంగుని విగ్రహం ఉన్నాయి. భక్తితో అర్చనలు, దీపారాధనలు చేస్తుంటారు.

డైమండు హార్బరు :

హూగ్లీ నుండి వచ్చిపోయే స్టీమర్లు ఈ హార్బరుగుండా వెళ్తుంటాయి. ఇక్కడ హూగ్లీ నది కొంచం వంకర తిరిగి సముద్ర సంగమానికి ఉరకలు వేసే చోటు. బహు రమణీయమైన ప్రకృతి దృశ్యం. ఇక్కడ వసతికి వెస్ట్ బెంగాల్ టూరిస్టు డెవలప్ మెంట్ కార్పొరేషను ద్వారా రిజర్వేషన్లు పొందవచ్చును. విడిదికి లాంచిలోవెళ్ళి సాగరికా టూరిస్టు లాడ్జిలో బస చేయవచ్చు.

హాల్దియా :

హాల్దియాపోర్టు. కలకత్తాకు దక్షిణంగా 86 కి. మీ. దూరంలో హుగ్లీనది పడమటి తీరంలో ఉంది. ఓడరేవు మేటవేయటం వలన కలకత్తాకు తగ్గిపోయిన ప్రాముఖ్యం గూను పునరుద్ధరించటానికి కట్టబడింది హాల్దియా రేవు.

## గంగాసాగర్ :

ఇది గంగ సాగరసంగమం చేరే స్థానం. చాల పవిత్రమైనదిగా గణుతికెక్కింది. మాఘమాసంలో మకర సంక్రాంతి సమయంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. అనేకమంది యాత్రికులు వచ్చి స్నానాలు వగైరాలు చేస్తారు. సాధువులు, సన్యాసులు, గృహస్థులు విశేషంగా వస్తారు. స్టీమరులో వెళ్ళాలి. సాధువులకు భోజన వసతులు, స్టీమరు ఏర్పాట్లు కలకత్తా సేట్లు ఏర్పాటు చేస్తారు. భోజనసామాగ్రి, మంచి నీరు వగైరాలు ముందే సేకరించి పెట్టుకోవాలి.

సముద్రతీరంలో ఆదినాధ క్షేత్రమొకటున్నది. ఇది అష్టాదశ శక్తి పీఠాల్లో 14వదిగా చెప్పుకుంటారు.

## డిఘా :

కలకత్తానుండి 185 కి. మీ ఆగ్నేయంగా ఉన్న సముద్ర తీర విశ్రాంతి కేంద్రం. కలకత్తానుండి డిఘాకి ప్రతి రోజూ CSTC వారు బస్సులు నడుపుతున్నారు. 6 గంటల ప్రయాణం. ఇక్కడికి దగ్గరిలోనే సుమారు 8 కి.మీ దూరంలో ఒరిస్సా సరిహద్దునానుకుని చందనేశ్వర ఆలయం వుంది. ఇది కూడా చూడవచ్చు.

## బఖ్ఖాలి :

దీన్నే ఫ్రేజర్‌గంజ్ అని కూడా అంటారు. కలకత్తా నగరానికి తూర్పున హుగ్లీ నదీతీరంలో 132 కి.మీ దూరంలోవున్న మరో సముద్రతీర విశ్రాంతికేంద్రం హాయి గొలిపే కొబ్బరి తోటలు ప్రకృతి సహజమైన కొన్ని చిన్ని చిన్ని వృక్ష సముదాయాలు ఉన్నాయి. ఇక్కడనుండి బోటులో జంబూ ద్వీపానికి కూడా వెళ్ళి రావచ్చు. విడిదికి వెస్ట్ బెంగాల్ టూరిస్టు కార్పొరేషను వారిద్వారా పొందవచ్చు

## సుందర్‌బాన్స్ :

బంగ్లాదేశ్ సరిహద్దులోకి చొచ్చుకొనిపోతూ ఏర్పడిన అటవీ ప్రాంతం. గంగా నది సాగరసంగమం చేసే చోటు. చాంటా బ్లాకులోను, లోథియన్ ద్వీపంలోనూ రాయల్ బెంగాల్ టైగరును ఇంకా చూడగలం. ఈ వన్యమృగ జాతి మొత్తం మానవుల స్వార్థానికి బలైపోయి రానురాను అరుదై పోతూంది. మామూలు వన్యమృగాలు తేళ్ళు, దుప్పులు, కొండచిలువలు, చిరుతపులులు, కోతులు, కొండముచ్చులు, మొసళ్ళు వగైరాలును చూడవచ్చు.

కలకత్తాకు — ఉత్తరంగా — పరిసరాలు :

చంద్రనాగూరు :

కలకత్తా నగరానికి సుమారు 39 కి. మీ. దూరం. ఒకనాటి ఫ్రెంచివారికాలనీ హుగ్లీ తీరాన ఫ్రెంచివారి సంస్కృతిని, ప్రత్యేకతలను వెలార్చే చర్చిలు, ప్రార్థనా మందిరాలు, కాన్వెంటులు, సమాధులు, పునాదులు మొదలైన వాటన్నిటితో పాటు రెండు హైందవ దేవాలయాలు— 1) భువనేశ్వరి, 2) నందలాల్ ఆలయాలు.

బాన్స బెరియా :

సుమారు 43 కి. మీ. పైగా వుంటుంది. ఇక్కడి వాసుదేవ ఆలయం, హంసే శ్వరి ఆలయాలు శిల్ప చాతురికి ప్రసిద్ధి పొందాయి.

హుగ్లీ పట్టణం :

మహానగరానికి 41 కి. మీ. దూరం. చిన్సూర, బండేల్ అనే రెండు చూడద గిన ప్రదేశాలకు అతి సమీపం. హుగ్లీ పట్టణం కలకత్తా పెరగక ముందు ఒక ముఖ్య అంతర్జాతీయ వ్యాపార కేంద్రం. 1537లో పోర్చుగీసువారు ఒక కర్మాగారాన్ని నిర్మించుకున్నారిక్కడ. ఇక్కడికి 10 కి. మీ. దూరంలో బెంగాల్‌లో ప్రముఖమైన రేవుగా వుండేది. కాని తరువాత వరదల మేటల కారణంగా ఉపయోగించటం మాని వేశారు. ఇప్పటికీ ఆనాటి వైభవ చిహ్నాలు అక్కడక్కడా చిరు జ్ఞాపికలుగా కన బడుతుంటాయి. 1632లో షాజహాన్ పోర్చుగీసువారిని తరిమికొట్టాడు. మళ్ళీ మరు సటి సంవత్సరమే అనుమతించాడు. 1651లో బ్రిటిషువారి ఈస్టిండియా కంపెనీ కూడా కాలు పెట్టింది. 1836లో ప్రసిద్ధమైన ఇమాంబారా పెద్ద పెద్ద స్తంభాలతో కట్టబడినది. ఈ వూరులో ముఖ్యంగా దర్శనీయమైన ప్రదేశం.

చిన్సూరా :

డచ్చివారికి బ్రిటిషువారు తమ అధీనంలో ఇండోనేషియాలోని సుమత్రా దీవినిఇచ్చి ఇక్కడ ఈ నగరాన్ని వారి దగ్గరనుండి మార్పిడిగా తీసుకున్నారు. 1678లో కట్ట బడిన డచ్ చర్చి అష్టకోణాకృతిలో ఉన్నది దర్శనీయం. ఒక కిలోమీటరు దూరంలో డచ్ వారి గోరీలదొడ్డి సమాధులున్నాయి.

బండేల్ :

మరి రెండు కి. మీ దూరంలో హుగ్లీ తీరంలోనే ఉన్నటువంటి మంచి పిక్నిక్ స్పాట్. ఇక్కడ అతి పురాతనమైన పోర్చుగీసు చర్చి ఉన్నది. మొదట 1599లో నిర్మించబడింది. కాని మొగల్ చక్రవర్తి షాజహాన్ దండయాత్రలో పూర్తిగా విధ్వంసం చేయబడింది 1640లో. తరువాత మళ్ళీ కట్టారు.

కామర్పుకురా, జయరాంబాటి :

శ్రీరామకృష్ణ పరమహంస పుట్టిన వూరు కామర్పుకురా. శ్రీ రామకృష్ణ సేవా సంస్థకి కొన్ని ఉద్యానవనాలు, తోటలున్నాయి. ఒక దేవాలయం కూడా ఉంది. పరమహంస పూర్వనామం గదాధరుడు. 1836 ఫిబ్రవరి 18వ తేదీన వీరి జననం.

జయరాంబాటి : శ్రీరామకృష్ణుని సతీమణి శ్రీ శారదాదేవి జన్మస్థలం మాత జన్మదినం. 1853 సం. డిశంబరు 22వ తేదీ. ఇక్కడ శ్రీరామకృష్ణ మిషనువారు ఒక దేవాలయాన్ని ఏర్పరచారు. మాత శారదాదేవి 20-7-1920న స్వర్గస్తురాలైనారు. వీరి బోధలు అమృతప్రాయాలు.

శాంతి నికేతనం :

బోల్పూరుకు దగ్గరలో విశ్వకవి రవీంద్రుడు స్థాపించిన విశ్వభారతి విశ్వవిద్యాలయం- 1901లో శాంతినికేతనం ఒక స్కూలుగా ప్రారంభించారు ఠాగూర్. ఈనాటికి అది ఒక పెద్ద విశ్వవిద్యాలయంగా రూపొందింది. ఆరుబయట గురుకుల పద్ధతిలో మానవునికి ప్రకృతికి గల అవినాభావ సంబంధాన్ని దృఢతరం చేస్తూ విద్యాబోధన జరిగేది, గొప్ప గొప్ప విద్వాంసులు, జాతీయ నాయకులు ఈ శాంతి నికేతనంలో అధ్యయనం చేసినవారెంతోమంది. దేశప్రతిష్ఠను ఇనుమడించే పదవుల్లో అలంకృతులైనారు. శ్రీ రవీంద్రనాథ ఠాగూరు మహాశయునికి నోబెల్ బహుమతి వచ్చింది. మనదేశ జాతీయగీతం, జనగణమన రచయిత ఠాకూర్. దేశస్వాతంత్ర్యానికి పాటుపడిన మహామహులు, నాయకులు ఆనాటి బ్రిటిష్ పాలకులకు శత్రుసమానులు- కాని ఠాగూర్ మహాశయులు మాత్రం ఇంగ్లీ వారికి ప్రీతిపాత్రమైనవారు.

వసతికి యూనివర్సిటీ గెస్ట్‌హౌస్ వుంది. బోల్‌పూర్ స్టేషన్‌లో రైల్వే రిటైరింగు రూములు కూడా లభ్యం.

దుమ్ముర్దహా :

బండేల్‌నుండి సుమారు 15 కి. మీటర్లుంటుంది. ఇక్కడికి సమీపంలో శ్రీ సీతారాందాస్ ఓంకార్‌నాథ్‌గారి ఆశ్రమం వుంది. వీరు అపర గౌరాంగులని ప్రసిద్ధి చెందారు. ఇక్కడనేగాక ముఖ్యంగా పూరిలోను, ఓంకారేశ్వర్‌లోను మరి అనేక యితర ప్రాంతాల్లో ఆశ్రమాలున్నాయి.

మాయాపూర్ — నవద్వీప ధామం :

శ్రీ చైతన్య మహా ప్రభువు యొక్క జన్మస్థానం. బెంగాల్‌ను పరిపాలించిన హిందూ రాజుల్లో ఆఖరివారైన లక్షణసేన్ రాజధాని. కలకత్తానుంచి 114 కి. మీ. నదిని దాటి అవతలకి వెళ్తే మాయాపూర్. ఒకనాటి సంస్కృత పాండిత్యానికి ప్రముఖం. ఎంతోమంది దార్శనికులు, పండిత ప్రకాండులు ఉండేవారు. కాని ఈనాడు భాగీరథిపైనున్న ఘాట్లు శిథిలావస్థలో ఉన్నాయి. గౌరాంగుడు ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ నాడు జన్మించారట. బెంగాలీలు ఈ పూర్ణిమనే హోలీ పండుగగా భావిస్తారు. డోలా పూర్ణిమ అని కూడా అంటారు. 16వ శతాబ్దపు ప్రారంభంలో చైతన్య ప్రభువులు పాదచారులై దేశమంతటా తిరిగి శ్రీకృష్ణభక్తిని ప్రచారం చేసిన మహనీయులు. ఆయన 48వ యేటనే పరమపదించారు.

నవద్వీపధామంలో భాగీరథి, మహాప్రభుని జన్మస్థానం, శ్రీ వాసుగృహం, సువర్ణ గౌరాంగ, రాధాకృష్ణ మందిరం, నందకుమార్ మందిరం, భజనాశ్రమము వగైరా.

మాయాపూర్: హరేకృష్ణ ఉద్యమానికి ప్రధాన కేంద్రం. ఇక్కడ కూడా శ్రీకృష్ణ భక్తిని ప్రేరేపించే ఆలయాలున్నాయి. కొంతమంది గౌరాంగుని అనుయాయులు ప్రకారం మయాపూర్ గౌరాంగ జన్మస్థలంగా నమ్ముతారు.

కెన్‌దులి :

శ్రీ జయదేవుని అష్టపదులు విననివారెవరూ లేరు. కృష్ణభక్తిలో మధురభక్తి తత్త్వంలో పరాకాష్ఠ జయదేవుని గీతగోవిందం. సంస్కృతాష్టపదులు. సంగీత సాహిత్యాల్లో విశిష్టస్థానాన్ని సంపాదించుకొని ఇప్పటికి బహుళ ప్రచారంలో వుండి శాస్త్రీయ సంగీత స్వరంహాలిలో చోటుచేసుకొని గానం చేయబడుతున్నాయి. ఆ జయదేవకవి జన్మస్థానం. ఆయన గౌరవార్థం ప్రతి సంవత్సరం మాఘమాసంలో పెద్ద ఉత్సవం కూడా జరుగుతుంది. వేలకొలది యాత్రికులు వచ్చి దర్శించి వెళుతుంటారు.

ప్లాసీ :

1757లో బెంగాలు నవాబు సిరాజుద్దౌలాకు ఫ్రెంచివారు బాసటగా నిల్చి-బ్రిటిషువారితో పోరాడిన ప్రదేశం, బ్రిటిషువారి అదృష్టాన్ని తిప్పి పాలనకు పురి గొల్పడానికి మలుపుకు కారణమైన ప్రదేశం. కలకత్తాకు 172 కి. మీ. ఉత్తరాన ఉన్నది. చరిత్రప్రసిద్ధమైన ప్రదేశం. ఇక్కడి నుండి 10 కి. మీ. దూరంలోనున్న ఫరీద్‌పూర్‌లో సిరాజుద్దౌలా సమాధిని కూడా చూడవచ్చు.

ముర్షిదాబాదు :

ఒకప్పుడు మంచి వ్యాపారకేంద్రం. కాని యిప్పుడు బెంగాల్ గ్రామీణ జీవితానికి ప్రతీకగా ప్రశాంతంగా ఉంటుంది. ఆనాటి సిరాజుద్దౌలా ముఖ్యపట్టణం. బ్రిటిషువారి కుట నీతికి, దుష్ప్రయత్నాలకు అడ్డుకట్టవేయాలని ప్రయత్నించి ఓడిపోయిన ధీరుడు. ఇక్కడ పురాతన మొగలుల వైభవాల అవశేషాలు కూడా చూడవచ్చు. 1837లో నిర్మించబడిన హజార్ ద్వారా అంటే వేయి స్థంభాలు– నిజామత్ ఖిల్లా కట్రా మసీదు. కాత్‌గోలా వగైరాలు చూడవచ్చు.

ఇది చాల చిన్న పట్టణం. కేవలం ప్రస్తుతం 20,000 జనాభాలోపే. చౌకలో హోటల్ హిస్టారికాలో దిగవచ్చు. భోజనం కూడా చౌకగా వుంటుంది.

ఇంగ్లీషు బజారు :

లక్షలోపు జనాభా గలిగిన ఒక చిన్న పట్టణం. డార్జిలింగుకి వెళ్ళే త్రోవలో భాగీరథీతీరంలో ఉన్నది. పూర్వపు బెంగాలు నవాబుల కాలానికి చెందిన ఎన్నో అవశేషాలను ఇక్కడ చూడవచ్చు.

గౌరు :

ఇక్కడినుండి 7 కి. మీ. దూరంలో మహమ్మదీయులు రాకముందు బెంగాలు రాజధానిగా ఉన్న ప్రదేశం. గంగా, మహానంద నదులు కలిసే చోటున వెలసిన నగరం. పురాతనమైన కోట, మసీదులు, జయస్థంభాలు ఇక్కడ మిగిలే వున్నాయి. మహమ్మదు ప్రవక్తయొక్క అడుగు జాడలున్నాయి. ఇక్కడికి దగ్గరలోనే ఉన్న పాతమాల్డా పాండువాలను కూడా చూడవచ్చు. పాండువానాటి అధికార కేంద్రం, అనేక శిథిల భవనాలున్నాయి పురాతన వైభవాన్ని చాటుతూ.

బకేశ్వర్ :

బీరభూం జిల్లాలో ఉన్నది. పురాతనపు మౌని శ్రేష్ఠుడు, అష్టావక్రుని గురించిన కథలెన్నో ప్రచారంలో ఉన్నాయి. అక్కడ దాదాపు 250 చిన్న చిన్న శివాలయాలు ఆవరించుకుని ప్రధాన శివాలయం ఉంది. శైవపీఠాల్లో ఇది ఒకటిగా పరిగణించబడుతుంది. చిత్తరంజన్, బీహార్ సరిహద్దులో ఉంది. అసన్‌సోల్‌నుండి 25 కి. మీటర్లుంటుంది. దేశబంధు చిత్తరంజన్‌దాస్ పేరిట వెలసిన ఒక రైల్వే స్టేషను గల గ్రామం. లోకోమోటివ్ ఫ్యాక్టరీతోను మరి యితర రైల్వే కర్మాగారాలతోను మహానగరమైంది. ఈ చిత్తరంజన్ నుండి 10 కి. మీ. దూరంలోనే ఉన్నది.

వైద్యనాథధామ్ :

వైద్యనాథధామం చేరటానికి జేవ్‌ఘర్ స్టేషన్‌లో దిగవచ్చును. ద్వాదశజ్యోతిర్లింగములలో 11వది. ఇక్కడ 22 ప్రధాన ఆలయాలున్నాయి. లింగము శిరస్సుమీద రావణుని బొటనవ్రేలి నొక్కు ముద్రగలదని ప్రతీతి. గంగతో అభిషేకించటానికి యాత్రికులు విశేషంగా వస్తారు.

జిసిధి దగ్గర పరిశాలు కలుస్తారు. అనేక ధర్మశాలలున్నాయి. ఇక్కడి జలవాయువు, శివగంగ స్నానములు కుష్టువ్యాధిని సైతం నయం చేయగలవనే గాఢ నమ్మకం వున్నది.

చూడదగినవి : శివగంగ, జగదంబ, బైజుభక్తమందిరం.

విష్ణుపూర్ :

చరిత్రప్రసిద్ధమైన ఈ పట్టణం కలకత్తానుండి సుమారు 200కి.మీ దూరంలో ఆగ్నేయదిశగా ఉంది. మల్లరాజుల పాలనలో రాజధానీ నగరంగా విలసిల్లింది. అనేక దేవాలయాలు కట్టించారు శిల్పకళా సౌందర్యం మూర్తీభవించి ఉన్న దేవాలయనిర్మాణం. టెర్రాకోటా రంగురంగుల హౌనెక్స్‌తో అందాల రాసి పోసినట్లుగా కనువిందు చేస్తాయి.

దాల్మదాల్ ఫిరంగి :

ఈ ఫిరంగి మీద అందమైన చెక్కడాలు గలిగి చాల పెద్దది. మహారాష్ట్రుల దాడులను శక్తివంతంగా అరికట్టటానికి మల్లరాజు గోపాల్‌సింగ్ కాలంలో గొప్పగా ఉపయోగపడిందని చెప్పుకొంటారు.

**రాస్‌మంచ్ :**

పెద్ద ప్లాట్‌ఫారమ్. ఇక్కడ శ్రీకృష్ణ భగవానుని రాసలీలోత్సవం మల్లరాజుల కాలంలో జరిపేవారట. దీనికి ద్వారాలున్నాయి.

**మదన మోహనుని ఆలయం :**

బెంగాలు శైలిని పుణికి పుచ్చుకున్న దేవాలయం 1694 లో నిర్మాణం జరిగింది. 1758 లో రాధేశ్యాం మందిరం కట్టబడింది. ఇది గాక ఇంకా పురాతన కాలంనాటి దుర్గామందిరం, శ్యామరాయ్ మందిరం ముఖ్య ఆకర్షణలు. అన్నిటి మీద టెర్రా కోటారంగు వేయబడింది. మల్లరాజుల కాలంనాటి శిధిలాలు పురాతత్త్వ అధ్యయన పరులకు ప్రత్యేక అభిరుచిని కలిగించేవిగా ఉంటాయి.

ఇక్కడికి దగ్గరలోనే తూర్పు భారతం మొత్తానికి తలమానికంగా నిలిచిన పెద్ద స్టీలుప్లాంటు మరెన్నో యితర పరిశ్రమలకు నిలయమైన దుర్గాపూర్ కూడా ఉంది.

**తారకేశ్వరం :**

బండేల్‌నుండి షోరాపూరి జంక్షను మీదుగా తారకేశ్వరం స్టేషనుకు చేర వచ్చును. ఇక్కడి ముఖ్య విశేష మేమంటే వ్యాధిగ్రస్తులు వచ్చి సేవలు చేసి వ్యాధి విముక్తి పొందగలరని గట్టి నమ్మకం. కనుక వ్యాధి గ్రస్తులు సేవలు చేస్తుంటారు తారకేశ్వరుని ఆలయంలోని స్వామివారికి. స్వామి దర్శనార్థం యాత్రికులుకూడా విశేషంగా వచ్చి అర్చనలు చేసి పోతుంటారు.

**కలకత్తా నగరంలో వసతులు, సౌకర్యాలు.**

**సమాచారం :**

అతి పెద్దదైన కలకత్తా జనరల్ పోస్టాఫీసు (Calcutta G P.O) B.B D. బాగ్‌లోనే వుంది. ఇక్కడ వుత్తరాలు యాత్రికులు పోష్టు మాస్టరు C/o అడ్రసుతో వ్రాసే వుత్తరాలు చిరునామాదారు వచ్చేవరకు అట్టిపెట్టేందుకు ప్రత్యేకమయినవిభాగం Poste-Restante సమర్థంగా పనిచేస్తున్నది ఉంది. ఇక్కడే టెలిఫోన్ భవన్ కూడా ఉంది.

సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు — 8, రెడ్ క్రాస్ ప్లేస్ – ఇక్కడి నుండి అంతర్జాతీయంగా విదేశాలకు టెలిఫోన్ చేయవచ్చు. అందుకు చాల సౌకర్యంగా కూడా వుంటుంది.

Foreigners' Registration Office -- (TEL : 44301) నం. 237 —ఆచార్య జగదీశ్ చంద్రబోస్ రోడ్డు.

అమెరికన్ ఎక్స్‌ప్రెస్ : నం. 21 ఓల్డ్ కోర్టు హౌస్.

టాక్సు ఎగ్జంప్షన్ సర్టిఫికెట్టుకి : రూము నం. 31, 4th Floor, ఇన్ కంటాక్సు బిల్డింగు, బెంటింకు స్ట్రీటు.

గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు నం 4, షేక్‌స్పియరు సరణి. ఫోన్స్ : 441402, 443521.

వెస్టు బెంగాల్ టూరిస్టు బరో, 3/2, బి.బి.డి. బాగ్. ఫోన్ : 238271. కలకత్తా G. P. O. కి ఎదురుగానే. రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల యాత్రిక సమాచార కేంద్ర విభాగాలు రెండో విమానాశ్రయంలో ప్రత్యేక కౌంటరులున్నాయి.

కలకత్తా డమ్‌డమ్ విమానాశ్రయం అంతర్జాతీయ ప్రసిద్ధి చెందింది. ఈ నగరానికి ప్రపంచం అన్ని దేశాలనుంచి ఎయిర్ కనెక్షన్సున్నాయి. ముఖ్యంగా ఎయిర్‌లైన్సు ఆఫీసులన్నీ చౌరంఘీలోనే దర్శనమిస్తాయి. ఇండియన్ ఎయిర్‌లైన్సు ఆఫీసు చిత్తరంజన్ వెన్యూలలోను, బర్మా ఎయిర్‌వేస్ ఆఫీసు మైదానం ఉత్తరం ట్రామ్ టర్మినస్‌లోను ఉన్నాయి.

## చౌరంఘీలో ఉన్న ఎయిర్‌లైన్సు ఆఫీసులు :

ఎరోఫ్లాట్, ఎయిర్ ఇండియా, బంగ్లాదేశ్ బిమాన్, బ్రిటిష్ ఎయిర్‌వేస్, రాయల్ నేపాల్ ఎయిర్‌లైన్సు, థాయ్ ఇంటర్నేషనల్, వాయుదూత్ వగైరాలు.

ఇక్కడ దగ్గరలోనే సద్దర్ స్ట్రీటులో కొన్ని ట్రావెల్ ఏజన్సీలు డిస్కౌంటులో ఎయిర్ టిక్కెట్టును సంపాదించిపెట్టేవికూడా ఉన్నాయి.

## సౌకర్యంకోసం కొన్ని కన్సులేట్ ఆఫీసులు, అడ్రసులు.

1) బంగ్లాదేశ్, నం. 9 సర్కస్ అవెన్యూ ఫోన్ : 444458

2) భూటాన్ : నం. 48, టివోలికోర్టు, ప్రమోదేష్ బారువా సరణి. ఫోన్ : 441301

3) వెస్ట్ జర్మనీ : నం. 1, హేస్టింగ్సుపార్క్ రోడ్డు. ఫోన్ : 459141
4) నేపాల్ : నం. 19, స్ప్రెరండెల్ రోడ్డు, ఫోన్ : 452024
5) నెదర్లాండ్సు : నం. 18, A. బ్రాబౌర్న్ రోడ్డు, ఫోన్ : 262160
6) థాయ్‌లాండ్ : నం. 18, B. మండవిల్లీ గార్డెన్సు. ఫోన్ : 460836
7) యు. కె. నం . 1, హోచిమిన్ సరణి. ఫోన్ : 445171
8) యు. ఎస్. ఎ. నం. 5/1 హోచిమిన్ సరణి. ఫోన్ : 443611

గమనిక :-

రంగూన్‌కు కలకత్తా సింహద్వారంలాంటిది. అయినా యిక్కడి బర్మా ఎయిర్ వేస్ వీసాలు యివ్వటానికి వీల్లేదు. కనుక బర్మా దౌత్య కార్యాలయాలున్నటు వంటి కాట్మాండు, ఢాకా లేక న్యూఢిల్లీలకు వెళ్ళవలసిందే.

టూర్లు :

షేక్స్ పియర్ సరణిలో ఉన్న ఇండియన్ టూరిజమ్ డెవలెప్‌మెంటు కార్పొరేషను, B.B.D. బాగ్‌లోని వెస్ట్ బెంగాల్ టూరిస్టు బరో ప్రతిరోజూ టూర్లు నిర్వహిస్తున్నారు. ఆదివారం మాత్రం వుండవు. ఉదయం గం. 8 నుండి 12-30 ని॥ల వరకు సిటీలో దగ్గరలో ఉన్న స్థలసందర్శనకు టిక్కెట్టు రు. 21/-లతో లభ్యం.

సాయంకాలం 1-30 నుండి 5-15 వరకు నిర్వహించబడే సందర్శన కార్యక్రమాలకు కూడా అదే ఛార్జీ వుంటుంది. కాని ఒకేరోజు రెండు టూర్లు కలిపి తీసికుంటే లాభం, టిక్కెట్టు రు. 26/- మాత్రమే. అనుకోకుండా ఒక్కోసారి ఈ స్థల సందర్శనలు రద్దు చేయబడతాయి. విచారించి తెలుసుకోటం ముఖ్యం.

వాహన సౌకర్యాలు :

నగరానికి చాలినంతగా లేవని చెప్పవచ్చు. బస్సులు బహురద్దీగా వుంటాయి. జేబుదొంగలు చేయివాటం జాస్తిగా వుంటుంది. దొంగలుంటారు జాగ్రత్త. మామూలు బస్సులకు తోడుగా మినీ బస్సులు కూడా తిరుగుతుంటాయి. అయితే ఛార్జీ కొంచం ఎక్కువ.

ట్రాములు :

ఒక రకంగా చెప్పాలంటే డబ్బారేకుల డబ్బాలవంటివి. బహుజన సమ్మర్ధంగా ఉంటాయి. వీటిని ప్రభుత్వం వారే నడుపుతున్నారు.

అండర్ గ్రౌండులో సొరంగ మార్గంగా రైలుమార్గం :-

నిర్మాణం జరుగుతుంది. అధికమైన శ్రమ కోర్చి నిర్మించటం జరుగుతుంది. ప్రస్తుతానికి చౌరంఘీలైను మాత్రం అమలులోకి వచ్చింది. సోమవారం నుండి శుక్రవారం వరకూ మాత్రమే. శని, ఆదివారాల్లో ఈ మార్గం మూసి వుంచబడుతూంది. ప్రొద్దుటి పూట 9 నుండి 11 వరకు. సాయంకాలం 3 గం. నుండి 8 గం. వరకు మాత్రం స్టాండర్డుగా టిక్కెట్టు 1 రూపాయి మాత్రం. ఇక ఆఖరుకు ఎట్టకేలకు మెట్రో రైల్వేలో మాత్రం ఇంట్లు టోలిగంజ్ నుంచి డమ్‌డమ్ విమానాశ్రయం వరకు నడుస్తాయట.

టాక్సీలు :

మీటరు మీద మాత్రం నడవటం కష్టం. పెట్టగలిగిన వారికి, అవసరాన్నిబట్టి బేరం ఆడుకోడం మాత్రమే.

లాగుడు రిక్షాలున్నాయి. మనం ఎక్కి లాగమనడం ఈ రోజుల్లో చాల అన్యాయంగా తోస్తుంది మనకు. కాని మోయలేని బరువులు పెట్టెలు వగైరాలు వేయటానికి ఉపయోగించుకోవచ్చు.

సద్దర్ స్ట్రీటులో సైకిళ్ళు అద్దెకు దొరుకుతాయి. గంటకు 2 రూపాయలు. రోజంతా కావాలంటే 10 రు॥లకు దొరకవచ్చు.

# వసతులు - సౌకర్యాలు

## మహానగరంలో అతిథుల్నేవలో

### ధర్మశాలలు - సత్రాలు :

1) బినాని ధర్మశాల.
81, పాతురియాఘటి స్ట్రీట్.
ఫోన్స్ : 338089, 338323.
రిజర్వేషన్లుకి : ఆర్గనైజర్, బినాని ట్రస్ట్,
38, స్ట్రాండ్ రోడ్.

2) బాబూలాల్-అగర్వాల్‌కి ధర్మశాల
169 – A, మహాత్మాగాంధీ రోడ్, ఫోన్ – 331123
ఉచితవసతి – 3 రోజుల వరకు మాత్రమే. వంటపాత్రలు వగైరాలు కూడా లభ్యం – హిందువులకు మాత్రమే.

3) బారాసిఖ్ సంగత్
172, మహాత్మాగాంధీ రోడ్, ఫోన్ – 335227
ఉచితవసతి – భోజనం – 5 రోజులవరకు మాత్రం వుండవచ్చు.
గమనిక : పొగ త్రాగటం, మత్తుపదార్థములు సేవనం నిషేధం.

4) ధన్‌సుఖ్ దాస్ జెయిత్‌మల్ జైన్ ధర్మశాల
జైనులకు మాత్రమే ప్రత్యేకం.
44, బద్రిదాస్ టెంపుల్ వీధి, ఉచిత వసతి సౌకర్యం.

5) దిగంబర్ జైన్ భవన్ ధర్మశాల
10/1, మదన్ మోహన్ బర్మన్ స్ట్రీటు
ఉచితవసతి – హిందువులకు మాత్రం.
మూడు రోజులు మాత్రం

6) కాళీఘాట్ గురుద్వారా, 31, రాస్‌బెహారి అవెన్యూ, ఫోన్ – 411727
ఉచిత సౌకర్యం, పొగ, మత్తు పదార్థములు నిషేధం, మూడురోజులు.

7) నేత్రం బజారు ధర్మశాల, నం. 25, బర్తాలా స్ట్రీట్
ఉచిత వసతి సౌకర్యం – ఇన్నాళ్ళని పరిమితం లేదు.

8) సేఠ్ జమ్నాదాస్ టిబ్రెవాలా ధర్మశాల, 164, చిత్తరంజన్ ఎవెన్యూ,
హిందువులకు మాత్రమే – మూడురోజులు మాత్రం – ఉచితసౌకర్యం.

9) శ్యామదేవ్ ఛటక ధర్మశాల. 150, మహాత్మాగాంధీ రోడ్,
ఉచిత వసతి – 5 రోజులు మాత్రం.

**అతి తక్కువలో – హోటళ్ళు :**

సద్దర్ స్ట్రీట్‌లోనే ఉన్నాయి. హౌరా స్టేషను దిగగానే ఏ టాక్సీ, ఆటో వారైనా సరే సద్దర్ స్ట్రీట్ పేరు చెబితే చాలు– ఇక్కడికే తీసుకువస్తారు, ఇండియన్ ప్రక్కనే చాలమందికి తెలిసిన సాల్వేషను ఆర్మీ రెడ్ షీల్డ్ గెస్టుహౌస్ రాత్రిపూట

పడక సౌకర్యం ఒక్కొక్క రాత్రికి రు. 13/-ల్లో ఏర్పాటు చేస్తుంది. నీటి సౌకర్యం కొంచం తక్కువేనని చెప్పవచ్చు.

సద్దర్ స్ట్రీట్‌లో కొంచం కిందికి వస్తే అక్కడ స్టువార్టు లేన్‌కూడ ప్రక్కకి తిరగంగానే మోడరన్ లాడ్జి, హోటల్ పారగాన్ అని రెండు హోటళ్ళున్నాయి. ఫరవాలేదు అందుబాటులోనే వుంటాయి.

నం. 4/1 సద్దర్‌స్ట్రీట్‌లోనే ది టూరిస్టు ఇన్, నం. 5 A. షిల్టన్ హోటల్, 6/2/3 సద్దర్ స్ట్రీటులోనే ఆస్టోరియా హోటల్, 11 B చౌరంఘిలేన్‌లో కాపిటల్ గెస్టుహౌస్ మొదలయినవి మరెన్నో అక్కడ దగ్గరనే వున్నాయి.

ఇకపోతే YMCA లున్నాయి.

1) 25, చౌరంఘీ 2) సురేంద్రనాథ్ బెనర్జీ రోడ్డులో 3) YWCA, 1, మిడిల్‌టన్ రోడ్డు – ఆడవారికి మాత్రం – నం. 10 J. B. ఆనందదత్త లేన్, హౌరాలో Youth Hostel వుంది. ఇక్కడికి చేరాలంటే హౌరా స్టేషన్నుండి శ్యామశ్రీ సినేమా దగ్గరకు బస్సులో వెళ్ళాలి.

హౌరా, సీల్డా స్టేషన్లలో రైల్వే రిటయిరింగ్ రూములు కూడా లభ్యం.

**మధ్య తరగతి – అంటే కొంచం పై మెట్టులో :**

1) ఫెయిర్‌లాన్ హోటల్ 13 A సద్దర్ వీధి – ఇక్కడ ఎయిర్‌కండిషన్ రూములు 300 – 400 రు. లకు లభ్యమవుతాయి.

2) లిట్టన్ హోటల్ – 14, సద్దర్ వీధి, సెంటర్లీ ఎయిర్‌కండిషన్డు హోటలు ఇక్కడ పాత, కొత్తరూములు. పాతవి అయితే 200 నుండి 240/- కొత్తవి అయితే 350/- నుండి 400/- వరకు రేటు వుంటుంది రోజుకు.

3) గుజరాతి లాడ్జి విండ్సే వీధిలో వున్నది. ఇక్కడే మరొకటి విండ్సే గెస్టు హౌస్ అని కూడా ఉన్నది. రూములు 90/- నుండి 150/- ల వరకూ ఉంటుంది రోజుకు.

**శ్రీమంతులకు :**

అంటే రోజుకు రు. 500/- పై మాటే.

ఇందులో వెస్టరన్ స్టయిల్ హోటళ్ళు :

ఈ హోటళ్ళు I. I. D. C. వారిచే గుర్తించబడినవి.

1) ఒబెరాయ్ గ్రాండ్, 15, జవహర్‌లాల్ రోడ్.
ఫోన్ : 230181, గ్రామ్స్ : OBHOTEL, Telex 021-7248.

2) హోటల్ హిందూస్తాన్ ఇంటర్నేషనల్
235/1 ; ఆచార్య J. C. బోస్‌రోడ్డు.
ఫోన్ : 442394 గ్రామ్స్ : MODERN-Telex : CA 021-7164.

3) పార్క్ హోటల్
17 పార్క్ వీధి, ఫోన్ : 248301
గ్రామ్స్ : PARKOTEL, Telex ; PARK CA 021-7153

4) ఎయిర్‌పోర్ట్ అశోక్
కలకత్తా ఎయిర్‌పోర్ట్, ఫోన్ ; 575111
AIR PORTEL. Telex : AIROTEL - 021-2271

5) రిట్జ్‌కాంటినెంటల్ హోటల్
12, జవహర్‌లాల్ నెహ్రూరోడ్,
ఫోన్ : 232391, గ్రామ్స్ ; RITZEONTE Telex : 021-7418

6) గ్రేట్ ఈస్టరన్ హోటల్,
1-3, ఓల్డ్ కోర్టు హౌస్‌వీధి,
ఫోన్ : 232331, గ్రామ్స్ ; GREASTERN

7) స్పెన్సెస్ హోటల్,
4, వెల్స్‌లీప్లేస్, ఫోన్ : 236871, గ్రామ్స్ : HOMELINESS.

ఇతర హోటళ్ళు :

1) హోటల్ మినర్వా
11, గణేష్ చంద్రఎవెన్యూ,
ఫోన్ : 235540

2) షేవర్లి హోటల్,
11, సైడ్ స్ట్రీట్, ఫోన్ : 240272

3) మెట్రోపోల్ హోటల్,
4, డాక్రెస్‌లేన్, ఫోన్ : 238151

4) హోటల్ హాలిడే హోమ్
16, ప్రిన్సెస్ స్ట్రీట్, ఫోన్ : 238707

5) ఇండియా హోటల్,
63, సూర్యసేన్ స్ట్రీట్, ఫోన్ : 359411

6) ఆటోమొబైల్ అసోసియేషన్ ఆఫ్ యీస్టరన్ ఇండియా,
13, ప్రమోదేష్ బారువాసరణి,
బాలీగంజ్ సర్క్యులర్ రోడ్డు, ఫోన్ : 475131

7) ఏస్టర్ హోటర్
15, షేక్స్పియర్ సరణి
ఫోన్ : 449917

8) బ్రాడ్‌వే హోటల్
27, A. గణేష్ చంద్ర ఎవెన్యూ

9) హోటల్ వైట్ హాల్
5/1 సద్దర్ స్ట్రీట్, ఫోన్ : 243311

10) న్యూ సెంట్రల్ హోటల్
90, చిత్తరంజన్ ఎవెన్యూ, ఫోన్ : 342360

11) రామకృష్ణ మిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్ గోల్ పార్క్,
ఫోన్ : 463431-4

12) రాజస్థాన్ గెస్టుహౌస్
19, జకీరియా స్ట్రీట్, ఫోన్ ; 348153

## పశ్చిమ బెంగాల్‌లో ఇంకా

### డార్జిలింగ్ :

భారతదేశానికి పెట్టని కోటలు. ఉత్తుంగ శిఖరాలతో మంచుతో కప్పబడి వుండే హిమాలయ పర్వతాల పాదాలచెంత నిలిచిన నగరం – డార్జిలింగ్. ప్రముఖంగా పేర్కొనబడిన వేసవి విశ్రాంతి కేంద్రం. అంతర్జాతీయ ఖ్యాతిని, గుర్తింపును పొందిన ప్రదేశం. కలకత్తా నుండేగాక, దేశంలోని ప్రధాన నగరాలైన ఢిల్లీ,

బొంబాయి, మదరాసుల నుండి విమానయాన సౌకర్యం ఉంది. అన్ని వైపులా కమనీయమైన కనువిందు చేసే టీ తోటలు నేత్రపర్వంగా దర్శనమిస్తాయి. నగరంచుట్టూ చలి ప్రదేశంనించి వచ్చిన బ్రిటిష్ సైన్యాలకు 18వ శతాబ్దపు మధ్యకాలం నుంచి విశ్రాంతికి, కులాసాలకు కేంద్రంగా వుండేది. ఉత్తర హిందూ స్థానపు మైదానపు ప్రాంతాల్లోని వేడిని, తట్టుకోలేనివారికి చల్లగా సేదదీర్చే ప్రదేశం. డార్జిలింగు జాతీయ అంతర్జాతీయ ప్రశస్తిని పొందిందనటానికి నిదర్శనం ఈ చిన్ని పట్టణంలో వెలసిన అనేక హోటళ్ళు – ఎన్ని వున్నా చాలని పరిస్థితి. ఇక్కడికి వచ్చినపుడు మీ చుట్టూ తూర్పు హిమాలయాల్లోని కొండజాతులు పరివేష్టించి ఉంటారు. వీరికి తోడు నిరంతరం వచ్చే టిబెట్ శరణార్థులు – కష్టించి పని చేసి జీవనం గడపటానికి వచ్చేవారు ఎందరో! వారికి ప్రత్యేకంగా పునరావాసకేంద్రం కూడా ప్రభుత్వం నడుపుతూంది.

కలకత్తానుండి సిల్గా స్టేషనునుండి రైలుద్వారా వెళ్ళటం అద్భుతమైన అనుభూతి. ఢిల్లీ, మద్రాసు, బొంబాయిలనుండి కూడా రైలు మార్గం వుంది. అన్నీ న్యూ జల్పాయిగూరి స్టేషను ద్వారానే.

డార్జిలింగు నుండి ప్రపంచంలో కెల్లా ఎత్తయిన మౌంట్ ఎవరెస్టు, కాంచనగంగా మొదలైన ఉత్తుంగ శిఖరాలను చూడవచ్చు. ధగద్ధగాయమానంగా మెరుస్తూ చూపరులకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంటాయి. ప్రకృతి సౌందర్యానికి పేరుగాంచిన ఆల్ప్స్ పర్వతశ్రేణి సౌందర్యం కూడా దీనిముందు తక్కువేనని చెప్పాలి.

డార్జిలింగు కలకత్తాకు 686 కి.మీ. దూరంలో 2, 134 మీ. ఎత్తున వున్నది. అక్కడినుండి మనకు దర్శనమిచ్చే పర్వతశిఖరాలన్నీ తెల్లటి మంచుతో కప్పబడి స్నిగ్ధ సౌందర్యం రాశి పోసినట్టు కనపడుతుంది. జన్మలో ఒకసారైనా చూడదగిన దృశ్యం.

## ఈ పర్వత ప్రాంతాల్లో చూడదగిన విశేషాలు :

వాతావరణం జూన్ నుండి సెప్టెంబరు వరకు నిరంతరం వర్షాలు కురుస్తుంటాయి. చూడదలుచుకున్నవారు ఏప్రిల్ నుండి జూన్ 15 లోపుగాని, అక్టోబరు నుండి నవంబరు వరకు గాని చూడవచ్చు. అత్యధిక ఉష్ణోగ్రత 72° ఫారన్‌హీట్. సగటు ఉష్ణోగ్రత 8. 5 నుండి 15° సెంటిగ్రేడ్ వేసవికాలపు ఉష్ణోగ్రత. చలికాలంలో అయితే 1.5° నుండి 6° సెంటిగ్రేడు లోపే. వర్షాకాలం గనుక ఇక్కడికి రావటం

తటస్థిస్తే గొడుగు తప్పనిసరి. ఇక్కడ చౌకగా దొరుకుతాయిగూడా. తేలిగ్గా కొనుక్కోవచ్చు.

ఇక్కడ మహాకాల్ ఆలయముంది. జయింపనలవిగాని 'దుర్జయలింగము' అని అంటారు. ఈ పేరుతో ఉన్న నగరం. కాలక్రమేణా డార్జిలింగ్‌గా మారిందని అంటారు.

చూడదగిన స్థలాలు :

టైగర్ హిల్ :

2,555 మీటర్ల ఎత్తుగా వున్న ఈ ప్రదేశం మంచి పిక్నిక్‌స్పాట్. ఇక్కడి విశేషదృశ్యం - సూర్యోదయం కాంచనగంగ శిఖరం పైడుగా కనబడే అద్భుత దృశ్యం. సూర్యోదయ కాలంలో మంచు స్ఫటికాలమీద బాలభానుని నునులేత కిరణాలు ప్రసరిస్తూ ఆ సమయంలో ఆకాశంలో ప్రతిఫలించే వింతరంగుల సోయగాలు ప్రపంచంలో మరెక్కడా కానరాని అద్భుత దృశ్యం. చూస్తేనేకాని తనివి తీరనిది. వచ్చేటప్పుడు కెనెటర్ వ్యవసాయ క్షేత్రం కూడా దర్శించవచ్చు. హోటల్ ప్రాంగణంనుండి వాహన సౌకర్యం ఉంటుంది.

సందక్ ఫూ :

58 కి. మీ. దూరంలో 3,636 మీటర్ల ఎత్తున ఉన్న శిఖరం. ఇక్కడ యూత్ హాస్టలు డాక్ బంగళా ఫాలుట్ 21 కి. మీ. దూరంలో ఉంది. పర్వతారోహణ చేయవచ్చు. అక్కడికి వెళ్ళేటప్పుడు కావలసిన సామాగ్రి స్లీపింగ్ బ్యాగ్, ఎయిర్‌పిల్లో, అల్యూమినియం కాంప్‌కాట్, పరుపు, ఇద్దరికి సరిపోయే గుడారం వగైరాలు అద్దెకు దొరుకుతాయి. వాటికి కావలసిన డిపాజిట్టు సెక్యూరిటీగా చెల్లించి ఆరోహణాక్రమం అయిన తరువాత తెచ్చి యివ్వవచ్చు.

ఘూమ్ మొనాస్టరీ :

టిబెట్టు బౌద్ధుల ఆశ్రమం. ఇక్కడ 15 అ. ఎత్తుగల మైత్రేయ బుద్ధుని విగ్రహం వుంది. నగరానికి 8 కి. మీ. దూరం మాత్రం.

సంఛాల్ లేక్ (ఫారెస్టు) :

డార్జిలింగునుండి 10 కి.మీ. ఉన్న ఈ సరస్సు పట్టణ నీటిఅవసరాలకు ఉప

యోగపడుతుంది. ఇక్కడికి రావాలంటే డార్జిలింగు మునిసిపల్ ఆఫీసరుగారి పర్మిషను ముందుగా పొందాలి. ఇది మంచి పిక్నిక్‌స్పాట్.

**అలూబెరి మోనాస్టరీ :**

డార్జిలింగు దగ్గరిలో టెన్జింగ్ నార్వే రోడ్‌లో ఈ ఆశ్రమం పర్యాటకులకు స్వాగతం పలుకుతుంది. ఇక్కడ వుండే సన్యాసులు, సాధువులు టిబెట్టు, సిక్కింలలో తయారు చేయబడిన హాండిక్రాఫ్ట్స్ వస్తువులు అమ్ముతారు. మోనాస్టరీ తలుపులు తాళం వేసివుంటే దగ్గరలోనే వున్న కుటీరంలో అడిగి తీసికొని చూడవచ్చు.

డార్జిలింగు స్టేషను దిగువన హిందూ దేవాలయం ఒకటి వుంది. నేపాల్‌లోని కాట్మండూలో ప్రసిద్ధి చెందిన పశుపతినాద ఆలయం మాదిరిగా కట్టబడింది. ప్రత్యేక శైలిలో వున్నదానిని చూడవచ్చు.

**హిమాలయాన మౌంటెనీరింగ్ ఇన్‌స్టిట్యూట్ :**

నగరానికి పశ్చిమంగా 2 కి. మీ. దూరంలో వున్న పర్వతారోహకులకు ప్రత్యేక శిక్షణా కేంద్రం దీనికిదే సాటిగా ప్రత్యేక ప్రతిపత్తి గలిగింది, ఒక మ్యూజియంకూడా వుంది. అందులో పూర్వంనుంచి పర్వతారోహణ కుపయోగించిన సామాగ్రి, మంచు మనిషి నమూనాలు, హిమాలయ పర్వతశ్రేణి నమూనాలు చూడదగినవి.

**జూలాజికల్ పార్కు :**

పర్వతారోహకుల శిక్షణాకేంద్రం ప్రక్కనే పద్మజానాయుడు జూ వుంది. ఇందులో ఎత్తయిన మంచుకొండల్లో మాత్రం తిరుగాడే పావునాతోపాటుగా టిబెట్టు ప్రాంతాల్లో వుండే చిత్రమైన ఎలుగుబంటి, నల్లఎలుగుబంటి, లేడి, చిరుతపులి, మచ్చల చిరుత, సైబీరియన్ పెద్ద పులి వగైరా విశేషమైన జంతువులున్నాయి.

**రంజీత్ వేలీరోప్ వే :**

టీ తోటల మీదుగా వేయబడినది. అద్భుత ప్రకృతి సౌందర్య రాసులను తిలకిస్తూ పర్వత లోయలను దర్శించుతూ వెళ్ళవచ్చు.

**లెబాంగ్ రేస్ కోర్సు :**

ఇక్కడ గుర్రప్పందాలు నడపబడతాయి. నగరానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్న రేస్ కోర్సు ప్రపంచంలోకెల్లా ఎత్తయిన రేస్‌కోర్సు పందాలు మార్చి నుండి జూన్ వరకు జరుగుతాయి.

టిబెట్టు శరణార్థుల పునరావాస స్వయం సేవా కేంద్రం :

ఇది ఒక వర్క్‌షాపు. వున్ని రగ్గులు, తివాచీలు టిబెట్టువారి పనితనాన్ని శ్లాఘించే విధంగా తయారు చేయబడిన అందమైన తోలు వస్తువులు, కొయ్యనగిషీ పనులు గల సామాన్లు అమ్మకం జరగుతాయి. ఇత్తడి, కంచు నగిషీల వస్తువులు కూడా దొరుకుతాయి.

## డార్జిలింగులో - హోటళ్ళు వగైయిరాలు

ధర్మశాల :

మోహన్‌లాల్ శివలాల్ ధర్మశాల

కార్ట్‌రోడ్ - ఉచితవసతి సౌకర్యం

చౌకలో :

1) యూత్ హాస్టల్ - డా॥ జకీర్‌హూస్సేన్ రోడ్, ఫోన్. 2290.

2) హోటల్ కాదంబరి - రైల్వేస్టేషన్ దగ్గర (ఒక బక్కెట్టు వేడినీళ్ళ సౌకర్యం కూడా ఉంది)

3) హోటల్ నిర్మలా - కాదంబరి ప్రక్కనే.

4) పోస్టాఫీసు తర్వాత - టింబర్ లాడ్జి

5) షామ్‌రాక్ హోటల్ - హోటల్ పగోడా.

హోటల్ ప్రిస్టేజ్, నబీన్స్ లాడ్జి, వీటన్నింటికీ తోడు.

టైగర్‌హిల్ దగ్గర వెస్ట్‌బెంగాల్ టూరిస్టు శాఖవారు నిర్వహణలో మేపుల్ టూరిస్టుబంగళా. ఘమ్ దగ్గర టూరిస్టు లాడ్జి వగైరాలు.

## శ్రీమంతులకు, విదేశీయులకు
## వెస్టరన్ స్టయిల్ హోటళ్ళు

ఒబెరాయ్ మౌంట్ ఎవరెస్టు

గాంధీరోడ్, ఫోన్. 2616, 2236 గ్రామ్స్ - OBHOTEL.

విండామిర్ హోటల్

భానుసరణి, ఫోన్. 2396, 2814 గ్రామ్స్ - WINDMERE

సెంట్రల్ హోటల్

రాబర్ట్‌సన్‌రోడ్, ఫోన్. 2038, 2167 గ్రామ్స్ - NADAM

ఇతర హోటళ్ళు :

టిప్పానీ హోటల్,
ఫ్రాంక్లిన్ ప్రెస్టాజ్ రోడ్డు, ఫోన్. 2840
అలిస్‌విల్లా హోటల్,
H. D. లామా రోడ్డు, ఫోన్. 2381
హోటల్ బెల్లివ్యూ,
నెహ్రూ రోడ్డు, ఫోన్. 2129
పైన్‌రిడ్జి హోటల్,
17, నెహ్రూ రోడ్డు, ఫోన్. 2094
హోటల్ కోజ్ హోమ్,
16, నెహ్రూ రోడ్డు, ఫోన్. 2094
స్విస్ హోటల్
గాంధీ రోడ్డు, ఫోన్. 2266
కాపిటల్ హోటల్,
గాంధీరోడ్డు, ఫోన్. 2860
అశోకా హోటల్,
2 C, రాక్‌విల్, టూప్ విహార్ రోడ్డు, ఫోన్. 2751
హోటల్ మేఘదూత్,
4, తోడెన్‌లా రోడ్డు. ఫోన్. 2975
హిందూ బోర్డింగు
దాచన్ మేన్షన్, ఫోన్. 2260
స్నో వ్యూ హోటల్,
హిల్‌కార్ట్ రోడ్, ఫోన్. 2040
న్యూ ఎవరెస్టు లక్జరీ హోటల్
ఫోన్. 2252
కైలాష్ హోటల్,
కార్ట్ రోడ్, ఫోన్. 2418

మెజస్టిక్ హోటల్,
2, మెహతాబ్ చాంద్ రోడ్డు, ఫోన్. 2384
నటరాజ్ హోటల్,
రాక్‌వుడ్, ఫోన్. 2908
కాంచన్‌గంగా హోటల్, కార్ట్ రోడ్.
డార్జిలింగ్ హోటల్,
4 A, బిలోంబ్రె రోడ్,
మరి యింకా ఎన్నో.

శాఖాహారులకు ప్రత్యేకం :

జ్యోతి సదన్, 18 B M చటర్జీ రోడ్, ఫోన్. 2375
శ్రీ లాడ్జ్ : జాలెన్ విల్లారోడ్, ఫోన్. 2893
కలకత్తాలోని వెస్ట్ బెంగాల్ టూరిజమ్ డెవలెప్‌మెంటు కార్పొరేషను ఆఫీసు.
B B D బాగ్ ఆఫీసు, కలకత్తాలోనే రిజర్వేషన్లు సౌకర్యంతో—

1) టైగర్‌హిల్ టూరిస్టు లాడ్జి.
సెంచాల్, P. O. ఘలామ్.

2) షల్లాబాష్ టూరిస్టు లాడ్జి.
Dr, జకీర్ హుస్సేన్ రోడ్డు, ఫోన్. 2684

3) మేపుల్ (Maple)
ఓల్డ్ కచ్చేరీ రోడ్డు, ఫోన్. 2092

**డార్జిలింగ్ నుండి నిర్వహించబడే టూర్సు వివరాలు :**

| ప్రదేశ వివరాలు | సమయం | టిక్కెట్టు వెల. | నిర్వహణాస్థలం. |
|---|---|---|---|
| ఆవా ఆర్ట్ గాలరీ – ధీరధమ్ దేవాలయం | ఉ. 9–30 నుండి 11–30 వరకు | రు. 11/- | నెహూర్‌రోడ్ చౌరాస్తా |
| హిమాలయన్ మౌంటనీరింగ్ ఇన్‌స్టిట్యూట్ & జూ – పాసింజర్ రోప్‌వే | మ. 1–30 నుండి సా. 4–30 వరకు | రు. 11/- | ఫోన్. 2050 నేతాజీ సుభాష్‌చంద్ర బస్సుస్టాండు, న్యూకార్ పార్కు. |
| టిబెటన్ సెల్ఫ్ హెల్ప్ రెఫ్యూజీ సెంటర్, లేబాంగ్ రేసుకోర్సు. | | | |

## మధ్యలోవున్న - సిలిగురిలో

వెస్టరన్ స్టైలు :

1) హోటల్ సింక్లెయిర్స్,
P. O. ప్రధాన్ నగర్,
ఫోన్. 22674, 22675

2) సిలిగురి టూరిస్టు లాడ్జి,
హిల్‌కార్ట్ రోడ్డు, ఫోన్. 21018

3) గీతాంజలి టూరిస్టు హోటల్,
సెవోక్ రోడ్, P. O. మెక్‌విలియమ్‌సన్, ఫోన్. 21019

ఇండియన్ స్టైలు :

1) సల్యూజీ హోటల్,
హిల్‌కార్ట్ రోడ్, ఫోన్. 22029

2) ఢిల్లి హోటల్
హిల్‌కార్ట్ రోడ్, ఫోన్. 22918

3) రంజిత్ హోటల్, ఫోన్. 22056

4) న్యూ రంజిత్ హోటల్, ఫోన్. 21647

5) ఎయిర్ వ్యూ హోటల్, ఫోన్. 21160 & హోటల్ సెహాయ్,
ఫోన్. 21916

6) షేరె పంజాబ్ హోటల్,
Opp, సిలిగురి జంక్షన్.

అన్నీ హిల్‌కార్ట్ రోడ్‌లోనే.

హోటల్ బ్రాడ్‌వే, బిధాన్ మార్కెట్ రోడ్, ఫోన్. 20855

సిలిగురి నేషనల్ హైవే నం. 31 మీద అమరివుంది, ప్రధాన నగరాలకు అన్నిటికీ రోడ్డు కనెక్షనులున్నాయి. నార్త్ బెంగాల్ స్టేట్ ట్రాన్స్ పోర్టు కార్పొరేషన్ ఉత్తర బెంగాల్‌లో అన్ని ముఖ్య కేంద్రాలను కలుపుతూ బస్సులు నడుపుతున్నారు. దూరపు తీరాలకు ఎక్స్‌ప్రెస్ బస్సులున్నాయి. సిలిగురినుంచి కలకత్తా, దుర్గాపూర్, పాట్నా మొదలైన ప్రదేశాలకు. ఇక్కడికి 30 కి.మీ. దూరంలోఉన్న కాకర్ భిట్టా నుండి ఖాట్మండు బస్సులకు సిలిగురిలోనే లభ్యమవుతాయి. ప్రతి రోజు రెగ్యులర్‌గా కాకర్ భిట్టాకు సిలిగురినుండి బస్సులున్నాయి. రిజర్వేషను - నార్త్ బెంగాల్ స్టేట్ ట్రాన్స్ పోర్టు కార్పొరేషన్ బుకింగు ఆఫీసు, సిలిగురి నుంచి పొందవచ్చు.

## సిలిగురి నుండి, ముఖ్యమయిన బస్సు రూట్లు గమ్యాలు.

| ప్రదేశం | దూరం. కి.మీ. | బ్రేక్ అప్ |
|---|---|---|
| కలకత్తాకు — | 607 | కిషనగంజ్ – 103 – రాయగంజ్ 78– మొయిదా 76, – బెర్హంపోర్ 137 – ప్లాసీ 39, క్రిష్ణనగర్ 56 – కలకత్తా 118. |
| డార్జిలింగ్ — | 80 | కుర్సియంగ్ 48 – డార్జిలింగ్ 32 |
| గాంగ్‌టక్ — | 114 | టిస్టా బజార్ 53 – రాంగ్‌పో 22 – గాంగ్‌టక్ 39. |
| గౌహతి — | 475 | జుల్పాయిగురి 44 – ధూప్‌గిరి 31 – మదారిహాట్ 40 – ఖటాజన్ 57 – శ్రీరాంపూర్ 30 – సెరెలి 70 – బార్‌పేట రోడ్ 74 – రంగియా 81 – గౌహతి 48. |
| కాలింపాంగ్ — | 54 | సవోక్ – 19 – కాలింపాంగ్ 35 |
| ఖాట్మండు — | 564 | ఇటహరి 128 – లాహన్ 107–ధల్‌కేబర్ 58–లాల్‌బంది 34–పథియ్యా 75– హెటావుదా 28 – మహాబీర్ 37 – ఖాట్మండు 97. |
| కుర్సియంగ్ — | 48 | సుక్నా 10 – కుర్సియంగ్ 38. |
| పాట్నా — | 470 | ఇస్లాంపూర్ 73 – పూర్నియా 101 — నవుగాచ్ఛియా 66– ఖగారియా 68 — బరౌని 52 – మోకామేహ్ 20 — భక్తియార్‌పూర్ 43 – పాట్నా 47. |

డార్జిలింగు నుండి పర్వత మార్గాలు :

1) డార్జిలింగు – రింబిల్ – రామన్ – ఫాలూట్ – సందక్‌ఫూ
మరల – రింబిక్, బిజన్‌బారి – డార్జిలింగు

ఈ మార్గం ప్రస్తుతం బహుధా అమలులో వున్నది. యూత్ హాస్టలులో లభించే పర్యాటకుల సౌకర్యార్థం లభించే ప్రత్యేక పుస్తకంలో సూచించబడినమార్గం. ఈ మార్గంలో తినుబండారాలు వగయిరాలు దొరుకుతాయి.

బస్సులు రింబిక్ వరకు వుంటాయి. సుమారు 5 గం. ప్రయాణం బస్సులో. చార్జీ 12 రు. వుంటుంది. గవర్నమెంటు ఆఫ్ వెస్టు బెంగాలు వారు, ప్రయివేటు సంస్థలయిన చేతన, మనోరామసవారు యాత్రా బస్సులను నిర్వహిస్తున్నారు. రింబిక్ నుంచి ఒక అరగంట నడిస్తే పాపులర్‌గా వుండే శివప్రధాన్ హోటలు చేరవచ్చు.

అక్కడినుండి రామన్‌కు చేరటానికి నాలుగు గంటలు నడవాలి. అక్కడనుండి ఎత్తు మొదలవుతుంది. ప్రక్కనే ఒక కిలోమీటరు దిగాల్సి వుంటుంది. శిరిఖోలా నది ఆ నదిని దాటేం తర్వాత సుమారు తొమ్మిది కిలోమీటర్లు నడిస్తే రామన్‌చేరి అక్కడ వున్న యూత్ హాస్టలుకు చేరవచ్చు.

రామన్ నది 3 కిలోమీటర్లుంటుంది. నదిని చేరి బ్రిడ్జి మీదుగా నదిని దాటాలి. అక్కడనుండి వివిధ రకాలైన వృక్షజాతులు మన మనసుకు ఆహ్లాదాన్ని కలిగిస్తూ మరోవంక గగుర్పాటును కలిగిస్తూ మనలను ఆశ్చర్యంలో ముంచే దట్టమైన పర్వతారణ్యాలలోగుండా పైకి సన్నని త్రోవగుండా ఎక్కుతూ 11 కి. మీ దూరంలో ఫాలూట్ చేరవచ్చు. అక్కడ ఒక డాక్ బంగళా వుంది. ఇక్కడే నేపాల్, సిక్కిం పశ్చిమ బెంగాల్ మూడు కలిసే కేంద్రం. ఇక్కడి నుండి ఒక సుభము హూర్తంలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన హిమాలయోత్తుంగ శిఖరాలు కాంచనగంగ శిఖరం, ఎవరెస్టు శిఖరం రెండింటినీ చూడవచ్చు. దీనికి కనీసం రెండు రోజులు పడుతుంది. ఇక మూడో రోజు పాము మెలికల్లా వున్న వంకర దోవలో ఫాలూట్‌నుండి దిగుతూ 18 కి. మీ. నడచిం తర్వాత సందక్ పర్వతారోహణ కుపక్రమించేపోయి చేరుకోవచ్చు. ఈ రోజు నడక కనీసం 6 లేక 7 గం. పట్టవచ్చు కాంచనగంగ శిఖరం ఇక్కడ నుంచి 144 కి. మీ. మాత్రమే. సందక్‌ఫూ దగ్గర కూడా ఒక డాక్ బంగళా వుంది. ఇక ఇక్కడినుండి నేరుగా డార్జిలింగు చేరటానికి బస్సుకు బదులుగా బిజాన్‌బారి చేరే

మార్గం చూడండి, లోడోమా నది మీది బ్రిడ్జి చేరటానికి సుమారు 8 కి. మీ. దూరం నడవాలి. ఇక్కడినుండిమనకు వ్యవసాయక్షేత్రాలు దర్శనమిస్తాయి.ఈపొలాల్లోగుండా ఝెపి చేరవచ్చు. ఝెపి నుండి బిజన్‌బారి చేరి అక్కడనుండి రింబిక్‌కు బస్సులో చేరవచ్చు. ఇక్కడనుండిజీపులోగానిబస్సులోగాని డార్జిలింగుచేరవచ్చు. ఉత్సాహవంతులకు ఈ ఆరోహణ ఒక మంచి దివ్యానుభూతిని కలగజేస్తుందనుకోవటంలో సందేహంలేదు. బిజన్‌బారి నుండి డార్జిలింగుకు బస్సు చార్జీ రు. 15/- వుంటుంది.

**మార్గం 2:**

డార్జిలింగు – మనయ భంజంగ్–టోంగ్లు–సందక్‌ఫూ–ఫాలూట్ తిరిగి మరల అదే మార్గం. సందక్‌ఫూ 118 కి. మీ. ఫాలూట్ 160 కి. మీ. త్రోవ అంతా నులి వెచ్చని గ్రామీణ అందాలు మూటగట్టిన సుందర దృశ్యాలమధ్య ఆహ్లాదకరంగా సాగుతుంది.

మొదటిరోజు నడిచిగాని, జీప్‌లోగాని మనయ భంజంగ్ చేరుకోండి. 26 కి.మీ దూరం వుంటుంది. ఎత్తుగావున్న నిట్టనిలువుగా ఎత్తులను ఎక్కి 11కి. మీ. దూరంలో ఉన్న టోంగ్లు చేరండి. ఒక బంగ్లా కూడా ఉంది. ఇక్కడ నుండి కాంచన గంగా శిఖరదృశ్యం ఒక బ్రహ్మాండమైనది, అపురూపమైనది.

మరుసటిరోజు వెదురుపొదలగుండా ఎత్తుపల్లాలగుండా కాలాపొఖ్రి వరకు కష్టపడి 22 కి. మీ. దూరంలో ఉన్న సంగక్‌ఫూ చేరవచ్చు. ఇక్కడినుండి ఈ త్రోవగుండా నడిచేటప్పుడు పర్వతశ్రేణి దృశ్యాలు మహాద్భుతంగా కనబడతాయి. ఇటువంటి దృశ్యాలు కమనీయంగా జన్మలో ఒకసారి వీక్షిస్తే కలకాలం మనసులో గుర్తుండేటట్లు ముద్రవేసుకొని చెరగని స్మృతులుగా మిగులుతాయి.

సందక్‌ఫూ నుండి ఫాలూట్ వెళ్ళదలిస్తే వెళ్ళొచ్చు. లేకుంటే వెనక్కి తిరిగి డార్జిలింగు చేరుకోవచ్చు. ఫాలూట్‌నుండి మనయ్‌భంజంగ్ చేరటానికి ఒకరోజు పట్టవచ్చు. కాని టోవ బాగుండదు. దానికి బదులుగా 5 కి. మీ. దూరమయినా మేఘమా దగ్గరినుండి పడమరదిశగా వున్నటువంటి నేపాల్‌లో చేరిన జవ్‌బారి మీదుగా రావటానికి ఇష్టపడతారు. అయితే సరిహద్దు సమస్య ఈ కొండల్లో వుండదులెండి.

**మార్గం 3 :**

డార్జిలింగు – మనయ భంజంగ్ – టోంగ్లు – సందక్‌ఫూ – ఫాలూట్–రామన్ రింబిక్ – ఝెపి – డార్జిలింగు బిజన్‌బారి ద్వారా మొత్తం (158 కి. మీ).

మొదటి ఆరోహణ భాగం రెండవమార్గం మాదిరిగానే ఫాలూట్ వరకూ సాగుతుంది. రెండవభాగం ఫాలూట్ నుండి రింబిక్ నుండి బిజన్‌బారి వరకు మొదటి మార్గంలో రావాలి.

## మార్గం : 4

డార్జిలింగు - మానయభంజంగ్ - టోంగ్లు - సందక్‌పూ - ఫాలూట్-రామన్ రింబిక్ - పాల్మజువా - బటాసి - మనయభంజంగ్ - డార్జిలింగు (మొత్తం 178 కి. మీ.)

మొదటగా ఈ ఆరోహణ క్రమం రింబిక్ వరకూ మూడవమార్గాన్ని అనుసరించి సాగుతుంది. రింబిక్‌నుండి పాల్మజువాకు కాంచనగంగా దృశ్యాలతో 14 కి మీ మరికొంచం పైకి సుమారు 11 కి. మీ. దేవ్‌రాలిమీదుగా బటాసికి ఎక్కి దిగటంతో సరిపోతుంది. మరుసటిరోజు మనయభంజంగ్ చేరుకుని అక్కడినుండి జీప్‌లోగాని, లేక వోపికవుంటే నడిచైనా డార్జిలింగు చేరవచ్చు.

## దారిలో వుండటానికి — వసతి సౌకర్యాలు :

త్రోవపొడుగునా బంగళాలు, యూత్ హాస్టల్సు వున్నాయి. కుదిరితే ముందుగా రిజర్వేషనులు చేయించుకుని మరీ డార్జిలింగు నుండి బయలుదేరవచ్చు. రిజర్వేషనులు యూత్‌హాస్టల్సు విషయంలో పెద్దగా అవసరం వుండదు. బంగ్లాల్లో వంటకు కావలసిన ఏర్పాట్లు, చలికి తట్టుకోడానికి నెగళ్లు, లాంతెర్లు వగయిరాలు అభ్యమవుతాయి. కట్టెలు బంగ్లా చౌకీదారువేత తెప్పించుకోవచ్చు. మీ సౌకర్యం కోసం బంగ్లాలు, యూత్ హాస్టళ్ళు ఈ క్రింది కీలక ప్రాంతాల్లో వున్నాయి. మంచుకొండల ప్రదేశం, చలి ఎక్కువగా వుంటుంది.

| ప్రదేశం | వసతి | సుమారు ఎత్తు |
|---|---|---|
| మనయ భంజంగ్ | యూత్ హాస్టలు | 2184 మీ |
| జోరెపొఖ్రి | డాక్ బంగళా | 2256 " |
| టోంగ్లు | డాక్ బంగళా | 3070 " |
| సందక్‌పూ | యూత్ హాస్టలు | 3636 " |
| | డాక్ బంగళా | |
| ఫాలూట్ | డాక్ బంగళా | 3600 " |

| ప్రదేశం | వసతి | సుమారు ఎత్తు |
|---|---|---|
| రామన్ | యూత్ హాస్టలు | 2560 " |
| రింబిక్ | " | 2286 " |
| ఝెపి | ఇన్‌స్పెక్షన్ బంగళా | 762 " |
| పాల్మాజువా | ఫారెస్టు బంగళా | 2210 " |
| బటాసి | ఫారెస్టు బంగళా | 2098 " |

**మరి కొన్ని వివరాలు :**

ఆహారపదార్ధములు-బియ్యం, పప్పులు, గుడ్లు, చికెన్,పుల్లిపాయలు, బంగాళా దుంపలు వగైరాలు చాలా చోట్ల దొరుకుతాయి. త్రోవ పొడుగునా చన్న చిన్న టీ దుకాణాలుంటాయి. ముఖ్యంగా సందక్‌ఫూ, మెఘ్మా, గారిబాస్, రింబిక్, ఝెపి, లోడోమా, బిజన్‌బారి మొదలగు కేంద్రాల్లో టీ దుకాణాలు వగయిరాలు కనబడతాయి. డార్జిలింగు కంటె రేట్లు ఎక్కువ. వీలుంటే సరిపడినన్ని డార్జిలింగులో కొనుక్కొని బయలుదేరటం మంచిది. ఫరవాలేదు-ఇంతకంటే మనం తినేది తాగేదిఏముందిలే-అనుకుంటే. కొంచం ధర ఎక్కువయితేనేం. మోసుకుపోవటం ఎందుకూ అనుకుంటే మాత్రం ఏమీ బరువులు లేకుండానే లాగించేయవచ్చు. అలాకాదు అనుకుంటేమాత్రం కావలసిన ఆహారపదార్థములు, రెడీమేడ్ ఫుడ్స్ దగ్గరినుంచి అన్నీ కావలసిన మేరకు నిల్వలు తీసికొని ప్లాను ప్రకారం వెళ్లాల్సి వుంటుంది.

**ముందుగా రిజర్వేషన్‌కి కొన్ని సూచనలు :**

ఝెపి బంగ్లాకు తప్ప మిగిలిన డాక్ బంగ్లాలకు, డిప్యూటి కమీషనర్, డార్జిలింగు ఇంప్రూవ్‌మెంటు ఫండు డిపార్టుమెంటు, డార్జిలింగు వారిని సంప్రదించి రిజర్వేషనులు పొందవచ్చు.

ఝెపి డాక్ బంగ్లాకు : డివిజనల్ ఇంజనీరు, స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డు, సిలిగురి.

ఫారెస్టు బంగ్లాలకు : డివిజినల్ మేనేజరు, వెస్ట్ బెంగాల్ ఫారెస్టు డెవలప్‌మెంటు కార్పోరేషన్, డార్జిలింగు వారి ద్వారా పొందవచ్చును.

ముఖ్య గమనిక :

ఈ పర్వతారోహణ మార్గాలగుండా పర్వతారోహణ చేయబోయేముందు డార్జిలింగు యూత్ హాస్టల్సులో లభ్యమయ్యే పర్వతారోహకుల వివిధ రకాలైన అనుభవాలు, అనుభూతులు వారు స్వయముగా వ్రాసిన వ్యాఖ్యానాలు చూడటం ఎంతయినా మంచిది. మార్గం సుగమం అవుతుంది.

కాలింపాంగ్ :

హిమాలయ శ్రేణి పాదాలచెంత సుమారు 1250 మీటర్లు ఎత్తునవున్న ఒక చిన్న పర్వత పట్టణం. ముఖ్య వేసవి విడిది కేంద్రంగా పేర్కొనబడినది. ఇటు డార్జిలింగు నుండి 51 కి. మీటర్లు. అటు సిక్కిం ముఖ్యపట్టణమయిన గాంగ్‌టక్ నుండి 77 కి. మీటర్లు వుంటుంది.

డార్జిలింగునుండి రోడ్డు ప్రయాణం చాలా బ్రహ్మాండంగా వుంటుంది. గుట్టలుగా కనబడే సౌందర్యరాసుల్ని మనసులో పదిలంగా దాచుకుంటూ పర్వతాల మధ్య వున్న గ్రామీణ సౌందర్యాల్ని చూచుకుంటూ వెళ్ళటం మరిచిపోరాని మధురానుభూతి.

ఇది ఒకానొకప్పుడు సిక్కిం రాజులకు చెందిన భూభాగం. 18వ శతాబ్దం మొదట్లో భూటానువారి వశమైంది. తరువాత 19వ శతాబ్దంలో బ్రిటిషువారి చేతుల్లోకి వచ్చి ప్రస్తుతం వెస్ట్‌బెంగాల్ ప్రాంతంలో ఒకటిగా చేరిపోయింది.

కాలింపాంగ్‌లో రెండు ముఖ్యమయిన బుద్ధవిహారాలున్నాయి. వెళ్ళే దోవలో రంజీత్, టిస్టా నదుల ప్రాంతంలో ఉన్న టీ తోటలు-మనోహరదృశ్యాలు చూడదగినవి.

మార్కెట్ :

ఇక్కడ బుధవారం, శనివారం రోజులు సంత జరుగుతుంది. యాత్రికులకు ఆసక్తిని రేకెత్తించే విధంగా కొన్ని వస్తువులు ఇక్కడి నైపుణ్యం గల పని వారలచే తయారుచేయబడిన వస్తువులు అమ్మకానికి వస్తుంటాయి. అయితే రేట్లు మాత్రం బాగానే వుంటాయి. నచ్చితే నచ్చినవి కొనుక్కోవచ్చు.

ఆశ్రమాలు :

14వ శతాబ్దంలో దలైలామా వంశానికి చెందినవారిలో టిబెట్టులో బౌద్ధం మొగ్గ తొడిగింది. 1937లో ఇక్కడ థార్పా చోలింగ్ ఆశ్రమం వెలసింది. కాని ఎన్నో శతాబ్దాల క్రితం కట్టబడి శిథిలావస్థలో వున్నట్టు కనబడుతుంది.

కొంచ క్రిందుగా భూటానీయుల ఆశ్రమం తోంగ్సాగొంపా ఉంది. ఇది పురాతనమైందే. 1692 ప్రాంతంలో నిర్మించబడినా చక్కటి ఆలనాపాలనలతో ఎప్పటికప్పుడు రంగులు వేయించి, సరిక్రొత్తగా కనపడుతుంది.

కాలింపాంగ్ పుష్పవనాలకి ఫ్లవర్ నర్సరీలకి పేరుపొందింది. ఇక్కడి నుండి ఉత్తర భారతంలో అనేక నగరాలకు పువ్వులు ఎగుమతి చేయబడతాయి. వాటిలో పేర్కొనదగినవి రెండే రెండు. 1) శ్రీ గణేష్ మోని ప్రధాన్ నర్సరీ 2) శ్రీ L B. ప్రధాన్ నర్సరీ.

ఇక్కడ వుండటానికి అనేకమైన చౌక హోటళ్ళున్నాయి. సామాన్యులకు, శ్రీమంతులకు పురాతనమైన హిమాలయన్ రెస్టారెంటు, పోస్టాఫీసుకు దగ్గరలోనే సుమారు 80 నుండి 180 వరకు అవుతుంది. రోజుకు భోజనాదులతో సహా. మరి కొంచం దూరంలోనే హోటల్ సిల్వర్‌ఓక్ కూడా వుంది. మరికొంచం ఖరీదు జాస్తి.

కుర్సియాంగ్ :

డార్జిలింగుకు 32 కి. మీ. దూరంలో మరో మంచి హిల్‌స్టేషన్ విశ్రాంతి కేంద్రం. ఇక్కడ పగ్లా ఝోరా జలపాతం చూడదగింది. సముద్ర మట్టానికి 1482 మీటర్ల ఎత్తులో వుండి దాదాపు 150 కి. మీ. దూరం వరకు పరచుకునివున్న పర్వత శిఖరాలదృశ్యం నయనానందకరం చేస్తుంది. డాహిల్, యీగిల్స్‌క్రాగ్ అనేవి రెండు పర్వత శిఖరాల మీదినుంచి ఈ దృశ్యం చూడవచ్చు. ఇక్కడ పట్టుపురుగుల వ్యవసాయం. మల్బరీ తోటలు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.

కూచ్ బీహార్ :

ఒకానొకప్పుడు రాజ పరగణాకి ముఖ్య పట్టణంగా వుండి అనేక భవనాలు, దేవాలయాలు, పార్కులు యాత్రికులకు కనువిందు చేస్తాయి. ఆసక్తిని రేకెత్తిస్తాయి.

జలద్‌పారా వన్యమృగ రక్షక కేంద్రం :

100 చ. కి. మీ. వైశాల్యంలో ఉన్న ఈ వైల్డ్‌లైఫ్ శాంక్చ్యుయరీలో టోర్సా నదికి గల తొమ్మిది ఉపనదుల ప్రవాహముల కలయికతో విలసిల్లిన చిన్న అటవీ ప్రాంతం. ఎత్తయిన చెట్లు, పచ్చిక బయళ్ళు ప్రత్యేకం. ఏనుగుల మీద అడవిలో ఒక రౌండు తిరిగి రావచ్చు, ఈ ప్రాంతంలో ఒంటికొమ్ము ఖడ్గమృగాలు, అడవి ఏనుగులు, ఎలుగుబంట్లు, చిరుతలు, కొండచిలువలు, అడవి ఎద్దులు, దున్నపోతులు లేళ్ళు, సంబార్‌లు మొదలైన ఎన్నో వన్యమృగాలను చూడవచ్చు, అడవిలో టూరిస్టు బంగ్లా వుంది.

కలకత్తానుండి న్యూజల్పాయిగురి మార్గంలో వున్న హసిమారా ఇక్కడికి అతి దగ్గరిలోని రైల్వేస్టేషన్. స్టేషనుకి 6 కి. మీ. దూరంలో వున్న మదారిహట్ అడవికి ముఖద్వారం వంటిది.

కాలింపాంగ్ నుండి బాగ్‌డోగ్రాకి మిలిటరీ ట్రాన్స్‌పోర్టు లిమిటెడ్ వారు ప్రతి రోజూ బస్సులు నడుపుతున్నారు. బాగ్‌డోగ్రా ఎయిర్‌పోర్టుకి సుమారు 3గంటలు పట్టవచ్చు.



# సిక్కిం

పశ్చిమ బెంగాల్‌నుండి ప్రవేశించదగినది. ఇటీవలనే ఇండియన్‌యూనియన్‌లో అంతర్భాగంగా 22వ రాష్ట్రంగా చేర్చుకోబడిన అతి చిన్న రాష్ట్రం.

రాష్ట్ర వైశాల్యం – 7, 298 చ. కి. మీ.

జనాభా – సుమారు 2, 50, 000

ముఖ్య పట్టణం – గాంగ్‌టక్

ముఖ్య భాష – నేపాలీ

రాష్ట్రం తూర్పు హిమాలయాల్లో ఒదిగివున్న చక్కటి గంధర్వలోకం అని చెప్పుకోవచ్చు. ఆకాశాన్ని చుంబించే ఎత్తయిన హిమవన్నగా శిఖరాలను చూస్తూ జిగిబిగిలుగా అల్లుకొన్న పూపొదరిళ్ళతో సమృద్ధమైన నారింజ తోటలతో స్వేచ్ఛగా విహరించే రంగు రంగుల సీతాకోక చిలుకలతో కావ్యరసానందాన్ని చేకూరుస్తూ మనసుకు అహ్లాదాన్ని కలిగిస్తూ యాత్రికులకు నేత్రపర్వంగా సుమధుర స్వప్నంగా భావిస్తుంది. ప్రకృతి తన వింతసోయగాలను పర్వతాల రూపంలో మూటలు గట్టి కొని మాటలకందని అలౌకిక ఆనందానికి ప్రోదిగా నిలుస్తుంది.

సరిహద్దులుగా తూర్పున డోంగ్‌క్యా శ్రేణి టిబెట్‌కు సిక్కింకు మధ్య అడ్డు గోడగా నిలుస్తుంది. పడమరన సింగాలియా శ్రేణి నేపాల్‌నుండి వేరుపరుస్తుంది. దక్షిణాన పశ్చిమ బెంగాల్ సరిహద్దుగా వుంది.

సంగ్రహంగా పూర్వ చరిత్ర :

ఇక్కడి స్థానికులు అనబడే వారు ప్రకృతినే పరాత్పరునిగా భావించి పూజించే గిరిజన జాతులు వీరిని లిప్చాలు అని అంటారు. కాని వీరు కూడా అస్సాం కొండ ప్రాంతాలనుండి తరలి వచ్చినవారని ప్రతీతి. బహుశా 13వ శతాబ్దంలో ఈ వలస సంభవించి ఉండవచ్చునని పండితుల అభిప్రాయం. వీరు కేవలం పర్వతారణ్యాల్లో తిరుగాడుతూ దొరికిన దానితో సంతృప్తి పడుతూ - కొంతకాలం వ్యవసాయం చేసి కొంటూ జీవనాన్ని గడుపుతూండేవారు. సహజంగా వీరు చాలా శాంతిపరులు, దయా స్వభావులు. పరోపకారబుద్ధి గలిగినవారు. వీరి ప్రశాంత జీవనానికి అడ్డుగా ఇటీవల కాలాల్లో టిబెట్టునుండి, నేపాల్ నుండి వలసవచ్చిన వారివల్ల అంతరాయం కలిగిందని చెప్పవచ్చు. అయినప్పటికీ ఇక్కడి ప్రజల్లో దాదాపు 18 నుండి 20 శాతం వరకు ఇంకా నిలిచే వున్నారు.

అది 1641వ సంవత్సరం. టిబెట్టునుండి ఒకావొక అతీంద్రియశక్తి ప్రేరితుడై టిబెట్టు నుండి ఒక లామా బయలుదేరి వచ్చాడు, మరి యిద్దరు లామాలను కలవడానికి. కలవవలసినది - కలిసిన ప్రదేశం యుక్సామ్. ఆ ముగ్గురు కలిసి ఆ ప్రదేశానికి కిరీటధారి ఎవరా అని అన్వేషించసాగారు. ఎవరైనా రాచబిడ్డడు దొరుకుతాడా అని. ఆ సమయంలో గురుశాషి మనుమడైన ఫున్‌ట్సోగ్ నంగ్యాల్ వీరి దృష్టిలో తగినవాడుగా కనబడ్డాడు. ఆ ముగ్గురు లామాలు ఈయనను రాజుగా చేశారు ఈ సమయంలో ప్రస్తుతం ఇండియన్ యూనియన్‌లో ఇమిడియున్న సిక్కింరాష్ట్రానికి తోడు-తూర్పు నేపాల్‌లో కొంతభాగం, టిబెట్‌లోని చుంబిలోయ, భూటాన్‌కి చెందిన హాలోయ, ప్రస్తుతం పశ్చిమబెంగాల్‌లోని డార్జిలింగ్, కాలింపాంగ్ ప్రాంతాలు చేర్చబడినాయి.

1717 నుండి 1734 వరకు భూటానీయులతో అనేక యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాల్లో కాలింపాంగ్, బజారుట్‌ను మొదలయినవి వదులుకోవల్సి వచ్చింది. 1780 తరువాత జరిగిన ఘూర్ఖా దండయాత్రలలో మరికొన్ని ప్రదేశాలను పోగొట్టుకోవలసి వచ్చింది. అప్పటికీ, వీరికి మద్దతుగా చైనీయులు, భూటాన్‌లోని లెప్చాల సహాయసహకారాలు వెన్నంటి వుంటూనే వున్నాయి. అయినప్పటికీ నష్టాలు మాత్రం తప్పలేదు. ఆ తరువాత గుర్ఖాలు బ్రిటిషువారి ఈస్టిండియా కంపెనీవారితో యుద్ధానికి తలపడ్డారు. ఎన్నో యుద్ధాలు జరిగాయి. చివరికి 1817లో గూర్ఖాలు ఓడిపోయి సిక్కిమ్ తీర ప్రదేశాలన్నీ బ్రిటిషువారికి వప్పగించారు. దీంతోటి సిక్కిం రాజా

గారి అధీనంలోకి తీసికొనివచ్చి తగాదాలన్నీ ఒక దోవకువచ్చి సమ్మగమైన రాజ్యంగా ఏర్పడింది సిక్కిం. 1885 లో బ్రిటిషువారు తమ సేనల విశ్రాంతికోసం, కులాసా కుషీల కోసం డార్జిలింగు ఏరియాను ఇవ్వమని దానికొంత సాంవత్సరిక భత్యం యిస్తామని వత్తిడి తీసికొని వచ్చారు. టిబెట్టువారు దీనికి అంగీకరించలేదు. కాని దీని కోసం గూడ క్రమంగా జరిగిన వాగ్వివాదాలు, వత్తిళ్ళతో అనేక మార్పులకు గురయి చివరకు అక్కడ వ్యవసాయం నిమిత్తం కావలసిన కూలీలవంకన టిబెట్టు మొదలైన ప్రదేశాలనుండి అనేకమందిని ప్రోత్సహించి నిరంతరం వలసలకు తావిచ్చారు. 1960 వరకు ఇలాటి వలసలు సాగుతూనే వున్నాయి. చివరికి సిక్కింరాజు వీటిని నిరోధించటానికి సమకట్టారు. నేపాలీలు రావటానికి వీల్లేదని ఆంక్షలు పెట్టారు. ఈ నిరోధము అనేక అంతర్గతమైన గొడవలకు దారితీసింది.

ప్రస్తుత పరిస్థితుల్లో స్థానికులైన లెప్చాల శాతం 18% కంటే లేదు. మిగతా 75% నేపాలీలు, మిగతావారు భూటానీయులు. ఇక్కడి ప్రజల మతం ముఖ్యంగా 60 శాతం పైగా హిందూ మతం. 28 శాతం బౌద్ధులు. అయినా సిక్కింలో చూడదగినవి సుందరమైన హిమాలయ పర్వత దృశ్యాలు, అక్కడి గ్రామీణ ప్రాంతం, పురాతనమైన బౌద్ధవిహారాలు.

## ముఖ్యమైన గమనిక — విదేశీయులకు ప్రత్యేకం :

విదేశీయులు అనగా భారతీయులు తప్ప మిగతా దేశాల వారసత్వంగలవారు– ప్రవేశపు అనుమతి తప్పనిసరిగా కావాలి. దీనికోసం ధరఖాస్తులు ఈ క్రింది చిరునామా వారికి డూప్లికేట్‌తో పంపించవలెను.

దీ అండర్ సెక్రటరీ,
మినిస్ట్రి ఆఫ్ హోమ్ ఎఫెయిర్స్,
ఫారినర్స్ సెక్షన్, లోకనాయక్ భవన్,
ఖాన్ మార్కెట్, న్యూఢిల్లీ-110 003. ఫోన్-619709.

పర్మిషన్ సంపాదించటానికి కనీసం ఆరు వారాల వ్యవధి కావలసి వుంటుంది. ఈ పర్మిషను మొదటి విడతాలో సాధారణంగా 15రోజుల వరకు పరిమితంగా వుంటుంది. 7 రోజులు స్థల సందర్శనానికి, మరో వారం రోజులు పర్వతారోహణ వగయిరాలకు. అవసరమయితే మరో 8 రోజులు. గాంగ్‌టక్‌లోని ఇన్‌స్పెక్టర్ జనరల్ పోలీసువారి అనుమతితో పొడిగించుకోవచ్చు.

పర్మిషనులు పొందటానికి మరో అడ్రసు :
డెప్యూటి కమీషనర్, డార్జిలింగు లేక సిక్కిం టూరిస్టు ఆఫీసు,
హిల్ కార్ట్ రోడ్డు, సిలిగురి.
మీరు ఎక్కడినుండి పర్మిట్‌ను సేకరించదలచుకున్నారో స్పష్టంగా తెలపాలి.

మామూలుగా పర్వతారోహణోత్సాహికులకు నైరుతీ విభాగంలో వున్న డ్జోంగ్రి వరకు మాత్రం. ఏది ఎలా వున్నా పర్వతారోహణ చేయదలచుకున్నవారు ముఖ్యంగా డ్జోంగ్రి పైన ఎక్కాలంటే మినిస్ట్రి ఆఫ్ హోమ్ ఎఫెయిర్స్, గవర్నమెంటు ఆఫ్ ఇండియా వారి పర్మిషను విధిగా కావాలి.

విదేశ యాత్రికులు సమూహంగా 20మంది కంటె ఎక్కువ ఉండరాదు. ఒకవేళ అంతకంటె ఎక్కువగా ఉంటేమాత్రం— అదే గవర్నమెంటు వారిచే గుర్తించబడిన ట్రావెల్ ఏజన్సీ వారిచే నిర్వహించబడేదయితే కొన్ని సూచించబడిన పరిమిత మార్గాలగుండా డ్జోంగ్రి వరకు మాత్రం పర్వతారోహణ చేయవచ్చు. అందునా కలకత్తానుండి బాగ్‌డోగ్రా వరకు విమానంలో ప్రయాణించి 10 రోజుల్లోగా ఈ క్రింది మార్గాల్లో పూర్తి చేయాలి.

బాగ్‌డోగ్రా – నయాబజార్ – పేమాయంగ్‌ట్సే–యాక్సమ్–డ్జోంగ్రి, లేదా బాగ్‌డోగ్రా–యాక్సామ్–డ్జోంగ్రి.

ఈ సమూహంతోపాటు సిక్కిం గవర్నమెంటువారు ఏర్పాటు చేసిన ఒక లెయిజన్ ఆఫీసర్ లేక గైడ్‌ను వెంట తీసికొని వెళ్ళాలి. వారి రాకపోకలు – ఎప్పుడు తిరిగి వచ్చేదీ ఖచ్చితంగా డిపార్టుమెంటు ఆఫ్ టూరిజం, గవర్నమెంటు ఆఫ్ సిక్కిం గాంగ్‌టక్ బజారు, గాంగ్‌టక్ వారికి తగినంత ముందుగా తెలియపరచాలి. వారితో పాటుగా గైడు లేక లెయిజన్ ఆఫీసరును పంపే ఏర్పాటుకి అనుగుణంగా వుండటానికి.

ఈ గైడు లేక లెయిజన్ ఆఫీసరు లేనిదే ఏ విదేశీయాత్రిక సమూహం గూడ సిక్కిం యాత్రాదర్శనం చేయటానికి వీల్లేదు. గనుక గమనించాలి.

## సిక్కింలో చూడదగిన ప్రదేశాలు :

### గాంగ్‌టక్ :

సిక్కిం రాష్ట్రానికి రాజధాని. చిన్న పట్టణం. జనాభా సుమారు 15, 000 మాత్రం.

పడమరవైపున వ్యాపించియున్న కొండల వరసన రాణిపూల్ నది సరసన బ్రహ్మాండమైన సుందర దృశ్యంలో ఇమిడియున్న ప్రదేశం. ఈ పట్టణం ఒక మంచి సినిమా సెట్టింగులా స్వాభావికంగా అమరియున్నది. చుట్టూ అతి దగ్గరగా ఎన్నో చోట్లనుండి కాంచనగంగా శిఖరాలు నేత్రపర్వం చేస్తాయి. ఇది కేవలం 1800 సంవత్సరంలో సిక్కిం రాజధాని అయి శీఘ్రగతిన ఆధునికతను సంతరించుకుంటు న్నది. 5, 800 అడుగుల ఎత్తునవున్న ఈ పట్టణం రోడ్డు అంతా బౌద్ధమత ప్రార్థనలతో నిండివున్న జండాలు రోడ్డు కిరుప్రక్కలా బారులు తీరి మనల్ని పట్టణం వైపుకి తీసికొని వెళతాయి.

అయితే ఖాట్మండూలాగా పురాతన దేవాలయాలు, రోడ్డులు ఇరుకుగా వుండ టం వగైరాలు వుండవు. ఎందుకంటే ఇటీవలి కాలంలోనే ప్రాధాన్యతను సంతరించు కుని అభివృద్ధిపథంవైపు సాగుతున్న చిన్న పట్టణం గనుక. కనుచూపు ఆనినంత వరకూ వినీలాకాశంక్రింద పరుచుకున్న ఎత్తయిన మంచుకొండ శిఖరాలు పోటీ పడుతూ అడుగడుగునా సౌందర్యాన్ని నింపుకున్న ప్రకృతిమాత హొయలు నయనా నందకరంగా గోచరిస్తాయి.

పట్టణానికి చివరగా చోగ్యాల్ భవనం, అసెంబ్లీహాలు వున్నాయి.

కొత్తగా కట్టబడిన ఆశ్రమం. గుంపా, డీర్‌పార్క్, గవర్నమెంటువారి ఆధ్వ ర్యంలో నడిచే కాటేజ్ ఇండస్ట్రీస్ ఇనిస్టిట్యూట్ లివాచీనేతలో శిక్షణ యిచ్చేది చూడవచ్చు. అనేక చేతిపనులు, చేనేత వస్త్రాలు తయారు చేసే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టిబెటాలసీలో టిబెట్టు సంస్కృతీ సంప్రదాయాల విజ్ఞానమునకు సంబంధించిన గ్రంథాలు, కుడ్య చిత్రాలు, కొయ్య నగిషీలు, బుద్ధుని విగ్రహాలతో వున్న దీపపు స్తంభాలు మరెన్నో యితర విగ్రహ సంపద నిజంగా చూడదగినది.

గాంగ్‌టక్‌నించి 23 కి. మీ. దూరంలోవున్న రూమ్‌టెక్‌లో 18వ శతాబ్దంలో నిర్మించబడిన బౌద్ధ ఆశ్రమాలు చాలా వున్నాయి. దాదాపు 150 మంది లామాలకు వసతిగా వుండి పవిత్ర స్థలంగా గుర్తించబడింది, ఈ ఆశ్రమంలో వేంచేసియున్న దైవస్వరూపం పరమ పూజనీయులు గ్యాలాకర్మహ. గురువుకి 16వ అవతారంగా భావిస్తారు.

బక్కిమ్ :

ఉద్యానవనం. పర్వతారోహకులు డ్జొంగ్రి శిఖరారోహణ చేసేటప్పుడు ఒక ముఖ్యమైన మజిలీ.

యాంక్సమ్ :

మొదట 17వ శతాబ్దంలో ఈ ప్రదేశానికి రాజుగా ఎవర్ని చేయాలా-యోగ్యు డెవరా అని-అదృశ్య శక్తి ప్రేరితులై వచ్చిన ముగ్గురు లామాలు కలిసిన పవిత్ర స్థలం. ఇక్కడే సిక్కిం రాజుని నిర్ణయం చేసి కిరీటధారిని కనుగొన్న ప్రదేశం. హిమాలయ పర్వతారోహకులకు ప్రధానమైన ప్రదేశం.

గాంగ్‌టక్ నించి 9 కి. మీ. ఉత్తరాన తాష్‌డింగ్ వ్యూ పాయింటు నుంచి కాంచనగంగా శిఖరాలను సర్వ దిగ్దర్శకంగా చూడగలగటానికి చక్కటి పాయింటు.

ధుబ్ది ఆశ్రమం :

యొకసమ్‌కి 320 మీటర్ల ఎత్తున అతిపురాతనమైన ఆశ్రమం ఒకటుంది. చాలా ప్రశాంతమైన ప్రదేశం. మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

పెమాయంగ్సే :

ఇక్కడ అద్భుతమైన శిల్ప రచనా చాతుర్యంతో పద్మాకారంతో ఒక పెద్ద ఆశ్రమం 1705లో నిర్మించబడింది వుంది.

మరి యింకా పశ్చిమంగా 1716లో నిర్మించబడిన ఆశ్రమం తాష్‌డింగ్ అనే చోట అమరి వుంది. మధ్యలో బాగా ఎత్తుగా కట్టబడి ఎక్కటానికి మెట్లున్నాయి. శిఖరాగ్రమునకు చేరి చూస్తే సర్వపాపాలు పోతాయని ప్రతీతి.

సిక్కింలో చూడదగిన మరికొన్ని ఆశ్రమాలు :

గాంగ్‌టక్ పర్వతాగ్రాన ఉన్న ట్సుక్లా ఖాంగ్, ఎంచీ ఆశ్రమం - దగ్గర లోనే వున్న రలోంగ్, యానాంగ్ దక్షిణ సిక్కింలో ఉంటే - ఉత్తరాన ఫోడాంగ్, ఫెన్సాంగ్, తాహూంగ్ మొదలయినవి. ఇక్కడ మానవ కళేబరం ఎముకల్తో తయారు చేసిన కొమ్ము బూరాలు, కవచాలు లాంటివి చూడవచ్చు.

వుండటానికి వసతులు :

గాంగ్‌టక్‌లో మాత్రం A/c హోటళ్ళు లేవు. వున్నవాటిలో కేంద్రప్రభుత్వ పర్యాటక శాఖవారిచే గుర్తింపబడినవి కొన్ని.

వెస్టరన్ స్టైలు హోటళ్ళు :

1) నోర్ఖిల్ హోటల్
ఫోన్ : 386

2) టాషిడెలెక్
ఫోన్ : 361

ఇతరం :

పెమాయాంగ్సే టూరిస్టు లాడ్జి :

రిజర్వేషన్లు : డిప్యూటి డైరెక్టరు, టూరిజమ్ శాఖ,

సిక్కిం గవర్నమెంటు, గాంగ్‌టక్, ఫోన్ : 292, 664

సెంట్రల్ P. W. D. రెస్టు హౌస్ :

నార్త్ సిక్కిం హైవే, గాంగ్‌టక్,

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, C P W D వారి ఆధ్వర్యంలో.

టూరిస్టు లాడ్జి :

డిప్యూటి డైరెక్టరు, సిక్కిం గవర్నమెంటు టూరిజమ్ డిపార్టుమెంటు

గాంగ్‌టక్ వారి ఆధ్వర్యంలో రిజర్వేషను పొందవచ్చును.

ఇన్‌ఫర్మేషను సెంటరు నుండి వెళ్ళటానికి ప్రత్యేక సౌకర్యం వుంది.

ఇతర హోటళ్ళు మరికొన్ని :

గాంగ్‌టక్‌లో :

హోటల్ అశోక్ మయూర్, హోటల్ కంచెన్ వ్యూ, ఆర్చిడ్ హోటల్, షే. రే. పంజాబ్, గ్రీన్ హోటల్, కర్మా హోటల్, డెంజాంగ్ హోటల్, హోమా మొదలయినవి.

స్థల సందర్శనానికి నిర్వహించబడే టూర్స్ :

1) ఉదయం. గం 9-30 నుండి 12-30 ని॥ల వరకు. టాషివ్యూ పాయింటు నుండి సిక్కిం గవర్నమెంటు టూరిజమ్ డిపార్టుమెంటువారిచే నిర్వహించబడే టూరులో ఫిబ్రవరి నుండి మే వరకు — అక్టోబరు నుండి డిసెంబరు వరకు మాత్రం – డేర్ పార్క్, అన్ని రోజులలోనూ – ఎంచీ పురాతన ఆశ్రమం. రాయిల్ చాపెల్, సెక్రటేరియట్, కాటేజ్ ఇండస్ట్రీస్ యూనిట్ ఇన్‌స్టిట్యూట్, రిటిబెటాలజీ సెర్చి ఇన్‌స్టిట్యూట్, చోర్టెన్, ఆర్చిడ్ శాంక్చ్యుయరీ. చార్జీ రు. 20/- లు మాత్రం.

2) మధ్యాహ్నం 1-30 నుండి 4-30 వరకు మాంటెక్ ఆశ్రమం. చార్జీ రు. 25/- మాత్రం.



# నేపాల్



ఆసియా ఖండంలో ప్రపంచం మొత్తంమీద రెండు పెద్ద దేశాలుగా పరిగణించబడే భారత చైనాల మధ్య ఒద్దికగా ఇమిడియున్న చిన్న స్వతంత్ర రాజ్యం. దేవలోక సదృశం హిమాలయ పర్వతాల దక్షిణపు వాలులో ఉన్న ఈ దేశం వైశాల్యంలో ఇంగ్లాండు లేక బంగ్లాదేశ్ అంత మాత్రమే వుంది. నిర్దిష్టంగా దేశ వైశాల్యం : 1,47,141 చ.కి.మీ.

జనాభా : 1,61,000 పై చిలుకు.

దేశరాజధాని : ఖాట్మండూ.

ప్రజలు : ఘూర్ఖాలు.

మాట్లాడే భాష : నేపాలీ.

ఇటు భారతదేశం – అటు చైనా వున్నా మన దేశానికి నేపాల్‌కు కూడా విడదీయరాని సంబంధ బాంధవ్యాలున్నాయి. సాంస్కృతికంగాను, మత పరంగాను ప్రజల ఆచార వ్యవహారాల్లోకూడా ఎన్నో సారూప్యాలున్నాయి. హిందూమతం, బౌద్ధమతం రెండూ చెట్టపట్టా లేసుకుని వర్ధిల్లాయి. అయినా హైందవమతం, సంస్కృతి, వేద విహితమైన సత్సంప్రదాయాలు ప్రజల జీవన విధానంలో ముఖ్యంగా చోటు చేసుకున్నాయి. ఇందుకు ముఖ్యకారణం. హైందవ పురాణాల్లో విష్ణువుయొక్క దశావతారాల్లో బుద్ధుని తొమ్మిదవ అవతారంగా పేర్కొనబడటం గమనార్హం. ఇప్పటికీ ఇక్కడ హైందవులు సుమారు. 80 శాతం ప్రజలతో కమేడింగ్‌గా వున్నది. మిగతా 20 శాతంలో 15 శాతం మంది అచ్చమైన బౌద్ధులు, ఇస్లామీయులు చోటు చేసికొని యున్నారు.

నేపాల్ చూడటం అంటే 'టైమ్ మెషిన్'లో ప్రయాణించి పురాతనం, ఆధునికం ప్రక్క ప్రక్కనే దర్శించడంగా చెప్పుకోవచ్చు. మహారాజులు ఆర్యరాజపుత్ర వంశాలకు చెందిన వారుగా వున్నా ప్రజలందరూ అందుకు విభిన్నంగా మంగోలాయిడ్స్‌కి చెందినవారు. ముఖ్యంగా భారత్ ఈశాన్యం కొండల సరిహద్దుల ప్రదేశాలకి చెందినవారుగా ఉన్నారని చారిత్రక పండితుల భావన. అందుకు తగ్గట్టుగా వారి శారీరక నిర్మాణంకూడా - పసిమివర్ణం, చిన్న వంకర కండ్లు, ఎత్తుదవడలు, పొట్టి - పొడుగూ కాకుండా సరి సమానమైన ఎత్తు కలిగి యుండుట - గమనించదగిన విశేషాలు. ఈ దేశంలో మనకు ఆసక్తిని రేకెత్తించే ఎన్నో పూర్వ విశేషాలు చెక్కు చెదరకుండా ఉన్నాయి. వాటిని చూడబోయేముందు సంగ్రహంగా దేశ చరిత్రను ఒక్కసారి అవలోకించడం ఎంతయినా సముచితం.

సంగ్రహంగా చరిత్ర :

నేపాల్‌కు విస్తృతమైన పురాతన చరిత్ర వుంది. ప్రపంచం మొత్తంలో అతి పురాతనమైన ప్రజాస్వామ్యం క్రీ.పూ. 6వ శతాబ్దానికి ముందే వర్ధిల్లి వుందంటే అతిశయోక్తి కాదు. ఇది గౌతమ బుద్ధుని పూర్వులైన శాక్యరాజులు పాలించినకాలం. క్రీ.పూ. 3, 4 శతాబ్దాల కాలంలో ఉత్తర భారతంనించి విచ్ఛలీయులు నేపాల్‌లో ప్రవేశించడం మొదలు పెట్టారు. మధ్య యుగాల వరకూ నేపాల్ రాజ్యం చిన్న చిన్న ముక్కలుగా స్వతంత్ర రాజుల పరిపాలనలో వుండేది. క్రీ.శ. 13వ శతాబ్దంలో జరిగిన మల్లరాజుల వలన హైందవ సంస్కృతికి, సంప్రదాయాలకు అంతులేని బలాన్నిస్తూ, సుందర దేవాలయాలు, కళాత్మకంగా రూపొందించడం జరిగింది.

17వ శతాబ్దంలో కాట్మండూలోయ మూడు విభాగాలుగా విడిపోయింది—మూడు వేర్వేరు రాజ్యాలయింది - అవి కాంతిపూర్, లలిత్‌పూర్, భక్తపూర్ - ఇప్పుడు దాదాపుగా ఖాట్మండు, పటాన్, భదగాంలుగా పేర్కొనబడ్డాయి. పశ్చిమ ఘూర్ఖా ప్రదేశానికి చెందిన రాజా పృథ్వీ నారాయణ షా క్రీ.శ. 1735 -1775 వరకు పాలించిన వారు- మూడు విడి రాజ్యాలను ఒకే గొడుగు క్రిందకు తెచ్చారు. 1846 ప్రాంతంలో రాణాలు వశం చేసుకున్నారు. అప్పటి నుండి బ్రిటిషు వారి దాడులు మొదలయ్యాయి. దీనికి అంకురార్పణ 1817 లోనే జరిగిందని చెప్పవచ్చు. కాని 1857 లో జరిగిన భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి నాందీగా జరిగిన సిపాయిల కలహం సమయంలో ఘూర్ఖాలు ఇంగ్లీషు వారికిచ్చిన మద్దతుతో

నేపాలు రాజ్యంలో బ్రిటిషువారి వశంలో ఉన్న అనేక ప్రాంతాలు వారికే వశం చేశారు. అప్పటి నుండి బ్రిటిషు రాయల్ ఆర్మీలో నమ్మకం, విశ్వాసపాత్రమైన సైన్య విభాగంగా ఉండి అన్ని యుద్ధాల్లోను ముందుండి బ్రిటిషువారి తరపున కొమ్ము కాసి బాసటగా నిల్చారు ఘూర్ఖాలు. నేపాల్ దేశ చరిత్రలో 1846 నుండి ఇటీవల వరకూ అంటే దాదాపు 1951 వరకూ చీకటి యుగంగా పరిగణించబడింది. ఈ కాలంలో నేపాలు రాజ్యం మొత్తం నియంతలై రాణాలు ప్రధాన మంత్రులుగా ఆధిపత్యంలో ఉండి అనేక యిబ్బందులకు గురి అయింది. తరువాత నేపాల్‌లోని షా వంశానికి చెందిన తొమ్మిదవ రాజైన రాజా మహేంద్ర 1951 లో రాణాల మంత్రిత్వానికి ఫుల్‌స్టాప్ పెట్టి వారి ఆధిక్యతను తుడిచిపెట్టి వేయగలిగాడు. తరువాత ఆయన కుమారుడైన రాజా బీరేంద్ర బీర్ బిక్రమ్‌షాదేవ్ నేతృత్వంలో ఆర్థిక ప్రగతి లోను, సంస్కరణలోనూ ముందంజవేస్తూ పురోగతివైపు వడివడిగా సాగిపోవటం మొదలైంది.

## ప్రజలు :

వివిధ ప్రదేశాలనుండి వచ్చి నిలిచిపోయిన అనేక గిరిజన జాతులు, తెగల సమ్మేళనంతో వివిధ ఆచారాలకు, సంప్రదాయాలకు నిలయమై శోభిల్లుతూంది. గురుంగులు, మగరులు అన్నపూర్ణ, హిమచూలి, గణేష్‌హిమాల్ కొండల దక్షిణ వాలులోను, పడమటి వాలు ప్రదేశాల్లోను నివసిస్తుంటారు. తూర్పు కొండల ప్రాంతంలో నివసించేవారు రాయ్‌లు, లింబూలు, సున్‌వర్‌లు. షేర్పాలు (మంచు పులులుగా పేర్కొనబడ్డవారు) 15, 000 అడుగుల ఎత్తున నివసిస్తుంటారు. ఖాట్మండూ లోయలోనే వారు నివసిస్తున్నారు. తరాయి అడవి ప్రాంతంలో తరు, ధిమాలీ జాతులు వుంటాయి. నేపాల్ దేశానికి సంబంధించి అధిక జనాభా ముఖ్యంగా ఖాట్మండూ, పటాన్, భక్‌తాపూర్, బిరాట్‌నగర్, బీర్‌గంజ్, నేపాల్‌గంజ్, భైరాహవా ప్రదేశాల్లో కేంద్రీకరించబడి ఉన్నాయి. ఘూర్ఖాలు స్థానికంగా ఉన్న మంగోలాయిడ్స్ కుదురుకు చెందినవారుగా పరిగణించబడుతున్నారు.

## మతం, సంస్కృతి, సాంప్రదాయాలు :

దేవభూమి, వేదభూమి. ఇక్కడ హైందవం, బౌద్ధం రెండూ సరిసమానంగా వర్ధిల్లిన మతాలు. హైందవులు బుద్ధుని, బౌద్ధులు హిందూ దేవతల్ని ఆరాధించటం

గమనించదగిన అంశం. రెండు మతాల మధ్య గల సత్సంబంధాలు సర్వసాధారణంగా సంప్రదాయబద్ధమైన ఆచారాలు, ఉత్సవాలు, ఆరాధనలు విశేషంగా పాటించబడుతున్నాయి.

బౌద్ధ విహారాలుగాని, హిందూ దేవాలయాలుగాని అద్భుతమైన శిలాశిల్పాలు, ఇత్తడి విగ్రహాలు, చెక్క నగషీ పనులు ఆశ్చర్యాన్ని గొల్పుతాయి. సుసంపన్నమైన సాంస్కృతీ వారసత్వం అన్ని యెడలా కొట్టవచ్చినట్లు కనపడుతుంది. ఇక్కడ ప్రతిరోజూ ఒక పండుగే. ప్రతి పండుగా మహోత్సాహంతో సంరంభంగా జరుపుకుంటుంటారు. వాటిలో ముఖ్యమైనవి :-

ఏప్రియల్ రెండో వారంలో జరుపుకొనే సంవత్సరాది- నబ బర్షి మహోత్సాహంతో జరుపబడే వేడుకలతో సంరంభంగా వుంటుంది. జాతీయ సెలవు దినంకూడా. ఇదే రోజున భడగావన్‌లో లింగజాతర లేక బిస్కెట్ మహోత్సవంగా నిర్వహించబడుతుంది.

మేలో వచ్చే బైశాఖ పూర్ణిమ. (వైశాఖ పూర్ణిమ) బుద్ధుని జన్మదినం. తథాగతునికి స్వయంభూ వద్ద లుంబినీ మరికొన్ని ప్రదేశాల్లో పూజలు, సేవలు బ్రహ్మాండంగా జరుగుతాయి. పటాన్‌లో జరిగే అరుణా మచ్చీంద్రనాథుని రథయాత్రోత్సవం కనుల పండుగగా జరుగుతుంది. దీనికి ప్రతిగా ఖాట్మండూలో శ్వేతమచ్చీంద్రనాథుని రథయాత్ర గొప్పగా జరుగుతుంది. అది మార్చి-ఏప్రిలు మాసాలలో నాలుగు రోజులుజరుగుతుంది. జూలై నెలలో షెర్పాలుధుంజీమహోత్సవంజరుపుకుంటారు.లోషద్ పండుగ షెర్పాలు, టిబెట్టు భాష మాట్లాడేవారు కలిసి బ్రహ్మాండంగా జరుపుకుంటారు ఈ సమయంలో జరిగే సామూహిక నాట్యాలు, జానపద నృత్యాలు, గానాలు చూడదగినవి. రాజా బీరేంద్రదేవ్‌గారి జన్మదినం 28 డిశంబరు నాడు మహా సంరంభంగా జరుగుతుంది. తమ ఏలికకు గొప్ప అభినందనగా జరుపబడుతుంది. ఈ రోజున తుండిఖేల్‌లో గొప్ప కవాతులు వగైరాలు కూడా జరుగుతాయి.

మరింకా ముఖ్యంగా గోయాత్ర, దాశాయన్, దుర్గపూజ అక్టోబరు మాసంలో జరుగుతుంది. ఈ సందర్భంగా దేశం మొత్తానికి 15 రోజులు సెలవు దినంగా ప్రకటిస్తారు. ఆగష్టు-సెప్టెంబరు మాసాల్లో ఇంద్రోత్సవం, కుమారి పూజ ముఖ్య ఆకర్షణ. ఇక్కడ దీపావళి అక్కడ తీహార్ పండుగ. శివరాత్రి పర్వదినం పశుపతినాథ్ దేవాలయంవద్ద అశ్వాలు కూర్చిన రథాలు, అశ్వయాత్రోత్సవం మరి అనేక రకాలైన క్రీడల్లో పందేలు నిర్వహించబడుతుంటాయి.

ఇక్కడికి రావాలంటే ? ! :

భారతీయులకు వీసాలు అక్కరలేదు. ఆంక్షలంటూ ఏమీ లేవు. ఎప్పుడైనా రావచ్చు, పోవచ్చు. విదేశీయులకు వీసాలు, పర్మిట్లు వగైరాలు తప్పవు. ఇండియా, బర్మా, థాయిలాండ్, బంగ్లాదేశ్, బర్మా, శ్రీలంక ప్రధాన నగరాలన్నిటినుండి రాయల్ నేపాల్ ఎయిర్‌లైన్సు కార్పోరేషను వారి విమాన సర్వీసులున్నాయి. కాట్మండూ నుండి బాంగ్‌కాంక్, కలకత్తా, న్యూఢిల్లీ, కొలంబో, పాట్నా నగరాలకు విమానాలు నడుపుతూంది. బాంకాంక్-కలకత్తా-కాట్మండులను కలుపుతోంది థాయ్ ఎయిర్‌లైన్సు. రంగూనునుండి-కాట్మండుని UBA కలుపుతుంది. బంగ్లాదేశ్ బిమాన్ ఢాకా-కాట్మండులను కలుపుతుంది.

నేపాల్లోపల ది రాయల్ నేపాల్ ఎయిర్‌లైన్సు అనేక నగరాలమధ్య విమానాలను నడుపుతుంది. గోర్ఖా, పోకార, భైరాహవా, నేపాల్‌గంజ్, డాంగ్, భద్రపూర్, జనకపూర్, సుఖేత్, జుమ్లా, బాగ్లుంగ్, సిలిగురి (వెస్ట్ బెంగాల్) డోటి, రుకుంబాన్, రుంజతర్, లుక్లా, తుమ్లుగ్‌లార్, లామిదండ, మేఘల్లి మొదలయిన నగరాలకు కాట్మండుని దగ్గర చేస్తున్నాయి.

అక్టోబరు నుండి మే నెలల మధ్య హిమాలయశ్రేణిలో అతి పెద్దవైన శిఖరాలను దర్శించటానికి వీలుగా 1977 నుండి హెలికాప్టర్ సర్వీసులు గూడ ప్రారంభించింది నేపాలు ప్రభుత్వం. ఈ సమయంలో ఎవరెస్టు శిఖరాన్ని గూడా దర్శించవచ్చు.

కాట్మండులో దాదాపు 15 విమానయాన కార్యాలయాలున్నాయి. (AIR LINE OFFICES).

ఇండియాలోని కొన్ని నగరాలనుండి రోడ్డు కనెక్షన్లు గూడ ఉన్నాయి. కాట్మండుకి – ఢిల్లీ, పాట్నాల మీదుగా ఏసియన్‌హైవే కాట్మండుకి చేరుస్తుంది. నేత్రానందాన్ని గూర్చే తరాయి అడవులు, కొండలు, గుట్టలు, లోయలు పెద్ద పెద్ద మహాపర్వతాలు ఒక పెద్ద సీనరీగా కనడుతూ ప్రయాణికులను సంభ్రమాశ్చర్యాలు, ఆహ్లాదాన్ని కలిగిస్తుందీ రోడ్డు ప్రయాణం. ఒక మరిచిపోలేని మధురానుభూతి ఇక్కడ ప్రకృతి మనకిచ్చే కానుక.

వీటికి తోడు నేపాల్‌లో నేరోగేజ్ రైలుమార్గం ద్వారా పాసెంజర్ రైళ్ళను నడుపుతుంది నేపాల్-జనక్‌పూర్-జయనగర్ రైల్వేసంస్థ.

విదేశీయులకు ప్రవేశద్వారాలు పన్నెండు. 1) కాకర్‌భీటా, 2) జోగ్‌బని, 3) జతేశ్వర్, 4) బీర్‌గంజ్, 5) రోదారి, 6) సునేలి (బెల్‌హారియా) 7) కాకర్ హవా (కలిదాహ) 8) నేపాల్‌గంజ్, 9) బోయిలాబాస్, 10) ధంగాడి, 11) మహేంద్రనగర్, 12) త్రిభువన్ ఇంటర్‌నేషనల్ ఎయిర్‌పోర్టు-కాట్మండు.

నేపాల్ దేశంలోకి వెళ్ళబోయే ముందు విదేశీయులకు-

1) వేలిడ్ పాసుపోర్టుండాలి.

2) దానికి తోడు వీసా నేపాల్ ఎంబసీగాని కాన్సలేట్ వారిచే గాని ఎండార్సు చేయబడినది - విధిగా కలిగి వుండాలి.

3) 30 రోజుల పరిమితిని మూడు విడతలుగా ఒక్కొక్కసారి ఒక్కొక్క నెలకంటే ఎక్కువ గాకుండా పొడిగించుకోవచ్చు.

4) భారతీయులకు వీసాలు, పాస్‌పోర్టులు అవసరంలేదు. వివరాలేమైనా కావాలంటే సమాచారం కొరకు సంప్రదించవలసిన చోటు :-

ది సెంట్రల్ ఇమ్మిగ్రేషన్ ఆఫీసు,
రాంషాపథ్, పుతలీసరక్, కాట్మండు.

వీసాలు-వగైరాలకు సంప్రదించవలసిన చోటు :-
టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ కౌంటరు,
బసంత్‌పూరు, కాట్మండు, ఫోన్ : 15818.

సమాచారానికి ప్రత్యేక కౌంటరులు :- త్రిభువన్ ఎయిర్‌పోర్టు, కాకర్‌భీటా, బీర్‌గంజ్, పొకారా, భైరాహవాల్లో గూడా ఉన్నాయి. బంగ్లాదేశ్‌లో ఉన్న నేపాల్ ఎంబసీ ద్వారా కూడా నేపాల్‌కి వీసా పొందవచ్చు. మరికొన్ని దేశాల్లోవున్న నేపాల్ ఎంబసీలు- బర్మా, చైనా, ఈజిప్టు, ఇండియా, జపాన్, పాకిస్తాన్, సౌద్ అరేబియా, UK, థాయిలాండ్, USA, హాంగ్‌కాంగ్ మొదలైన అన్ని దేశాల్లోనూ ఉన్నాయి.

**విదేశీ మారకపు విలువలు :**

భారతదేశీయులు తప్ప ఇతరంగా ఏ దేశాన్నుండి వచ్చినా విధిగా నేపాల్ కరెన్సీ వుండాల్సిందే. ట్రావెలర్ చెక్‌లు వగైరాలు తెచ్చుకోవచ్చు. యాత్రికులు కరెన్సీ డిక్లరేషన్ ఫారాలు పూర్తిచేసి ప్రవేశం చేసే పాయింటు దగ్గర యివ్వాలి. నేపాల్‌లోని నేపాల్ రాష్ట్రబ్యాంకి విదేశ మారకమునకు గల ప్రత్యేక కౌంటర్లలో

పాస్‌పోర్టు చూపించి నేపాల్ ద్రవ్యాన్ని పొందవచ్చు. మారకపు రేట్లు ఈ క్రింది విధంగా ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| నేపాల్ రూపాయి | | = | ఇండియాలో రు. 1-45 పై. |
| 14.30 | ,, | = | U. S. డాలరు 1 |
| 25 | ,, | = | స్టెర్లింగ్ పౌండు |
| 7 | ,, | = | స్విస్ ఫ్రాంకు |
| 3 | ,, | = | ఫ్రెంచ్ ఫ్రాంక్ |
| 2.80 | ,, | = | స్వీడిష్ క్రోనార్ |
| 100 | ,, | = | 2000 జపాన్ ఎన్‌లు |
| 100 | ,, | = | 7000 ఇటలీ-లీరాలు |

ఇక్కడున్న ప్రతి ట్రావెల్ ఏజన్సీస్‌వారు- ఇంగ్లీషే తెలిసిన గైడ్స్‌ను యివ్వగలరు. స్థల దర్శనాలకు చక్కటి ప్రోగ్రాము కూడా వారి దగ్గర లభ్యమవుతుంది. ఇక్కడి నేపాల్ రాజధాని అయిన ఖాట్మండు నుండి మొదలుపెడదాం ముఖ్యమైన విశేషాలు.

ఖాట్మండు :—

4,500 అడుగుల ఎత్తున ఉన్నది. సుమారు 385 సంవత్సరాల క్రితం ఒక చెట్టుతోడెలో తొలచబడిన పగోడా ఆకారంతో ఉన్న చిన్న దేవాలయం అయిన కష్టమండప్ వలన ఈ పట్టణానికి ఖాట్మండు అనే సార్థకమైన పేరు గలిగిందని ప్రతీతి. ఇది ఇప్పటికీ నగరం నడిబొడ్డున దర్బార్ స్క్వేర్‌లో వున్నది. ఖాట్మండు ప్రస్తుత నేపాల్‌కి రాజధాని నగరం. జనాభా సుమారు 5 లక్షల పైచిలుకు వుంటుంది. అన్ని విధాల ఉన్నత ప్రమాణాల ఆధిక్యతతో యాత్రికులకు మనోల్లాసాన్ని కలిగించే కమనీయమైన సుందర నగరం. ప్రాచ్యదేవళాలు, ప్రార్థనా మందిరాలు, బజారులు ఒకవంక- మరోవంక ప్రాశ్చాత్య రీతుల్లో కట్టబడిన అధునాతనమైన భవనాలు, హోటళ్ళు మనకెంతో ఆసక్తికరంగా వుంటాయి. కొత్తరోడ్డుకు, పూర్వపు మెయిన్ మార్కెటుకూ మధ్యన దర్బార్ స్క్వేర్‌కు అనతి దూరంలో అమరియున్నవి ఖాట్మండులోని అద్భుత ప్రదేశాలు. మూడంతస్థుల కుమారిదేవి ఆలయం చూడదగినది. కుమారి

అంటే జీవంతో ఉన్న ప్రత్యక్ష దైవం. ఈ దైవంగా ఒక చిన్న బాలికను ఎన్నుకోనేటప్పుడు జరిగే కోలాహలం, ఉత్సవం నిజంగా చూచితీరవలసిందే. ఈ బాలిక అపరదేవి అవతారంగా యౌవన ప్రాదుర్భావం వరకూ ఇష్టదైవంగా ఆరాధించ బడుతుంది.

**హనుమాన్ ధాకా :**

శివాలయం సముదాయం. తెలాజు దేవాలయం 16వ శతాబ్దంలో నిర్మించబడిన బహుసుందరమైన రాజభవనం. ఆంజనేయస్వామి విగ్రహం ఎర్రటి గొడుగు క్రింద ప్రవేశద్వారం దగ్గరనే వుంటుంది. కస్థ మండపం దగ్గర 1687 సంవత్సరంలో తయారుచేయబడిన గరుడ వాహనం శిల్పం, గజాననుడైన శ్రీ విఘ్నేశ్వరుని విగ్రహం, లయకారుడైన కాలభైరవుని- అయింటేస్థితిలో ఉన్నది- కమనీయం రమణీయం.

దర్బార్ స్క్వేర్‌లో శృంగార శిల్పాలతో రసోద్దీపనం కలిగించే కమ్మని శిలా శిల్పకళాకేంద్రం జగన్నాథ దేవాలయం. హిందూ దేవాలయం నారాదేవి ఆలయం పగోడాకృతిలో ఉన్నటువంటిది, ఇంద్రచౌకురో ఆకాశభైరవాలయం ఇంద్రునికి బలులిచ్చే చోటుగా ప్రసిద్ధము అయినది. నాథయోగుల మచ్ఛీంద్రనాథ ఆలయంలోని మచ్ఛీంద్రనాథుడు హిందువులకు, బౌద్ధులకు ఆరాధ్యదైవంగా వున్నది చూడవచ్చు.

1903లో నిర్మించబడిన సింహ దర్బార్‌పాలెస్ పూర్వపు మహారాజులు నివసించటానికి ఉద్దేశించిన రమ్యహర్మ్యం. ఈ భవనం కొన్నాళ్ళ క్రితం పెద్ద అగ్ని ప్రమాదంలో చిక్కుకుని చాలావరకు పరశురామ ప్రీతి అయింది. తగులబడక ముందు 1600 గదులతో 7 దర్బారు హాలుల్తో ఆసియాలోకెల్ల అతిపెద్దవైన రాజుల గృహాల్లో ఒకటిగా పేర్కొనబడింది. పోయినవిపోగా ప్రమాదం బారిపడకుండా వున్న ముచ్చటైన ముందరభాగం, రిసెప్షను రూము ఏరియా వై భవాలను గురుతు చేయటానికి మిగిలి ఉన్నాయి. ఇక్కడికి దగ్గరిలోనే మృతవీరుల స్మారక మందిరం ఒక గంభీరమైన ఆర్చి కట్టడం. ప్రస్తుతపు రాజభవనం నూతన కట్టడం దర్బారు మార్గంలో చివరగా నున్నది. మధ్యలో ఉన్న నేషనల్ మ్యూజియంలో వున్న నేపాలీయుల నగిషీల అద్భుత వస్తు సముదాయం కళాత్మకమైన వస్తుప్రదర్శన చూచుకుని, అతి పురాతన బుద్ధదేవుని ఆలయం మూడు కిలోమీటర్లలో ఉన్నదానిని చూడవచ్చు.

**పశుపతినాథ్ ఆలయం :**

ఖాట్మండు నగరానికి తూర్పున 5 కి.మీ. దూరంలో ఖాట్మండు నగరంలోకి

చెందినదే గొప్ప శివాలయం. బాగమతీనది ఒడ్డున అమరియున్న ఈ పవిత్ర దేవా లయం ఒక ప్రధాన ఆలయం. ఇక్కడికి శివరాత్రి పర్వదినానికి భారతీయులు కొన్ని వేలమంది వచ్చి దర్శించుకొని పోతారు. ఇక్కడి పార్వతి అమ్మవారు, అష్టాదశ శక్తిపీఠాల్లో 11వ మూర్తిగా ప్రసిద్ధం. పశుపతినాధుని దర్శనం సర్వవ్యాధి నివారణం సర్వపాపహరణంగా నమ్మిక. ఆలయం పైభాగం బంగారుపూత పూయబడిన అంచులు గలది. ఆలయంలోకి హిందువులు మాత్రమే రావచ్చును. ఇతర మతస్థులకు ప్రవేశం లేదు. నేపాల్‌లో ముఖ్యంగా మంచి రుద్రాక్షలు, కస్తూరి, జవ్వాజులు దొరుకుతాయి. ఈ ఆలయంలో ఇనుమును బంగారంచేసే పరుసవేది ఉందనిన్నీ ప్రస్తుతం దానికి శక్తి తగ్గినది అనీ ప్రచారంలో ఉన్నటువంటి మాట.

ఇక్కడికి సమీపంలో గుహేశ్వరి ఆలయం- శివుని యిల్లాలు పార్వతిదేవికి అంకితమయిన మరో ఆలయం వుంది ఇది కూడ ఒక శక్తిపీఠంగా పేర్కొనబడు తుంది. ఇక్కడ కూడ హిందువులు మాత్రమే ప్రవేశానికి అర్హులు.

మరో రెండు కి.మీ. దూరంలో క్రీ.శ. 500 సం॥లో రాజా మానదేవుడు కట్టించిన బౌద్ధవిహారం ఉన్నది. మరో కిలోమీటరు దూరంలో గోకర్‌బన్ అనే వన్య మృగ రక్షణశాలకూడా ఉంది. ఏనుగెక్కి విహరిస్తూ వన్యమృగాలను పరికించవచ్చు.

## బాలాజు ఉద్దన్ :

ఇది ఒక ఉద్యానవనం. ఇక్కడ 18వ శతాబ్దం మధ్యకాలంలో నిర్మించబడిన ఒక పెద్ద స్విమ్మింగ్‌పూల్ వున్నది. ఇక్కడి ఈ స్విమ్మింగ్‌పూల్‌కి 22 మకర శిరస్సు ఆకారంగల వాటిలోనుండి నీరు ప్రవహిస్తూ వుంటుంది. నగరానికి వాయవ్యంగా ఉన్నది.

మంచి పిక్నిక్‌స్పాట్ సుందరిజల్ జలపాతం.

ఇక ఖాట్మండుకి నైరుతిదిశలో 7 కి.మీ. దూరంలో త్రిభువన విశ్వ విద్యా లయం, మరెన్నో ఆకర్షణలతో కిరీట్‌పూర్ ఉన్నది.

## చోవర్ :

కొండపైన ఆదిమఠము అనే దేవాలయం ఉన్నది. ఇక్కడి నుండి బ్రహ్మాండ మైన పర్వత దృశ్యములు, అనంతమైన లోయలు చూడగలం. ప్రకృతిలోని అతి ఉన్నతత్వం - అధఃపాతాళం రెండూ చూడగలగటం ప్రత్యేకం.

### ఫార్పింగ్ & దక్షిణకాళి :

ఫార్పింగ్ షేష్ నారాయణుని ఆలయం ఒక చిన్నకొండ మీద అమరి యున్నది. కళాత్మక విలువలుగల ఎన్నో శిల్పాలు చూడవచ్చు. క్రింద మనకు కన బడే చిన్న కుంటలో మెరిసే వింతచేపలు కనపడతాయి. ఫార్పింగ్ నుంచి రెండు కిలోమీటర్ల దూరంలో దక్షిణకాళి ఆలయం ఉన్నది. దేవిని ఆరాధించటానికి ప్రజలు ప్రతి మంగళవారం, శనివారాలు వస్తుంటారు- అర్చనలు, పూజలు చేయిస్తుంటారు.

## పటాన్

ఖాట్మండుకి ఆగ్నేయదిశలో సుమారు 5 కి.మీ. దూరంలో ఉన్నది పటాన్ పట్టణం. పురాతన కాలంలో లలితపూర్‌గా ప్రసిద్ధి. నేపాల్‌కి ప్రాచీన కాలంలో కొన్నాళ్ళు ముఖ్య పట్టణంగా వున్నది. ప్రస్తుత నేపాల్‌లో ఖాట్మండు తరువాత 2 వ స్థానంలో నిల్చే పెద్దపట్టణం. ఈ పట్టణం క్రీ.శ. 298 ప్రాంతంలో రాజా వీరదేవ్ నిర్మించారుట. నగరమంతా బుద్ధస్థూపికలు, హిందూ దేవాలయాలు బదు, ఇత్తడి ద్వారాలు, దేవతా విగ్రహాలు, అనంతమైన సుందరమైన చెక్కడపు పనులను నిక్షిప్తం చేసుకొని ఉన్నాయి. ఈ పట్టణం ఎంతో పేరుపొందిన నైపుణ్యంగల ఉత్తమ కళాకారులకు కాణాచి అయినది. నిజంగా ఈ హిమాలయ పర్వతరాజ్య సంస్కృతీ సంప్రదాయాలను అధ్యయనం చేసే అభిరుచి వున్నవారికి ఎంతో ఆకర్షకం, తప్పని సరిగా చూడదగిన ప్రదేశం.

### దర్బార్ స్క్వేర్ :

పట్టణానికి నడిబొడ్డున ఉన్న ముఖ్య ఆకర్షణ కేంద్రం. పురాతన భవనాలు, హిందూ దేవాలయాలు, బౌద్ధుల ఆరామాలు, అనేక పురాతన శిలాశిల్ప చెక్కడాలు, రాతిలో మలచిన నగిషీలు అద్భుతానందాన్ని కలుగజేస్తాయి.

### హిరణ్యావర్ణ మహావీర్ :

మూడంతస్థుల బంగారు పగోడాకృతిగల లోకేశ్వరుని ఆరామం. 13 వ శతాబ్దంలో రాజా భాస్కరవర్మ కట్టించారు బుద్ధుని బంగారు చిత్రం. ఒక పెద్ద ప్రార్థనా చక్రం, అనేకమయిన చిత్రాలు గోడలమీద పెయింటింగ్ చేయబడినవి. శిల్పాల ముఖ్యంగా ఆకర్షిస్తాయి.

బుద్ధునికి మరో ఆరామం రుద్రవర్మ మహావీర్ ఆశ్రమం. రాతి విగ్రహాలు, కంచు విగ్రహాలు, మత చిహ్నాలు ఎన్నో వున్నాయి. చారిత్రక అధ్యయన పరులకు మరింత ఆసక్తికరం.

రాజా సిద్ధనరసింహమల్ల కట్టించిన కృష్ణ మందిరం, మహాభారత యుద్ధం, రామ రావణ కర్ణ చిత్రాలతో క్రీ.శ. 16వ శతాబ్దంలో నిర్మించినది.

1422 లో జయస్థితి మల్లరాజు నిర్మించిన శివాలయం కుంభేశ్వర ఆలయం. 5 అంతస్థులు పగోడా రీతిలో కట్టబడింది. నిండు పున్నమినాడు వెన్నెలలో చూడ దగిన మనోహరమైన కట్టడం.

## అరుణ మచ్ఛేంద్రనాథ్ ఆలయం :

మచ్ఛీంద్రనాధుడు నేపాల్ ప్రభువులకు ఆరాధ్యదైవము. ఒకానొక ప్పుడు పుష్కరంపాటు నేపాల్ దేశం మొత్తం కరువుతో అల్లాడినప్పుడు అప్పటి ప్రభువు, శ్రీ రాజా నరేంద్రదాసు ఒక మహత్వ పూర్ణమయిన బౌద్ధ భిక్షువును ఆహ్వానించి తెచ్చారట. ఆ మహానుభావుని రాకతో సుభిక్షంగా వర్షాలు కురిసి దేశం సశ్యశ్యామలయి కరువు కాటకాలనుండి విముక్తమైనదట. ఆనాటినుండి నేటివరకూ మచ్ఛేంద్రనాధ్ ఉత్సవాలు సంరంభంగా జరుగుతూనే వున్నాయి.

## అశోకుని స్థూపాలు 4 :

పటాన్ పట్టణం నాలుగు దిశల క్రీ. పూ. 250 ప్రాంతంలో అశోకునిచే నిర్మించబడినవిగా నమ్మిక. ఈ నాలుగు స్థూపాలు నగరానికి ఒక ఆశ్రమ ప్రతి పత్తిని కలిగిస్తున్నాయి.

ఇక్కడికి దగ్గరలోనే జంతు ప్రదర్శనశాల వుంది. అందులో ఒంటి కొమ్ము ఖడ్గమృగం, హిమాలయాల్లో వుండే పిల్లి, మరెన్నో అరుదైన జంతు జాలాలు మనకు కనువిందు చేస్తాయి.

పటానుకు 10 కి. దూరంలో గోదావరి దట్టమైన అడవుల మధ్యలో పెంచ బడుతున్న రాయల్ బొటానికల్ గార్డెన్, ఛపాగావం గ్రామం దగ్గరగల తిలభైరవ తాలా చూడదగిన ప్రదేశాలుగా చెప్పుకోవచ్చు. ఇక్కడ దగ్గరలోనే 9,050 ఠి ఎత్తులోగల బుద్ధుల పగోడాను దర్శించవచ్చు.

# భడగావన్

దీన్నే భక్తిపూర్ అని అంటారు. రాజధానీ నగరానికి సుమారు. 15 కి.మీ. దూరంలో వున్న మూడవ నగరం. వ్యవస్థాపకులు రాజా ఆనంద దేవ క్రీ. శ. 9వ శతాబ్ధం ఉత్తర భాగంలో కట్టించారని ప్రతీతి. ఇక్కడి గృహాలు, ప్రపంచం లోని అత్యంత కళాత్మకంగా రూపొందించబడిన కళానికేతనాలుగా చెప్పుకొంటారు. చాలా పురాతన కాలానికి చెందినపపటం - పశ్చిమ జర్మనీవారి ఉదార సహాయంతో పట్టణం మొత్తాన్నే ఒక పెద్ద మ్యూజియంగా మార్చే పనిలో ఉన్నారు. రాజుల బంగారు ప్రతిమలు, పురాణ పురుషుల రూపాలను గృహాల పైకప్పులలో, స్థంభాల లోను, నిక్షిప్తంచేసి ఉండటం విపులంగా అధ్యయనం చేయదగిన విశేషం.

ఇంకా ఇక్కడ చూడిదగినవి వస్త్రముల మీద వేయబడిన రంగు రంగుల చిత్రాలు, భవనాలు, తలేజు ఆలయం, బాగమతి ఆలయం, బట్ల్యాల శిఖరం రీతిలో ఉన్న దేవాలయం, దత్తాత్రేయులవారి ఆలయం, ఐదు అంతస్థుల నటపోలాలయం, వగైరాలుతో పాటు, ఠానోతిమి గ్రామంలో తయారయ్యే చిత్ర విచిత్రములైన మట్టి పాత్రలు, నాట్యాలు చేసేటప్పుడు వేసుకొనే మాస్కులు వగైరాలు. భడగా వన్‌కి 10 కి. మీటర్ల దూరంలో - సూర్య వినాయక ఆలయం చూడదగింది.

**పోఖార :**

పర్వత శ్రేణుల్ని, శిఖరాగ్రాలను పరికించటానికి అద్భుతమైన అవలోక నాంశం.

**లుంబిని :**

బుద్ధుని జన్మస్థలం - మన దేశంలోని ఉత్తర ప్రదేశ్‌కి దగ్గర.

**నంచి బజారు :**

ఎవరెస్టు శిఖరావలోకనానికి ఒక మంచి పాయింటు.

**ముక్తినాథ ఆలయం :**

ఇది సాలగామక్షేత్రం. శక్తిపీఠం అనికూడా ప్రతీతి. ఇక్కడ సత్రాలు వగయిరాలున్నాయి. మహా పవిత్రమైన గండకి నదీ తీరం.

గండకి నదీమతల్లిని గురించి విశేషంగా చెప్పుకొంటారు. గండకి వేశ్య అయినా మహాపతివ్రత. ఈమె పాతివ్రత్యాన్ని శ్రీ మహావిష్ణువే పరీక్షించి ఆమెకు

మోక్షం ప్రసాదించి నదీరూపంలో ప్రవహించమని ఆదేశించి అనుగ్రహించాడని - తాను సాలగ్రామ రూపంలో నదిలో వసించి భక్తులను పాపవిముక్తులను చేయుదునని అనుగ్రహించినట్లు పురాణగాధ. ఇక్కడి విష్ణు, కృష్ణ, నారసింహ, హయగ్రీవాది విష్ణు సాలగ్రామాలు తెచ్చికొని భక్తులు భక్తిమీర ఆరాధనలు, అర్చనలు చేసికొంటుంటారు. ఈ సాలగ్రామ నది పుట్టుక దామోదర కుండము. ఇక్కడికి చేరుకోటం చాల కష్టతరమైనపని.

సాలగ్రామాలు దొరికే ప్రదేశాలు :

కృష్ణ గండకి - నుండి ముక్తినాధం వెళ్ళుమార్గం. ముక్తినాధం నుండి ఒక రోజు నడకలో చేరగలిగే నృసింగుకోలా, నరసింగునది - విశేషంగా సాలగ్రామాలు దొరికే ప్రదేశం. ఏ పదార్థాలు దొరకవు. 4 గురు లేక 5 గురు జట్టుగా కలిసి వెళ్ళవలసిందిగా మనవి. తెలిసిన వారిని వెంట తీసికొని వెళ్ళటం ఎంతో సముచితం.

# గోరక్ పూరు

బుటోలు బజారు సుమారు 20 కి. మీ. దూరంలోపు. నడకమార్గం. రీడీ క్షేత్రం. కృష్ణ, రీడీ నదుల సంగమస్థానం. మనకు కాశీ ఎంత పవిత్రమైన యాత్రా కేంద్రమో నేపాళీయులకు ఈ క్షేత్రమంత పవిత్రమైనది. రీడీ నుండి కృష్ణ గండకి తీరంలో వెళ్తే ముక్తినాధం చేరవచ్చును. ఈ ప్రదేశానికి వెళ్ళేప్పుడు కుసుమాగాష, బాగ్లుంగ్, బుద్రవేణి, రాణీపిల్వా, దానా భంసార్, తుకుంసె బన్సార్, కాగబ్ని మజలీలుగా చేసికొని వెళ్తూ ముక్తినాధంను చేరవచ్చు.

పర్వతారోహణకు :

ఎవరెస్టు శిఖరం, కాంచనగంగ శిఖరాల నధిరోహించ దలచిన పర్వతారోహకులకు నేపాల్ ఒక చక్కని అవకాశం. ఎనిమిది వారాలవరకు ట్రెక్కింగ్ చేయవచ్చును గాని 5 రోజులనుండి 15 రోజాలవరకు మాత్రం తగిందిగా చెప్పవచ్చు. మామూలుగా ట్రెకింగ్ సెప్టెంబరు నుండి మే వరకు చేయవచ్చు. అయితే చలికాలమయిన డిశంబరు నుండి ఫిబ్రవరి వరకు మాత్రం భయంకరమైన చలి. తట్టుకోలేరు ఎంతటి వారయినా.

**సూచించబడిన ట్రెక్కింగ్ మార్గాలు :**

1) ఖాట్మండు నుండి నమ్‌చేబజారు - 250 కి. మీ. 15 రోజుల వ్యవధి.
2) పోఖ్రా నుండి అన్నపూర్ణ - 40 కి.మీ. 3 రోజులు వ్యవధి.
3) పోఖ్రా నుండి జోమ్‌సన్ - 110 కి.మీ, 6 రోజులు.
4) ఖాట్మండు నుండి గోసయికుండ - 70 కి.మీ. 4 రోజులు.
5) దుంబ్రె (మనాంగ్ వరకు బస్సు) - 110 కి.మీ. 8 రోజులు.

ట్రెక్కింగు చేయగోరేవారు, సెంట్రల్ ఎమిగ్రేషన్ డిపార్టుమెంటు, ఖాట్మండు వారి దగ్గరినుండి పర్మిషన్ తీసుకోవాలి.'TREKKING IN NEPAL' పుస్తకం ఉచితంగా ఇవ్వబడుతుంది— టూరిస్టు డిపార్టుమెంటు వారిని అడగండి. ఇస్తారు. మరింత సమాచారం ట్రెక్కింగ్ మార్గాలు మరిన్ని తెలుసుకోవచ్చు.

**నేపాల్‌లో వుండటానికి వసతి సౌకర్యాలు :**

గవర్నమెంటు రికగ్నైజ్‌డు హోటళ్ళన్నీ ఖాట్మండు లోయలోనే ఉన్నాయి.

**ఖాట్మండులోని హోటళ్ళు :**

అన్నపూర్ణ, ఫోన్ : 11711, సోల్టీ ఓబెరాయ్, ఫోన్ : 11211, యేటి- మొదలైనవి 5 నక్షత్రాల హోటలు కోవలో ఉన్నవి.

**మిగతావి 4 నుండి 2 నక్షత్రాలు సరళిలో :**

శంకర్, బ్లూస్టార్, క్రిస్టల్, నారంగణి, యెల్లోపగోడా, షాంగ్రీలా, మకోలూ మొదలయినవి.

**ఇంకా తక్కువలో :**

ఖాట్మండు రెస్ట్‌హౌస్, హిమాలయా వ్యూ, కాంప్, సెంట్రల్, న్యూ లాలి గురాస్, పరాస్ సిద్దార్థ స్టార్, కోహినూర్, బ్లూ డైమండ్ వగయిరాలు.

**నగర శివార్లలో, నేపాల్ నేషనల్‌లో పార్కులో :**

ఎలిఫెంట్ కాంప్ హోటలు, గయిడ్ వైల్డ్ లైఫ్ క్యాంపు, టైగర్ టాప్స్.

**డామన్‌లో :**

వ్యూ టవర్, ఎవరెస్టు లాడ్జి.

**ఖాట్మండుకి 80 కి.మీ. వాయువ్యంగా :**

ది రిసార్ట్ హోటల్ కాకమి.

ఖాట్మాండుకి 30 కి.మీ. తూర్పుదిశగా :

ది మౌంటు ఎవరెస్టు లాడ్జి, నగర్‌కోట.

మౌంట్ ఎవరెస్టు దగ్గరిలోని ఖూమ్‌జింగ్ :

ది ఎవరెస్టు వ్యూ హోటల్ - బ్రహ్మాండమైన ఆధునిక వసతులతో ఎత్తులో వున్న విశ్రాంతి కేంద్రాలకు కావలసిన అన్ని హంగులతో ఉన్నది.

పోఖార :

న్యూక్రిస్టల్, ఫోన్ : 35
పీడిబెయిల్ లాడ్జి, ఖాట్మాండు, ఫోన్ : 11711

అన్నపూర్ణ శిఖరం :

న్యూస్నోవ్యూ, ఘంజార, రూపి, గారగాపస్, ఫేవా.

జనక్‌పూర్ :

హాలిడే, ఫోన్ : 106.

బీర్‌గంజ్ :

సంఘూం, దియాలా.

భైరవ :

లుంబిని, పశుపతి.

పటాన్ :

యూత్ హాస్టల్ మహేంద్రయువాలయ. ఫోన్ : 21003

# బిహార్

ప్రాచీన భారత యశశ్చంద్రికలు దిగ్దిగంతాల నెల్లెడల వ్యాపింపజేసిన మగధ సామ్రాజ్యంగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయిన భూభాగం. మగధను గురించి వేదాల్లో ప్రసక్తి, ప్రశస్తి వుంది. పురాణాల్లో కూడా ప్రసిద్ధం. మగధదేశం ఏలిక అయిన శ్రీ చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలం క్రీ. పూ. నాలుగవ శతాబ్దం కాలానికే ఒక మహత్తరమైన విశాల సామ్రాజ్య యశోశేముషీ వైభవాలకు ఆలవాలంగా నిలిచిన ప్రదేశం. ఇప్పటికీ మన దేశం అన్ని భాషల సాహిత్యంలోనూ చోటు చేసికొన్న విక్రమాదిత్యుని సాహసిక గాథలు ఈ మహారాజునకు సంబంధించినవే నని చెరగని అభిప్రాయం. చరిత్రకారుల వాదం. మహాసామ్రాజ్యాలు పుట్టి, గిట్టినాయి ఈభూమి మీద. వాటి తాలూకు యశశ్చంద్రికా శోభలు మాత్రం నిరంతరం వెలుగు కిరణాల్ని వెదజల్లుతున్నాయన్నది నిర్వివాదం. ఆ ప్రాచీన వైభవాన్ని ప్రశంశిస్తూ పాశ్చాత్య రచయిత H. G. WELLS వ్రాసిన అభిప్రాయం గమనించతగిన అంశంగా చెప్పుకోవచ్చు—'ONE OF THE BRIGHTEST INTERLUDES IN THE TROUBLED HISTORY OF MANKIND' అన్నది ఈయన వ్యాఖ్యానం. చరిత్రలో మౌర్యుల పరిపాలన, గుప్తుల పరిపాలనా కాలాలు స్వర్ణ యుగంగా కీర్తించబడిన అధ్యాయాలు. ఈ పవిత్ర వేదభూమిలోనే సిద్ధార్థుడు జ్ఞాన మార్గాన్వేషియై బుద్ధుడుగా మారి 'ఆశియా జ్యోతి'గా వెలుగొందటానికి కారణమైన బోధివృక్షం గల పవిత్ర బుద్ధ గయ ఇక్కడే ఉన్నది.

అసలు బౌద్ధులకు ముఖ్య విహారంగా ఉంది 'విహార' అనే నామంతో తేజ

రిల్లిన ప్రదేశం. కాల క్రమేణా బీహారుగా రూపాంతరం చెందిందని చరిత్ర పండితులు నొక్కి వక్కాణిస్తున్నారు.

ఆనాటి మగధ సామ్రాజ్యానికి రాజధాని నగరంగా ఉన్న పాటలీ పుత్ర నగరమే ఈనాడు పాట్నాగా బీహారు రాష్ట్రానికి ముఖ్య పట్టణంగా ఉన్నది. అట్టి ఈ రాష్ట్రం దేశం మొత్తంలో వైశాల్యానికి సంబంధించి 9వ స్థానంలో నిలిచినా జనాభా విషయంలో రెండవ స్థానాన్ని ఆక్రమిస్తూ ఉంది.

రాష్ట్రం మొత్తం పాలనాపరంగా 37 జిల్లాలుగా విభజించబడింది.

రాష్ట్ర వైశాల్యం - 1, 73, 877 చ. కి. మీ.

జనాభా - 7 కోట్లు సుమారు చ. కి. మీ. కి 402 మంది జనసమ్మర్దత.

భాష - హిందీ.

అక్షరాస్యత - 26. 20 శాతం.

ముఖ్య జీవనోపాధి - వ్యవసాయం.

రాజకీయంగా - అసెంబ్లీ స్థానాలు - 324.

స్త్రీ పురుష నిష్పత్తి - 946 : 1000.

**జిల్లాలు వివరం :**

పాట్నా, నలందా, నవడా, గయ, ఔరంగాబాదు, రోహ్‌టస్, భోజపూర్, సరన్, సివాన్, గోపాల్‌గంజ్ (పశ్చిమ్) చంపారన్ (తూర్పు), చంపారన్, సితామర్హి, ముజఫర్‌పూర్, వైశాలి, బేగూసరాయ్, సమాస్తిపూర్, మధుబని, దర్భాంగా, సహార్సా, మదేపురా, పూర్ణియా, కటిహార్, మోంఘిర్, ఖగారియా, భాగల్‌పూర్, సంతాల్‌పరగణా, దేవ్‌గర్, గోడ్డా, సాహెబ్‌గంజ్, ధన్‌బాద్, గిరిధి, హజరిబాగ్, పలాము, రాంచి, గుమ్లా, లోహర్‌దాగ, సింగ్‌భం, జహానాబాదు.

**నైసర్గికంగా :**

పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌ల మధ్య ఇమిడిఉన్న రాష్ట్రం. ఉత్తరాన హిమాలయ పర్వత పాదాలవరకు— నేపాల్ సరిహద్దులదాకా సాగి ఉన్నది. పాట్నాకు నేపాల్‌నుండి రోడ్డు సౌకర్యం కూడా వుంది.

భౌగోళికంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. అవి ఉత్తర దక్షిణ విభాగాలు. ఉత్తర విభాగం అంతా సారవంతమైన సమతల ప్రదేశం అయితే దక్షిణ విభాగం అంతా కొండలు, గుట్టలు, అడవులతో నిండి వుంది. రాష్ట్రంలో సరయూ,

గండక్, గంగానదుల ప్రవాహంతో సశ్యశ్యామలంగా పునీతమవుతుంది. దక్షిణ విభాగం చోటా నాగపూర్. సంతాల్ పరగణా మొదలైన జిల్లాల విభాగం దట్టమైన అడవులతో, కొండలతోను వుండి 300 మీ. నుండి 1300 మీ. ఎత్తుగల చిన్నా పెద్ద పర్వతాలు శ్రేణులుగా ఏర్పడి వున్నాయి. ముఖ్యంగా దేశంలోని అటవీ సంపదకి, ఖనిజ సంపదలకి కాణాచి. రాష్ట్రంలో ఇనుము, బొగ్గు భారీ పరిశ్రమల కేంద్రం. దాదాపు దేశమొత్తం మీద లభ్యమయ్యే ఇనుము, బొగ్గు ఖనిజాల్లో 40 శాతం ఇక్కడే లభిస్తూండటం విశేషం. అందువల్లనే జమ్‌షెడ్‌పూర్, బొకారోల్లో భారీ పరిశ్రమలు చోటు చేసుకొన్నాయి. ఇనుము ఉత్పత్తిలో ఈ రెండు చోట్ల గల స్టీలు ఫ్యాక్టరీలే అందుకు నిదర్శనం.

బీహార్ స్టేట్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషనువారి సరికొత్త భారీ పరిశ్రమలు – రాంచి వద్ద ఏర్పాటు అవుతున్న స్పాంజ్ ఐరన్ కర్మాగారం, జామూల్ వద్ద G. I. షీట్సు, భోజపూర్ దగ్గర నైలాన్, లతేహార్ సాల్వెంటు ఎక్స్‌ట్రాక్షన్‌ప్లాంటు, రాంచీలోని వాచ్ ఫ్యాక్టరీ, గయ వద్ద బీహార్ ఫాస్టనర్స్ మరి యింకా యితర చిన్న పెద్ద పరిశ్రమలు అన్నిచోట్లా సుమారు 10, 000 పైగా స్థాపించబడివుండటం రాష్ట్ర అభివృద్ధికి ఇతోధికంగా తోడ్పడేవి.

అటవీ సంపదలు – కలప, బీడీలకు పనికివచ్చే కెందులీఫ్, లక్క, జిగురు వగయిరాలు స్వతసిద్ధంగా దొరికే పదార్థాలు – అభివృద్ధికోసం అనేక పథకాలు అమలులో వున్నాయి. రాష్ట్రం మొత్తం మీద 19 శాతం అటవీ భూభాగంగా అమరి వుంది.

వరి, గోధుమ, మొక్కజొన్న, పప్పుధాన్యాలు, వగైరాలు వ్యవసాయోత్పత్తులు ఆహారపదార్థాలయితే – పొగాకు, జనుము, నూనెగింజలు, చెరకు, బంగాళా దుంపలు వాణిజ్య పంటలు,

ఇన్నివున్నా రాష్ట్రప్రజలు ఎక్కువభాగం పేదరికంలో మగ్గుతూ వుంటున్నారు. నిరంతర పేదరికంతోబాటు హిమాలయ పాదాలనుండి దక్షిణాన ఒరిస్సా అంచులవరకూ విస్తరించిన ఈ ప్రదేశంలో ఎప్పుడూ ప్రకృతి వైపరీత్యాలు గొడ్డలిపెట్టుగా సంభవించటం అతి తరచు.

## సంగ్రహంగా చరిత్ర :

ముందు చెప్పినట్లుగా ప్రాచీన కాలంలో మహోజ్జ్వల వైభవాలు గతస్మృతుల యశోవిక్రమ పరాక్రమాలతో అతి బలవంతులయిన మౌర్యులకు జన్మభూమి. ధర్మ

చక్రవర్తి అశోకుని కాలంలో పాటలీపుత్రం ప్రపంచ మొత్తంలో కీర్తించబడినది. అశోకుని మరణంతో కీర్తిచంద్రికలకు కొన్ని మచ్చుతునకలు అడ్డం వచ్చినా గుప్తుల కాలంలో ఇబ్బడి ముబ్బడిగా ప్రకాశించాయి. ఢిల్లీ సుల్తానుల కాలాల్లోను, మొగల్ చక్రవర్తుల కాలంలోను, బీహారు ప్రతిపత్తి కేవలం ఒక ప్రొవిన్సు పరిమితికి కుదించ బడింది.

కాని మరల షేర్షా హుమాయూన్‌ని ఢిల్లీ నుంచి తరిమికొట్టి సింహాసనాన్ని ఆక్రమించుకుని పూర్వపు పాటలీ పుత్రం స్థానాన్నే నేటి పాట్నా నగరానికి అంకు రార్పణ చేశాడు. మరల ఒక వెలుగు వెలిగింది. షేర్షా చక్రవర్తి తన పరిపాలనలో అనేక సంస్కరణలు చేసి దేశం మొత్తానికి చక్కటి పరిపాలన అందించినవారిలో నొకరు. అక్బరు కాలంలో శాంతిసౌభాగ్యాలకు నిలయమైంది. మొగలు సామ్రాజ్యం పతనం తరువాత బీహారు బెంగాలు నవాబుల చేతుల్లోకి వెళ్ళింది. 1764లో జరిగిన బుక్సర్ యుద్ధంతో బ్రిటిషువారు నవాబుల చేతుల్లోంచి బీహారు ప్రదేశాన్ని లాక్కు న్నారు. మొట్టమొదటగా అప్పటినుండి బీహారు బ్రిటిషువారి కబంధ హస్తాల్లో పడి పోయి, బెంగాల్ రాష్ట్రంలో ఒకభాగంగా కంపెనీ పరిపాలనలో ఇమిడిపోయింది. 1936లో బీహారు, ఒరిస్సాలు ప్రత్యేక రాష్ట్రాలుగా విడగొట్టబడ్డాయి.

ప్రాచీన కాలంలో మహోన్నత్యాన్ని అనుభవించినా ప్రస్తుతం పేదరికం కోరల్లో దారుణ దరిద్రాన్ని అనుభవిస్తున్న ఈ వేదభూమిని (పేదభూమిని) 'గత కాలము మేలు- వచ్చుకాలము కంటెన్, ప్రస్తుతము కంటెన్' అని మనసులో భావిం చినా దేశపురోగతిలో ప్రగతిపథంవైపు మరింతగా పురోగమించాలనే కోరికతో ఈ రాష్ట్రంలోని వివిధ పర్యాటక కేంద్రాల్ని చూద్దాం. విశేషాల్ని అవలోకిద్దాం. ముందుగా రాజధాని నగరం-

## పాట్నా

ప్రాకృత కాలంలో సిరులు యశములుగొన్న పుష్పపురి లేక పాటలీపుత్ర నగ రం మగధ దేశానికి ముఖ్య రాజధాని. ఈ నగరాన్ని తిలకించిన చైనా యాత్రికుడు ఫాహియాన్‌కి ఈ మహానగర సృష్టి కేవలం దేవతల సృష్టి తప్ప వేరొకటిగాదనే భావం వెలిబుచ్చాడు. ఈ పాటలీ పుత్రానికి పూర్వనామాలు పుష్పపురం, కుసుమ

పురం అని రెండు నామాంతరాలున్నా యంటారు. రెండు పేర్లు, అనాదిగాఉన్న పాటలీ అనే నామాలు పుష్పమనే సార్థకనామాన్ని ధృవీకరిస్తున్నాయి. ఈ నగరాన్ని ఉద యన మహారాజు మనుమలైన అజాతశత్రు పావనగంగా తీరమున నిర్మించారని ప్రతీతి.

ఆధునికపరిశోధకుల అభిప్రాయం ప్రకారం పురాతన పాటలీపుత్రం సువిశాల మైన భూభాగం దగ్గరలోఉన్న కుమార్‌హార్ గ్రామానికి ఉత్తరం వైపుగా సుమారు అరమైలు దూరం వరకూ వ్యాపించిఉన్న నగర విశేషంగా పేర్కొనబడింది. చోటి పహార్ నుండి కుమార్‌హార్ వరకు విస్తరించి ఉన్న ప్రదేశంలో ఆనాటి అశోకుని రాజభవనం సుమారు 4 చ. మై. వైశాల్యాన్ని ఆక్రమించి వున్నదని అంటారు 40 అడుగుల ఎత్తునగల ఇటుకల గట్టుమీద తన తమ్ముడైన మహేంద్రునికి అశోక చక్రవర్తి ఆశ్రమ నివాసాన్ని ఏర్పరిచారని ప్రతీతి. అది నిన్న మొన్నటి పాట్నా నవాబుల నివాసంగా ఉన్నది. అశోకునిచే నిర్మించబడిన పవిత్ర స్తూపాలు పంచ పహారివద్ధ నిర్మించబడినాయట.

ఈ ప్రదేశాన్ని ఆక్రమించిన ఆఫ్‌గన్ చక్రవర్తి షెర్షా ఈ నగరానికి పాట్నా అని నామకరణం చేశారు. అదే యిప్పుడు ప్రస్తుత బీహారు రాష్ట్ర రాజధానీ నగరంగా ఉన్నది.

పాట్నా నగరానికి కలకత్తానుండి, ఖాట్మండు, వారణాసి, ఢిల్లీల నుండి విమాన సర్వీసు లున్నాయి. రైలుద్వారా అన్ని ప్రధాన నగరాలను కలిపే మార్గా లనేకం. పాట్నా నగర జనాభా ప్రస్తుతం 10 లక్షలకుపైగా వున్నది.

**వి శే షా లు :**

పవిత్ర గంగానదీ తీరంలో 15 కి.మీ. పొడవునా విస్తరించియున్నదీ నగరం. పశ్చిమ కొసన ముఖ్య రైల్వేస్టేషను, ఎయిర్‌పోర్టు, ఎయిర్‌లైన్ ఆఫీసులు అమరి వున్నాయి. తూర్పు కొసన ప్రాచీన అవశేషాలన్నీ ఉన్నాయి. ఆధునికత సంతరించు కున్న భాగం- ఈ తూర్పు పడమరల మధ్య ఉన్న గాంధీ మైదానం ప్రాంతం.

రైల్వేస్టేషను దగ్గరిలోని ముఖ్యమైన ఫ్రేజర్ రోడ్డు M హక్‌పథ్‌గాను, ఎగ్జిబిషన్ రోడ్డుని బ్రిజ్‌కిషోర్ పథ్‌గాను, గార్డినర్ రోడ్డుని బీర్‌చంద్ పటేల్‌రోడ్డు గాను మార్చబడ్డాయి.

రైల్వేస్టేషనులోని సమాచార కేంద్రం కౌంటరు చాల ఉపయోగకరంగా ఉన్న దంటారు. టూరిస్టు బంగళా దగ్గర గవర్నమెంటు టూరిస్టు ఆఫీసున్నది.

గోల్ ఘర్ :

29 మీటర్ల ఎత్తున అర్ధచంద్రాకారంలో 1786లో జాన్‌గార్‌స్టిన్ ఆనాటి గవర్నరు జనరల్ వారన్‌హెస్టింగ్స్ ప్రోద్భలంతో కట్టించారు. 1770లో బీహారు ఒక దుర్భర కాటకానికి గురయిందట. కరువులని ఎదుర్కొనటానికి చాలినంత ధాన్యపు నిలవలకోసం ధాన్యాగారం కావలసివచ్చింది. అందుకు అనుగుణంగా ఈ గోడౌను లాంటిది కట్టించారట. అయితే దీన్ని అప్పటి నుండి పెద్దగా వాడలేదు. కిందనుండి పైవరకు రెండు చుట్టు మెట్లదారు లున్నాయి. పైకి ఎక్కి నగరమొత్తాన్ని చూడ వచ్చు. పట్టణం ప్రక్కనే ప్రవహిస్తున్న పావన గంగానదిని చూడవచ్చు.

పాట్నా మ్యూజియం :

సోమవారం తప్ప ప్రతిరోజూ ఉదయం 10–30 గం.ల నుండి సా. 4–30 వరకు ప్రదర్శన కొరకు తెరచియుంచ బడుతుంది. ఈ కట్టడము మొగలు – రాజ పుత్ర నిర్మాణ కౌశల్యాల మేళనంతో రూపొందించబడిన అద్భుతమైన కట్టడం. ఈ మ్యూజియంలో మౌర్యులు, గుప్తుల స్వర్ణయుగాలనాటి శిలాశిల్పాలు, ఎర్రమట్టితో చేయబడిన సుందర ప్రతిమలు, నలందా మొదలయిన విశ్వవిద్యాలయాల పురాతన అవశేషాలు, చైనా, టిబెట్టు దేశాలకు చెందిన అనేక చిత్రాలు, పెయింటింగ్‌లు, వర్మానాలు వగయిరాలు విశేషంగా ప్రదర్శించబడుతున్నాయి. ఒక రకంగా చెప్పా లంటే క్రీ.పూ. మౌర్యులు మగధరాజ్య శోభలకి సంబంధించిన జ్ఞాపికలతోపాటు, మధ్య యుగాలనాటి వస్తు సముదాయాలతో మనకు పూర్వచరిత్రను శోభాయమానంగా చూపిస్తుంది. అధ్యయనానికి ఎంతగానో ఉపకరిస్తుంది.

కుమ్రాహార్ గ్రామం :

ఈ గ్రామం దగ్గరే పురాతత్వ పరిశోధకులు జరిపిన త్రవ్వకాలలో క్రీపూ. 3 శతాబ్దం అశోకుని కాలంనాటి పాటలీపుత్ర అవశేషాలు బయటపడ్డాయి. పాటలీపు త్రం క్రీ.పూ. చంద్రగుప్త విక్రమాదిత్యుని రాజధాని నగరం తరువాత అశోకుని తండ్రి యైన బిందుసారుడు కూడా ఇక్కడినుండే రాజ్యపాలన చేశాడు అశోకుడు క్రీ పూ. 274 నుండి 237 వరకు పరిపాలించాడు. ఇక్కడి ముఖ్యాంశాలు– ఆనంద విహార్

అనే పేరుతో విలసిల్లిన బౌద్ధవిహారం- ఆనాటి మౌర్య సామ్రాజ్యం గుర్తులుగా రాజ దర్బారు హాలు ఎత్తైన స్థంభాలతో ఉన్నటువంటి దాన్ని చూడవచ్చు. గ్రీకురాయబారి మెగస్థనీస్ వ్రాతల్లో చంద్రగుప్త మౌర్యుని సభాస్థలిని వీక్షించి వేనోళ్ళ పొగడి శ్లాఘ నీయంగా వ్రాశారు. ఈ రాజు ప్రాచీనవైభవం ఈజిప్టు, బాబిలోనియా, క్రెటాన్ చక్రవర్తుల రాజభవనాలన్నిటినీ తలదన్నే విధంగా శోభాయమానంగా ఉందనిపొందు పరిచారు. ఈ త్రవ్వకాలు జరిగిన ప్రదేశం ఉదయం 9-30 నుండి సా. 5-30 గ.ల వరకు చూడవచ్చు. సోమవారం సెలవు దినం.

హర్ మందిర్ :

పాట్నా పాతపట్నంలో చౌకు ఏరియాలో పవిత్ర శిఖ్కు మందిరం, నగరం నడిబొడ్డున అమరివున్నది. 1660లో శిఖ్కు గురువుల్లో ఆఖరివారు 10 వ వారు అయిన గురుగోవింద సింగ్ జన్మస్థలం. ఈ చలవరాతి దేవళం పంజాబ్ శిఖ్కు మహారాజు అయిన రంజీత్‌సింగ్ 19వ శతాబ్దంలో నిర్మించారు. పైకప్పు డోములాగా వున్న ఈ కట్టడపు క్రింది భాగంలో పవిత్ర సిక్కు మతగ్రంథాలు, సిక్కు మత వైశిష్ట్యాన్ని తెలిపే ఫోటోలు, చిత్రపటాలు, గురుగోవిందసింగ్ ఉపయోగించిన పాద రక్షలు, ఉయ్యాల మొదలైన వస్తువులతో పవిత్రంగా చూసుకుంటుంటారు. శిఖ్కు గురువుల జయంతి ఉత్సవాలు ప్రతి సంవత్సరం డిశంబరు-జనవరి నెలల్లో వైభవంగా జరుపబడతాయి. ఈ పవిత్ర దేవాలయంలోకి ప్రవేశించేవారు పాదరక్షలు లేకుండా రావాలి. తలమీద చిన్న వస్త్రాన్ని కప్పుకుని రావాలి. దేవాలయంలో ప్రవేశించగోరే వారికి ద్వారం వద్దనే ఈ గుడ్డలు యిస్తారు. మనం మరల తిరిగి యివ్వాల్సివుంటుంది. మందిరం బయట ఆకర్షణీయమైన కొయ్యబొమ్మలు అమ్ముతారు.

జలాన్ ఖిల్లా :

హర్‌మందిర్‌కి ఒక కిలోమీటరు దూరంలో ఉన్న అతిపురాతనమైన సమాధి. ముందుగా అనుమతి పొందితే పచ్చలమీద పొదిగిన నగిషీలు, అనేక పురాతన స్థాపికలను, ఆభరణ విశేషాలను చూడవచ్చు.

పద్రి-కి-హావేలి :

1751లో కాపుచిన్ ఫాదర్స్ నిర్మించిన పురాతనమైన చర్చి. ఖుదాబక్ష్ ప్రాచ్య గ్రంథాలయం, మధ్య యుగాల చరిత్రను తెలిపే అనేక అముద్రిత గ్రంథాలు భద్రపరచబడి వున్నాయి. ఆనాడు చేతివ్రాతలు వ్రాసిన పర్షియన్, అరబిక్ గ్రంథాలు

చూడవచ్చు. మనం వాటిని చూడటానికి అనువుగా మంచి లైటింగ్ కూడా ఏర్పరుచబడింది. ఇక్కడ ఒక అంగుళం వెడల్పుగల ఖురాన్ పుస్తకం ఉంది. స్పెయిన్‌లోని మూర్ యూనివర్సిటీ నుండి నాశనం కాకుండా తెచ్చిన పుస్తకాలు కూడా ఉన్నాయి.

**సోనేపూర్ పశువుల సంత :**

గంగానది అవతలి ఒడ్డున సోనేపూర్‌లో ప్రపంచంలోనే చెప్పుకోదగిన పెద్దదైన పశువులసంత జరుగుతుంది. ఈ బ్రహ్మాండమైన సంత అక్టోబరు, నవంబరుల్లో కార్తీకమాసం పర్యంతం జరుగుతుంది. ఇక్కడ ఏనుగులు, లేళ్ళు, ఒంటెలు, గొర్రెలు సైతం అమ్మకానికి పెడతారు. విశేషంగా చూడదగినది.

సైఫాఖాన్ మసీదు :

జహంగీర్ కుమారులు యువరాజు పర్వేజ్ గంగానదీ తీరంలో కట్టించిన బ్రహ్మాండమైన మసీదు. దీన్నే పత్తర్–కి–మసీదు లేక చిమ్నిఘాట్ మసీదు అని అంటారు.

సదాకత్ ఆశ్రమం :

1921 లో నిర్మించబడిన భారతీయ విద్యాపీఠము. స్వతంత్ర భారతదేశం మొట్టమొదటి అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ పదవీ విరమణ తరువాత ఇక్కడేవుండి తమ శేష జీవితాన్ని గడిపారు. ఆయన స్మృతి చిహ్నంగా వారు వుపయోగించిన వస్తు సముదాయాన్ని ప్రదర్శనా యోగ్యంగా ఉంచారు.

పాట్నా బయోలాజికల్ పార్కు :

ఇది జంతుప్రదర్శనశాల— పార్కు రెండూ కలిసి వున్నాయి. సాయం వాహ్యాళికి, పిల్లలు జంతు ప్రదర్శన తిలకించటానికి యోగ్యము.

**ఇంకా ఇక్కడ చూడదగినవి :**

మృత వీరుల స్మారక చిహ్నం, లక్ష్మీనారాయణ మందిరం, పశ్చిమ్ దరోజా ఖిలా హౌస్, షాహి మసీదు మొదలయినవి ఆసక్తికరం.

## పాట్నా పరిసరాల స్థలాలు

మాంఘిర్ :

పురాణ ప్రశస్తిగల పురాతన అంగ రాజ్యానికి ముఖ్యపట్టణం. మధ్య కాలంలో మొగలాయిలు – బ్రిటిషువారి ఆక్రమణలోకి వచ్చేంతవరకూ మీర్‌ఖాసింకు

ప్రదర్శితమవుతూ మరెన్నో శిల్పాల కాలయమైన ప్రదర్శనశాల కూడా వుంది. బర్మా వారికి, జపాను వారికి, జైనులకు వసతి సౌకర్యాలున్న భవనాలున్నాయి. ఇక్కడి నుండి రాజగిర్, గయ, పాట్నాలకు బస్సు సౌకర్యాలున్నాయి. హర్షుడు మొదలయిన ప్రభువులు పోషణకు అనేక గ్రామాలు జాగీరులు యిచ్చారట.

రాజగిర్ :

నలందాకు 19 కి. మీ. దక్షిణంగా ఉన్నది. కొండల నడుమ ఉన్నది. హిందూ, మహమ్మదీయుల, బౌద్ధ, జైన మతస్థులందరికీ యాత్రాస్థలం. పూర్వం దీనికి గిరివ్రజపురం అనే నామం ఉండినట్లూ, మహా భారత కాలంలోని జరాసంధుని ముఖ్య పట్టణంగా పేర్కొనబడింది. రామాయణంలో దీనినే 'వసుమతి'గా చెప్ప బడిందని ప్రతీతి.

మగధ రాజులకు అనేక శతాబ్దాలు రాజధానిగా ఉన్నదట. అందుచేత రాజ ప్రాసాదాలుండటం వలన రాజ గృహమనియు, 'రాజగిర్' అని పేరు వచ్చిం దని చెప్పు కుంటారు. మగధ రాజులు అజాత శత్రు నిర్మించిన పాటలీ పుత్రమునకు వచ్చిన తరువాత కాలక్రమేణా ప్రాధాన్యం తగ్గినది. గడ్డి విపరీతంగా పెరుగుతుం డటంచేత బౌద్ధులు దీనిని 'కుషనగర్'గా గూడా పిలిచేవారుట. దీనికి ఐదు శిఖరాలు ఉన్నాయట- వాటి ప్రస్తుత నామాలు- వైభద్ర, విపుల, రత్న, ఛాతా, శైల, ఉద్య, సోనగా పేర్కొనబడ్డాయి. మహాభారతంలోని జరాసంధుని రాజ్యము వైభద్ర, రత్నాచలాల మధ్య ఉన్నదనియు - సోనా పర్వత ప్రాంతంలో ఓడించిన రాజులను కారాగారంలో ఉంచాడని గుర్తించబడింది. ఈ ప్రాంతం సరస్వతి – బాణ గంగా నదుల మధ్య ఉన్నది.

వైభద్ర పర్వత పాదంలో వేడినీటి ఊటలున్నాయి. విపుల పర్వతం దగ్గర మరిన్ని వేడినీటి ఊటలున్నాయి. ఇక్కడికి ఉష్ణధారల స్నానార్థం హిందువులనేకులు విశేషంగా వస్తుంటారు.

బుద్ధుని కాలంలో బింబిసారుడు రాజగిర్‌ని రాజధానిగా చేసికొని పాలించారట. 96 ద్వారాలున్నాయని చెప్పుకుంటారు.

తథాగతులవారు సప్తపర్ణ గుహలో నిర్వాణాన్ని పొందారని, బౌద్ధులు బుద్ధుని అనంతరం మొట్ట మొదటి సభా నిర్వహణం యిక్కడే జరిగిందిట. అజాత శత్రువు ఇక్కడొక బౌద్ధ స్తూపాన్ని నిర్మించారు.

బుద్ధుడు జీవించి ఉండగా ప్రధాన నగరంగా చేసికొని 12 సంవత్సరాలు ఇక్కడే ఉన్నారట. ఇక్కడ ఒక చిన్న కొండమీద జపానవారి బౌద్ధస్తూపంకూడా వుంది.

జైనులకు కూడా యాత్రాస్థలమే : జైన తీర్థంకరులలో 20వ తీర్థంకరులు ఇక్కడ జన్మించటమేగాక, 24వ తీర్థంకరుల వారు ఇక్కడ జన్మించారుట. కనుక జైనులీకొండలమీద జైనాలయాలు కూడా నిర్మించారు

ఇక్కడొక వేడినీటి యూట దగ్గర మహమ్మదీయ ఫకీరు కొన్నాళ్ళు ఉపవాస దీక్షలో ఉన్నందున మహమ్మదీయులకు కూడా యాత్రాస్థలమయినది. ఇక్కడ ప్రవహించే సరస్వతీ నదినే కొంతదూరం పోయాక వైతరిణి అంటారు. ఆ తరువాత మరికొంత దూరం పోయాక సాలగ్రామ నదియని యంటారట.

రాజగిర్ ఉష్ణకుండం దగ్గరనే టూరిస్టు ఇన్‌ఫర్మేషను ఆఫీసుకూడా ఉంది. మరిన్ని విశేషాలు సేకరించవచ్చు.

**వసతికి :**

టూరిస్టు బంగళాలు నంబరు వకటి, రెండు ఉన్నాయి. రాజ్‌గిరి యూత్ హాస్టలు, బర్మా దేవాలయం లోపలే ఒక చిన్న కాఫీ ఫలహారశాల కూడా ఉంది. వీటికి తోడు, తృప్తీస్ హోటలు, ఆనంద్ హోటలు, హిల్ వ్యూ హోటల్ వగైరాలున్నాయి.

**పావపురి :**

జైన తీర్థంకరులు మహావీరులు నిర్యాణం పొందిన స్థలం. నలందాకు 25 కి.మీ. దూరంలో ఉన్న ప్రదేశం జైనులకు ఒక ముఖ్య యాత్రాకేంద్రం.

# గయ క్షేత్రం

## (పితృగయ)

ఇక్కడి జనాభా సుమారు 2,00,000 గల పట్టణము. గయ జిల్లాకు ముఖ్య పట్టణం. ఫల్గునీ నదీతీరంలో అమరియున్న పట్టణం. నది ఎండిపోయినా అంతర్వాహినిగా ప్రవహిస్తుందట.

గయాక్షేత్రం హిందువులకు, బౌద్ధులకు గొప్ప పవిత్రమైన యాత్రా స్థలం. కొత్తగయలో సత్రాలు, ఆఫీసులు, రైల్వే స్టేషను వగయిరాలున్నాయి. పాత గయలో పురాతన ఆలయాలు వగయిరాలున్నాయి.

గయ అనేపేరు శ్రీ మహావిష్ణువు భక్తుడైన గయాసురుని నుంచి వచ్చింది. గయాసురుని ఋజువర్తనం చూచి దేవతలు ఈర్ష్య చెందారట ఈర్ష్యాళువులైన దేవతలు గయాసురుడు లేవకుండా అతని మీదనే తిష్ట వేయాలని చూచారు. ఈ విషయం తెలిసిన గయాసురుడు దేవతలను ప్రసన్న భావంతో ఉండమని, వారేం కోరితే అది యివ్వగలననీ, వారికోరిక ప్రకారం అక్కడే భూమిలో ఉంటాననీ కానీ, సకల దేవతలు తనని అనుసరించి స్థిర నివాసం చేయాలని కోరాడట. ఆ విధంగా దేవతలందరూ అతని శరీరాన్నే అంటుకుని ఉండే విధంగా వరం యిచ్చారు. ఆ పిదప ఈ క్షేత్రంలో గయాసురుని ఖననం చేశారట. అతని పేరుమీద గయాసురుని త్యాగ నిరతికి, శాంతస్వభావానికి, ఋజువర్తనకుగుర్తుగా యీ నాటికీ అది అతిపవిత్ర స్థలముగా కొనియాడబడుతోంది.

కాశీలో మాదిరిగానే ఇక్కడ గయావర్జనం అనేపేరిట, యాత్రికులు శాక, ఫల వర్జనం చేస్తారు. ఈ కార్యక్రమాన్ని పండాలు మంత్ర యుక్తంగా శాస్త్రోక్త విధిని చేయిస్తారు. గయావర్జనము ముఖ్యంగా విష్ణు పాదాలయం వద్దగాని, అక్షయ వటం దగ్గిరగాని చేస్తారు.

**విష్ణు పాదాలయం :**

పాతగయలో ఫల్గునీ, మాధురస్వేదా నదుల సంగమం దగ్గిర వున్నది. ఈ ఆలయాన్ని 1787 సం॥లో ఇండోర్ మహారాణి అహల్యాబాయి కట్టించారు. 30 మీటర్ల ఎత్తుగల గాలిగోపురంతో సమున్నతంగా తలెత్తి దర్శనమిస్తూంది. హిందువు లకు మాత్రమే ప్రవేశం. అన్య మతస్థులు రావటానికి వీల్లేదు. నదీతీరంలో అనేక స్నాన ఘట్టాలున్నాయి. వర్షాకాలంలో అయితే నీరు నదిలో పుష్కలంగా వుంటుంది. మిగతా రోజుల్లో నీరుండదు. ఈ నది ఒడ్డునే శవదహన కార్యక్రమాలు గూడ నిర్వహిస్తుంటారు. ఆలయంలో 13 అంగుళములు గల విష్ణుపాదం ముద్ర రాతితో చేసినది వెండిపళ్ళెరంలో ఉంచారు. విష్ణువు గజ అనే రాక్షసుని తన కుడిపాదంతో హతమార్చాడట.

సభామందిరం చాల విశాలం. మధ్య ఒక పెద్ద గంట వ్రేలాడుతుంది. తూర్పుగా హనుమాన్ విగ్రహం వుంది.

**గదాధర భగవాన్ ఆలయం :**

గదాధరుడు చతుర్భుజములతో మూర్తీభవించి దర్శనమిస్తాడు. ఇటువంటి మూర్తి మరి యెక్కడా లేదని ప్రతీతి. ఇది గదాధర్‌ఘాట్‌లో ఉన్నది.

సూర్యభగవానుని ఆలయం – 1000 మెట్లెక్కి చిన్న గట్టు మీద అమరి యున్న పెద్ద కోనేరు. ఆ కోనేటికి పడమటి దిక్కున నాలుగు భుజములుగల సూర్యభగవానుడు ఉన్నాడు. ఇక్కడ పిండములు వేయుదురు. ఈ కొండ మీదనుండి గయ పట్టణం మొత్తాన్ని వీక్షించవచ్చు. కృష్ణద్వారక-కృష్ణాలయం, నారదగంజ్ ఘాటుకు దగ్గరలోని త్రిజోగినాధ ఆలయం చూడదగినవి. పాతగయకు ఉత్తరంగా ఉత్తర మానస్ కొలను ఉంది. ఇక్కడ కూడా పిండ ప్రదానములు చేస్తారు. ఇంకా సీతా కుండు, రామగయ, రామశిలా పర్వతం, ఖాగేశ్వరి ఆలయం, సంస్కృత కళాశాల వగైరాలున్నాయి.

**అక్షయ వటము :**

విష్ణుపాద, బ్రహ్మయోని పర్వతాల మధ్య త్రేతాయుగము నుండి ఉన్నదట. వారణాసిలో మొదలయిన శ్రాద్ధవిధులు -గయా శ్రాద్ధములు పూర్తి అయిన తరువాత ఈ వృక్షము క్రింద పితృకర్మలు చేయించి పిండ ప్రదానములు చేయిస్తారు. అప్పటికిగాని పితృదేవతలకు శాశ్వత కైవల్యం సాధ్యంగాదని గాఢమయిన నమ్మిక.

ఇక్కడే మంగళగౌరి అష్టాదశ పీఠాల్లోని 13వ పీఠం ఉంది. ఇంకా బ్రహ్మయోని, మాతృయోని మొదలయినవి గూడ పవిత్రమయినవి.

**వసతి :**

కొత్త గయలో కొన్ని సత్రాలున్నాయి.

వాటికితోడు రైల్వే రిటయిరింగ్ రూములు, ది న్యూ అజాత శత్రు హోటలు, సుజాత రెస్టారెంటు స్టేషను రోడ్డులోనే వున్నాయి. పాల్ రెస్టారెంటు, స్టేషన్ వ్యూ రెస్టారెంటు, శ్రీకైలాష్‌రెస్ట్‌హౌస్ వగయిరాలున్నాయి. ఇక్కడికి అనంతదూరంలోనే.

**బుద్ధగయ :**

ముఖ్యంగా బౌద్ధులకు నాలుగు పవిత్రస్థలాలున్నాయి. 1) బుద్ధభగవానుడు జన్మించిన లుంబిని-నేపాల్‌లో వుంది. 2) సిద్ధార్థుడు తపస్సుచేసి, జ్ఞానాన్ని పొందిన స్థలం బుద్ధగయ. 3) గౌతమబుద్ధుడిగా మారి తన మొట్టమొదటి సందేశాన్ని ప్రజలకు వినిపించిన ప్రదేశం-కాశీ దగ్గరగల సారనాథ్, 4)కుషినగర్–ఆయన నిర్యాణం చెందినది.

ఇక్కడ గల అనాదియైన ఒక రావిచెట్టు క్రింద కూర్చుని బుద్ధుడు తపమాచరించాడట. ఆయనకు జ్ఞానబోధ గలిగింది ఇక్కడే గనుక ఇది బోధివృక్షం అయింది.

ఇక్కడ హిందువులు ఈ మహాబోధివృక్షం క్రింద గూడ పిండములు వేస్తారు. అశోక చక్రవర్తి ఇక్కడివి రెండు మొక్కలు శ్రీలంకకు పంపారట. 6వ శతాబ్దంలో అసలు బోధివృక్షం నిర్జీవమై పడిపోయినపుడు శ్రీలంకనుండి బోధివృక్షం పిలకలు రెండు తెప్పించి నిజవృక్షం వున్న చోట మరల పాతబడినాయి. అయితే ఈ వృక్షంకూడా కాలక్రమేణా 19 శతాబ్దం వరకూ ఉండి చచ్చిపోయింది. అప్పుడు ఈ వృక్షం తాలూకు రెండు మొక్కలను ఒకటి నిజవృక్షం గల స్థలంలో మరొకటి కొంచం అవతలగా నాటబడ్డాయి. ప్రస్తుతం వున్న బోధివృక్షానికి వయస్సు ఒక శతాబ్దం పైబడిందని చెప్పవచ్చు.

బౌద్ధులు ప్రపంచం నలుమూలలనుండి వచ్చి చేరుతుంటారు. ప్రత్యేక అధ్యయనాసక్తులై వచ్చే పాశ్చాత్యులు కూడా ఎంతోమంది ఊరికే చూచిపోవటానికయితే ఒక రోజు చాలు.

ఒక ఎర్రటి రాతి ఫలకం ఉంది. అది బుద్ధుడు కూర్చొని యున్న ఆసనంగా చెప్తారు. దానిని వజ్రాసనం అని కూడా అంటారు.

దగ్గరిలోనే నిరంజనా నది ప్రవహిస్తూ వుంది. బుద్ధుడు ఇక్కడే స్నానం చేశాడు.

**మహాబోధి ఆలయం :**

ఈ ఆలయం పిరమిడ్ ఆకారంలో 50 మీటర్లు ఎత్తున ఒక బ్రహ్మాండమైన కట్టడం. దీనికి అంకురార్పణ అశోక చక్రవర్తి చేశాడు. ఈ దేవాలయాన్ని క్రీ. శ. 635లో హుయాయాన్‌త్సాంగ్ చూచానని తన వ్రాతల్లో వ్రాసికొన్నాడు. దరిమిలా పదకొండవ శతాబ్దంలోను, 1882 శతాబ్దంలోను పునరుద్ధరించబడి ప్రస్తుత స్వరూపం వున్నా సహజంగా 7వ శతాబ్దంలో వున్న స్వరూపం కూడా ఇదేనని చెప్పుకుంటారు. తూర్పువైపున తోరణ ప్రవేశద్వారం గుండా ఆలయ సభా ప్రాంగణంలోకి ప్రవేశించవచ్చు. ఆలయం బౌద్ధ శిల్పశైలికి మచ్చు తునక. ఆలయంలో బుద్ధ విగ్రహం చాలా పెద్దది. బంగారు మలామా చేయబడి వుంది. ఇక్కడి కొన్ని శిలా శిల్పాల ఖండాలు కలకత్తాలోని విక్టోరియా మ్యూజియంలోను, లండనులోని ఆల్బర్ట్ మ్యూజియంలోను ప్రదర్శనలో వున్నాయి.

ఇవే కాకుండా ఇక్కడే వివిధ దేశాలనుంచి తరలించి తెచ్చిన బుద్ధ విగ్రహాలతో బుద్ధ ఆశ్రమాలు కూడా ఉన్నాయి.

టిబెట్టువారి ఆరామంలో ఒక పెద్ద ధర్మచక్రం, జపాను వారి ఆరామంలో ఒక చక్కటి బుద్ధ విగ్రహం ఉంది.

మహాబోధి దగ్గరనే అనిమేష లోచన చైత్యంలో ఒక చోటును ప్రత్యేకంగా పవిత్రంగా చూస్తారు. ఇక్కడ బుద్ధభగవానుడు జ్ఞానోదయం చెందాక ప్రపంచ ప్రజలకు తన జ్ఞానాన్ని ఇవ్వాలా వద్దా అని సందేహాస్పదమైన మనస్సుతో అనిమేషుడై ఆలోచనా మగ్నుడై నిర్ణయం కోసం అటు యిటూ పచార్లు చేశారని ప్రతీతి. జ్ఞానోదయానంతరం ఆ సర్వేశ్వరునికి కృతజ్ఞతా భావంతో అవనతముఖుడై కొంచం సేపు మౌనంగా ఉన్న చోటు కూడా చూడవచ్చు.

ఇక్కడ హిందూమతానికీ బౌద్ధమతానికి విడదీయరాని బంధం ఒకటి వుంది. శ్రీ మహావిష్ణువు దశావతారాల్లోనూ బుద్ధుని అవతారపురుషుడుగా గుర్తించి 9వ అవతారంగా పేర్కొనబడింది. వైందవులకు కూడా గొప్ప యాత్రాస్థలమై యున్నది.

ఇక్కడనే అహల్యాబాయిచే నిర్మించబడిన జగన్నాథ మందిరంకూడావుంది. నిరంజనీ నది వద్ద కూడా పిండ దానము చేస్తుంటారు యాత్రికులు.

కొన్ని అశోకునిచే నిర్మితమైన గుహలు కూడా ఉన్నాయి. అతి ప్రాచీనం.

**జహ్నుముని ఆశ్రమం :**

సుల్తాన్‌గంజ్ స్టేషను సమీపంలో గంగా తీరంలో ఒక శివాలయమున్నది. ఇక్కడినుండి బైజు భక్తుడొకాయన గంగా జలాన్ని తీసికొనిపోయి వైద్యనాథ స్వామిని అభిషేకించేవాడట. అయితే ఇక్కడ అతి ప్రాచీన కాలంలో జహ్నుముని ఆశ్రమం ఉండేదని చెపుతారు.

**సిద్ధేశ్వర ఆలయం :**

గయా స్టేషను నుండి సుమారు 20 కి. మీ. దూరంలో బేలా రైల్వే స్టేషను సమీపంలో తూర్పు దిశన బారాబర్ పర్వతమున్నది. ఎత్తయిన ఈ పర్వత శిఖరం మీద బారా రాజు ఆలయ నిర్మాణం చేశారు. సిద్ధేశ్వర లింగమును రాత్రులందు ఆరాధిస్తారు. అనంత చతుర్ధశి ఉత్సవాలు మహావైభవోపేతంగా జరుగుతాయి. పర్వతం దిగువనే 'నాట్‌ఘర్' అనే పేరుతో ఏడు గుహలున్నాయి. పాతాళగంగ అనే నది ఇక్కడ ప్రవహిస్తూంది. ఇక్కడ ఆశ్చర్యాన్ని కలిగించే గొప్ప బుద్ధ విగ్రహం ఉన్నది. ఒక గుహ మాత్రం అసంపూర్తిగా ఉన్నది. మూడు గుహలు ఒక సముదా

యంగాను, మూడు గుహలు మరో సముదాయముగాను ఉండి వింతయైన మెరుగులతో అద్భుతాశ్చర్యాల కాలవాలమై యున్నాయి.

బుద్ధ గయలో - వసతులు :

అశోక్ ట్రావలర్స్ లాడ్జిలో రూములు రు. 150/- నుండి 175/- రూ వరకూ ఉంటుంది. టూరిస్టు బంగళాలో - పడకల సౌకర్యంతో ఉన్నాయి. అమన్ శశి వంటి హోటళ్ళున్నాయి. ఎక్కువకాలం ఉండాలంటే బౌద్ధ ఆరామం బర్మావారిది విదేశీయులకు అనుకూలంగా వుంటుంది. టిబెట్టు ఆలయం వెనకాల, జపాను వారి ఆశ్రమాలలోను రూములు లభ్యమవుతాయి. శాఖాహార భోజనం కల్పన హోటల్‌లో చౌకగా లభ్యమవుతుంది.

# వైశాలి

క్రీ. పూర్వం 527 సం. లో జైన తీర్థంకరులు మహావీరులు జన్మించిన స్థలం. పాట్నాకి సుమారు 44 కి. మీ. దూరంలో ఉన్న పట్టణం. బుద్ధుని నివాసంలో విశిష్ట మైన ప్రాముఖ్యాన్ని సంతరించుకుని ఉన్నది. పురాతన పట్టణ అవశేషాలు గంగా తీరంలో 'బసర్' అనే ప్రాంతంలో కనుగొనబడ్డాయి.

రామాయణంలో పేర్కొనబడిన వైశాల నామంతో ఉన్న రాజు పేరిట వెలసిన ఈ ప్రాచీన నగరం క్షత్రియ రాజులైన విచ్ఛలీ వంశీయులకు చెందినదని చరిత్ర కారుల అభిప్రాయం.

విచ్ఛవులు ఒకనాడు అతులిత భోగభాగ్యాలతో తులతూగినవారు. వారి వైభోగ ములను దేవతా సదృశంగా భావించబడేది. బుద్ధుడు సైతం వీరి అలంకార ప్రియత్వ మును, శాంతి, ఋజువర్తనాన్ని శ్లాఘించారట. పురాతన కాలంలోనే పట్టణాన్ని భయంకరమైన ప్లేగువ్యాధి ఆవరించినప్పుడు పౌరులు బుద్ధుని పట్టణాన్ని సందర్శించ వలసిందని కోరారుట. తథాగతుని రాకతో ప్లేగు అంతరించి పోయింది. రాజనర్తకి అయిన ఆమ్రపాలి ఉద్యానవన ప్రాంగణములోనే బుద్ధుడు తన సందేశాన్ని ప్రజల కందించారట.

క్రీ.శ. 383 సం.లో రెండవసారిగా బౌద్ధసమావేశం ఈ ప్రాంతంలో జరి గిందట. ఇందుకు చిహ్నంగా రెండు స్థూపాలు నిర్మించబడ్డాయి. అశోక స్తంభము,

పురాతన సరస్సులు, జైన దేవాలయాలు, బౌద్ధ స్తూపాలు, విశాలరాజు ప్రసాదము, మ్యూజియం చూడదగినవి.

## దక్షిణ బీహారు :

### పరాష్‌నాథ్ కొండ :

జైనులకు ఈ స్థలం ఎంతో పవిత్రమైనది. వారికి వివరించ నక్కరలేదు. 24 మంది జైన తీర్థంకరుల్లో 21 మంది ఇక్కడే నిర్యాణం పొందారు.

23వ తీర్థంకరులు పరాష్‌నాధుని పేర ప్రసిద్ధమయినది.

సుమారు 1365 మీటర్లు ఎత్తున్న పర్వతం మీద 24 జైనాలయా లున్నాయి. ఒక్కొక్కటి ఒక్కొక్క తీర్థంకరుని పేర. చక్కని వనాలతో గూడిన పర్వతాగ్రం ఒక బ్రహ్మాండమైన దృశ్యకావ్యంగా గోచరిస్తుంది. కొండ పైదకు మధువన గ్రామం నుండి పైకి దోవవున్నది. కొండమీద ఒక డాక్‌బంగ్లా వుంది.

### హజారిబాగ్ :

బీహార్ హిల్ స్టేషను. గయకు దక్షిణంగా ఉన్న వేసవి మకాము దామోదర్ లోయలో వున్నది. వన్యమృగ సంరక్షణా కేంద్రం ఇక్కడి విశేషం. వసతి టూరిస్టు లాడ్జి, ఫారెస్టు రెస్టు హౌస్ వున్నాయి. సముద్ర మట్టానికి 2000 అడుగుల ఎత్తున వున్నది.

### రాంచీ :

దామోదర్ లోయ చివరన 93 కి.మీ. దూరంలో వున్నది. బీహారులోని మరో మంచి వేసవి కేంద్రం. ప్రదేశం చాల చిన్నది. రాంచి కొండ దిగువన ఒక చిన్న సరస్సు- మానవ నిర్మితం. మానసిక ప్రశాంతతకు చక్కని కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడి నుండి దక్షిణంగా జగన్నాధుని ఆలయం వుంది. ఇది పూరీలోవున్న జగన్నాధుని ఆలయానికి నమూనాఅట. ఇక్కడ కూడా చిన్న సైజు రథయాత్ర జరుగుతుంది. రాంచీకి 43 కి.మీ. దూరంలో హుంద్రూ జలపాతం, మరి కొంచెం దూరంలో జొహ్నా జలపాతం, రవీంద్ర కవీంద్రుని ఆకర్షించిన 'మోరాబది' పర్వతాలు వున్నాయి.

వసతికి :

దోరందాలో హోటల్ యువరాజ్, మోనార్క్ హోటల్, హోటల్ ఆకాశదీప్ పాలెస్ హోటల్ కద్రూలోనిది– మరికొన్ని.

బీహారులో మరికొన్ని యాత్రికాకర్షణలు

మనేర్ :

పాట్నాకు పడమర దిశగా 29 కి.మీ. దూరంలో ఇస్లాముకు ప్రవేశద్వారంగా భావించవచ్చు. ఈ పేరుకూడా ఇక్కడ నివసించిన సూఫీఫకీర్ పీర్‌హజరత్ మఖదున్ యాహ్యామానేం నుంచి వచ్చింది. ఈయన సమాధి 'బారీదర్గా'గాను, ఆయన శిష్యులైన 'దౌలత్' వారి సమాధి 'ఛోటీ' దర్గాగాను ప్రసిద్ధి. ఈ గోరీలమీద చేసిన చెక్కడపు పనులు, నగిషీలు మహాద్భుతం.

బీహార్ షరీఫ్ :

13–16 శతాబ్దాల్లో మహమ్మదీయుల సంస్కృతి ఒకగొప్ప మెరుపు మెరిసిన ప్రదేశం. పీర్‌మఖ్దుమ్‌షా షరీఫుద్దీన్ సమాధి వుంది. ఈయన సమాధి కారణంగానే ముస్లిములకు పవిత్ర యాత్రా స్థలమైంది. 13వ శతాబ్దపు మహనీయమైన మాలిక్ ఇబ్రహీమ్ బాయావారి సమాధి ఒక గొప్ప కళాకేంద్రంగా చెప్పుకోవచ్చు.

ససరామ్ :

ఢిల్లీ నుండి కలకత్తా మెయిన్‌లైనులో వున్నది. మనదేశ చరిత్రలో ఒక ముఖ్య స్థానాన్ని పొందిన గొప్ప సంస్కరణావాది, ఆఫ్గన్ చక్రవర్తి, పరిపాలనా దక్షులు అయిన షెర్‌షా సమాధిగల గొప్ప కట్టడం చూడవచ్చు. ఆయన చేసిన భూ సంస్కరణలు, భూమి శిస్తు అమలును పటిష్ఠంగా అమలుపరిచి ప్రజోపయోగమైన పాలనాపరంగా అనేక సంస్కరణలు ప్రవేశపెట్టి చరిత్రలో స్థిరమైన చోటు సంపాదించుకొన్న మనుడు. ఈ చక్రవర్తి తాను బ్రతికి వుండగానే తన గోరీ ఎక్కడ ఎలా కట్టాలి అనేది ప్లాను చేసికొని మొదలు పెట్టించి చాలవరకు పూర్తి చేయించాడట కాని తుదిమెరుగులు మాత్రం వదలివేశాడు.

ఈ కట్టడం ముందు ఒక పెద్ద సరస్సు నేర్పరిచి దూరాన కొండలు చుట్టూ ఆవరించిన నేపథ్యంలో కట్టడపు చిత్తరపు నీటిలో స్పష్టంగా కనబడేట్లు దృశ్యమానంగా రచించబడిన ఒక కళాఖండంగా చెప్పుకోవచ్చు.

బీహారు ఒక పెద్ద పారిశ్రామిక కేంద్రం. సహజ వనరులు పుష్కలంగా గలిగిన ప్రదేశం. ఖనిజ సంపద దండిగా లభ్యమవటం— భారీ పరిశ్రమలు వర్ధిల్లటానికి ఎంతో అనువుగా వుంది.

**జమ్‌షెడ్‌పూర్ :**

సర్‌జమ్‌షెడ్జి తాతా 1907లో నిర్మింపజేసిన స్టీల్‌సిటీ- టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ ఈ నగరంలో తలమానికంగా ఉంది. రాష్ట్రం మొత్తముమీద దిమ్నా సరస్సు అందాల ప్రోవు.

దామోదర్ వేలీ ప్రాజెక్టు యాత్రికుల ముఖ్య ఆకర్షణ. ఈ బహుళార్థ సాధకమైన ప్రాజెక్టు వ్యవసాయ అవసరాలేగాక, విద్యుచ్ఛక్తి జనకం, మరెన్నో రాష్ట్ర నీటి అవసరాలను తీరుస్తూ రాష్ట్రాన్ని వరదల బారినుంచి కాపాడుతూ సుభిక్షం చేస్తుంది. ఈ ప్రాజెక్టు మూలంగా ఇనుము, బొగ్గు, అభ్రకం పరిశ్రమలు ఇతోధికంగా అభివృద్ధి చెందుతూ రాష్ట్రాన్ని పారిశ్రామికంగా ఉన్నతం చేస్తుంది. ఈ ప్రదేశం మొత్తం ఒకసారి చుట్టిరావాలంటే కోదర్మ రైల్వేస్టేషను నుండి మొదలుపెట్టటం ఎంతయినా సముచితం. పచ్చటి అటవీ ప్రాంతంలో 19 కి.మీ. ప్రయాణం ఒక మధురానుభూతిని మిగులుస్తూ రెండు పచ్చటి కొండలమధ్య అమరియున్న తలైయా డామ్ రిజర్వాయర్ దగ్గరకు తీసకొని వస్తుంది. ఇక్కడి సర్క్యూట్‌హౌస్ ఎంతో ప్రశాంతతని చేకూరుస్తుంది.

2000 అడుగుల ఎత్తున ఉన్న హజారీబాగ్ వేసవి కేంద్రం. పట్టణానికి కొద్ది దూరంలో ఉన్న నేషనల్ పార్కు చూడదగింది, ఇక్కడి వివిధ రకాలైన పుష్పజాతులు ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి.

హజారీబాగ్ నుండి 56 కి.మీ. దూరం వెళితే పుష్పవనాలు పొదరిండ్లు ఆవరించబడిన కోనార్‌డామ్ రిజర్వాయర్‌ని చూడవచ్చు. ఇక్కడినుండి వెడల్పైన రోడ్డు కోనార్ నదీతీరం మీదుగా బొకారో థర్మల్ స్టేషన్ చూడవచ్చు. ఇక్కడ కూడా ఒక స్టీల్‌సిటీ వుంది. దృశ్యం నయన మనోహరంగా ఉంటుంది. బొకారో నుండి దామోదర్‌వేలీ ప్రాజెక్టుతాలూకు 104 చ.కి. మీటర్లు ఆవరించియున్న ఒక పెద్ద నీటి రిజర్వాయరును చూడవచ్చు. ఇది ఆసియాలోకెల్ల పెద్దదిగా పేర్కొనబడింది. ఈ ప్రదేశాన్ని ఇక్కడి అమరియున్న దేవాలయపు అధిదేవత కళ్యాణేశ్వరిమాత పేరుమీద 'మాయిథాన్' అని అంటారు.

ఇక్కడికి 77 కి.మీ. దూరంలో సింద్రీ ఎరువుల కర్మాగారం వుంది. ఇది కూడా ఆసియాలోకెల్ల పెద్దది.

భాగల్పూర్ :

బీహారులోని భాగల్పూరు విశ్వవిద్యాలయం. పట్టణ ప్రక్కనే బరారి గుహలున్నాయి. ఇక్కడనే రాయిని తొలిచి నిర్మించిన దేవాలయం కూడా ఉంది. దక్షిణంగా ఉన్న అడవి ప్రాంతంలో మందార పర్వతం మీద అమరియున్నది. అనతి దూరంలో శివాలయం కూడా ఉంది. శివాలయం మాత్రం నదీగర్భంలో ఒక చిన్న తిన్నె మీద అమరియున్నది. అవతలి ఒడ్డున అందమైన మసీదు.

దేవ్‌గర్‌లోని వైద్యనాథ ధామం, కరామిబాగ్‌లోని తపోవన్, నందన్ త్రికూట పర్వతాలు, అనుకల్ ఠాకూర్ ఆశ్రమం మరికొన్ని ముఖ్యమైన ఆకర్షణా కేంద్రాలు.

హజరీ బాగ్‌నుండి 83 కి. మీ. దూరంలో అంవాల కోనలో రాజరప్ప జలపాతం ఉంది. చాలా మనోహర దృశ్యం. మరో ముఖ్యవిశేషం ఏమిటంటే దక్షాధ్వరధ్వంసం తరువాత శివుని జటాజూట రౌద్రాగ్ని కీల లెగయ సతి దేహాన్ని గిరగిర త్రిప్పేటప్పుడు లోకాలన్నీ తల్లడిల్లిపోతుంటే శ్రీ మహావిష్ణువు చక్ర ప్రయోగా దాటికి ముక్కలైంది సతీదేవి శరీరభాగం. శిరోభాగం యిక్కడపడి- ఛిన్నమస్తక భాగం ఈ పర్వతాగ్రాన నిలచి యుండటం - 51 శక్తి పీఠాల్లో ఒకటిగా పరిగణించబడినదిగా ప్రతివారనూ సందర్శించదగినది.

తోప్‌చంచి సరస్సు, ఘటశీల ఎనదగిన వేసవి విశ్రాంతి కేంద్రాలు.

పాట్నాలో వసతులు :

ధర్మ సత్రాలు, బిర్లా ధర్మశాల, సబ్జిబాగ్, అశోకరాజపథ్ గురుద్వారా - (హర్ మందిర్), ధర్మశాల కదమ్ కువన్, రైల్వేస్టేషను దగ్గరవున్న ధర్మశాల.

రైలు ప్రయాణీకులకు మాత్రం - రైల్వేరిటయిరింగ్ రూమ్సు ముందు వచ్చిన వారికే భోగ్యం.

సర్క్యూట్ హౌస్ :

బీర్‌చంద్ పటేల్‌పథ్, (గార్డినర్ రోడ్డు) - రిజర్వేషనులు : డిస్ట్రిక్ట్ మెజిస్ట్రేటు, పాట్నా లేక అండర్ సెక్రటరి (రాజకీయంగా) లేకపోతే కేర్ టేకర్.

**డాక్ బంగళా :**

మఝరుల్ హక్‌పథ్ (టూరిస్టు సెంటరు దగ్గర) రిజర్వేషనులు: డిస్ట్రిక్టు ఇంజనీర్, పాట్నా.

**ముఖ్య గమనిక :**

సర్క్యూట్ హౌస్, డాక్ బంగ్లా ప్రభుత్వపు అధికార్లకు ప్రథమ ప్రాధాన్యమనేది మరిచిపోరాదు.

**పాట్నాలో పాశ్చాత్య రీతుల్లో హోటళ్ళు :**

1) హోటల్ పాటలీపుత్ర, బీర్‌చంద్ పటేల్‌పథ్, గ్రామ్సు : టూరిజమ్ (TOURISM)

2) హోటల్ రిపబ్లిక్ : ఎగ్జిబిషన్ రోడ్డు. గ్రామ్సు : (LYSWAL)

3) హోటల్ సత్కార్, ఫ్రేజర్‌రోడ్, గ్రామ్సు : (SATKAR)

**ఇతరంగా మరెన్నో హోటళ్ళు :**

**వాటిలో కొన్ని :**

అనేకంగా చాలా హోటళ్ళు చిన్నా పెద్దా మఝరుల్ హక్ పథ్ రోడ్డులోనే వున్నాయి. హోటల్ నటరాజ్, అమర్ హోటల్, శ్రీప్రకాష్ హోటల్, గ్రాండ్ హోటల్, హోటల్ రాజస్థాన్, హోటల్ మేఘదూత్, పార్క్ హోటల్, గేలార్డ్ ది హోటల్, మార్వారి హోటల్ వగైరా వగైరా మీ అభిరుచికి, జేబుకి తగినట్లుగా ఎన్నుకోవచ్చు.

**వీటికి తోడుగా—**

హోటల్ ప్రిన్స్, డాక్ బంగ్లారోడ్డు, హోటల్ నటరాజ్, అశోక్ రాజ్‌పథ్, హోటల్ అప్సర, కదమ్ కువన్, పాలెస్ హోటల్, గాంధి మైదానం, సూరజ్ హోటల్, స్టేషన్ రోడ్డు వగైరాలు.

**పాట్నానుండి వివిధ ప్రదేశాలకు రోడ్డు మార్గాలు :**

| పాట్నానుండి | దూరం | మజిలీలు లేక స్టాపింగులు |
|---|---|---|
| బుద్ధగయ – | 184 కి.మీ. | భక్తియార్‌పూర్–48, నవడా–66, గయ–57, బుద్ధగయ–18. |

| | | |
|---|---|---|
| కలకత్తా – | 608 " | భక్తియార్‌పూర్-48, నవడా-66, బర్హి-85, బగోదర్-51, బారాకర్-108, అసన్‌సోల్-16, దుర్గాపూర్-50, గాల్సి-42, మోర్గా-87, కలకత్తా-55. |
| హజరీబాగ్ – | 236 " | భక్తియార్‌పూర్ - 48, నవడా-66, బర్హి-85, హజరీబాగ్-37. |
| నలందా – | 90 " | భక్తియార్‌పూర్-48, బిహార్-31, నలందా-11. |
| పవపురి – | 90 " | భక్తియార్‌పూర్ - 48, బిహార్-31, పవపురి-11. |
| రాజగిర్ – | 108 " | భక్తియార్‌పూర్-48, బిహార్-31, నలందా-11, రాజగిర్-18. |
| రాంచి – | 328 " | భక్తియార్‌పూర్ - 48, నవడా-66, బర్హి-85, హజరీబాగ్-37, రాంచి-92. |
| వైశాలి – | 261 " | భక్తియార్‌పూర్-48, మోకామే-45, బరౌని-23, ముజఫర్‌పూర్-.07, వైశాలి-38. |
| – | 58 " | మహేంద్రఘాట్ ఫెర్రీ క్రాసింగు ద్వారా పతేజాఘాట్-8, హాజ్‌పూర్-15, వైశాలి-35. |
| వారణాసి – | 270 " | అర్రాహ్-61, బిక్రమ్‌గంజ్ - 48, వారణాసి-64. |



# మధ్యప్రదేశ్



చరిత్రలోని పాతరాతియుగం, కొత్తరాతి యుగాలనాటి అతి ప్రాచీనకాలం నాగరికతా విశేషాలు, చిహ్నాలు ఈ రాష్ట్రంలో చూడవచ్చు. అనేక రకాల ఆదిమ, గిరిజన జాతులు, తెగలు, వెనుకబడిన కులాలవారు ఈ రాష్ట్రంలో ఉన్నంతగా మరే రాష్ట్రంలోను లేరు. పురాతనపు ఆదిమజాతులు అయిన గోండులు, భిల్లులు, పీరా వన్‌లు, కోర్కేనులు, కోలలు మొదలయిన ఆదిమజాతులు దాదాపు 23 జిల్లాల్లో పరుచుకుని ఉన్నారు. కొన్ని జాతుల తెగల వారైతే ఆధునికత, నాగరికత తెలియని జాతులు మారు మూలల్లో ఎన్నో ఇరుక్కొని వున్నాయి. వివిధ రకాలైన ఆచారాలు నమ్మకాలు ప్రత్యేక తరహా సంప్రదాయాలు కట్టుబాట్లు నెలకొని ఉన్న మధ్యప్రదేశ్ రాష్ట్రం పూర్వ చరిత్రకీ, ప్రస్తుతానికీ ఒక వారధి లాంటిదిగా భావించవచ్చు. అనేక కట్టుబాట్లు కూడా చూడవచ్చు.

భౌతికంగా :

పేరుకి తగ్గట్టుగా దేశం మొత్తానికి హృదయ స్థానాన్ని ఆక్రమిస్తూ, చుట్టూతా కుడినుండి ఎడమవైపుకి చూస్తూపోతే, ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ మహారాష్ట్ర, రాజస్థాన్ రాష్ట్రాలు చుట్టి వున్నాయి. దేశం మొత్తాన్ని ఉత్తర దక్షిణ ప్రాంతాలుగా విభజించే వింధ్యాచల శ్రేణి, మరోవంక సాత్పురాపర్వతశ్రేణి రాష్ట్ర మొత్తాన్ని ఉన్నతమైన పీఠభూమిమయం చేస్తుంది. వాతావరణం కూడా పర్వతాల మయమయి ఉన్న ఈ రాష్ట్రంలో విపరీత భేదాలకు నెలవుగా వుంది. అతి తక్కువ

ఎత్తు అనుకుంటే 1600 అ. ఎత్తు సముద్ర మట్టానికి పైన వున్నది. పర్వతాల మధ్య నుండి ఒరుసుకుని ప్రవహించే నదులు ముఖ్యంగా చంబల్, బెత్వా, సింధీ, నర్మదా, తపతి, మహానది, ఇంద్రావతి నదీ నదాల జలాలు రాష్ట్రాన్ని సుజలపూరితం చేస్తున్నాయి. సగటు వర్షపాతం 30నుండి 60 అంగుళాలు. రాష్ట్ర ఉత్తరభాగంలో మాత్రం వాతావరణ వైపరీత్యం జాస్తిగా కనబడుతుంది. ఎత్తుగా ఉన్న పీఠభూమి ప్రాంతం సమోష్ణంగా ఉండి, చల్లని మలయసమీరం హాయి గొలుపుతూంది. దక్షిణం తూర్పు మైదాన ప్రాంతాలు సాధారణంగా వేడి, తేమ మిళితమయిన వాతావరణంగా పేర్కొనబడుతుంది. దాదాపు రాష్ట్రంలో మూడో భాగం ఉష్ణారణ్యాలతో నిండి వుంది.

ఇక్కడి వెనుకబడిన ఆదిమజాతుల, తెగల, గిరిజనుల అభివృద్ధి కోసం విశేష మైన కృషి జరుగుతోంది. వారి జీవన విధానంలో అనేక నూతన మలుపులు త్రిప్పా లనే తపన ప్రణాళికా రచయితల మస్తిష్కంలో నిరంతరం జరిగే మథన. రాష్ట్ర అభివృద్ధి మొత్తం కూడా వీరి అభివృద్ధి మీదనే ఆధారపడి ఉందంటే అతిశయోక్తి కాదు.

రాష్ట్ర వైశాల్యం : 4, 43, 446 చ. కి. మీ.

రాష్ట్ర రాజధాని : భోపాల్.

జనాభా : 5, 50 లక్షలు సుమారు జనసమర్ధత చ. కి. మీటరుకి 118 మంది

మాట్లాడే భాష : అనేకంగా హిందీ

అక్షరాస్యత : 27. 82%

వైశాల్యంరీత్యా రాష్ట్రం దేశం మొత్తంలోను ప్రథమస్థానం ఆక్రమించినా జనాభా విషయంలో 6వ స్థానంలో నిలుస్తుంది.

పాలనాపరంగా ఈ విశాలమైన రాష్ట్రాన్ని 45 జిల్లాలుగా విభజించబడింది.

బాలఘట్, బస్తర్, బెటూల్, భిండ్, భోపాల్, బిలాస్‌పూర్, ఛాత్రపూర్, ఛింద్వార, దామొహ, దాతియా, దేవాస్, ధార్, దుర్గ్, తూర్పునిమార్, గునా, గ్వాలియర్, ఇండోర్, హోషంగాబాదు, జబల్‌పూర్, ఝబువా, మాండ్లా, మంద సేర్, మొరెనా, నర్సింఘపూర్, పన్నా, రాయ్‌గర్, రాయ్‌పూర్, రాయ్‌సేన్, రాజగర్, రాజనందగాం, రత్లామ్, రేవా, సాగర్, సత్నా, సెహోర్, సెయోని

షెహూదాల్, షాజాపూర్, శివపురి, సిద్ధి, సుర్గుజ, టికామ్‌గర్, ఉజ్జయిన్, విదిశా పశ్చిమ నిమార్.

## సంగ్రహంగా చరిత్ర :

అశోకుని కాలం వరకూ వెళ్ళి ఒకసారి చూద్దాం. మౌర్యసామ్రాజ్యం పునాదులు మాల్వాలో చాలా బలంగా ఉన్నాయి మౌర్యులనాటి అశోకచక్రవర్తి నిష్కళంక కీర్తి చంద్రికల శోభతో నిండిన మహారాజు. ఆనాటి అశోక చక్రవర్తిచే నిర్మించబడిన ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సాంచీ స్థూపమే ఇప్పటికీ ఆనాటి చరిత్రకు నిదర్శనంగా భాసిస్తూంది. మౌర్యరాజుల తరువాత శుంగవంశపు రాజులు పాలించారు. శుంగుల తరువాత గుప్తరాజులు. తరువాత హూణ దండయాత్రలతో గుప్త సామ్రాట్టులు పీగిపోయారు. సుమారు వేయి సంవత్సరాల క్రిందట పార్మారులు నైఋతి మధ్యప్రదేశ్ ప్రాంతాలను పరిపాలించారు. వీరిలో కళా, సంస్కృతులను, సాహితీ పోషకుడుగా గణుతికెక్కిన భోజరాజు చిరస్మరణీయుడు. ఆయన పేరు మీదనే భోపాల్ పట్టణం గణుతి కెక్కింది. ఈ మహారాజు పాలనలోనే ఇండోర్, మాండులు కూడా వున్నాయి.

క్రీ. శ. 950-1050 మధ్య ఛాందెల్లాలు అద్భుతశిల్ప సౌందర్యానికి కాణాచియైన ఖజురాహో దేవాలయ సముదాయాన్ని నిర్మించారు. ఇవి రాష్ట్రంలో ఈశాన్యదిశగా ఉంది ప్రపంచం మొత్తం మీద అద్భుత శిల్పసౌందర్యరాశిగా ప్రపంచం నలుమూలలనుండి యాత్రికాకర్షణగా భాసిస్తున్నాయి. 12 - 16 శతాబ్దాల మధ్య హిందూ-ముస్లిముల యుద్ధాలకు ముఖ్య కదనరంగంగా వుండి అనేక చేదు అనుభవాలను రుచి చూసింది. చివరికి అలసిపోయిన హైందవులు మొగలాయీలకు పెత్తనం కట్టబెట్టక తప్పలేదు. కాలక్రమేణా మరాఠులు వారిమీద బ్రిటిషువారి ఆధిపత్యంలోకి జారిపోయింది.

1956లో జరిగిన రాష్ట్రపునర్నిర్మాణ చట్టం ప్రకారం మధ్యప్రదేశ్ రాష్ట్ర అవతరణ నవంబరు 1 న జరిగింది. 17 హిందీస్తి జిల్లాలు, మూందటి వింధ్యప్రదేశ్, భోపాల్ రాష్ట్రం, కోట జిల్లాలోని సిరోంజ్ సబ్‌డివిజను మొత్తం కలిపి మధ్యప్రదేశ్‌గా ఏర్పాటు చేయబడింది.

రాష్ట్రం సహజ సంపదల నిలయం. ముఖ్యంగా ఇనుప ఖనిజం, మాంగనీసు

ఖనిజం, బొగ్గు, సున్నపురాయి, తగరం, ఎనలేని సంపదలు. భారీ పరిశ్రమలయిన భిలాయి ఉక్కు కర్మాగారం, భోపాల్‌లోని భారత్ హెవీ ఎలక్ట్రికల్స్, కోర్బాలోని అల్యూమినియం కర్మాగారం, హోషంగాబాదులోని సెక్యూనిట్ పేపరుమిల్లు, దేవాస్‌లోని బ్యాంకునోట్లు ప్రెస్సు, నేపానగర్‌లోని న్యూస్‌ప్రింటుమిల్లు, నీముచలోని ఆల్కాలాయిడ్ ఫ్యాక్టరీ, మరెన్నో సిమెంటు ఫ్యాక్టరీలు, వాహనాల తయారీలు, ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు, గన్‌కారేజి ఫ్యాక్టరీ, 23 బట్టల మిల్లులు, భారీ పరిశ్రమలు. 23 బట్టల మిల్లుల్లో 7 మిల్లులు జాతీయం చేయబడ్డాయి. ఇవికాక వ్యవసాయాధారిత పరిశ్రమలెన్నో వున్నాయి.

యాత్రికులకు ముఖ్య ఆకర్షణాలు :

భోపాల్ :

జనాభా సుమారు 7 లక్షలు. మధ్యప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్య పట్టణం. మహారాజయిన భోజరాజు 11వ శతాబ్దంలో ఒక చెరువును త్రవ్వించారు. పాల్ అంటే చెరువు. భోజ్‌పాల్ అనేపేరు ఆ విధంగా సమకూడిందని తరువాత కాలక్రమేణా భోపాల్ అయిందని అంటున్నారు. పర్వతాలు, సరస్సులతో చూడముచ్చటయినది.

భోపాల్‌కి ఢిల్లీనుండి, బొంబాయినుండి, విమానమార్గం వుంది. బొంబాయి నుండి–ఢిల్లీ, మద్రాసు–ఢిల్లీ ప్రధాన రైలుమార్గంలో ఉండి మంచి సౌకర్యంగా అమరి వుంది. రోడ్డుద్వారా దేశంలోని అనేక చోట్లకు ముఖ్యనగరాలకు కలుపబడి ఉంది.

భోపాల్ పేరు ఇటీవల జరిగిన యూనియన్ కార్బయిడ్ గాస్ లీకింగు ప్రమాదం ప్రపంచం మొత్తం మీద వార్తాపత్రికల హెడ్‌లైన్లలో చోటు చేసికొని తీవ్ర సంచలనానికి గురయిన సంగతి మనకందరికీ తెలిసిందే। ఇది ప్రపంచ మానవ చరిత్రలో మరిచిపోలేని దుర్ఘటన. ఆధునిక విజ్ఞాన ప్రగతిలో ఒక చిన్న తడబాటు జరిగితే ఎంతటి ఘోరవిపత్తుకు గురికావలసి వస్తుందో మానవకోటికంతటికీ కనువిప్పు కలిగే సంఘటన. కలిగేనా కనువిప్పు ? ।

అనాటి సకలకళాపోషకుడు, సాహితీరంగంలో సంస్కృత భాషారసమయ కవివరేణ్యులకు కొంగు బంగారమై ఉజ్జ్వల శోభాయశశ్చంద్రికలతో తారాడిన యశో

భాస్కరుడు, శ్రీ భోజమహారాజు వైభవాలు ఒకప్రక్క రాష్ట్ర చరిత్రలో మరపురాని సువర్ణరేఖా లిఖితంగా అనాటి వైభవాలే జ్ఞాపికలే మనకు యీనాటి దీపికలు.

భోజమహారాజు పాలనానంతరం నగరం ఎన్నో శత్రురాజుల యుద్ధాల తాకిడికి గురయింది. అయితే మరల 14వ శతాబ్దంలో మొగలులు పునరుద్ధరించారు. ఈ నగరాన్ని బహుముఖ కళాకేంద్రంగా విలసిల్లేటట్లు తీర్చిదిద్దారు. దోస్ మొహమ్మద్ ఔరంగజేబు రాజ ప్రతినిధి, భైరాసియా ప్రాంతానికి పాలకుడుగా నియమించబడ్డాడు 1707లో ఔరంగజేబు మరణించాడు. దాంతో స్వతంత్రత ప్రకటించుకుని ఆ వంశం వారే బ్రిటిషువారి అండదండలతో దేశస్వాతంత్ర్యం వరకూ పాలన సాగించారు.

నగరంలో ముఖ్యమయిన దృశ్యం రెండు సరస్సులు. ఒక సరస్సుమీద ఓవర్ బ్రిడ్జి నిర్మించబడి రెండుగా విభజించబడింది. ఎగువభాగం – దిగువ భాగం.

సరస్సు తీరంలో సూర్యాస్తమయ దృశ్యం కడురమణీయం. బోటింగ్ సౌకర్యం కూడా వుంది– నౌకా విహారం చేయవచ్చు.

పార్కులు:– యాత్రికులు తమ శ్రమనంతా మరచిపోయి అందమైన ఉద్యానవనాల్లో గడపటానికి అనువుగా కిలోల్ పార్కు, కమలా పార్కు, అయిష్‌బాగ్, ఫర్‌హటాష్కా బాగ్, నూర్ బాగ్ సుందరోద్యానాలుగా తీర్చిదిద్దబడ్డాయి.

**నవాబ్ పాలెస్ :**

ఈ రాజప్రాసాదపు గోడలు చెరువు లోపలకు చొచ్చుకుని పోయాయి. ఫతేగర్ దక్షిణంవైపు అమరియున్న గోడలు సరస్సుకు మరెంతో అందాన్ని చేకూర్చాయి. చుట్టుప్రక్కల భవనాల నుండి ప్రసరించే దీపాల వింతకాంతులు సరస్సు మీద ప్రసరించి శోభాయమానమైన దృశ్యంగా కనబడుతుంటుంది.

**మసీదులు :**

**తాజ్–ఉల్–మసీదు :**

షాజహాన్ బేగమ్ మొదలుపెట్టిన ఈ మసీదు అసంపూర్తిగా వదలివేయబడింది. ఇది ఇండియాలోగల అతిపెద్ద మసీదుల్లో ఒకటిగా పేర్కొనబడుతుంది. ముఖ్యభవనం మీద మూడు డోములు, రెండు స్థంభాలు పైభాగం డోము ఆకారంలో నిర్మించబడ్డాయి. మసీదు అంతా గులాబి వర్ణంతో మనకు దర్శనమిస్తుంది.

జుమా మసీదు :

1837లో మహారాణి బేగమ్ ఖుదాసియా నిర్మించారు. 1860లో మోతీ మసీదును, ఢిల్లీలోని జుమామసీదు ఫక్కీలో రాణి సికందర్‌జహాన్ బేగము నిర్మించారు. ఈ మసీదులు మొగలుల శిల్పాభిరుచిని తెలియజేస్తుంటాయి.

లక్ష్మీనారాయణ ఆలయం :

ఇటీవలి కాలంలో నూతనంగా అరేరా కొండమీద కట్టించబడిన సుందర దేవాలయం. ఇక్కడి లక్ష్మీనారాయణుల దర్శనమేగాక నగర సౌందర్యాలు దృశ్యమానంగా చూడవచ్చు. ప్రశాంతమైన ప్రదేశం.

ఇంకా యితరమైనవి:– సదార్‌మంజిల్ ప్యాలెస్– ఒకానొకప్పుడు నవాబుల ఆడిటోరియంగా ఉపయోగించిన భవనం. వల్లభ భవనం, స్టేట్ సెక్రటేరియట్ భవనం, టాగూర్ భవనం దగ్గరగల ఆర్కియలాజికల్ మ్యూజియం, సరిక్రొత్తగా నిర్మించబడిన సాంస్కృతిక కేంద్రం భారతీయ విద్యాభవనం చూడదగినవి.

భోపాల్ పరిసర ప్రాంతాలు – దర్శనీయ స్థలాలు

భోజపూర్ :

భోపాల్ నుండి 28 కి.మీ. భోజరాజు కట్టించిన శివాలయం చరిత్ర ప్రసిద్ధి చెందిన సోమనాథ ఆలయంగా కూడా పేర్కొనబడింది. గర్భగుడిలో శివలింగము ఏకశిలా నిర్మితము.

చిక్‌లోడ్ :

45 కి. మీ. దూరంలో వున్నది. ఇక్కడ ఉన్న పెద్ద భవనం నవాబుల విశ్రాంతి మందిరంగా పేర్కొనబడింది. ప్రస్తుతం మంచి వేసవి మకాం. పరిసర ప్రాంతాలు చక్కని పర్వతారణ్యాలతో, సరస్సులతో రమణీయంగా ఉంటుంది. మార్చి నుండి జులై దాకా, అక్టోబరు నుండి నవంబరు వరకు హాయిగొలిపే విధంగా ఉంటుంది. ఇట శ్రీ సమర్థ రామదాసుగారిచేత నిర్మించబడిన మారుతీ ఆలయం చూడదగినది. 25 కి.మీ. దూరంలో ముక్తగిరి ఆలయం కూడా వుంది.

రాయ్‌సేన్ :

మాల్వా ప్రదేశంలో ఒక కీలకమైన కోట చిన్నకొండమీద నిర్మించబడింది. లోపల మూడు భవనాలు, నవద్వారాలు గలిగి 4 సరస్సులు, 40 బావులు వున్న చక్కని దుర్గం. కోటగోడల మీద కొన్ని విలువైన రాతలున్నాయి. నిర్మాణం క్రీ.శ. 1200.

భీంబేత్కా :

ఇటీవలనే అతి ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. వింధ్య పర్వతాల నడుమ దాదాపు 600 గుహాశ్రయాలు పాత రాతియుగపు కాలంనాటివి కనుగొనబడ్డాయి. దీనికి పురాతత్వ శాస్త్ర ప్రాముఖ్యం ఎంతయినా వుంది. చరిత్ర అధ్యయన పరులకు ఎంతో ఆసక్తిని రేకెత్తించే విషయాలెన్నో కనుక్కోవచ్చు.

జిన్నోర్‌ఘుర్ కోట :

ఒక పెద్దకొండమీద నిర్మింపబడింది. సుమారు 60 కి.మీ. దూరంలో అమరి వుంది. ఇక్కడ చిలుకలు విశేషంగా ఉంటాయి.

పిక్నిక్ కేంద్రాలు :

16 కిలోమీటర్లు దూరంలో రాయసేన్ రోడ్డులో వున్న అజ్నాబ్, 10 కి.మీ దూరంలో ఉన్న హతాయ్‌ఖేర, 16 కి మీ. దూరంలోని 'సియోరి', అడవుల్లో సుందరమైన 'సమర్ధ' మంచి విహారయాత్రా కేంద్రాలుగా పేర్కొనబడ్డాయి.

## సాంచి

ఇన్నివేల సంవత్సరాలనుండి విధివైపరీత్యాలకు తట్టుకుని, మానవుల దారుణాలన్నిటినీ మౌనంగా సహిస్తూ, బుద్ధదేవుని పవిత్ర సందేశాన్ని నిరంతరం అందిస్తూ, శైథిల్యావస్థను అధిగమించుతూ నేటికి తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూ మనకందిస్తున్న చారిత్రక జ్ఞాపకాల దీపికలు— ఆనాటి శాంతి శరశ్చంద్రికలను ప్రసరింపజేస్తున్నాయి యిక్కడి బౌద్ధస్తూపాలు— బహురమణీయమైన కళల రాణాచిగా దర్శనమిస్తున్నాయి.

భోపాల్ నగరానికి 68 కి.మీ. దూరంలో మైదానాల్లో నిలిచిన చిన్నకొండ సాంచి. తథాగతుని జీవితానికి సంబంధించిన ప్రాచుర్యం లేకపోయినా బౌద్ధమతాన్ని విశేషంగా ప్రచారం చేసిన అశోకచక్రవర్తికి మాత్రం సంబంధ బాంధవ్యాలనేకం. అశోకుని యౌవన ప్రాదుర్భావంలో ఉజ్జయినిలో ఉండగా ఆయన వివాహం వణిక్ ప్రముఖులు విదిశా రాజ్యపాలకుని కుమార్తె దేవితో వివాహం జరిగింది. సాంచి విదిశా దేశానికి అతి దగ్గరలో ఉన్న ఏకాంత ప్రదేశం ప్రశాంతంగా గోచరించింది అశోకునికి. కళింగ యుద్ధం తరువాత వికలమైన మనస్సుని పదిలపరచుకుని బుద్ధుని సందేశాలపై ఆకర్షితుడై మహా మానవతావాదిగా మారి ఇక్కడ కొంతకాలం తపశ్చర్యనాచరించాడు. బుద్ధుని పవిత్ర జ్ఞాపికలను నిక్షిప్తం చేయాలనే సంకల్పంతో సేకరించి స్థూపాలు నిర్మించాడు. ఆ సదుద్దేశంతోనే మొట్టమొదటి మహా స్థూప నిర్మాణం జరిగింది. బౌద్ధమత వ్యాప్తికి ఒక స్కూలు, ఆశ్రమాన్ని నిర్మించాడు. బౌద్ధ మతప్రచారానికి క్రీ.శ. ?వ శతాబ్దం నుండి 11వ శతాబ్దం వరకూ అధ్యయన కేంద్రంగా నిరాటంకంగా సాగింది. బౌద్ధమతం క్షీణదశకు చేరుకుంది. దానితోపాటు ఈ కేంద్రం కూడా అశ్రద్ధకు గురయింది. అసలు మరిచిపోయారనే చెప్పవచ్చు. తరువాత 1818లో ఈ శిథిలాల ప్రాచుర్యాన్ని బహిర్గతం చేసింది, బ్రిటిష్ సేనాని జనరల్ టేలర్. తరువాత దశాబ్దాల్లో కొంతమంది పరిపక్వతలేని ఔత్సాహిక పరిశోధకులు విచక్షణా రహితంగా చేసిన చేతలవల్లను, కొంత దురాశాపరులైన దుండగలు స్థూపాల్లో ఏదో దాగుందనే భ్రమలతోను చాలా వరకు అన్యాయంగా పాడుచేశారు. అలగ్జాండర్ కన్నింగ్‌హామ్ అనే ఆయన 2, 8 స్థూపాల్లో మాత్రం పవిత్ర చిహ్నాల పేటికలను కనుగొనటం తటస్థించింది.

స్థూపాల పునరుద్ధరణకు వానిని దర్శనీయంగా చేయటంలోను విశేషమైన శ్రద్ధను కనబరిచినవారు సర్ జాన్ మార్షల్.

## ప్రాముఖ్య సంకేతాలు :

ఇక్కడి స్థూపాల్లో బుద్ధుని విగ్రహంగాని, చిత్రరవుగాని కనబడదు. కాని సంకేతాలద్వారా ఆయన్ను మన ముందుకు అవిష్కరించే శిల్పవిశేషాలు అద్భుతంగా మలచబడ్డాయి. పద్మశిల్పం బుద్ధదేవుని జననాన్ని, బోధివృక్షం శిల్పం ఆయనకు కలిగిన జ్ఞానోదయానికి చిహ్నంగాను, ధర్మచక్రం ప్రథమ సందేశాన్ని, స్వేచ్ఛను నిర్వాణంగాను నిర్వచనాలు చెప్తాయి.

3 స్తూపాల్లో మహాస్తూపం 36.5 మీటర్ల వ్యాసంతో 16.4 మీటర్ల ఎత్తు ఉన్నది. రెండవ స్తూపం కొండ అంచున నిలిచి ఉన్నది- రావిచెట్లు చుట్టూ పరివేష్టించి వున్నాయి. మూడవది ఒక గొడుగు ఆకారం పైకప్పుతో చత్రం నీడలో ఉన్నట్లుగా మహాస్తూపానికి దగ్గరలోనే మలచబడింది. ఈ స్తూపంలో బుద్ధదేవుని ప్రముఖ శిష్యవరేణ్యు లయిన సారిపుట్ట, మహామొగ్గల్లనల చిహ్నాలను భద్రపరచ బడినాయట. నాలుగు ద్వారాలమీద జాతకకథలు చెక్కబడ్డాయి. తూర్పు ద్వారంమీద గౌతముడి తండ్రి సదనాన్ని త్యాగం చేయటమూ, తల్లి స్వప్నము మరికొన్ని అద్భుతాలు చిత్రీకరించబడ్డాయి. పడమటి ద్వారంమీద బుద్ధుని ఏడు అవతార విశేషాలు మలచారు.

ఉత్తర దిశన అమరియున్న ద్వారంపైన ధర్మచక్రం వుంది. స్తంభాలమీద అద్భుతాల కథలు చెప్తాయి. ఉత్తరద్వారం గౌతముని జననం నిర్వచించబడింది.

మధ్యలో వున్న ఆర్చిమీద సారనాథ్‌లోగల మృగదావనంలో తన మొట్ట మొదటి ఉపన్యాసం యిస్తున్నట్లుగా చూపించబడింది.

శిధిలాల్లో అశోక స్తూపం, గుప్తదేవళం వగయిరాలున్నాయి. మహా కళశ సేకరణ- వినియోగాలు ఒకే శిలతో చెక్కబడిన శిల్ప విశేషం. పురాతన వస్తు ప్రదర్శన శాల కూడా వుంది.

వసతికి సర్క్యూట్ హౌస్, I.T.D.C.వారి ట్రావలర్స్ లాడ్జి, రెస్టు హౌస్, బుద్ధిస్ట్ గెస్టుహౌస్ లున్నాయి.

**భీల్సా :**

సాంచీ ప్రక్కనగల స్టేషను తూర్పు పడమరలుగా 17 మైళ్ళు, ఉత్తర దక్షిణాలుగా ఆరుమైళ్ళ పర్యంతం వ్యాపించిన ఎన్నో స్తూపాలున్నాయి. సుమారు 65 స్తూపాలు- అన్నికూడా క్రీ.పూ. 3వ శతాబ్దంలో అశోకుని కాలంలో నిర్మించ బడినవే.

## ఉ జ్జ యి ని

పురాతన కాలంలో అవంతిక అని పిలువబడే ఉజ్జయిని విక్రమాదిత్య మహా రాజులు వారు, మహాకవి కాళిదాసులతో గర్వోన్నతిని గలిగించే ఔన్నత్య శోభలతో అలరారిన ప్రదేశం. అతి పవిత్రమైన సప్తనగరాలలో ఒకటిగా పేర్కొనబడింది.

12 సంవత్సరాలకొకసారి జరిగే కుంభమేళా మహోత్సవం ఇక్కడే జరుగుతుంది. ఉజ్జయినికి మహాశక్తి వంతమయిన మౌర్యరాజుల రాజప్రతినిధి అశోకుడు. తరువాత పర్మారు రాజులకు 9–10 శతాబ్దాలలో రాజధానీ నగరంగా శోభిల్లింది. తరువాత ముసల్మాను దాడులకు గురయి వారి వశమైంది. 1750 ప్రాంతాల్లో మరాఠీలు, సింధియాలకు 1800 వరకు వారికీ రాజధానిగా వుంది.

### భర్తృహరి గుహ :

విక్రమాదిత్య సార్వభౌముని వంశానికి చెందిన రాజు భర్తృహరి. ఆయన ప్రాపంచిక సుఖాలమీద రోసి విరాగి అయినాడు. ఆవైరాగ్యమే ఆయన చేత వైరాగ్య శతక మొకటి వ్రాయించింది. ఈ నాటికీ భర్తృహరి సుభాషితాలు సాహితీరంగంలో ప్రసిద్ధం. తెలుగు భాషలో కూడా భర్తృహరి సుభాషితాలపేర నీతి శతకం ఉంది. ఆయన వైరాగ్య భావంతో సన్యసించి ఈ గుహలో నివశించారు. 11వ శతాబ్దంనాటి శివాలయ శిథిలాలను చూడవచ్చు.

### గోపాల మందిరం :

కృష్ణ భగవానుని ముద్దులొలికే విగ్రహం వెండితో చేయబడింది వున్నది. ఆలయ ద్వారాలు దర్వాజాలు వెండితో చేయిబడ్డాయి.

### జంతర్ మంతర్ :

ఇది అతి పురాతనమైన నక్షత్ర వేధశాల. రాజస్థాన్‌కి చెందిన మహారాజా సవాయి జైసింగ్ 2 ఖగోళశాస్త్ర అభిరుచిని అభినివేశాన్ని తెలియ జేస్తూంది కట్టడం. 18వ శతాబ్దంలో ఆయనచే నిర్మించబడింది. అద్భుతమైన తాపీపని పరికరాలున్నాయి. అవి యీ నాటికీ వినియోగ స్థితిలో వుండటం గొప్ప విశేషం.

### కలియాదే ప్యాలెస్ :

క్షిప్రానది చుట్టూ ఆవరించియున్న స్థలఖండికమీద నిర్మించబడిన భవన రాజము ఈప్రాసాదంలో బ్రహ్మాండమైన మంటపాలున్నాయి క్షిప్రానదిఘట్టాలలో కుంభమేళా జరిగేటప్పుడు యాత్రికులు ఇక్కడకి వచ్చి, స్నాన పానాదులు చేసి అగరు ధూపములతో నదీమ తల్లికి పండ్లు, పుష్పములు, కొబ్బరి కాయలు సమర్పించు కుంటారు శక్తిమీర.

మహాకాల్ టెంపుల్ :

ఓ నాటి పురాతన శివాలయం—మధ్య యుగాల్లో అంటే 13 వ శతాబ్దం ప్రాంతాల్లో ధ్వంసం చేయబడింది. మళ్ళీ 17వ శతాబ్దంలో కట్టించబడిన అతి పురాతన దేవాలయం.

ఇక్కడే శ్రీకృష్ణ భగవానుడు, ఆయన అన్న బలరాముడు, మిత్రుడు సుదాముడు సాందీప మహర్షి వద్ద గురుకుల విద్యాభ్యాసం చేశారట. ఆ సంప్రదాయాన్ని ఇక్కడ గల ఒక దేవాలయం గురుకుల ఆశ్రమంగా నడపబడుతోంది.

# ఇ న్ డో ర్

మధ్యప్రదేశ్ మొత్తంలో పెద్దనగరం. జనాభా సుమారు 8 లక్షలు పైమాటే. సరస్సులు, ఖాన్ నదుల తీరాన అమరియున్న ప్రదేశం మహారాష్ట్ర పాలకులనుండి మల్హార్‌రావు హోల్కారు బహుమతిగా గ్రహించింది.

ఈనాడు ఒక గొప్ప వ్యాపార కేంద్రంగా గుర్తించబడింది. మల్హార్‌రావు గారి కుమారులు ఖండేరావు. అహల్యాబాయి ఆయన దేవేరి. కాని అనతికాలంలోనే భర్తృవిహీన అయింది. అయినా మొక్కవోని ధైర్యంతో పరిపాలించి రాణీ అహల్యాబాయి అసమాన ప్రజ్ఞాధురంధరు రాలుగాను, అద్వితీయమైన పాలనా చాతుర్యం గల మేధావిగాను చిరస్థాయిగా నిలిచిపోయింది. నగరంలో ఆమె స్మరణం, స్మృతి ఎల్లెడలా ద్యోతక మవుతుంది.

ఇక్కడ చూడదగినవి: పురాతన రాజప్రాసాదము. ఇందులో ప్రస్తుతం గవర్నమెంటు ఆఫీసులున్నాయి. ముఖ్యంగా డాలీ కాలేజి భవనాలు-మహారాజుల సంతానం మాత్రం చదువుల కుపయోగించటానికి ఉద్దేశించ బడ్డాయి — కనుక కేవలం ఒక స్కూలు, లేక కాలేజిలాగ కాక అద్భుత భవనాలుగా గోచరిస్తాయి. నిజంగా చూడదగిన భవనాలు.

కాంచ మందిరం :

జైన దేవాలయం. మనిషి పాపంచేసి చనిపోయిన తరువాత నరకంలో ప్రవేశించి పడే బాధల గాధలు చిత్రాలుగా వ్రాసివున్న అద్దాల మందిరం. ఒకసారియైనా చూడదగినదే. ముగ్గురు జైన తీర్థంకరుల కంచు విగ్రహాలున్నాయి.

మ్యూజియం :

G.P.O. దగ్గరలోనే కార్ పార్కింగు వసతితో ఉన్నది. భారత స్వాతంత్ర్య పోరాటంలో మొదటి ఘట్టమయిన 1850 శిపాయిల తిరుగుబాటులో ఇదికూడా ఒక యుద్ధవేదిక. మాల్వా ప్రదేశంలో త్రవ్వకాలలో దొరికిన నాణాలు, శిల్ప ఖండాలు, చూడదగిన విశేషాలు — ముఖ్యంగా మంద సౌరులో దొరికినవి సుమారు. 700 పైగా ఉన్నాయి. మధ్య ప్రదేశ్ మొత్తం మీద లభ్యమయిన పురాతన వస్తుసముదాయంలో అధికభాగం ఇక్కడనే వున్నాయి. ప్రవేశం ఉచితం. సోమవారాలు మాత్రం సెలవు దినం.

ఛత్రిబాగ్ :

నదీతీరంలో ఉన్న ఒక పెద్దతోట. ఈ తోటలో ఇండోర్‌ని పాలించిన హోల్కార్ వంశీయుల స్మారక చిహ్నాలు, మందిరాలు ఉన్నాయి. వంశ మూలపుల పురుషుని స్మారక మందిరం విశేషంగా అలంకరించబడి వుంది. రాణి అహల్యా బాయి సమాధి కూడా ఇక్కడే వుంది.

గీతాభవన్ :

దక్షిణాది శిల్పరీతుల్లో నిర్మించబడిన అన్నపూర్ణ ఆలయంతోపాటు మరికొన్ని ఆలయాలు చూడముచ్చటగా సాక్షాత్కరిస్తాయి.

ఇండోరు ఉజ్జయినికి 58 కి. మీ. దూరంలో ఉన్నది. అయితే పెద్ద నగరం కావడంతో బొంబాయి నుండి విమాన మార్గం, ఇతర అన్ని ముఖ్యకేంద్రాలు బస్సులు, రైలు మార్గాలుతో కలుపబడి ఉన్నాయి.

## మాండు

ఇండోర్ నుండి 96 కి. మీ. దూరం. ప్రబంధేతిహాసప్రదమైన ప్రకృతి సహజ సౌందర్యాలరాశి, అనేకమంది తమ రాజ ప్రాసాదాలు, భవనాలు, దేవాలయాలు, విశేషించి నిర్మించు కోటానికి దోహదపడిన సుందర మనోహర ప్రకృతిగల ప్రదేశంగా కొనియాడ బడింది.

వింధ్యాచల లోయల్లో 2000 అడుగుల ఎత్తున ఒదిగియున్న సుందరమైన పట్టణం మాండు. 11వ శతాబ్దంలో పర్మార్ రాజుల పాలనలో మాల్వారాజ్యానికి రాజధానిగా శోభిల్లింది.

14-16వ శతాబ్దాల కాలంలో ఖిల్జీలు, లోడీలు, ఘోరీల ఆక్రమణలో వుంది. ఈ మహమ్మదీయ రాజుల్లో చాలామంది నిర్మాణోత్సాహులు. ఈ నాటికి ఈ ప్రదేశం రాణి రూపమతి-బాజ్ బహదూర్‌ల ప్రణయేతిహాసం అడుగడుగునా స్పందింప జేస్తుంది. ఇది ఒక అమర ప్రేమకథ. అనేక ప్రేమకథల మాదిరిగానే విషాదాంతం.

హోషంగ్ షా సమాధి :

షాజహాన్ తాజ్ మహలు నిర్మాణం చేసేటప్పుడు సుందరమైన ఈ కట్టడం చూచి రమ్మని శిల్పులను కొందరిని పంపించారట. శవ పేటిక ఒక ప్రత్యేక తరహాలో నిర్మించబడింది. ప్రతి మూలలోను డోము ఆకారంలో నిర్మించబడిన ఈ కట్టడాన్ని చూచి తాజ్‌మహల్ నిర్మాణ శిల్పులు స్ఫూర్తిని పొందారని చెప్పుకుంటారు చూడదగినది. 1435 లో నిర్మించబడిన చలవరాతి భవనం.

జహాజ్ మహల్ :

రెండు సరస్సుల మధ్య నిలిపిన ఒక పాత్రలాగా కన్పడుతుంది. పడవ ఆకారంలో ఉన్న ఈ కట్టడం వెన్నెలలో సరస్సు నీటిలో ప్రతి బింబిస్తూ ఒక మనోహరమైన అనుభూతిని కలిస్తూంటుంది. మాండులో ఈ భవనం చాల విశేషంగా చెప్పుకుంటుంటారు. 15 మీటర్ల వెడల్పు, 110 మీటర్ల పొడవుగలిగి నిజంగా ఒక పెద్ద ఓడ ఆకారంలో దర్శనమిస్తుంది. మహమ్మద్ షాఘియా సుద్దీన్ తండ్రి. ఎప్పుడు నిరంతరం యుద్ధాలలో, విశ్రాంతి లేకుండా గడపటం ఘియా సుద్దీన్‌కి నచ్చలేదు. మనసు ఎప్పుడూ విహారాలకోసం అంగలారుస్తుండేది. ఎప్పుడూ అంతఃపుర కాంతలతో వినోదాల్లో మునిగి తేలుతుండేవాడు. ఉత్తరపు చివరలో స్నాన మందిరంలో జలకాలాడే స్త్రీల సోయగాలను పరికించటానికి వీలుగా నిర్మాణం కౌశల్యం ఉండి రాజకుమారుని మానోల్లాసానికి కావలసిన శృంగార దృశ్యాలు కనబడుతుండేయట. ఈ భవనం అంతఃపుర కాంతలకు ప్రత్యేకించబడిందట.

హిందోళ మహల్ :

ఘియాసుద్దీన్ అనందాల ప్రోది అయిన జహాజ్‌మహల్‌కి ఉత్తరాన ఉన్న ఈ మహల్ ఉయ్యాల భవనంగా చెప్పబడింది. వాలుగా నిర్మించబడిన గోడలు అటు యిటూ ఊగుతున్నటువంటి అనుభూతిని కలిగిస్తూంది. ఉత్తరంవైపు ఒక పెద్ద ఏటవాలుగా కట్టబడిన వాలుతలం మహారాజు ఏనుగుమీద ఎక్కి తద్వారా పైకి వెళ్ళటానికి వీలుగా ఉపయోగించేవారట. భవన నిర్మాణంకూడా ఏనుగులు సైతం యధేచ్ఛగా రాకపోకలు సాగించగలిగినంత పటిష్టంగా నిర్మించబడింది.

చంపాబోలి :

మొదటి రెండు రాజభవనాలకు పడమటి దిశన నదియొక్క ఉత్తరపు ఒడ్డున నిర్మించబడిన భవనం ఎంతటి వేసవికాలంలోనయినా బయట ఎండ ఎంత మండిస్తున్నా లోపల మాత్రం చల్లటి మలయసమీరం వీస్తూ సహజమైన ఎయిర్‌కూలింగును కలిగించేలా ఉంటుంది. నిర్మాణ కౌశల్యం మెచ్చుకోతగింది. ఈ భవనానికి తోడు ఈ సముదాయంలో 1405లో నిర్మించబడిన దిలావర్‌కాన్ మసీదు జహాజ్‌మహల్‌కి దక్షిణాన అమరియున్న తవేలి మహల్ వగైరాలను కూడా చూడవచ్చు.

బాజ్ బహదూర్ భవనం :

బాజ్ బహదూరు 16వ శతాబ్దంలో మాల్వాని పరిపాలించాడు. గొప్ప నాయకుడు బ్రహ్మాండమైన కోట్టమూర్దు నాలుగువైపుల విశాలమైన వసారాలు, మధ్యలో ఎత్తుగా కట్టిన చుట్టూ కట్టడం చూపరులను ఆశ్చర్యం గొల్పించే విధంగా ఉన్న అందమైన కట్టడం. కళాభిరుచికి దర్పణం.

రాణీ రూపవతి అంతఃపుర భవనాలు :

మాండుకోట ఎత్తయిన శిఖరం మీద రాణిరూప్‌మతి ప్రశాంతంగా విహరించటానికి విశ్రాంతి గృహాలు – ఒక చక్కటి కోనేరు – ఒక చిన్న కాలువద్వారా అందులోకి నీరు నింపుతూ వుంటుంది. బాజ్ బహదూరు భవనానికి దక్షిణంగా 3 కి మీ. దూరంలో రేవాకుండా అనే సరస్సు రాణీగారు కట్టించిన పవిత్రమైన సరస్సు. అల్లంత దూరాన సాగర్ తలావ, సరస్సు కూడా వుంది. బాజ్ బహదూరు చివరి

స్వతంత్రరాజుగా పేర్కొనబడ్డాడు. ముందు మొగలాయిల చేతికి చిక్కిన తరువాత ప్రాచీన వైభవమంతా ఒక ఛాయామాత్రంగా నిలిచిపోయింది. 1509లో కట్టబడిన బాజ్ బహదూర్ ప్రాసాదం ఆయన రాజరికానికి రాకముందే నిర్మించబడింది. రాజస్థాన్ మొగలు శిల్పరీతులు విచిత్రమేళనంగా నిర్మించబడిన చక్కటి కట్టడం.

**దర్యాఖాన్ సమాధి :**

రేవకుండుకి – గ్రామానికి మధ్యగా, రోడ్డుకు తూర్పుదిశగా రెండు కట్టడాలున్నాయి. హాథీమహల్ పేరుకు తగ్గట్టుగా ఏనుగు పాదాలంత లావుగా బ్రహ్మాండమైన స్థంభాలుమీద డోము ఆకారం నిర్మించబడినది. ఈ స్థంభాల కారణంగానే దాన్ని హాథీమహల్‌గా పేర్కొనబడిందంటారు. అల్లిబిల్లి అల్లికలుగా మొజాయిక్ టైల్సుతో అలంకారప్రాయంగా కట్టించబడిన దర్యాఖాన్ సమాధి చూడవలసిందే।

**నీలకంఠ మహాదేవ ఆలయం :**

ఒక చక్కని శివాలయం. ఇందులో ఒకానొకప్పుడు హాలాహలం మింగిన శివుడు తనలో వున్న లోకాలన్నీ భస్మమైపోతాయనే భయంతో గరళాన్ని లోపలికి పోనీయకుండా గొంతులోనే దాచుకోవటం వలన కలిగిన నలుపుని సూచిస్తూ అక్షరాల నీలకంఠుని విగ్రహం ఉండేదట. తరువాత మహమ్మదీయుల ఆగడాలవలన కొన్నాళ్ళు నీరు నిలవ చేయటానికి మాత్రం ఉపయోగించేవారట. తదుపరి మరల కొన్నాళ్ళకు శివాలయమయింది. జహంగీరు చక్రవర్తికి చాలా యిష్టమయిన స్థలాల్లో ఇదొకటిగా చెప్పుకుంటుంటారు.

**వసతికి :**

అతి చౌకలో ఒక ధర్మశాల వుంది. ఆర్కిలాజికల్ రెస్టుహౌస్, ట్రావలర్ లాడ్జి, టూరిస్టు బంగళా-రిజర్వేషనులు ఇండోర్‌లోని టూరిస్టు ఆఫీసులో చేయించుకోవచ్చు. టూరిస్టులకు కుటీరాలు కూడా లభ్యమవుతాయి.

**ప్రయాణ సౌకర్యం :**

భోపాల్, మహో(MHOW) ఉజ్జయిని, ధర్, ఇండోర్‌నించి మాండుకి నిరంతరం బస్సులు తిరుగుతూనే వుంటాయి. ఇండోర్‌నుండి మాండుకి ప్రతిరోజూ టూర్లు నిర్వహించబడతాయి.

పరిసరాల్లో :

ఓంకారేశ్వర్ :

ప్రసిద్ధి చెందిన ద్వాదశ జ్యోతిర్లింగములలో ఒకటిగా పేర్కొనబడింది. నర్మదానదీ గర్భంలో ఒక చిరులంక మీద ఆసీనయై ఉన్న శివాలయం. మహమ్మదు ఘజనీ దండయాత్రకు గురియైన రెండు శివాలయాల్లో ఇది కూడా ఒకటి. మొదటిది సోమనాథ దేవాలయం - పూర్తిగా ధ్వంసం చేయబడింది. 1024లో ఈ ధ్వంసరచన జరిగిందని చరిత్రకారులు చెప్తున్నారు. ఓంకారేశ్వరుని ఆలయం లంకలో ప్రతిష్ఠితమై యుండగా నదికి దక్షిణ తీరాన మనిలేశ్వరుని ఆలయం వుంది. ఈ శివాలయాలు ప్రకృతి వైపరీత్యాలకు గురయి కొంత మునల్మానుల దండయాత్రల ఆగడాలవల్ల కొంత శైథిల్యానికి గురయ్యాయి. చాలావరకు జీర్ణమైపోయాయి. అయినా ఇప్పటికీ కొన్ని అద్భుతమైన కట్టడాలు ప్రాచీన వైభవానికి తార్కాణాలుగా మనకు దర్శన మిస్తూనే వున్నాయనటంలో సందేహంలేదు. నదీ తీరంలో శివాలయాల సముదాయం మొత్తం ఒకానొకప్పుడు విష్ణ్వాలయాలుగాను, జైనాలయాలుగాను ప్రసిద్ధి చెంది తరువాత శైవాధిక్యతను పొంది శివాలయాలుగా మార్చబడ్డాయని చరిత్రకారుల అభిప్రాయం.

ఇండోర్‌నుండి 80 కి.మీ. దూరంలో ఉన్న ఓంకారేశ్వరంకు తరచుగా టూర్లు నిర్వహించబడుతుంటాయి.

మహేశ్వరాలయం :

నర్మదా నదీ తీరంలో ఇండోర్‌కి 100 కి. మీ. దూరంలో ఉన్న శివాలయం. ప్రసిద్ధిచెందిన హోల్కారు వంశపు రాణీ అహల్యాబాయి స్మారక చిహ్నం కూడా వుంది.

ధార్ :

మాండు, భోపాల్ వ్యవస్థాపకులు, కవి, పండిత పోషకుడుగా గణుతికెక్కిన భోజమహారాజు నిర్మితం. మాండు నిర్మాణం కాక ముందు మాళవదేశానికి రాజధాని నగరంగా విలసిల్లిన కోట. ఇప్పటికీ భద్రంగానే వుం దీ కోట. కోటలో భోజనశాల ఒక పెద్ద రాతి కట్టడం. ఇక్కడ మసీదులో సంస్కృత భాషలో కొన్ని పురాతనపు వ్రాతలున్నాయి. ప్రక్కనే మహమ్మదీయ ఫకీరు కమాల్ మౌలా సమాధి దర్గా అమరి యున్నది.

బాగ్ గుహాలు :

మాండుకి 50 కి. మీ. దూరంలోను, బాగ్ గ్రామానికి 3 కి. మీ దూరంలోన వున్నాయి క్రీ. శ. 400-700 సంవత్సరాలనాటి పురాతనమైన బౌద్ధగుహాలు లోపలకు నీరు ప్రవేశించి పాచి పట్టి మురికి వాసనతో బాధపడి అలగా పాలనా లే: అడవి గాచిన వెన్నెలలా పడి వున్నాయి. చాల దయనీయమైన స్థితిలో ఉన్నది. వీటిలో ప్రముఖంగా పేర్కొనదగినది 4 నెంబరు గుహ రంగమహల్. గుహాంతా రంగులు వేయబడి రంగు రంగుల చిత్రాలున్నాయి. ఈ చిత్రాల నమూనాలు గ్వాలియర్ మ్యూజియంలో ప్రదర్శిస్తున్నారు అజంతా, ఎల్లోరా గుహాలు చూచినట్లయితే ఇవి చూడవలసిన పని లేదు- అయినా ముఖ్య నమూనాలు గ్వాలియర్‌లో చూడవచ్చు గనుక ప్రత్యేకంగా ఇంతదూరం వచ్చి శ్రమపడి చూడనక్కరలేదు.

ఖజురాహో :

ఖజూర్ అంటే ఖర్జూరం అని అర్థం. జేజక భుక్తి అనబడే ఈ బుందేల్ ఖండ్ శౌర్యప్రతాపాలకు ప్రసిద్ధి ఎన్నెన్నో వీరగాధలు జానపదుల సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. ప్రవేశద్వారం వద్దగల రెండు బంగారు ఖర్జూర వృక్షాల వల్ల ఈ వూరికి ఖజురాహో అనేది సార్థక నామధేయమయింది.

క్రీ. శ. 10వ శతాబ్దంనుండి 13వ శతాబ్దం వరకు ఈ ప్రాంతాన్ని అవిచ్ఛిన్నంగా పాలించిన చంద్రవంశపు రాజులుగా పేర్కొనబడే ఛాందెల్ల రాజవంశానికి మూలపురుషుని గురించి ఒక కథ ప్రచారంలో వుంది.

హేమావతి అనే బ్రాహ్మణ కన్య అతిలోక సౌందర్యరాశి. ఈమె రూపలావణ్యాలకు మురిసిన చంద్రభగవానుడు ఇహలోకంలోకి దిగివచ్చి ఆమెని చేపట్టి పరిణయమాడాడు. వారిద్దరికీ గలిగిన కుమారరత్నం గొప్ప శక్తివంతమయిన రాజవంశానికి మూలపురుషుడుగా గల ఉజ్జ్వల భవితవ్యాన్ని వరంగా ప్రసాదించాడట చంద్రభగవానుడు. అదే ఈ చాందెల్ల రాజవంశానికి శ్రీకారం చుట్టిన నాందీగా చెప్పుకుంటారు. న్యాయంగా చూస్తే ఈ ఖజురాహో ఒక మారుమూల ప్రదేశం. వాతావరణం పొడిగా వుండి విపరీతమైన ఉష్ణాధిక్యతతో ధూళి ధూసరితంగా ఉంటుంది. ఎనలేని శౌర్య ప్రతాపాలకు స్వతంత్రేచ్ఛ గలిగిన వారుగా బుందేల్‌ఖండ్ ప్రజలు గుర్తించబడ్డారు.

ఛాందెల్ల రాజులు 10వ శతాబ్దినుండి పాలన సాగించిన మొదటిలోనే సుమారు 100 సంవత్సరాలు ఊపిరిఆడని విశేష వ్యయ ప్రయాసలతో జరిపిన అవిరళ కృషి ఫలితంగా తరాలు మారినా చెదరని, తరగని నిధిగా మనకు అందించిన భారత-ఆర్య శిల్ప కళారీతుల మేలు కలయికగా ఖజురాహో దేవాలయాల సముదాయం మన ముందు కనువిందు చేస్తుంది. ప్రపంచం మొత్తంమీద పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్న గొప్ప శిల్ప కళా కేంద్రంగా అభివర్ణించబడింది.

ఇక్కడి శిల్పవిశేషాల్లో ప్రతి దేవాలయంమీద శృంగార రసప్రబంధాలు సాక్షాత్కరిస్తాయి. శృంగారశాస్త్ర సూత్రకారుడు వాత్స్యాయనుని కామ సూత్రాలకు సజీవ శిల్ప రూపకల్పనా సృష్టి జరిగింది. శిల్ప రచనలో వివిధ పోకడలతో ఆనాటి జీవన విధానం మన కండ్లకు కట్టినట్లుగా సాక్షాత్కరించే కమనీయమైన కళారూపాలు. ఛాందెల్ల రాజులు మనోభావనా వీచికల్లో మెరిసిన తటిల్లతలు శృంగార నాయకలుగా అప్సరసలుగా, నాట్య సుందరీ మణులుగా, మైధున జంటల శృంగార కార్య కలాపాలుగా, దేవతలు, పురాణ పురుషులు, మల్లుల యుద్ధ విన్యాసాలు, సాము గరిడీల ప్రదర్శనలు, ఏనుగుల పోట్లాటలు, గ్రామీణ జీవనంలో పనిపాటలు చేసి కష్టపడే జానపదులు, పరువపు అశ్వాల సమూహములు, మరెన్నో యితర వన్య మృగాలను అక్కడ తీసికొనివచ్చి వివిధ భంగిమల్లో ప్రదర్శితంగా మనకు సాక్షాత్కరిస్తాయి. ఒక్కొక్క దృశ్యము, ప్రతి అంగుళము మనకు నయన మనోహరంగా తోస్తూ శిలల మీద అన్ని సోయగాలు, నగిషీలు, జిలిబిలి చెక్కడాలు ఆశ్చర్యాన్ని, సంభ్రమాన్ని ముక్కున వ్రేలుంచుకొనేట్లు చేస్తాయి. రండి-ఈ దేవాలయాల శిల్ప సోయగాలు చూడవలసిందేగాని చెప్పనలవిగాదు.

అయితే యీ నాటికీ చెక్కుచెదరక మనకు ఎన్నో కధలు చెప్తూ ప్రపంచ ప్రజలందరిని, ఆకర్షిస్తూ, కళాభిజ్ఞుల ప్రశంస లందుకొని కైమోడ్పు లందుకొంటున్న కారణం ఊహకందనిదీ! బహుశా మారుమూలగా వుండటం కారణమయితే- ఇక్కడి అత్యుష్ణోగ్రత కారణంగా వాతావరణ వైపరీత్యాల వలనగానీ- మహమ్మదీయ మత ఛాందసులైన దుస్సాహసిక దుండగీడుల దాడుల ఆగడాలనించీ తప్పుకోవటమేనంటే అతిశయోక్తి కాదేమో. లేకపోయినట్లయితే విగ్రహారాధన మీద కసి, ద్వేషం ముప్పిరిగొంటుంటే విగ్రహాల కాలవాలమైన దేవాలయాల నన్నిటినీ చాలవరకు ధ్వంసంచేసిన వాటిలో ఇవికూడా కాలగర్భంలో కలిసిన శిథిలావశేషాలుగా వుండేవేమో.

ఈ దేవాలయాల అమరికను బట్టి మూడు సముదాయాలుగా విభజించవచ్చు. 1) తూర్పు విభాగం, 2) పడమర విభాగం, 3) దక్షిణ విభాగం. వీటన్నిటినీ గురించి కూలంకషంగా తెలిసినవారిని మార్గ దర్శకులుగా (గైడ్స్) తోడుచేసి గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసునుండి టూర్లు నిర్వహించబడు తున్నాయి. ఈ గైడ్‌కి మీరు యిచ్చేది అతి స్వల్పమే! ఇక వరుసగా-

చౌసట్ యోగిని ఆలయం :

9 వ శతాబ్దానికి అటూయిటూగా నిర్మించబడిన దేవాలయం. ఇందు తంత్ర శాస్త్రప్రవీణులైన 64 యోగినులకు ప్రత్యేకించ బడినది. వీరందరూ కాళీ ఉపాసకులే! ఆలయమంతా నల్లరాతితో నిర్మించబడింది. 64 యోగినులకు 64 గదులు నిర్మించబడి 65వ గది శ్రీమహాకాళికి ప్రత్యేకించ బడింది. కొంత శిథిలమైంది కూడా.

కందరీయ మహాదేవ ఆలయం :

31 మీటర్లు ఎత్తు శిఖరం గలిగిన ఈదేవాలయం ఖజురహో దేవాలయా లన్నిటిలోకి పెద్దది. 1025-1050ల మధ్య కట్టబడింది. శిల్పకళా వైభవం కూడా మెచ్చుకో తగినది. ఛాందెల్ల రాజుల అభిరుచి, అభినివేశం ప్రతి శిల్పంలోను కొట్టవచ్చినట్లు కనబడుతుంది. చుట్టూ కొన్ని ఆలయాలు పరివేష్టితంగా చిన్నవి ఉన్న చిహ్నాలు మాత్రం కనబడుతున్నాయి. కాని అవి ఏనాడో అదృశ్యమయిపోగా ముఖ్య ఆలయం మాత్రం చెక్కుచెదరలేదు. ఆలయం లోపల 226, బయట 646 మొత్తం శిలామణులుగా లెక్కించబడ్డాయి. ఆలయం చుట్టూ మూడు సముదాయాలుగా స్త్రీ, పురుష దేవతలు, అప్సరసలు, సంగీత వాయిద్య విశేషములతో పాటలు పాడుచున్న రమణీలలామల గాయక బృందాలు, వీటన్నిటికి తోడు మైధున జంటలు. మైధున జంటల శృంగార కామ కలాపాల్లో మునిగియున్న జంటలు చూపరులకు ఆశ్చర్యం గొలిపే రీతిలో రతి కేళీమగ్నమై యున్నట్లుగా గనపడుతారు. ఈ శిల్పాలు నిజంగా కామ రసోద్దీపనంగా ఉన్నాయనటంలో సందేహం లేదు. ఒక పాశ్చాత్యుని భావన ప్రకారం- కామకళలో అంతర్జాతీయ పోటీలు గనుక పెడితే గోల్డ్ మెడల్ ఈ జంట సజీవంగా వుండే వీరిదే నని చమత్కరించారు. ఇందులో ముఖ్యంగా ఆసక్తిని రేకెత్తించే శిల్ప విశేషం మానవుడు తనకతీతమైన రాక్షసశక్తిని ఎదుర్కొని నిలబడ గలగటం. ఇది మానవ మేధాశక్తికి, యుక్తి బలాలకు పరీక్ష- అయితే తుది విజయం మానవునిదే!

ఇక్కడి ఆలయాలన్నిటినీ ముఖ్యంగా ఐదు విభాగాలుగా చేయవచ్చు. 1) ప్రవేశద్వారం- ఆరాధన మండపంగాను, 2) మండపం 3) మహామండపం 4) గర్భగుడి 5) ప్రదక్షిణం. అధిష్టానమైన దేవత గర్భగుడిలో ప్రతిష్ఠితమై యుంటుంది. గర్భగుడిలో ప్రతిష్ఠించబడిన ఖాండవ్య మహాదేవ శివలింగము చాల పెద్దది. 102 అడుగుల పొడవు, 66 అడుగుల వెడల్పు, 109 అడుగుల ఎత్తుగలిగి అద్భుత శిల్పవిశేషాలతో అలరారుతూ వుంది. పైకప్పులోను, స్థంభములు అనేక అద్భుత శిల్పకళా విశేషములతో యాత్రికుల కానందాన్ని కలిగిస్తుంది.

## దేవి జగదాంబాలయం :

ఖాండవ్య మహదేవుని ఆలయానికి ఉత్తరదిశగా అమరియున్న పార్వతీ అమ్మవారికి ప్రత్యేకించబడినది. చూస్తే ఇది ఖాండవ్య మహాదేవుని ఆలయం కంటె పురాతనమైనదిగా కనపడుతుంది. ఇది మొదట వైష్ణవ ఆలయంగా వుంది. తరువాత పార్వతీ అమ్మవారి ఆలయంగా మార్చబడినట్లు చెప్పుకుంటారు. అమ్మవారి విగ్రహం నల్లరంగుతోగల కాళీమాతగా రూపొందించబడినట్లుగా కనపడుతుంది. సృష్టికార్యంలో శృంగారానికి గల ప్రతిపత్తిని వెలువరిస్తూ స్త్రీ, పురుష సంయోగములను శృంగార క్రీడలు మలచబడ్డాయి. శ్రీ మహావిష్ణు శృంగార లీలను ప్రతిబింబిస్తూ మైధున జంటలను చిత్రీకరించబడ్డాయి. శృంగార రచనలో పరాకాష్టను పొందిన శిల్ప విశేషాలుగా చెప్పుకోవచ్చు.

## చిత్రగుప్త ఆలయం :

సప్తాశ్వరధారూఢుడైన సూర్యభగవానుడు విగ్రహాన్ని చూడవచ్చు. శ్రీమహావిష్ణువుని యొక్క దశావతార విశేషాలుగా పదితలల శ్రీ మహావిష్ణువు విగ్రహాన్ని ఇక్కడ చూడవచ్చు. చుట్టూవున్న గోడలమీద అద్భుతరీతిలో ఊరేగింపు, వేట దృశ్యము, ఏనుగుల యుద్ధవైచిత్రి, నర్తకీమణుల నృత్యవిలాసాలు స్పష్టంగా మలచబడిన శిల్పవిశేషాల్లో ముఖ్యంగా పేర్కొనదగినది.

పరిభ్రమణ క్రమంలో కుడిప్రక్కనే అమరియున్న చిన్ని పార్వతీ ఆలయంలో పార్వతిదేవి గాక ఆమె సవతిగా పేర్కొనబడిన గంగామాత తన మకరవాహనంతో సాక్షాత్కరిస్తుంది. ఈ ఆలయం స్వతస్సిద్ధంగా విష్ణుమూర్తి ఆలయంగా మలచబడిందని అంటారు.

### నందీశ్వరుడు_విశ్వనాథుని ఆలయం :

విశ్వనాధుని ఆలయంలో ఒకానొకప్పుడు శివలింగము ఎమరాల్డ్ వజ్రపు విశేషమైన రాయితో తయారు చేయించబడినదిగా వుందని ప్రతీతి. ఆలయ నిర్మాణం సుమారు 1002లో జరిగినదిగా భావించబడుతున్నది. కారిడార్ల మీద ఉత్తరంవైపున సింహాల గుంపు, దక్షిణాన మత్తేభాల మందలు మలచబడ్డాయి. త్రిమూర్తులలో మొదటివాడు, సృష్టికర్తయైన బ్రహ్మ సభ దీరి ఉన్నట్లు బ్రహ్మలోకము మరోవంక చూడగలం. విశ్వనాధుని ఆలయానికి ఎదురుగా శివుని వాహన విశేషమైన నందీశ్వరుని విగ్రహం చాలా పెద్దది ఉన్నది.

### లక్ష్మణాలయం :

క్రీ.శ. 930 నుండి 950లలో నిర్మించబడిన కట్టడం విష్ణ్వాలయం. దీనినే రామచంద్ర చతుర్భుజాలయం అనికూడా అంటారు. ప్రవేశ ద్వారంలో లక్ష్మి, బ్రహ్మ, శివుని విగ్రహాలు సాక్షాత్కరిస్తాయి. ద్వారంపైన కమనీయమైన సాగరమథన దృశ్యం చిత్రీకరించబడింది. ఆలయ ప్రాకార కుడ్యంమీద రెండు వరుసల్లో వేట, ఊరేగింపు, అప్సరసల దృశ్యాలు శిల్పీకరించబడినవి. ద్వారబంధముమీద నవగ్రహాలు మలచబడ్డాయి.

దక్షిణంవైపున వున్న ఆవరణంలో కొంతమంది శిల్పులు వారి ప్రధాన స్థపతి సూచనల ప్రకారం శిల్పాలు చెక్కుతున్నట్లుగా చెక్కబడి ఉన్నది. బహుశా ఆలయ నిర్మాణంలో పాల్గొన్న శిల్పుల బృందమై ఉంటుందని భావన. మరొకవంక జవనాశ్వాన్ని యువకిశోరం లొంగదీసుకొంటున్న వైనం శిల్పమైంది.

లక్ష్మణాలయానికి ఎదురుగానే లక్ష్మీదేవి, వరాహావతారమైన శ్రీ మహావిష్ణువు ఆలయాలున్నాయి. అవి చక్కగా లక్ష్మణాలయం కంటే మతంగేశ్వరాలయానికి ఎదురుగా వున్నట్లు చెప్పుకోవచ్చు.

### మతంగేశ్వర ఆలయం :

లక్ష్మణాలయం కంటె ముందుగా క్రీ.శ. 900-925లో నిర్మించబడినదిగా కనబడుతుంది. ఎదురుగా సుమారు 2.5 మీటర్ల ఎత్తువున్న వరాహస్వామి భూమాతను రక్షిస్తున్న వైనం మలచబడింది. ఈ విగ్రహంచుట్టూ చిన్న చిన్న విగ్రహాల్లో దేవతలు పరివేష్టించివున్న దృశ్యం కమనీయమైనది.

ఆర్కి లాజకల్ మ్యూజియం :

పడమటి ఆలయసముదాయానికి సమీపంలోనే పోస్టాఫీసు నుంచి వచ్చే మార్గంలో అమరియున్నది. ఇక్కడ ఖజురాహో శిల్పకళా ఖండికలను అనేకంగా ప్రదర్శనా యోగ్యంగా భద్రపరచ బడ్డాయి. పడమటి సముదాయానికి చెల్లించే ప్రవేశరుసుముతోనే చూడవచ్చు. శుక్రవారాలు సెలవు— ఆ రోజు విడిచి మరే రోజయినా 9 గం. నుండి సాయంత్రం 5 గం. వరకూ చూడవచ్చు.

తూర్పు విభాగ సముదాయం :

రెండు విభాగాలుగా విభజించవచ్చు. మొదటిది జైన దేవాలయాల సము దాయం. ఆ తరువాత రెండవది హిందూ దేవాలయాలు వూరి మధ్యలో అక్క డక్కడా వున్నవి. వీటిని చూడాలంటే జైన సముదాయం నుండి ఒక రిక్షామీద వెళ్ళి అన్నింటినీ సవివరంగా చూడవచ్చు.

పార్శ్వ నాథాలయం :

ఖజురహోలో గల జైన దేవాలయలన్నింటిలోకి పెద్దది. శృంగార లతికల చిత్రాలు లేకపోయినా అద్భుతమైన కళారూపాలు కొన్ని మలచ బడ్డాయి. జీవ చైతన్యాలుట్టిపడే విధంగా కాలిలో ఇరిగిన ముల్లు తీస్తున్న భంగిమలో ఉన్న అతివ, పయవాలుట్టిపడే పడతి సుకుమారంగా కండ్లకు కాటుక నలదుకొంటున్న దృశ్యాలు వంటివి సామాన్య జీవన విధానంలో సరికొత్త సౌందర్య శోభలు కన్పించే విధంగా మలచబడిన శిల్పాలు మచ్చుకు కొన్ని. ఈ ఆలయం మొదట్లో ఆదినాధుని ఆల యంగా నిర్మించబడినా సుమారు ఒక శతాబ్దం క్రింద పార్శ్వ నాధుని మూర్తి ఆది నాధుని మూర్తిని తొలగించి ప్రతిష్టించబడింది. అప్పటి నుండి పార్శ్వనాధుని ఆల యంగానే పరిగణనలోకి వచ్చింది. ఈ ఆలయంలో ఆభరణ భూషణ భూషితమైన ఒక ప్రత్యేకమయిన వృషభ సింహాసనం కూడా వుంది. ఇదే ఆదినాధుని చిహ్నం.

దీనికి ప్రక్కనే గల మరొక ఆలయం ఆదినాధుని ఆలయంగా మరొకటి ఉన్నది. సున్నితమైన శిల్పాలు, చక్కని నగిషీల జిలుగులతో పురాతనమయిన దేవళం. ఖజురహోలో ఉన్న ఇతర దేవాలయాలను పోలివుంది. లోపల గర్భ గుడిలో ప్రతిష్ఠితమైన జైన తీర్థంకరుని విగ్రహాన్నిబట్టి జైన దేవాలయం అని

చెప్పుకోవాల్సి వస్తుంది గాని లేకపోతే అది పూర్తిగా హైందవాలయంగానే భావించ బడేది.

**శాంతినాథ ఆలయం :**

ఇటీవల ఒక శతాబ్ది క్రిందట నిర్మించబడిన నూతన జైన దేవాలయం. కట్టడంలో పురాతన శిల్ప విశేషాలను ఏర్చి కూర్చి మరీ కట్టారు. ఇక్కడ ఒక చిన్న జైన మ్యూజియం కూడా వుంది.

**ఘంటై :**

ఆలయం ఆగ్నేయ దిశలో వున్నది. చాల శిథిలమై, జీర్ణావస్థలో ఉన్నది. అయితే ఆనాటి వైభవ చిహ్నాలు యింకా మాసిపోకుండా కన్పడుతున్నాయి. ఎంతో కళాత్మకంగా నిర్మించబడింది. ప్రవేశంలో గరుడ వాహనయైన జైన దేవత అష్ట భుజియై మనకు సాక్షాత్కరిస్తుంది. స్తంభం పైభాగాన చివరి తీర్థంకరులైన మహావీరుని తల్లిగారి యొక్క షోడశ స్వప్న విశేషాలు చిత్రీకరించబడి యున్నవి చూడ దగును.

**జావరి :**

క్రీ. శ. 1075-1100 సంవత్సరాల్లో నిర్మించబడిన చిన్న విష్ణ్వాలయం. చిన్నదైనా ఖజురహోలో బృహత్తర ఆలయ నిర్మాణ కౌశల్యానికి ప్రతీకగా నిలుస్తుంది. బాహ్యంగా కొన్ని అందమైన స్త్రీల విగ్రహాలను మలచారు.

**వామనునికి దేవాలయం :**

శ్రీ మహావిష్ణువు మరుగుజ్జు అవతారమైన వామనునికి ప్రత్యేక ఆలయం. జావరి ఆలయం కంటే కొంత పురాతనమైనది. శిఖర నిర్మాణం అతి సాదాగా ఉన్నా దృశ్యమానమయినది. గుడి చుట్టూవున్న శిల్పాలు ఇక చెప్పనక్కరలేదు- అందాల రాసులయిన భామలు అనేక భంగిమల్లో సాక్షాత్కరిస్తారు.

**బ్రహ్మదేవునికి ఆలయం :**

బ్రహ్మదేవునికి ఈ దేశంలో ఆలయాలే అరుదు. అయినా ఇక్కడ ఒక బ్రహ్మదేవుని ఆలయం వుంది. ఖజురహో ఆలయ సముదాయంలో పురాతనమైన వాటిలో ఇదికూడ ఒకటి. పూర్తిగా నల్లరాయి, కారురాయి కలిపి కట్టిన దేవాలయం. కాని ఇది బ్రహ్మదేవుని ఆలయం మాత్రం కాదు. శ్రీ మహావిష్ణువు కోసం కట్టింది.

ఇక్కడి నుండి జైన ఆలయాల సమూహానికి వెళ్ళే రోడ్డులోనే ఒక పెద్ద హనుమంతుని విగ్రహంతో మరో దేవాలయం కనబడుతోంది.

## ద క్షి ణ వి భా గం

ఇక్కడ రెండు దేవాలయాలు మాత్రం వున్నాయి. వూరికి దక్షిణ దిశలో 5 కిలోమీటర్ల దూరంలో అమరియున్న దులాదేవ్ ఆలయం ఒక శివాలయం, చతుర్భుజాలయం అనే పేరుతో విష్ణుదేవుని ఆలయం వున్నాయి.

దులాదేవ్ ఆలయం :

ఖజురహోలో ఉన్న ఆలయాలన్నిటికంటే తరువాతి కాలానికి చెందింది. ఈ ఆలయ నిర్మాణానికి వచ్చేసరికి శిల్పులు మొదటి ఆలయాల్లో ఉన్న శిల్ప విశేషాలనే ఇక్కడకూడా మలిచారు అని చెప్పుకుంటారు. ఏమయినా శృంగార శిల్పాలకు పెట్టింది పేరుగా ఉన్నది. అనేక భంగిమల్లో కామకేళిలో మునిగిఉన్న మైథున జంటలను చూడవచ్చు.

చతుర్భుజాలయంలోని విశేషం శ్రీ మహావిష్ణువు విగ్రహం మూడు మీటర్ల ఎత్తుతో గంభీరమైన ఆకృతిలో పొంద గట్టడమే।

ఈ ఆలయాన్నింటిలో శృంగారం, రతికేళి, కామకలాపాలు ఎక్కువగా చోటు చేసుకోవటంలో గల ఔచిత్యాన్ని గురించి ఒక చిన్నమాట— దీన్ని గురించి పెద్దగా విశ్లేషించి వ్రాయాలని కాకపోయినా ఒక నిజాన్ని మాత్రం రాయకతప్పదు. ఒక సారి కీ. శే. తాపీ ధర్మారావు గారిని స్మరించుకుందాం— వారు దేవాలయాలమీద బూతు బొమ్మలను గురించి ఒక గ్రంథమే వ్రాశారు. స్థూలంగా చెప్పాలంటే— మానవుడు అనాది కాలంనించీ సంఘజీవి, బుద్ధిజీవిగా జీవరాసులన్నింటినీ తన కనుకూలంగా మలచుకొనే ఉద్దేశ్యంతోగాని, అదృశ్యమయిన, దృశ్యమయిన ప్రకృతి శక్తులతోను ఎదిరించే పోరాటంలోను తన సమాజాభివృద్ధిని, సంతతిద్వారా వృద్ధిచేసు కోటానికి అనేక రీతుల పాటుపడినట్లు చరిత్ర మనకు చెప్పకనే చెప్తున్నది. సమస్యలను ఒంటరిగా ఎదుర్కొనేకంటే సామూహికంగా ఎదుర్కోటానికి ప్రోద్బలంగా కనబడుతుంది. కనుక తన సమాజాన్ని, సంతతని అభివృద్ధిపరచే సృష్టి కార్యక్రమ

వైచిత్రికి ప్రాధాన్యత నిచ్చాడు. వైవాహికాంతరమైన శృంగారానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తిని సృష్టించుకుని ప్రచారాన్నివ్వటానికి పూనుకున్నాడు. శిలలమీద తన మనోభావ లహరినిశిల్పాలుగా మలచాడు- సాహిత్యంలో శృంగారానికి పెద్దపీట వేసి మధుర కావ్యాలని వ్రాసుకొన్నాడు. భావ వ్యక్తీకరణలో సరికొత్త సొగసులు, అందాలను సమకూర్చుకున్నాడు. సామూహికంగా ఒక చోట కలవటానికి దోహద పడే దేవాలయాలను నిర్మించుకుని తద్వారా తోటివారిని విజ్ఞానులుగా చేయటానికి ఉద్యమించి ప్రధాన ప్రచార సాధనంగా ఉపయోగించుకున్నాడని చెప్పవచ్చు. సర్వ ప్రపంచంలోని సృష్టికి మూలకారణం స్త్రీ, పురుష జీవుల సంగమం ప్రభావం. అందులోనూ బుద్ధి జీవిగా మెలగిన మానవజన్మ ఉత్తమంగా భావించి ఒక వంక ప్రకృతి శక్తులతో నిరంతరం పోరాడతూ, మరోవంక తమ గణ సమూహాల్ని అభి వృద్ధి చేసికొంటూ శృంగారం అతి పవిత్రంగా ఎంచుకుంటూ తన వారందరికీ సృష్టి అంతరాలను బోధిస్తూ అందుకు ప్రధాన సాధనంగా దేవాలయాలను ఎన్నుకుని రస రమ్యంగా శిల్పాలద్వారా శాశ్వతత్వాన్ని చేకూరుస్తూ కామ కళాకేళీ విలాసం కూడా ముఖ్య ఘట్టాలు చిత్రీకరించారన్నది గమనించ దగిన విషయం. ఆనాడు ఈనాడు న్నన్ని ప్రచార సాధనాలుగాని, జన బాహుళ్యాలు గాని లేవు. పురాతన కాలంలో చీకటి గుహలనించి బయటకు వచ్చి రమ్య హర్మ్యాల నిర్మాణానికి పూనుకొని సంఘ టిత శక్తిగా రూపొందాలనే తపన అనాది కాలంలో పిసి ఆవశ్యకతకి ఎంతగానో తోడ్పడింది. అయితే ఈనాడు జనాభా పెరగటం, కామ విశృంఖలత విలయతాండవం చేస్తున్నాయి. ఆనాడు సమాజాభివృద్ధి, సంతతికోసం వెంపర్లాడిన మానవజాతి ఈ నాడు కుటుంబ నియంత్రణ మార్గాల నన్వేషించటంలో కూడా ఎంతో సముచితంగా కనుపిస్తుంది- 'అతి సర్వత్ర వర్జయేత్' కదా ।

ఈ ఆలయ సముదాయాలన్నింటినీ ఎంత త్వరగాచూసి వెళ్దామన్నా కనీసం ఒకరోజుయినా పడుతుంది. ఒక సమూహాన్ని చూచి మరో సమూహం చూడాలంటే రిక్షాలు వగయిరాలున్నాయి. సమాచార పరంగా తెలిసిన గైడ్లుకూడా లభ్యమవుతారు. అనుమతి పొందిన గైడుకి ఫీజు పూటకు రు. 25/- తీసికొంటారు.

**ఇక్కడ వుండటానికి :**

రాహిల్ (జనతా హోటలు) ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించబడుతుంది. వేడినీరు, చన్నీరు సౌకర్యాలతో రోజుకు 50/- నుండి 70/- రూపాయల వరకు

గదులు లభ్యమవుతాయి. పడక సౌకర్యం రు. 12 లకే లభ్యం. ఇది కొంచం పాతది టూరిస్టు బంగళా, టూరిస్టు డిపార్టుమెంటువారిచే నిర్వహించబడే టూరిస్టు విలేజి భవనం కూడా యోగ్యంగా ఉంటాయి. రూములు కనీసం 50–75 రూ. వరకు రోజు 1 కి. చార్జీలున్నాయి.

వీటికన్నా చౌకగా రూములు దొరికే కొన్ని ప్రయివేటు హోటళ్ళు కూడా ఉన్నాయి. న్యూభారతి లాడ్జి, గుప్తాలాడ్జి, లక్ష్మిలాడ్జి మొదలయినవాటిలో రూ.20నుండి 25 రు. లకే గదులు సౌకర్యం సమకూరుతుంది. మరి కొంచం ఖరీదు భరించేవారికి రోజు 1 రు. 40/–ల్లో 'హోటల్ సన్ సెట్ వ్యూ' వుంది.

శ్రీమంతులకు రాష్ట్ర టూరిస్టు డిపార్టుమెంటువారు నిర్వహించే 'హోటల్ పాయల్' హోటల్ ఖజురహో ఆశోక్, హోటల్ ఛాందెలా ఉన్నాయి. ఇక్కడ చాందెలా మాత్రం రోజుకు కనీసం 550 నుండి 715 రూ. ల వరకూ ఉన్న పోష్ హోటలు. వీటికి తోడుగాకొత్తగానిర్మించబడిన 'జాన్‌ఓబెరాయ్'కూడాఅమరియున్నది. ఇవన్నీ విదేశ పర్యాటకులకు కూడా చాలా అనువుగా ఆకర్షణీయంగా వుంటాయి.

ఖజురాహో ఒక మారుమూల ఒదిగి ఉన్న చిన్న వూరు. అయినా యాత్రా సౌకర్యాలుగా విమాన సౌకర్యం గూడా ఉన్నది. ఢిల్లీ నుండి ఖట్మాండుకి విమాన మార్గంలో ఢిల్లీ – ఆగ్రా – ఖజురాహో – వారణాసి – ఖాట్మండూ మార్గంలో ఖజురాహో స్టాపింగు వున్నది.

రైలుమార్గం ఆగ్రా, గ్వాలియర్, ఝూన్సీల మార్గం. ఝూన్సీకి ఖజురాహో 175 కి. మీ. దూరం. అక్కడినుండి బస్సుల్లో వెళ్ళవచ్చు. ఢిల్లీ – బొంబాయి మెయిన్ లైనులో ఝూన్సీ దగ్గర దిగి బస్సుల్లో వెళ్లాల్సి వుంటుంది. ఎంతయినా ప్రయాసతో కూడుకున్నది ప్రయాణం జీవితంలో చూడదగిన ప్రదేశంగాను, అంతర్జాతీయంగా గొప్ప కళాకేంద్రంగా భాసిస్తున్న ఖజురాహోను చూడటానికి ఈ మాత్రం ప్రయాసభరితమైన ప్రయాణం చేయక తప్పదు మరి. వారణాసి నుండి బయలుదేరే గంగా కావేరి రైలుమార్గంలో సత్నా దగ్గర దిగి మూడున్నర గంటల బస్సు ప్రయాణంతో ఖజురాహో చేరవచ్చు.

**మహోబా, మరికొన్ని విశేష స్థలాలు :**

ఖజురాహో నుండి 68 కి. మీ. దూరంలో మహోబాకు బస్సులో వెళ్ళవచ్చు. చూడదగిన ప్రదేశంగా అనేకమంది పర్యాటకులు చెప్తారు. మధ్యప్రదేశ్‌లో మానిక్–

పూర్-ఝాన్సి రైలు మార్గంలో మహోబా స్టేషన్ ఉంది. రైల్వేస్టేషను నుండి కొద్ది దూరంలోగల కీర్తిసాగరమనే సరోవరం—దాని సమీపంలోనే మదన సాగరం అనే సరస్సు - సరస్సుకు నాలుగువైపులా దేవాలయాలున్నాయి. మదనసాగర సరస్సు మధ్యలో ఖజ్రామఠం పేరుతో శివమందిరం ఉన్నది. అక్కడ ఆగ్నేయ దిశగా కంఠేశ్వర శివుడు, చండికాదేవి మందిరాలు, శంకరాచార్య గుహ అమరి యున్నాయి. చండికాదేవి 12 అడుగుల యెత్తున అష్టాదశ భుజములతో గంభీరాకృతిలో వున్నది. చండీ వుపాసకులు అనుష్ఠానం కోసం చాలామంది వస్తుంటాయి.

పడమరవైపుగా గోకార పర్వతం—చక్కని తపోభూమి, ఒక పెద్ద చీకటి గుహ కూడా ఉంది. పర్వతంనుండి ఉత్తరి దిక్కుగా రావణ స్థానంలో 12 అ. యెత్తు గల భైరవ విగ్రహం ఉన్నది.

మహోబాకు 5 కి. మీ. దూరంలో శిథిలమైన సూర్య దేవాలయం ఒకటున్నది చూడదగినది.

కలింజార్ కోట లేక కాలాంజన గిరి :

అద్భుతమైన ప్రకృతి సౌందర్యంతో అలరారే పర్వతంపైన పురాతనపుకోట. యాత్రికులు బస చేయటానికి డాక్ బంగళా ఉంది. మహోబా నుండి ఒక జీపులో ప్రకృతి సౌందర్యంతో తిలకిస్తూ మధ్యలోగల కొండ దిగువనే గల సురసరి గంగ అనే సరస్సు కూడా వుంది. పర్వతం పైకి వెళ్ళే త్రోవలో వన ఖండేశ్వర శివ మందిరం ఉంది. కోటకు ఏడు ప్రాకారాలున్నాయి, నాలుగవ ద్వారంలో ఒక పెద్ద భైరవ విగ్రహం భైరవకుండం వున్నాయి. కోటలో పాతాళగంగ, హనుమాన్ కుండం ఉన్నాయి. పాతాళగంకు వెళ్లాలంటే చాల కష్టం.

సత్యయుగంలో 'రత్నకూటం' గాను త్రేతాయుగంలో 'మహాగిరి' అని, ద్వాపరంలో 'పింగలా' అని కలి యుగంలో 'కలింజార్' గా పేర్కొనబడిన ఈ ప్రదేశానికి పురాణేతిహాసాల్లో గొప్ప మహిమాన్విత ప్రదేశంగా పేర్కొనబడింది. అనాదినుండి తపస్సుకు అనుకూలమైన ప్రదేశంగా ప్రసిద్ధి. ఇక్కడి సరస్సులో స్నానం చేస్తే సహస్రగోదాన ఫలం లభిస్తుందట. ఈ విషయం మహాభారతంలో కూడా చెప్పబడింది. 80 అడుగుల ఎత్తున కాలభైరవ విగ్రహం అమరి యున్నది.

కోట 5 మైళ్ళు చుట్టుకొలతగలిగి అనేక శిలాశాసనాలున్నాయి. నీలకంఠ

మహాదేవుని ఆలయం దర్శనీయం. శ్రీ మహాభాగవతంలోని జడ భరతుడిక్కడే తపస్సు చేశాడట. మరెన్నో జైన దేవాలయాలున్నాయి దర్శనీయంగా.

ఈ పురాతనమైన కోటకు సప్త ద్వారాలున్నాయి. రామాయణ కాలంలో సీతాదేవి లంకనుండి వచ్చేటప్పుడు విశ్రాంతి తీసుకొన్న స్థలంగా ప్రతీతి. ద్వారం సమీపంలో సీతాసజ్జ, రామసజ్జ ఉన్నాయి.

కార్తీకమాసంలో పెద్ద ఉత్సవం జరుగుతుంది. చాల విశేషంగా ప్రజలు పాల్గొంటారు.

ఖజురాహో పరిసరాల్లో 30 కి. మీ. దూరంలో వున్న పన్నా సఫారీ పార్కు పన్నా వజ్రాల గనులు, పాండ్వా జలపాతం, రాజగిరి ప్రాసాదం చూడదగిన ప్రదేశాలు.

## జబల్‌పూరు

జనాభా 5, 50, 000. రాష్ట్రంలో రెండవ పెద్ద నగరంగా రాజిల్లుతుంది. ఇటార్సీ, అలహాబాదు లైనులో ఉన్న నగరం.

ఒక శతాబ్దం క్రిందట థగ్గులనే దారిదోపిడీగాళ్ళను అణిచివేసే ప్రయత్నంలో బ్రిటిషువారికి ముఖ్య కేంద్రంగా వున్నది. వీరు ముఖ్యంగా మనుషులను తీసికొనివెళ్ళి కాళిమాతకు నరబలులందించేవారట. వీరి ఆగడాలు పెచ్చుమీరి ప్రజాకంటకులుగా మారినప్పుడు బలవంతాన అణిచి వేయక తప్పలేదు. వీరి చర్యలను సమూలంగా మట్టుపెట్టినవారు కల్నల్ స్లీమాన్ ఈ చర్యతు పూర్తి స్వస్తి 1829లో జరిగింది. ఈ సమూహాన్ని సమూలంగా మార్చటాని కుపయోగించిన స్థలము కూడా చూడవచ్చు. ఇప్పుడా ప్రదేశంలో బాలురను సంస్కరించే విద్యాలయమొకటి నడుపబడుతుంది. సత్నా జబల్ పూర్‌ల మధ్యగల ఒక గ్రామం స్లీమాన్‌బాదు. ఈయన పేరు మీదనే సార్థకమయ్యింది. అక్కడ దేవాలయంలో ఆరని జ్యోతి నిరంతరం వెలుగుతూనే వుంది. జబల్‌పూర్‌లో రాణి దుర్గావతి మ్యూజియం వుంది.

### మార్బుల్ రాక్స్ :

స్థానికంగా బేరాఘాట్ అనబడుతుంది ప్రదేశం. సుమారు 24 కిలో మీటర్లు

టుంది జబల్‌పూరుకుండి. ఇక్కడ నర్మదా నదీ ప్రవాహం నీటి మట్టానికి సుమారు 30 అడుగుల ఎత్తున తెల్లని నున్నపురాతి చరియలు కొన్ని ఏర్పడి వున్నాయి. తెల్లగా మెరిసే ఈ రాళ్ళ కాంతి పుంజాలు నీటిలో ప్రతిబింబిస్తూ ఒక గమ్మత్తయిన దృశ్యాన్ని అద్భుతంగా కనిపింపజేస్తుంది. ముఖ్యంగా దీని సోయగాలు పున్నమినాటి వెన్నెలలో బహు శోభాయమానంగా ఉంటాయి. ఖచ్చితంగా జన్మలో ఒకసారైనా చూచి తీరవలసిన సుందరమనోహర దృశ్యం. నర్మదానది ఈ కొండ రాళ్ళ చరియలమీదుగా దుముకుతూ ఒక జలపాతాన్ని ఏర్పరచింది. ఇక్కడే ఏనుగు పాదాలను గూడ చూడవచ్చు. చిత్ర విచిత్రంగా రూపొందిన రాళ్ళ సమూహాన్ని హనుమంతుని గంతు'గా వర్ణిస్తారు. మాధవరావు పీష్వా చెక్కించిన శాసనాలేవో ఉన్నాయి. మార్గ మధ్యంలో చలువరాతి నగిషీల బొమ్మలు బహు చౌకగా దొరుకుతాయి. కొనుక్కోవచ్చు.

మదన్ మహల్-చౌసత్ యోగిని ఆలయం :

మార్బుల్‌రాక్సుకు వెళ్ళే దోవలోనే ఒక పెద్ద కొండరాయిమీద అతి పురాతనమైన గోండుల కోట ఉన్నది. గోండు జాతివారు ముఖ్యంగా నాగు పాములను ఆరాధిస్తారు. వీరు యిక్కడ ఆర్యులకంటే బహు పురాతన కాలంలో ఇక్కడ స్థిరపడి-దాదాపు అక్బరు కాలం వరకూ స్వతంత్రులుగా జీవించారు. పెద్ద గుట్టకు దిగువన రమారమి 109 మెట్లు ఎక్కి-వెళితే మదన్‌పూర్ ఆలయం లేక చౌసత్ యోగిని ఆలయం చూడవచ్చు. గుండ్రంగా కట్టబడిన ఈ ఆలయంలో చాలామంది యోగినుల విగ్రహాలు పాడుచేశారు. కొన్ని పాడుబడి పోయాయి. ఈ యోగినులు కాళీమాత అనుచర వర్గంగా పేర్కొనబడింది.

వుండటానికి ధర్మసత్రం, హోటళ్ళు అనేకం వున్నాయి. టూరిస్టు డిపార్టుమెంటువారు నిర్వహించే టూరిస్టు మోటెలు వుంది.

జబల్‌పూరు-భోపాల్ మధ్య వారానికి రెండుసార్లు విమాన సౌకర్యం గలదు. కాని రాయ్‌పూర్‌కి ప్రతిరోజూ వుంది.

గౌరీ శంకరము :

జబల్‌పూరుకు సుమారు 20 కి. మీ. దూరంలో నర్మదా సరస్వతీ నదుల సంగమ స్థానం - తీరాన్నే శాతవాహనుడు నిర్మించాడని చెప్పబడే గౌరి శంకరాలయం ఉన్నది. ఇక్కడి మట్టి తెల్లగా వుంటుంది. ఆలయమునకు దిగువ భాగంలో

కొన్ని గుహాలున్నాయి. తంత్రశాస్త్రమునకు సంబంధించిన కొన్ని గుహాలున్నాయి. అందుకు సంబంధించిన విగ్రహాలు కూడా ఎక్కువగా చూడవచ్చు.

జబల్‌పూరుకు 6 కి. మీ. దూరంలో ఉన్న గుప్తేశ్వరాలయం కూడా చూడదగినది.

# గ్వాలియర్

మధ్యప్రదేశ్ రాష్ట్రానికి వాయువ్య దిశనగల పట్టణం. పారిశ్రామికంగాను, చారిత్రకంగాను ప్రసిద్ధి పొందిన నగరం. స్వతంత్రం రాకముందు సింధియా రాజ్యపు రాజధాని. గ్వాలియర్‌లో గల కోట భారతదేశంలో నిర్మించబడిన కోటల్లో మణిహారంగా భావించబడుతుంది. ఇది చాల పురాతనమైన కట్టడం. ఆసక్తిని రేకెత్తించే దేవాలయాలు, శిథిల భవనాలు చూడటానికి వెళ్ళే ముందు పూర్వ చరిత్ర ఉజ్వల శోభను ఒకసారి చూద్దాం.

అతి పురాతనమైన నామం గోపగిరి, లేక గోపాద్రి. వెయ్యి సంవత్సరాల పూర్వపు ఘట్టాలు కొన్ని పరిశీలించదగిన అంశాలు చోటుచేసుకున్న కోట చరిత్ర కమనీయం.

పూర్వపు సూర్య సేన మహారాజు భయంకరమైన కుష్ఠువ్యాధితో బాధపడుతున్నాడు. ప్రస్తుతపు కోట ఉన్న కొండమీద గ్వలిప మహాముని ఉండేవాడు. సూర్య సేన మహారాజు గ్వలిప మహామునిని దర్శించిన వేళావిశేషంతో మునివర్యుని అనుగ్రహంతో సూరజ్‌కుండులోని నీరములు త్రావి సూర్య సేనుని వ్యాధి అంతా మటుమాయమయి సరిక్రొత్త ఆరోగ్యవంతమయిన శరీర శోభతో తేజరిల్లాడు. నూతన జనసత్త్వాలు పొందిన మహారాజుకి మౌనివర్యులు ఆయనకు క్రొత్త పేరు పెట్టారు. అదే సూరజ్‌పాల్ అనేది. ఆయన సంతతి వారందరూ పాల్ అనే నామాన్ని విడవవలదని – అది వున్నంతవరకూ వంశము సర్వోన్నతిని బొంది పాలకులుగా ఉండగలరని అనుగ్రహించారు. తరువాత కాలక్రమేణా తరువాత తరాల వారు ఈ 'పాల్'ని వదలివేశారు. 83మంది వారసులు వరకూ బాగానే వుంది 84వ వాడైన తేజకరన్ 'పాల్' నామాన్ని తగిలించుకోవటానికి ఇష్టపడక వదిలివేశాడు రాజ్యం కూడా అంతరించిపోయింది.

1398లో తోమార్ వంశం అధికారంలోకి వచ్చింది. తరువాత కొన్ని శతాబ్దాలవరకూ ఇరుగు పొరుగు వారితో కయ్యాలు, యుద్ధాలతో సతమతమవుతూవుండేది. 1486 మాన్‌జింగ్ అధికారంలో కొచ్చాడు. తోమార్ వంశీయుల్లో గొప్పవాడుగా పేరు సాధించాడు.

1505లో జరిగిన ఢిల్లీ సుల్తానులు లోడీల దండయాత్రలను 1505లో త్రిప్పికొట్టగలిగినా 1516లో మాత్రం ఇబ్రహింలోడికి వశంగాక తప్పలేదు. తరువాత మానసింగ్ మరణించాడు. మాన్‌సింగ్ కుమారులు, మనుమలు ఎదిరించి నిలబడటానికి చేసిన ప్రయత్నాలు ఫలించక మొగలాయీల వశంలోనే ఉన్నది. తరువాత మరాఠీల వశం అయింది 1754లో. తరువాత 50 సంవత్సరాలు అనేక ఆటుపోట్లకు గురయినా క్రమంగా సింధియాల చేతుల్లోకి వెళ్ళింది. నేపథ్యంలో బ్రిటిషు వారి మద్దతు, అదుపుతున్నాయి. 1857లో జరిగిన 'సిపాయిల కలహం'లో సింధియా మహారాజు బ్రిటిషువారికి అండగా నిలిచాడు. 1858లో చాలా నాటకీయ పరిణామాలకి నిలయమైంది కోట. చివరికి భారత స్వాతంత్ర్య పోరాటంలో ప్రథమ ఘట్టంగా పేర్కొనబడిన 'సిపాయిల తిరుగుబాటు' కి ఇక్కడే భరతవాక్యం పలుకబడింది. స్వాతంత్ర్య వీరులు భారత స్వతంత్ర చరిత్రలో స్వతంత్ర వీరులైన తాంతియా తోపే, వీరనారి ఝాన్సీ రాణిలను బ్రిటిషువారు ఇక్కడే చంపివేశారు. ఆ మృతవీరులకు స్మారక మందిరాలు నిర్మించి నివాళులర్పిస్తున్నారు. వానిని కూడా చూడవచ్చు.

గ్వాలియర్ నుండి ఆగ్రా మార్గంలో రాజస్థాన్ మధ్యప్రదేశ్ సరిహద్దుల్లో ప్రవహించే చంబల్ నదీలోయ బందిపోట్లకు పెట్టింది పేరు. ఇటీవలి కాలంవరకూ ప్రయాణికులు ప్రాణాలు అరచేత పట్టుకుని వెళ్ళాల్సిందే అదృష్టాన్ని తలుచుకుంటూ.

గ్వాలియర్ కోటలోకి వెళ్దాం ఇక—

## గ్వాలియర్ కోట :

అద్భుతమైన కోట లోపల ప్రవేశించటానికి పంచమహాద్వారాలనే ఐదు ద్వారాలు. ఈశాన్య ద్వారంగుండా ప్రవేశిస్తే మొదటగా కనబడేది ఆర్కియాలాజికల్ మ్యూజియం. విశాలమైన వాలుతలం మాన్‌సింగ్ భవనానికి దారితీస్తుంది. ఆగ్నేయ ద్వారంగుండా మిట్టమీదకు దారితీస్తుంది. కొంచం ప్రయాసతో కూడుకొని వున్నది. జైనశిల్పాలను చూడవచ్చు. కోటలో మనకు తాగడానికి తినడానికి అదే ఏమీ దొరకవు. తీసుకొని వెళ్ళాల్సిందే!

సుమారు 100 మీటర్లు ఎత్తుగల కొండమిట్ట దాదాపు 3కి.మీ. పొడవుంటుంది. వెడల్పు కిలోమీటరు పైనే వుంటుంది. కోట మిట్ట చుట్టూ 10 మీటర్లు ఎత్తున గోడ కట్టబడి వుంది. కోట మీదనుండి నైఋతీమూలగా లష్కర్ అనబడే పాత పట్టణ దృశ్యం. ఆగ్నేయంవైపు నూతనంగా అభివృద్ధి చెందిన పట్టణ విస్తరణ చుట్టు ప్రక్కలగల మైదానాల మీదుగా ఒక బ్రహ్మాండమైన దృశ్యం. కోటలోపల, బయట చూడదగినవెన్నో వున్నాయి.

## ఆర్కియాలాజికల్ మ్యూజియం :

కోటకు ఈశాన్యద్వార మార్గంలో గుజారిమహల్‌లో ఉన్నది. మ్యూజియం సోమవారాలు తప్ప ప్రతిరోజూ 10 గం - 5 గం. వరకు దర్శనీయం. ఈ భవనం మాన్‌సింగ్ ప్రియురాలు ప్రేయసి అయిన రాణి మృగనయని కోసం, 15వ శతాబ్దంలో నిర్మించబడింది. ప్రస్తుతం జీర్ణావస్థలో వున్నది. ఇందులో హిందూ, హైందవ, జైన దేవాలయాలతో శిల్పకళాఖండాలు, బాఘ్‌గుహలలోని చిత్రాల నమూనాలు ప్రదర్శించబడుతున్నాయి.

ఈశాన్య ద్వారంగుండా మాన్‌సింగ్ భవనానికి వెళ్ళవచ్చు. ఒకప్పుడు మెట్లుండేవి. తరువాత చదును చేయబడింది. అయినా వాహనాలకంత అనుకూలం కాదు. మొత్తం ఆరు ద్వారాలున్నాయి. లోపలికెళ్ళేప్పుడు అధిగమించాల్సినవి. 1) అలంగిరిగేటు – ఔరంగజేబు పేరిట క్రీ. శ. 1600లో నిర్మించబడింది. 2)బాదల్ గర్ – మాన్‌సింగ్ రక్తబంధువు బాదల్‌సింగ్ పేరన 3) బన్సూర్‌గేటు – ఇప్పుడు కన పడటం లేదు. 4) గణేష్‌ద్వారం – 1400 ప్రాంతంలో నిర్మించబడింది. ఇక్కడ ఒక చిన్న పావురాయిగూడు, నాలుగు స్తంభాలతో ఒక చిన్న ఆలయం గ్వాలిపమహర్షి కోసం నిర్మించబడింది. క్రీ. శ. 876 సంవత్సరంలో నిర్మించబడిన విష్ణుదేవళం—చతుర్భుజ మందిరం పేర, 1518లో చనిపోయిన మృతవీరుని సమాధి, జైన శిల్పాలు తొలచబడిన శిలా విశేషాలు, హిందూ శిల్ప విశేషాలు శిలలు చూడవచ్చు. 5) హాథియా పేర్ లేక ఎలిఫెంటు గేటు భవన ప్రాంగణంలోకి తీసుకొని వెళ్తుంది. 6) ఇప్పుడు లేకపోయినా ఒకప్పుడు హవాగేటుగా వుండేది.

మాన్‌సింగ్ భవనం అంతా రంగులతో పెయింట్ చేయబడి గోడల మీద అనేక చిత్ర విశేషాలు చూడవచ్చు. ఇప్పటికీ నిత్యనూతనంగా గోచరించటం ఆశ్చర్యంగా వుంటుంది. 1486లో నిర్మించబడి 1881లో మరమ్మత్తులు చేయబడ్డాయి.

గోడలమీద ఆకుపచ్చ, బంగారు రంగు టింటుతో నీలం రంగుతో బాతులు, నెమళ్ళు, ఏనుగులు చిత్రీకరించబడినాయి, కోటలో ఉత్తరం కొసన ఇతర ముఖ్య భవనాలు కొన్ని వున్నాయి. అవి కరన్ ప్యాలెస్, కీర్తిమందిర్, జహంగీర్, షాజహాను మందిరాలు వాటికి తోడు లోతైన పెద్ద సరస్సు - జోహార్ అనబడేది ముఖ్యంగా చూడదగినవి. 1232లో ఒకానొక రాజపుత్రుడు ఆచారవిధిగా ఆత్మహూతి కారణంగా ఈ సరస్సును నిర్మించారు.

ఇక్కడే అత్తా-కోడళ్ళ దేవాలయాలున్నాయి. 9-11 శతాబ్దాల మధ్య కాలంనాటివి నలువైపులా నాలుగు స్తంభాల మీద బరువును మోపి కట్టబడినాయి. ద్వారం దగ్గర విష్ణువు విగ్రహం మలచబడి వుంది.

తేలి-కా-మందిర్ కోట ముందు ఎదురుగా సూరజ్‌కుండు సరస్సు అవతల నిర్మించబడిన దేవాలయం. బహుశా 9 వ శతాబ్దానికి చెంది ఉండవచ్చు. ఒక ప్రత్యేక తరహాలో ద్రావిడ శిల్పనిర్మాణాన్ని అనుసరించి పై కప్పు, ఆర్య శిల్ప రీతుల్లో విగ్రహాలు యితర కట్టుబడి అంతా జరిగింది స్పష్టంగా చూడవచ్చు. 10 మీటర్ల ఎత్తుగా వున్న ద్వారం మీద గరుడ వాహనం అమరి వుంది. ఈ కోట మొత్తం మీద ఎత్తయిన నిర్మాణం ఇదే అని చెప్పవచ్చు.

నైఋతి ద్వారంలోగుండా వెళితే- జైన విగ్రహాలు వరుసగా దర్శనమిస్తాయి. సుమారు క్రీ. శ. 1400 సం. పూర్వమే నిర్మించబడి ఉండవచ్చు. వాటిలో కొన్ని చాల పెద్ద విగ్రహాలున్నాయి. కొన్నిటిని బాబరు సైన్యాలు 1527లో ధ్వంసం చేస్తే మరల మరమ్మత్తు చేయబడ్డాయి. వీటికి నంబర్లున్నాయి- 5 సమూహాలుగా పేర్కొన బడ్డాయి. వాటిలో అర్వాహి సముదాయంలోని 17 మీటర్ల ఎత్తుగల ఆదినాథుని విగ్రహం, ఆసీనుడైయున్న 10 అడుగుల నేమనాథుని విగ్రహం పెద్దవిగా చెప్పుకో తగినవి.

### జయవిలాస ప్రాసాదం :

గ్వాలియర్ న్యూ టౌన్‌తో 1809 సంవత్సరం ప్రాంతంలో నిర్మాణం జరి గింది. ఇదే సింధియా రాజుల రాజభవనం. గ్వాలియర్ మహారాజ వంశానికి చెందిన వారు ఇంకా అక్కడే నివాసముంటున్నా చాలాభాగం మ్యూజియంగా వాడబడుతోంది. రాజరీవిని వెలార్చుతూ బెల్జియం కట్‌గ్లాస్ పర్నిచరు, వేటాడి చంపిన వ్యాఘ్రపు

చర్మాలు మస్తుగా ఉన్నాయి. శృంగార నాయికా శిల్పం చలువరాతిలో చెక్కబడింది. ఆమె చేతిలో ఒక హంస, ఎన్నో శృంగారోద్దీపితమైన చిత్రాలు, శిల్పాలుతో నిండివున్నదొక గది. ఒక చక్కని రైలు నమూనాలో బ్రాందీ మొదలగు మత్తు పానీయాలు, సిగార్సు అమర్చినది డైనింగ్ టేబిల్ చుట్టూతా అమర్చబడింది ఉన్నది. చూడమచ్చటయింది. మ్యూజియం విభాగం సోమ వారాలు తప్ప ఇతర రోజుల్లో 10 గం. నుండి 5 గం. వరకు దర్శనీయం. ఈ భవనంతోపాటు మోతీ మహల్ అనే మరో భవనంకూడా దగ్గరలోనే వున్నది.

గ్వాలియర్ పాత పట్టణంలో 1661 సంవత్సరంలో నిర్మించబడిన అందమైన కట్టడం జామి మసీదు. మహమ్మద్ ఘవుస్ సమాధి చాల పెద్దది తూర్పువైపున ఉన్నది. మహమ్మద్ ఘవుస్ గ్వాలియర్‌కోట బాబరువశం కావటానికి చాల కీలక పాత్ర నిర్వహించిన వారట. నాలుగు వైపుల షడ్భుజాకారంలోగల స్థంభాలున్నాయి. తొలి మొగలాయి సాంప్రదాయ కట్టడాలకు ప్రతీక. దగ్గరిలోనే అమర గాయకుడు తాన్‌సేన్ సమాధికూడా అమరియుంది. ఇక్కడవున్న చింత చెట్టు చిగురు గాయకుల స్వరానికి మాధుర్యమును అనుమతించేదిగా వుందని గాఢమైన నమ్మిక. ఇప్పటికీ కొంతమంది గాయక సార్వభౌములు ఇక్కడికివచ్చి ఈ చింతాకు భక్షణం చేస్తుంటారట తమ స్వరమాధుర్యం పెరుగుతుందనే విశ్వాసంతో. ఈయన మహా చక్రవర్తి అక్బర్ కాలంలోనివారు.

**సామాన్యులకు :**

గ్వాలియర్‌లో వుండటానికి స్టేషను దిగంగానే హోటల్ అశోక్ అందరికీ అందుబాటులో ఉన్నది. లష్కర్‌లో ఉన్న హోటల్ హోమ్‌సన్సు చౌకలో రూములున్నాయి.

మరికొంచం దూరంలో కొంచెం అధికధరలో హోటల్ ఇండియా, గవర్నమెంటువారి తాన్‌సేన్ హోటల్ సౌకర్యంగా ఉంటాయి.

హోటల్ గుజారిమహల్, రీగల్ హోటల్ మొదలయినవి లష్కర్ ప్రాంతంలో ఉన్నాయి.

**శ్రీమంతులకు :**

వెల్‌కం గ్రూపుకి చెందిన ఉషాకిరణ్ ప్యాలెస్, హోటల్ వివేక్ కాంటినెంటల్, హోటల్ ప్రెసిడెంటు, హోటల్ సఫారి మొదలయినవి.

ఢిల్లీ-బొంబాయి రైల్వే మెయిన్ లైనులో గ్వాలియర్ ఉంది. ఢిల్లీ నుంచి 317 కి. మీ., 118 కి. మీ. ఆగ్రానుండి, బొంబాయినుండి మొత్తం 1225 కి. మీ టర్లుంది.

రోడ్డుమార్గం :

గ్వాలియర్ నుండి ఢిల్లీ, ఆగ్రా, ఇండోర్, ఉజ్జయిని, భోపాల్, జబల్‌పూర్, ఖజురాహోలకు, దగ్గరిలో ఉన్న శివపురి వంటి వాటికి బస్సులు ప్రతినిత్యం ఉన్నాయి.

నగరవిహారానికి టాక్సీలు, ఆటో రిక్షాలు, సైకిల్ రిక్షాలు, టెంపోలు అనేకం వున్నాయి.

గ్వాలియర్ పరిసరాల్లో :

ముచికుంద తీర్థం :

గ్వాలియర్ నుండి ధోల్‌పూర్ జంక్షనులో దిగితే సుమారు 5 కి. మీటర్ల దూరంలో ముచికుంద తీర్థముంది. స్టేషన్ దగ్గర ధర్మసత్రాలు, బండ్లు వసతులున్నాయి.

ముచికుందుడు ఇక్ష్వాకు చక్రవర్తి. ఆయన ఇక్కడ ఇదే గుహలో కఠోరమైన తపస్సు చేశాడు. ఆ సమయంలో కాలయ యవనుడనే రాక్షసుని సంహరించటానికి యుక్తిగా ఈ గుహయందు ప్రవేశించే విధంగా తరిమాడు. కాలయవనుడు ఈ గుహలో దూరేసరికి ముచికుందుని తపస్సు భగ్నమయి పోయింది. తపోభంగమయిన ముచికుందుడు శపించాడు. శాపాగ్ని కాలయవనుని భస్మంచేసింది. ఈ విధంగా లోక కంటకుడైన రాక్షసుని పీడవదిలింది, ముచికుందుడు చిరంజీవి. ఇది భాగవత కథా విశేషం. భాద్రపద మాసంలో గొప్ప ఉత్సవం కూడ జరుగుతోంది.

గ్వాలియర్ ఆగ్రామధ్యన రాజస్థాన్ తాలూకు ఒక చిన్న మొకిరవుంది. ఈ మొకిర దగ్గరనే ఉత్తరప్రదేశ్‌నించి మధ్యప్రదేశ్ విడివడేది. అదే ధోల్‌పూర్-ముచికుంద తీర్థానికి వెళ్ళేముందే ఔరంగజేబు కుమారులు ఘోరమైన యుద్ధానికి పాల్పడ్డారు, సింహాసనం మీద అధికృతకోసం - మొగల్ సామ్రాజ్య పతనానికి దగ్గిర

పడినప్పుడు. ధోల్‌పూర్ షేర్‌గర్ అనే శిథిలమైన కోట, ఒకటిప్పంది. బాలివద్ద ఖాన్‌పూర్ మహల్ అనే ఒక పెద్ద భవనం షాజహాన్ కోసం కట్టించబడింది చూడ వచ్చు. కాని పాపం షాజహాను చక్రవర్తి ఇందులో కాలుకూడ పెట్టలేదు అదేం చిత్రమో మరి i కారణలెన్నైనా వుండొచ్చు.

శివపురి :

వేసవి విశ్రాంతి కేంద్రం. గ్వాలియర్‌కు నైఋతి దిశగా 117 కి. మీ. దూరంలో ఉంది. ఝాన్సీకి 51 కి. మీ. దూరం. మార్గం అరణ్యాల్లోగుండా వెళుతుంది. రోడ్డుమీద కొన్ని వన్యమృగాలు కూడా సాక్షాత్కరిస్తాయి. శివపురి దగ్గర ఒక అందాలసరస్సున్నది. సరస్సు తీరంలో చుట్టూ చక్కని ఉద్యాన వనాలు న్నాయి. మధ్యలో నర్వారు దగ్గర ఒక పెద్ద కోటను కూడా చూడవచ్చు.

వుండటానికి చింకారా మోటెల్, వూరిమధ్యలో హరిష్ లాడ్జి చక్కటి వసతి సౌకర్యంతో అందరికీ అందు బాటులో ఉన్నాయి.

ఝాన్సీవైపు వెళితే రైలులో 61 కి. మీ. దూరంలో ఒక పెద్ద గుట్ట-ఆ గుట్ట మీద తెల్లటి జైన దేవాలయాల సముదాయం కనబడుతుంది. సోనాగిరి రైల్వే స్టేషను అతి సమీపమైనది.

ఝాన్సీకి ఉత్తరాన ఉంది దాతియా. అక్కడ ఉంది రాజా బీర్‌సింగ్‌దేవ్ ప్రాసాదం ఏడంతస్తుల భవనం ఎవరూ లేక పాడుబడి పోయింది కనబడుతుంది. ఊరిచుట్టూ గోడ కట్టబడి వుంది. వూరికి పడమరన అమరివున్నదీ భవనరాజం.

ఛందేరి :

అనగానే ఛందేరి నగిషీల చీరలు జ్ఞాపకానికి వస్తాయి. ఒకానొకప్పుడు మాండు ఒక బలవంతమయిన రాజ్యంగా ఉన్నప్పుడు ఛందేరి ఒక ముఖ్యకేంద్రం. మహాభారత ఇతిహాస కాలంలో చేది దేశం శిశుపాలుని నగరంగా పేర్కొనబడింది. మహాభారతంలో శిశుపాలుని పాత్ర మన కందరికీ పరిచితమే. ఇక్కడ అనేక శిథిల భవనాలు, సరాయిలు, మసీదులు, సమాధులు, దర్గాలు మాండు శైలిలో పఠాన్ రీతిలో నిర్మించబడ్డాయి. మసీదు కోషక్ మహల్ జీర్ణావస్థలో ఉన్నదానిని చూడ గలం.

వుండటానికి బస్సుస్టాండు దగ్గర సర్క్యూట్ హౌస్, రెస్ట్ హౌస్ ఉన్నాయి.

ఝాన్సీ :

పేరు చెప్పంగానే భారత స్వాతంత్ర్య ప్రథమ ఘట్టంలో వీర మరణం చెంది అమరురాలై చరిత్రలో చిరస్మరణీయ స్థానాన్ని పొందిన ఝాన్సి-కి-రాణి తళుక్కున మనసులో మెరిసి గగుర్పాటు కలిగిస్తుంది.

ఝాన్సీ పట్టణం :

జనాభా సుమారు 2,25,000 మంది. గ్వాలియర్‌కు దక్షిణంగా 101 కి.మీ. దూరంలో ఉత్తర ప్రదేశ్‌లో చేరింది. ఖజిరహో వెళ్ళటానికి ఝాన్సీద్వారా వెళ్ళాల్సి వుంటుంది. ఢిల్లీకి అతి సమీపంలోవుంది.

ఓర్చ ఝాన్సీకి 11 కి. మీ. దూరం మాత్రమే వుంది. 1605 నుండి 1627 వరకు ఓర్చ ముఖ్య పట్టణంగా రాజా బీర్‌సింగ్‌దేవ్ ఈ ప్రదేశాన్ని పరిపాలించాడు. ఆ సమయంలో ఝాన్సీ కోట కట్టటం జరిగింది. మొగల్ చక్రవర్తి సలీమ్ అక్బరుతో విభేదించి కయ్యం పెట్టుకున్నాడు. అక్బరు సైన్యాలు ఈ రాజ్యాన్ని చాలా వరకు నాశనం చేశాయి. 1605-27 వరకు బీర్‌సింగ్‌దేవ్ శక్తివంతంగా పరిపాలించాడు. 1627 లో షాజహాన్ చక్రవర్తి సింహాసనాన్ని అధిష్టించాడు. మరల రాజ్యం చిక్కుల్లో పడింది. తిరుగుబాటును ప్రదర్శించిన బీర్‌సింగ్‌ని 13 సంవత్సరాల ఔరంగజేబు అణిచివేశాడు. 18వ శతాబ్దంలో మరల ఓర్చాని కలుపుకుని మరొకసారి గర్వంగా తలెత్తింది. 1803 బ్రిటిషువారి ఈస్టిండియా కాలుపెట్టిన సంవత్సరం. క్రమేణా రాజ్యం మొత్తం వారి హస్తాల్లోకి జారిపోయింది. 1853లో ఝాన్సీ రాజ్యానికి వారసులు ఎవరూలేరు. ఈ సమయంలోనే సిపాయిల తిరుగుబాటులో ముఖ్యపాత్ర వహించిన ఒకానొక కారణం 'రాజ సంక్రమణ సిద్ధాంతం' చట్టం అమలులో పెట్టింది - బ్రిటిషు పాలక సంస్థ. దీనితో వారసులు లేనటువంటి రాజ్యాలు మొత్తం బ్రిటిషు సామ్రాజ్యంలో భాగమైపోతాయి. దత్తస్వీకారం కుదరదంది బ్రిటిషు వారి చట్టం. ఈ సమయంలో క్రుద్ధురాలైన ఝాన్సీరాణి తనకుతానుగా రాజ్యపాలన చేయాలని సమకట్టటం అనేక వివాదాలకు దారితీసింది. నాలుగు సంవత్సరాల్లో సిపాయిల తిరుగుబాటు తలెత్తింది. ఝాన్సీలోగల బ్రిటిషువారిని ఊచకోత కోసింది. కాని తరువాతి సంవత్సరమే స్వదేశీయులు వారిలో రేగిన కలహాలు అంతర్గత విభేదాలు కారణంగా బ్రిటిషువారిదే పైచేయి అయి ఝాన్సీని మరల వారివశం చేసుకోగలిగారు. ఒంటరిదైన జాన్సీరాణి గ్వాలియర్‌కు పలాయనమయి అక్కడినుండి పురుష వేషంలో

వీరోచితంగా పోరాడి మరణించింది. భారత స్వాతంత్ర్య చరిత్రలో స్వతంత్ర పోరాటపు ప్రథమ ఘట్టానికి నాయకత్వం వహించి అతి ముఖ్యమయిన పాత్రవహించినదిగా ఆమెకు సుస్థిరస్థానం కల్పించబడింది. మధ్య భారతంలో 'జోన్ ఆఫ్ ఆర్క్'గా కీర్తించబడింది.

బ్రిటిషువారు 1858లో కోటను తమకు విధేయులైన సిపాయిల కలహాన్ని అణచటానికి తోడుపడిన సింధియా రాజుల చేతుల్లో పెట్టింది. తరువాత 1886లో గ్వాలియర్ కోటకు మార్పిడి చేసింది.

ఇక్కడి నుండి ఖజురహోకి బస్సులు ప్రభాతవేళ బయల్దేరి వెళ్తుంటాయి. వుండటానికి రైల్వే రిటయిరింగు రూములు, సెంట్రల్ హోటల్, హోటల్ సిటి, నటరాజ సినిమాహాలు దగ్గరగల హోటల్ అశోక్, శాస్త్రి మార్గ్‌లోగల 'ఝాన్సీ హోటల్' (కొంచెం ఖరీదు జాస్తి) వున్నాయి.

ఝాన్సీ రాజ్యానికి అతి సన్నిహిత సంబంధాలున్న ఓర్ఛా పట్టణాన్ని కూడా చూద్దాం.

ఇక్కడికి కేవలం 11 కి.మీ. దూరంలో అతి చేరువలోనేనున్న ఓర్ఛాకోట దర్శనీయం. బెత్వానదీ మధ్యలోగల ఒక సమున్నతమైన లంకలో నిర్మించబడింది. ఇప్పటికీ బీర్‌సింగ్‌దేవ్ భవనం చూడ చక్కగా వుంటుంది. మరో భవనం జహంగీర్ మహల్- జహంగీర్ కోసం ప్రత్యేకంగా కట్టించబడింది. అయితే ఎప్పుడూ జహంగీర్ ఇందులో ప్రవేశించను కూడా లేదు. పైనుంచి గ్రామీణ అందాలను తిలకించవచ్చు. శిధిలాలు పూర్వపు శోభను గుర్తుకు తెచ్చేవిగా దర్శన మిస్తుంటాయి. రాజులు, రాజ్యాలు కాలయవనికలో తెరమరుగయినా అనేక విశేషాలు తమలో దాచుకుని కమ్మని కథలుగా, చారిత్రక విశేషాంశాలతో దర్శనమిచ్చే మానవ చరిత్రకు గీటురాళ్ళుగా పురాతన కట్టడాలు యింకా నిలిచి వున్నాయి ఎన్నో. ఎన్నెన్నో! వాటిలో ఓర్ఛా ఒక మణిపూసగా చెప్పుకోవచ్చు.

ఈ మధ్యప్రదేశంలో యింకా చూడదగిన సాంస్కృతిక విశేషాలుగా ఎన్నో వున్నాయి. వాటిలో ముఖ్యంగా పురాణ కాలంనాటి గుర్తులు యింకా తమతోనే నిక్షిప్తంగా భద్రపరచిన ప్రదేశాలుగా ఈ క్రిందివానిని పేర్కొనవచ్చు.

పంచమర్హి :

ఇటార్సీ- జబల్‌పూర్ లైనులో సముద్రమట్టానికి 1100 మీటర్ల ఎత్తులో మధ్యప్రదేశ్ పర్వత విశ్రాంతి కేంద్రం. వేసవి విడిదిగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడికి దగ్గరిలో పాండవులు నివసించిన గుహలున్నాయి. 2 కి.మీ. దూరంలో గల మహా దేవాలయము దర్శనీయం. శివరాత్రికి ఉత్సవం జరుగుతుంది. వేలకొలది యాత్రికులు వస్తారు.

సాగర్ :

సాగర్ యూనివర్శిటీ జాతీయంగా ప్రసిద్ధి చెందిన విశ్వవిద్యాలయం. సాగర్ అనే సరస్సు తీరంలో నిర్మించబడింది. సముద్ర మట్టానికి 700 మీటర్ల ఎత్తులో నుండి ఆహ్లాదకరమైన వాతావరణంతో హాయి గొల్పుతూ వుంది. ఇక్కడే మహా రాష్ట్రిలకోట గూడ ఉంది. విశ్వవిద్యాలయ నిర్మాత శ్రీ నరసింహగేర్. ఇక్కడ పోలీస్ ట్రయినింగ్ స్కూలు కూడా ఉన్నది.

విరాట్‌పూర్ :

పాండవులు 11 సం, అరణ్యవాసం తరువాత నియమానుసారంగా ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయవలసివుంది. ఆనాడు తమకు మిత్రరాజైన విరాటరాజు కొలువులో వివిధ నామాలతో ఆశ్రయం పొంది తమ అజ్ఞాతవాస దీక్షను విజయవంతంగా ముగించిన ప్రదేశం ఇక్కడే. ప్రస్తుతం ఈ ప్రదేశం సోహాగ్‌పూర్ అనే పేరుతో వ్యవహరించ బడుతుంది. ఇక్కడ ఉన్నటువంటి బాణగంగ, కొచ్చికాలయం పాండవులు తమ ఆయుధాలను దాచిపెట్టిన శమీవృక్షం దర్శనీయం. నవరాత్రుల్లో బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. చేరువలో ఉన్న అరణ్యాలనుండి అనేక అటవీ ఉత్పత్తుల వ్యాపారం జోరుగా సాగుతుంది. బొగ్గు విశేషంగా దొరుకుతుంది. గ్రహణ సమయాల్లో బాణగంగ దగ్గర జరిగే ఉత్సవాలు అనేకం- చిత్రాతి చిత్రం గూడ.

అమర కంటక్ :

దీనికి మరోపేరు రత్నపూర్. మక్కాల్ పర్వతాల్లో నర్మదానది జన్మస్థలం. ఇక్కడ నర్మదతోపాటుగా ఝుహిలా, సోన్ నదులకు కూడా ఈ అమరకంటక్ పర్వతమే జన్మస్థలం.

వసతికి పండాల గృహాలు మాత్రం లభ్యం. ఇక్కడికి దగ్గరలో చూడదగినవి నర్మదాకుండ్, నర్మదానది పుట్టుక స్థానం. T.B. రిహాబిలిటేషన్ సెంటరు కూడా.

కపిలధార :

పర్వతంమీద 2 మైళ్ళు దూరంలో ఉన్నది. యాత్రికులు స్నానం చేస్తారు. మహాకవి కాళిదాసుని అమరకావ్యం మేఘసందేశం రచన ఇక్కడి నుండియే సాగించారని ప్రతీతి.

గాయత్రి కుండు :

గాయత్రి మంత్ర పునశ్చరణ, ఆవాహనాదులకు సిద్ధిప్రదమైన స్థలం. రావణ బ్రహ్మ చాలకాలం ఇక్కడ వుండి తపస్సు చేశాడట.

అమర్‌నాధ్ మహాదేవు మందిర్ - పాండవాగ్రజుడు ధర్మరాజుచే ప్రతిష్ఠించనట్లుగా ప్రతీతి. రేవారాజుల అధీనంలో ఉన్నది.

ఇంకా మాండ్లాకోట, అడవులు, నర్మదానదీ తీరంగలోగల అనేక దేవాలయాల సమూహంలోవున్న ఓంకార మాంధాత, కన్హానేషనల్ పార్కు, బస్తర్‌జిల్లాలో ఆదిమ గిరిజనజాతుల నివాసంలో కళకళలాడే ప్రదేశాల్లో అమేన ఝరివేగంతో ప్రత్యుష్ణంగా నయన మనోహరంగా, మనోహ్లాదాన్ని కూర్చే చిత్రకూట జలపాతం, రత్నపూర్‌కి 25 కి.మీ. దూరంలోగల బిలాస్‌పూర్, ఒకనాటి ఛత్తీస్‌ఘర్ '36 కోటలరాజ్యము'గా ప్రసిద్ధి చెందిన దాని రాజధానీ నగరం, మొగలు రాజులకు - రాజపుత్ర వీరుల యుద్ధ వేదికగా ప్రసిద్ధిచెందిన మండ్‌సౌర్ దగ్గరలోని రత్లామ్ పట్టణం అనేక పురాతత్వ విశేషాల్తో అలరారుతున్న మందసౌర్ పట్టణం— ఇక్కడ 14 మీటర్ల ఎత్తుగావున్న క్రీ.శ. 528 సం॥లో హూణుల దండయాత్రలను విజయవంతంగా ఎదుర్కొన్న దానికి చిహ్నంగా నిర్మించిన జయశాసన స్తంభం, మ్యూజియంలోగల విశేషాల్లో గుప్తుల కాలంనాటి విశేషాలు ఎన్నో చూడదగినవి. ఇంకా బిలాయి ఉక్కు కర్మాగారం- మధ్యప్రదేశ్ ముఖ్య పట్టణం.

## భోపాల్‌లోని వసతి సౌకర్యాలు

ధర్మ సత్రాలు :

1. శ్రీ గణేశ్‌రామ్ గోయెల్ ధర్మశాల
   సుభాష్ రోడ్డు. రు. 2/- మనిషికి.

2. అగర్వాల్ బిస్‌రామ్‌జీ ధర్మశాల
జమేరాతి గేట్. రు. 1/- మనిషికి.

3. అరట్‌లామ్ సింధి ధర్మశాల
బేరాసియా రోడ్డు.

4. జైన్ ధర్మశాల, 5. మహావీర్ ధర్మశాల,

6. నీమ్ సరాయి, సరాయి సికందరి.

7. శ్రీరామ్ జైస్వాల్ ధర్మశాల, ఘోరనికాస్ దగ్గర.

**ఇతర వసతులు :**

సర్క్యూట్ హౌస్, ఫోన్: 3028, 3525, రిజర్వేషనులు: హాస్పిటాలిటీ ఆఫీసరు, వల్లభ భవన్, భోపాల్.

న్యూ రెస్ట్ హౌస్, నార్త్ టి.టి.నగర్ ఫోన్: 62489, రిజర్వేషనులు: సబ్ డివిజనల్ ఆఫీసరు, (B&R) PWD, భోపాల్.

యూత్‌హాస్టలు: నార్త్ టి.టి.నగర్, ఫోన్: 63671, రిజర్వేషనులు: వార్డెన్.

మామూలుగా రైలు ప్రయాణికులకు పరిమితమయిన రైల్వే రిటయిరింగ్ రూములు స్టేషను మాస్టరువద్ద రిజర్వేషను పొందవచ్చును.

**వెస్టరన్ స్టైలు హోటలు :**

హోటల్ రామ్‌సన్ ఇంటర్నేషనల్, హమీదియా రోడ్డు,

ఫోను : 2298, 2299.

గ్రామ్స్ : **SEHIBROS.**

**ఇతర హోటళ్ళు :**

హోటల్ ఇంపీరియల్ సాబ్రె, పాలెస్ గ్రౌండ్సు.

హమీదియా రోడ్డునందు గలవి :

పగోడా హోటల్, ఫోన్ : 3949, రాజ్ దూర్ హోటల్, ఫోన్ : 279,
అశోకా హోటల్, ఫోన్ : 3331, జ్యోతి హోటల్, ఫోన్ : 2275,
గ్రాండ్ హోటల్, ఫోన్ : 4070, హోటల్ రంజిత్, ఫోన్ : 3641.
వగైరాలు.

షిరాజ్ హోటల్, ఎడ్యుకేషన్ ఆఫీసు, ఫోన్ : 62543.
విజయ హోటల్, స్టేషను రోడ్డు,
నలందా హోటల్, ఇబ్రహీంపురా, ఫోన్ : 3435
డీలక్స్ హోటల్, కాపిటల్ హోటల్, సత్కార్ లాడ్జి వగైరాలు.
శ్రీమంతులకు ప్రత్యేకం - హోటల్ రామ్‌సన్స్ ఇంటర్నేషనల్
ఫోన్ : 72298 (9)

జహాన్యూమా ప్యాలెస్ (JEHAN NUMA PALACE)
శ్యామలా హిల్స్‌లోనిది,

హోటల్ పంచానన్ (ఫోన్ : 63047) న్యూ మార్కెట్‌లోపల.
మొదలయినవి అనువుగా వుంటాయి.

భోపాల్ నుండి వివిధ రోడ్డు మార్గాలు :

| భోపాల్ నుండి | దూరం | మజిలీలు లేక స్టాపింగులు |
|---|---|---|
| ఆగ్రా – | 540 కి.మీ. | బియోరా–116, గునా–97, శివపురి–98, గ్వాలియర్–114, ఆగ్రా–119. |
| బొంబాయి – | 789 " | డివాస్–152, ఇండోర్ – 35, దూలియా–261, నాసిక్–156, బొంబాయి–185. |

| | | |
|---|---|---|
| ఢిల్లీ - | 746 కి.మీ. | బియో-116, గునా-97, శివపురి-96, గ్వాలియర్-114, ఆగ్రా-119, ఢిల్లీ - 204. |
| ఇండోర్ - | 187 " | దివాస్-152, ఇండోర్-35. |
| కన్హా నేషనల్ పార్కు - | 540 " | సాగర్-187, జబల్పూర్-178, మాండ్లా-96, కన్హా-79. |
| ఖజురాహో - | 387 " | సాగర్-187, ఛాత్రపూర్-153, ఖజురాహో-47. |
| మాండు - | 290 " | దివాస్-152, ఇండోర్-35, ధార్-64, మాండు-39. |
| పంచమర్హి - | 210 " | హోషంగాబాదు-86, పిపారియా-72, పంచమర్హి-52. |
| సాంచి - | 68 " | రాయ్సేన్-44, సాంచి-24. |
| ఉజ్జయిన్ - | 189 " | దివాస్-152, ఉజ్జయిన్-37. |

# ఉత్తర ప్రదేశ్

ఋగ్వేదం వేదాల్లో అతి ప్రాచీన మయినది. అయితే ఋగ్వేదంలో ఈ ప్రాంత ప్రసక్తి కానరాదు. వేదాలు అపేరు షేయాలుగాను, సృష్టికర్త బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుండీ ఉద్భవించాయని పెద్దల ఉవాచ. మానవ నాగరికతలో మత ప్రాధాన్యం ముఖ్యపాత్ర వహించిన నాటినుండీ ఆర్యుల ఆధ్యాత్మిక, చారిత్రక సంస్కృత సాంప్రదాయాలు, విద్య, విజ్ఞానాలు ఈ ప్రదేశంలోనే పుట్టి ఉజ్వల శోభతో వెలిగి విస్తరిల్లాయి– జ్ఞాన ప్రపంచంలో చిరస్థాయిగా నిల్చి పోయాయి గణనీయంగా కొనియాడ బడినాయి

ఆర్యుల అనాది నాగరికతా విశేషాలు, వారిజ్ఞాన నిర్దేశకులు, ఆధ్యాత్మిక తత్త్వ వేత్తలు, విజ్ఞాన భాండాగారాలుగా పేర్కొన తగిన మహామౌని శ్రేష్ఠులు– సంస్కృత వాఙ్మయాన జాతి జీవన సూత్రాల నిర్దేశనాలు నిక్షిప్తంచేసి నరనరాన ప్రతి అణువు రక్తంలోను ప్రతిఫలింప చేసిన రామాయణ, మహాభారత పురాణేతిహాసాల దివ్య పురుషుల ఆవాసం ఈ ప్రదేశాల్లోనే జరగటం విశేషం. సుజల పూర్ణమయిన పవిత్ర నదులు గంగా, యమున, సరయూ, గోమతి, తపతి, గండకి, వేత్రవతి (బెత్వా) ఈ రాష్ట్రంగుండా ప్రవహిస్తూ, ఎన్నో పవిత్ర స్థలాలను అను సంధిస్తూ హైందవ నాగరికతా వారసత్వపు స్రవంతీ వాహికలుగా ప్రవహిస్తున్నాయి– గనుక ఈ మట్టి పవిత్రం, గాలి పవిత్రం– నీరూ– పవిత్రం. పుణ్యప్రదమైనాయి. అడుగడుగునా చారిత్రిక విశేషాల్తో శోభాయమనంగా వెలిగిన పురాణ పురుషులకు ఆలవాలమైన ఈ ప్రదేశం భారతదేశ చరిత్రలోనేకాదు.. ఈ గడ్డమీద ప్రతిజీవి అణువణువునా ప్రతిఫ

లించే అనేక భిన్నత్వాలను ఏర్చి, కూర్చి ఒకేదారంతో బంధించబడిన మణిహారంగా చెప్పుకోవచ్చు. దేశమాత రూపులో ముఖమండలంగా భాసించే ఈ రాష్ట్రం మన దేహంలో జ్ఞానేంద్రియాల కర్తవ్యం దేశంలో ఈ ప్రదేశం నిర్వహించిదంటే నిర్వివాదంగా ఒప్పుకోవలసిన సంగతి.

రామాయణ మహాకావ్య నిర్మాత వాల్మీకి మహాముని, ఆర్ష విజ్ఞానానికి పట్టుగొమ్మలయిన భరద్వాజుడు, యాజ్ఞవల్క్యుడు, వశిష్ఠ, విశ్వామిత్ర బ్రహ్మర్షులు ఇక్కడే ప్రభవించారు. బ్రహ్మర్షుల పుట్టినిల్లుగా, మధ్య ప్రదేశంగా విశేష ప్రాచుర్యాన్ని పొందిన వైనం ఎంత వ్రాసినా లోపరిగానే కనబడుతుంది. పురాణ కావ్యాల రచన మాత్రమేగాక వాటి ఆవాహాల ముఖ్య కేంద్రంగా ఉత్తర ప్రదేశ్‌లోని ప్రాంతాలు సుపరిచితం. రామాయణ చరిత్రకు కోసలరాజ్యం, మహాభారతేతి హాసమునకు హస్తినాపురం, మథుర ఈ రాష్ట్రంలోనే ఉన్న పవిత్రస్థలాలు. వేద వాఙ్మయంలో పుట్టి పెరిగిన హైందవమతం, జీవకారుణ్యానికి ఊపిరిపోసి మహత్వపూర్ణమైన మానవతను - అహింసను ప్రబోధించిన బౌద్ధమతానికి ప్రధాన వేదికగా పరిఢవిల్లిన ఈ రాష్ట్రంలోని అనేక పుణ్యస్థలాలు ఉజ్జ్వల ప్రాచీన శోభను నాటికీ నేటికీ వారధిగా నిల్చిన రాష్ట్ర ప్రత్యేకతలను పూర్వ చరిత్రను సింహావలోకనంగా సంగ్రహంగా అందిస్తున్నాం.

రాష్ట్ర వైశాల్యం : 2,94,411 చ.కి.మీ.
రాష్ట్ర రాజధాని : లక్నో నగరం,
జనాభా : 10,09,00,000 సుమారు.
జన సమ్మర్దత : చ.కి.మీ.కి. 377 మంది.
మాట్లాడేభాష : హిందీ
అక్షరాస్యత : 27. 88%.
ముఖ్య జీవనోపాధి : వ్యవసాయం.
రాజకీయంగా : అసెంబ్లీ స్థానాలు—426.
లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలు రెండు సభలున్నాయి.
స్త్రీ పురుష నిష్పత్తి : 885 : 100*

దేశం మొత్తంమీద అత్యధిక జనాభాగల రాష్ట్రం - జనాభాలో మొదటిస్థానం ఆక్రమిస్తుంది. వైశాల్యంలో నాలుగవ స్థానాన్ని ఆక్రమించే ఈ రాష్ట్రం దేశంలో 8వ వంతు స్థలాన్ని ఆక్రమిస్తుంది.

నైసర్గికంగా :

ఉత్తరాన టిబెట్టు, నేపాలు దేశాలు. వాయువ్య దిశన హిమాచల ప్రదేశ్. పడమరన హర్యానా, నైఋతి దిశన రాజస్థాన్, ఆగ్నేయదిశన-దక్షిణాగ్రాన మధ్య ప్రదేశ్, తూర్పున బీహార్ రాష్ట్రం. సరిహద్దులుగా ఆవరించబడియున్న ఇతర రాష్ట్రాలు.

భౌగోళికంగా :

ఉత్తరప్రదేశాన్ని మూడు ముఖ్య విభాగాలుగా విభజించవచ్చు.

1) ఉత్తర పర్వత భూభాగం 2) దక్షిణ పర్వతాలు-పీఠభూమి 3) గంగా మైదానం పరిపాలనా సౌలభ్యానికిగాను రాష్ట్రం మొత్తం 57 జిల్లాలుగా విభజించబడి నది. అవి— ఆగ్రా, అలీఘర్ అలహాబాదు, ఆల్మోరా, అజాంఘర్, బహ్రాయిచ్, బాల్లియా, బాందా, బారాబంకి, బరేలీ, బస్తి, బిజనోర్, బుదావున్, బులంద్ షహర్, ఛమోలీ, డెహ్రాడూన్, ఈటా, ఇటావా, ఫైజాబాదు, ఫరూకాబాద్, ఫతేపూర్, గర్వాల్, ఘజియాపూర్, ఘజియాబాద్, గోండా, గోరఖ్‌పూర్, హమీర్‌పూర్, హర్డోయి, జలావున్, జాన్‌పూర్, ఝాన్సి, కాన్పూర్(రూరల్), కాన్పూర్(అర్బన్) ఖేరి, లలిత్‌పూర్, లక్నో, మాయిన్‌పురి, మధుర, మీరట్, మీర్జాపూర్, మొరాదాబాద్, ముజఫర్‌నగర్, నైనితాల్, పిలిభిత్, పిథోర్‌ఘర్, ప్రతాప్‌ఘర్, రాయ్‌బరేలీ, రామ్‌పూర్, సహరాన్‌పూర్, షాజహాన్‌పూర్, సీతాపూర్, సుల్తాన్‌పూర్, టెహ్రిఘర్‌వాల్, ఉన్నావ్, ఉత్తరకాశి, వారణాసి.

మూడు భౌగోళిక విభాగాల్లో-

1) ఉత్తుంగ హిమాలయాల ప్రాంతంలో ఉత్తరకాశి, ఛమోలి, పిథోర్‌ఘర్, టెహరిఘర్‌వాల్, గర్వాల్, ఆల్మోరా జిల్లాలు, నైనితాల్ తహసీల్, చక్రతా తహసీల్ డెహ్రాడూన్ జిల్లాలోని డెహ్రాడూన్ తహసీల్ భాగం, మొత్తం రాష్ట్రంలో ఆరో వంతు చదరాన్ని ఒక భాగంగాను,

2) ఝాన్సి, జలావున్, హమీర్‌పూర్, బాందా జిల్లాలు, అలహాబాదు జిల్లాలోని మేజా, కర్చ్‌హానీ తహసీళ్ళు, దాదాపు మీర్జాపూర్ జిల్లా మొత్తం, గంగానది దక్షిణ భాగం, వారణాసి జిల్లాలోని ఛకియా తహసీల్. ఈ ప్రదేశం అంతా పర్వతాలు, పీఠభూమి సముద్ర మట్టానికి 300 మీటర్ల లోతున వుండే ఎత్తు ప్రదేశం.

3) ఉత్తరాన గల హిమాలయ పర్వతాలు—దక్షిణానగల ఎత్తయిన పీఠ భూమి, పర్వతాలు మధ్య బ్రహ్మాండమైన సారవంతపు ఒండ్రుమట్టి మైదానం— బహుశా ప్రపంచంలోకెల్లా విశాలమైనదిగా పేర్కొనబడింది. లోతుగా ఏర్పడిన ఒండ్రుమట్టిపొర ఖనిజహీనంగా ఉండటంవల్ల ఉత్తరప్రదేశ్ పారిశ్రామికంగా అంత బలంగా లేదని చెప్పవచ్చు. అయితే మహా సారవంతమైన ప్రదేశం అయినందున అత్యధిక జనాభా వత్తిడిగల ప్రదేశంగా తయారయింది.

రాష్ట్రం ఉష్ణ సంబంధ వాతావరణం. హిమాలయాలు మాత్రం చలి ప్రదేశాలుగా ఉంటున్నవి.

రాష్ట్ర ఆర్థిక విధానంలో వ్యవసాయం ముఖ్య పాత్ర వహిస్తుంది.

వ్యవసాయోత్పత్తుల్లో ముఖ్యంగా ఆహారపంటలు – గోధుమ, వరి, బార్లీ, పప్పు ధాన్యాలు, మొక్కజొన్న పంటలు కాగా..

వాణిజ్య పంటలుగా – ఆవాలు, గసగసాలు, చెరకు, ప్రత్తి పంటలు.

వ్యవసాయాధారిత పరిశ్రమలు– చక్కెర, వస్త్రముల తయారీ మిల్లులు, పంట నూనెలు, కాగితం, ఆహారోత్పత్తులు–వీటికితోడుగా ఇటీవల విద్యుదుత్పత్తులు, విద్యుత్ యంత్రాలు, కొన్ని బేసిక్ ఇండస్ట్రియల్ కెమికల్సు, సిమెంటు, అల్యూమినియం, ఎలక్ట్రానిక్స్ యూనిట్లు కొత్తగా వెలసిన పరిశ్రమలుగా పేర్కొనవచ్చు.

రాష్ట్రం ఎంత పెద్దదో సమస్యలు కూడా అంత ఎక్కువగా పుడుతూ వుంటాయి. జనసామాన్యం ఎప్పుడూ పేదరికంతో మగ్గుతూనే వుంటారు. ఎంత చేసినా ఇంకా చేయవలసింది ఎంతో మిగిలి వున్నట్లుగా కనబడుతుంది రాష్ట్రంలో. ఈ రాష్ట్రంనుండే మన దేశ ప్రధానులుగా పండిత జవహర్లాలు వంశంవారైన పండిట్ నెహ్రూ, శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ రాజీవ్‌గాంధీలు, స్వర్గీయులు లాల్‌బహదూర్ శాస్త్రి, చౌదరి చరణ్‌సింగ్‌లు వచ్చారు.

## సంగ్రహ చరిత్ర :

పొడి అక్షరాల్లో యు. పి. అని సంగ్రహంగా పిలవబడే ఈ రాష్ట్ర చరిత్ర అనేక పవిత్రమైన స్థలాలతోను, శోభాయమానమైన వర్ణ వర్ణ చరిత్రలతోనిండి ఉంది. తరతరాలనుండి భారత ప్రజలకు తరగని సంస్కృతి, సాహితీ విశిష్టతలతో పావన గంగా నదీ ప్రవాహక ప్రదేశమంతా అనేకరీతుల పునీతమైన చరిత్రలతో విలసిల్లుతూ ఈనాటికీ ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

క్రీ. పూ. అరవ శతాబ్దంలో రెండు గొప్ప మతాలు బౌద్ధమతం, జైనమతం వ్యాప్తికి ముఖ్య వేదికలున్నాయి. జైనమత వ్యవస్థాపకులు మహావీరుడు ఆఖరిశ్వాస పీల్చిన 'దూర' ఈ రాష్ట్రంలోదే. గౌతమబుద్ధుడు జ్ఞానోదయమైన పిదప తన మొట్ట మొదటి సందేశాన్ని ప్రజాబాహుళ్యాని కందించిన విశిష్ట ప్రదేశం సారనాథ్ యిక్క డిదే: ఈ పావన ప్రదేశాన్ని అనేక గొప్ప వంశాలు అవిచ్ఛిన్నంగా పాలించాయి. సమాజ జీవనానికి పటిష్టమైన పునాదులు వేయడమేగాక మానవ సమాజ నిర్మాణానికి కొన్ని పద్ధతులను నిర్దేశించిన వారూ యిక్కడే.

ఇనకుల సార్వభౌముడు, ఇక్ష్వాకు తిలకుడు శ్రీరామచంద్ర ప్రభువు శ్రీమద్రా మాయణం కథానాయకుని జన్మస్థలం అయోధ్య ఇక్కడిదే. మౌర్య సామ్రాజ్యంలో ఒక ముఖ్యభాగమై పేరొందిన మహాచక్రవర్తుల పరిపాలనలో విశిష్టస్థానాన్ని పొందిన విశేషాలు అనాది కాలంనించీ ఎన్నో. పుష్యమిత్రుడు, కనిష్కుడు, సముద్రగుప్తుడు, హర్షవర్ధనుడు, యశోవర్మ, మిహిర భోజుడు, మహీపాలుడు మొదలైనవారి అద్భుత శౌర్యపరాక్రమాల నీడలో అత్యున్నతస్థానం వహించినది. మహాభారత కథానాయకులు కౌరవ, పాండవులు భగవద్గీతాకారుడైన శ్రీకృష్ణభగవానుడు కూడా ఈ రాష్ట్రంలోని వారే. కేవలం ఉత్తమ సంజాత రాజవంశీయుల పాలనొక్కటే కాదు— ప్రసిద్ధి చెందిన విద్యాకేంద్రాలుగా వర్ధిల్లిన అయోధ్య, ప్రయాగ, వారణాసి, మధుర ఆర్ష విజ్ఞానాన్ని ప్రపంచపు నలుమూలలా ప్రకాశింప జేసినట్టి ఘనులైనవారు ఈ యీ ప్రదేశాలకు వచ్చి అధ్యయనం చేసినవారు ఎంతోమంది. ఆదిశంకరులు తమ విద్యా పీఠాన్ని, ఆశ్రమాన్ని బదరీనాథ్‌లో వెలయించారు.

ప్రాచీన నాగరికతా వైభవ చిహ్నాలు అనేకం హస్తినాపురం, కనోజ్, కౌశాంబి మధుర మొదలయిన ప్రదేశాల్లో జరిగిన త్రవ్వకాల్లో వెలువడిన పురాతత్త్వ విశేషాలు ఎన్నో మనకు నిదర్శనాలుగా నిలిచాయి.

సుమారు 2000 సంవత్సరములకు పూర్వం అశోకుని బౌద్ధ సామ్రాజ్యంలో భాగంగా వుండిన ఈ ప్రాంతం మధ్య యుగాలనాటికి వచ్చేటప్పటికి మొగలు సామ్రా జ్యంలో అతి ముఖ్యభాగంగా వుండటం ఎంతయినా విశేషమే। 1300లో అల్లాఉద్దీన్ ఖిల్జీ దండయాత్రలద్వారా కొంతభాగాన్ని జయించి వశం చేసికొన్నాడు. అప్పటి నుండి మొగలాయిల ప్రభావపు నీడలు ప్రసరించాయి. 16వ శతాబ్దంలో లోడీ వంశీ యులు ఆక్రమించి ఆగ్రాను ముఖ్యపట్టణంగా చేసికొని పరిపాలించారు. వెనువెంటనే బాబరు అనేక యుద్ధాలుచేసి ఈ ప్రదేశం మొత్తాన్ని మొగలు సామ్రాజ్యపు గొడుగు

క్రిందకు తీసికొని వచ్చాడు. 18వ శతాబ్దంలో క్రమంగా ఒక్కొక్క ప్రాంతాన్ని బ్రిటిషువారి యీస్టిండియా కంపెనీ కైవసం చేసికొంది.

1309 నుండి 18వ శతాబ్దం గడిచి 19వ శతాబ్దపు కాలంవరకూ హిందూ ముస్లిముల సంస్కృతులు పటాను పేకల్లా కలిసిపోయి ఒక సరికొత్త కలనేతగా సంస్కృతీ వైభవాలు ప్రభవించాయి. స్వామి రామానందుని శిష్యుడు ముస్లిము వాడైన కబీరు. ఈతడే తరువాత భక్తకబీరుగా ప్రఖ్యాతిగాంచాడు. 'రామచరిత మానస్' రచయిత తులసీదాసు, అక్బరు సంస్థానంలో అతి వివేకవంతుడుగా పేర్కొనబడిన బీర్‌బల్ మొదలయినవారు ఉర్దు భాషకు చేసినసేవ ఎనలేనిది. హిందూ ముస్లిముల సంస్కృతులకు మేలు కలయికగా ఉర్దు ప్రతీక యని వేరుగా చెప్పనవసరం లేదు.

బ్రిటిషువారి హయాంలో ఉత్తరప్రదేశ్ వైజ్ఞానిక రంగంలో నాయకత్వం వహించింది. బ్రిటిషువారు ఆగ్రాను, జౌధ్‌ను రెంటినీ కలిపి 'యునైటెడ్ ప్రావిన్సు' ఆఫ్ ఆగ్రా అండ్ జౌధ్‌గా నామకరణంచేసి తరువాత 1935లో హ్రస్వంగా 'యునైటెడ్ ప్రావిన్సు'గా పేర్కొన్నారు. భరతమాత బానిసత్వపు చెరవీడిన పిదప 1950లో ఈ రాష్ట్రానికి ఉత్తరప్రదేశ్‌గా జాతీయ నామకరణం జరిగింది.

## యాత్రిక ఆకర్షణలు రాష్ట్రం మొత్తం మీాద క్లుప్తంగా :

ఉత్తరప్రదేశ్ చాలా చక్కని అందాలు రాశిబోసిన ప్రకృతి దృశ్యాలకు కాణాచి. అందమైన పచ్చటి ఉద్యానవనాల్ని మైమరపించే ప్రకృతి, ఆదర్శ పూర్వకమైన ఆరోగ్యకేంద్రాలు, ఎత్తయిన పర్వతశిఖరాలు, అద్భుతమైన పవిత్ర నదీ నదాలు, కనువిందుచేసే కమనీయమైన లోయల ప్రాంతాలు రమణీయమైన ఆభరణాలు పుడమితల్లి ముఖవర్చస్సును ఇనుమడించే సోయగాలు.

ప్రసిద్ధి చెందిన 'వేలీ ఆఫ్ ఫ్లవర్స్', యమునోత్రి, గంగోత్రి, కేదారనాథ్, బదరీనాథ్, హేమకుండ్, పిండారి పసిరిక బయళ్ళు, నైనితాల్, ముస్సోరి, ఆల్మోరా, రాణిఖేత్ మొదలయిన పర్వత విశ్రాంతి కేంద్రాలు మనోహరమైన ప్రకృతి దృశ్యాలతో కనువిందు చేసే నయన మనోహర దృశ్యాలు, ఆహ్లాద వాతావరణ కేంద్రాలు, చక్కని వేసవి విడిది కేంద్రాలుగా ప్రసిద్ధం- ఇవన్నీ ఒక ఎత్తు- శ్రావస్తి, సారనాథ్ కృషీనగర్, సంకాస్య, కౌశాంబి మొదలైన ప్రదేశాలు విదేశీయాత్రికుల కూడా

ముఖ్య ఆకర్షణలు కాగా- హైందవ మత ప్రాబల్యం పవిత్రతలకు పెట్టింది పేరుగా యుగ యుగాలనుండి ప్రసిద్ధమైన పవిత్ర స్థలాలుగా వారణాసి, నైమిశారణ్యం, ప్రయాగ, హరిద్వార్, అయోధ్య, మధురలు, ఆగ్రా, లక్నోలు ఇస్లామిక సంస్కృతికి దర్పణాలుగా భావించి చెప్పుకోవచ్చు.

భారతదేశ స్వాతంత్రపోరాట ప్రథమఘట్టానికి ముఖ్యవేదికలుగా అంటే 1857 'సిపాయిల తిరుగుబాటు' యుద్ధంలో మీరట్, లక్నో, కాన్పూర్‌లలో జరిగిన కొన్ని నాటకీయ పరిణామాలు విశేష ప్రాచుర్యం కలిగి వున్నాయి. దేశస్వాతంత్ర్య పోరాట చరిత్రలో ఎన్నదగిన మైలురాళ్ళు. రాష్ట్రంలో ముఖ్య విశేషాలు- రాజధాని నగరమైన లక్నో నుండి మొదలుపెడదాం.

## లక్నో

అనాదిలో లక్ష్మణపురిగా ప్రసిద్ధిచెందిన మహానగరం. ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్య పట్టణం. దేశం మొత్తంలో ఈ పట్టణం రసికజన మనోరంజనిగా చెప్పుకొంటారు. లక్నో అనే పేరు అసలు శ్రీరామచంద్ర ప్రభువుని తమ్ముడైన లక్ష్మణుని పేర వెలసిన లక్ష్మణవటికి హ్రస్వరూపం అని ప్రతీతి. మొదట ఔధ్‌నవాబుల రాజధానిగా శోభిల్లిన చిరకాలంలో ఎన్నో ప్రాసాదాలు, మసీదులు నిర్మాణం జరిగింది.

ఈనాడు లక్నో మహానగరం విరుద్ధ భావాలకు నిలయం. ఒకవైపు కడుపులు కాలే కష్టజీవులు- మరోవైపు సురసాల రసానందాల్లో తేలియాడాలనే సుఖభోగలాలసులు,- పూరిగుడిసె లొకవైపు మహాప్రాసాదాలు ఒకవైపు రాజకీయ తీవ్రతలు నిత్యం నడయాడే చోటుగా కనబడుతుంది. ఎన్నో చారిత్రక విశేషాలను విప్పి చెప్పే స్మారకాలు, జ్ఞాపకాలు చూడదగినవి అనేకం.

మొగలుల పతనానంతరం 1724 నుంచి 1856 వరకు అవధ్ నవాబులు తమ అధీనంలో ఉంచుకుని పాలించగలిగారు. 1775-1797 వరకు పాలించిన అసఫుద్దవులా కాలంలో ఔధ్ రాజధాని లక్నోకి మార్పిడి జరిగింది. సుఖ భోగలాలసుడైన వజిద్‌అలీషాను 1856లో బ్రిటిషువారు తీసికెళ్ళి కలకత్తా జైలులో పారవేశారు. 1857 లో రేగిన సిపాయిల తిరుగుబాటులో లక్నో ప్రాధాన్యతకు, నాటకీయ పరిణామాలకు ఆజ్యం పోసినది. ఇది కారణంగా చెప్పుకోవచ్చు. ఇక్కడి మహమ్మదీయులు షియా తెగవారు. ఢిల్లీ, ఆగ్రాల్లోని మహమ్మదీయులు సున్నీ తెగవారు. లక్నోలో షియా తెగవారు జరిపే మొహరం పండుగ చూడదగింది.

చారిత్రిక విశేషాలు చాలావరకు లక్నోలో ఆగ్నేయ ప్రాంతంలోనే వున్నాయి. టూరిస్టు ఆఫీసు హజరత్‌గంజ్‌లోని టూరిస్టు బంగ్లాలో (హోటల్ గోమతి) వుంది. గవర్నమెంట్ ఆఫ్ ఇండియావారి టూరిస్టు ఆఫీసు మహాత్మాగాంధీ మార్గ్‌లో జనపథ్ మార్కెట్టు బిల్డింగు పై అంతస్థులో వుంది.

బారా ఇమాంబారా :

1784లో జౌధ్‌నవాబు అసపుద్దౌలా కరవు నివారణ కేంద్రంగా కట్టించిన అద్భుతమైన కట్టడం. పగలు ప్రజలదృష్టిని ఆకర్షించకుండా రాత్రిళ్ళు మాత్రమే తీరుబడిగా కట్టించారట. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద గిడ్డంగిగా పేర్కొనవచ్చు. 162 అడుగుల పొడవు, 53 అడుగుల వెడల్పు, 50 అడుగుల ఎత్తు గలిగిన పెద్ద మధ్యచావడి నిలువంపుగా కట్టబడి మోపుస్థంభాలు ఒక్కటిగూడా లేకుండా ఈనాటి, ఆనాటి భవన నిర్మాతలకు ఆశ్చర్యాన్ని గొల్పుతూ ఉన్నది. నాటి ఆడంబరపు మెరుగులు కానరావు. పైకి ఎక్కడానికి వంకరటింకరగా ఉన్న మెట్లవరుస ఉంది. పై అంతస్థు భూలా భులయ్యా ఎక్కడానికి రు. 2-50 టిక్కెట్టు. పైనంతా తికమకగా వుంటుంది. గయిడ్లు లేందే ఎక్కనివ్వరు. తిరిగిరావటానికి ఎంతో గజిబిజిగా వుంటుంది గనుక. పైనుంచి సుందర నగర దృశ్యం అద్భుతం.

ఇమాంబారా ప్రాంగణంలోనే ఎడమవైపున ఒక మంచి మసీదున్నది. ఇందులోకి ముస్లిమేతరులకు ప్రవేశం లేదు. కుడిప్రక్కన మూసివున్న గదులకు ప్రక్కగా లోతు తెలియని పెద్ద బావి ఒకటి ఉంది. ఉదారప్రభువు అసపుద్దౌలా, ఈ భవన నిర్మాణ కుశలుడు కఫాయుతుల్లా ఒకరి ప్రక్కన ఒకరు దీర్ఘనిద్ర చెందిన స్థలాలున్నాయి. ఇమాంబారా ఉ. 6 గం. నుండి సా. 5 గం. వరకు తెరచియుంచ బడుతుంది. నేలమాళిగ (Under ground) కూడా వుంది. కాని మూసివేయబడి ఉంది. చూడటానికి వీలులేదు.

రూమి దర్వాజా :

బారాఇమాంబారా బయటనున్న ఒక పెద్దద్వారం. అవుధ్ నిర్మాణ నైపుణ్యం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. పూర్వం రోము సామ్రాజ్యంలో ఒక భాగంగా ఇమిడి వున్న ఇస్తాంబుల్ పట్టణంలో ఉన్నదానికి నమూనా. 'రూమి' అనేమాట మహమ్మదీయులు 'రోము'కి ప్రతిరూపం. దీన్నే టర్కిష్ గేట్‌వేగా గూడా పిలుస్తారు, అవుధ్ నిర్మాణకుశలుర పనితనానికి చక్కటి ఉదాహరణ

హుస్సేనాబాద్ ఇమాంబారా లేక చోటా ఇమాంబారా :

కొంచం అవతలగా 1837లో మహమ్మదు అలీషా తన సమాధి అక్కడే వుండాలనే నిర్ణయంతో స్వయంగా వేలకొద్దీ పనివారల శ్రమతో కట్టించుకున్న కట్టడం. విశాలమైన ముందు చదరంలో ఏర్పరచబడిన ఒక చక్కటి దీర్ఘ చతురస్రాకారపు చెరువు, ఉద్యానవనం- రెండు ప్రక్కలా తాజ్‌మహల్ నమూనాలు చూడదగినవి. ఒకటి మహమ్మదు అలీషా కుమార్తెది. రెండవది ఆమె భర్త సమాధులు అమరి ఉన్నాయి. ముఖ్య కట్టడం మాత్రం రకరకాల డోముల్లో మధ్య డోము బంగారపుది. చిన్న చిన్న స్తంభాలు– లోపల మహమ్మదు అలీషా, ఆయన తల్లి గారివి సమాధులున్నాయి. లోపలికి వెళ్ళటానికి రు. 2/- టిక్కెట్టు. లోపలికి వెళితే నవాబుగారి రజత సింహాసనం చూడవచ్చు. బయట పంచపాళీలో అరబ్బీ బాషలో ఖురాను సూక్తులు, రేఖాగణిత చిత్రాలు చిత్రవిచిత్రంగా నలుపుమీద తెల్లటి అక్షరాల్తో అనేకం లిఖించబడి ఉన్నాయి. లోపలి భాగంలో గిల్టు వేయబడిన అద్దాలు, రకరకాల దీపాలంకరణలు, చందనంతో చేసిన నగిషీ పనుల పరికరాలు, గిల్టుపేపరు, జలతారు దారాలతో అందంగా అలంకరించబడిన విధం చూడవచ్చు.

ఇమాంబారాకు ఎదురుగా 'సాత్‌ఖండ' అనే ఏడంతస్థుల గోపురం అని పేరుతో పిలవబడే నాలుగు అంతస్థులది ఒకటివుంది. మిగతా మూడు అంతస్థులు పూర్తి కాలేదు. అసంపూర్తిగా వదలి వేయబడ్డాయి. 1840 సంవత్సరంలో అలీషా చనిపోయాడు. ఇక ఈ కట్టడం కూడా అంతటితో ఆగిపోయిందని చెప్తారు. ఇది కూడా ఉ. 6 గం. నుండి సా. 5 గం.ల వరకు తెరిచి యుంచబడుతుంది దర్శనీయంగా.

హుస్సేనాబాదు చెరువుకు ఎదురుగా కొంచెం అవతలగా ఒక చక్కటి గృహం వేసవికాలం వుండటానికి వీలుగా అలీషా కట్టించుకున్నదే ఒకటుంది. ప్రస్తుతం అందులో వివిధ అవుధ్ నవాబుల చిత్రపటాలు ప్రదర్శితంగా ఉన్నాయి. ఒక రూపాయి ప్రవేశ రుసుంతో ఉదయం 8 గంటల నుండీ సాయంత్రం 5 గంటలోపు ఎప్పుడైనా చూడవచ్చు.

గడియారం స్థంభం :

ఎత్తు 221 అడుగులు. చుక్కల్ని చూస్తున్నట్లుగా ఉంటుంది. ఈ స్థంభం నిర్మాణం 1880లో మొదలై 1887లో పూర్తయిందిట. ఆనాటి రోజుల్లోనే రు. 1

లక్ష 20 వేలు వ్యయించి నవాబువారు కట్టించారు. హుస్సేనాబాదు టాంకు ఎదురుగా సమున్నతంగా నిలబడి కాలనిర్దేశనం చేస్తుంది.

జామా మసీదు :

హుస్సేనాబాదు ఇమాంబారాకు పడమరగా బ్రహ్మాండమైన వైభవోపేత చిహ్నంగా నిలుస్తున్న గొప్ప కట్టడం జామామసీదు ఉన్నది. మూడు డోములు, రెండు స్థంబాలుతో ఉన్నది. అద్భుతంగా మొగలాయి శైలిలో నిర్మించబడిన ఈ మసీదు మహమ్మద్ ఆదిల్‌షా ప్రారంభించాడు. అంతలోనే అతను మరణించాడు. తరువాత అతని భార్య అయిన మాలిక్ జహాఁ పూర్తి చేయించింది. భారతదేశంలో ఉన్నకొన్ని మసీదులు మాదిరిగానే ఇక్కడ కూడా ముస్లిమేతరులకు ప్రవేశం లేదు.

లక్ష్మణ్ తిలా లేక లక్ష్మణ తిన్నె:

గోమతీ నదీ తీరాన ఉన్న ఎత్తయిన ప్రదేశం. శ్రీరామచంద్రులవారు తమ సోదరుడు లక్ష్మణస్వామికి బహుమతిగా ఇచ్చిన భూమిగా వాసికెక్కింది. ఇందువల ననే ఈ పట్టణానికి లక్ష్మణ్ పేరు మీదుగా ప్రసిద్ధి చెందిన ఇప్పటి లక్నో సార్థక నామధేయమయిందని చరిత్రకారుల అభిప్రాయం. ఈ స్థలాన్ని పీరు మహమ్మద్‌షా ఆక్రమించాడు. ఔరంగజేబు చక్రవర్తి కాలంలో ఆయన గవర్నరుగా అవుధ్‌ని పాలించిన సుల్తాన్‌అలి ఈ ప్రదేశంలోనే అలంగీర్ లేక ఔరంగజేబు మసీదును నిర్మించాడు. మూడు డోముల నిర్మాణం. మూలల్లో సన్నటి స్థంభాలున్నాయి. దీన్నే తిలేవలి మసీదు అని కూడా అంటారు. మొగలాయి శైలిలోని వైభవం, ప్రాభవం మిళాయింపు ఇందులో మనం చూడగలం. చక్కని ఉదాహరణ.

షా-నజఫ్ ఇమాంబారా :

హజరత్‌గంజ్ దగ్గరలోని సికిందర్‌బాగ్‌కు పడమరగా ఉన్న గొప్ప మసీదు. నజాఫ్ అనేది ఇరాక్‌లోని బాగ్దాదు పట్టణానికి 190 కి.మీ. దూరంలో ఉన్న పట్ట ణం. షియాతెగ వారిగురువు హజరత్‌అలీ ఈ పట్టణంలో సమాధి చేయబడ్డాడు. ఈ పట్టణానికి సంకేతంగా షా-నజఫ్ అనేపేరు చేర్చబడింది ఇమాంబారాకు. దీన్నేమరో రూపాంతరంగా నజాఫ్-ఎ-అష్రాఫ్ అనికూడా అంటారు. ఇక్కడ నవాబ్ ఘజియు ద్దీన్ హైదర్ ఆయన భార్యలు (వీరిలో ముబారక్ మహల్ అనే విదేశీయురాలు) సమాధి చేయబడ్డారు. 1857 సిపాయిల తిరుగుబాటు ఘట్టంలో ఈ మసీదు ప్రముఖ

పాత్ర వహించి యుద్ధ వీరులకు ఒక బలమైన కేంద్రంగా ఉపయోగపడిందిట. బయటి డోము చాలా సాదాగా ఉన్నా లోపల అనేక దీపాలంకరణలతో ఒప్పారుతూ, బంగారు మలామాతో ఉండేదని చెప్పుకొంటుంటారు. ఈ భవనంలో ముఖ్యంగా మొహర్రం టైములో బయటకు తెచ్చే పీర్లు, తగరపు కాగితాలు, లోహ విశేషాలు ఉత్సవ విశేషాలుగా వీధుల వెంట ప్రదర్శించేవి అనేకం యిక్కడ నిక్షిప్తం చేయబడ తాయట. అయితే తిరుగుబాటు ఘట్టం తరవాత విలువైన వస్తువులు చాలానే దొంగి లించబడ్డాయి అని అంటారు మామూలుగా ఉదయం 6 గం. నుండి సాయంత్రం 5 గం. వరకు దర్శనీయం.

సికిందర్ బాగ్ :

నవాబ్ వజిద్ అలిషా వేసవి గృహం. చక్కని తోట— అందులో గృహం ఆయన భార్య అయిన బేగం సికందర్ మహల్ పేరున సార్థకం చేశాడు. సిపాయిల తిరుగుబాటు ఘట్టంలో భయంకర యుద్ధ ఘట్టాలనేకం పునరావృతమైన చరిత్రాత్మక స్థలం. ప్రస్తుతం ఇక్కడ నేషనల్ బొటానికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ అమర యున్నది.

కైయిసర్ బాగ్ :

1845-50 ల మధ్య నవాబ్ వజిద్ అలీషా నిర్మించిన భవనాల వరుసతో కూడిన చక్కటి ఉద్యానవనం. (పార్కు). ఇదే లక్నో ఆఖరి నవాబు స్వర్గంగా భావించబడింది. బారాదరి మధ్యలో నీటిలో ఒక ప్రాసాదం ఉంది. లాల్ బారాదరి భవనం రాజావారి సింహాసనం దర్బారు హాలుగా ఉపయోగించబడేది సాదత్ అలీ ఖాన్ వారి తర్వాత కాలంలో.

ఉద్యాన వనంలో నవాబ్ సాదత్ అలీ అయిన బేగమ్ ముర్షిద్ గాదిల సమా ధులు అంకార ప్రాయంగా ఉన్నాయి. ఆర్కిలాజికల్ మ్యూజియం కొన్ని అద్భుత మైన వస్తువులు ప్రదర్శిస్తూంది. సమీపంలోనే ఘజియుద్దీన్ హైదర్ నిర్మించిన ఛత్తర్ మంజిల్– ఛత్రభవనం – అని పేరును సార్థకం చేస్తూ డోముపైన బంగారు రంగులో ఒక గొడుగును అమర్చారు. ఈ భవనం యూరోపియన్ ఆర్కిటెక్చర్ విశేషాలతో వింత సొయగాలీనుతుంది. ఒకానొకప్పుడు రాజు ప్రాసాదంగా ఉపయో గించబడిన దానిలో ప్రస్తుతం సెంట్రల్ డ్రగ్ రిసెర్చి ఆఫ్ ఇండియా చోటు చేసు

కొంది. దీని కెదురుగా ప్రస్తుతం లక్నో డివిజన్ కమీషనరు గారి ఆఫీసుగా ఉపయోగించ బడుతున్న ఛోటా ఛత్తర్ మంజిల్ కూడా ఉంది.

నాదన్ మహల్ :

లక్నోలో పురాతన భవన సముదాయంలో ఒకటిగా పేర్కొనబడినదీ భవనం. ఒకానొకప్పుడు అక్బరు రాజ ప్రతినిధి అయిన ఖాన్-ఇ-ఖానన్ ఇక్కడ సమాధి చేయబడ్డాడు. దీన్నే నాదన్ మహల్ మక్బారాగా పేర్కొంటారు.

రెసిడెన్సీ :

ఒకనాటి బ్రహ్మాండమైన భవన సముదాయంగా శోభిల్లినది ఇప్పుడు జీర్ణావస్థలో ఉండి దయనీయమైన పరిస్థితిలో పడివుంది. కాని ఆనాటి పురాతన వైభవ చిహ్నాలు మాత్రం ఇంకా మాసిపోలేదు. 1780-1800 అవధ్ నవాబు బ్రిటిషు ప్రతినిధికోసం నిర్మించిన భవనాలు. 1857 సిపాయి తిరుగుబాటు ఘట్టపు వీరోచిత పోరాటంలో అనేక ఫిరంగి గుండ్లతాకిడికి లోనయింది. బ్రిటిషు సామ్రాజ్య వాదుల గర్వాన్ని అణచివేయబడిన ప్రదేశంగా ఇప్పటికీ ఆనాటి ముట్టడి అనంతరం ఎలా వుందో అలాగే భద్రపరచబడింది- ఆనాటి ఘట్టాలు చిరస్మరణీయంగా స్మృతిపథంలో మెరవటానికి అన్నట్లుగా। ముఖ్యభవనం కొంచం ఎత్తుప్రదేశంమీద వుండి గోమతి నదిని ఎక్కి చూస్తున్నట్టుగా వుంటుంది. పెద్ద వరండా, వాచ్ టవర్, నేల మాళిగ గదులు ఉన్నాయి. భవనం గోడలపీద లతా గుచ్ఛములు, మంచి ఉద్యాన వనాలు భవన అందాన్ని ఇనుమడిస్తున్నాయి. రాత్రిపూట ఫ్లడ్ లయిట్లతో ప్రదేశమంతా వెలుగు ప్రవాహం నిండి ఉంటుంది. దగ్గరిలోనే ధ్వంసమైన చర్చి, దాదాపు 2000 స్త్రీ, పురుష సమాధులతో నిండియున్న గోరీలదొడ్డి. ఇందులో సర్ హెన్రీలారెన్స్ సమాధికూడా ఉంది. 1947 ఆగష్టు 15 వరకూ. బ్రిటిష వారి యూనియన్ జాక్ జండా ఎగురుతూ ఉండేది. 1857 తరువాత 1957 ఆగష్టు 15 న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో అసువులర్పించిన వీరులందరికీ రెసిడెన్సీ ఎదురుగా గోమతీనదీ తీరంలో ఒక గొప్ప స్మారక చిహ్నం నిర్మింపబడి ఆవిష్కరించ బడింది. ప్రస్తుతం రెసిడెన్సీ లోపలికి ఎవరినీ అనుమతించడం లేదు. కాని అలాగేవున్న నమూనా ఒకదాన్ని తయారుచేసి ఉదయం 9-30 నుండి సా. 5-30 గం. వరకు రు. 0-50 పై. టిక్కెట్టు గార్డెన్‌లోకి అనుమతి- రు. 1-00 టిక్కెట్టు మోడల్ రూముకు ప్రవేశ రుసుముపైన ప్రదర్శిస్తున్నారు. శుక్రవారాలు మాత్రం ప్రవేశం ఉచితం.

బనారసీ బాగ్, జూ, మ్యూజియం :

లక్నో మహానగర జంతు ప్రదర్శనశాల ప్రిన్స్ ఆఫ్ వేల్స్ జూ (తదుపరి ఎడ్వర్డ్ 8) 1921 లో స్థాపించబడింది. చక్కటి గార్డెన్‌లోనే జంతుప్రదర్శనశాల ఏర్పరచబడింది. హిందూదేశంలోగల అనేక రకాల జంతుజాలాలను ఇక్కడ చూడ వచ్చు. ముఖ్యంగా పేర్కొనదగినది సర్పెంటేరియం. ఉదయం 5 గం. నుండి సా. 7 గం. వరకూ దర్శనీయం.

దీనికి తోడు లక్నో స్టేట్ మ్యూజియం ఒక విశాల భవనంలో అమరి యున్నది. ఉత్తర హిందూస్థానం మొత్తంమీద దీన్ని మించిన మ్యూజియం ఒక్క ఢిల్లీలో వున్న నేషనల్ మ్యూజియం తప్ప మరెక్కడా లేదని గర్వంగా చెప్పవచ్చు. చాలా పురాతనమైందికూడా. గుప్తుల స్వర్ణయుగాల నాటివి, కుషానుల కాలంనాటి నాణెముల విశేషాల దగ్గరనుండి అనేకం భద్రపరచబడి ప్రదర్శించ బడుతున్నాయి. యాత్రికులు ప్రతివారూ తప్పక చూడదగినది.

మ్యూజియం వెనుక భాగంలో స్వతంత్రం రాకపూర్వం రెండువందల సంవత్సరాల పైనుంచి మనదేశాన్ని పాలించిన వివిధ బ్రిటిషు ప్రముఖుల నిలువెత్తు పాలరాతి విగ్రహాలు ఉన్నాయి. కాని వాటిస్థానంలో నేడు మన జాతీయ నాయకుల విగ్రహాలు ఆక్రమించాయి.

లా మార్టినరీ స్కూలు :

నగరం వెలుపల ఒక ప్రత్యేక తరహా స్కూలుంది. దీన్ని కట్టించినవారు ఫ్రెంచి దేశీయులైన మేజర్ జనరల్ క్లాడ్ మార్టిన్. పాండిచ్చేరిలో 1761 లో ఖైదీగా ఉన్నటువంటివాడు తరువాత బ్రిటిషు సైన్యంలో చేరాడు. 1776లో అవధ్ నవాబుల వద్ద చోటు చేసుకొన్నాడు. అప్పుడు గూడ బ్రిటిషువారి ఈస్టిండియా వారితో పూర్తిగా సంబంధ బాంధవ్యాలు వదులుకోలేదు. ఈ రెండు రకాల సంపాదనలతో ఒక పెద్ద గృహంకట్టి దానికి కాన్‌స్టాంటినా అనే పేరుపెట్టారు. చివరకు లక్నో మేజర్ జనరల్ క్లాడ్‌గా కన్నుమూశారు. తన యావదాస్తినీ స్కూలుకింద ఉపయోగించాలని నిర్దేశించి కన్నుమూశాడు. కాని బిల్డింగు తుది మెరుగులు లేకుండా అలాగే వదిలివేయబడింది. కట్టడం తను స్వయం కపోల కల్పితంగా డిజైను చేసి ఇటాలియన్ శైలిలో హిందూ ముస్లిముల నిర్మాణ విశేషాలు, అలంకరణలు జోడించి

వినూత్న శోభలు విరబూసేట్లుగా నిర్మించ తలపెట్టారు. చివరకు పనిపూర్తి కాకుండానే మరణించారు. అయినా చూపరులకు కావలసినంత ఆశ్చర్యం, అద్భుతం మిగిల్చి వెళ్ళారు. తరువాత తరువాత అనేక కట్టడాలు ఇదేమాదిరిగా వెలిశాయి. 1840 నుండి లా మార్టినరీ పబ్లిక్ స్కూలుగా ఇప్పటికీ నడప బడుతోంది.

లక్నో యూనివర్సిటీ భవన సముదాయం గోమతినదీ తటంలో అమరిఉంది. ఇంకా చూడదగిన భవన విశేషాలు కింగ్‌జార్జి మెడికల్ కాలేజీ, బీర్బల్ సాహ్ని ఇన్‌స్టిట్యూట్ అఫ్ పాలియో-బోటనీ, ఇండస్ట్రియల్ టాక్సికాలజీ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, రైల్వే రిసెర్చి డిజైన్సు అండ్ స్టాండర్డు ఆర్గనైజేషన్ వగయిరాలు ఆసక్తికరంగా ఉంటాయి.

ముఖ్యంగా 1930లో కట్టబడిన బ్రహ్మాండమైన భవనం నగరం నడిబొడ్డులో వున్నది రాష్ట్రవిధాన సభాభవనం, బ్రిటిషువారు రూపొందించిన చార్‌బాగ్ రైల్వే స్టేషను ప్రపంచంలో అందమైన వాటిల్లో ఒకటిగా పేర్కొనబడవచ్చు.

## స్థల సందర్శనాలు-సమాచారం :

యు. పి. స్టేట్ టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను వారు చార్‌బాగ్ రైల్వేస్టేషను నుండి ప్రతిరోజూ ఉదయం 9 గం. నుండి మధ్యాహ్నం 2 గంటల వరకూ 20 రూపాయల చార్జీతో నగర సందర్శనా సౌలభ్యంగా టూర్లు నిర్వహిస్తున్నారు. ఇందులో కేవలం రాను పోను చార్జీలు మాత్రమే ఇమిడి వున్నాయి. రు. 0-50 నుండి 2-00 వరకూ వసూలు చేయబడే ఆయా ప్రదేశాల ప్రవేశరుసుములు టిక్కెట్లు వగయిరాలు ప్రత్యేకం. ఇందులో బారా ఇమాంబారా, ఛోటా ఇమాంబారా రూమిగేటు, రెసిడెన్సి, మృతవీరుల స్మారక చిహ్నం, ఉద్యానవనాలు, తోటలు వగైరాలున్నాయి. ప్రత్యేకంగా పర్యాటకుల సౌకర్యార్థం ప్రత్యేక సౌకర్యాలుగా A/c కార్లు, డీలక్సు బస్సులు కూడా అమరుస్తారు. దీని విషయం హోటల్ గోమతి ఫోన్ నం : 32257, 34282 లలో అడిగి తెలుసుకోవచ్చు.

## లక్నో పరిసర ప్రదేశాల్లో ఎక్సకర్షన్‌లు, పిక్నిక్ స్పాట్‌లు :

1) బారాబంక్ వెళ్ళే రోడ్డులో వున్న 14 కి. మీ. దూరంలోని చిన్‌హట్ ప్రినిల్ పెవిలియాన్ దగ్గరి చక్కని సరస్సు.

2) 15 కి. మీ. దూరంలో ఉన్న కుక్రెయిల్ రిజర్వ్ ఫారెస్టు - ఇందులోని మొసళ్ళు పెంపక కేంద్రం.

3) కాన్పూర్ హైవేలో 44 కి. మీ. దూరంలో ఉన్న నవాబ్‌గంజ్ బర్డ్ శాంక్చుయరీ శీతాకాలంలో అనేక ఇతర ప్రదేశాలనుంచి వలసవచ్చే పక్షుల కేంద్రం చూడదగినవి.

**వుండటానికి :**

హోటల్ గోమతి-యు. పి. టూరిజం శాఖ నిర్వహించే హోటలు, కారల్‌టన్స్ క్లార్క్స్ అవధ్-5 నక్షత్రాల హోటలు, హోటలు కపూర్, మహాత్మాగాంధీ మార్గ, హోటలు ఎల్లోరా 3, లాల్‌బాగ్, ప్లాజా హోటలు వగైరాలుతోపాటు రైల్వే రిటయిరింగ్ రూములు చార్‌బాగ్ రైల్వేస్టేషను వగయిరాలు.

వీటిలో హోటలు క్లార్క్స్ అవధ్, హోటలు కారల్‌టన్స్ శ్రీమంతులకు ఆవాసాలు.

**లక్నోకు :**

హోటల్ క్లార్క్స్ అవధ్ బిల్డింగులో ఇండియన్ ఎయిర్‌లైన్సు వారి ఆఫీసు వుంది. ఫోన్సు : 44030, మరియు 48081 ఢిల్లీ-లక్నో రోజూ రెండుసార్లు. ప్రతి రోజు ఢిల్లీ-లక్నో-అలహాబాదు-వారణాసి లేక ఢిల్లీ-లక్నో-గోరక్‌పూర్ కనెక్షను తోను, ఢిల్లీ-లక్నో-పాట్నా-రాంచీ-కలకత్తాకు. వారంలో నాలుగుసార్లుగా బొంబాయి వారణాసి-లక్నో ఫ్లయిట్ విమానయాన సౌకర్యాలు అమరి వున్నాయి. నగరానికి 15 కి.మీ. దూరంలో అమౌసి ఎయిర్‌పోర్టు ఉన్నది.

**రైలు మార్గం :**

వారణాసి నుండి లక్నోకు, ఆగ్రానుండి లక్నోకు, లక్నోనుండి గోరక్‌పూరుకు నేరోగేజ్ రైలుమార్గం నేపాల్ సరిహద్దులకు చేరవచ్చు.

**బస్సులు :**

చార్‌బాగ్‌రైల్వే స్టేషను దగ్గిరలోనే నగర బస్సు స్టేషను కూడా వుంది. బస్సులు ఢిల్లీ, ఆగ్రా, అలహాబాదు, వారణాసి, కాన్పూర్, గోరక్‌పూరు వగైరాలకు నేరుగా బయలున్నాయి. నేపాల్ సరిహద్దు సునేలీకి 12 గం. ల ప్రయాణంలో చేరవచ్చు.

ఉత్తర ప్రదేశ్‌లో చూడదగిన క్షేత్రాలు రెండు విభాగాలుగా విభజించుకోవచ్చు. హిమాలయ పర్వత ప్రదేశాలు, ఇతర సమతలాలు అవి–

మొదటగా హిమాలయ పర్వత ప్రాంతాల పుణ్యస్థల విశేషాలు పరిశీలిద్దాం— వీనిలో హరిద్వార్, కన్‌కాల్, రిషికేష్, లక్ష్మణఝూలా, ముస్సోరి, నైనితాల్, రాణిఖేట్ మొదలైనవి.

## హ రి ద్వా ర ము

భారతదేశంలో అతి పవిత్రస్థలాల్లో ఒకటిగా పేర్కొనబడింది. శివాలిక్ పర్వత పాదాలవద్ద పావనగంగా కుడివైపు తీరంలో అమరి యున్న పుణ్యస్థలం. సప్త మోక్షదాయక పురాణాల్లో ఒకటి. దీనినే మాయాపురి, గంగాద్వారం అనే నామాంతరాలతో పిలుస్తారు. శైవులు హరద్వారమనీ, వైష్ణవులు హరిద్వారమనీ భక్తిమీర పిలుచుకొంటూ వుంటారు. మొత్తం మీద హిందువులకు అతి పవిత్రస్థలం–ముఖ్య యాత్రాస్థలం. సముద్ర మట్టానికి 1000 అడుగుల ఎత్తు జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో గొప్ప సుందర నగరంగా ప్రశస్తిని పొందింది. మహామహుడైన కపిల మహర్షి నివసించినచోటు– కపిలస్థాన్ పురాతన ప్రసిద్ధి. ఒకప్పుడు ఎంతో విశాలమై మైళ్ళ పొడవున వ్యాపించియున్న మహా పట్టణంగా కీర్తించబడి ఉన్నది. ఈ విషయం అబుల్‌ఫజల్ తన గ్రంథములో వ్రాశారు. ఈయన అక్బరు కాలంలో ఈ పట్టణ సందర్శనం చేశారు.

పావన గంగా నది హిమాలయ పర్వత లోయలగుండా తన మార్గం సుగమం చేసికొని హరిద్వారంవద్ద సమతల ప్రదేశంలో ప్రవేశిస్తూ (హరి) హరద్వారంగా తన నామాన్ని సార్థకం చేస్తుంది. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కుంభమేళ ప్రతి పన్నెండు సంవత్సరాలకు అవతరించే గంగా పుష్కర సమయంలో విశేషంగా జరుగుతుంది. అనేక దేవాలయాలున్నాయి.

ఉండటానికి అనేక ధర్మశాలలున్నాయి. వాటిలో గంగ ఒడ్డునే అమరి యున్న మద్రాసు ధర్మశాల తెలుగువారికి చాలా అనుకూలంగా ఉంటుంది.

**బ్రహ్మకుండు :**

గంగా తీరస్నాన ఘట్టాలలో అతి పవిత్రమైనది, ముఖ్యమైనది. పావన

గంగ శ్రీ మహావిష్ణువు పాద స్పర్శచే పునీతమైన స్వచ్ఛ జలాలు ఇక్కడ ప్రవహించటం ఒక గొప్ప విశేషం. శ్రీహరి పాదాలను నిక్షేపించేస్తూ ఒక ఆలయం కూడా వుంది. బిర్లా సంస్థ ఈ రేవును అతి సుందరంగా తీర్చిదిద్ది యాత్రికుల మనోహ్లాదానికి మరింత చేరువ చేశారు. ఈ స్వచ్ఛ జలాల్లో చేపలు తండోప తండాలు. యాత్రికులు వాటికి ఆహారాన్ని వేస్తూ ఆనందిస్తారు. శ్రీ మహావిష్ణువు అవతారాల్లో మత్స్యావతారం కూడా విశేషమే గదా! చనిపోయిన వారి అస్తికలు ఇక్కడ నిమజ్జనం చేస్తుంటారు. 10-15 సొగసైన ఆలయాలు దర్శనీయాలు. ఇక్కడి ఈ జలాలను పట్టుకుని పవిత్రంగా తీసుకెళ్తారు యాత్రికులు. గంగా తీరంలోని కుశావర్తం దగ్గర శ్రాద్ధ విధులను నిర్వహిస్తారు యాత్రికులు.

ముఖ్య మందిరాలు :

గంగ, గాయత్రి, లక్ష్మీనారాయణ, బ్రహ్మ, సత్యనారాయణ స్వామి, గణేశ ఆలయాలు వగైరాలు. అన్నింటిలోనూ మరీ ముఖ్యమయినవి మాయాదేవి, బిల్వకేదారు మహాదేవు ఆలయాలు చాలా ముఖ్యం. ఇక్కడ కాషాయ వస్త్రాలు ధరించిన సాధు పుంగవులు, మునివరులు విశేషంగా దర్శనమిస్తారు.

ఇక్కడ జరిగే గంగపూజ సాయంత్రం 5 నుండి 8 గం. ల వరకు జరుగుతుంది. నయనానందకరంగా, కన్నుల పండుగగా జరిగే ఈ పూజావిశేషాల్ని చూచి తీరవలసిందే! యాత్రికులు గంగలో హారతులు వెలిగించి తేలియాడ జేస్తారు. ఈ పూజకు కావలసిన సామాగ్రి పువ్వులు, నూనె, వత్తులు, ప్రమిదనుంచీ నూనే సర్వం అక్కడనే దొరుకుతాయి. నయన మనోహరంగా తేలే ఈ జ్యోతుల సముదాయం యాత్రికుల మనోకాశంలో వెలిగే ఆనందాలకు హారతులు. ఈ సమయంలో ఎవరికి వారు తోచినచోట ప్రశాంతంగా కూర్చుని ధ్యానమగ్నులై యుండటం గమనార్హం. ఈ సమయంలోనే అన్ని దేవాలయాల్లోనూ దాదాపు ఒకేసారిగా హారతులిస్తూ ఘంటానాదాలు శ్రావ్యమై కొన్ని జన్మలకుసరిపడా ఆనందపునిధులను హృదయంలో నిక్షిప్తం జేసుకోగలుగుతారు యాత్రికులు.

కన్ ఖాల్ :

హరిద్వార్ స్టేషనుకు 4 కి.మీ. దూరంలో ఉన్నది. చాల పురాతనమైనదీ, పురాణ ప్రసిద్ధమైనదిగానూ ప్రాముఖ్యం పొందినది. దక్షమహాధ్వరం జరిగినచోటు

దక్షప్రజాపతి ఆలయం కూడా వుంది. ప్రక్కనే సతీకుండం ఉంది. వీనికి తోడు దక్షిణేశ్వర, మహావీరాంజనేయ ఆలయాలున్నవి. ఇక్కడి గంగా స్నానఘట్టాన్ని అగ్ని కుండమంటారు. ముఖ్యమయినది రామఘాట్ చాల పవిత్రమైనదిగా భావించ బడుతూంది.

ఇక్కడ జరిగిన పురాణకథ చాలా విశేషం. ఈ కథతో అనేక ఇతరపవిత్ర స్థలాలకు సంబంధం వుండటం గమనార్హమైన విశేషం.

దక్షప్రజాపతి నివాసం కన్‌కాల్. ఆయనకు గల అనేకమంది కుమార్తెలలో సతీదేవి యొకతె. ఈమె తండ్రి అభిమతానికి వ్యతిరేకంగా మహాదేవుని పరిణయ మాడి ఇల్లు వదలి శివునికైలాస పర్వతం చేరింది భర్తతో.

మహారాజైన దక్షప్రజాపతి ఆడంబరంగా ఒక యజ్ఞాన్ని తలపెట్టాడు. అందరు అల్లుండ్రను ప్రత్యేకంగా ఆహ్వానించి స్వాగతసత్కారాలు చేశాడు. అయితే వీరిలో తన మాట వినని సతీదేవికిగాని, మహాశివునికి గాని పిలుపే లేదు. అయినా పుట్టింటిమీది మమకారంతో భర్త కాదని అంటున్నా సతీదేవి యజ్ఞాన్ని చూడటానికి పిలువని పేరంటానికి వెళ్ళింది. సతీదేవిని సమాదరించటంపోయి దక్షుని మనస్సు క్రోధాగ్ని కీలలకు నిలయమై ఆగ్రహించి శివుని దుర్భాషలాడాడు. భర్తృ దూషణం సహించలేని సతీదేవి యజ్ఞకుండంలో దూకి ఆత్మాహూతి గావించుకున్నది.

ఈ వార్త మహాదేవుని చేరింది. ఆయన కాలాగ్నిరుద్రుడే అయినాడు. క్రోధాగ్నితో దహించుకునిపోతున్న శివుడు తన జటాఝూటంలోని ఒకపాయను తీసి నేలమీద విసరికొట్టాడు. ప్రమథగణాల ఉద్భవం జరిగింది, వీరభద్రుడు నాయకుడై ఈ ప్రమథ గణాలలో దక్షుని యింటికివెళ్ళి దక్షుని యజ్ఞాన్ని ధ్వంసం చేశారు మహాభీకరంగా భీభత్సంగా.

అనంతరం మృతురాలైన సతీదేవి దేహాన్ని తన భుజాలమీద వేసికొని శోక తప్త హృదయంతో ప్రళయాగ్నిని సృష్టిస్తూ లోకాలన్నీ కసిమసిగా కలయ తిరుగు నారంభించాడు. ఈ పరితాప వేదనని చూసిన శ్రీ మహావిష్ణువు తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. సతీదేవి దేహం 52 శకలాలుగా ఛేధించబడి అనేకచోట్ల చెల్లా చెదురుగా పడిపోయాయి. ప్రతి శకలం పడినచోట ఒక్కొక్క శక్తిపీఠం వెలసి పవిత్ర మైన ఆలయాలు- పుణ్యస్థలాలుగా వెలశాయి. వీటిలో భాగంగానే నేటి మహానగరం కలకత్తాకూడా ఒకటిగా చెప్పబడింది.

బహుశా ఆనాటినుండే ఈ ఉదంతాన్ని పురస్కరించుకుని సతీ సహగమనం వ్యాప్తిలోకి వచ్చి సదాచారంగా భావించబడి- చివరకు హిందూ మత ఛాందస సంప్రదాయంగా కాలక్రమేణా రూపుదిద్దుకొని మహిళా మారణహోమానికి వేదికగా ఉపయోగపడిందని చెప్పుకోవచ్చు. ఆశయం ఏదైనా దురాచార సంప్రదాయంగా మారటమే గర్హించదగిన విషయం- మానవత్వానికి గొడ్డలిపెట్టు.

ఇక్కడికి దగ్గిరలో చూడదగినవి— దర్శనీయ స్థలాలు :

భీమగోడా :

హరిద్వారానికి ఉత్తరంగా సుమారు 2 కి మీ. దూరంలో ఉన్నది. ఇక్కడి నుండే పాండవుల అంతిమయాత్ర మహాప్రస్థానం గావించారని ప్రతీతి. ప్రాణాయామంతో తమ స్వర్గారోహణం చేశారని భారతకథ చెప్తుంది.

బిల్వకేశ్వరాలయం :

ఊరికి పడమరగా చిన్న కొండమీద బిల్వవనాంతరంగా అమరియున్న ఆలయం. ప్రక్కనే గౌరీకుండం ఉన్నది. రమణీయమైన ప్రకృతి శోభతోనిండి ఈ చోటనే గుహాంతరంలో దుర్గాదేవి ఆలయం అమరి యున్నది.

దగ్గరిలోనే చండీ పర్వతం గంగానదికి ఆవలితీరంలో ఉన్నది. భయంకరమైన అడవి ప్రాంతం. క్రూరమృగ సంచారం హెచ్చుగాగల ఈ కొండమీదనే చండీ ఆలయం, నీలేశ్వరాలయం, మానసాదేవి ఆలయాలున్నాయి. చూడవచ్చు.

ఇంకా ఈ ప్రదేశంలో దర్శనీయమైనవిగా— గంగాజీ మందిర్, గోవూఘాట్, చౌబీస్ అవతార్, మాయాదేవి, ఆశాదేవి, మాయాపూర్, సప్తసరోవర్, నహర్‌గంగ మొదలయినవి వాసికెక్కినవి.

ప్రధానమైన కొన్ని సంస్థలు ఆర్ష ధార్మిక తత్వము, ఆధ్యాత్మికతను ప్రచారం చేసే ధర్మసంస్థలుగా కొనియాడ బడుతున్న వానిలో పేర్కొనదగినవిగా- 1906లో స్థాపించబడిన ఋషికుల్- వేదవేదాంగ అధ్యయనాలతో ఆయుర్వేద శిక్షణ కార్యక్రమం కొనసాగే చోటుగా ప్రసిద్ధి గలది- స్వామి శ్రద్ధానందజీచే 1908లో ప్రారంభించబడిన గురుకుల్- సాహితీసేవ, ధర్మప్రచారంతో పునీతం చేసే సంస్థ, జ్వాలాపూర్ మహా విద్యాలయం- వానప్రస్థ శాఖతో సంప్రదాయానుసార శిక్షణ నిచ్చేది :- రామకృష్ణ మిషన్ ఆసుపత్రి మరెన్నో సంస్కృత పాఠశాలలు విద్యా పరిపోషకాలుగా ఆర్షవిజ్ఞాన కేంద్రాలుగా వర్ధిల్లుతున్నాయి.

# హృషీకేశం లేక ఋషీకేశ్

హరిద్వారం నుండి ఋషీకేష్‌వెళ్ళే మార్గంలో సుమారు 12 కి.మీ. దూరంలో రాయ్‌వాలా స్టేషను సమీపంలో సత్యనారాయణ మదిరం ఉంది. మనోహరంగా ఉంటుందీ మందిరం స్తంభములు, ఒక కోనేరు వుంది. చూచి వెంటనే ప్రయాణం సాగించవచ్చు.

మరో పదమూడు పద్నాలుగు కి.మీ. దూరంలో గంగా మహాదేవి రెండు వైపులా వున్న పర్వతాలను ఒరుసుకుంటూ ప్రవహిస్తున్నచోట సుందర పర్వతాలమధ్య చక్కగా అమరియున్న పట్టణం. జనాభా సుమారు 22,000. హరిద్వారం దగ్గరి కంటే ఇక్కడికి సులభంగా వెళ్ళవచ్చు. ఋషీకేశ్ పేరుకి తగ్గట్టుగా అనేక ఆశ్రమాలు, సాధువులకు నిలయం. హిమాలయ పర్వతారోహకులకు ఇది ఒక ముఖ్యమైన కీలక ప్రదేశం.

అనేక ధర్మశాల లున్నాయి. ఆంధ్రప్రదేశ్ నుండి వెళ్ళినవారు ఆంధ్రాశ్రమములో దిగుతారు. ఈ ఆశ్రమ వ్యవస్థాపకులు శ్రీ సచ్చిదానంద స్వాములవారు. వీరు తూర్పుగోదావరి జిల్లాలోని ఆవిడి గ్రామ వాస్తవ్యులు. ఇంత దూరంనుండి వెళ్ళిన స్వాములవారు యాత్రికుల సౌకర్యార్థం మొత్తం 64 గదులు, 10 వరండాలతో పెద్ద ధర్మశాలను నిర్మించి తద్వారా అపారమైన సేవలందిస్తున్నారు. అసామాన్యమైన ఈ విషయం ఎంతో ముదావహమైనది. శ్లాఘనీయం. ఈ పవిత్ర హిమాలయాల్లోని గంగోత్తరి, యమునోత్తరి, బదరీ, కేదార యాత్రికులకు కేంద్రంగా కూడా ఉంటుంది.

## త్రివేణి ఘాట్ :

ఇక్కడి గంగ, యమున, సరస్వతి నదులు కలియును. యాత్రికు లీ పుణ్య స్థలంలో స్నానాలు చేస్తారు.

ఇక్కడ భరత మందిరం ఆలయం, ఋషికుండు, పుష్కర మందిర్, గీతా భవనం ఉన్నాయి.

ఋషికుండు త్రివేణి ఘాటుకు ప్రక్కనే వుంది. ఋషికుండులో స్నానము చేసి శ్రీరఘునాధాలయమును దర్శిస్తారు యాత్రికులు. పుష్కర మందిరం శ్రీకోదండ రామస్వామి ఆలయం. అందమైన పాలరాతి విగ్రహాలు కమనీయం.

ఇక్కడే మహర్షి మహేష్ యోగి ట్రాన్సిడెంటల్ మెడిటేషన్ ధ్యానకేంద్రం పలుదేశాల నుండి విదేశీయులను ఆకర్షిస్తున్న కేంద్రం. ప్రఖ్యాత పాశ్చాత్య సంగీత విద్వాంసులు బీటిల్సు కూడా యోగి దర్శనార్థం ఇక్కడి వచ్చారట.

ఇదిగాక స్వామి శివానంద ఆశ్రమం, ఆశ్రమంలోని విశ్వవిద్యాలయం, వేద నికేతనం హిందూ అధ్యయన పరులకు ఆసక్తిని రేకెత్తించే విద్యాకేంద్రాలు. హిందూ తత్వము ఇక్కడి అధ్యయన విషయం. ప్రతి సాయంకాలం ఒక సాధుసత్తముడు సత్సంగమనే పేరుతో ఉపన్యాసాలు యిస్తుంటారు. స్వామి శివానాంద ఆశ్రమం 'ది డివైన్ లైఫ్ సొసయిటీ'గా వాసికెక్కింది.

మరో ధర్మశాల, సేవాకేంద్రంగా ప్రసిద్ధి చెందినది కాలీకమ్లీబాబా ధర్మశాల. ఇదిఒక సాధుమహాశయునిచే స్థాపించబడింది. సాధువు లందరకూ నిత్యభోజన సంతర్పణ జరుగుతుంది. బదరీ, కేదారం, గంగోత్తరి, యమునోత్తరి వెళ్ళువారికి మార్గ మధ్యంలో అనేకచోట్ల భోజన పదార్థాలు, ఇతర వసతులు కల్పిస్తూ యాత్రికసేవలో పరమార్థమును చాటుచున్నారు. బాబా సమాధి, గద్దీ దర్శనీయాలు.

## కైలాసాశ్రమం :

సాధువుల ఆశ్రమం. శంకర భగవత్పాదులవారి మందిరం, రామాశ్రమం ఉన్నాయి. దీనిని స్వామి ధనరాజ్ గిరిజీవారు స్థాపించారు.

## లక్ష్మణ ఝూలా మార్గం :

గంగానదికి ఆవలనున్న పవిత్ర బ్రహ్మపురికి వెళ్ళేవారికి నదిని దాటటానికి గల వంతెన సౌకర్యం. ఋషీకేశ్‌కి 5 కి.మీ. దూరంలో ఉన్నది. కాలినడకలో వెళ్తూ మార్గమధ్యంలో భరత, లక్ష్మణ, రామమందిరములు దర్శించుకుని వెళ్ళవచ్చు. వీరు రావణుని, ఇంద్రజిత్తును సంహరించటం వలన గలిగిన బ్రహ్మహత్యా దోష నివారణం రామాదులు తపస్సు చేసిన స్థలంగా చెప్పుకొంటారు.

## లక్ష్మణ ఝూలా :

అనాదిలో ఇక్కడ ఒక వంతెన శ్రీ రామచంద్రులవారి తమ్ములు లక్ష్మణ స్వామి కట్టించారని లేక ఏర్పరచటం జరిగిందని భావన. ఇప్పుడు ప్రస్తుతం అమరి ఉన్నది ఇనుప తీగెలతో క్రింద స్థంభాలు లేకుండా 80 అ. పొడవు, 6 అ. వెడల్పుతో మనుష్యులు, గుఱ్ఱాలు, గాడిదలు పోవటానికి మాత్రం వీలు కలిగిన ఉయ్యాల

వంతెన. ఝూలా అంటే ఊయల అని అర్థం. వంతెన దాటిన తరువాతనే గంగా తీరంలో బహురమణీయమైన ప్రదేశంలో నిర్మించబడిన గీతామందిరం చూడవచ్చు. గోరఖ్‌పూరు ముఖ్య కేంద్రంగా గీతా ప్రెస్సుద్వారా వైదిక మత ప్రచార సాహిత్యం ఇక్కడి నుండి వెలువడుతుంది. యాత్రికు లుండటానికికూడా మంచి వసతులున్నాయి ముందుగా పర్మిషన్ పొందాలి.

## పరమార్థ నికేతనం :

గీతాభవనం ప్రక్కనేగల పెద్ద ఆశ్రమం. 1924లో స్థాపించబడింది. ఆధ్యాత్మికతను పెంపొందించటానికి ఇతోధికంగా ఉత్సాహ ప్రోత్సాహాలు కలుగజేయటం ముఖ్య పరమావధి. అందుకు తగిన ప్రచారంగూడ విరివిగా జరుగుతుంటుంది. ఏప్రియల్ 15 నుండి జూన్ 30 వరకు ఆశ్రమంలో కొన్ని వందలు, వేలమంది సమూహంగా వుండి 'సత్సంగ సభలు' జరిపిస్తుంటారు. వ్యవస్థాపకులు స్వామి శుకదేవానందజీ మహారాజాగారు.

వసతికి ధర్మశాలలు, ఆశ్రమాలకు తోడుగా హోటళ్ళుగూడ అమరివున్నాయి. బస్సు రైలుస్టేషన్లకు అల్లంత దూరంగావున్న టూరిస్టు బంగళా మంచి వసతి. హోటల్ మేనక, జనతా టూరిస్టు లాడ్జి, ఇందర్‌లోక్ హోటల్ ఎన్నదగినవి.

బదరి, కేదారనాథ్, గంగోత్తరి మొదలగు యాత్రలు చేయువారికి ముఖద్వారసమమైనది. హరిద్వార్ నుండి ఋషీకేశ్‌కి రైళ్ళు, బస్సులు అనునిత్యం ఉన్నాయి.

## కార్బెట్ నేషనల్ పార్క్ :

సుమారు 225 కి. మీ. వైశాల్యంగల జాతీ యోద్యానవనం. 1935 లో వ్యవస్థీకరించబడింది. వన్యమృగ సంరక్షణ కేంద్రం. ముఖ్యంగా పెద్ద పులులు, ఏనుగులు, లేళ్ళు, సంబారులు, చిరుతపులులను వాటి సహజ సంచార రీతుల్లో విహరించటానికి తగినట్లుగా, యథేచ్ఛగా తిరుగాడటానికి వీలుగా సంస్కరించ బడింది.

హిమాలయ పర్వత పాదాలచెంత ప్రవహించే పావనమైన నదీమతల్లి రామ్ గంగానది ప్రవహిస్తుంది. నదిలో మొసళ్ళు విశేషం. చూడటానికి ధీకాలా మంచి సౌకర్యంగా వుంటుంది. పార్కుకి నడిబొడ్డున అమరియున్న ప్రదేశం. యాత్రికుల కనువుగా అబ్జర్వేషన్ పోస్టులు – మంచెలుకూడా ఉన్నాయి. సాయం సమయాల్లో

వన్యమృగ జాతుల జీవనం, సంచార వ్యవహారాలను గురించి మంచి చిత్ర ప్రదర్శ నలు గూడ నిర్వహిస్తుంటారు.

ఒకానొకప్పుడు కొన్ని సంవత్సరాల స్థిర నివాసం చేసిన జిమ్‌కార్బెట్ ప్రసిద్ధ మైన 'MAN EATERS OF KUMAON' అనే పుస్తక రచన ఇక్కడే చేశా రట. ఆయన తరువాత ఈ పార్కుకి ఆపేరు పెట్టటం జరిగింది.

వన్యమృగ విహారంతో పాటు అనేక రకాలయిన వలస పక్షి జాతులనుగూడ చూడవచ్చు. నిరంతరం స్వేచ్ఛగా ఎగిరే పక్షుల కిలకిల స్వరాలతో వనమంతా అహ్లాదకరమైన చల్లని వాతావరణం మనస్సులకు ఎంతో ప్రశాంతతను చేకూరు స్తుంది.

రామ్‌నగర్‌లో నిజమ్ కార్బెట్ లాడ్జిని మ్యూజియంగా మార్చారు.

ఈ వన సందర్శన అక్టోబరు నుండి ఫిబ్రవరి మాసం వరకు అనువుగా వుండేకాలం. యు. పి. హిల్ డెవలెప్‌మెంటు కార్పొరేషను వారు— ఢిల్లీ నుండి 3 రోజుల ప్యాకేజి టూర్లు నిర్వహిస్తున్నారు. ఏర్పాట్లకు :- టూరిస్టు ఆఫీసరు, యు.పి. గవర్నమెంటు, చంద్రలోక్ బిల్డింగ్, 36 జనపథ్, న్యూ ఢిల్లీ-110001. ఫోన్. నం. 322251 వారిని ముందుగా సంప్రదించండి.

గమనించదగిన విషయం :- మర్చిపోకండి - ఇక్కడ ఏనుగు మీద ఎక్కి విహారం చేయవచ్చు. చక్కటి ఫొటోలుకూడ తీసికోవచ్చు.

**విడిదికి-విశ్రాంతికి :**

ఢికాలలో ఓల్డ్, న్యూ ఫారెస్టు రెస్టు హౌసెస్ వున్నాయి. రోజుకు ఒక 100/- చార్జీమీద. ఇంతకంటె చౌకలో రు. 40/- చార్జితో టూరిస్టు కుటీరాలు, స్విస్ కాటేజ్ టెంట్స్ వగైరాలున్నాయి. భోజనం కూడా భలేచౌక. రు. 10/- లకు మీరు తినగలిగినంత-తిన్నన్ని.

పార్కు సాయంకాలం అయ్యేటప్పటికి మూసివేస్తారు. ఉదయం పెందలాడే గనుక చేరేట్లయితే వనవిహారానికి సదుపాయంగా ఉంటుందని వేరే చెప్పనక్కర లేదు.

# ఆల్మోరా

చుట్టు ప్రక్కల దృశ్యమానమయిన పర్వతాలు- వాటి శిఖరాలుమధ్యనే అమరియున్న సుందరమైన చిన్న పట్టణం. సముద్ర మట్టానికి దాదాపు 1650 మీటర్ల ఎత్తున అమరియున్న వేసవి విశ్రాంతి పర్వత కేంద్రం. మొదట ఇది నేపాల్ రాజ్యంలోని భాగంగా ఉండేది. 1815 లో జరిగిన ఘూర్ఖా యుద్ధంలో ఇండియాలో చేరింది. యాత్రికులు పట్టణం వెలుపలగల కాటేజీల్లో ఉంటుంటారు. ఇక్కడ ఉన్న ఈ పర్వతాలను కుమావన్ పర్వత సముదాయంగా పేర్కొనబడ్డాయి. గర్వాల్ కొండలలో రైల్వేలకు కాఠ్ గోడాము స్టేషను ఆఖరిది. అక్కడి నుండి మనోహరమైన రోడ్డుమార్గంలో బస్సుమీద ప్రయాణం ఒక దివ్యానుభూతి. దగ్గరలో 'మాయావతి' అనే రామకృష్ణ మఠం ఉంది.

కైలాసమునకు ప్రయాణం చేసేయాత్రికులు తమకు కావలసిన కూలీలను, గుఱ్ఱములను, ఇతర వస్తు సామాగ్రిని సమకూర్చుకొనే కేంద్రంగా ప్రసిద్ధం. ఆల్మోరా పట్టణ పరిసర ప్రాంతాలలో ఒక రౌండు చుట్టివస్తే అద్భుతమైన ప్రకృతి దృశ్యాలను మనస్సుల్లో ముద్రించుకోవచ్చు.

ఢిల్లీ నుండి నేరుగా ఆల్మోరాకు బస్సులు నేరుగా ఉన్నాయి. నైనిటాల్‌కి 68 కి.మీ. దూరం.

ఇక్కడికి 5 కి. మీ. దూరంలో కాశీనాధ్ ఆలయంవుంది. బ్రహ్మాండమైన ప్రకృతి అందాలతో పొదువుకుని ఉన్న అనేక పుష్ప వృక్షములతో మనోహరదృశ్య ప్రబంధ మానముగా ఉంటుంది. ప్రక్కనే 1 కి.మీ. దూరంలో కొండల్లో కేసరదేవి ఆలయం ఉంది.

బస్సుస్టాండుకు దగ్గరిలోనే 1.5 కి.మీ. దూరంలో ఉన్న బ్రైటన్ కార్నర్ **(BRIGHTON CORNER)** కి వెళితే అద్భుతమైన సూర్యోదయ, సూర్యాస్తమయా దృశ్యాలు చూడవచ్చును.

**ఉండటానికి :** టూరిస్టు కాటేజి, నీలకంఠ హోటల్ కొంచం చౌకగా అందుబాటులో ఉండేవి అయితే- గవర్నమెంటువారు నిర్వహించే టూరిస్టు బంగ్లా కాస్త ఖరీదయింది.

కవుసాని :

ఆల్మోరాకు 53 కి.మీ. దూరంలో వున్న చిన్న కుగ్రామం. పర్వత శ్రేణి మీద అమరియుండి చుట్టు ప్రక్కలగల 300 కి. మీ. దూరంలో గల పర్వత శిఖరాలు నయన మనోహర దృశ్యంగా కానిపించేచోటు.

ఉండటానికి టూరిస్టుబంగ్లా కాస్త ఖరీదయినది. రూముకు సుమారు 100/- వుండచ్చు. కాని అందుబాటులో పైన్ వ్యూ హోటల్, హోటల్ ప్రశాంత్‌లలో 10 రూపాయల్లో పడక సౌకర్యం ఉంది. పది నిముషాల నడక రోడ్డుమీద గాంధీ ఆశ్రమం, మరి యితర హోటళ్ళు కొన్ని సౌకర్యాలుగా ఉంటాయి.

రాణీఖేట్ నుండి రామ్‌నగర్ వెళ్ళే బస్సు మార్గంలో కవుసాకి అమరియున్నది. అతి సమీపంలోని రైలుస్టేషను కాఠ్‌గోడాము.

# నైనితాల్

జనాభా సుమారు 28,000. కుమావన్ పర్వత సముదాయం మధ్యన వున్న సుప్రసిద్ధ వేసవి మకాం, కాఠ్‌గోడాము చివరి రైలు స్టేషను. అక్కడి నుండి ప్రపంచం మొత్తంమీద సుందరమైన రోడ్డు మార్గంగా గణించ దగిన రోడ్డు మీద బస్సులో చేరవచ్చు. ఇది ఒకప్పుడు ఉత్తర ప్రదేశ్‌కి వేసవి రాజధానిగా వాసికెక్కింది. వేసవి కాలంలో విశ్రాంతికోసం వచ్చిన వారితోను, యాత్రికులతోను క్రిక్కిరిసి వుంటుంది.

సముద్ర మట్టానికి సుమారు. 6,400 అడుగుల ఎత్తున అమరియున్న ఎత్తైన ప్రదేశంలో పర్వతాలమధ్యన చక్కని అందాల సరస్సు దర్శనీయం. సుమారు ఒక మైలు పొడవు, పావుమైలు వెడల్పు గలిగిన సుందర సరస్సు. ప్రపంచం మొత్తం మీద అందమైన సరస్సుల్లో ఒకటిగా గణించబడింది. ఈ సరస్సు రెండుభాగాలుగా పైభాగం, క్రింది భాగంగా విభజించుకోవచ్చు. పట్టణ శివార్లలో వాహ్యాళిగా వెళ్ళితే అనేక సుందర దృశ్యాలు కమనీయంగా కనబడతాయి. దగ్గరిలో చైనా పేక్ ఎక్కితే మంచు కిరీటాలతో హిమాలయ పర్వతాలు రమణీయంగా దర్శనమిస్తాయి ప్రభాత వేళల్లో- పురాణ కాలంలో అత్రి, పులస్త్య మహామునులు వసించి తప

మొనర్చినట్లు స్కాంద పురాణంలో పేర్కొనబడిన పవిత్ర స్థలం. సరస్సులో బోటింగ్ సౌకర్యం కూడా ఉంది.

ఉండటానికి వసతులు : పట్టణానికి పడమర దిశన యూత్‌హాస్టలులో రు. 6/-తో పడక సౌకర్యం లభిస్తుంది. సామాన్యులకు సౌకర్యమైన వసతి.

నైనిటాల్ క్లబ్‌కి ఎదురుగా హోటల్ కారొనేషన్, సాయిదరి భవన్, పంజాబ్ హోటల్ అందుబాటులో అమరిన మరికొన్ని హోటళ్ళు.

శ్రీమంతుల సౌకర్యంగా గ్రాండ్ హోటల్, రాయల్ హోటల్, స్విస్ హోటల్ పేర్కొనదగినవి.

## రా ణి ఖే ట్

నైనితాల్‌కి ఉత్తరంగా అల్మోరాకి దగ్గరలో పడమరగా అమరియున్న చక్కటి వ్యూ పాయింట్. ఇక్కడి నుండి మంచుతో కప్పబడిన హిమాలయ శిఖరాలు చిత్రకారుని కుంచె గీసిన చిత్రంలా దృశ్యమానంగా కనబడతాయి. ఇక్కడికి 8 కి. మీ. దూరంలో ఉన్న చౌ భుట్టియా ఫల సంపన్నమయిన ప్రదేశంగా ప్రసిద్ధి.

### గర్వాల్ హిమాల్ ఆరోహణ క్రమం :

గర్వాల్ హిమాల్ పర్వతాల శ్రేణిలో పర్వతా రోహకుల ఉత్సాహాన్ని, ఇనుమడించే ఔత్సుక్యాన్ని రేకెత్తించే ఉత్తుంగ శిఖరాలెన్నో వున్నాయి. వానిలో ప్రసిద్ధి చెందిన నందాదేవి, త్రిశూల్ శిఖరాలుగూడా అమరి ఉన్నాయి. వాటితో పాటు హిందువులు అతి పవిత్ర స్థలాలుగా ఎంచే యాత్రిక స్వర్గధామాలు, ఆధ్యాత్మికంగా ఉన్నతోన్నతంగా భావించే పుణ్యస్థలాలుగా పేర్కొనబడే బద్రినాథ్, కేదార్ నాథ్, గోముఖ్ (పావన గంగ జన్మస్థలం) ఇంకా మరెన్నో పురాణ స్థలాలు అడుగడుగునా అలరించే విశేషములను పొదువుకుని ఉన్న దేవాలయాలు పురాణ పురుషులు, మునిశ్రేష్ఠులు నివసించిన పునీతమయిన ప్రదేశాలు త్రోవ పొడుగునా మనకెన్నో విషయాలను విప్పిచెప్పటానికి తారసపడుతుంటాయి.

### గమనిక :

దారిపొడుగునా నయన మనోహరంగా ప్రకృతి విరిసిన సోయగాలు అందాలను

మాటల్లో చెప్పలేనంత మధురానుభూతిని కలిగిస్తూ సాదరంగా తలలూపుతూ సృష్టి కర్త రచనా నైపుణ్యానికి ఆశ్చర్యం గొలిపే విధంగా కమనీయమైన కనువిందుచేసే ఈ ప్రదేశాలు తిరిగి చూడాలంటే కొన్ని సమయాలు మాత్రమే అనుకూలమైనవిగా ఉంటాయి.

ప్రదేశమంతా మంచుతో కప్పబడిన కొండల ప్రాంతం గావటంతో విపరీత మైన చలి యిక్కడ వాతావరణ ప్రవృత్తి. తట్టుకోటానికి తగిన ఏర్పాట్లతో వెళ్ళడం సముచితం.

సరియైన సమాచార సేకరణతోపాటు బాగా తెలిసిన మార్గదర్శకులు (గైడ్స్) ఉండటం ఎంతయినా అవసరం. ప్రస్తుత కాలంలో అనేకచోట్లకు బస్సు రూట్లున్నా కొన్నిచోట్ల నడకే శరణ్యం. అట్టి పరిస్థితుల్లో ఈ క్రింది సూత్రాలను విధిగా పాటించవలసి ఉంటుంది.

1) కూలీలను, మోత పనివారలను రిజిష్టర్డు ఏజన్సీల ద్వారా కుదుర్చుకోండి.

2) తోటి యాత్రికులవలె మనలో సంచరించే మోసగాళ్ళ బారిపడకుండా తగు జాగ్రత్తలో ఉండాలి.

3) నడిచి అలసిపోయినప్పుడు చమటపడితే చమట ఆరిన తరువాత స్నానం చేయండి.

4) ఈగలు ముసిరిన మిఠాయిలు, తినుబండారాలు తినకండి.

5) వెళ్ళేటప్పుడు అంటువ్యాధులు రాకుండా టీకాలు, ఇనాక్యులేషన్సు వేయించుకుని ఆ సర్టిఫికెట్లు జాగ్రత్త పెట్టుకోండి. లేకపోతే దారిపొడుగునా ఇబ్బంది లకు లోనుకావలసి వస్తుంది.

6) చలికి తట్టుకొనే విధంగా బ్లాంకెట్, రెయిన్‌కోటు, గొడుగు, చేతికర్ర, సూదులు, దారపుబండ్లు (కొండ జాతివారు అడిగినప్పుడు వారికి బహుమతిగా యిస్తే సంతోషపడతారు) నోటికి రుచిని ఊరించే పిప్పరమెంటు బిళ్ళలు వగయిరాలు తగు మాత్రంగా వెంటతీసుకొని వెళ్ళటం మంచిది— అత్యవసరం కూడా.

7) బదరీలోగాని, కేదారంలోగాని వేడినీటి కుండీల్లో ఎక్కువసేపు వుండి స్నానాలు చేయటం మంచిదికాదు,

బదరీ, కేదార్‌నాధ్, కైలాసయాత్రలు చేయగోరువారు మే, జూన్ మాసాలు, సెప్టెంబరు, అక్టోబరు మాసాలు మాత్రమే అనుకూలమైనవి.

ఋషీకేశ్‌లోని టూరిస్టు సమాచార కేంద్రంలో విచారించితే మనకన్ని విషయాలు సవిరంగా తెలియజేస్తారు.

హరిద్వార్‌లోగాని ఋషీకేశ్‌లోగాని సత్రాల్లో తమ బరువులను భద్రపరచి ఉంచుకోవాలి. అత్యవసరమైనవి మాత్రమే తీసికొని వెళ్ళాలి. ముఖ్యంగా ఇక్కడ కొనవలసినవి- ఉలెన్ స్వెట్టరు, చేతికర్ర, మంచి ఉలెన్ కంబళి లేక రగ్గు, చెవులకు కావలసిన టోపీ (ఉన్నది), కేన్వాస్‌బూటు- ఇతరంగా మామూలు దుస్తులు కావలసినవి. అవసరమనుకొనేవి యిక్కడనే ఏర్పాటు చేసుకోవాలని మనవి.

పూర్వకాలంలో అయితే ప్రయాణ సౌకర్యాలు చాల తక్కువగా ఉండేవి.కాని ఈనాడు బద్రీనాధ్, కెదారీనాథ్‌లకు అతి సమీపంగా చేర్చే బస్సురూట్లు ఏర్పడ్డాయి. నడకను చాలావరకు పరిమితం చేసుకోవచ్చు. హిమానీ ప్రాంతాలకు వెళ్ళేముందు తీసుకోదగిన జాగ్రత్తలు తీసుకొన్నాక బదరీనాధ్, కేదారీనాధ్‌లకు బయలుదేరుదాం. బదరి, కేదారయాత్రలు చేయగోరువారు ముందు కేదారనాధుని దర్శించి తరువాత బదరి యాత్ర చేయాల్సి వుంటుంది. అయితే ప్రస్తుతం బదరినాధ్ వరకు రోడ్డు మార్గం అమరియున్నది. కనుక ముందు బదరినాధ్ వెళ్ళి స్వామిని సేవించుకుని, కేదారనాధుని దర్శించుకోవచ్చును. హిందువులకు అతి ముఖ్యమయిన పురాతనపవిత్ర స్థలాలుగా భావించబడే ఈ రెండు స్థలాలను ప్రతివారూ దర్శించగోరుతారు. ముందుగా కేదారనాధుని మార్గం చూద్దాం. ముందు కేదారనాధుని దర్శించినవారు బదరియాత్రకు వెళ్ళవలెనంటే సోన్‌ప్రయాగ వరకు వచ్చి బదరినాధ్‌కు బస్సుద్వారా వెళ్ళవచ్చు.

## కేదారీనాద్ :

ఋషీకేశ్‌నుండి 250 కి.మీ. దూరం ఉంటుంది. సోన్ ప్రయాగ వరకు బస్సు వుంటుంది. సోన్‌ప్రయాగ నుండి తప్పనిసరిగా నడక సాగించవలసిందే. శ్రమకు ఓర్చుకొన గలిగేవారు, ప్రకృతి సౌందర్యాభిరుచులు కఠినమైనా, దూరమైనా పర్వతాలు ఎక్కుతూ, దిగుతూ పర్వత గ్రామీణ ప్రాంతాలను స్పృశిస్తూ ఉత్సాహంగా నడిచి వెళ్ళగోరేవారు, గంగోత్రి నుండి కేదార్‌నాధ్‌కు వెళ్ళవచ్చు. ఉత్తరకాశికి 20 కి.మీ. అవతలగా ఉన్న మాలా నుండి నడకమార్గం ప్రారంభమవుతుంది. లంకా, గంగోత్రిల

ద్వారా వెళ్ళవచ్చు. దానికి ఈ క్రింది మార్గంగా వెళ్ళటానికి తయారయి వెళ్ళాల్సి వుంటుంది. ఇది మొత్తం 8 రోజుల కార్యక్రమం. ఆ కార్యక్రమం ఈ క్రింది విధంగా ఏర్పాటు చేసుకోవచ్చు మాలా చేరిన తర్వాత,

| | | | |
|---|---|---|---|
| మొదటిరోజు | ప్రయాణం | మాలా నుండి బేలక్ఖాల్ | 15 కి.మీ. |
| రెండు | ,, | బేలక్ఖాల్ – బుడాకేదార్ | 14 ,, |
| మూడు | ,, | బుడాకేదార్ – ఘుట్టు | 16 ,, |
| నాలుగు | ,, | ఘుట్టు – పన్వాలిఖంటా | 12 ,, |
| ఐదు | ,, | పన్వాలిఖంటా – మగ్గు | 8 ,, |
| ఆరు | ,, | మగ్గు – సోన్‌ప్రయాగ్ | 9 ,, |
| ఏడు | ,, | సోన్‌ప్రయాగ్ – కేదార్‌నాథ్ | 20 ,, |
| ఎనిమిది | ,, | కేదార్‌నాథ్ – సోన్‌ప్రయాగ్ | 20 ,, |

సోన్‌ప్రయాగ్ నుండి చివరి ఇరవై కిలోమీటర్ల దూరంలో 6 కి.మీ. దూరం వరకు టాక్సీలో వెళ్ళవచ్చు. వచ్చేటప్పుడు కూడా అలాగే మరలా సోన్‌ప్రయాగ్ చేరవచ్చు.

కేదారనాథము అనాదిగా పురాణ ప్రసిద్ధి చెందిన శివాలయం. సముద్ర మట్టానికి 11,500 అ. ఎత్తున మంచుతో కప్పబడిన పర్వత శిఖరాలమధ్య అమరియున్నది. క్రింద నుండి లంబకోణంగా నేలమట్టం నుండి 22,850 అ. ఎత్తున నీలకంఠ పర్వతమనేది సృష్టి, స్థితి, లయల త్రిమూర్తులలో లయకారుడైన మహాదేవుని నివాసపు వెండి కొండలు, పంచశిఖరాలు గల ఈ శ్రేణి రుద్ర హిమాలయాలు లేక సుమేరు పర్వత శిఖరాలుగా పురాణాల్లో పేర్కొనబడ్డాయి. ధర్మరాజు తప్ప మిగిలిన పాండుపుత్రులందరూ తమ అంతిమశ్వాసను వదిలిన పవిత్రమైన చోటుగా ప్రసిద్ధి చెందినది. గంగోత్రి, యమునోత్రిలలో ఉదకములను కేదారేశ్వరుని అభిషేకానికి తీసికొని వస్తారు యాత్రికులు. ద్వాదశ జ్యోతిర్లింగములలో 9వదిగా ప్రసిద్ధి. సుమారు ఏడు మీటర్ల పొడవు, 70 సెం.మీ. వెడల్పుగల శిలమీద 4 మీటర్ల ఎత్తున అమరియున్న శివలింగము. స్వామిని అందరూతాకి స్వయంగా అర్చించుకోవచ్చు. పంచనదీ సంగమ స్థానమయి ముఖ్యంగా పావన మందాకినీ తీరంలో ఉన్న పవిత్రస్థలం. సంవత్సరంలో ఆరు మాసాలు మాత్రం మే నుండి అక్టోబరు వరకు ఆలయం తెరచియుంచబడుతుంది.

శీతాకాలం ఆరుమాసాలు మూసి ఉంచబడుతుంది. ఈ సమయంలో సుమారు 40 కి.మీ. దూరంలో ఉన్న ఊఖీ మఠంలో వుండి కేదారేశ్వరుని అర్చిస్తారు. ఆలయం మూయ బోయేముందు జ్యోతిని వెలిగిస్తారు. ఈ జ్యోతి ఆలయం తెరచునంత వరకు అంటే ఈ ఆరుమాసాలు కూడా ఆరకుండా వెలుగుతుంది. ఇది గొప్ప విశేషం.

ఆలయం వెనుక పర్వతాల నుండి పాండవులు ద్రౌపదితో గూడి స్వర్గారోహణ పర్వంలో చెప్పబడిన మహా ప్రస్థానమునకు వెళ్ళారని ఆ మార్గంలో వారి పాద చిహ్నాలు మనకు పండాలు చూపుతారు. ఈ మహాభారత కథానాయకుల విగ్రహ ములు, ద్రౌపది, కుంతీదేవి విగ్రహాలు ఆలయంలో చూడగలం. ఇక్కడ కూడా మంచు గడ్డల్లో ఉష్ణజలధారలు విశేషం.

అనేక ధర్మశాలలు, హాస్పిటలు, పోస్టాఫీసు మొదలైన అన్ని సౌకర్యాలు ఉన్నాయి. పూజ్యశ్రీ శంకర భగవత్పాదులు ఆదిశంకరులవారు ఇక్కడనే సిద్ధి పొందారని ప్రతీతి.

## గంగోత్రి — గోముఖం :

గంగోత్రి పవిత్ర గంగానది. పావన భాగీరథియై మహాదేవుని ఝటాజూటమైన దివినుండి భువికి దిగినచోటుగా పేర్కొనబడింది. మరో 24 కి.మీ. దూరంలో గోముఖతీర్థం ఉన్నది. ఇదే గంగావతరణ పుణ్యస్థలం. ఇక్కడినుండి మొదలైన గంగానది హిమాలయ పర్వతలోయల గుండా సుగమం చేసుకుని మహాప్రవాహమై తన స్వచ్ఛజలాల ద్వారా దేశాన్ని సుభిక్షంచేస్తూ పునీతమైనది. భారతీయ ఆధ్యాత్మిక తత్వానికి గంగానదీ పరీవాహక ప్రాంతమంతా పవిత్ర స్థలాలతోనిండి దివ్య సందేశాన్ని నలుదిక్కులా వెదజల్లుతూ జ్ఞానభిక్షకు కారణమైన సంస్కృతి సాంప్రదాయాల నిలయాలకు కాణాచియై వెలుగొందుతూంది. ఈ పుట్టుక స్థలం అతి పవిత్రమైనదే కాక అత్యంత రమణీయమైన ప్రకృతి దృశ్య పరమార్థం. ఋషీకేశ్ నుండి 247 కి. మీ. ముస్సోరి నుండి అయితే 212 కి.మీ. దూరం. సముద్ర మట్టానికి 3,140 మీటర్ల ఎత్తున గంగోత్రి ఒకచిన్న గ్రామం భాగీరథి కుడివైపు తీరంలో గంగామాత ఆలయం వుంది. గంగోత్రిలో యాత్రికులు తర్పణములు, శ్రాద్ధవిధులను ఆచరించి తమ పితృదేవతలకు శాశ్వత స్వర్గప్రాప్తిని కూర్చి ధన్యుల మయ్యామని ఆనందిస్తారు. గంగోత్రి మార్గమంతా పుష్పవన భరితమై భువిమీద వెలసిన నందనో ద్యానంగా భాసిస్తూ, కనులపండువై శ్రమను ఇట్టే మరిపించి ఆహ్లాదాన్ని చేకూరుస్తూ ప్రయాణో

త్సహాలమై ముందు ముందుకి సాగిపోతుంటాం. ఇక్కడ ఉన్న గంగామాత ఆల యాన్ని జైపూరు మహారాజావారు నిర్మించారట. మార్గంలో సాధు కుటీరాలనేకం తారస పడుతుంటాయి. దట్టమైన దేవదారువనా లున్నాయి.

భాగీరథి శిఖరాలమధ్య 4,225 మీటర్లు ఎత్తున గంగోత్రి నుండి 24 కి. మీ. దూరంలో నున్న గోముఖ తీర్థం చేరాలంటే చాల ప్రయాసతో కూడుకున్న పని. గైడు లేనిదే వెళ్ళటానికి సాహసించ గూడదు. మధ్యలో ఎప్పుడు మంచు బండలు కొండలుగా జారిపడుతుందో చెప్పలేము. మహాప్రమాద కరమైన సాహసం. శ్రమించి చేరితే మనకు ఒక అలౌకికానందమే కాక అద్భుతమైన దృశ్యం చూడదగును.

ఇంత ఎత్తున ఒక విశాలమైన మంచుగోడ. దాన్ని దాటితే కొన్ని అంటే దాదాపు 100 చ. కి. మీటర్లు పర్వతం పరచుకుని ఉన్న సమతల మైదానం ఉంది. ఈ ప్రదేశాన్నే దిక్పాలకుడైన కుబేరుని స్థానం— 'అలకాపురి'గా పేర్కొనబడింది. అంతా మంచుతో కప్పబడియున్న ప్రదేశం. ఏనాడు ఇక్కడ జనావాసం ఉందో అసలు లేదో కూడా తెలియదు. అయితే అంతా దేవభూమి. స్వర్గ సదృశం- మాన వుడు ఒంటరిగా చేరలేని చొరరాని ప్రదేశంగా గణ్యం. ఇక్కడి హిమనిధులు కరిగి జలరూపంలో అలకనందా, మందాకినీ నదులకు నీరమురొసంగునట. ఈ పర్వతాల క్రిందునే మట్టి, యిసుకతో కలసిన జలాలతో అతివేగంగా సుడులు తిరుగుతూ ప్రవహించేదే 'గంగా భవాని'. వేదకాలంలో ఈ గంగోత్రి మైదానం గోముఖ తీర్థం వరకూ వ్యాపించి ఉండేదని చెపుతారు. కాని కాలక్రమేణా కొంత తరిగి పోయిం దని చెప్పవచ్చు. గోముఖం అవతలగా దివ్య పురుషులైన కొంతమంది ఋషి పుంగ వులు ఒంటరిగా తపస్సు చేసికొనే నందనవనం, తపోవనం ఉన్నాయని అక్కడకు వెళ్ళాలంటే మానవ మాత్రులకు సాధ్యం కానిదని అంటారు.

ఋషికేశంనించి ఉత్తర కాశి - ఋషి - దబ్రాని వరకు వాహనంమీద (ఆటో మొబైల్) ప్రయాణం చేయవచ్చు. అక్కడి నుంచి లంకా చేరాలి. లంకా నుండి గంగోత్రి, గోముఖములకు ఒక ఆరు రోజుల ప్రయాణ కార్యక్రమాన్ని ఏర్పరుచు కోవాలి. గోముఖ ద్వారం తీర్థానికి వెళ్ళగోరేవారు సాహసికులు, వాతావరణంలో ఉండే గడ్డకట్టుకు పోయే చలికి తట్టుకోగలిగిన వారు గైడు దారి చూపుతుండగా మాత్రమే వెళ్ళవలెను. అక్కడ మనకు కావలసిన ఆహారపదార్థాలు వగయిరాలు తగుమాత్రంగా వెంట తీసుకుని వెళ్ళాల్సి వుంటుంది.

పర్వతమార్గ కార్యక్రమ వివరం :

| | | | |
|---|---|---|---|
| మొదటి రోజు – | లంకా – | గంగోత్రి – | 11 కి.మీ. |
| రెండవ రోజు – | గంగోత్రి – | చిర్బాసా – | 12 " |
| మూడవ రోజు – | చిర్బాసా – | గోముఖం – | 7 " |
| నాలుగవ రోజు – | గోముఖం – | చిర్బాసా – | 7 " |
| ఐదవ రోజు – | చిర్బాసా – | గంగోత్రి – | 12 " |
| ఆరో రోజు – | గంగోత్రి – | లంకా – | 11 " |

ఇక్కడో చిన్న విషయం– అయినా పెద్దగా గమనించ తగింది. మానవుడు పుట్టుక దగ్గర నుండీ అతి సన్నిహితంగా ప్రకృతితో మెలగి ఎన్నో రహస్యాలు తెలుసుకుని తన జీవిత సౌఖ్యంకోసం వెంపర్లాడాడు— ఆడుతున్నాడు. అయినా ప్రకృతి తనలో ఎన్నో అగమ్యాలను తనలో దాచుకుని ఇంకా ఇంకా రహస్యాలు, అద్భుతాలు మానవ మేధస్సుకు పదునూ, పరీక్షలు పెడుతూనేవుంది. భౌతికంగా ఇంకా ఎంతో శక్తినీ, యుక్తినీ సంపాదించగలగాలనే మానవ లక్ష్యాల గమ్యాలు మనకు అల్లంత దూరంలో కనపడి మాయమవుతూ వున్నాయనడానికి ప్రకృతి భౌతికశక్తి బలంముందు తన అల్పత్వాన్ని అంగీకరించక తప్పనిస్థితి మనకు గోచర మయ్యే దృశ్యం మానవునికి విసిరిన ఒక గొప్ప సవాలు. నూతన శక్తికి ప్రేరణ.

గోముఖానికి తూర్పున స్వర్గా రోహణ పర్వతం – నారాయణ పర్వతం— దాటంగనే బద్రినాథ్ అతి దగ్గరే! పడమరనే ఉన్న నీలకంఠ పర్వతం దాటితే కేదార్‌నాధ్ కూడ అతి దగ్గరే, కాని అటు బద్రీనాధ్ గాని, ఇటు కేదార్‌నాధ్ గాని అడ్డత్రోవలో నున్న అత్యున్నత హిమశిఖరావళిని దాటాలంటే మానవుని శక్తిచాలదు. సుమారు 22 వేల అడుగులు ఎత్తులోనున్న అంబర చుంబిత హిమశిఖరాలను, దాట శక్యమే! కాదు ప్రస్తుతానికి మాత్రంలేదు– శక్తి చాలదు. కనుక చుట్టు తిరిగి శ్రమించి పోవాల్సిందే! ఈ దుర్భేధ్యమైన మంచు పర్వత శ్రేణియే మన దేశానికి పెట్టని కోటలు అనేది ఇందుకే!

గంగోత్రి–కేదార్‌నాధ్–భద్రీనాధ్‌ల మార్గంలోవున్న పవిత్ర స్థలాలు– దర్శ నీయాలు. యాత్రిక లోకంలో సరికొత్త ఉత్ప్రేరకాలు– జాత్యాహికుల ముందున్న చిక్కులు–గజిబిజిగా ప్రకృతి మన ముందుచిన పజిల్స్ అనేకం. అయితే వాటిలో మానవుడు ఎన్నో ఇదివరకే సాధించాడు. వాటిలో కొన్నిటిని పురాణ పురుషులతో

ప్రసిద్ధంచేసి, శ్రమకోర్చి, ముందు తరాలవారికి మార్గదర్శకులుగా అనాదినుండే వేద పురాణ విహితమైన కొన్ని ప్రదేశాలను పరికిద్దాం. ముందుగా గంగోత్రి కేదార్‌నాథ్ మార్గంలో—

రుద్రప్రయాగనుండి కేదార్‌నాథ్ మధ్యలో :

ఈ మంచుకొండల్లో అనేకచోట్ల వెలసిన చిన్నచిన్న దుకాణాలు దారిచూపే దీపికలుగా వుండి ఒక్కొక్క దానికి ఒక్కో పేరుమీద కొంత గుర్తులుగా మనకు గోచరమయ్యేవి చట్టీలు. ఈ చట్టీలు అనేకంగా మనకు మార్గం మధ్యంలో కావలసిన వస్తు సంభారములను విక్రయిస్తు తమ జీవన భృతిని సాధించుకోటమే గాక యాత్రి కులకు ఎంతో ఉపయోగ కరమైన మార్గనిర్దేశం చేస్తూ యాత్రిక సేవలో పాలుపంచు కొని మైలురాళ్ళయినా యనటంలో సందేహంలేదు.

అగస్త్యముని :

రుద్రప్రయాగకు సుమారు 20 కి.మీ. అగస్త్యమహాముని తప మొనరించిన చోటు.

గుప్తకాశి : రుద్రప్రయాగకు, కేదార్‌నాథ్‌కు మధ్యలో ఉన్నది. ప్రాంతమంతా తరులతా పుష్పభరితమై మనోహరంగా ఆహ్లాదాన్నిస్తుంది. స్ఫటిక విగ్రహాలున్న విశ్వనాథాలయం, అర్ధనారీశ్వరాలయం ఉన్నాయి. శైవక్షేత్రం. ఇక్కడ ఒక నీటి కుండు ఉన్నది. ఎప్పుడూ 4 అ. మట్టం వరకు లోతుమాత్రం ఉండేట్లుగా నీరు వచ్చి పోవటానికి ఏర్పాట్లతో అమరియున్నది. మన ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న మహానందీ క్షేత్రంలోని కుండం జ్ఞాపకానికి వస్తుంది చూస్తే.

త్రిజోగీ నారాయణం :

అనాదిక్షేత్రం. గంగోత్రి-యమునోత్రి నుండి వచ్చే మార్గాలు రెండు కలిసే చోటు. జగత్కల్యాణ శేఖరుడు పరమేశ్వరుడు లోకమాత అయిన పార్వతీ దేవిని ఇక్కడే పరిణయ మాడాడుట. ఆనాడు వారు సేవించిన అగ్ని ఇప్పటికీ ప్రజ్వరిల్లు తూనేవుంది. యాత్రికులు ఇక్కడి భస్మాన్ని అతి పవిత్రంగా తీసికెళతారు. ధర్మ శాలకూడా ఉంది.

గౌరీకుండం :

సముద్ర మట్టానికి 6,500 అ. ఎత్తు. పార్వతీమాత హిమవంతుని పుత్రికగా జనన మందిన చోటు. ప్రకృతిలోని రెండు వైరుధ్యాలు ఒకేచోట కనబడే విచిత్ర విశేషమైన అతి శీతలమైన మంచు గడ్డలమధ్య అమరి యున్న పొగలుగ్రక్కే ఉష్ణ కుండం సరఫరా చేసే సహజమైన వేణ్ణీరు. ఇక్కడ మాత పార్వతీదేవి స్నానమా డిందట. యాత్రికులు ఈ కుండంలో స్నానంచేసి హాయిననుభవిస్తూ ధన్యుల మయ్యామని ఆనందిస్తారు.

కేదారేశ్వరుని దర్శనమైన పిదప బదరికాశ్రమం - బద్రినాథ్ అని పిలవబడే పుణ్యస్థలం దర్శించటానికి మార్గమధ్యంలో- విశేషాలు.

కేదార్ నాథమునుండి దిగువకు వచ్చి గంగోత్రిమార్గం కాకుండా రుద్ర ప్రయోగ మార్గాన్ని అనుసరించి వెళుతుంటే-

రామ్‌పూర్ చట్టిదగ్గర బాబా కాలేకమ్లీవాలా ధర్మశాల ఉన్నది. ఇక్కడికి సుమారు 3 కి.మీ. దూరంలో బాలగణేశుని దర్శనమవుతుంది. 8 కి. మీ. దూరంలో దుర్గాచట్టిఉంది. మహిషాసుర మర్దనీదేవి మందిరం ఉంది. మధ్యలో హనుమాన్‌చట్టి దాటితే 6 కి.మీ. దూరంలో నారాయణ కోటీచట్టి ఉన్నది- ఇక్కడ వీరభద్రేశ్వర, భస్మాసుర, మహదేవ, సత్యనారాయణ స్వాముల ప్రాచీన దేవాలయాలున్నాయి. భద్రేశ్వర కుండంలో జలధారలున్నాయి. యాత్రికులు వీటిలో స్నానంచేస్తారు. 10 కి.మీ. దూరంపైన వెళితే నవలింగ కేదారం తరువాత మరెన్నో దేవాలయాలు న్నాయి. మధ్య మధ్య మార్గంలో కొన్ని గ్రామాలుకూడా తగులుతాయి. నీటిధారలు, సెలయేళ్లు, నదీ నదాలు వంతెనలమీద దాటుకుంటూ పోవాలి- కొంత అరణ్యం, మధ్యలో సన్నని త్రోవ. గమించితే నాలా చట్టిదగ్గర లలితాదేవి పురాతన మందిరం ఉంది. మరల యిక్కడ రుద్రప్రయాగ మార్గముంటుంది. దానిని వదలి బదరీ మార్గాన్ననుసరించి వెళ్ళాలి. కాలిత్రోవన ఒక కి.మీ. దూరంలోపునే నాలాబట్టినుండి ఛమోలీ మార్గం తగులుతుంది. మరికొంచెం ముందుకు వెళ్తే మందాకినీ గంగను వంతెనమీదుగా దాటి శ్రమతో కూడిన ఎక్కుడు ఎక్కవలసి వుంటుంది. దాదాపు ఒక కిలో మీటరుపైగా ఎక్కి వెళితే ఊఖీమఠం చేరగలుగుతాము. కేదారనాథాలయం మూసివుండే ఆరుమాసాల కాలంలో కేదారనాధుని ఇక్కడి నుండే దర్శించి వెళతారు యాత్రికులు.

యాత్రికులు ఉండటానికి రెండస్థుల సత్రం ఉన్నది. ఇక్కడ పంచముఖి కేదారనాధుడు వేంచేసియున్న ప్రదేశం. గుడి చాలా ఎత్తుగా వుంటుంది. శిఖరంమీద బంగారు కలశం వుంది. భూషణాలంకృతుడైన మాంధాత మహారాజు విగ్రహం చూడవచ్చు. ఎదుటనే ఓంకారేశ్వర మహాదేవుని విగ్రహం, శ్రీ కేదారనాధుని బంగారు ఉత్సవవిగ్రహంఉన్నాయి. ఆలయంలో దివ్యమైన అష్టధాతు నిర్మితమైన పార్వతీదేవి, తుంగనాథేశ్వర పార్వతీ అమ్మవారల విగ్రహాలున్నాయి. అర్ధనారీశ్వరుడు, కాశీచతుర్భుజ నారాయణ విగ్రహాలు చూడవచ్చు.

ఊఖీ మఠముకు 6 కి.మీ. దూరంలో దుర్గాచట్టీ మార్గం మధ్యలో గ్వాలియర్, ఇండోర్ మహారాజులు కట్టించిన ధర్మశాల లున్నాయి. మరికొంచెం దూరంలో గుప్తగంగ ఉన్నది. విపరీతమైన చలి. చోపత్తచట్టి నుండి ఎడమవైపుకు వెళితే తుంగనాధ క్షేత్రం- కుడివైపుకి వెళితే బదరీనాధ క్షేత్రం. ఛమోలీ దగ్గర కేదార్ నుండి వచ్చే మార్గము- రుద్రప్రయాగ నుండి వెళ్ళేమార్గాల కలయిక- కూడలి.

ఎడమవైపు వెళ్ళటానికి 5 కి.మీ. శ్రమతో కూడిన ఆరోహణం చేయాలి. పేరుకుపోయిన మంచుగడ్డల మధ్య తుంగనాధాలయం అమరియున్నది. గ్రామంలేదు. కాని ధర్మశాల లున్నాయి. అధినాధుడైన దేవత తుంగనాధుడు. ఇక్కడే అమృత కుండమనే నీటికుండు- ఆకాశగంగాధార ఇందులో పడుతుంది. స్నానంచేసి తర్పణాదులు చేయవచ్చును. నల్లరాతితో కట్టిన శివాలయ శిఖరాన బంగారు కలశం-లోపల అనేక దేవతామూర్తులను చూడగలం. తుంగనాధుడు లింగరూపి. కేదారనాథ, మహేశ్వర, రుద్రనాథ, తుంగనాధుల భోగమూర్తులు, కల్పేశ్వర మహాదేవ పార్వతీ దేవుల యొక్క, కాలభైరవ, వేదవ్యాసుల, శంకరాచార్యుల అష్టధాతు విగ్రహాలు మరెన్నో దేవతామూర్తులను చూడవచ్చు.

చట్టీలు చాల దాటిన తరువాత కొన్ని కిలోమీటర్లు దూరం తరువాత గోపేశ్వర చట్టి చేరుతాం. గోపేశ్వర స్వయం భూలింగము. ఆ వెనుక పార్వతీ అమ్మవారి విగ్రహం ఉన్నాయి. దర్శించుకుని 10 కి.మీ. దూరంలో ఉన్న లాలసంగా అనేపేరుతో ఉన్న ఛమోలిచట్టి- హరిద్వారం నుండి రుద్రప్రయాగ, కర్ణప్రయాగల మీదుగా నేరుగా బదరీనాథం వెళ్ళే మార్గం ఇక్కడ కూడలిగా యేర్పడి కలుస్తాయి.

బదరీమార్గంలోని విశేష ప్రదేశాలు :

ఋషీకేశ్ నుండి బయలుదేరిన తరువాత సుమారు 55 కి.మీ. దూరంలోనే మార్గమధ్యంలో వ్యాసఘాట్– వ్యాసభగవానులు తపస్సు చేసిన స్థలంగా ప్రసిద్ధి. భాగీరథి వ్యాసగంగా సంగమం.

బదరికాశ్రమం :

అలకనందా భాగీరథి సంగమ స్థానం. ఇక్కడ వేంచేసియున్న శ్రీరాముని సేవించుమని, సంగమంలో స్నానంచేసి బ్రహ్మకపాలం వెళ్ళటానికి ముందుగా ఇక్కడ శ్రాద్ధవిధులను ఆచరించాలి. ఇది ఆళ్వారులచే గానం చేయబడిన 108 వ దివ్యదేశంగా పరిగణనలో ఉన్నది. భోజన శాలలు, ధర్మశాలలు, వసతి గృహాలు అన్నీ వున్నాయి.

బదరినాథమునకు వెళ్ళేవారికి జోషిమఠ్ ఒక ముఖ్యమయిన కూడలి. బస్సులు ఇప్పుడు సరాసరి బదరీనాథము వరకు ఉన్నాయి. మధ్యలో ఉన్న గరుడగంగను దర్శించవచ్చు. గంగలో స్నానంచేసి అందులోని చిన్నిచిన్ని రాళ్ళను తీసికొనిపోయి శ్రీ గరుడాళ్వారులవారు వేల సంవత్సరాలు తపస్సుచేసిన ప్రదేశంలోగల గరుడ భగవానుని పాదాలచెంత ఉంచి అర్చించి యిండ్లకు తీసికొనివచ్చి పూజించుకొనే ఆచారం ఉన్నది.

మధ్యలోగల టంగిని, పాతాళగంగను సేవించుకొని గులాబికోటిచట్టి, కుమార్ చట్టి, రౌనేటి, పయినా, ఝూడుక్కలా, శింగధారల ద్వారా జోషిమఠం చేరవచ్చును.

జోషీ మఠ్ :

గర్వాల్‌హిమాల్ కొండల్లో ఒక కీలకకేంద్రం. ఆది శంకరులు స్థాపించిన నాల్గు మఠాల్లో ఇదికూడా ఒకటిగా పేర్కొనబడింది. శీతాకాలం ఆరుమాసాలు కేదార్ నాథ్‌లో మాదిరిగానే బదరీనాథాలయం కూడా మూసి వేయబడి వుంటుంది. ఆ సమయంలో బదరీనారాయణుని ఉత్సవ విగ్రహాదులకు స్వామి కైంకర్యం అర్చనాదులు యిక్కడనే నిర్వహిస్తారు. సముద్ర మట్టానికి 6000 అ. ఎత్తు. నవదుర్గ, శివ, పార్వతి, గణేష్, నృసింహ ఆలయాదు లున్నాయి. గులాబిలు విశేషంగా దొరుకుతాయి. పండ్లు, యితర పుష్పాలు, కూరలు బాగా దొరుకుతాయి.

విష్ణుప్రయాగ :

5000 అ. ఎత్తున విష్ణుగంగ- అలకనంద నదులు కలిసే సంగమ స్థానం. మహావేగంగా మేఘగంభీర నిస్వనాలతో గుండెలదిరేటట్లుగా ప్రవాహ వేగం భయోత్పాతం కలిగిస్తుంది. ప్రకృతి ప్రళయ భీకర స్వరూపానికి మచ్చుతునకగా కానగును.

మధ్యలో గురుద్వారా శిఖ్కుల పవిత్రస్థలం గూడ గమించి పాండుకేశ్వర్‌చట్టి చేరవచ్చు. బదరీ దేవస్థానంవారి ధర్మశాల ఉంది. వాసుదేవ, బదరీ ఆలయాలున్నాయి స్వామి విగ్రహ ప్రతిష్ఠ పాండు మహారాజుచే ప్రతిష్ఠిత మయిందట. అందుకే దీనికి పాండులేశ్వరమనే పేరు వచ్చిందని ప్రతీతి.

వినాయకచట్టి, లాంబగడ్‌లు దాటి హనుమాన్‌చట్టి చేరగలం. ప్రకృతి సౌంర్యం పరమ రమణీయం. 9వేల అడుగుల ఎత్తున ఉన్న ఈ ప్రదేశంలో ఆంజనేయాలయమున్నది. హనుమాన్‌ధార అనే సెలయేరు అలకనందలో కలుస్తుంది. పలు విధాలయిన పుష్పజాతులు కనువిందు చేస్తాయి. ఇక చివరి కెప్పుడెప్పుడాయని ఎదురు చూచే బదరనాథ్‌పురి కొంతదూర ముండగనే నేత్రపర్వంగా కనపడుతుంది.

## బ ద రీ నా థ ధా మ ం

దీనినే బ్రహ్మకపాలం అని కూడా అంటారు. బదరికాశ్రమం అని కూడా నామాంతరంఉంది. మార్గం సమతలంగాఉంటుంది. ఇప్పుడు బస్సులు నేరుగా ఇక్కడికి చేరే మార్గం ఉంది.

28,000 అ. ఎత్తుగల ఉత్తుంగ పర్వత శిఖరాలు మధ్య నారాయణ పర్వత శిఖరం అంబర చుంబితంగా చుక్కలను చూపుతూ నింగిదాకా ఎగసి మహోన్నతంగా ఆలయం వెనుకనే సాక్షాత్కరిస్తుంది. బదరీధామం సముద్ర మట్టానికి 10 వేల అడుగుల ఎత్తున వుంది. ఇది 106వ దివ్యదేశంగా కీర్తించబడినది.

అధిదేవతయైన శ్రీ బదరీ నారాయణస్వామి, అరవింద వల్లీతాయారు, తప్త కాంచన విమానం, తప్తకుండు తీర్థం, తిరుకోవలం, బదరీవృక్షం, తిరుమంగయాళ్వారు, పెరియాళ్వారు, మంగళా శాసనం, నారాయణుని కుడివైపుగల కుబేరుడు గణేశ్వరుడు, ఎడమప్రక్కన లక్ష్మీనారాయణ మూర్తి, దిగువన ఉద్ధవుడు, నారదుడు గరుడాళ్వారులను నయన పర్వంగా వీక్షించవచ్చును.

శ్రీ మహావిష్ణువు పద్మాసనాసీనుడై జ్ఞానముద్రతో జపనిష్ఠా గరిష్ఠుడైన నరునకు మం॥ తోపదేశం చేస్తున్న భంగిమలో మలచబడిన మూర్తి విశేషమే శ్రీ బదరీ నారాయణుని విగ్రహం. ఫాలభాగంలో నేత్రసదృశమై ఒక దివ్యమైన వజ్రం కాంతులను వెదజల్లుతూంటుంది. మిగతా శరీర భాగమంతా మణిభూషణాలంకృతమైన నగల విశేషాలతో అలంకరించబడి నేత్రపర్వంగా వింతకాంతు లీనుతుంటుంది. తలపైగా స్వర్ణ వితానం అలకరించబడి వుంటుంది.

అసలు వేద పురాణాల కాలం నుండీ మహాభారత కాలం ముందుగానే ఈ స్వామి విశేషాలు, ఆలయ విశేషాలు కొనియాడ బడినాయి. కాని తరువాతి కాలంలో కొంత అశ్రద్ధకు ఆలవాలమైనదని తెలుస్తుంది. బహూశా విపరీతమైన హిమపాతానికి గురై యుండటంవల్ల కాబోలు. చివరకు కొన్నాళ్ళకు పురాతన ఆలయం, మూర్తిని అలకనందలో కలిపివేయటం జరిగింది. తరువాత ఆదిశంకరులకు ఒకదివ్య స్వప్నంలో సాక్షాత్కరించిన స్వామి విగ్రహం ఎక్కడ వుందో తెలిపిన కారణాన మరల అచ్చోట దొరికిన విగ్రహం పునఃప్రతిష్ఠ జరిగింది. ఆలయం కూడా మరల నిర్మాణం చేయబడిందని చెపుతారు. శీతలకాలం ఆరుమాసాలు కూడా విపరీతమైన హిమపాతం మూలంగా మంచుతో కప్పబడి వుంటుంది. ఈ కాలంలో మూసివేయబోయే టప్పుడు కేదారేశ్వరంలో లాగే ఇక్కడ కూడా ఒక జ్యోతిని వెలిగిస్తారు. ఆ జ్యోతి మరల ఆలయం తలుపులు తీసేనాడు అలాగే విస్మయంగా వెలుగుతూ ఆరకుండా మనకు దర్శనమిస్తుంది. ఇది గొప్ప విశేషం. యాత్రికులు ఈ జ్యోతి దర్శనం కోసంవస్తారు. మూసివున్న కాలంలో దేవతల పూజలందుకొంటాడు స్వామి.

ఆలయం చుట్టూ ప్రదక్షిణం చేయటానికి వీలుగా విశాలంగా వుంటుంది. సమీపంలోనే పురాణ ప్రవచనాలు, భక్తిగానాలు గావించు యాత్రిక బృందా లుంటాయి. ఆలయమును అనుకుని ధర్మశిల, స్వామి తిరుమంజన తీర్థాలున్నాయి. తప్తకుండుకు వెళ్ళేదారిలో స్వామి విగ్రహమును పునఃప్రతిష్ఠించిన శంకరాచార్యుల వారి విగ్రహం చూడవచ్చు.

ఆలయమున కెదురుగా అలకనందా నదిని ఆనుకొని సెగలపొగలతో తృళ్ళింతలాడే వేడినీటికుండు ఉంది. దీన్ని తప్తకుండం అంటారు. ఇక్కడ నీటి ఉష్ణోగ్రత 125° వుంటుంది. కొంచెం ఆగండి. ముందు నారద కుండులో స్నానంచేసిన పిదప తప్తకుండు స్నానం చేయాలి. లేకపోతే వ్యాధిగ్రస్తులయే అవకాశముందనేది గాథ

విశ్వాసం. ఇక్కడి ఆలయ పూజారి అయిన మలబారు నంబూద్రి బ్రాహ్మణులు స్నాన సౌకర్యం కోసం ప్రత్యేకంగా ఒక గదిని కట్టారు. అనేక శాలలు, ధారలు న్నాయి. ఇక్కడ పితృతర్పణాలు చేస్తారు.

### బ్రహ్మకపాల శిల :

అలకనందా నదీ తీరంలో సుమారు 120 మీటర్ల దూరంలో కనబడుతుంది. బ్రహ్మ సరస్వతీదేవిని మోహించినందుకు పరమ శివుడు కోపించి త్రిశూల ప్రయోగంతో బ్రహ్మ శిరస్సును ఖండించాడు. బ్రహ్మ శిరస్సు శివుని చేతికంటుకునిపోయి బ్రహ్మ హత్యా దోషం ఆవరించింది. అందుకు పరమశివుడు పాతక నివారణార్థం సర్వ తీర్థములను సేవించి శ్రీ మహావిష్ణువు ఆదేశం ప్రకారం ఈ శిల దగ్గరకు వచ్చే సరికి పాతక నివారణకు సూచనగా ఏతత్ బ్రహ్మకపాలం (శివుని చేతికంటుకొన్న శిరస్సు) జారి పడిపోయిందట. బ్రహ్మహత్యా దోషవిముక్తికలిగిన పవిత్ర ప్రదేశంగా చెప్తారు. అందువలననే బ్రహ్మకపాలమనే పేరు సార్థకమయిందని పురాణాలు చెప్తున్నాయి. ఇక్కడ పితృదేవతలకు శ్రాద్ధ విధులు నిర్వర్తించటం పుణ్యప్రదం. అలకనందా తీరంలో తర్పణలు విడుస్తారు.

బదరీనాథ పై భాగమును కింపురుష వర్షము అంటారు. సంకల్పాల్లో గూడ ఇలాగే చెప్తారు. దగ్గరలో ఎన్నో తీర్థాలు, ఆలయాలున్నాయి. వానిలో-

### వ్యాస గణేశ గుహాలు :

పదునెనిమిది పురాణాలు, మహాభారత రచన వ్యాస భగవానుడు చెప్తుండగా శ్రీ గణేశుడు ఘంట మెత్తకుండా వ్రాసిన చోటుగా ప్రసిద్ధి. ఈ గుహను నిర్మించిన వారెంత ధన్యులో! ఈనాటికి గూడ మహాభారత కథ హైందవ జ్ఞాన, భక్తి, కర్మ, వైరాగ్యములను నిర్దేశిస్తూ ప్రపంచ రచనల్లో ఉత్తమమైనదిగా పంచమ వేదంగా కొనియాడబడుతున్న సంగతి తెలియనిది కాదు,

'మానా' లేక మణిభద్రపురం మనదేశపు చివరి గ్రామం. కన్యాకుమారి దక్షిణపుకొనఅయితే ఇది ఉత్తరపుకొన మానా కనుమద్వారా మానససరోవరం వెళ్ళవచ్చు. కాని కడు దుర్గమమైనది- మానవులు వెళ్ళలేనిది.

వ్యాస గణేశ గుహల దగ్గరనే కేశవ ప్రయాగ ఉంది. ఇక్కడ పవిత్ర సరస్వతీ అలకనందల సంగమస్థానం.

మాతామూర్తి ఆలయం సరస్వతీ నదీ తీరంలో ఉన్నది. వసుధార అనే అద్భుత జలపాతం గంభీరంగా ఎంతో ఎత్తునగల హిమశిఖరం మీద నుండి క్రిందకు ఝరీ వేగంతో దుమికే జలపాతం చూడటానికి రెండు కళ్లూ చాలవు. ధార శిలలమీద పడి చిందే తుంపరల మీద పడి ప్రతిఫలించే సూర్యకాంతి అనేక రంగులతో విభ్రమాన్ని వింతసోయగాన్ని కలిగిస్తుంది.

సతోపన్‌థా :

బదరిధామమునకు 20 కి. మీ. దూరంలో ఉన్న ఒక అందాల సరస్సు. ప్రకృతి ఇక్కడ తన అందాలను విరబోసియున్నట్లుంది సృష్టిలీలావిచిత్ర వైశిష్ట్యాన్ని వెలార్చుతూ మానవ మేధస్సు కందని అతీతమైన దివ్యలోకానుభూతిని కలిగించే అద్భుతం. ఈ రచనా వైశిష్ట్యంలో సృష్టికర్త రచనా నైపుణ్యం వేనోళ్ళ శ్లాఘించక తప్పదు. మానవునిలోని మనీషి మేల్కొని దుర్భావములన్నీ పటాపంచలై సర్వేశ్వరుని లీలా విశేషములకు ఆశ్చర్య పడుతూ దివ్యజ్ఞానసంపన్నుడై మరల ఎన్ని జన్మలనెత్తి ఐనా మరల మరల చూడాలనే ఆశ ఆకాంక్షలతో తను కూడా ఈ సృష్టి రచనలో ఒక అణువునైనందుకు తన జన్మ ధన్యమైనదని భావిస్తాడు.

ముఖ్య గమనిక :

బదరినారాయణంలో విజయవాడ పేరును చిరస్థాయి చేసిన వైశ్య ప్రముఖులు శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారి వితరణతో నిర్మించబడిన ఆంధ్రాశ్రమం తెలుగువారి విడిదికి ఎంతో అనుకూలంగా ఉంటుంది. నిజంగా రెడ్డిగారెంత ధన్యులో ! ఇంత చక్కటి ధర్మశాల అంత దూరాన అమరియుండటం మన అదృష్టంగా భావించవచ్చు.

బదరిధామంనుండి మరల ఋషీకేశ్‌కి రావటం, వచ్చేటప్పుడు చూడదగినవిగా నంద ప్రయాగ – మందాకినీ అలకనందల సంగమస్థానం – దగ్గరలో కణ్వాశ్రమం. రావణబ్రహ్మ తపస్సు చేసిన చోటు ఉన్నాయి – మరియు కర్ణప్రయాగ – మహా మహాభారతంలోని దానకర్ణుడు – కుంతీ పుత్రుడు సూర్యుని గురించి తపస్సు చేసిన చోటుగా ప్రసిద్ధి చెందింది. కనుకనే ఈ పేరు సార్ధకమయింది. పైగా అలకనందా పిండారా (కర్ణగంగ)ల సంగమ స్థానం. పంచప్రయాగలలో ఈ రెండింటినీ కూడా పేర్కొనబడ్డాయని ప్రతీతి.

బదరీధామంనుండి రాబోయే ముందు ప్రకృతి సౌంధర్యారాధకులకు ప్రత్యేకంగా పర్వతారోహణౌత్సాహికులకు మరో పరమ కమనీయమైన కనువిందు.

**నందాదేవి శిఖర శరణ్యం :**

చుట్టూ 70 హిమశిఖరాల పైగా ఆవరించబడి సముద్ర మట్టానికి 7, 818 మీటర్ల ఎత్తున గంగోత్రి - మిలన్‌ల మధ్యన అమరియున్న మైదాన ప్రాంతం. చూడటానికి ఒక పెద్ద కోటలాగ వుంటుంది. ఇది సహజ సిద్ధంగా విధాత్ర నిర్మిత మైన కట్టడంలాగా భావిస్తుంది. చుట్టుకొలత చూస్తే 120 కి. మీ. దూరంతో 640 కి. మీ. చదరంలో అమరిన విశాలమైన చదరం. ఎన్నో జలపాతాలు, నదీనదాలు, వనాలతో చూడటానికి బహు శోభాయమానంగా వుండి నందాదేవి శిఖరారోహకులకు బేస్ కాంపు.

జోషిమఠ్ నుండి 15 కి. మీ. నడక దూరంలో అనేక ఎగుడు దిగుడులతో చేరవలసి వుంటుంది. బహు ప్రయాసభరితమైన ఈ ప్రయాణం మనిషి ఓపికకు ఒక పెద్ద పరీక్ష. అయితే అంతులేని ఆనందం, మనస్సుకి సాధించగలిగిన తృప్తి అనిర్వచనీయంగా కలుగుతాయి. లాట నుండి 6 కి. మీ దూరం మొదటి ప్రదేశం లాటాఖారక్ 1524 మీటర్ల ఎత్తు ఎక్కేసరికి ఆయాసం వస్తుంది. విరిసిన ప్రకృతి అందాలు, సోయగాలు శ్రమను మరిపించి ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని కల్గిస్తాయి. ఋషి గంగా మార్గంలోని రోంటి, నందాఘంటి, బేతర్‌తోలిలు బ్రహ్మాండమైన దృశ్యాలు శ్రమను మరిపించి మురిపాన్ని కలిగిస్తాయి. లాటాకారక్ ప్రదేశం అంతా పుష్ప భరితంగా వుంటుంది. చలిగాలులు విపరీతంగా వుంటాయి. బేతర్‌తోలిహిమాల్ ఉత్తరంగాను, త్రిశూల్ దక్షిణంగాను దృశ్యం చెప్పనలవికాదు—అనూహ్యం. దృశ్యమానమయిన 7068 మీటర్ల ఎత్తున ఉన్న దునాగిరి దాటిన వెంటనే నందాదేవి శరణ్య పుణ్యస్థలిని వీక్షించగలము. మాలాతుని లోయకి వచ్చేసరికి హనుమాన్ పడమటి దిశను చూడవచ్చును. దగ్గరనే గల దిబ్రుఘేటల్ నదీ తీరంలో పచ్చని పసిరిక బయళ్ళు ఆ వెంటనే అరణ్యం, వేసవిలో రమణీయమైన పుష్పజాతులు కమనీయమైన ఆహ్వాన దృశ్యం. కొన్ని పర్వత శిఖరాలు దాటితే పర్వతారణ్యాల గుండా మార్గం 'తిలచున్ని' దాటి భుజగర పరిక్రమణాన్ని అధిగమించాలి. ఇందుకు ముఖ్యంగా మూడు మార్గాలు- 1) దునగిరి, చంగ్ భంగ్ బేస్, 2) త్రిశూల్‌బేస్, (1979 లో కనుక్కోబడిన నూతన మార్గం) 3) నందాదేవి ఉత్తరపు బేస్ (చంగ్ భంగ్ మైదానానికి ఎగువున వున్న రిషితాల్)

మొత్తం పన్నెండు రోజులు కార్యక్రమం :

1 రోజు జోషిమఠ్ - లాటా - 25 కి. మీ. బస్సు ద్వారా వెళ్ళవచ్చు.
లాటా - లాటాఖారక్ - 6 కి. మీ.
2 రోజు - లాటాఖారక్ - ధరాన్సి - 10 కి. మీ.
3 రోజు - ధరాన్సి - దేవ్‌డి - 13 కి. మీ.
4 రోజు - దేవ్‌డి - రమాని - 8 కి. మీ.
5 రోజు - రమాని - భుజగర - 6 కి. మీ.
6 రోజు - భుజగర - తిలచన్ని - 8 కి. మీ.
7 రోజు - తిలచన్ని - నందాదేవి బేస్‌కాంప్ - 5 కి. మీ.
8 రోజు - నందాదేవి బేస్‌కాంప్ - భుజగర - 6 కి. మీ.
9 రోజు - భుజగర - రమాని - 6 కి. మీ.
10 రోజు - రమాని - ద్రిబుఘేటా - 17 కి. మీ.
11 రోజు ద్రిబూఘేటా - ధరాన్సి - 5 కి. మీ.
12 రోజు - ధరాన్సి - జోషిమఠ్ - 31 కి. మీ బస్సుద్వారా 15 కి. మీ కలిపి

ఋషీకేశం చేరిన తరువాత అక్కడినుండి ఎడమవైపుకి వెళితే డెహ్రాడూన్, ముస్సోరి ప్రాంతాలను చూడవచ్చు.

డెహ్రాడూన్ :

ఋషీకేశంకు 42 కి. మీ. దూరంలో ఉంది. ముస్సోరి అతి సమీపం. మంచి అందమైన పట్టణం. పురాణ ప్రసిద్ధితోపాటు ఆధునిక కాలంలో కూడా కొన్ని కీలక వ్యవస్థలు అమరియున్న పట్టణం.

పూర్వం మహాభారత కాలంలో విలువిద్యాచార్యుడైన ద్రోణుడు నడిపిన యుద్ధ విద్యల స్కూలు అట. పాండవులు, కౌరవులు యిక్కడనే తమ శస్త్రాస్త్ర విద్యలు, అనేక యుద్ధవిద్యలు ద్రోణాచార్యుని వద్ద శిక్షణ పొందారు. ఈ ప్రదేశాన్ని 'డెహ్రా ద్రోణ'గా పిలువబడే ఈ చిరుపట్టణం కాలక్రమేణా డెహ్రాడూన్‌గా మారింది. డెహ్రా డూన్ అంటే లోయ మకాం అని అర్థమట.

గర్వాల్‌హిమాల్‌కి ముఖ ద్వారంగా చెప్పుకోవచ్చు. ఇక్కడ చూడదగినవి. 'డూన్‌స్కూల్' మన ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ చదువుకున్న స్కూలు. అద్భుతమైన ప్రకృతి సౌందర్యం, గవర్నమెంటువారి ఫారెస్టు రిసెర్చి హౌస్, నేషనల్ డిఫేన్స్ అకాడమీ, రాబర్స్ గుహలు, తాపకేశ్వర శివాలయం, లక్ష్మణసిద్ధ ఆలయం, కల్సి దగ్గరవున్న అశోకుని శిలా శాసనం, ప్రసిద్ధి చెందిన సహస్ర జల ధారా జలపాతములు, శ్రీ గురుగోవిందసింగ్ వారి పురాతన శిక్కు గురుద్వారం మొదలయినవి. బ్రిటిష మ్యూజియం మర్చిపోకండి!

**ముస్సోరి :**

యు. పి. లోని వేసవిమకాం. చక్కని హిల్ స్టేషను. మొట్టమొదటి ఆవాసం పొందినవాడు 1827లో ఒక ఆర్మీ ఆఫీసరు 'కేప్టెన్ యంగ్'. తరచు అన్ని హిల్ స్టేషన్లలోను సుందరమైనదిగా మహారాణి సదృశంగా పేర్కొనబడుతూంది. డెహ్రాడూన్ నుండి 35 కి.మీ. దూరంలో వుంది. సముద్ర మట్టానికి 2000 కి.మీ. ఎత్తులో వుంది. ఇది ఒక గుర్రపునాడా ఆకారంలో ఏర్పడిన కొండ భాగం. విశేషంగా పండ్ల జాతులకు ప్రసిద్ధి. చుట్టూవున్న హిమవత్పర్వతాలు కడురమణీయంగా ఒకవంక, మరోవంక రమణీయమయిన ప్రకృతి దృశ్యాలతో అలరారే డూన్‌లోయ మనోహరం. రాత్రిపూట నింగి కెగసిన డెహ్రాడూన్ విద్యుత్కాంతి అంబరాన వెలిగేకాంతి రేఖలాగా పొగగట్టి చక్కని పాలపుంతని మరిపిస్తుంటుంది. ముస్సోరిలో దేశం మొత్తానికి కీలక పదవులు నిర్వహించే అడ్మినిస్టేటివ్ ఆఫీసర్ల ట్రెయినింగ్ సెంటర్ లాల్ బహదూర్‌శాస్త్రి అకాడెమీ ఇక్కడనే వుంది.

ఝూలాఘర్ నుండి ప్రారంభమయ్యే రోప్‌వే గన్‌హిల్ కొండకు చేరుస్తుంది. అక్కడినుండి ఆకాశంలో బద్రీనాధ్ మొదలయిన పుణ్యస్థల దర్శనం కనువిందు చేస్తుంది.

దగ్గరలో అనేకమయిన జలపాతాలున్నాయి. వాటిలో పేర్కొన దగినవిగా మోసి, భట్టా, కేంతి మొదలయిన జలపాతాలున్న ప్రదేశాలు మంచి పిక్నిక్‌స్పాట్స్.

**లాల్ దిబ్బా :**

ముస్సోరిలో ఎత్తయిన శిఖరం. ఇక్కడి నుండి చూస్తే అనేక దేవతా నివాసాలు— కేదార్‌నాథ్, బద్రీనాథ్ మొదలయిన వాటితోపాటు స్వచ్ఛ వాతావరణంలో నందాదేవి, త్రిశూల్, ద్రోణగిరి పర్వత శిఖరాలను చూడగలం.

# యమునోత్రి, దోడితాల్.

అసలు బదరి కేదార్‌నాథ ధాముల యాత్ర చేయువారు ముందుగా యమునోత్రి, గంగ్రోత్రిల వద్దకు వెళ్ళి ఆయా నదుల పవిత్రస్థలాల నుండి స్వచ్ఛ జలాలను కేదారంలోను, బదరీలోను అభిషేకించటానికి తీసికుని రావటంకద్దు. కనుక ఈ యాత్రలలో సంప్రదాయానుసారం మొదటనే యమునోత్రిని దర్శించి పవిత్ర జలాలతో రావటం ఎంతయినా సముచితం. యమునోత్రి పావన యమున బృందావన జమున పుట్టిన పవిత్ర పుణ్యస్థలం- హిమాలయ శృంగాలలో బహురమణీయమయిన ప్రకృతి అందాలతో విరిసి ఉన్నటువంటి దృశ్యమానమయిన చోటు. శ్రమపడియైనా యాత్రికులు ఇక్కడి పవిత్ర దర్శనం చేయనిదే వెళ్ళరు. హైందవ సంస్కృతీ సాహిత్యాలలో యమునానదికి చాల విశిష్టమైన స్థానం ఉంది.

యమునోత్రి పావన యమున పుట్టుక స్థలం. హిమాలయ పర్వతాలలోని కాళింది పర్వత సానువుల్లో సముద్రమట్టానికి 4421 మీటర్ల ఎత్తునవున్న సమతల ప్రదేశంలోని ఘనీభవించిన మంచుగడ్డలు కరిగిన జలధారలు మూలధారమై వడివడిగా కిందికి దిగి పరవళ్ళ ప్రవాహమై ప్రవహించే నదియై భరతఖండాన్ని సుజల పూర్ణం చేస్తుంది. ఇక్కడ ఈ పర్వత మధ్యంలో నదీతీరంలో ఎడమవైపుగా యమునాదేవికి ఆలయమున్నది. ఆలయానికి దిగువనే ఉష్ణ జలధారల ఊటలున్నాయి. యిక్కడి ఉష్ణధారలు అతి ఉష్ణంగా ఉంటాయి. బదరీధామంలో కంటే ఎక్కువైన ఉష్ణం ఇక్కడ గమనించతగింది. దాగాపు 194 డిగ్రీల ఫారన్‌హీటు ఉష్ణోగ్రత ఉంటుంది. బియ్యం మూటగట్టి నీళ్ళలో ఉంచితే పచనమవుతుంది.

**వసతులు :**

కాలీ కమ్లీవాలా వాని ధర్మశాల, లాల్ రఘునందన్ ధర్మశాలలున్నాయి. రెండు రోజుల నడక మార్గంలో దగ్గరనే గల దోడితాల్ దగ్గరకు తీసికొని వెళుంది. ఇక్కడ దట్టమైన అరణ్యాలు పైన దేవదారు, ఓకు చెట్లు మహోన్నతంగా పెరిగినవి వుంటాయి. ఒక చక్కని సరస్సు అమరియున్నది. చేపలు విశేషం. అనేక రకాల రంగురంగుల పక్షులు, నీటిపక్షులు వగైరాలు నయన మనోహరంగా సందడి చేస్తుంటాయి. సరస్సు చుట్టూవున్న తీరంలో సహజమైన నీటి ఊటలులోని ఆహారం పక్షులకు ప్రధానమైన ఆహారం.

టెహ్రీడామ్ :

అనేక మంది వాతావరణ పరిశీలకులను, రాజకీయ నాయకుల ఆందోళనలను కాదని ఇక్కడ ప్రస్తుతం భాగీరథికి ఒక బృహత్తరమైన బహుళార్థ సాధకమైన ప్రాజెక్టుపనులు అతి చురుకుగా సాగుతున్నాయి. బహుశా 1990 కల్లా ఈ అనకట్ట పూర్తవుతుందని అంచనా. ప్రాజెక్టు పని పూర్తయితే 27 లక్షల ఎకరాల పంట పొలాలకు నీరు, 2400 మెగావాట్ల విద్యుత్తు లభ్యమయి దేశం మొత్తం మీదనే అతి పెద్ద అనకట్టగా రూపొందే ఏర్పాటుతో చకచకా ముగిస్తున్నారు పనులు. దీనికి సోవియట్ యూనియన్ వారి సాంకేతిక అండదండలున్నాయని కనుక ఈ నేపథ్యంలో జరిగే నిర్మాణ విశేషంలో అన్ని లోపాలు కొట్టుకుపోతాయని మానవాళికి మహత్తర కానుకగా భాసించగలదని ప్రభుత్వం వారి వాదన. ప్రభుత్వం వారి నమ్మకం వమ్ము కాకూడదని భవిష్యత్తులో సుందర స్వప్నాల నిజరూపంగా భాసించగలదని ఆశిద్దాం.

అడుగు ముందుకేస్తే అందాల దేవభూమిని గురించి ఎంతని వ్రాయగలము ? చూచి ఆనందించి జన్మ సాఫల్యం చేసుకోవలసిందే తప్ప !

ఇంకా ఇక్కడ ఉత్సాహం ఉంటే చూడదగినవి. హేమకుండ్, రూప్‌కుండ్ సరస్సులు, పిండారమైదానం రామ్‌నగర్ వగయిరాలు ఇంకా ఇంకా ఎన్నో ఎన్నో వసతీ, వయసూ, ఓపికా ఉండాలేగాని జీవితం చాలదు.

## పర్వతారోహణ ఔత్సాహికులకు ప్రత్యేకం

## యమునోత్రి — డోడితాల్ మార్గం :

మొత్తం 7 రోజుల ప్రయాణ కార్యక్రమం.

1 రోజు — ముస్సోరి - హనుమాన్ చట్టి 81 కి.మీ.
(75 కి.మీ. బస్సుమీద, మిగతా 6 కి.మీ. టాక్సీలోను)
2 రోజు - హనుమాన్ చట్టి - జానకిచట్టి - 7 "
3 రోజు - జానకిచట్టి - యమునోత్రి - 14 "
జానకిచట్టి - "

4 రోజు – జానకిచట్టి – ఖసర్ – 14 కి.మీ.

5 రోజు – ఖసర్ – దోడితాల్ – 16 కి.మీ.

6 రోజు – దోడితాల్ – అగ్రో – 15 "

7 రోజు – అగ్రో – కల్యాణి – గంగోత్రి – 17 "

ఉత్తరకాశి – "

## కువారి కనుమ మార్గం :

8 రోజుల కార్యక్రమం—

1 రోజు – జోషిమఠ్ – గోర్సన్ – 15 కి.మీ.

(మొదటి 8 కి.మీ. టాక్సీ ద్వారా వెళ్ళవచ్చు)

2 రోజు – గోర్సన్ – చిత్రకంఠ 9 కి.మీ.

3 రోజు – చిత్రకంఠ – కువారి – 8 "

4 రోజు – కువారి – దొనబెట్టి 7 – "

5 రోజు – దొనబెట్టి – పన్నా – 8 "

6 రోజు – పన్నా – సోన్‌ఖరక్ – 14 "

7 రోజు – సోన్‌ఖరక్ – రమ్మాని – 6 "

8 రోజు – రమ్మాని – ఘట్ – 14 "

ఘట్ – నంద ప్రయాగ్ – 29 " (టాక్సీమీదరావచ్చు)

## ఖాత్ లింగ్ మైదానం :

మొత్తం 13 రోజుల ప్రయాణం.

మొదటి మూడు రోజులు కేదార్‌నాథ్ మార్గాన్ని అనుసరించి వెళ్ళాలి. చూడండి.

1 నుండి 3 రోజు – కేదార్‌నాథ్ మార్గం.

4 రోజు – ఘట్ట – రిహ – 10 కి.మీ.

5 రోజు – రిహ – గంగి – 10 "

6 రోజు – గంగి – ఖాన్‌సోలి – 15 "

7 రోజు – ఖాన్‌సోలి – ఖాత్‌లింగ్ – 11 "

8 రోజు – ఖాత్ లింగు – నౌముతి – 9 కి.మీ.

9 రోజు - నౌముతి - కల్యాణి 12 కి.మీ.
10 రోజు - కల్యాణి - రీహ - 15 కి.మీ.
11 రోజు - రీహ - ధాపర్ధర్ - 15 కి.మీ.
12 రోజు - ధాపర్‌ధర్ - గంసాలి - 25 కి.మీ.
గంసాలి - టెహరి - 31 కి. మీ. (బస్సులో)
13 రోజు - టెహ్రి - ఋషికేశ్ - 72 కి. మీ.

### వేలీ ఆఫ్ ఫ్లవర్స్ :

ప్రకృతి పరచిన అందాలగని. త్రోవలో గోవింద్‌ఘాట్ నుండి కొంచం దూరం నడిస్తే హేమకుండ్ సరస్సు కూడా చూడవచ్చు. జూన్ నెల మధ్యనుండి సెప్టెంబరు మధ్యవరకు మైమరపించే వేలీ ఆఫ్ ఫ్లవర్స్‌ను దర్శించటం మరువరాని మధురానుభూతి. చల్లటి మలయ సమీరంలో అల్లల్లాడుతూ నేత్రపర్వంగా స్వాగతం పలుకుతాయి ఎన్నో పుష్పజాతులు. సుమారు 10 కి. మీ. పొడవు, 2 కి.మీ. వెడల్పులో పరచిన రంగుల తివాచీ. మధ్య మధ్య అనేక సెలయేళ్ళు వచ్చి కలిసి ప్రవహించే పుష్పవతీ నది ఈ లోయను రెండుగా చేస్తుంది. ఆ చివరన ఘోరాధుంగీ మహాపర్వతం లోయను అరికట్టుతుంది.

లోయనుండి ఘంగరియా వరకు లక్ష్మణ గంగను అనుసరించి వెళితే హేమ కుండు సరస్సు చేరవచ్చు. సిఖ్ఖు మతగ్రంథం 'గ్రంథసాహిబ్' లో విశిష్ఠంగా పేర్కొనబడింది. సిఖ్ఖుల గురువు గురు గోవింద్‌సింగ్ ఇక్కడ సప్తశిఖరాలమధ్య అమరిన ఈ సరస్సు తీరంలో కొన్నాళ్ళు తపస్సు చేసిన పుణ్యస్థలంగా ప్రతీతి. సిక్కులకు అతి పవిత్ర స్థలంగా ఎన్నబడింది. మొత్తం మూడు రోజుల కార్యక్రమంలో ఈ రెండు ప్రదేశాలను దర్శించవచ్చు.

1 రోజు - గోవిందఘాట్ - ఘంగరియా - 14 కి. మీ.
2 రోజు - ఘంగరియా - వేలీ ఆఫ్ ఫ్లవర్స్ - 6 కి. మీ.
3 రోజు - వేలీ ఆఫ్ ఫ్లవర్స్ - ఘంగరియా - హేమకుండ - ఘంగరియా 16 కి. మీ.

### రూప్ కుండు సరస్సు :

సముద్ర మట్టానికి 4, 778 మీటర్ల ఎత్తులో 7, 122 మీటర్ల ఎత్తయిన త్రిశూల్ పర్వత పాదంలో అమరియున్న బహు సుందర దృశ్యమానమైన రూప

కుండు సరస్సు అంతు చిక్కని రహస్య స్థలంగా భావించబడుతుంది. ఇక్కడికి వచ్చినవారిలో కొంతమంది కనబడకుండా పోయారనేది ఒక ప్రచారం. దానికితోడు ఇక్కడ అనేక మానవ కంకాళాలు, గుర్రాల అస్థిపంజరాలు ఎన్నో కనబడుతున్నాయని చెబుతారు. కర్ణప్రయాగ దగ్గరలోగల నౌతి గ్రామంనుండి ఎంతో ప్రయాసతో కూడిన ఎగుడు దిగుడులను అధిగమించటానికి ఉద్యుక్తులైన యాత్రిక సందోహాలు పుష్కరానికోసారి రాజ జయ యాత్ర సలపటం విశేషించి పేర్కొనదగింది. వీరికి మార్గగామినిగా ఒక అద్భుతమైన వింత శక్తిగల నాలుగు కొమ్ముల మేషం (పొట్టేలు)ముందు నడుస్తూ తీసుకుని వెళ్తుందట. నందాదేవి శిఖర మధ్యంలోగల రూప్‌కుండు సరస్సు దగ్గరికి వెళ్లేసరికి అదృశ్యమయిపోతుందట మేషరాజం. యాత్రికులు పసిడి నందాదేవి విగ్రహాన్ని వెండి పల్లకిలో మోసుకుని వెళ్తారట.

ఆరోహణ నడక క్రమం గ్వాల్డోము నుండి మొదలవుతుంది. ఋషికేశంనించి గ్వాల్డోము వరకు 240 కి. మీ. అందమైన గ్రామీణ ప్రాంతాల మీదుగా బస్సు ప్రయాణంతో చేరవచ్చు. ఆపైన 12 రోజుల కార్యక్రమం ఈ క్రింది విధంగా ఏర్పాటు చేసుకోవాలి.

1 రోజు – ఋషికేశం – గ్వాల్డోము – 240 కి. మీ. (బస్సులో)

2 రోజు – గ్వాల్డోము – దేబల్ – 10 కి. మీ.

3 రోజు – దేబల్ – మందోలి – 15 కి. మీ.

4 రోజు – మందోలి – వాన్ – 14 కి. మీ.

5 రోజు – వాన్ – బద్నిముగ్వాల్ – 8 కి. మీ.

6 రోజు – బద్నిబుగ్వాల్ – బగ్గుబసా – 8 కి. మీ.

7 రోజు – బగ్గుబసా – రూప్‌కుండ్ – బగ్గుబసా – 8 కి. మీ.

8 రోజు – బగ్గుబసా – వాన్ – 16 కి. మీ.

9 రోజు – వాన్ – కస్నూవాల్ – 9 కి. మీ.

10 రోజు – కస్నూవాల్ – షీతల్ – 9 కి. మీ.

11 రోజు – షీతల్‌ఘాట్ – ఘటనంద ప్రయాగ – 80 కి. మీ.(టాక్సీలో)

12 రోజు – నందప్రయాగ – రిషికేశ్ – 192 కి. మీ.

పిండారీ మైదానం :

గ్వాల్డోమునుండి– లోహర్‌ఖేత్ వరకు బస్సులో ప్రయాణం చేయవచ్చు. మొత్తం 90 కి. మీ. దూరం పైగా వుంటుంది. ఆరోహణ అవరోహణలు తేలిగ్గానే వుంటాయి. అనేక బ్రహ్మాండ శిఖరాలు దృశ్యమానం. నందాఖత్ దగ్గర సముద్ర మట్టానికి 3353 మీటర్ల ఎత్తున మూడు కిలోమీటర్ల పొడవు అర కిలో మీటరు వెడల్పున ప్రకృతి పరచిన రంగుల వెన్నెలలు. ఉత్తుంగ శిఖరాలు ఒకవైపు, మరోవంక ఝురీ వేగంతో శిఖరాగ్రాల్లోంచి జాలువారే జలధారలు, గాలికి కమ్మని విరితావుల గుభాళింపులతో మనసులను మరో లోకంలో విహరింపజేసే పరిమళాల సౌరభాల మలయ సమీరం–మధుర మనోహర దివ్యానుభూతి. అక్షరాల మానవుడు సైతం దేముడి వైభోగంలో పాలుపంచుకునే సుందర దృశ్యాలంకారం. ఇందుకు లోహర్ ఖేత్ డాక్ బంగళాలో మకాం పెట్టుకుని 5 రోజుల కార్యక్రమంలో సందర్శించవచ్చు.

1 రోజు – లోహర్‌ఖేత్ – ఖతి – 18 కి. మీ.

2 రోజు – ఖతి – పుర్కియా – 16 కి. మీ.

3 రోజు – పుర్కియా – పిండారీ – 7 కి. మీ.

4 రోజు – పిండారి – ఖతి – 21 కి. మీ.

5 రోజు – ఖతి – లోహర్‌ఖేత్ – 18 కి. మీ.

లోహర్‌ఖేత్‌నుండి తిరిగి బస్సులో ప్రయాణం. ఈ బస్సు ప్రయాణంకూడా మహదానందకరంగా సాగుతుందనటంలో సందేహం లేదు. ఈ ప్రాంతాలను సందర్శించటానికి వచ్చేటప్పుడు కనీసపు ఆహారావసరాలు, చలిని తట్టుకోటానికి కావలసిన ఉన్ని దుస్తులు, రగ్గులు, రోజాయిలు వగైరా సరంజామా చాల ముఖ్యమని గమనించగలరు. కేవలం బదరీనాథ్, కేదారీనాథ్‌లతో యాత్ర పూర్తి చేసుకోదలచినవారు సోన్ ప్రయాగ నుంచి కేదార్‌నాథ్ వరకు నడవలేని వయోవృద్ధులు, స్త్రీలు, పిల్లలు వగయిరాలు డోలీలు కండీలు ఏర్పాటు చేసుకోవలసి వుంటుంది. అన్నీ ముందుగా తగు జాగ్రత్తలు సమకూర్చుకొని మరీ హిమాలయ యాత్రలకు బయలుదేరవలసి వుంటుందని మనవి. మీకు అన్నీ దర్శించటానికి అనంత ఆయురారోగ్యములు కలిగి క్షేమంగా తిరిగి రాగలగాలని కోరుతూ మంచుకొండలమీదినుండి ప్రస్తుతానికి కిందికి దిగి ఈరాష్ట్రంలో సమతలమైదాన ప్రదేశాలు విశేషాలు గమనిద్దాం. గమ్యాలెన్నయినా వాటికి తగిన మార్గాలనేకం. ముఖ్యమయిన వాటిని ఇక్కడ పొందుపరచటానికి తగుమాత్ర ప్రయత్నం చేస్తున్నాము.

లక్నో వారణాసి మార్గంలో :

క్రీ.శ. 1033లో ఘజనీ మహమ్మదు బహారిచ్‌లో చంపి వేయబడ్డాడు. బహారిచ్‌కి మూడు కి. మీ. దూరంలో ఒక గోరీ వుంది. షాహెబ్ మాహెన్ అంటే తల క్రిందులైన పట్టణం అని గౌతమ బుద్ధుడు సహస్ర పత్ర పద్మంలో ఆసీనుడై విశ్వ రూపము చూపించిన పవిత్ర పుణ్యస్థలం. దీన్నే శ్రావస్తి అని అంటారు. ఇక్కడికి చేరాలంటే నౌగర్-గొండా లూపు లైనులో ఉన్న గోరక్‌పూరు నుండి వెళ్ళవచ్చు దగ్గరి రైల్వేస్టేషను గాయిన్‌జొవా అక్కడ ఇప్పటికీ పురాతన బుద్ధదేవళాల అవశేషాలు, ఇటీవలనే నిర్మించబడినవి కొన్నిటిని చూడవచ్చు.

ఫైజాబాదు :

ఒకనాటి అవుధ రాజధాని. ప్రస్తుతం లక్ష ఇరవై వేల జనాభా గల పట్టణం. బహూబేగం చనిపోయిన తరువాత అతి త్వరితంగా క్షీణదశకు చేరుకుంది. ఆమెకు ముందు అధికారం నెరపిన ఆమె భర్తకు, ఆమెకు సమాధులున్నాయి. ఇక్కడి గుప్తార్ పార్కులో, చక్కని ఉద్యానవనాలున్నాయి. ఉత్తరప్రదేశ్‌లోని చక్కని కట్టడాల్లో పేర్కొనదగినవిగా చూడదగినవిగా ఈ సమాధులు పేరెన్నికగన్నాయి శ్రీరామచంద్రుడు తన అవతారం చాలించి అదృశ్యుడయిన చోటుగా ఒక వింతయిన ఆధ్యాత్మిక సురతళం ఫైజాబాదులో నిండి వుంది.

అయోధ్య :

సరయూ నదీ తీరంలో రామాయణకాలంలోను, తరువాత బౌద్ధ యుగంలోను విశేషప్రాముఖ్యాన్ని పొంది వైభవోపేతంగా వెలిగిన 12 యోజనములు విస్తీర్ణముగల పట్టణంగా శోభిల్లింది. సప్తమోక్షదాయకపురులలో ఒకటిగానూ, 106వ దివ్య దేశంగా ప్రసిద్ధి. దాదాపు 100 పైగా ఆలయాలున్నాయి.

పురాణకాలంలో త్రేతాయుగంలో శ్రీ మహావిష్ణువుయొక్క పరిపూర్ణ మానవ అవతారంగాను, ఇక్ష్వాకు కులతిలకుడు, రఘుకుల సోముడు హైందవుల ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రుని జన్మభూమి. కోసల రాజ్య ముఖ్య పట్టణం. అయోధ్య పేరు చెప్పగానే ప్రతిభారతీయుని శరీరం పులకాంకితమవుతుంది. ముక్తికి, మోక్షానికి ముఖ్య సోపానమయిన 'రామ' శబ్ద నిజ సాక్షాత్కారం కలిగిన అయోధ్య పట్టణమెంత పవిత్రమైనదో చెప్పనక్కరలేదు. దశరధుడు మనువునుండి 56 వ సూర్యవంశ చక్రవర్తి. దశరథ మహారాజు కాలంలో పైన చెప్పినట్లు

12 యోజనాలు విస్తీర్ణంగలిగిన పట్టణంగా కీర్తించబడినది అయోధ్య. కాలం తెచ్చిన మార్పులతో నేటికి నామావశిష్ట మైనదని వేరుగా చెప్పనక్కరలేదు. యుగాంతంలో పట్టణం మొత్తాన్ని తన గర్భంలో కలిపివేసికొని దాచుకొంది. తరువాత విక్రమాదిత్యా మహారాజు పరిశోధించి పూర్వపు రామ చరిత్రకు సంబంధించిన ఆలయాస్థలాల్లో రామకోట, రాజభవనం, నాగేశ్వరనాథాలయం, మహాదేవాలయం, మణిపర్వతం మొదలైన వాటన్నిటినీ పునరుద్ధరించినట్లుగా చరిత్ర కారులు చెప్తున్నారు. కొన్ని శతాబ్దాల రాజపుత్రుల పరిపాలనానంతరం విరివిగా జరిగిన మహమ్మదీయ దండ యాత్రికులు మత ఛాందసులై కొంత ఆలయ సంపదలను కొల్లగొట్టే కాంక్షతో మరి కొంతగాను అనేక ఆలయాలను ధ్వంసం చేశారు. ప్రభువులైన మహమ్మదీయులు తమ రాజధానిని ఫైజాబాదుకు మార్చినా అయోధ్య విశిష్టత తలయెత్తి నాటి మహోజ్వల చరిత్రను చాటడంలో ప్రత్యేక ప్రతిపత్తిని విడనాడలేదని నొక్కి చెప్పవచ్చు.

బౌద్ధమతపరంగా :- చైనా యాత్రికుడు హ్యూయన్‌సాంగ్ 7 వ శతాబ్దంలో అయోధ్యను దర్శించి, అయోధ్యలో 20 బౌద్ధ ఆలయాలు, 3000 మంది భిక్షువులు ఉన్నారని తన వ్రాతల్లో వ్రాశాడు.

**అయోధ్యలో చూడదగినవి :**

రామ జన్మస్థానము : దశరథ మహారాజు పుత్రార్థియై యిక్కడే పుత్రకామేష్టి యజ్ఞాన్ని చేశాడు. ఇక్కడ ఉన్న ఆలయాన్ని మహమ్మదీయ చక్రవర్తి బాబరు నిర్మూలించి ఆ ఆలయ స్థంభాలనే ఉపయోగించి ఒక పెద్ద మసీదును నిర్మించాడు. అదే బాబ్రి మసీదు. దరిమిలా ఈ స్థలాన్ని గురించి వివాదాలు, కొట్లాటలు జరిగి హిందూ ముస్లిముల కలతలకు కాణాచిగా మారి చివరకు కోర్టుల్లో గూడా కేసు నడుస్తుండటం మనకందరికి తెలిసిందే! పూర్వం బ్రిటిషువారి కాలంలోగూడా ఇలాగే కలహాలు జరిగినప్పుడు-మసీదు లోపల మహమ్మదీయులు, వెలుపల హిందువులు కైంకర్యాలు జరుపుకునేట్లు పరిష్కారం జరిపారు దేశ స్వాతంత్ర్యం తరువాత మసీదు లోపల నొక రామమందిరం ఏర్పాటు చేశారు.

ఇక్కడ ఉన్న ఇతర ప్రధాన మందిరాలు.

**హనుమాన్ ఘడీ :**

రామ్‌కోట్ అనబడే ఎత్తుగావున్న రామచంద్రాలయం. నవాబ్ షాజుద్దౌలా నిర్మించాడు.

**కనకభవనం :**

శ్రీరామ చంద్ర ప్రభువుయొక్క నిజనివాసం. సీతారాముల విగ్రహాలు బంగారు కిరీటంతో అలంకరించబడినవి, బంగారు సింహాసనం ఉన్నాయి.

సంకట విమోచన హనుమాన్ ఆలయం, శ్రీరాముడు రాజ్యము చేసినచోటు, రామ అంతఃపురం, ఆనందభవనం, కైకేయి కోపగృహం.

**హరిహర మందిర్ :**

రామ, రాధాకృష్ణ, ఆంజనేయాదుల అనేక మూర్తులతో రూపకళాజీ కట్టించినది. సరయూ మందిర్, నాగేశ్వర మందిర్, వగయిరాలు ఎన్నో ఆలయాలున్నాయి. ఇక్కడ ప్రతి అణువూ, అంగుళం అంగుళం రామ స్పర్శతో పునీతమై రామనామ ధ్వనితో పావనమైనది. ఇక్కడి గాలీ, నీరు, అన్నీ రామచంద్ర ప్రభువు స్మరణతో సర్వమూ రామమయమయినది.

**కాలా రామమందిర్ :**

ఇక్కడ ఉన్న రామకోటికి నిత్యపూజ జరుగుతుంది. 'శ్రీరామ జయరామ జయ జయ రామ' అనేనామం వ్రాయించుతారు. విగ్రహం విక్రమాదిత్య ప్రభువుచే ప్రతిష్ఠితమైంది.

**చౌరా :**

తులసీదాస్ మందిరం – ఇక్కడవుండే తులసీదాస్ 'రామచరిత మానస్'ను వ్రాశాడట. మరి యింకా అయోధ్యారాజ్య గ్రంథాలయం చూడదగింది.

క్షీరేశ్వరుని ఆలయం : శ్రీరాముని తల్లి కౌసల్యచే ప్రతిష్ఠించబడినది. సీతమ్మ వారు అయోధ్య వచ్చినపుడు అర్చించటానికి వీలుగా వుంటుందని నిర్మించబడింది.

త్రేతా–కా–ఘర్ : రామచంద్ర ప్రభువు నిర్వహించిన యజ్ఞవాటిక. దీని గుర్తుగా సీతారాముల విగ్రహాలు నిల్చుని వున్న భంగిమతో వున్నాయి.

రిషభ దేవుని జైనాలయం : జైన తీర్థంకరుల్లో ఒకరైన రిషభదేవుని ఆలయం. జైనులది.

సాధువుల ఆశ్రయం, వైష్ణవ సంప్రదాయులకు విజయ రాఘవమందిర్, బాబా రఘునాథదాస్ ఛావనీ.

స్వర్గద్వార్ :

శ్రీరాములవారు సరయూలోనికి వెళ్ళి అంతర్ధానమై అవతారం చాలించిన చోటు - యాత్రికులిక్కడ పిండప్రదానములు చేస్తుంటారు.

సరయూ నదీతీరమంతా యాత్రికుల స్నానాలకి చక్కటి స్నాన ఘట్టాలున్నాయి. జానకీ ఘాట్, రూప కళాఘాట్, పాప విమోచనఘాట్, లక్ష్మణఘాట్, రామఘాటు మొదలయిన వెన్నో వున్నాయి. వీటిలో రామఘాట్ కాశీలోని మణికర్ణికా ఘాటుకున్న ప్రశస్తివుంది. 6 కి.మీ. దూరంలో అయోధ్య నవాబు వేయించిన అందమైన గులాబితోట కూడా దర్శనీయం.

నంది గ్రామ్ :

అయోధ్యకు సుమారు 20 కి. మీ. దూరంలోవుంది. భరతుడు రామపాదుకలనుంచి అయోధ్యా రాజ్యపాలన రామ వనవాసకాలం 14 సంవత్సరాలు పరిపాలించాడు.

ఉండటానికి సాకేత హోటల్ రూములు అందుబాటులో వుంటాయి.

జవున్‌పూర్ :

ప్రస్తుతం ఒకలక్ష జనాభాగల పట్టణం. 1360 లో ఫిరోజిషా తుగ్లక్ చే నిర్మించబడి, తరువాత స్వతంత్ర ముస్లిము రాజ్యమయిన షార్కీ రాజ్యానికి రాజధానిగా వుంది. తరువాత సికందర్ లోడివశంలో ఉండి తరువాత మొగల్ చక్రవర్తుల చేతుల్లోకి వెళ్ళింది. ముసల్మానులు రాకముందు ఇక్కడ అనేక హిందూ, బౌద్ధ, జైనదేవాలయాలున్నాయి. వీటన్నిటిలో చాలా వాటిని ధ్వంసం చేయడమో లేదా మసీదులుగా మార్చటమో జరిగింది.

వీటిలో 1408 నిర్మించబడిన అటలా మసీదు ఈస్థలం ఇంతకు పూర్వం హిందూ దేవతయైన అటలాదేవి ఆలయం. మసీదుకూడా అదే పేరున అటలామసీదుగా పిలవబడుతుంది. అపూర్వంగా కట్టబడిన జామి మసీదు, మరెన్నో యితర మసీదులు హిందూ, జైన దేవాలయాలనే అదే సామగ్రితో మసీదులుగా మార్చినవి కనబడుతాయి. కూలగొట్టిన శిథిల పునాదులమీద నిర్మించబడిన హర్మ్యాలు ఈ మసీదులు. ఇక్కడేగాదు మరెన్నో చోట్ల దుండగీడుల దురంతాలకు నిలయమైనవి భారత భూభాగంలో ఇంకా ఎన్నోవున్నాయి. 1564-1568 మధ్య నిర్మించబడిన అక్బారి బ్రిడ్జిని కూడా చూడగలం.

మార్వారి ధర్మశాల ఉంది వసతికి. వారణాసి నుండి ఇక్కడికి ఇక్కడినుండి వారణాసికి టాక్సీలు, బస్సులూ ఉన్నాయి.

మఘర్ :

ఖలీలా బాదునుండి 10 కి. మీ. దూరంలో ఉన్న రైల్వేస్టేషను. హిందూ మహమ్మదీయులచే సమానంగా ఆరాధించబడిన భక్తకబీరు సమాధివుంది. మానవు లందరూ ఒక్కటే. అందరికీ సర్వేశ్వరుడొక్కడే అని చాటిచెప్పిన మహాజ్ఞాన భక్త శిఖామణి.

గోరఖ్‌పూరు :

2,50,000 జనాభాగల పట్టణం వారణాసి నుండిగాని, ఢిల్లీనుండి గాని ఖాట్మండు వెళ్ళేటప్పుడు తగిలే ముఖ్యకేంద్రం. గోరక్ ఎప్పుడూ సశ్యశ్యామలంగా వర్ధిల్లే పచ్చని పంటపైరులతో విలసిల్లేది. అయితే ఇప్పటివరకూ గూడా పాత వాస నలువదలక వెనకబడేవుంది. 'బాబా గోరక్‌నాధ్ వారి సమాధి' ప్రసిద్ధి. బాబావారి పేరిటే వూరి పేరుకూడా సార్ధకమయింది. దగ్గరలోవున్న గీతా ప్రెస్ ఆధ్యాత్మిక ప్రచార గ్రంధ ప్రచురణలో ప్రసిద్ధిగాంచి పేరెన్నిక గన్నది సంస్థకు ప్రధానులుగా శ్రీ హనుమాన్ ప్రసాద్ పొద్దార్, జయదయాల్ గోయింకాగార్లు, 1921 లో ప్రారం భించబడింది మార్గశిర శుక్ల త్రయోదశినాడు జరిగే గీతాజయింతి ఆరంభంగా ఉత్స వాలు జరుగుతాయి. విశేషంగా పేర్కొనదగినది.

మహాపరి నిర్వాణ :

కాసియా అనేచోటు గౌతమబుద్ధుడు తన 80వ యేట సాలవృక్ష వనంలో క్రీ. పూ. 487 మే నెలలో ఇక్కడే నిర్యాణం చెందాడు. దీనినే కుషనగర్ అని కూడా అంటారు. ఇక్కడ అశోకుడు క్రీ. పూ. 240 లో నిర్మించిన ఒకగొప్ప స్తూపంకూడా ఉంది. ఇక్కడి బుద్ధవిగ్రహం బోధివృక్షం క్రింద ఆసీనుడైయున్న భంగిమలో ఉన్నది. దగ్గరనే హిరణ్యావతీ నదీతీరంలో దేవిస్థాన్, ముక్తిబంధ విహార్ లను చూడవచ్చు. అనిరుద్ధగ్రామ సమీపంలో 500 చ.అ. విస్తీర్ణంలో యిటుకలతో కట్టినస్తూపం. బిర్లా ధర్మశాల-అందులోని రమణీయ బౌద్ధాలయం చూడనగును.

ఇక్కడ స్థానికంగా ఒక చిన్న I T D C ట్రావెలర్స్ లాడ్జి వుంది— వసతికి.

**లుంబినీ వనమునకు :**

లుంబిని బుద్ధ భగవానుని జన్మస్థలం. నేపాల్‌ను వెనుక నుంచి ప్రవేశించ టానికి వెనుకద్వారం. ఇతర దేశస్థులకు (భారతీయులకు తప్ప) అందరికీ వీసా వుండాలి. వీసా కావలెనంటే నేపాలీ 60 రు.లకు చెక్‌పాయింటు దగ్గర పొందవచ్చు. నౌగర్ నించి బస్సులు గొండా-గోరక్‌పూర్ లూప్‌లైనులో కాకర్‌వాహ్ వరకు- నౌగర్ హిందూదేశం బోర్డరు. ముందుకు వెళ్ళాలంటే ఇక్కడచెప్పి వెళ్ళాలి. నౌగర్‌లో మహాబోధి సొసైటీ రెస్ట్‌హౌస్ వుంది. కొద్ది మొత్తం డొనేట్ చేస్తే వుండవచ్చు.

రెండో మార్గం- సునౌలి దగ్గర నేపాల్ బోర్డరు దాటాల్సి వుంటుంది. భైరవ వద్ద ఒకరాత్రి నిద్రచేసి లుంబినీకి బస్సులో వెళ్ళవచ్చు.

లుంబినీ ఆసియాలోని నాలుగు ప్రధాన బౌద్ధ కేంద్రాల్లో ఒకటిగా పరిగణన. పట్టణానిని ఉత్తరంగా ఘంఘీనది నేపాలు సరిహద్దున భారతదేశం నుండి వేరు పరు స్తుంది.

లుంబినీలో 1896లో పురావస్తుశాఖవారు వెలువరించిన ఒక అశోకస్థంభాన్ని చూడవచ్చు. 7వ శతాబ్దంలో వచ్చిన హ్యూయన్‌సాంగ్ తన వ్రాతల్లో ఈ లుంబినీ వనమును బౌద్ధ మతమునకు ఇచ్చివేసినట్లు తన పుస్తకంలో పేర్కొన్నారు.

గౌతముడు భూమిమీద పడినచోట ఒక బావి ఏర్పడింది. ఈ బావినీరు ఎంతో పవిత్రంగా నెంచిన యాత్రికులు తీర్థంగా సేవిస్తారు. ఇది పూర్వపు శాక్యరాజులు పరిపాలించిన కపిలవస్తు రాజ్యానికి రాజధానియై సప్త ప్రాకారాలతో విలసిల్లిందని చరిత్రకారుల యభిప్రాయం. అందుకనే బుద్ధుని శాక్యసింహుడుగా కూడా పిలుస్తారు.

ఇటకు దగ్గరిలో బలరామ్‌పూర్‌కి సమీపంలో ఇకేన అనే ప్రదేశంలో గౌత ముడు ఆధ్యాత్మిక దివ్యశక్తితో 500 మంది అంధులకు దృష్టిని ప్రసాదించినట్లు చైనా గ్రంథాల్లో పేర్కొన్నారు.

## వా ర ణా సి

పావన గంగాతీరంలో గంగకు ఉపనదులైన వరణ-అసి నదులమధ్య ఒద్దికగా అమరియున్న అమరధామమే బెనారస్, లేక వారణాసి లేక కాశీ. హైందవ సంస్కృతీ ప్రచారంలోను, వైజ్ఞానికంగాను, చారిత్రికంగాను అనాదినుండీ పేరెన్నిక గన్న పట్ట ణం. ఇప్పటికి రెండువేల అయిదు వందల సంవత్సరాల క్రితమే ప్రపంచ నాగరి కతల్లో ఒక సుస్థిరమైన స్థానం పొందిన బాబిలోనియా శైశవ దశలోను, రోము

సామ్రాజ్యం గ్రీకు సామ్రాజ్యం వెలవకముందే ఈ కాశికాపురి మహోన్నతమైన వైభవ ప్రాభవాలతో విలసిల్లిందనటానికి అనేక తార్కాణాలున్నాయి. సంస్కృత భాష జీవచైతన్యాలతో అమరభాషగా వెలుగొందిన వేదపురాణ కాలాలకంటే ముందే అత్యున్నతమైన స్థానాన్ని అలంకరించిన విజ్ఞాన కేంద్రం. నాటినుండి నేటివరకూ గూడా వైజ్ఞానిక విశిష్టతను కాపాడుకొంటూనే తన స్థానాన్ని అజరామరంగా కాపాడుకొంటూ వస్తున్న ఈ పుణ్యస్థలం మహిమాన్వితగాను, గణ్యతా లోపం అవంతగూడ లేకుండా దినదినాభివృద్ధిగా కాలాలకతీతంగా పరిక్రమిస్తూంది. ప్రయాణ సౌకర్యాలేవీ లేనినాడు కూడా కాశీ ప్రయాణం చేయని భారతీయుడు తన జీవితం వృధా అని తలంచుతూ శక్తియుక్తులన్ని కూడదీసికొని సైతం జీవితకాలంలో ఒక్కసారైనాచూచి తరించాలని ఉవ్విళ్ళూరని వారుండరంటే అతిశయోక్తి కాదు.

వైజ్ఞానిక యాత్రికులు తమ పూర్వ గ్రంథాల్లో గొప్పగా అభివర్ణించారు. చైనా యాత్రికుడు హ్యూయన్‌సాంగ్ తన పుస్తకంలో ఆనాడు తాను చూచిన కాశీనగరంలో 100 శివాలయాలున్నాయనీ, 10,000 మంది ఉపాసనా పరులున్నారని ఉట్టంకించాడు.

రాజ్యాలు మారినా, రాజులు మారినా, కాలచక్రంలో ఎన్ని కల్పాలు దొర్లిపోయినా, వ్యవస్థలు మారినా కాశికాపురి తన గణ్యతను ఇసుమంత కూడా కోల్పోలేదు. వారణాసి అనేదాని కంటే కాశి అనేది ఈ పట్టణానికి అతి పురాతన నామం. వేదాల్లో ప్రాచీనమైన అధర్వణ వేదంలో వారణాసి ప్రశస్తి శ్లాఘించబడింది.

అనంతమైన కాలవాహినిలో చెక్కుచెదరని ఈ పుణ్యస్థలిలో ఎందరో చక్రవర్తులు, మతకర్తలు, దర్శనకారులు, మహామహులు వసించి ఆదిదేవుడై సకల ప్రపంచానికి అధినాధుడై జగత్కల్యాణకరుడు, భక్తవశంకరుడు అయిన శ్రీ విశ్వనాధుని సేవించి తరించారు. వారి జన్మలను చరితార్థం చేసికొన్నారు. నిత్య తేజోవిరాజితమై విజ్ఞానపీఠంగా వెలయించారు. భరతభూమిలో పారే పావనగంగానదీ స్వచ్ఛజలాలు ఆసేతు హిమాచలంలో కొన్నిచోట్ల అతర్నిహితంగా ప్రవహిస్తూ పునీతం చేస్తున్నాయి. అలాగే సుజ్ఞాన వీచికలతో భరతఖండపు సంస్కృతీ విభవాలను దేశమంతటా చాటే నిలయంగా విలయాల కతీతమై, సగర్వంగా భరతమాతను పునీతం చేస్తుంది. దేశమంతటా పరచుకునియున్న విభిన్న సంస్కృతీ, సంప్రదాయాలన్నిటినీ మూల సూత్రంగా ఒకే దారంతో ఇమిడియున్న పూసలుగా భిన్నతంలో ఏకత్వానికి ప్రోదిచేసిన ఘనత కాశికాపురికే దక్కుతుందనటం నిర్వివాదం.

గంగాస్నానం, స్వామి కైంకర్యములు చేయు పుణ్య పురుషులకు ముక్తిని ప్రసాదిస్తూ వరప్రదానమై 'కాశ్యంతు మరణాన్ముక్తిః' అనే సూక్తి సార్థకం చేస్తూ విశ్వనాథుడు జగత్పతియై ఈ క్షేత్రంలో మరణించే వారందరికీ తారక మంత్రోప దేశంచేసి బ్రహ్మ జ్ఞానమును ప్రసాదించే ఈ స్థలమహిమ వర్ణనాతీతం సర్వ కలుష హారిణి, పాపహారిణిగా గంగామాత ప్రసిద్ధి చెందినది.

ఈ కాశీ పట్టణంను పరిపాలించిన రాజులందరి కథలు దేశ సాహిత్యంలో చోటుచేసికొని అజరామరమయిన మణి దీపాలయ్యాయి.

ఇక్కడే- విశ్వామిత్ర మహర్షి పరీక్ష కెదురు నిల్చి హరిశ్చంద్ర మహారాజు తన సత్యనిష్ఠను లోకానికి చాటాడు. గౌతమ బుద్ధుడు తన అహింసా ప్రవచనాన్ని మొదటగా ఇక్కడే చేశారుట. ఆదిశంకరులు తమ అద్వైత మతస్థాపనం ఇక్కడే చేశారు. ఈ చోటనే తులసీదాస్ 'రామచరిత మానస్' రూపంలో రామాయణ గానం అరంభించాడు. పండిత మదనమోహన మాలవ్యా సర్వకళాకవితమైన హిందూ విశ్వ విద్యాలయమును స్థాపించి భారతదేశ స్వాతంత్ర్య బీజావాపనం చేశాడు. అంతెందుకు మన జాతీయ జండా మీద చోటుచేసుకున్న మూడు తలల సింహ స్థూపాకృతిని రాజ్యాంగ ముద్రగా స్వీకరించిన చిహ్నం ఇక్కడ దగ్గరలో అశోకుడు నిర్మించిన సారనాథ స్థూపంలోనిదేః

ఇటువంటి పంచక్రోశ పరిక్రమం గలిగిన కాశీక్షేత్రంలో నేటికి 15,000పైగా ఆలయాలున్నాయి. జైనమత వ్యవస్థాపకులైన జైన సంప్రదాయానికి శ్రీకారం చుట్టిన మహానుభావులు శ్రీ పార్శ్వనాథుడు కాశీరాజు కుమారుడే.

ఇట్టి పవిత్ర కాశీపురం జగత్కళ్యాణేందు శేఖరుడైన శ్రీ విశ్వనాథుని నివాస స్థానం.

## విశ్వనాథాలయం :

అతి ప్రధానమైనది, పురాతనమైనది. 1670లో తురకల దండయాత్రతులో నై మత ఛాందసుడైన ఔరంగజేబు ఆలయ విధ్వంసానికి పూనుకొన్నారట. హంతకులు లోన ప్రవేశించినంతనే విశ్వనాథుడంతర్ధానమయ్యేనట. స్వామిని చూడలేనివారు పరా భూతులై అక్కసు మిక్కుటమై ఆలయాన్నే మసీదుగ జేసికొన్నారట. తరువాత స్వామి ఇందూర్ మహారాణి అహల్యాబాయికి స్వప్నంలో సాక్షాత్కరించి తానున్న తావును తెలిపాడు, వెంటనే రాణి అహల్యాబాయి స్వామిని కనుగొని 1776లో పునః

ప్రతిష్ఠించారట. 1860 నుండి ప్రధానార్చనలు, దక్షిణ భారతంలో ప్రసిద్ధి చెందిన నాట్ కోట్ చట్టియార్ల చేత ప్రారంభించబడింది.

ద్వాదశ జ్యోతిర్లింగముల్లో ఇది 10వది. హైందవేతరులకు ఆలయం లోనికి ప్రవేశార్హత లేదు. చాతుర్వర్ణముల వారు స్వామిని స్పృశించి అర్చించ వచ్చును. ప్రాచీన ఆలయ శిఖరం ఔరంగజేబు మసీదు వెనక కనబడుతుంది. ఆలయ కలశం సువర్ణమయం. దీనికోసం 750 కిలోల పైగా బంగారమును లాహోర్ మహారాజు రాజా రంజిత్‌సింగ్ సమర్పించారట.

దసరా సమయంలో శరన్నవరాత్రులు ఉత్సవాలు మహా సంరంభంగా జరుగు తాయి. రామాయణ కథా విశేషాలు రావణునిపై శ్రీ రామచంద్రుని విజయ విశేషంగా విచిత్ర వేషాలు, నాటకాలు పరమ రమణీయంగా ప్రదర్శిస్తారు. మహిషాసుర మర్ధని దుర్గామాత పూజలు ఘనంగా జరుగుతాయి.

వైశాఖ మాసంలో వచ్చే బుద్ధపూర్ణిమనాడు ఒక బ్రహ్మాండమైన ఉత్సవం సారనాధ్‌లో జరుగుతుంది విశేషంగా.

## మాత అన్నపూర్ణేశ్వరి ఆలయం :

విశ్వేశ్వరాలయానికి అల్లంత దూరంలో విశాలమైన 'మాత అన్నపూర్ణేశ్వరి' ఆలయం వుంది. ఈ ఆలయానికి ఎదురుగా ఒక విశాల మందిరంలో గౌరీశంకర్, సూర్య, హనుమాన్, గణేశ మందిరాలున్నాయి. అష్టాదశ పీఠాల్లో భక్త సంసేవ్య అయిన 'విశాలాక్షి' దేవి మందిరం. 10వదిగా ఎన్నబడింది. పదునెనిమిది పురాణ ముల కర్తయైన వ్యాస భగవానుడు తన శిష్యులతో కాశీకి వచ్చాడు భిక్షాటన కోసం. విశ్వేశ్వరునికి ఒక చిన్న కోరిక కలిగింది- వ్యాసుని పరీక్షిద్దామని. మధ్యాహ్నం వరకు తిరిగినా ఎక్కడా ఒక్క కబళం కూడా దొరకలేదు. బయట సూర్యతాపం లోపల ఆకలితాపం. రెండూ ఒక్కుమ్మడిగా ప్రతాపించాయి. కమండలంలోని నీళ్ళు తీసికొని కాశికాపురిని శాపదగ్ధం చేయాలని సంకల్పించాడు. వెంటనే ఓ నిండైన మాతృమూర్తి వ్యాసుని సంకల్పం మానుకోమని ఆయనకు, ఆయన శిష్య వర్గానికి విందు భోజనం ఏర్పాటుచేసిన మాత అన్నపూర్ణ. వేరెవరో కాదు కాశీ విశాలాక్షియే! సకల జనులకు అన్నప్రదాత్రి అన్నపూర్ణ.

క్షేత్రమంతా గోవులు యధేచ్ఛగా గుంపులు గుంపులుగా సంచరిస్తుంటాయి. కాశీ నుండి వరుణ వరకు గంగా తీరంలో విశాలమైన స్నాన ఘట్టములు ఎన్నో!

రాజులు, మహారాజులు యాత్రికుల సౌకర్యార్థం భక్తిమీర ఎంతో వ్యయప్రయాసల కోర్చి కూడా నిర్మించారు. ఇవి మొత్తం 64 ఘట్టములు. పడవమీద కొంతమందిసమూహంగా వెళ్ళికూడా చూడవచ్చు. అన్ని ఘట్టములు తిరిగి రావటానికి దాదాపు 5 లేక 6 గం.ల సమయం కావలసి వుంటుంది. వీటన్నిటిలోనూ అతిముఖ్యమయినవిగా ఐదు ఘట్టములలో స్నాన మాడుట యాత్రిక భక్తులకు అవశ్యమని చెపుతారు. గంగ యిక్కడ ఉత్తర వాహినియై ప్రవహిస్తుంది. ముఖ్యమయిన 1. అసిఘాట్, 2. దశాశ్వమేధఘాట్, 3. వర్ణసంగం లేక బర్ణ సంగం 4. పంచగంగ 5. మణికర్ణికా ఘట్టములలో సానాల్ని పంచగంగ తీర్థస్నానాలు. ఇవి అన్నీ ఒకే రోజులో పై చెప్పిన వరుస క్రమంలో పూర్తి చేయాల్సి వుంటుంది. గంగలో అక్కడ కూడా నీటి గుర్రాలు మునుగుతూ పైకి లేస్తూ వుంటాయి.

64 ఘట్టములలో ప్రతి ఘట్టానికి ఒక ప్రత్యేక చరిత్ర, ప్రాధాన్యత, ప్రాముఖ్యం ఉన్నాయి. వాటిలో కొన్నింటిని మాత్రమే యివ్వగలుగుతున్నాం. విస్తృతంగా వ్రాసుకుంటూపోతే గ్రంథ విస్తరణ భీతి మరోవైపు అడ్డుకట్ట వేస్తుంది. కనుక కొన్ని అతి ముఖ్యము అనుకున్న వాటిని మాత్రం వ్రాస్తున్నాం.

**దశాశ్వమేధ ఘాట్ :**

ఇక్కడ బ్రహ్మదేవుడు పది అశ్వమేధ యాగములు చేశాడని ప్రతీతి. ఎప్పుడూ క్రిక్కిరిసి ఉంటుంది. అన్ని ఘట్టములలోను ఇది చాల ముఖ్యమయినది. పంచగంగ తీర్థాల్లో మొదట అస్సిఘాట్‌లో స్నానమొనర్చిన పిదప ప్రాధాన్యతా క్రమంలో స్నానాలకిది రెండవ ప్రధాన ఘట్టము.

**మాన్ మందిర్ :**

జయపూర్ మహారాజా వారిచే నిర్మించబడింది. 1590లో ఇక్కడి భవనం మీద నక్షత్ర వేధశాల నిర్మితం. చాలా పురాతనమైంది.

**భజనాశ్రమము :**

ఇక్కడ అఖండ నామ సంకీర్తనం జరుగుతుంది.

**లలితాఘాట్ :**

నేపాల్ మహారాజావారు నిర్మించింది.

మణికర్ణికా ఘాట్ :

పంచగంగల స్నానాల్లో 3వది. అతి ముఖ్యమయినది. అతి పవిత్రమైనది. ఇండోర్ మహారాణి అహల్యాబాయి నిర్మించినది. రెండు భాగాలున్నాయి. ఒకవంక స్నానాలకు, రెండోవంక శవ దహనాలకు ముఖ్యంగా ఏర్పాటు గలిగినది. మోక్ష క్షేత్రము. మహాదేవుని ఇల్లాలు పార్వతీదేవి కర్ణ కుండలం క్రిందపడిన పవిత్ర స్థలం గనుక మణికర్ణిక అనేది సార్థకమయినది. ప్రతి యాత్రికుడు మొదట చక్ర తీర్థంలో స్నానమాడిన తరువాత గంగ స్నానం చేస్తారు. స్నానానికి రుసుము కట్టవలసి వుంటుంది. బ్రాహ్మణ బ్రువులు సంకల్పాలు చెప్తుంటారు. జీవితంలో అంతిమ శ్వాస వదిలిన వారిని పాడెమీద తీసికొని వచ్చి దహన సంస్కారాలు నిర్వర్తిస్తుంటారు. ఫొటోలు తీసుకుంటాం అంటే కొరవితో తలగోక్కున్నట్లే. తస్మాత్ జాగ్రత్తః మెట్ల పైభాగంలో మణికర్ణికను తీయడానికి మహాదేవుడు ఒక బావిని త్రవ్వారట. ఆ బావి అంతా మహాదేవుని స్వేదంతో నిండిపోయిందట. అక్కడ మణికర్ణికా సరస్సుగా వెలసిందని చెప్పుకొంటారు. ఘాటుకు సరస్సు మధ్యన చరణ పాదుక అనే చదరపు రాయి ఒకటి ఉన్నది. శ్రీమహావిష్ణు పాద చిహ్నంగా గుర్తించబడింది. మహామహుల భౌతికకాయాల్ని ఇక్కడ ఈ శ్రీచరణ పాదుక శిలవద్ద దహన సంస్కారాలు జరపటం విశేషం. ప్రక్కనే గణేశాలయం ఉంది.

తులసిఘాట్ :

చాలా వరకు పడిపోయి నదిలో కలిసిపోయింది. నామమాత్రంగా వున్నది.

ఆనందమాయిఘాట్ :

ఆనందమాయి గొప్ప సిద్ధురాలు. ఆమెకు భారతదేశ మందంతటా శిష్యులు, అనుచరులు ఉన్నారు. ఆమెచే నిర్మించబడింది. ఇక్కడ ధార్మిక గోష్ఠులు, తత్త్వ ప్రవచనాలు, సంకీర్తనలు నిత్యమూ జరుగుతుంటాయి.

నిర్వాని అఖాడా :

నాగ—దిగంబర సాధువు లుంటారు.

దండిఘాట్ :

అనేక మంది మహాత్ములుంటారు.

హనుమాన్ ఘాట్ :

దక్షిణదేశం నుండి వచ్చిన వారు విశేషంగా నివసిస్తున్నారు.

హరిశ్చంద్రఘాట్ :

ఇక్కడే హరిశ్చంద్రుడు పాము కాటుచే మరణించిన తన కుమార్డు లోహితాస్యుని దహనం చేశాడుట. సత్యహరిశ్చంద్రుని సత్య నిరతి పరీక్షలో కాటికాపరి పనిని నిర్వహించిన విషాదఘట్టము- బీదవారి శవాల్ని ఇక్కడ దహనం చేస్తార్టుట.

కేదారఘాట్ :

ఇక్కడి ఆలయం చాలా పెద్దది. రాళ్ళమీద, గోడలమీద తెలుగువారి పేర్లు అనేకం కనబడతాయి. కనుక తెలుగువారు ఇక్కడకు విశేషంగా వస్తారని చెప్పకనే చెపుతుంది.

క్షేమేశ్వరఘాట్ :

కన్యకాపరమేశ్వరి ధర్మశాలకు అతి దగ్గరిలో వున్నది. ధర్మశాల గుంటూరు వారిచే నిర్మించబడింది.

బచ్ రాజ్ ఘాట్ :

ఇక్కడ జైన ఆలయాలు, పాఠశాల ఉన్నాయి. జైనులు ప్రత్యేకంగా వస్తారు. మూడు జైన దేవాలయాలున్నాయి.

మాన్ సరోవరఘాటు :

అంబరు మహారాజు రాజా మాన్‌సింగ్ నిర్మించింది. కైలాసగిరి పర్వతపాద సానువులో ఉన్న మానసరోవరం పేరు ఈ ఘట్టానికి పెట్టబడింది.

సోమేశ్వర గాట్ :

ఇక్కడి స్నానం సర్వవ్యాధి నివారణ మైందిగాను, సర్వపాప కలుష హారిణిగాను ప్రసిద్ధం.

దత్తాత్రేయ గాట్ :

ఇక్కడ దత్తాత్రేయ స్వామి వారి పాదముద్ర లున్నాయి. దగ్గరిలో దత్తాత్రేయ ఆలయం కూడా ఉన్నది. దర్శనీయం.

**సింధియా గాట్ :**

సింధియా రాజులచే 1830లో నిర్మించబడినది. చాలా పెద్దది. కాని కాల క్రమేణా నదీ గర్భంలో కొంత కలిసిపోయింది. పునర్నిర్మాణోచితమైనది.

**పంచగంగా గాట్ :**

పంచగంగా తీర్థ స్నానాల్లో ముఖ్యమయినది. నాలుగవది. ఘాటుపైన ఔరంగ జేబు చిరు మసీదు వుంది. దీన్నే అలంగీర్ మాస్కూ అని అంటారు. విష్ణ్వాలయం ధ్వంసం చేసి దాని మీద కట్టబడింది. ఇప్పటికీ ఇదే బిందుమాధవుని ఆలయంగా పిలుస్తారు.

**గాయ్ గాట్ :**

పవిత్రమైన గోమాత శిలా విగ్రహం ఉంది. ఒడ్డునే దాల్మియా భవనం ఉంది.

ఇంకా త్రిలోచనా గాటు, ప్రహ్లాద్ గాటు, మహిషాసుర గాటు, రాజ గాటు వగైరాలతో పాటు చివరగా వరుణా గాటు కూడా ఉంది. వరుణా గాటు ఒడ్డునే ఆదికేశవ, జ్ఞానకేశవ మందిరాలున్నాయి. అస్సీగాటుతో మొదలయిన గాటులు క్రమంగా వరుణా గాటుతో ముగుస్తాయి. కొంతమంది పంచగంగా స్నానాల్లో చివరి తీర్థ స్నానంగా పరిగణిస్తారు. అయితే ఎక్కువ ప్రాముఖ్యం చివర మణికర్ణికా స్నానంగా పరిగణించటం కద్దు. ఎవరెవరి నమ్మకాల ప్రకారం వారు చేయవచ్చు. గంగా తీరంలో అమరియున్న ఈ గాటుల ఒడ్డున వారణాసి నగరం అంతా పెద్ద, చిన్నా సందులు- విశేషంగా పూజా సామాగ్రి, దేవతామూర్తులు, భక్త వరేణ్యులను యాత్రికులను ఆకర్షిస్తూ అనేక సామానులు అమ్మే షాపులు అమరి ఉన్నాయి.

## కాశీలో చూడదగిన ప్రదేశాలు

**ఔరంగజేబు మసీదు :**

సువర్ణమయమైన శ్రీ విశ్వనాధుని ఆలయమును నేలమట్టం చేసి అదే రాతి స్తంభాలను ఉపయోగించి 71 మీటర్లు ఎత్తుగల స్తంభాలతో ఔరంగజేబు ఒక గొప్ప మసీదు నిర్మించాడు. ప్రస్తుత ప్రభుత్వం వారు మత సామరస్య పరిరక్షణార్థం- లౌకిక తత్వాన్ని ప్రబోధిస్తున్నటువంటి ప్రజాస్వామ్య నిరతి రక్షణగా మసీదును నిరంతరం సాయుధులైన కాపలా దారులతో భద్రంగా చూస్తుంది. హిందువైనా, ముస్లిమయినా మనిషి మనిషే. మానవత్వానికి మతం పేరుతో దూరం కాకూడదనే భావన భద్రంగా కాపాడబడుతుంది.

దుర్గాలయం :

పట్టణంలో దక్షిణ దిశలో అమరియున్న ముఖ్యమైన ఆలయం, బెంగాల్ మహారాణి 18వ శతాబ్దంలో ఉత్తర భారత నాగర శిల్పరీతుల్లో అంచెల శిఖరంతో కట్టించబడినది. పార్వతీదేవి రౌద్రాకారంగా మహిషాసుర మర్ధనిగా చీకట్లను నిర్ధాక్షిణ్యంగా చీల్చి చెండాడిన రుద్రస్వరూపిణి గావున ఇక్కడ జంతుబలులు గూడ జరుగుతుంటాయి. ముఖద్వారానికెదురుగా 4 అడుగులు ఎత్తు వేదికపై అద్భుత శిల్ప చాతుర్యంతో 12 స్థంభముల మంటపం ఉంది. అక్కడనే సంకట విమోచనాలయమనే శ్రీ తులసీదాసు నిర్మించిన ప్రసిద్ధాంజనేయాలయమున్నది. దీని యెదుటనే ప్రశాంత ప్రదేశంలో గల రామాలయమునకు యాత్రికులు, పౌరులు అనేకమంది వచ్చి దర్శిస్తుంటారు.

తులసీ మానసాలయం :

మహాభక్తులైన శ్రీ తులసీదాసు రామాయణ కథను హిందీలో గానవాహినిగా 'రామచరిత మానస్'ను వ్రాసినవారుగా గణ్యులు. ఈ ఆలయం 1964లో నిర్మించబడింది. ఆలయ కుడ్యాలమీద రామచరిత మానస్‌లోని గాన విశేషాల్లో కథాగమనంలోని దృశ్యాలను చిత్రాలుగా మలచారు. ఇందులో శ్రీ తులసీదాసు తను రామాయణ కథా రచన చేసేటప్పుడు ఈ ప్రదేశంలో నివసించి తన రచనను పూర్తి చేశారట. పైన రెండో అంతస్తులో అనేక పురాణ కథాదృశ్యాలను గమనించవచ్చు. హైందవేతరులకు ప్రవేశం లేదు.

భారతమాత ఆలయం :

హైందవాలయాలకు విభిన్నంగా దేశమాత స్వరూపం చలువరాతితో మనోహరంగా చెక్కబడింది. శిల్పి బాబు శివప్రసాద గుప్త. ఆలయ ప్రారంభోత్సవం జాతిపిత మహాత్మాగాంధీ హస్తాలమీదుగా జరిగింది. అందరూ దర్శించవచ్చు. జనసమ్మర్ధంగా వుండే వారణాసి స్టేషనుకు అవతల ప్రశాంతంగా 1 కిలోమీటరు దూరంలో అమరి ఉంది.

మాలవ్యా బ్రిడ్జి :

మొదట 1885లో నిర్మించిన బ్రిడ్జి. బ్రిడ్జిపైనుండి నిలబడి గంగాతీర స్నాన ఘట్టాల వైభవాన్ని చూడవచ్చు.

బెనారస్ హిందూ యూనివర్శిటీ :

దుర్గాలయంనుండి 20 నిముషాలు నడిస్తే ఈ శతాబ్దపు మొదట్లో పండిట్ మదన్ మోహన్ మాలవ్యాచే 5 చ. కి. మీ. విస్తీర్ణంలో స్థాపించబడిన విశ్వవిద్యాలయం బెనారస్ హిందూ యూనివర్సిటీ. సంస్కృతమునకు ప్రాధాన్యము. అనాదిగా జ్ఞాన కేంద్రంగా విలసిల్లిన కాశీపట్టణానికి ఆధునిక విజ్ఞాన కేంద్రం. ఇందులో చిత్రకళ, సంగీతం, సంస్కృతీ వికాసముల అధ్యయన కేంద్రం. భారతీయ కళాభవనంలో 15వ శతాబ్దంనుండీగల మినియేచర్ పెయింటింగ్స్‌ను చూడవచ్చును. పై అంతస్తులో వారణాసి చిత్రం, ఇంకా అనేకమయిన పురాతన చిత్రాలను చూడవచ్చు. మామూలుగా 11 గం. నుండి 4 గం. వరకు అన్ని ఆదివారములలో సెలవు ఏ కాలంలోనైనా.

సరస్వతీ భవనం :

క్వీన్స్ కళాశాలకు సమీపమున ఉన్నది. సంస్కృత వాఙ్మయానికి ప్రసిద్ధి చెందింది.

శ్రీరామకృష్ణ మిషన్ :

1900లో స్థాపించబడింది.

కాలభైరవుడు :

పౌరాణిక కాలం నుండీ కాశీ నగరమునకు కాలభైరవుడు శునక వాహనుడై గస్తీ తిరుగుతుంటాడని ప్రతీతి.

ఇంకా జ్ఞానవాపి మసీదు, నందెసార్ కోఠీ, విక్టోరియా గార్డెన్స్, విజయనగర ప్యాలెస్, కాశీరాజు కోట, చౌకు బజారు పెద్ద వ్యాపారకేంద్రం. కబీరు పసిపిల్లవాడిగా తల్లికి దొరికిన చోటుగా ప్రసిద్ధి చెందిన లహర్‌తారా, తులసీదాసు నిజ గృహం, మీరాఘాట్‌లోని నూతన విశ్వనాథాలయం మొదలైనవి చూడదగినవి.

పవిత్ర తీర్థాలు :

జ్ఞానవాపి :

ఔరంగజేబు దండెత్తి వచ్చినపుడు శ్రీ విశ్వనాథుడు అదృశ్యుడై ఏతత్కూపంలో వున్నట్లు రాణీ అహల్యాబాయికి స్వప్నంలో సాక్షాత్కరించి తనున్నట్లు తెలిపిన చోటు – యాత్రికులు పుష్పాలతో పూజించి తీర్థాన్ని పుచ్చుకుంటారు.

**అమృతకుండు :**

ఇందలి పవిత్ర జలాలను స్వీకరించితే మహా మొండి వ్యాధులయిన కుష్టు రోగాదులను సైతం దూరం చేయునని ప్రతీతి చెందిన తీర్థం.

**నాగకుండం, కాళీకర్వాటు :**

ఇక్కడ చనిపోతే వారికి పునర్జన్మ లేదట. కాలకూపం వగయిరాలు సేవించ దగిన తీర్థాలుగా ఎన్నదగినవి.

# సారనాథ్

రైల్వేస్టేషను నుండి 10 కి. మీ. దూరం. జ్ఞానవికసితుడైన బుద్ధుడు ఐదు గురు శిష్యులకు తన మొట్టమొదటి మత బోధగావించిన పవిత్రప్రదేశం. క్రీ.పూ 3వ శతాబ్దంలో అశోకచక్రవర్తి ఎన్నో స్థూపాలను, విహారాలను నిర్మించాడు. వాట న్నిటిలోను ధమేక స్థూపం ముఖ్యమయినది. ఇంతకు పూర్వం ఋషి పుంగవులు ఆధ్యాత్మిక గోష్ఠులు నిర్వర్తించేవారు. బోధివృక్షం క్రింద జ్ఞానపూర్ణుడైన తరువాత వెంటనే పాదచారుడై సారనాథ్‌కి చేరాడట. చైనా యాత్రికులు పాహియాన్, హ్యూయిన్ సాంగ్ సారనాథ్ ప్రాచీనతను గురించి తమ వ్రాతల్లో గొప్పగా అభివర్ణించారు. ఈ ప్రదేశం కూడా ముస్లిముల దండయాత్ర నుండి తప్పుకోలేదు. 1194లో కుతుబుద్దీన్ నిర్మూలించాడట. దీన్ని జింకల అడవిగా చెప్పుకుంటారు. ఒక స్థూపం మీద అక్బరు చక్రవర్తి సైతం తన తండ్రి హుమాయూన్ స్మారకం కట్టించాడట. 1836 వరకు ఇవన్నీ ఎవరికీ తెలియదు. 1836 లో ఒక బ్రిటిషు పురాతత్త్వ శాస్త్ర అధ్య యనపరుడు నిర్వహించిన త్రవ్వకాలలో సారనాథ్ ప్రాచీనవైభవ అవశేషాలు బయట పడినవి. కృతజ్ఞతలు.

**చూడదగినవి :**

చౌఖండే 100 అ. ఎత్తున నిర్మించబడిన స్థూపం. పర్షియా భాషలో శాసనం ఉంది. ప్రధాన స్థూపం–దానికి ఎడమవైపున అశోక స్తంభం 148 అ. ఎత్తున కట్ట బడిన ధమేకస్థూపం, మ్యూజియం భద్రపరచబడిన అనేక పురాతన శిల్ప విశేషాలు, అశోకచక్రం–భారతదేశపు ప్రభుత్వ చిహ్నం–దర్శనీయం. 1938 లో అందంగా పాల రాతితో నిర్మించబడిన చైనా దేవాలయం, నాగార్జున స్థూపంలో దొరికిన బుద్ధుని

దంతము భద్రపరచబడిన మూలగంధ కుటీ విహార్, అందులో జపాను బౌద్ధ శిల్పి వ్రాసిన చిత్రాలు చూడదగినవి. ఇక్కడ పెరిగే బోధి వృక్షం శ్రీలంకలోని అనూరాధ పురంలోగల అసలు బోధివృక్షం తాలూకు పిలకలేనని చెపుతారు- దర్శనీయం. దగ్గరలో అమరియున్న చైనా, బర్మా, దేశీయుల ఆలయాలు, మొదలయినవి ఎన్నో చూడనగును. ఇక్కడ ఒక దిగంబర జైన దేవాలయం ఉన్నది. 11వ తీర్థంకరుడైన శ్రీ హంసనాధుని జ్ఞాపకార్థం నిర్మించబడినదని ప్రతీతి.

రామ్‌నగర్ కోట :

గంగ అవతల కుడివైపు ఒడ్డున ఉన్నది. దీన్నే కాశీ రాజు కోటగా చెప్పుకుంటారు. కోటలోనే ఒక మ్యూజియం ఉన్నది. మ్యూజియంలో పురాతన రాణీవాసం వారు వాడే వెండి పల్లకీలు, ఏనుగ అంబారీలు (వెండితో తయారించినవి), రాణివాసంలోని హంసతూలికా తల్పం, పాత తుపాకులు, ఆయుధ విశేషాలు, ఖడ్గాలు వగయిరాలు చూడవచ్చు. 1 రూపాయి టిక్కెట్టుతో 10 గం. నుండి 12 గం. వరకు 1 నుండి 5 గం. వరకు దర్శనీయం. ఇక్కడే వేదవ్యాస మహర్షి విగ్రహం కూడా చూడవచ్చు. దీన్నే వ్యాసకాశి అని కూడా అంటారు.

చునార్ కోట :

పూర్వనామం చరణాద్రి. గంగా తీరంలో అరమైలు వెడల్పు, మైలు పొడవున మానవ పాదాకారంలో అమరియున్న కొన్ని కొండలు వలన ఈ పేరు వచ్చిందట, బలి వామనునికి మూడు అడుగుల దానమిచ్చినపుడు స్వామి మొదటిఅడుగు ఇక్కడ ఉంచారట.

ప్రసిద్ధ ఆఫ్గన్ చక్రవర్తి షేర్షాసూరి ఇక్కడ నివశించాడట. హుమయూన్‌ని రాజ్యభ్రష్టుడ్ని చేయటంలో కృతకృత్యుడయ్యాడిక్కడ. కోటను, బావిని, దర్గాను చూడటానికి యాత్రికులు విశేషంగా వస్తారు. వారణాసికి నలభై కి.మీ. లోపు వుంటుంది.

కాశీలో కొనదగినవి :

ప్రపంచ ప్రసిద్ధమైన బెనారస్ పట్టుచీరలు, జరీనగిషీల బుటాతో మగువల మనసును మైమరపించే పట్టు చీరెలు. ఆగండొక్కసారి. ప్రతి షాపువారు పిలుస్తారు 'ఏం కావాలండీ' అంటూ. పిలిచిందే తడవుగా షాపుల్లో దూరకండి. ఇవి కొనటానికి ప్రసిద్ధమైన స్థలం. నేరుగా మగ్గాలమీదనుండి తెచ్చి అమ్మే స్థలం G.P.O వెనకాల

ఉన్నటువంటి గోల్‌ఘర్ దాకా ఓపిక పట్టండి. అందమైనవి భలే చౌకగా లభిస్తాయి.

సితార్‌లు :

పండిట్ రవి శంకర్ చేతిలోని సితార్ మేము తయారు చేసిందేనని అనేక మంది మిమ్ములను మభ్యపెట్టటానికి ప్రయత్నిస్తారేమో! జాగ్రత్త. కాని సితార్‌లు ఇక్కడ విశేషంగా తయారుచేయబడతాయి. మేలైనవి దొరుకుతాయి. సంగీతప్రియులకు ఒక మంచి చక్కటి అవకాశం-ముఖ్యంగా సితార ప్రియులకు.

దుర్గాలయం :

కాశీరాజు కోటనుండి 4 కి.మీ. దూరంలో ఉంది.

యజ్ఞేశ్వరనాథాలయం :

కాశికి దగ్గిరిలోనే చంద్రప్రభానదికి సమీపంలో యజ్ఞేశ్వరనాథ మహాదేవ మందిరం ఉన్నది.

దక్షయజ్ఞకుండం :

సగడి తాలూకాలోని మహారాజ గంజ్ బజారునందుగల ఒక పెద్ద సరోవరం ఉంది. ఇక్కడ పూర్వం దక్షప్రజాపతి యజ్ఞం చేసినచోటు. ఇక్కడ సరోవర స్నానం బహుపవిత్రం.

మౌశాహ్.గంజ్ రైలు లైనులో మహమ్మదాబాద్ స్టేషన్నుండి 8 కి. మీ. దూరంలో ప్రాచీనకాలంలో దేవలార్క్మని పిలవబడే దేవలాన్ ఉన్నది. ఇక్కడ దేవలమహర్షి ప్రతిష్ఠించిన సూర్యమందిరం ఉంది.

దగ్గరలోనే ఖురాసన్‌రోడ్డు నుండి 5 కి.మీ. దూరంలో దూర్వాస మహాముని తపస్సు చేసిన దూర్వాస ధామంకూడా ఉంది.

# అ ల హా బా దు

వారణాసికి పడమరగా 135 కి. మీ. దూరంలో ఉన్నది. అలహాబాదునే ప్రయాగ, త్రివేణి అనికూడా అంటారు. గంగ, యమున, సరస్వతి నదుల సంగమంగా ప్రసిద్ధి. గంగా, యమునలు మనకు కనిపించేట్లు కలిస్తే సరస్వతీనది అంత

ర్వాహినిగా ప్రవహిస్తూ ఇక్కడనే కలుస్తుందట. అందుకే త్రివేణి సంగమంగా పేర్కొనబడింది. మూడు మహాపవిత్రమైన నదుల కలయికగా నేర్పడిన సంగమస్థానం గనుకనే తీర్థరాజమనే పేరు సార్థకమయింది.

అలహాబాదు నగర జనాభా రమారమి 6 లక్షలు పైచిలుకు. జంక్షను స్టేషను కూడా చాలా పెద్దది. పురాణేతిహాసాల్లో ప్రయాగక్షేత్రంగా అభివర్ణించబడింది. ఇక్కడ బ్రహ్మదేవుడు ఒక మహాయజ్ఞమును చేశాడు. చైనా యాత్రికుడు హ్యూయాన్ సాంగ్ ఈ నగరాన్ని క్రీ.శ. 634 ప్రాంతంలో దర్శించాడు.

ప్రస్తుతనామం అక్బరు మహాచక్రవర్తి వలన వచ్చింది. నదీ సంగమస్థానాన్ని తలయెత్తి చూస్తున్నట్లుగా అక్బరు చక్రవర్తి ఒక పెద్దకోట కట్టించాడు. 1584 లో ఈ పేరు సార్థకమయ్యింది. అక్బరు తరువాత మహారాష్ట్రులు, తరువాత పఠానులు, 1801 లో బ్రిటిషువారి ఈస్టిండియా కంపెనీవారికి 1801లో అవుధ్‌నవాబు దత్తం చేశాడు. చివరగా ప్రథమ స్వతంత్ర సంగ్రామంగా పేర్కొనబడిన సిపాయి తిరుగుబాటు అనంతరం 1858 లో బ్రిటిషు రాజరికంలోకి అప్పగించబడింది. వారణాసి మాదిరిగా ఇరుకు సందులు గాకుండా చక్కని విశాల రాజవీధులతో ఆధునికత్వం పుణికి పుచ్చుకుంది.

మహాత్మాగాంధీ రోడ్డులో టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసు వుంది. నగరంలో మూడు రైల్వే స్టేషనులున్నాయి. పుణ్యస్థలి పవిత్రతతోపాటు ఎంతో చారిత్రక ప్రాధాన్యంగల అలహాబాదులో ముఖ్యమైనవి— దర్శనీయాలు.

## త్రివేణీ సంగమం :

ప్రతి సంవత్సరం పవిత్ర స్నానోత్సవం దాదాపు ఒక నెలపాటు జరుగుతుంది. దీన్ని మాఘమేళా అని అంటారు. సాధారణంగా జనవరి 15, ఫిబ్రవరి 15 లలోపు వస్తుంది ఈ ఉత్సవం. ప్రతి 12 సంవత్సరాలకు పుష్కరోత్సవం జరుగుతుంది. దీన్ని కుంభమేళా అని అంటారు. ఇక్కడ ఈ పుణ్యస్థలిలో స్నానం చేయటానికి లక్షలాది యాత్రికులు ప్రతి సంవత్సరం ప్రవాహంలాగా వస్తుంటారు. కుంభమేళా కయితే ఇహ చెప్పనక్కరలేదు. దేశం నలుమూలలనుండీ యాత్రిక బృందాలు దాదాపు కనీసం పది లక్షలుపైగా వచ్చి పవిత్ర స్నానాలు చేసి వెళ్తారు. మేళా సమయాల్లో ప్రత్యేకంగా ముందు జాగ్రత్తలు తీసికొంటారు. అయినా ఒక సంవత్సరమయితే ఇటీవలి కాలంలోనే తొక్కిసలాటలో కొన్ని వందలమంది ప్రాణాలు

కోల్పోయారు. కుంభమేళా ప్రతిమూడు సంవత్సరాలకూ నాసిక్, ఉజ్జయిని, హరిద్వారాలు, అలహాబాదు మధ్య రొటేటింగ్ అవుతుంటుంది. 1989 లో అలహాబాదు వంతు వస్తుంది. యమునా నదిజలాలు నీలవర్ణంతో స్వచ్ఛంగా వుంటే గంగానది నీరు మురికిగా మందంగా ఉంటాయి. ఇక్కడి గంగానది 2 కి.మీ. వెడల్పున పరుచుకుని ఉంటుంది. స్టేషను నుండి సుమారు 5 కి మీ. దూరముంది.

## పూర్వకథ—ప్రాచీన ప్రశస్తి :

శ్రీరామ చంద్రుడు భరద్వాజాశ్రమం నుండి పాదచారియై వచ్చి, త్రివేణీ సంగమంలో స్నానమాడినట్లు రామాయణంలో చెప్పబడింది. భరద్వాజాశ్రమం ఆనంద భవనం దగ్గరిలో ఉన్నదట.

గరుత్మంతుడు అమృత భాండాన్ని దేవతలకోసం తీసికొనిపోయి, నాలుగు చోట్ల ఆగాడట. ఆ నాలుగు చోట్లూ హరిద్వారం, ప్రయాగ, ఉజ్జయిని, నాసిక్. కనుకనే కుంభమేళా ఉత్సవాలు నాలుగు ప్రదేశాల్లోనూ జరుగుతాయని ప్రతీతి.

బుద్ధుడు క్రీ. పూ. 6వ శతాబ్దంలో ప్రయాగలో తన ప్రబోధం చేశాడు. అశోకుడు 3వ శతాబ్దంలో ప్రయాగను దర్శించి స్తూపాలు నిర్మించాడు.

## అలహాబాదు కోట :

త్రివేణీ సంగమాన్ని ఆనుకొనే బలిష్ఠమైన గోడలు ఎత్తుగా కట్టించబడిన కోట వుంది. 1583 లో అక్బరు చక్రవర్తి కట్టించిన ఈ కోట యమునానది వైపు ఉన్నది. నిర్మాణంలో పెద్ద పెద్ద ఇటుకలను ఉపయోగించారు. నదిమీదినుంచి చూస్తే అద్భుతంగా కనబడుతుంది. విదేశీయులను కోటలో పలికి రానీయరు. అధికారికమైన ప్యాసుబుంటే చూడవచ్చు. అవి వచ్చేమార్గం మాత్రం సున్న.

కోటద్వారం లోపల అశోకస్తంబం వున్నది. మంచి పాలిష్‌రాయితో క్రీ.పూ. 234 సం. నాటిది. 1837 వరకు ఒకమూల పడివుంది. స్తంబంమీద అశోకుని శాసనాలు, తరువాత కాలంలో సముద్రగుప్తుని కాలంలోను, ఇతర గుప్తుల కాలంలోని సువర్ణ ఘట్టాలను రచించారు. గుప్తుల వైభవ చిహ్నానికి ఇదొక తార్కాణ. తరువాత జహంగీరు వ్రాయించినవి కూడా చూడవచ్చు. ముచ్చటగా మూడుయుగాలకు ప్రతినిధిగా ఈ స్తంభాన్ని పరిగణించవచ్చు.

అక్షయ వటవృక్షం : తూర్పువైపు కోట గోడలో ఒక చిన్నిద్వారం ఉంది. ఈ ద్వారంగుండా వెళితే అక్షయ వటవృక్షాన్ని చూడవచ్చు. ఈ వృక్షాన్ని గురించి కూడా హ్యూయాన్ సాంగుకూడా ముచ్చటించాడు తన వ్రాతల్లో. ఇది భూగర్భంలో ఉన్నది. అక్కడ అనేక దేవతా విగ్రహాలుకూడా ఉన్నాయి. ఆకులు కొమ్మలు కనిపించకుండా కట్టివేయబడ్డాయి. ఎన్నోసార్లు పీకివేయాలని ప్రయత్నించి అలవిగాక, తరువాతనరికి సీసంపోసినా మరల చిగురించి తన ప్రత్యేకతను నిలబెట్టు కుంది వటవృక్షం.

కోటకు వెళ్ళే త్రోవలో ఒక గుంటలో శయనించియున్న 'శ్రీ ఆంజనేయ మూర్తి' గలదు. భుజాలమీద రామలక్ష్మణులు, కాళ్ళక్రింద కాళీ, రావణులుగలరు. చాల ప్రసిద్ధం.

**ఖుస్రూబాగ్ :**

ప్రశాంతవనం. జహంగీరు కుమారుడైన ఖుస్రూని తండ్రియైన జహంగీరే వధించాడు. అతనికి ఒక సమాధి ఈ వనంలో ఉంది. ఇందులో తన రాజపుత్ర మాత, ఖుస్రూ సోదరికి గూడ సమాధులున్నాయి. ఖుస్రూ తన తండ్రి నెదిరించి నందుకు కినిసి విషమ్మును మింగి ఆత్మహత్య గావించుకున్నదట తల్లి. స్టేషనుకు దగ్గర లోనే ఉన్నది.

**అలహాబాదు మ్యూజియం :**

కమలా నెహ్రూరోడ్డులో ఉన్నది. ఉదయం గం. 11 నుండి 4-30 గం. వరకు దర్శనీయం. రుసుం. 0-20 పైసలు మాత్రం. సోమవారాలు సెలవు. ఎదురుగా ఒక అందమైన చిల్డ్రన్ పార్కు కూడా ఉంది. మ్యూజియంలో రాజస్థానీ చిత్రాలు, పండిట్ నెహ్రూ సేకరించిన రోరిచ చిత్రాలు, కొన్ని అరుదైన వస్తు సముదాయమును చూడగలం.

**ఇతరంగా :**

భరద్వాజాశ్రమం, నాగేశ్వరాలయం, ఆనందభవన్- పండిట్ నెహ్రూ తండ్రి మోతీలాల్- నెహ్రూ కుటుంబం నివసించిన గృహం, అలహాబాదు విశ్వవిద్యాలయం కంపెనీ బాగ్ అనే విశాలమైన ఉద్యానవనం, నగయిరాలతోపాటు—

శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారీ మహారాజుగారు— ఝూషీ— ఆజన్మ బ్రహ్మచారులై దీర్ఘకాల తపోనిష్ఠా గరిష్ఠులై, కొన్ని సంవత్సరాలు పర్యంతం మౌనవ్రతం

గావించి అనేక సాధనలు సాధించిన సిద్ధపురుషులు వసించేవారి ఆశ్రమం చూడదగింది. వీరు ఆధ్యాత్మికతను ప్రేరేపించి అనేక గ్రంథములు వ్రాసి ప్రచురించారు. వీరి ముఖ్యసాధనం అఖండనామ సంకీర్తనం. ప్రవచనకాలలో అనేక రీతుల భక్తి, జ్ఞాన, వైరాగ్య ప్రవచనములు, గోష్ఠులు నిత్యమూ జరుగుతుంటాయి. గోవధను శాసనరూపంగా నిరోధించిన మహామహులు.

అలహాబాదులో నిర్వర్తించవలసిన ముఖ్య కర్తవ్యాలు :

రామేశ్వరం నుండి తెచ్చిన సేతువును ఇక్కడ కలుపుతారు. ముత్తైదువలు అయిన స్త్రీలు వేణిపూజ జరిపించి కొన వెంట్రుకలను సమర్పిస్తారు. ఇది దంపత సమేతంగా చేయవలసినది. ఆ వెంట్రుకలు నీటిలో మునగటం విశేషం. తీర్థ విధులు తప్పకుండా చేయాలి.

యమునకు అవలిఒడ్డున- చక్రధర, సోమేశ్వర శివాలయం (శిధిలమయింది) శంకర, ఆంజనేయ, బిందుమాధవ ఆలయాలు దర్శనీయం.

బ్రహ్మచారిగారి ఆశ్రమానికి అనతి దూరంలో సముద్రకూపం అనే బావి ఒకటుంది. దీని తీర్థం అమోఘ మహిమగలదని ప్రతీతి.

గమనిక :

అలహాబాదు నుండి ముందుకు సాగే ముందుగా వీలయితే ఈ క్షేత్రాలనుగూడ దర్శించి అలహాబాదు చేరి తిరిగి ప్రయాణం సాగించవచ్చు. అయితే విజయవాడ నుండి అలహాబాదు, నాగపూర్, ఇటార్సి, జబల్‌పూర్ మీదుగా వచ్చేవారు మధ్యలో ఈ క్షేత్రాలను దర్శించి అలహాబాదు చేరవచ్చు.

రీవా :

ఒకానొకప్పటి వింధ్యప్రదేశ్ రాజధాని. అలహాబాదు - ఇటార్సీ మార్గంలో సత్నా చేరి అక్కడ నుండి బస్సులో 50 కి.మీ. ప్రయాణంచేసి చేరనగును. రీవా కోట, నగరం దర్శనీయం. నేలబొగ్గు విశేషంగా దొరుకుచోటు.

పన్నా :

వజ్రాలకు ప్రసిద్ధి. ప్రతి సంవత్సరం ఎన్నో వజ్రాలు ఇక్కడి గనులనుండి తీస్తారు.

సత్నా నుండి 15 కి.మీ. లోపు 909లో నిర్మించిన బౌద్ధస్తూపం చూడవచ్చు. దీనిని భారత స్తూపం అంటారు.

మంచి పిక్నిక్‌స్పాట్ అయిన బూచార్, ఛాఛాయి జలపాతాలు చూడవచ్చు. కాని ఇవి మధ్యప్రదేశ్ లోనివి.

**చిత్రకూట్ :**

సెంట్రల్ మీటర్‌గేజిలో కర్వీ స్టేషనులో దిగితే సుమారు 12 కి. మీటర్లలో ఉన్న చిత్రకూట్ చేరగలం. ధర్మశాల లున్నాయి. చూడదగినది.

**రామఘాట్ :**

శ్రీరామచంద్రుడు వనవాసంలో ఉండగా దశరథుని మరణవార్త విన్నప్పుడు. తండ్రికి పిండప్రదానములు గావించిన చోటు. మందాకినీ తీరం మహాభక్తుడు తులసీ దాసుకు సీతారామ లక్ష్మణ సహితంగా దర్శన మిచ్చారట శ్రీరాములవారు. అప్పుడు వారికి తిలకాలు దిద్దారట.

**హనుమాన్ ధార :**

అందమైన చోటు. పెద్ద ఆంజనేయస్వామి విగ్రహం ఉంది. ఆయన చేతిలో ఒక జలధార పడుతూ వుంటుంది. గొప్ప మహిమాన్వితుడైన స్వామి.

**కామత గిరి :**

ఈ పర్వతం చుట్టూ పరిభ్రమణం లేదా ప్రదక్షిణం చేస్తారు. చుట్టూ చల్లని నీడనిచ్చే చెట్లు సేదదీరుస్తుండగా అందమైన చల్లని వాతావరణంలో- అక్షయవటం, ధర్మ పాఠశాల, కైలాసనాథేశ్వరం, రాధామందిరం, శ్రీరామనామ వృక్షం, పశ్చిమ దర్వాజా, బిహరజీ, కాంతానార్ మొదలయినవి చూచుకుంటూ పరిభ్రమణం చేయవచ్చు

**ఇంకా ఇక్కడ :**

**జానకీకుండు :**

మందాకినీ తీరంలో ఉన్న అతి సుందరమైన ఆలయం అనసూయాశ్రమం. అత్రి మహాముని భార్య- సతీఅనసూయ సీతాసాధ్వికి పాతివ్రత్య మహిమను బోధించిన పవిత్రమైన చోటు. తులసీదాస మందిరం, జగవేది మందిర్, విజావర్ మందిర్ మొదలైనవి. జానకికుండు దగ్గర సాధుపుంగవు లుంటారు.

పర్వతంమీద, కోటితీర్థం– మందాకిని దాటి కొంత చిట్టడివి నడిచి వెళ్ళిన నిట్ట నిలువుగా అర కిలోమీటరుపైకి ఎక్కితే తొట్టిలోపడే ఊటజలధార, దేవాంగన ఊట మొదలయినవని గూడ చూడవచ్చును.

తులసీదాసు జన్మభూమి :

గోస్వామి శ్రీతులసీదాసు యమునా తీరంలో గల రాజాపురంలో జన్మించి నట్లుగా ప్రతీతి. వారి వంశస్థులు ఇప్పుడిక్కడ నివసిస్తున్నట్లుగా చెపుతారు.

బంధూాక్ ఫూాక్ :

1781లో నిర్మితమైన జగేశ్వర మహదేవుని ఆలయం గొప్ప శైవ క్షేత్రం. శివరాత్రికి బ్రహ్మాండంగా ఉత్సవాలు జరుగుతాయి.

చిత్రకూట పర్వత ప్రాంతంలో :

లక్ష్మణ పర్వతం, కోటి తీర్థం, సిద్ధబాబాకుటి, గుప్తగోదావరి, భరత్‌కూట్, రామ శయ్య మొదలయినవి దర్శనీయములు.

# కాన్పూర్

జనాభా సుమారు 14 లక్షలు. పెద్ద పారిశ్రామిక కేంద్రం. ఇంగ్లండులోని మాంచెస్టరుకు దీటురాగలిగినదిగా ప్రసిద్ధి. లక్నోకు దక్షిణంగా అలతి దూరంలో ఉన్న మహాపట్నం. భారతదేశ స్వాతంత్ర్య యుద్ధంలో ప్రథమఘట్టమయిన 1857 సిపాయిల తిరుగుబాటులో 'కాన్పూరు కుట్ర' అతి ప్రాముఖ్యం వహించిన ఘట్టం జరిగిన చోటుగా ప్రసిద్ధి. 1875లో సామూహిక స్మారక చిహ్నంగా బ్రిటిషువారు ఒక చర్చిని నిర్మించారు. ఇక్కడ అతి పెద్దదైన ఒక జంతు ప్రదర్శనశాల దర్శనీయం. ప్రయాగ్ నారాయణ్, రామనారాయణ్, శ్రీ గురుప్రసాద్ శుక్లాలయములు చూడదగినవి. సుగర్ టెక్నోలాజికల్ ఇన్‌స్టిట్యూట్ కలదు. కాన్పూరు చర్మవస్తువులు, ఉన్ని దుస్తులకు ప్రత్యేక ప్రసిద్ధి.

రామ్‌పూర్ :

జనాభా 1,80,000. పూర్వపు రోహిల్లాకి రాజధాని. స్టేట్ లైబ్రరీలో అతి పురాతన కాలానికి చెందిన వ్రాతప్రతులు, తాళపత్ర గ్రంథాలు భద్రపరచి ఉంచారు.

మేధావులకు కావలసినంత మేత. కోటలోపల ఆసక్తిని రేకెత్తించే జామి మసీదు దర్శనీయం.

బరేల్లీ :

జనాభా 3,60,000. పూర్వపు రోహిల్ఖండ్‌కి రాజధాని. ఆఫ్గన్ నుండి వలస వచ్చిన రోహితులు, మరాతులు, అవుధ్ నవాబుల మధ్య రేగిన గొడవలవలన వారిలోని అంతఃకలహాల వలన బ్రిటిషువారు స్వాధీనం చేసుకోగలిగారు.

ఇటావా :

శిధిలమైన కోట ఉంది. మొగలు సామ్రాజ్యం వైభవంగా వెలిగినప్పుడు ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకున్న ప్రదేశం. జామిమసీదు – జవున్‌పూర్‌లోని జామిమసీదు దాదాపు ఒకేరకంగా ఉన్నది– చూడవచ్చు.

కనోజ్ :

కాళీనది తీరమునకు సుమారు 7 కి.మీ. దూరంలో ఉన్నది. దీనిని అశ్వతీర్థమని అంటారు. ఆర్యుల కాలంలో చాలా ప్రసిద్ధి చెందినది. ఒకప్పుడు పురాణ కాలంలో గాధి దేశంగా ప్రసిద్ధి చెందిన ఈ ప్రదేశం బ్రహ్మర్షి విశ్వామిత్రునికి జన్మస్థలంగా చెప్పబడింది.

పూర్వకాలంలో కలశనాధుడు అను చక్రవర్తి ఏలుబడిలో ఉన్నది. ఈ చక్రవర్తి యొక్క నూర్గురు కుమార్తెలను వాయుదేవుడు వివాహం చేసుకోవాలని కోరితే ఆ కన్యలు నిరాకరించారు. వాయువు తనను నిరాకరించినందుకు కోపించి శపించాడట, వారందరిని కుబ్జరూపులు గమ్మని. అప్పటినుండి ఈ నగరానికి కన్యాకుబ్జమనే పేరు గూడ సార్థక నామ మయిందని చెపుతారు

దేవీ భాగవతంలో చెప్పినట్లుగా 108 శక్తి పీఠాల్లో 11వ స్థానాన్ని ఆక్రమించిన ఇచ్చట గౌరీదేవి ఆలయం వుంది. వామనుని ఆలయం కూడా ఉంది. దర్శనీయం.

బౌద్ధ మతపరంగా కూడా ఒక వెలుగు వెలిగిందని చెప్పవచ్చు. హ్యూయాన్ సాంగ్ దర్శించినప్పుడు 100 బౌద్ధ మఠాలున్నాయని, కొన్ని వేలమంది భిక్షువులున్నారని, 200 దేవాలయా లున్నాయని తన వ్రాతల్లో వ్రాసియున్నాడట.

జయచంద్రుని కుమార్తె రాణీ సంయుక్తను పృథ్వీరాజు ఇక్కడి నుండే ఎత్తుకునిపోయి జయచంద్రుని అభీష్టానికి వ్యతిరేకంగా పెండ్లాడాడు.

సి. బి. :

భక్త సూరదాసుని జన్మస్థలం. ఈయన 1540 ప్రాంతంవాడు. మహాభారతాన్ని 'సూరసాగర్' అనే గ్రంథంగా హిందీలో రచించిన గొప్ప భక్త కవి శేఖరుడు.

# ఆగ్రా

ఆగ్రా చేరటానికి ఢిల్లీ-ఆగ్రా-ఖజురాహో-వారణాసి-ఖాట్మాండు విమానంలో ఢిల్లీనుండి మొదటి మజిలీ అయిన ఆగ్రా చేరటానికి 30 నిమిషాల కంటే పట్టదు. ఈ సౌకర్యం ప్రతిరోజూవుంది. ఇదిగాక ఢిల్లీ-ఆగ్రా-జైపూరులకు వారానికి మూడు సార్లు వాయుదూత్ సౌకర్యం వుంది.

బస్సు, రైళ్ళు- లక్నోనుండి, కాన్పూర్ నుండి బస్సు, రైలు సౌకర్యం ఉండనే ఉంది. ఆగ్రా యమునానది ఒడ్డున ఉన్న పట్టణం. ప్రస్తుతం జనాభా 7 లక్షలు పైగా ఉంది. యమునానదిలో తాబేళ్ళు విశేషం. బ్రాడ్‌గేజికి, మీటర్‌గేజికి వేరు వేరుగాగాని, కలిపిగాని ఏడు స్టేషను లున్నాయి.

ఇక్కడ ప్రపంచము నందలి 'సెవన్ వండర్స్'లో ఒకటిగా ప్రసిద్ధి చెందిన సుందర కళాత్మకమైన కట్టడం 'తాజ్‌మహల్'కి నెలవు. దీనికితోడు చరిత్ర ప్రసిద్ధి గాంచిన విశేషాలకు యుగం మొదటినుంచి ప్రశస్తి. ఈ విశేషాల్లో ఒకటిగా ఆగ్రా కోట గూడా ఒకటి. ఇండియాకి వచ్చే విదేశ యాత్రికులకు ప్రత్యేక ఆకర్షణ తాజ్ మహల్. ప్రపంచం నలుమూలల నుండి కేవలం తాజ్‌మహల్ చూడటానికే వస్తారంటే అతిశయోక్తి కాదు. తాజ్‌మహల్ అందాన్ని గురించి ఎంత వ్రాసినా తక్కువగానే కనబడుతుంది. వర్ణనాతీతం అక్షరాలా! అయితే విశేషాలు ముచ్చటించక తప్పదు

ఆగ్రా గురించి :

అనాది కాలంలో అగ్రబనగా పురాణాల్లో ఉల్లేఖించబడింది. శ్రీకృష్ణ పరమాత్మని తాతగారైన ఉగ్రసేనుని పేర వెలిసిందని ప్రతీతి. ఒకవంక మహాభారతంలో ఈ పట్టణం అగ్రవనముగా పేర్కొనబడగా, గ్రీకు భౌగోళికుడు ప్టోలెమీ. క్రీ. శ. 2వ శతాబ్దంలో ఈ పట్టణాన్ని 'అగ్ర'గా పేర్కొనడం గమనించ దగింది.

రాజకీయంగా మొగలుల కాలంనుంచీ ప్రాధాన్యతను సంతరించుకున్న పట్టణం ఆగ్రా. మొగలు సామ్రాట్టులు ఇక్కడ కట్టుకున్న, కట్టించిన రాజప్రాసాదాలు ఎన్న

లేని ఖ్యాతిని తెచ్చిపెట్టాయి. తాజ్‌మహల్ చూడటానికి జీవితంలో మరల మరలా రావాలని కోరుకుంటారు. ఎంతదూరం నించైనా తాజ్ అందాన్ని వివిధ వేళల్లో ప్రసరించే వింతకాంతులు మనోమోహనంగా ఉంటాయి. పగటిపూట ఒక అందం. పూచిన పున్నమి వెన్నెలలో తాజ్ అందాలు మరింత ఇనుమడించిన సోయగాలు చూడ జన్మ చరితార్థం అవుతుంది.

తాజ్‌మహల్ :

ఒక్కొక్క దేశంలోని ప్రత్యేకత ఆ దేశంలోని అద్భుత కట్టడం వన్నె తెచ్చిపెట్టినవి ప్రపంచంలో ఫ్రాన్స్‌లోని ఈఫిల్‌టవర్, ఆస్ట్రేలియాకి సిడ్నీలో ఒపేరా హౌస్ లాంటివి అయితే భారతదేశంలోని తాజ్‌మహల్‌ని గురించి మొదట చెప్పి తరువాత మిగతావాటిని చెప్పాలి. షాజహాన్, ముంతాజ్‌ల ప్రణయ స్మారక చిహ్నం– ప్రపంచలో మొట్టమొదటగా చెప్పదగినది నాటికి నేటికి నభూతో నభవిష్యతిగా ప్రథమ పంక్తిలో పెద్దపీటవేసి చెప్పుకోవలసినది. మొగల్ చక్రవర్తి షాజహాన్ అయిన బేగమ్ ముంతాజ్‌ల అమర ప్రణయం. వివాహం అయిన 17 సంవత్సరాలు నిరంతరంగా ప్రేమ సాగరంలో ఓలలాడి 14 మంది సంతానం కలిగిన పిదప 15వ సంతానం కలిగినప్పుడు విధిబలీయమై మరణం సంభవించింది. ఎడబాటుని తట్టుకోలేని చక్రవర్తి మనసులోని ప్రణయవేదన రూపొందించబడిన చిరస్మరణీయ రూపకల్పనగా తాజ్‌మహల్ కట్టడం ఆవిర్భవించింది. 1632లో ప్రారంభించబడి 1653 వరకు అంటే 20 సంవత్సరాలుపైగా జరిగిన 20,000 మంది శిల్ప నిపుణుల నిర్విరామ కృషితో ఏర్పడిన అజరామరమైన అద్భుత సుందర రూపం. అంతా చలువరాతితోనే నిర్మించబడింది. దీనికి ఆధ్వర్యం వహించిన ప్రధానశిల్పి ఇరాన్ దేశీయుడైన ఇసాఖాన్. దీనికి అందాల మెరుగులు దిద్దేందుకు ఫ్రెంచి దేశీయుడైన ఆస్టిన్‌ఆఫ్‌బోర్డాక్స్ ఇటలీ దేశస్థుడైన వెరోనియో– వెనిస్ నగర నివాసి పాలుపంచుకున్నారుట. దేశాంతర యాత్రికులు సైతం ప్రపంచమంతా తిరిగివచ్చిన సౌందర్యోపాసకులు తాజ్‌మహల్‌ను దర్శించి మరచిపోలేని తన్మయతను పదిలపరచుకుని తమ తోటి యితర దేశీయులను కూడా ప్రపంచమంతా తిరగటం ఒక ఎత్తు ఇండియాలోని 'తాజ్' ని చూడటం ఒక ఎత్తుగా వ్రాసికొని యున్నారు.

52 మీటర్లు ఎత్తుగా ఉన్న సెంట్రల్‌డోము నాలుగు మూలలా నాలుగు సన్నని తెల్లని స్తంభాలు నిలబెట్టుతున్నాయి. ఈడోము క్రిందనే షాజహాన్, ముంతాజ్ బేగంల సమాధులున్నాయి.

మచ్చలేని స్నిగ్ధత్వంతో గల పాలరాయితో ముంతాజ్‌బేగంకి తాజ్‌మహల్ స్మారకంగా కట్టించిన షాజహాన్- తన విషాదాన్నంతా ప్రతిఫలించే విధంగా నల్లని చలవరాతితో తన సమాధికట్టంగా వేరొకటి నల్లతాజ్‌మహల్ కట్టించాలని ముచ్చట పడ్డాడుట. అయితే యింతలో కుమారుడైన ఔరంగజేబు తండ్రిని సింహాసనం నుండి క్రిందకు నెట్టి రాజరికం తనచేత చిక్కించుకున్నాడు. చక్రవర్తి తన శేషజీవితాన్ని ఆగ్రా కోటలో ప్రణయస్మారక చిహ్నాన్ని చూస్తూ విషాదంగా గడపవలసి వచ్చింది.

యమునానది ఒడ్డున వున్న తాజ్ మహల్ పైకెక్కితే ఆగ్రా పట్టణం దృశ్యమానంగా కనబడుతుంది. దీనిశోభ సూర్యకాంతిలో లోపలిభాగం ఆశ్చర్యాన్ని గలిగించే వింతగా కనబడితే సూర్యాస్తమయ సంజవెలుగులో మరో విధంగా కనబడుతుంది. పున్నమి వెన్నెలలో పాలరాతి అందాలు పరమ రమణీయంగా మూసబోసిన ముగ్ధ మోహనంగా కనబడి మనసునిండా ప్రేమతత్వం అద్వైతమై మరపిస్తుంది. ప్రతివారు జన్మలో ఒకసారి చూచి ధన్యత జెందదగిన కమనీయ కళారూపం. ఒకసారి చూస్తే మరల మరల చూడాలనిపించే కావ్యం. నదిమీది నించి చూస్తే ఎర్ర కారురాయితో నిర్మించిన జంట మసీదులుగా కనబడుతుంది. ప్రవేశంలో అరబ్బీలో వ్రాయబడిన ఖురాను సూక్తులతో పెద్దద్వారం లోపలకు దారితీస్తుంది. తాజ్ కట్టడం ఎదురుగా ఒక పెద్ద నీటికుండు త్రోవను రెండుగా విభజిస్తుంది. సరస్సులో నీరు నిండుగా వుంటే నీటిలో ప్రతిబింబిస్తుంది. ఇంత చక్కని కావ్యకళా రూపం మరెక్కడా లేదు.

ప్రవేశ రుసుం రు. 2/- శుక్రవారాలు మాత్రం ఉచితంగా దర్శనీయం.

అయితే ఇటీవల వినిపించే ఒక అపశ్రుతి. మనం ఆధునికత్వం పేరుతో మన అవసరాలకు తగినట్లుగా దేశం పారిశ్రామికీకరణం చేయటంతో ఏర్పడిన కాలుష్యంతో మచ్చ కలిగేట్లుందని కొంతమంది శాస్త్రవేత్తలు వ్యక్తీకరించిన అభిప్రాయాలు గమనించదగినవి. దీనికితోడు ఒక రసాయన కర్మాగారం తలపెట్టారు. ఇక ఇది గూడా తయారయితే ఈ శతాబ్దానికల్లా పాలరాతి వన్నె తరిగిపోయి తాజ్‌మహల్ కళావిహీనంగా తయారవగలదనే వాస్తవం గర్హించ తగిన విషయం. ఇంతకుముందు దుండగులు వెండి, బంగారాలు వలుచుకుని వెళ్ళినా పాలరాతి వైభవాన్ని కదల్చలేకపోయారు. కాని ఇప్పుడో మరి !!

ఆగ్రా కోట :

అక్బరు మహాచక్రవర్తి 1565లో ప్రారంభించి రక్షణార్థం ఈ కోటను, 8 సంవత్సరాలు పర్యంతం కట్టించాడు. ఇది ఒక బ్రహ్మాండమైన కట్టడం. చక్రవర్తి మనుమడు షాజహాను ఏలుబడిలో కొచ్చిన తర్వాత దానికి సరికొత్త అందాలు మెరుగులు దిద్దించాడు. చలువరాతి పని చేయించాడు. ప్రత్యేకంగా ఈ కోటను ముందుగా చూస్తే తాజ్‌మహల్ కట్టడం అంత అందంగా రూపొందడానికి గల పునాది కారణం సుబోధక మవుతుంది. కోటచుట్టూ 70 అ. ఎత్తుగల బలిష్టమైన గోడలు 2.5 కి.మీ. వైశాల్యంలో పరిక్రమించాయి. కోట చుట్టూ 10 మీటర్లు వెడల్పు పెద్ద అగడ్త చుట్టు కొని వుంది. కోట కూడా యమునానది ఒడ్డునే అమరియున్నది. విశేషం. దక్షిణాన అమర్‌సింగ్ గేటు ద్వారా ప్రవేశించవచ్చు. లోపల నగరంలో నగరం ఇమిడియున్నది. విశేషాలెన్నో పొదువుకుని ఉన్నది. ప్రవేశ రుసుం 2 రూ. శుక్రవారాలు ప్రవేశం ఉచితం. కొన్ని ప్రాధాన్యత గలిగిన అందాల రాజ ప్రాసాదాలు లోపల చూడదగిన ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకుని వున్నాయి. అక్కడ గైడ్సు కూడా వుంటారు. విశేషాలు వివరిస్తూ మనకు అన్నీ చూపించగలరు. ముఖ్యంగా చూడదగినవి:

మోతీ మసీదు :

ముత్యాల మసీదు. షాజహాను చక్రవర్తి 1646-1653 మధ్యలో నిర్మించింది. మధ్యలో ఒక చిన్న చలువరాతి తటాకంచుట్టూ ఆవరించియున్న పంచపాళీ వసారాల సముదాయంతో చూడముచ్చటగా ఉన్నది.

దివాని-ఇ-అమ్ :

అంతకుముందు కొయ్య కట్టడం. దీన్ని షాజహాను ప్రజల ఫిర్యాదులను విచారించే సభా భవనంగా తయారుచేశాడు. అందులో సింహాసనం ఒక ప్రత్యేక గదిలో అమర్చబడి వున్నది. ఈ గది చలువరాళ్ళను మధ్యలో తాపడం చేసి కట్టించాడు బహుసుందరంగా. దీని ప్రక్కనే 'నగీనా మసీదు' ఒకటి, దాని ప్రక్కనే జనానా అంతఃపుర కాంతలు వ్యాపారస్తులు అమ్మకానికి తీసుకొని వచ్చే వస్తువులు ఎన్నిక ప్రదర్శన నిమిత్తం కట్టించబడిన 'లేడీస్ బజారు' నిర్మించబడి ఉన్నవి. చూడవచ్చు.

దివాన్-ఇ-ఖాస్ :

ఇది కూడా షాజహాను చక్రవర్తి 1636-37 మధ్య నిర్మించారు. చక్రవర్తి ఈ ప్రదేశంలో ముఖ్య రాజోద్యోగులను, విదేశ రాయబారులను కలవడానికి ప్రత్యేక

హాలు. ఈ హాలు మూడు ఆర్చీలతో రెండు గదులుగా విభజించబడింది. ప్రపంచ ప్రసిద్ధి చెందిన నెమలి సింహాసనం- షాజహాను చక్రవర్తి కూర్చుండేది ఇక్కడవే ఉండేది. తరువాత ఔరంగజేబు దాన్ని ఢిల్లీ తరలించాడట. ఆ తరువాత ఇరాన్‌కు తీసికొని పోబడింది. ప్రస్తుతం టెహరాన్‌లో వున్నదంటారు.

## అష్టభుజి గోపురం :

దివాన్-ఇ-ఖాస్‌కి అతి సమీపంలోనే ఉన్న సమున్నతమైన గోపురం. దీన్నే సామాన బురుజుగా పిలుస్తారు. ఈ బురుజు మీది నుంచి చూస్తే ముంతాజ్ మహల్, యమునపై ఉన్న తాజ్‌మహల్ ఇంకా ఇతర భవనాలు పర్యవేక్షించటానికి షాజహాను చక్రవర్తి కట్టించాడట. కాని షాజహాను 1666లో ఏడు సంవత్సరాలు కారాగారవాసం చేసి విషాదాంతంగా దురదృష్ట మృత్యు వాతన పడ్డాడు. అంతటి మహా చక్రవర్తి జీవితం ఇంత దీనంగా ముగియటం చూస్తుంటే సంపదల బుద్బుదత్వం మనసుల్లో మెదిలి వైరాగ్య భావానికి దారి తీస్తుందో లేక మరింత పిరికి మందును పోసి పటిష్ఠ రక్షణకోసం వెంపర్లాడుతుందాని వారి వారి భావాల ప్రోదిని బట్టి నిర్ణయించుకోవలసిందే! తరువాత కాలక్రమేణా కొంత నష్టానికి గురయింది. అయినా పూర్వ వైభవాల చిహ్నాలను ఇంకా బహిర్గతం చేస్తూనే వుంది.

## జహాంగీరు ప్రాసాదం :

అక్బరు చక్రవర్తి జహాంగీరు కోసం కట్టించిన సుందర విలాస భవనం. మొదట ఈ కోట శత్రువులకు భేద్యంగా సైన్య సమూహాలకోసం కట్టించినదైనా ఈ భవనంలో విలాస ప్రాసాదాలకు కోటలో అంకురార్పణ జరిగినదని చెప్పవచ్చు. ఈ భవనం మధ్య ఆసియా హిందూ శిల్పరీతుల మేళనానికి మచ్చుతునక. మొగల్ రీతులు ఇందులో కనపడవు.

## షాజహాన్ చలవరాతి భవనం :

ఇది షాజహాను వారి అంతరంగిక భవనం. లోపలి గదులు మండే ఎండల కాలంలో శీతల-పవనాలు వచ్చే ప్రత్యేక అమరికతో కట్టించబడ్డాయి. సహజ సిద్ధంగా- ఆనాడే ఎయిర్‌కూల్ టెక్నాలజీతో నిర్మించబడి వుండటం మనకెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

## అద్దాల భవనం :

అంతఃపుర కాంతలు డ్రెస్సింగు కోసం ఉపయోగించే ఈ ప్రాసాదం అనేక మైన అద్దాలు బిగించి నిర్మించబడింది. షాజహాన్ వారి ఖాస్‌మహల్ – (గోష్ఠీ మందిరం) ముందు ఒక చిన్న అందమైన ద్రాక్షతోట పెంచబడింది. ఢిల్లీ గేటు, హాథీ పోల్ రెండూ మూసి వేయబడ్డాయి.

జహంగీరు మహలు ముందు హౌజ్-ఇ-జహంగ్రి అనే ఒక పెద్ద స్నానాల తొట్టి ఏక శిలా నిర్మితమయింది చూడవచ్చు.

## ఇంకా చూడవలసినవి :

అమర్‌సింగ్ గేటు- జోధ్‌పూర్ మహారాజు రాజా అమర్‌సింగ్, ఆయన అనుచరులను దివాన్-ఇ-అమ్‌తో జరిగిన గొడవ కారణంగా ఈ గేటు దగ్గరనే హత మార్చటం జరిగిందట. అందుచేత ఇది అమర్‌సింగ్ గేటుగా ప్రసిద్ధి. ఈ కిరాతకం- 1644లో జరిగింది. ఇక్కడ నుండి అపరాధులనబడేవారిని శిక్షకు గురి చేయటానికి నది లోపలకి తోయటానికి వీలుగా ఒక రాతి బండ ఉండేది.

అన్నిటితోపాటుగా కోటలో ఉన్న నీటిగేటు, నవబత్‌ఖానా, భూగర్భ భవనాలు నీటిగేటు, చిత్తూరు దర్వాజా, రాతి గంగాళం వగైరాలు చూడవచ్చు.

## ఇత్మద్–ఉద్–దౌలాహ్ :

జహంగీరు యొక్క ప్రధానమంత్రి అయిన మీర్జా మియాస్ బేగ్- ఒక పర్షియా దేశస్థుడు అయిన ఈయన కుమార్తె నూర్‌జహాన్ (ప్రపంచ జ్యోతి అనే అర్థం అట) ను జహంగీరు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు— ఈయన సమాధి కోసం నిర్మించిన కట్టడం. ఈ కట్టడం నూర్జహాన్ స్వయంగా పర్యవేక్షించి కట్టించినది. దీనిలో పాలరాతి తెరలు పారదర్శకంగా బహు నైపుణ్యంగా నిర్మించబడ్డాయి. తరువాత కొద్ది సంవత్సరాలకే మొదలయిన తాజ్‌మహల్ కట్టడంలో నియోగించిన సాంకేతికత్వం రాయిలో రాయిని పొదిగి కట్టడం మొట్టమొదట పూర్ణత్వం సిద్ధించిన చోటుగా పేర్కొనదగింది. ఈ నిర్మాణ కౌశల్యాన్ని 'పియెత్రా దూరా' అని అంటారు. (PIETRA DURA). తాజ్‌మహల్ తోటి పోలిస్తే ఇది చాలా చిన్నది. కాని కట్టడానికి ఇది మాతృకగా భావించవచ్చు. సమాధి మీద ప్రసరించే వెలుగు నీడల క్రమం నియంత్రించినట్లు కట్టడం మెచ్చుకో తగింది. ప్రవేశరుసుము రు. 2/-

శుక్రవారాలు ఉచిత దర్శనం. ఇదే విధంగా జహంగీరుకు లాహోరులో మరో సమాధి కట్టించినది నూర్జహాను.

ఇక్కడికి దగ్గరలోనే ఒక కి.మీ. దూరంలో అఫ్జల్‌ఖాన్ కోసం కట్టిన సమాధి చైనా-కా-రౌజా అనే సమాధి ఉంది. షాజహాన్ దర్బారులో ఉన్నతోద్యోగం నిర్వహించిన ఈయన 1639లో లాహోరులో మరణించాడు. వెలుపలి భాగమంతా పర్షియను ప్రభావాన్ని వెలార్చుతూ చక్కని చిక్కని రంగుల ఎనామిల్ టైల్స్ ఉపయోగించబడ్డాయి. నేడు ఇది చాలా వరకు శిథిలమయి జీర్ణావస్థలో ఉన్నది. మిగిలి వున్న పెంకులు విభాగం పూర్వపు ఔన్నత్యాన్ని చాటడానికి మాత్రం అవశేషాలుగా వున్నది చూడగలం.

## రామ్‌బాగ్ :

1528లో బాబరు చక్రవర్తి నాటిన ఉద్యానవనం. బాబరు మరణించినప్పుడు తాత్కాలికంగా కొన్నాళ్ళు ఖననం చేసి ఉంచిన ప్రదేశం. తరువాత కాబూల్‌కి మోసుకొని వెళ్ళబడింది శవం. యమునా తటంలో ఉన్న ఈ వనాన్ని ఎవరైనా ఎప్పుడైనా చూడవచ్చు. ప్రవేశం దర్శనం ఉచితం తెల్లవారిం దగ్గరినుంచీ అస్తమయం వరకూ.

## జామి మసీదు :

ఆగ్రాకోట నుండి సాగే రైలు పట్టాల వారనే 1648 లో షాజహాను చక్రవర్తిచే నిర్మించబడిన మసీదు. షాజహాన్ కుమార్తె అయిన జహనారా పేరున కట్టించినట్లుగా మెయిన్‌గేటు మీద చెక్కబడిన రాతలవలన తెలుస్తుంది. షాజహాన్‌తోపాటుగా జహనారాను కూడా చెరసాల పాలు చేశాడు ఔరంగజేబు మహాశయుడు. ఢిల్లీలో వున్న జామిమసీదు కంటె చిన్నది.

## దయాల్‌బాగ్ దేవాలయం :

ఆగ్రాకు ఉత్తరంగా 10 కి.మీ. దూరంలో రాధాస్వామి మతస్థులకు రాధాస్వామి పాలరాతి దేవాలయం. తాజ్‌మహల్ నిర్మాణంలో ప్రయోగించబడిన పియెట్రాదూరా నైపుణితో నిర్మించబడింది. హిందూ విభాగం యింకా కడుతూనే ఉన్నారు. ఇక్కడికి చేరటానికి బస్సులున్నాయి. దర్శనీయమైనది.

## సికంద్రా :

ఈ ప్రదేశం 1488 - నుండి 1517 వరకు ఢిల్లీ రాజ్యాన్ని పరిపాలించిన

సుల్తాన్ సికందలోడి కోట వున్నది గనుక ఈ పేరుతో ప్రసిద్ధమైంది. బారాది భవనం ఈయనచే కట్టించబడింది.

ఇక్కడ ఒక పెద్ద ఉద్యానవనంలో అక్బరు మహా చక్రవర్తి సమాధి ఉంది. అక్బరు తన కాలంలో స్వయంగా మొదలు పెట్టాడు. అయితే ఆయన కుమారుడు జహంగీరు 1613లో అక్బరు తరువాత పూర్తి చేశాడు.

ఈ సమాధి ముస్లిమ్-హిందూ భవన నిర్మాణాల మేలు కలయికగా రూపొందించబడింది. ప్రతి మూలలో మూడంతస్తుల స్తంభాలు అమర్చారు. బహుభుజులుగా ఎర్రరాయి రాయిలో తెల్లటి పాలరాయిని పొదిగి నిర్మించబడ్డాయి. ఇక్కడి సమాధి సముదాయానికి 4 పెద్ద పెద్ద ద్వారాలు అమర్చబడ్డాయి. ఒకటి ముస్లిము, ఒకటి క్రిస్టియను, ఒకటి హిందు, నాలుగవది అక్బరు తనదైన ప్రత్యేకబాణి సర్వమత సమ్మతంగాను ఏర్పరచబడ్డాయి తెల్లవారింది మొదలు సూర్యాస్తమయం వరకూ ఎప్పుడైనా దర్శించవచ్చు. ప్రవేశ రుసుం రు. 2/- శుక్రవారాలు ఉచితంగా దర్శనీయం.

ఆగ్రా ఢిల్లీ గేటు దగ్గరి నుండి చూస్తే సికింద్రా వరకు అనేక సమాధులు రెండు స్తంభాలు మైలురాళ్ళుగాను ఉన్నాయి.

ఆగ్రాలో పాతపట్టణంలో కినారి బజారు పాత మార్కెట్టు ఏరియా తిరిగి చూడదగింది. మాల్కా బజారులోని మధురవాణీలు ఒంటరి మనిషిని చూస్తే కన్ను కొడతారు జాగ్రత్త.

## ఫతేపూరు సిక్రి

అక్బరు చక్రవర్తి నిర్మించిన అద్భుత నగరం. ఆగ్రాకు 40 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ షేక్ సలీమ్ చిస్తి అనే మహమ్మదీయ ఫకీర్ నివసించేవాడు. అక్బరు సంతానార్థియై ఈయన వద్దకు వచ్చి ఆశీస్సులను పొందగా హైందవభార్యకు (జోధ్‌బాయి)కు కలిగిన కుమారుకు (జహంగీరు)కు ఆయన పేరునే సలీమ్ అని పేరు పెట్టాడు. ఆ ఫకీరు నివసించిన స్థలంలో ఒక కోటను కట్టి సమకట్టాడు చక్రవర్తి. ఆ కాలంలో అగ్బరు రాజ్యానికి రాజధానీ నగరంగా విలసిల్లింది.

1573 గుజరాతుమీద దండెత్తి విజయుడై తిరిగి వెళ్ళాడు. విజయానికి చిహ్నంగా పతేపూర్ నామంతో (విజయనగరం) ఫతేపూర్ సిక్రి అని పిలవబడే నగరాన్ని నిర్మించారు. ఇక్కడ అక్బరు చక్రవర్తి 15 సంవత్సరాలు నివాసమున్నాడు. ఆయన ఇక్కడ వున్న సమయంలో అనేక భవనాలు నిర్మించబడ్డాయి. కాని నీటి వసతి సక్రమంగా లేని కారణంగా ఆ నగరాన్ని వదలి వెళ్లాల్సి వచ్చింది. ఆనాటినుండి ఉపయోగంలో లేని నిర్జన నగరమైనా అక్కడి భవనాలు వగయిరాలు చరిత్రలో గొప్ప యాత్రికి ఆకర్షణగా మాత్రం మిగిలిపోయాయి. ఈ చారిత్రక అవశేషాలు. ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకుని ఉన్నాయనటంలో సందేహం లేదు. అక్బరు చక్రవర్తి ఇతర మహమ్మదీయ రాజులవలెగాకుండా మతపరమైన చాందసత్వానికి తావులేని వాడుగాను, పరమత సహనీయుడై సామరస్యం కోసం పాటుపడి అన్ని మతాలను సమానంగా గౌరవించినవాడుగా చరిత్రలో గణుతికెక్కినాడు. సర్వమత సమానంగా ఆయన సరికొత్తమతం ప్రవేశపెట్టాడు. అదే 'దీన్ ఇలాహి' అనే మతం.

ఇది ఒక పర్వత శ్రేణీ మధ్యలో ఎత్తుగా ఉన్నది. సమీప ప్రాంతంలో ఏర్పడిన గ్రామానికి ఆధునికమైన బస్టాండు రైల్వేస్టేషను గూడా ఉన్నాయి.

జామి మసీదు లేక దర్గా మసీదు :

ఫతేపూర్ సిక్రి మసీదు మక్కా మసీదుకు నకలు అని ప్రతీతి. దీని కట్టడంలో హైందవ-మహమ్మదీయ శిల్పరీతులు మిళాయించి నిర్మించారు అక్బరు మహాచక్రవర్తి. ప్రధాన ద్వారం బులంద్ దర్వాజా 54 మీటర్లు ఎత్తులో భారతదేశం మొత్తంమీద పెద్ద దర్వాజాగా పేర్కొనబడింది. ఈ దర్వాజా దక్షిణ భారతంమీద విజయ చిహ్నంగా నిర్మించబడింది. గేటు బయట ఒక లోతైన బావి ఒకటి వుంది. అప్పుడప్పుడు దుస్సాహసికులు కొంత గేటుకున్న మెట్లు మీదుగా పైకి వెళ్ళి అక్కడి నుంచి ఈ బావిలోదూకి సాహస ప్రదర్శన చేయడం కద్దు. మసీదులోపల షేక్ సలీమ్ చిస్తి సమాధి పాలరాతి నగిషీల తెరల మధ్య వుంది. సంతానాభిలాషులైన స్త్రీలు ఇక్కడికి వచ్చి మొక్కుకుని వెళ్తారట. ఇక్కడికి వచ్చి తాము గాఢంగా ఏదైతే కావాలని కోరుకుంటారో అది తీరి సఫలమనోహరధులవుతారనే గాఢమైన నమ్మకం ఉంది. షేక్ సలీమ్ గారి మనుమడు ఇస్లామ్‌ఖాన్ సమాధి కూడా ఇక్కడే వుంది. మసీదు బయట అబుల్ ఫాజి, ఫైజి మొదలయినవారికి ప్రత్యేక భవనాలున్నాయి.

జోధ్ భాయి భవనం :

మసీదుకు ఈశాన్యంగా హిందూ రాజపుత్ర మహిళయైన అక్బరు భార్య జోధ్‌బాయి కోసం కట్టించిన 'హవామహల్' చూడతగింది. అంతఃపురల విరామ ములు హాయిగొలిపే చల్లనిగాలితో సేద దీరటానికి వీలుగా నిర్మించబడింది. పైనించి సుతారంగా కింద జరిగే సంఘటనలు వీక్షించటానికి అనువుగా నిర్మించారు.

బీర్‌బల్ భవనం :

అక్బరు ఆస్థానంలోని హైందవరాజు. మహాసంభాషణా చతురుడు-ఎప్పుడూ తన తెలివి తేటలతో చక్రవర్తికి వినోదాన్ని కలిగిస్తూండే హిందూ రాజు. మాటల్లో ఎంత చతురుడో కత్తిపడితే అంత నిర్వీణ్యుడు. ఈ భవనం ఒక జ్యూవెల్ బాక్సు లాగా ఉంటుందట. 1586 పెషావర్‌లో జరిగిన యుద్ధంలో మరణించాడు. జోధ్ బాయి భవనానికి ఆనుకుని గుర్రాల శాలలు, ఒంటెల శాలలు ఉన్నాయి. ఇప్పటికీ కట్టకొయ్యలుగా ఉపయోగించటానికి కొన్ని రాతి చట్రాలు ఇంకా దర్శనమిస్తూనే వున్నాయి.

మారియమ్స్ భవనం :

జోధ్‌బాయి భవనానికి దగ్గరిలోనే బంగారు మందిరంగా పేర్కొనబడినదిగా ఉన్నటువంటి చక్కటి అందాల మందిరం— జహంగీరు తల్లిగారు ఉపయోగించేది.

పంచమహల్ :

పోను పోను పైకి సోగగా నిర్మించబడిన ఐదంతస్తుల మేడ - రాణివాసపు స్త్రీల ఉపయోగానికి ప్రత్యేకం.

దివాన్-ఇ-ఖాస్ :

అంతరంగిక భవనానికి బైట మామూలు హాలు పెద్దదిగా ఉంది. కానిలోపల ఒక ప్రత్యేక తరహాలో నిర్మించబడింది. సమున్నతమైన శిలావేదిక దానిమీద ఒక ఉచిత సింహాసనం, నాలుగు మూలలనుండి బ్రిడ్జిల్లాగా ఈ సింహాసనాన్ని కలిపే వారధులు ఉన్నాయి. బహుశా అక్బరు చక్రవర్తి తన నలుగురు మంత్రి పుంగవులు నాలుగుమూలలా పరివేష్టించి ఉండగా మధ్య సింహాసనంమీద కూర్చుండి మంతనాలు జరిపేవాడని అనుకోవచ్చు.

దివాన్-ఇ-ఆమిా :

ఈ నిర్జన నగర ద్వారానికి సమీపంలో ప్రేక్షకుల హాలు ప్రజలకోసం ఒకటి ఉంది. దీని చుట్టూ వసారాలున్నాయి. దీన్ని ఆనుకునే పచ్చీసు గళ్ళు ఒక పెద్ద పట్టా పరిచినట్లుంది. ఇక్కడ అక్బరు మహాచక్రవర్తి సజీవుడై బానిస స్త్రీలను పాచికలుగాను, పావులుగానూ ఉపయోగించి చదరంగం ఆడేవారట. ఇది గాబోలు రాచరికవిలాస లీలా వినోదహేల-విచారించదగినదే మరి? ।

ఇంకా రాచరికపు వన్నెలొలికే ఎన్నో వున్నాయి చూడటానికి. అనేకం శిథిలావస్థలో ఉన్నా నిర్జనమై ఉన్నా ఆనాటి వైభవాల చిహ్నాలు మాత్రం కాలగర్భంలో కలిసి పోకుండా కాపాడుతూన్న సుప్తనగరం. యాత్రికులకు ముఖ్య ఆకర్షణగా చారిత్రక స్మరణగా మిగిలింది యిప్పటికీ.

# మధుర - బృందావనములు

## మధుర :

ఆగ్రాకు ఉత్తరంగా 573 కి.మీ. దూరం. ప్రస్తుత జనాభా 1,50,000. 3500 సంవత్సరాల క్రితం శ్రీకృష్ణభగవానుడు జన్మించినభూమి. పురాణేతిహాసాల్లో ద్వాపర యుగంలో శ్రీ మహావిష్ణువు యొక్క దశావతారాల్లో అవతార విశేషంగా పేర్కొనబడినా, ఆధునిక చరిత్ర పరిశోధక పండితులు కేవలం మూడు వేల ఐదు వందల సంవత్సరాల క్రితంలోపే అని అన్నా మన భారతదేశం శ్రీకృష్ణభగవానుడు లేని భారతాన్ని ఊహించటానికి కూడా వీలు లేదన్న సంగతి నిర్వివాదం.

మధుర యమునా నదీ తటంలో సప్తమోక్షదాయకమైన పట్టణాల్లో ఒకటిగా పేర్కొనబడింది. ముఖ్య హైందవ యాత్రాస్థలం. భారతీయ జీవన స్రవంతిలో ప్రముఖభాగంగా మానవతా విలువలను నిర్దేశిస్తూ మనిషిని కర్తవ్యోన్ముఖుడుగా మలచిన ఘనత శ్రీకృష్ణభగవానుడి బోధామృతమైన గీత — భగవద్గీతగా దేశ సంస్కృతీ సాహిత్యాలలో నేటికీ అజరామరంగా నిలిచి ఆధ్యాత్మిక శక్తినీ, జనజీవన యుక్తినీ భారతీయులందరి ప్రత్యక్షమునా ప్రస్ఫుటంగా ప్రతిఫలించిన మధురకావ్య కథానాయకుడు- భగవంతునిగా కొనియాడబడిన కృష్ణభగవానుడు అందరి పూజలను అందుకొంటున్న మహనీయుడు అయినవాడు. నడయాడిన ప్రదేశంగా పునీతమైన ప్రదేశం.

గ్రీకు హిస్టోరియన్ టోలమీ పుస్తకాల్లో ముట్రాగా పేర్కొనబడింది. విదేశ రాయబారులైన హ్యూయన్ సాంగ్, పాహియాన్ వగైరాలు ప్రముఖంగా పేర్కొన్నారు. హిందూతత్త్వ ప్రాముఖ్యమేగాక బౌద్ధము కూడా తన ప్రభావాన్ని విశేషంగా పొదువుకున్న దాఖలాలు కనబడుతున్నాయి. 20 బౌద్ధ విహారాలున్నాయని ప్రతీతి. అయితే మహమ్మదు ఘజనీ దండెత్తి విధ్వంసకాండ జరిగినప్పుడు బౌద్ధం పూర్తిగా అదృశ్యమై పోయిందట. 1500 సంవత్సరములో దండెత్తిన సికందర్ లోడి కూడా ఇక్కడి ఆలయాల ధ్వంస రచనలో ముఖ్యపాత్ర వహించాడు. అయితే మత సామరస్యాన్ని నెరపిన అక్బరు, జహంగీరు కాలాల్లో ఈ పట్టణ పునరుద్ధరణ జరిగిందని చరిత్ర చెబుతోంది. ఇది ఒక వేయి సంవత్సరాల పూర్వంనించీ మధ్య యుగాలనాటి వరకు జరిగిన చరిత్ర అయితే అంతకు పూర్వం కూడా ఒక్కసారి స్పృశిద్దాం. ఆనాటి అనగా శ్రీకృష్ణుడు పుట్టినకాలంలోకి ఒక్కసారి పయనిద్దాం.

ఈ పట్టణం శత్రుఘ్న మహారాజు నిర్మించాడని చెప్తారు. పురాతన పట్టణం గావటం వలన పట్టణమంతా 2 లేక 3 గ. వెడల్పుగల సందులు గొందులుగా వుంటుంది. సందుల్లోనే 2, 3, 4 అంతస్తుల మేడలు గూడ ఉన్నాయి. ఇక్కడ యమునా నదిలో తాబేళ్ళు విశేషంగా ఉంటాయి. యమునకు 25 స్నానఘట్టాలున్నాయి. 99వ దివ్యదేశమయి, తీర్థవిభులకు ముఖ్యస్థానమయిన పట్టణంలో 4 స్టేషన్లున్నాయి. ఉండటానికి అనేక ధర్మశాలలున్నాయి. ధృవగాట్ వద్ద శ్రాద్ధాలు పెడతారు.

వ్రజభూమి అని పిలవబడే ఈ ప్రదేశంలోని బృందావనం, మధుర బాల కృష్ణుని బాల్యచేష్టలకు నిలయమై విడదీయరాని అనుబంధం పెనవేసుకునిపోయి ఉన్నది. ఈ పురాణ పురుషుని జననం వెనుక మధురమైన కథ అందరికీ తెలిసిందే; అయినా అప్రస్తుతం కాదనే భావంతో క్లుప్తంగా యిస్తున్నాం.

కంసుడు నిరంకుశుడైన రాజు- తండ్రి ఉగ్రసేనుణ్ని కారగారం పాలుచేసి సింహాసనాన్ని బలవంతంగా ఆక్రమించినవాడు. కంసుని సోదరి దేవకి. దేవకిని మిత్రుడయిన వసుదేవునికిచ్చి వైభవంగా వివాహం చేశాడు. ఇంతలో ఒక అశరీరవాణి భవిష్యద్వాణిగా దేవకి అష్టమ గర్భోదయంతో కంసుని ఆయువు మూడిందని చేసిన హెచ్చరికతో- విధిని తల్లక్రిందులు చేసి తన ప్రాణాన్ని రక్షించుకోటం కోసం— సోదరి- బావగార్లు ప్రాధేయపడగా వారిని వేధించక తమ సంతానం మొత్తాన్ని

పుట్టిన వెంటనే కంసునిపరం చేస్తామనే మాటయిచ్చిన మీదట వారిద్దరినీ తన కనుస న్నల్లోనే వుండే విధంగా చెరసాలలో ఉంచాడు.

పుట్టిన వారినందరినీ హతమారుస్తూ అష్టమ సంతానంకోసం ఎదురుచూస్తూ గడి పాడు కంసుడు. దేవకీ వసుదేవులకు కారాగారంలోనే అష్టమసంతానంగా శ్రీమహావిష్ణువు అవతార విశేషంగా శ్రీకృష్ణ భగవానుడు ఉదయించాడు. అదే సమయంలో గోకు లంలో నందునియింట యశోదా దేవికి యోగమాయ శిశువుగా జన్మించింది. ఈ సమయం గాఢనిశీధి. మధుర అంతా గాఢనిద్రలో మునిగివుంది. భగవానుని ఉద యంతో కారాగారం తలుపులు వాటంతటవే తెరచుకున్నాయి. శృంఖలా బద్ధులైన దేవకీ వసుదేవులబంధనాలు ఒక్కసారిగా విడిపడ్డాయి. పుట్టినపసికందుని పొత్తిగుడ్డల్లో మూటగట్టుకుని వసుదేవుడు బయలుదేరాడు నందునియింటికి- ఇది ఆ భగవానుని ఆదేశమే ! కోట ద్వారాలు బళ్ళున తెరచుకున్నాయి. పోటెత్తి ప్రవహించే యమున దోవయిచ్చింది. నదికి ఆవల ఓడ్డునున్న గోకులంలో యశోద ప్రక్కన వున్న యోగమాయ స్థానంలో బుల్లికృష్ణుని వుంచి తిరిగి ఆ శిశువుతో మరలివచ్చాడు మధురకు వసుదేవుడు. యోగమాయతో కారాగారంలోకి ప్రవేశించాడు- దేవకివద్దకు చేరాడు. వెంటనే ఎక్కడివక్కడ అన్నీ మామూలయిపోయాయి. కోటలో కావలా దారులకు తెలివిడి అయింది. పసిపాప ఏడుపు వినబడింది. వెంటనే కబురు చేరింది కంసునకు. భీకరంగా వున్న కంసుడు ఆనందంగా వచ్చాడు. తన మృత్యువుని అంతం చేయగలుగుతున్నాననే రాక్షసానందం ఉక్కిరి బిక్కిరి చేస్తుండగా- శిశు వుని ఎత్తి కొట్టబోయాడు. పైకి లేచిన శిశువు క్రిందకు రాలేదు. ఎగిరి పైకివెళ్ళి అదృశ్యమయిపోతూ కంసుని మృత్యువు వేరొకచోట సురక్షితంగా ఉందనే చావు కబురు చెప్పి విహ్వలుడై చూస్తుండగానే అదృశ్యమైపోయింది. శిశువు యోగమాయ కదా !

తరువాత ఎంతో అన్వేషణ చేయించాడు కంసుడు. ఎందరో పుట్టిన శిశువులను బలిగొన్నాడు. ఏ ప్రయత్నమూ ఫలించలేదు. ఈ ప్రయత్నాలన్నీ భాగవతకథల్లో శ్రీకృష్ణుని బాల్యలీలలు రసవత్తరంగా వర్ణించబడ్డాయి భాగవత కథలో.

చివరకు మథురకు వచ్చి కంసుని అంతం చేస్తాడు శ్రీకృష్ణుడు. భాగవత, మహాభారత పురాణాల్లోని శ్రీకృష్ణుని గురించి అనేక అద్భుతలీలలు వర్ణించబడ్డాయి. కొన్ని ఐతిహాసికంగాను, కొన్ని ప్రచార కల్పనలుగాను కల్పించబడినవిగా కన

బడుతున్నా మొత్తంమీద చరిత్ర విశేషాల్ని కలబోసి కథా కావ్యాలుగా నిర్మించ బడినవి.

శాస్త్రీయ పద్ధతిలో జరపబడిన త్రవ్వకాలల్లో కొన్ని పురాతన విశేషాలు, నిజాలు, మానవ నాగరికతా నిర్మాణ విశేషాలు అతి పురాతన కాలాలకు సంబంధించిన వెన్నో వెలుగులోకి తీసికొని రాబడ్డాయి.

మథుర అనేకమైన పండుగలు, ఉత్సవాలకు ఆలవాలమై నిరంతరం సందడిగా వుంటుంది. వాటిలో ముఖ్యంగా శ్రీకృష్ణుని లీలలగురించిన ఎన్నో జానపదనృత్య విశేషాలు శోభాయమానంగా ప్రదర్శించ బడుతుంటాయి. హోలీ ఉత్సవాలు, రాస లీలోత్సవాలు పరమ రమణీయం. మథురలో చూడదగిన ప్రదేశాలుగా-

**శ్రీకృష్ణ జన్మభూమి :**

దేవకీ వసుదేవులజైలు - శ్రీకష్ణుని జన్మస్థానం - ఇక్కడ కత్రా కేశవదేవ్ దేవాలయం ఒకటి వుండేది. ఈ ఆలయాన్ని ఔరంగజేబు ధ్వంసం చేశాడు. 1661 లో ఔరంగజేబు రాజప్రతినిధి అబ్దిన్ నబీర్‌ఖాన్ కేశవదేవ దేవాలయం ఉన్న చోటునే జామిమసీదును గట్టాడు. కాని పురాతన దేవాలయం ఇంకా సశేషంగా మసీదు వెనుక కనబడుతూనే వుంది. ఇక్కడే హిందువు లందరూ ఆరాధనలు, అర్చనలు జరుపుతారు. దరిమిలా ఆధునికంగా కేశవాలయం నిర్మించబడింది. కత్రా వెనుక.

**బలిదేవుని మందిరం :**

బలిచక్రవర్తి, శుక్రాచార్యుడు, వామనావతారం విగ్రహాలు ఉన్నాయి. దర్శనీయం. వామనుడుకూడా విష్ణువు యొక్క దశావతారాల్లో ఒక అవతార విశేషమే।

**కంసునికోట :**

5000 సంవత్సరాల క్రితం కట్టబడిందని ప్రతీతి. యమునా తీరంలో అమరియున్నది. శిథిలమైంది. అంబర్ మహారాజు రాజా మాన్‌సింగ్ మరల కట్టించాడట ప్రస్తుతరూపం. ఇక్కడే రాజా జయ్‌సింగు ఒక నక్షత్ర వేధశాల కట్టించాడని అంటారు కాని ప్రస్తుతం లేదు.

**విశ్రామగాట్ :**

కంసవధానంతరం శ్రీకృష్ణ బలరాములు ఇక్కడ విశ్రాంతి తీసికొన్నారట. వారి పాద చిహ్నాలుగూడా ఉన్నాయి.

సలీబురుజు :

1570 లో యమున ఒడ్డునే నిర్మించబడింది. అంబర్‌కి చెందిన రాజా భగవాన్‌దాస్ తన తల్లి స్మారక చిహ్నంగా కట్టించాడట. 17 మీటర్లు ఎత్తుగల దీర్ఘ చతురాకారపు గోపురం. 4 అంతస్తులుగా ఉంది.

ద్వారకాధీశ మందిరం :

నూతనంగా నిర్మించబడిన ఆలయం. 1914 లో ఒక గ్వాలియర్ భక్త శిఖామణి కట్టించాడు. జన్మాష్టమీ, హోలి మహా సంబరంగా జరుగుతాయి ఇక్కడ. దానితో పాటుగా గీతామందిరం కూడా వుంది. అద్భుతమైన చిత్రాలుగా భాగవత కథలు, భగవద్గీత శ్లోకములు మొత్తం లిఖించబడ్డాయి. గీతా స్తంబంమీద మధురా—బృందావనం రోడ్డుమీద వుంది.

ముఖ్యమయిన పుణ్య ఘట్టాలుగా :

1868 లో నిర్మించబడిన ధృవఘాట్, కృష్ణ గంగాఘాట్, వసుదేవఘాట్, అశికుండ్ ఘాట్ లేక వరహక్షేత్రం. మొదలయినవి స్నానఘట్టములు.

ఇతర మందిరాలు :

సప్తర్షి మందిరం, యోగమాయా జన్మస్థానం, నందగృహం, కంసుని ఏనుగు దంతంతో జంపిన మందిరం, శ్వేతవరాహమూర్తి, లక్ష్మీ నారాయణ మందిరం, కేశవ దేవ మందిరం ఇంకా మరెన్నో— మధుర అంతా ఎక్కడ చూచిన నంతకిశోరుని జ్ఞాపికలు, మందిరాలే !

మధురను ప్రదక్షిణం చేస్తే సప్తద్వీప పరివృతమైన భూమిఅంతా ప్రదక్షిణం చేసినట్లు అని ఒక నమ్మకం.

వ్రజ పరిక్రమం :

వ్రజపురం 84 క్రోసులట. పరిక్రమ సమూహాలు చాల వస్తాయి. ఋషులైన సాధువుల సమూహము, గోస్వాముల సమూహం గృహస్థులతో గూడినది యాత్రగావచ్చి ప్రదక్షిణగా వచ్చి వెళతారు. పరిక్రమం కనీసం 16 రోజులు పడుతుందట.

## చుట్టు ప్రక్కల పరిసరాల్లో :

### మహావనం :

మధురనుండి 8 కి. మీ. వసుదేవుడు పొత్తిళ్ళలో పసివాడైన శ్రీకృష్ణుని యశోద ప్రక్కలో పరుండబెట్టి, యశోద ప్రసవించిన యోగమాయను తీసికొని వెళ్ళాడట. నందభవనం గూడ చూడవచ్చును. యశోద కృష్ణుడు బాల్యంలో మన్ను దిన్నాడని కోపించితే పదునాల్గు భువన భాండముల విశ్వరూపం తన నోటిలో చూపించిన ప్రదేశం. యశోద ఒడిలో ఉయ్యాలలూగినది ఇక్కడనే.

### గోకులం :

మహావనంనుండి 1.5 కి.మీ. దూరం. శ్రీకృష్ణుడు గోవిందుడై గోవుల గాచిన దిక్కడనే. 100వ దివ్యదేశంగా పరిగణించబడినది. గోకులనాథ్‌జీ ఆలయం కూడ దర్శించవచ్చు. గోపాలుడు దిన దిన ప్రవర్ధమానుడై కంసుని కంట బడకుండా పెరిగిన దిక్కడనే. కృష్ణాష్టమినాడు ఇక్కడకి కొన్ని వేలమంది యాత్రికులువస్తారు ఉత్సవం చాల విశేషంగా జరుగుతుంది.

### బలదేవ్ గాంవ్ :

మధుర నించి 21 కి. మీ. దూరం. శ్రీకృష్ణుని అన్నగారైన బలరామునికి నిర్మించబడిన ఆలయం. బలదేవునకు ఈ ఆలయంలో వెన్న, పటిక బెల్లం నివేదన చేస్తారట.

### బర్సానా :

రాధాకృష్ణుల ప్రణయతత్త్వం అమరమైన దీ గ్రామం. భగవంతునికి, భక్తునికి మధ్యగల అనుబంధానికి ప్రతీకగా భావిస్తారు. రాధాదేవి ఆలయం వుంది. మధుర నుండి 47 కి.మీ. దూరం. హోళీకి రంగరంగ వైభోగంగా రంగుల పండుగ జరుగుతుంది. స్త్రీలు పురుషుల మీద సవాలు విసిరి పందేలమీద రంగును వర్షిస్తారు. ఆలయానికి దాదాపు 200 మెట్లు ఎక్కి వెళ్ళాలి.

### బృందావనం :

యమునా తీర వనం. నీలమేఘశ్యాముని నవరస లీలలు, రాసలీలా విశేషాలకు ప్రధానమైన చోటు. నందకిశోరుని చిన్మయ లీలలు అందంగా దీపించిన చోటు-

యమునా జలాలు శ్యామలం, నీలమేఘ శ్యాముని తనువు నీలం. భక్తులు బృంద
వనం పేరు చెపితేనే చిన్నారి చిలిపి కృష్ణుని లీలలు స్ఫురణకు వచ్చి తనువు పు
లకాంకితమయ్యే మధురమైన భావలహరికి అంతులేని తాదాత్మ్యానికి ఆలవాలమైనది

అనేక ధర్మశాల లున్నాయి. ప్రశాంత వాతావరణం పావన యమునా తీరం
బృందావనమంతా రాసవిహారీ లీలా కృష్ణుని జ్ఞాపికలే. మధురభక్తి తత్వానికి మరు
లేని స్మరణలు శ్రీచరణుని చరణ మంజీరాలు–ఘలం ఘలల నినాదాలు–ప్రతిచోటు
చూడదగిందే– అందులో కొన్ని.

**శ్రీ బాంకీ బిహారీకా మందిరం :**

అందాలు పరిచినట్లున్న చలువరాతి మందిరం మనోహరమైనది. బృంద
వనిలో కెల్లా ప్రధానమైనది, ముఖ్యమయినది.

సహబిహారికి మందిరం, రాధారమణ మందిరం, గ్వాలియర్ మందిరం
యమున వద్ద టికారీ మందిరం, నిధివన్, కాళీయ మర్దనం జరిగినచోటు, చీర్‌గాటు–
గోపికా వస్త్రాపహరణం చేసి పొన్నచెట్టు మీద కెక్కినచోటు రాధావల్లభ్‌జీ, మదన్
మోహన్‌జీ, అష్టసఖి, జైపూర్ మందిర్, బన్సీవట్ మొదలయిన వన్నీ చూడ
వచ్చు. ఇన్నింటికీ తలమానికంగా వెలుగొందేవి——

**నందభవన్ :**

బదరీ, జగన్నాథ్ మొదలగు ప్రదేశాల నుండి పేము బెత్తాలు తెచ్చి యిస్తా
రట, సాధు పుంగవులు, గృహస్థులు కూడా. ఇది యొక విచిత్ర సంప్రదాయం.

**గోవింద దేవునాలయం :**

1590లో నిర్మించబడిన రమణీయమైన మందిరం.

**చార్ సాంప్రదాయ ఆశ్రమం :**

బృందావనం స్టేషన్‌నుండి అరమైలు దూరం. సంకీర్తన ప్రధానంగా గల
ఆలయం. గౌరాంగ మహా ప్రభువు వారి సంస్థవలె విశేషమైనది.

**శ్రీ రంగని ఆలయం :**

1851లో నిర్మించబడినది. దక్షిణ దేశంలోని శ్రీ రంగం కున్న ప్రాధాన్యం
ఉంది.

**రాధా వల్లభుని ఆలయం :**

1626లో నిర్మించబడింది.

**షాషాజి మందిర్ :**

1876లో నిర్మించబడింది.

**యమునా స్నాన ఘట్టాలు :**

కళాగాట్, హనుమాన్‌గాట్, చౌలాగాట్, కాశీగాట్, వంశీగాట్ వగయిరాలు

**జ్ఞానగుదిరి :**

పూర్వ కాలంలో సాధుపుంగవులు తపస్సు చేసిన చోటు. ఇక్కడి సంకీర్తన చాల పవిత్రమైనదిగా భావిస్తారు యాత్రికులు.

**నింబార్కపురం :**

గోవర్ధన బర్సానాల మధ్య నింబార్కుడు తపస్సు చేసిన ప్రదేశం. వేదత్రయములకు భాష్యము రచించిన చోటుగా ప్రసిద్ధి.

**నందగావ్ :**

రాధాకృష్ణుల సమ్మేళన ప్రదేశం. నందుని నివాసం.

**నిజబిహారి వనం :**

కృష్ణ భగవానుడు రాస క్రీడలు సలిపిన మరో ప్రదేశం. ఇక్కడ రాస క్రీడల్లో ఉన్న పొద పొదలా యెద యెదలా పరచుకున్న రాధా మాధవ తత్త్వపేల గోపికలతో సలిపిన రాసలీల.

**గోవర్ధనగిరి :**

108 దివ్యదేశాల్లో 102 వదిగా పరిగణన. గోవర్ధనగిరిని కొనగోటను నిలిపి గోవులను, గోపాలకులను ఇంద్రుడు కోపించి కురిపించిన రాళ్ళవాన నుండి కాపాడిన ప్రదేశం. ఇక్కడే మానసగంగ అనే సరస్సుంది. స్నానం చేస్తే గోహత్యాదోషం పోగొట్టగలిగిన మహత్వ పూర్ణమైనదిగా ప్రతీతి. గోవర్ధనంలో దర్శించదగిన ఆలయాలు- మానసాదేవి మందిరం, లక్ష్మి నారాయణ మందిరం, మానసగంగ, శ్రీరశ్యామ్ మొదలయినవి.

దీపావళికి, ఆషాఢ పూర్ణిమ, శ్రావణం, భాద్రపదం, కార్తీక మాసాల్లో ఉత్సవాలు విశేషంగా జరుగుతాయి.

గోవర్ధనం నుండి 5 కి.మీ. దూరంలో రాధాకుండు— రెండు పెద్ద సరస్సులున్నాయి. రెండింటిలోనూ స్నానం చేస్తారు యాత్రికులు. మఠములు, ఆశ్రమాలు ఉన్నాయి.

యమునా తీరంలోనే వ్రజమండల పరిక్రమ మార్గంలో వటేశ్వరం ఉన్నది. శూరసేనుని నగరంగా ప్రసిద్ధి. ఇక్కడ కొన్ని దేవాలయాలు, యమునాతీర స్నాన ఘట్టాలున్నాయి. కార్తీక కృష్ణ విదియనాడు గొప్ప ఉత్సవం జరుగుతుంది. యాత్రికులు ఉత్సవం తిలకించటానికి లక్షల్లో వస్తారు.

ఇవన్నీ చూచిన తరువాత మధురచేరి అక్కడి నుండి ఢిల్లీ ప్రయాణం చేయవచ్చు. అయితే మార్గంలో అలీఘడ్‌కి వెళ్లే ముందుగా.

ధరణితీర్థము :

చూడవలసినది 30 కి.మీ. దూరంలో ఉన్నది. విశ్వామిత్రుడిక్కడ యజ్ఞం చేశాడు. యజ్ఞ కుండం దగ్గరనే విశ్వామిత్ర సరస్సు కూడా ఉంది. ఇక్కడ శివాలయం, ఆంజనేయులవారి పురాతనాలయం, కాశీ మందిరం, ధారుణేశ్వర మహాదేవ మందిరం, సంకట విమోచన హనుమంతుని ఆలయం వగైరా హిందూ దేవాలయలున్నాయి.

అలిగఢ్ పెద్ద విద్యా కేంద్రం. కోట, మసీదు ఉన్నాయి. పూర్వం కోయిల్ అనే పేరుతో ఉండేది. 1194లోనే కోట కట్టబడింది. ఔరంగజేబు పతనానంతరం ఆఫ్ఘనులు, జాట్‌లు, మరాఠులు. రోహిలులు ఒకరి తరువాత ఒకరు ఆక్రమించారు. చివరికి 1776లో ఈ కోట అలిగఢ్ (ఎత్తయిన కోట అనే అర్థం) అనేది సార్థక నామధేయం అయింది. ఈ కోటకు ప్రస్తుత రూపం 1524లో సంప్రాప్తించినది. అంతకు ముందు బౌద్ధుల, హైందవుల దేవాలయాలు పెక్కు లున్నట్లుగా ప్రతీతి. అలిగఢ్ ముస్లిము విద్యాలయం చాల ప్రఖ్యాతి. మాఘ మాసంలో జరిగే పశువుల సంత చాల ప్రసిద్ధి. అలిగఢ్ తాళాలంటే దేశ వ్యాప్తమైన గిరాకీ.

# మీ ర ట్

ఉత్తరప్రదేశ్‌కి చెందినదైనా ఢిల్లీ తరవాతనే మీరట్. నగరం పెద్దదే. క్రీ.శ. 1714లో సూరజ్ అనే జలాశయం నిర్మించి దానిని గంగా జలాలతో నింప బడింది. ఆ సరస్సు తీరంలోనే అనేక ఆలయాలున్నాయి. అనేక ధర్మశాలలు, భవ నాలు రమణీయంగా ఉంటాయి.

**ముఖ్యంగా చూడదగినవి :**

సతీ స్తంభములు, బాలేశ్వరనాధాలయం అనే అతి పురాతనమైన దేవళం, జిల్లా మొత్తం మీద విశాలమైనది. మనోహరనాధాలయము, పాండవుల సంతతివారు నిర్మించినట్లుగా చెప్పబడుతున్న పురాతన మనోహరాలయం. ఇక్కడ జరిగే— నవచండీ ఉత్సవం విశేషంగా చూడదగినది. ఇందులో గమనించదగినది ముఖ్యంగా అశ్వ ప్రదర్శనం ఒకటి.

ఇవే గాకుండా ఉత్తరప్రదేశ్‌లో చూడదగినవిగా

**మిశ్రకతీర్థం :**

బరేల్లీ నుండి నేతాపూర్ ద్వారా నైమిశారణ్యం చేరి సామానులు భద్రపరచు కుని వెళ్ళదగినది. మిశ్రిత అను సంస్కృత పదం నుండి వచ్చినది 'మిశ్రిక్'. సర్వ తీర్థాలు తెచ్చి కలిపి నందువలన 'మిశ్రిక్' అనే పేరు క్రమంగా సార్థక మయింది. తొలుత బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారంగా తీర్థాలన్నీ ఇక్కడికే వచ్చి చేరిన వట. అందులో దధీచి మహర్షిని స్నానం చేయించారట. అందువలననే 'సర్వతీర్థ' మనే పేరు కూడా వచ్చింది. ఫాల్గుణమాసంలో ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగు తుంది. ఇది నైమిశారణ్యానికి 5 కి.మీ. దూరంలో ఉంది.

**నైమిశారణ్యం :**

అనే పేరు వినగానే 'శౌనకాది మహా మునులకు సూత మహాముని యిట్లు చెప్పదొడగెను' అనే పురాణ శ్రవణం టక్కున జ్ఞాపకానికి వస్తుంది. ఆ నైమిశారణ్య పుణ్య స్థలమే యిది. గోమతి తీర తటంలో ఉంది. చాల పవిత్రప్రదేశంగా పేర్కొన బడింది పురాణ పుణ్యక్షేత్రం. ఆనాటి ఛాయలు ఇంకా మాసిపోలేదు. నిదర్శనంగా- చక్రతీర్థం, బ్రహ్మకుండం, పాండవుల కోట, అంజనేయస్వామి, వ్యాసమహర్షి ఆల యాలు దర్శనీయాలు. చక్రతీర్థంలోని నీరు వేడిగాను, బ్రహ్మకుండంలోని నీరు చల్లగా ఉండటం విశేషం.

చక్రతీర్థం :

శ్రీ మహావిష్ణువు చక్రాయుధం చేత నిర్మించాడని చెపుతారు. నీరు స్వచ్ఛమైనది. ఒక వంక నీరు వచ్చి మరోవంక ద్వారా పోతుంది. 1937లో చక్కని మెట్లు చుట్టూ చక్రాకారంలో గోడను నిర్మించారు. మొదటగా గోమతిలో స్నానం చేసి తరువాత చక్రతీర్థంలో స్నానం చేస్తారు. సర్వరోగాలు పోతాయట. తీర్థవిధులు గూడ నిర్వహిస్తారు.

దశాశ్వమేధ ఘాటు :

గోమతీ తీరం. స్నానం బహుపుణ్యప్రదం. ఇక్కడ రామలక్ష్మణ, ఆనందాశ్రమం, లక్ష్మీనారాయణ మందిరాలు సేవించదగినవి.

హనుమత్ మందిరం :

సర్వకార్య సిద్ధి గలిగిన స్వామి విగ్రహం చాల పెద్దది.

పాండవుల ఖిల్లా :

పాండవులు 12 సంవత్సరాలు వనవాసము చేసిన చోటుగా ప్రసిద్ధి. రామానుజకూటం, సూతభగవానుని మందిరం-సూతుడు ఋషులకు పురాణ శ్రవణం చేసిన ఆసన విశేషం సూతగద్దె ఉన్నాయి. ఇంకా గౌడియా మఠము, వేదవ్యాస - గోమతి తీరంలో శుకుడు పరీక్షితునకు భాగవతం ఏడు దినములలో వినిపించిన పుణ్యస్థలం. దీనిని ఆనుకునే పుష్కర్, బ్రహ్మావర్త, గంగోత్రి, పంచ తీర్థ మొదలయినవన్నీ ఒకే చోటన ఉన్న పావన స్థలం.

హత్యాహరణ సరోవరం :

ఇది నైమిశారణ్యం నుండి పన్నెండు కి. మీ. దూరంలో ఉన్నది. స్నానం, తీర్థవిధులవలన త్రివిధములయిన పాపములు పరిహారమగును.

ఇవిగాక 51వ శక్తి పీఠంగా నెన్నబడినది, లలితాదేవి ఆలయమున్నది. ప్రతి అమావాస్య సోమవారం కలిసి వచ్చిన రోజున పెద్ద ఉత్సవం జరుగుతుంది.

నైమిశారణ్యం :

8 క్రోసులున్నది. ఫాల్గుణ అమావాస్య నుండి చైత్ర పూర్ణిమ వరకు అనేక మంది సాధుపుంగవులు, లక్షలమంది యాత్రికులు పరిక్రమం చేస్తారు. త్రోవలో అష్ట

భుజ భగవాన్, క్షేమకర్త భగవాన్, జానకీ కుండం మొదలయినవి దర్శనీయాలు. కల్పి, బ్రహ్మావర్తం, సంగ్రామపురం, బ్రహ్మఘాట్, ఉన్నావో క్షేత్రాలు కూడ యాత్రిక ఆకర్షణలు.

ఉత్తరప్రదేశ్‌లో ప్రసిద్ధి గాంచినది దుధ్వా నేషనల్‌పార్కు, బౌద్ధుల కౌశాంబి మదమహేశ్వర్ మొదలయినవి గూడ చూడదగిన ఇతర యాత్రికాకర్షణలు.

స్థానికంగా ఆగ్రాలో నిర్వహించబడే స్థల సందర్శన టూర్లు :

1) ప్రతిరోజూ ఉ. 10–30 గం. నుండి సా. 6 గం. వరకు

యు. పి. స్టేట్ ట్రాన్సుపోర్టు కార్పొరేషనువారి నిర్వహణ.

టిక్కెట్లు కోసం :

1) జనరల్ మేనేజరు, UPSRTC, 96 గ్వాలియర్ రోడ్డు, ఆగ్రా.

2) ప్లాట్‌ఫారం నం. 1. ఆగ్రా కంటోన్మెంటు రైల్వేస్టేషను – విచారణ విండో దగ్గర పొందవచ్చు.

ఫతేపూర్‌సిక్రి, ఆగ్రాకోట, టాజ్‌మహల్ – టిక్కెట్ల వివిధ రకాలు – రేట్ల వివరాలు

డీలక్స్ కోచ్—పెద్దలకు—రు. 23/- పిల్లలకు రు. 18-50.
A/c కోచ్ — " రు. 43/- " రు. 38-50.
A/c కోచ్ — " రు. 63/- " రు. 58-50.
(లంచ్ & టీలతో)

చార్జీలు, గైడ్ చార్జీలతో కలిపి, ప్రవేశ రుసుములతో సహా.

గమనిక :

శుక్రవారాలయితే పై రేట్లలో రు. 4–50 రాయితీ వుంటుంది.

ప్రయాణం ఆగ్రా కంటోన్మెంటు స్టేషను దగ్గర మొదలయి మరల అక్కడే పూర్తి.

2) ప్రతిరోజూ ఉ. 8 గం. – 12–30 వరకు

ITDC ట్రాన్స్‌పోర్టు యూనియన్‌వారి నిర్వహణం.

టిక్కెట్లు :

మేనేజరు, ITDC యూనిట్, హోటల్ ముంతాజ్ అశోక్, 181/2 ఫతేబాద్ రోడ్డు, (రిజర్వేషనులు కూడా ఉన్నాయి)
తాజ్‌మహల్, ఆగ్రాకోట, ఇత్మద్-ఉద్-దౌలా సమాధి
టిక్కెట్టు వెల – పెద్దలకు రు. 15/- పిల్లలకు రు. 10/-
గయిడ్ చార్జీలతో సహా

గమనిక : రేట్లు ప్రస్తుత పరిస్థితులనుబట్టి కొంచం పెరిగి ఉండచ్చు. గమనించగలరు.

3) ప్రతిరోజూ సా. 2 గం. నుండి సా. 6-30 గం. వరకు

ITDC ట్రాన్స్‌పోర్టు యూనిట్ నిర్వహణం
టిక్కెట్లు కోసం – 2 వదానిలో మాదిరే అడ్రసు
ఫతేపూరు సిక్రీ, సికింద్రాలకు రేట్ల వివరం
పెద్దలకు రు. 20/- లు పిల్లలకు రు. 10/-
గయిడ్ చార్జీలతో సహా.
2, 3 టూర్లకు టిక్కెట్లు ఆగ్రా ఎయిర్‌పోర్టులో కూడా దొరుకుతాయి.

ప్రారంభం : గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు – మరికొన్ని యితర ప్రముఖ హోటళ్ళ ప్రాంగణాలనుండి బయలుదేరటం – మరల అక్కడికే పూర్తి.

ఆగ్రాలో :

ప్రత్యేక సంస్థలు-

1) ANTIQUE REGISTRATION OFFICE
19, MIG- న్యూ షాగంజ్.

2) FOREIGNER'S REGISTRATION OFFICE
16, ఇద్గా కాలనీ, ఫోన్ : 74167

ఆగ్రాలో సమాచార కేంద్రాలు :

ఆగ్రా కంటోన్మెంటు రైల్వేస్టేషను ప్రాంగణంలో

1) యు. పి. గవర్నమెంటు టూరిస్టు కౌంటరు, ఫోన్ : 61273

2) యు. పి. గవర్నమెంటు టూరిస్టు బ్యూరో,
64, తాజ్ రోడ్, ఫోన్ : 75852

3) హర్యానా గవర్నమెంటు టూరిస్టు బ్యూరో,
షాపింగ్ ఆర్కేడ్, తాజ్ కాంప్లెక్సు, ఫోన్ : 65950

4) రాజస్థాన్ గవర్నమెంటు టూరిస్టు బ్యూరో
షాపింగ్ ఆర్కేడ్, తాజ్‌మహల్ కాంప్లెక్సు, ఫోన్ : 64582

5) గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు,
191, మల్, ఫోన్ : 72377

6) గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఇన్‌ఫర్మేషన్ కౌంటరు,
ఖేరియా ఎయిర్‌పోర్టు, ఫోన్ : 62244

ట్రావల్ రిజర్వేషన్లు :

విమాన యానంకు :

ఎయిర్ ఇండియా & ఇండియన్ ఎయిర్ లైన్సు
హోటల్ క్లార్క్సషిరాజ్, 5 టాజ్ రోడ్డు

రైలుకి :

ఆగ్రా కంటోన్మెంటు రైల్వేస్టేషను – ఆగ్రా ఫోర్టు రైల్వేస్టేషను
సమయం ఉ. 9 గం. నుండి సా. గం. 4–30 వరకు

బస్సులు :

అనేక యితర యాత్రా కేంద్రాలకు అనువుగా రోడ్డు సౌకర్యం బస్సు రూట్లు

ఆగ్రానుండి :

| వరకు | దూరం కి. మీ. | మజిలీలు–గమ్యాలు |
|---|---|---|
| భరత్‌పూర్ – | 54 | నేరుగా. |
| ఢిల్లీ – | 204 | మథురా-54, హోడల్–55, పాల్వాల్-29, బల్లభ్‌గర్-23 ఢిల్లీ-43. |
| గ్వాలియర్- | 119 | ధోల్‌పూర్-58, మొరెనా-26 గ్వాలియర్-35. |
| జైపూరు- | 237 | భరత్‌పూర్-54, మహ్వా-69. దోసా-63, జైపూరు–51. |
| ఖజురాహో | 357 | గ్వాలియర్-119, ఝాన్సీ-101 ఛాత్తర్‌పూర్-127, ఖజురాహో -48. |
| లక్నో | 357 | షికోహాబాదు-65, మైన్‌పురి-40, బ్యార్-35, కనోజ్-66, కాన్పూర్-82, ఉన్నావో-18, లక్నో-51. |
| మధుర | 54 | నేరుగా. |
| నైనితాల్ | 376 | అవాగర్–65, ఈటా–21, కాస్‌గంజ్-29, బాదవున్-55, బరేలీ-49, హల్‌ద్వాని–95. నైనితాల్-62. |

ముఖ్యమయిన వసతులు :–

ఆగ్రాలో :

ధర్మశాలలు :

భోజనవసతి ఉండదు– పడుకోటానికి మాత్రం కొద్దిపాటి చార్జీలు వసూలు చేయబడతాయి– పేదవారికి సౌకర్యం అనిపించేవి చౌకలో.

ఆగ్రాసిటీ రైల్వే స్టేషను ఎదురుగా ఉన్నవి :-

(1) గయాప్రసాద్ బెకారీలాల్ ధర్మశాల.
(2) జానకీప్రసాద్ ధర్మశాల, మదన్‌మోహన్ దర్వాజా.
(3) R.B. భిషంబర్‌నాథ్ ధర్మశాల.

రాజ్-కి-మండి రైల్వే స్టేషన్ దగ్గర ;

(1) అగర్వాల్ పంచాయితి ధర్మశాల
(2) ఫకీర్‌చంద్ గెస్టు హౌస్
(3) ప్రతాప్‌చంద్ ధర్మశాల
(4) సుందర్‌లాల్ జెయిన్ ధర్మశాల

హోటళ్ళు, శ్రీమంతులకు, వెస్టరన్ స్టైలు :

తాజ్‌మహల్‌కి దక్షిణంగా అమరియున్నవి-

(1) హోటల్ మొఘల్ షెరాటన్, ఫతేహాబాద్ రోడ్డు, ఫోన్: 64701, 64728
(2) హోటల్ క్లార్క్సషిరాజ్, 5 తాజ్‌రోడ్డు, ఫోన్: 72421
(3) హోటల్ ముంతాజ్, ఫతేహాబాద్ రోడ్డు, ఫోన్: 64771
(4) హోటల్ గాలక్సీ అశోక్, ఫతేహాబాద్ రోడ్, ఫోన్: 64171
(5) I.T.D.C. వారి హోటల్, దిమల్లో
(6) జైవాల్ హోటల్, తాజ్‌రోడ్డు వగైరాలు.

చౌకలో హోటళ్ళు :

కన్‌టోన్మెంటు రైల్వేస్టేషనుకు సమీపంలో- ఆ పరిసరాల్లో
G P.O.కి దగ్గరలోని టూరిస్టు రెస్ట్ హౌస్
(పడక సౌకర్యం రాత్రి పూటకి మాత్రం రు. 7/-)
న్యూ టూరిస్టు రెస్టు హౌస్
హోటల్ ఖన్నా, అజ్మీర్‌రోడ్డు
హోటల్ అజయ్ ఇంటరేనేషనల్, ఫోర్ట్ రైల్వే స్టేషను దగ్గరగా
హోటల్ జైహింద్, కాలకా రోడ్డు,

హోటల్ అక్బర్ ఇన్, 21, ది మాల్.

మేజర్ బక్షి హోటల్, సాదరు ఏరియా లోనిది-

వగైరాలు ఇంకా అనేక చిన్నా, పెద్దా హోటళ్ళు చాలా వున్నాయి.

ఇతర వసతులు :

సికింద్రా దగ్గర : ఆర్కెలాజికల్ సర్వే రెస్టు హౌస్

ఫతేపూర్ సిక్రీలో రిజర్వేషనులు : సూపరింటెండింగ్ ఆర్కెలాజిస్టు,
ఆర్కెలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా,
నార్తరన్ సర్కిల్, ఆగ్రా కంటోన్మెంటు.

P.W.D, ఇన్‌స్పెక్షను బంగ్లా, M.G రోడ్డు, ఆగ్రా కన్‌టోన్మెంటు

రిజర్వేషన్లకి :

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ప్రొవిన్షియల్ డివిజను, P.W.D. (R&B), జనరల్ కరియప్ప రోడ్డు, ఆగ్రా.

డిస్ట్రిక్టు బోర్డు గెస్టు హౌస్, బాలుగంజ్.

రిజర్వేషనులు : అడిషనల్ ఛీఫ్ ఆఫీసరు, డిస్ట్రిక్టు బోర్డు, ఆగ్రా.

ఇక రైల్వేస్టేషనులోని రిటయిరింగు రూములు- వగయిరాలు అనేకం.

మధుర - బృందావనములలో వసతులు :

మధుర :

ఆగ్రా హోటల్, బెంగాలీ ఘాటు, క్వాలిటీ హోటల్, బస్టాండు దగ్గర; బ్రిజ్ బిహార్ రోడ్డు, తిలక్ ద్వారం రోడ్డు, లీలాసదన్, జంక్షనురోడ్డు, హోటల్ మయూర, జంక్షను రోడ్డు, ప్రేమ్ హోటల్, తిలక్ ద్వారం వగైయిరాలు.

ధర్మశాలలు :

అహమ్మదాబాద్‌వారి ధర్మశాల, చట్టాబజారు.

భివానివారి ధర్మశాల, బెంగాలి ఘాటు.

కలకత్తావారి ధర్మశాల, ఆర్యసమాజం రోడ్డు.

గంగా ధర్మశాల, రామదాసు మందిర్.

జైన ధర్మశాల, బృందావన దర్వాజా.

కాషీదాయ్ ధర్మశాల, బెంగాలీ ఘాట్ వగైరాలు.

ఇతరంగా వసతులు :

(ప్రభుత్వ అతిధులకు ముఖ్యం)

(1) P.W.D. ఇన్‌స్పెక్షన్ హౌస్, కలెక్టరేట్ దగ్గర.
రిజర్వేషన్లకు: ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ప్రొవిన్షియల్ డివిజను, P.W.D. మధుర.

(2) ఫారెస్టు రెస్టు హౌస్, పారడైజ్ అల్లీ, ఆగ్రారోడ్డు, కన్‌టోన్మెంటు.
రిజర్వేషన్లకు : డివిజనల్ ఫారెస్టు ఆఫీసరు, బ్రిజ్‌భూమి డివిజను, 23, విజయనగర్ కాలనీ, ఆగ్రా.

(3) షేఖారి కిసాన్ నివాస్, డాంపియర్‌నగర్.
(ముఖ్యంగా వ్యవసాయదారులు, రైతులకు ప్రత్యేకం– ఖాళీగా వుంటే ఇతరులకు ఇస్తారు)
రిజర్వేషన్లు : చైర్మన్ లేక సెక్రటరీ, డిస్ట్రిక్టు కో–ఆపరేటివ్ బ్యాంకు, డాంపియర్ పార్కు, మధుర.

(4) రాధేశ్యామ్ గెస్టు హౌస్, గుజరాతీ సమాజ్, బెంగాలీ ఘాటు.

(5) శ్రీమతి క్రిష్ణాదేవి దార్మియా ఇంటర్నేషనల్ గెస్టు హౌస్, కేశవదేవ్ కట్రా, మధుర.

(6) మథురా జంక్షన్ రైల్వే రిటయిరింగ్ రూములు– రైలు ప్రయాణికులకు మాత్రం.

బృందావన్‌లో :

(1) జయ్‌పురా భవన్, గోవర్ధన్ దర్వాజా

(2) క్రిష్ణ–బలరామ్ ఇంటర్నేషనల్ గెస్టు హౌస్, రామన్‌రేటి.

(3) జీవన్ బల్లభ్ టెంపుల్, బెహారిపురా– ఇంకా మరెన్నో ధర్మశాల లున్నాయి. ఎవరు ముందు అయితే వారికి పద్ధతిలో.

# ఢిల్లీ

## పాత+కొత్త ఢిల్లీ

ఢిల్లీ మహానగరం అతి పురాతనమైంది- 5000 సంవత్సరాల అతి దీర్ఘ చరిత్ర గలది. ద్వాపర యుగమని చెప్పబడే మహాభారత కాలంలో ఆనాటి వీరులు పాండవుల రాజధాని ఇంద్రప్రస్థ పురంగా పురాణేతిహాస ప్రసిద్ధి గలిగినది. అనాది కాలంలో పురాణాల్లో ఒక సమున్నత నగర ప్రదేశం. భూభారం మోసే వాసుకి శిరస్సున అమరియుండునట్లున్నూ, మహామణిమాన్వితమై, సత్యప్రదమై శోభిల్లుతూందనీ, దాని విశిష్టతను ఓర్వలేని ఒక మహారాజు ఒక పెద్ద ఇనుప స్తంభాన్ని పాతాళం వరకు దిగవేయించగా అది వాసుకి మహాశయుని శిరస్సును రెండుగా చీల్చివేసిందట. తరువాత కొంతకాలానికి మరో మహారాజు ఆ స్థంభము ఎంతలోతు నుండో తెలుసుకోవాలని ఉబలాటపడి పైకి పీకించాడట. ఆ స్థంభము భూమిలోనున్న చివరి అంచునుండి రక్తము ప్రవాహమై పారుతూ అంతా రక్తసిక్తమయి ఉండటం ఆశ్చర్యాన్ని కలిగించింది. వాసుకి శిరస్సులో దిగబడియున్న ఈ ఇనుప స్తంభం పైకి లాగి వేసేటప్పటికి శిరస్సున నాటియున్న ములుకును పెరికివేసినట్లయి అటు నిటు కదలటానికి కొంచం సులువయిందిట. హిందీలో 'ధిల' లేక 'ఢిలి' అంటే ఇంగ్లీషులో లూజ్ (LOOSE) అనే అర్థం. అది కాలక్రమేణా బ్రిటిషువారి నోట 'డెల్లి'గా మారిందని ఒక కథ అయితే - మధ్యయుగాల్లో 'ఢిల్లి' మహారాజు పేరిట సార్థకమయిందని మరో వాదం. ఏది ఎలా వున్నా ప్రస్తుతం మనం చూస్తున్న ఈ ఢిల్లీ

మహా నగరంగా విస్తరిల్లటానికి కారణాలు వివరంగా చర్చించే ముందు ప్రపంచంలో అతి పెద్దదై ప్రజాస్వామిక దేశంగా చెప్పుకొనబడే మన సువిశాల భారతదేశానికి - రాజధానీ నగరం అనే సంగతి మన కందరికీ తెలిసిందే.

ఈ మహానగరం యమునా నదీతీరంలో అమరియుండి రెండు భాగాలుగా స్థూలంగా అభివృద్ధి చెందినది. మొన్నటిదాకా మొగలాయి సామ్రాజ్యపు వెలుగు అంచులదాకా పాత ఢిల్లీ వివిధ చక్రవర్తుల పాదుషాల కాలాల్లో నిర్మించబడిన సప్త నగరాల కలయికగా పరిఢవిల్లి, తరువాత బ్రిటిషువారి కాలంలో న్యూ ఢిల్లీ నగరం నిర్మాణం జరిగి మొత్తం ఏకమై ఎనిమిది నగరాల కలయికతో సుందర శోభావిలసితమై, అనేక ప్రాచీన చారిత్రక జ్ఞాపికలతో నాటికీ నేటికీ వింతల వారధిగా మన ముందు నిలిచిన దాన్ని చుట్టూ పరిక్రమంలో కొన్ని గ్రామాల్ని కలిపి కేంద్రపాలిత రాష్ట్రంగా ప్రత్యేక ప్రతిపత్తి గలిగిన ఆధిక్యతను సంతరించుకున్నది.

మహానగర రాష్ట్ర జనాభా : 62 లక్షలు పై చిలుకు.
వైశాల్యం : 1, 483 చ. కి. మీ.
రాజధాని : ఢిల్లీ
ప్రజలు మాట్లాడే భాషలు : హిందీ, పంజాబి, ఉర్దు, ఇంగ్లీషు.
అక్షరాశ్యత : 62 శాతం
స్త్రీ పురుష నిష్పత్తి : 808 : 1000
జనసమర్ధత : 1 చ. కి. మీటరుకు 4194 మంది.

ఢిల్లీ కేంద్రపాలిత రాష్ట్ర పతిపత్తిగా రాష్ట్ర పునర్విభజన సమయం అయిన నవంబరు 1, 1956న సంక్రమించింది. అభివృద్ధి పథంలో అగ్రగామిగా వుండేందుకుగాను పార్లమెంటులో 1966 సంవత్సరంలో ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషన్ అక్టు నొకదానిని ప్యాసు చేసింది. ఈ చట్ట ప్రకారం ఢిల్లీకి ఒక ప్రత్యేక మెట్రోపాలిటన్ కౌన్సిలు 61 మంది సభ్యులతో ఏర్పాటు జరిగింది. ఇందులో 5గురు సభ్యులను రాష్ట్రపతి నామినేట్ చేస్తారు. అత్యున్నత ప్రభుత్వోద్యోగి లెఫ్టినెంట్ గవర్నరు సహాయంగా 4గురు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లుంటారు. వీరిలో ఒకరు ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌గా వ్యవహరిస్తారు. కేంద్ర హోమ్ మినిష్టరు గారి సలహా మేరకు వీరిని కూడా రాష్ట్రపతియే నియమిస్తారు. మొత్తం 214 గ్రామాలున్నాయి. వీటిని జనాభా ప్రాతిపదికగా ఢిల్లీ, న్యూఢిల్లీ, ఢిల్లీ కన్‌టోన్మెంట్‌లుగా విభజించబడింది.

7గురు పార్లమెంటు సభ్యులు, 3 గురు రాజ్యసభ సభ్యులు ఎన్నికైన ప్రజాప్రతినిధులు ప్రాతినిధ్యం వహిస్తారు.

పాలనా సౌలభ్యానికి పాలనాపరంగా మూడు స్థానికసంస్థలు ప్రజాసౌకర్యాల కొరకు తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాయి. 1) న్యూ ఢిల్లీ మునిసిపల్ కమిటీ, 2) ఢిల్లీ మునిసిపల్ కార్పోరేషను 3) ఢిల్లీ కన్‌టోన్‌మెంటు బోర్డు. గ్రామీణ విభాగమంతా మునిసిపల్ కార్పోరేషన్ ఆఫ్ ఢిల్లీ క్రిందకు వస్తుంది.

## సంగ్రహంగా పూర్వ చరిత్ర :

పురాణేతిహాసాల్లో ప్రస్తుతించబడిన ప్రదేశమైనా ఢిల్లీచరిత్రను 11వ శతాబ్దపు ప్రాంతం నించి చూడటం సముచితం. పూర్వపు ఇంద్రప్రస్థ పురం రాక్షసుల విశ్వకర్మయైన మయునిచే నిర్మింపబడిందని ప్రతీతి. కాని ఈనాటి ఢిల్లీ న్యూ ఢిల్లీ నగర నిర్మాణ శిల్పి ఎడ్విన్, లుటియెన్స్‌తో సహా అనేకమంది నిర్మాణ కుశలురు ఈ అపూర్వ నిర్మాణక్రమంలో పాలుపంచుకున్నట్లు చరిత్ర విశదం చేస్తుంది. వారి తాలూకు స్మృతి చిహ్నాలనేకం మనకు సాక్ష్యం కూడా యిస్తున్నాయి యిప్పటికీ. కురుక్షేత్ర సంగ్రామం దగ్గరనుంచీ అనేక యుద్ధాలకు ప్రధానరంగమైంది. యుద్ధంలో విజయులైనవారి సింహనాదాలు ఇక్కడే ప్రతిధ్వనించాయి. ఓడినవారి కన్నీటి చారికలతో శోకపరితప్త దీనాలాపాలు విహ్వలించాయి. ఈ చోటంతా రక్తపుటేరులుపారి పరిప్లావితమయి- ఈ భూమిలో పురాతన చరిత్రలు కథలు కథలుగా చెప్పే శాసనాలు, స్మారక జ్ఞాపికలతో నిండిపోయి ఉంది. కాలగమనంలో కొన్ని మాసిపోయి, దుండగుల దండయాత్రల్లో కొన్ని ధ్వంస రచనకు గురయినా, ఎన్నోమార్లు దోపిడీలకు గురయి కొల్లగొట్టి దోచుకోబడినా ఇంకా ఎన్నో అవశేషాలు మిగిలే ఉన్నాయి చరిత్రకాధారంగా.

కుతుబ్‌మినార్ దగ్గరనే పురాతన కోటయొక్క శిధిలాలు కనబడతాయి. దీన్ని లాల్‌కోటగా పిలుస్తారు. దీన్ని అనంగపాలుడనే మహారాజు నిర్మించాడు. క్రమేణా ఈ వంశపురాజుల వద్దనుండి చౌహానుల వశంలోకి వచ్చింది. ఈ చౌహానువంశపు రాజే పృథ్వీరాజు. అవక్ర పరాక్రమశాలి. ఇతని కాలానికే ఢిల్లీ సామ్రాజ్యం మహా వైభవోపేతంగా, సిరుల నిలయంగా తులతూగుతోంది. అప్పుడే మొదలైంది అనేక మంది దండయాత్ర. టర్కీ సుల్తాను మహమ్మద్ ఘోరీని పృధ్వీరాజు చిత్తుగా ఓడించి గాజులు తొడిగించి వెనక్కు తరిమేశాడు. పొరుగు రాజు జయచంద్రుడు సుల్తాను పంచన చేరి పృధ్వీరాజును చంపించాడు. ఇది 1192లో జరిగింది.

తరువాత జయచంద్రుడూ మిగలలేదు. నిర్దాక్షిణ్యంగా ఘోరి చంపాడు. అతని రాజ్యాన్ని కబళించాడు. ఈ విధంగా హిందూరాజుల అంతఃకలహాల మూలంగా ఒక్కొక్క మెట్టూ పరాయి పాలకుల హస్తాలలోకి జారిపోయింది. ఇది మనకు చరిత్ర చెప్పిన తిరుగులేని నిజం. ఇది అన్నియెడలా అప్పటినించి ఇటీవల దాకా అక్షరసత్యమై నిరూపించబడింది. ప్రతియొక్క పారతంత్ర్య ఘట్టంలోనూ– ఎవరిని తప్పు పట్టాలి?।

ఘోరి తరువాత అతని రాజప్రతినిధి కుతుబుద్దీన్ పాలించాడు. వస్తుతః అతను ఒక బానిస. అతని వంశం బానిస వంశంగా పేర్కొనబడి 1206 నుండి 1290 వరకూ ఆ రాజులే ఢిల్లీ సామ్రాజ్యాన్నేలారు. ఈ వంశానికి చెందిందే చరిత్రలో ప్రసిద్ధి కెక్కిన మహిళా పాలకురాలు రజియా సుల్తాన్. ఆమె తండ్రి ఇల్‌తుత్‌మిష్ కూతురైనా, కొడుకుగా పెంచిన తండ్రికి ఆమె శక్తిసామర్థ్యాలు బాగా తెలిసి తన వారసురాలిగా ప్రకటించి చనిపోయాడు. నిజంగా మెచ్చుకో తగిన సమర్థురాలు. అయితే ఆడదనే చిన్న చూపుతో కించన భావంతో పురుషులు సహకారం యివ్వలేదు అందు మూలంగా నాలుగు సంవత్సరాల కంటే ఆమె గద్దె మీద నిలవలేదు. పురుష జాతి అహంకారానికి బలియై పోయిన అబలగా మిగిలిన సబల. 1240లో కరకు కత్తులకు ఆమె, ఆమె భర్త అల్తునియా బలైపోయారు విషాదాంతంగా. తరువాత కైకుబాదు హత్యతో జలాలుద్దీన్ ఫిరోజ్‌షా బానిస వంశానికి పుల్‌స్టాప్ పెట్టాడు. తరువాత ఢిల్లీ రాజ్యం నేలిన జలాలుద్దీన్ ఫిరోజ్‌షా వంశం ఖిల్జీ వంశంగా పేరొంది 30 సంవత్సరాలు రాజ్యమేలారు. (1290–1320)

ఖిల్జీల తరువాత తుగ్లకుల వంశం. ఘియాసుద్దీన్ తుగ్లక్‌తో 1320లో మొదలాయి 1413 వరకు పాలించింది. వీరు క్రూరుడైన సమర్‌కండ్ తైమూరు (లేక తామర్లేను) దండయాత్రకు లొంగిపోయారు. తుగ్లకు ప్రతిఘటించ ప్రయత్నించాడు. కాని ఆ క్రూరుడి ధాటికి ఆగలేకపోయాడు. పచ్చినెత్తురు తాగే కసాయివాడు. స్త్రీ, బాల, వృద్ధులనే విచక్షణ లేకుండా 1 లక్షమందిని ఊచకోత కోసాడట రాక్షసుడు. ఢిల్లీనంతా కొల్లగొట్టమని తన సైనికులను యథేచ్ఛగా విహరించమని 15 రోజులు మకాం వేసి సిరులన్నీ దోచుకుని మహాధనవంతుడై మరలాడుట. తరువాత సయ్యద్‌లు, లోడీలు 1413 నుండి 1528 వరకు పరిపాలించారు. అప్పుడొచ్చాడండి తైమూరు వంశీయుడు, మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరు– దృశ్యంలోకి. మొగలువంశపు చక్రవర్తులు 19 మంది. వారిలో చరిత్రలో ఎన్నుకొనదగినవారుగా మంచిగాని, చెడు

గాని బాబరు- (1526-30)హుమాయూను,(1530-56)అక్బరు-(1556-1605) జహంగీరు(1605-27) షాజహాన్ (1627-58) ఔరంగజేబు (1658-1707) వీరంతా మొగలు సామ్రాజ్యాన్ని అన్ని రకాలుగా విస్తరించుకుంటూపోయి ఎన్నో యుద్ధాలు చేసి గణుతికెక్కారు. చివరివాడైన ఔరంగజేబు కాలానికి వచ్చేటప్పటికి భారత ఉపఖండం మొత్తం ఢిల్లీ పాదుషా ఏలుబడిలోకి వచ్చింది. ఈ కాలాల్లోనే అనేక చరిత్ర ప్రసిద్ధ కట్టడాలు నిర్మించబడి కళాపోషణం ఇతోధికంగా జరిగింది. కొంతమంది నిరంకుశులై మత చాంధసత్వంతో ప్రవర్తించినా దేశ సంపదలను మరెక్కడకో తరలించక ఇక్కడనే, ఈ మట్టిలోనే వ్యయించి, ప్రజలను పీడించియైనా కొన్ని ప్రపంచమంతా ఆశ్చర్యంతో ముక్కున వేలు వేసుకోగల అనేక నిర్మాణాలు గావించారు. వానిలో ఎందరి ఘర్మజలాల శ్రమ తర్పణమో, అసువుల త్యాగమో లెక్కవేయగలిగిన గణికులు లేరన్నా అతిశయోక్తి కాదేమో! అయితే యీనాటికీ కొన్ని చెక్కు చెదరక పూర్వ వైభవాలను, వారి కృషినీ, పట్టు సడలకుండా తరాల తరబడి కట్టుకున్న కోటలు, బురుజులు, రహస్యహర్మ్యాలు కండ్లముందు కాలానికతీతంగా నిలిచి ఉన్నాయి.

1608 జహాంగీరు చక్రవర్తికాలం. అప్పుడే ఇంగ్లాండు రాజు కింగ్ జేమ్స్ I తాలూ రాయబారి మొగలు దర్బారులో కాలుపెట్టాడు. తరువాత 1615 లో సర్ థామస్‌రో జహాంగీరు చక్రవర్తి దగ్గర యీస్టిండియా కంపెనీ తరపున ఫ్యాక్టరీలు ఇండియాలో కట్టటానికి అనుమతిని సంపాదించగలిగాడు. ఆనాటి అనుమతే బ్రిటిషు వారు భారతదేశంలో అంచెలంచెలుగా చొచ్చుకొని వచ్చి 'రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య' స్థాపనకు పునాది.

మొగల్ పాదుషాలు దీనస్థితికి చేరుకున్నారు 1738 ప్రాంతంలో నాదిర్షా పర్షియానించి వచ్చి దండెత్తాడు అదేసమయంలో 30,000 మంది పౌరులను పొట్టన బెట్టుకున్నాడు. నగరమంతా చాలా వరకు పరశురామప్రీతి గావించాడు. నెమలి సింహాసనం, 1000 ఏనుగులు, 7000 గుర్రాలు, 10,000 ఒంటెలు అనేక విలువైన వస్తువులు, దొరికిన అందమైన ఆడవాళ్ళను ఏరుకుని మరీ, 500 మంది అద్భుత శిల్పకారులను మొత్తం ఇరాన్‌కి తరలించాడు. అంతకీ సంతృప్తి చెందలేదు చూపంతా కోహినూర్ వజ్రంమీదే వుంది. చివరకు మహమ్మదుషా (ఆనాటి మొగలు చక్రవర్తి) తన తలపాగాలో దాచుకున్నాడు. చివరికి స్నేహపూర్వకంగా జరిగిన తలపాగాల మార్పిడిలో ఆ వజ్రం కూడా కోలుపోవలసి వచ్చింది. చేసేదిలేక

బతుకు జీవుడా అని దొంగకు తేలుగుట్టినట్టు మెదలకుండా వూరుకొన్నాడు కక్కలేక మింగలేక. ఇంత చేసిన నాదిర్షా అన్నీ దక్కించుకుని అనుభవించాడా ? లేదు. ఈ కొల్ల సంపదను చూచి వులిసిపోయిన సైనికాధికారి నాదిర్షాను చంపి చేజిక్కించు కొన్నాడు. అంతటితో వూరుకోలేదు. ఢిల్లీ మీద దండయాత్రలు తరచూ తన గురు వైన నాదిర్షా చూపిన మార్గంలోనే కొల్లగొట్టుకుని పోయేవాడు. ఒక వంక మొగలుల పతనం మరింత చేరువయ్యేకొందీ బ్రిటిషువారు బలపడసాగారు. చివరికి 1803 లో ఆగ్రాను, ఢిల్లీని సాధించారు- ఈస్టిండియా కంపెనీ ఆంగ్లేయులు. చివరికి ఆనాటి ఢిల్లీ సుల్తాను షా ఆలంను బందీగా పట్టుకొన్నారు. చివరి మూడేండ్లు కారాగా రంలో గడిపి 1806 లో చనిపోయాడు. అతని కుమారుడు అక్బరు II ని చక్ర వర్తిగా మకుటం అలంకరింప చేశారు. 1857 లో ఈస్టిండియా కంపెనీకి వ్యతి రేకంగా ప్రథమ స్వాతంత్ర్య సమరంగా అభివర్ణించబడే 'సిపాయుల తిరుగుబాటు' సంభవించింది. బ్రిటిషువారు ఆఖరు మొగలు చక్రవర్తి 'బహదూర్‌షా'ని స్వతంత్ర పోరాట వీరులకు సహకరించాడనే మిషమీద రంగూన్ పంపివేశారు. 1862 లో బహదూర్ షా చనిపోయాడు.

పాత కోటకు ప్రవేశద్వారం 'ఖూని దర్వాజా' అని సార్థకమైన చరిత్ర ప్రసిద్ధి. చక్రవర్తి వారసుల నందరినీ ద్వారం దగ్గరే కొంతమందిని కాల్చి చంపారు, కొంతమందిని ఉరితీశారు బహిరంగంగా. కంపెనీ కమాండర్ హడ్సన్ వ్రాసి కొన్నాడు. 'నేను ఏమంత పైశాసికంగా, క్రూరంగానూ ప్రవర్తించలేదు— కాని దొరికిన అవకాశాన్ని సద్వినయోగం చేసికొని అందర్నీ మట్టు బెట్టగలిగాను' అని- ఇంతటితో మొగలు వంశం అంతరించింది. అయినా ఇంకా కొంతమంది ఆ వంశీ యులు ప్రాణాలతో బతికున్నవారు యిప్పటికీ కొంతమంది ఉన్నా వారంతా అతి పేదరికంలో మగ్గుతూ వూరూ పేరు లేక ఎక్కడో పడివున్నారు.

సుల్తాను ఘియాసుద్దీన్ బెంగాలుమీద దండయాత్ర సాగించి విజయగర్వంతో వచ్చినప్పుడు నిజాముద్దీన్ అనే మహమ్మదీయ ఫకీరు ఇలా అన్నాడు- 'హనుజ్ డిల్ హి దూర్ అస్త్' అంటే ఢిల్లీ ఎంతో దూరముందింకా అని అర్థం.

ఢిల్లీ అనే భూతల స్వర్గం ఎంతోమంది ఆశపడ్డా చివరి వరకు అందినట్లే అంది చేజారిపోతుంది అన్నది అక్షరసత్యం.

1858 లో ఈస్టిండియా పెత్తనం ఇండియాలో బ్రిటిషు రాచరికానికి ఒప్ప గించిన సంవత్సరం. అప్పుడు బ్రిటిషు ఇండియా రాజధాని కలకత్తా. ఢిల్లీ అడగి

పోయిన వైభవం తిరిగి పునరుద్ధరించబడిన సంవత్సరం—1911. 5వ జార్జి చక్రవర్తి సభ జరిపి ఇక ఇక్కడి నుండి ఇండియా రాజధాని ఢిల్లీ అని ప్రకటించిన సంవత్సరం. ఆనాటి నుండి ఢిల్లీ వైభవం పరాకాష్ఠకు చేరుకోటానికి అన్ని విధాల దశలు దశలుగా ఇనుమడించబడింది. ఈ నేపథ్యంలోనే 1947 ఆగస్టు 15 వచ్చింది. పాత కొత్త ఢిల్లీలు కొంగ్రొత్త మెరుగులు దిద్దుకుంటూ వింత సోయగాలను నింపుకుందనటంలో సందేహంలేదు. అంతర్జాతీయ మహానగర ప్రతిపత్తిగల రాజధానిగా అనేక హంగులను సమకూర్చుకుంది. ఒకవంక నిన్నటి వైభవాల అవశేషాలు జిలుగు వెలుగుల మెరుపులను రంగు రంగులుగా ప్రసరిస్తుంటే— నేడు ఆధునికతకు అద్దంపట్టే అనేక నూతనహొయలు సంతరించుకుంటూ 19వ శతాబ్దపు చివరి అంచున ఉన్న ఈనాడు శరవేగంగా 21వ శతాబ్దంలో అడుగు పెట్టటానికి నవనవోన్మేషంగా తయారయ్యే ఈ మహానగరంలో నాటి, నేటి విశేషాలను చూద్దాం. ఎంతో ఆసక్తి, ఉత్సాహం రేకెత్తించే స్మరణలు మనసుకు ఆహ్లాదాన్ని కలిగిస్తూ, హృదయం పులకిత నందనమే అవుతుంది.

"అగర్ ఫిర్దోస్ బెర్ రు-ఇన్-జమీన్-అస్త్
హమిఁ అస్త్, హమిఁ అస్త్ ఒ హమిఁఅస్"

ఎర్రకోటలో సున్నితమైన సుందరమైన నగిషీల పువ్వులమధ్య చెక్కిన పై రెండు వాక్యాలు పర్షియా భాషకు చెందినవి. ఆనాటి ఢిల్లీ వైభవాన్ని తెలిపే మచ్చుతునకలు- వాటి అర్థం-

'భువిలోన స్వర్గం అనేది ఎక్కడుంది అంటే
అది యిక్కడే- యిక్కడే- యిక్కడే'

స్వర్గంకోసం దేవతలు, రాక్షసులు పోటీపడి ఇంద్ర పీఠాన్ని అధిష్ఠించి స్వంతం చేసుకోటానికి ఏ రకంగా అయితే యుద్ధాలు, దండయాత్రలు జరిగాయో అన్నింటికంటే ఎక్కువ యుద్ధాలు జరిగిన ప్రదేశముగా గణించవచ్చు. ఈ నగరం ఒక చోటనుండి ఫలానావి దర్శించవీలు అని చెప్పే దానికంటే మీరు దిగిన చోటు నుండి కార్యక్రమ నిర్వహణ మీరే రూపొందించుకోటం ఉత్తమం. అందుచేత చూడదగిన ముఖ్య చారిత్రిక ప్రదేశాలు, జ్ఞాపికలు, స్మారకాలు, కోటలు వగైరాలన్నీ అకారక్రమంతో యిస్తున్నాం- వాటి వింతలు విశేషాలతో పరికించండి.

**అశోక స్తంభం :**

క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన అశోక స్తంభం 13 మీటర్లు ఎత్తు గలిగింది. ఫిరోజిషా కోట్‌లా శిథిలాల మీద నిలబెట్టబడి ఉన్నది. దీనిని మీరట్ దగ్గర తోప్రా నుండి తీసుకొనివచ్చి 1354 లో ప్రతిష్ఠించాడు. లేత నారింజరంగు శిలలమీద అద్భుతంగా పాలిష్ చేయబడిన ఈ స్థంభంమీద అశోక చక్రవర్తి సప్తశాసనాలు బ్రాహ్మీలిపిలో చెక్కబడి ఉన్నాయి. పాతఢిల్లీ - కొత్తఢిల్లీల మధ్యన ఉన్న ఫిరోజాబాదు ఎనిమిదింటిలో అయిదవదిగా పేరొందినది.

**ఇండియాగేటు :**

42 మీటర్ల ఎత్తున రాతితో నిర్మించబడిన రాజ్‌పథ్ తూర్పు కొసన అమరియున్న పెద్ద ఆర్చిగేటు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో వాయువ్య సరిహద్దులో భారతసైన్యం అతి ముఖ్యమైన కీలకపాత్ర వహించినది. అందులో 90,000 మంది ప్రాణాలు బలైపోయాయి. 1921 లో ఈ యుద్ధం స్మారకం వారి సంస్మరణ చిహ్నంగా కట్టించబడింది. సిటీ బస్సులన్నీ ఇండియాగేటు మీదుగానే ప్రయాణం చేస్తాయి. గేటు కిరువైపులా, రోడ్ల కిరువైపులా మైళ్ళకొద్దీ వ్యాపించిన ఉద్యానవనాలు సుందరంగా కనుచూపుమేర కమనీయంగా ఉంటుంది. ఈ పరిసరాల్లోనే రాష్ట్రపతి భవనం. పార్లమెంటుభవనం వంటి బ్రహ్మాండమైన భవనాలు అమరి ఉన్నాయి.

**ఎర్రకోట :**

(లాల్ ఖిల్లా) :- అనంగానే మన మనస్సుల్లో భారత స్వాతంత్ర్య దినం ఆగస్టు 15 మన కళ్ళముందు తళుక్కున మెరుస్తుంది. స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ప్రతి సంవత్సరం మన దేశ ప్రధాని దేశ ప్రజలందరిని ఉద్దేశించి చరిత్రాత్మకమైన ఈ ఎర్రకోటనుండే సందేశాన్నివ్వటం జరుగుతుంది.

ఎర్రటి రాయితో కట్టబడి జరిగింది కనుక ఎర్రకోటగా ప్రసిద్ధి చెందినది. సుమారు 2 కిలోమీటర్లు పొడవున ఆక్రమించి యున్నది. షాజహాను చక్రవర్తి 1638 లో ఆరంభించి 1648 లో పూర్తి చేశాడు. నిర్మాణాన్ని అత్యధిక వ్యయ ప్రయాసల్తో రాజసం ఉట్టిపడి స్వర్గవైభవాన్ని తలదన్నేట్లుగా కళాత్మకంగా రూపొం

దించాడు చక్రవర్తి. వెలలేని వజ్ర వైఢూర్యాలకు. రత్నరాశులకు నిలయమైంది. ప్రపంచం మొత్తం మీద ఎన్నదగిన వజ్ర, వైఢూర్య, రత్నఖచిత నెమలి సింహాసనం, వెలకట్టలేని కోహినూర్ వజ్రం, మరెన్నో విలువైన రత్నమాణిక్య రాలులకు చోటు చేసుకొంది. రాజసం, విలాసం, శోభవైభవం ముప్పిరి గొనగా స్వర్గంలో ఇంద్రవైభవం దీనిముందు దిగదుడుపే అనిపించేంత ఘనంగా కట్టించబడింది. రాతి పనిలో నగిషీలు అనల్పం. అత్యద్భుతం. ఇంతగా శ్రమించి ముచ్చటపడి కట్టించుకొన్న రమ్య హర్మ్యాలు గల కోటకి షాజహాను చక్రవర్తి తన రాజధానిని శాశ్వతంగా మార్చుకోగలిగాడా ? లేదు. ఇంతలోనే ఆయన కన్న కుమారుడు ఔరంగజేబు చక్రవర్తి సింహాసనాన్ని ఆశించి చక్రవర్తిని, తన సోదరి జహనారాను కారాగారం పాలుచేసి ఆగ్రాకోటలో నిర్బంధించగా షాజహాను శేషజీవితం అంతా తాజ్ మహల్ చూస్తూ విషాదంగా గడపవలసి వచ్చింది. విధి ఎంత విచిత్రమైంది ?

కట్టేవాడొకడైతే నివాసం మరొకరిది. ఎవరికి రాసివుందో వారికేగదా! ఔరంగజేబు మాత్రం? మొగలుల సామ్రాజ్యపు ఆఖరు చక్రవర్తి. సామ్రాజ్య పతనం వంశక్షీణం అతి త్వరితంగా ఆక్రమించాయి. అనేక కుట్రలు కుహకాలకు నిలయమైంది. వైభవోపేతమైన సిరుల కాణాచి రాజభవనం వున్నచోట కలవు. కోటలోపల జరిగే మోసాలు, రక్తపాతం అంతా ఇంతాకాదు. దురదృష్టాల వలయంలో చిక్కుకొని ప్రాణాలు పోగొట్టుకున్న వారిలో 1719లో ఫరూక్ షియార్ నిలువునా నరికివేయబడ్డాడు. 1739లో నాదిర్షా జరిపిన దుర్మార్గాలకు అంతం లేదు. ఎన్నో పుటలు రహస్య చరిత్రకు పుంఖాను పుంఖాలుగా కథలు. 1788లో 2వ షా ఆలం యెడల (ఆనాటి మొగల్ చక్రవర్తి) రోహిలుల సేనాని ఘులామ్ ఖదీర్ నెరపిన రాక్షసత్వం మన్నింపు అనే మాటకు తావీయలేనిది. దాచిన సొమ్ముల ఆచూకి తెలుపమని స్త్రీలందర్నీ కట్టేసి కొరడాలతో కొట్టి హింసించాడు. చక్రవర్తి కళ్ళు పీకించాడు. షా ఆలం కుమారుడు శిశువని అయినా చూడకుండా గొంతుపిసికి చంపాడు. పాతఢిల్లీలోని ఉద్వేగపూరితమైన రోడ్లు వదలి నిర్మల ప్రశాంతత చోటుచేసుకొని రాజ్యం చేస్తుంది యిప్పుడు. కోటగోడల మీదకెక్కి ఒకసారి యమునవైపు దృష్టి సారించితే కనబడేది వికృత వేగాషళ్ళు, రకరకాల వాయిద్యాలతో అడుక్కునే బిచ్చగాళ్ళు, జానెడు పొట్ట కోసం తాటిమీద నడిచే గారడివాళ్ళు, ఎలుగుబంట్లను ఆడించి అడుక్కునే వాళ్ళు ఉండటం గమనించగలం. కోటలోకి ప్రవేశ రుసుం రు. 0-50 పైసలు. శుక్రవారాలు ఉచితం. కోటలోపలి పురాతన వైభవాల కాణాచియైన ప్రదేశాలు చూద్దాం.

లాహోర్ గేటు :

ప్రస్తుతం మనదేశం నుండి స్వతంత్రం వచ్చిన సమయంలో విడిపడిన పాకిస్తాన్‌లోని లాహోరు వైపు చూస్తూండటం వలన ఈ పేరు వచ్చిం దీ ద్వారానికి. కోటలోని జనానాకి షాపింగు సెంటరై ఆనాడు మీనా బజారు అని పిలువబడే ప్రదేశం చిన్న చిన్న షాపులతో ఈనాడు మనకు దర్శనమిస్తుంది. ఆనాడు ప్రసిద్ధి చెందిన నగల వ్యాపారాలు, బంగారు నగల నగిషీల పనితనాలు, పట్టు వస్త్రాలు, ప్రత్యేక జరీ నగిషీల జిలుగులతో తయారించే పనితనపు నేతపని యందు, రంగుల తివాచీలు తీసుకొని వచ్చేవారు, రంగు తలపాగాలు నవాబుల శిరస్సుల నలంకరించేందుకు కొని వచ్చేవారు, సిరుకొలుక ముదమార తెచ్చి యిక్కడ కూర్చొని ప్రదర్శించేవారట రాజీవాసపు జనాలకు, రాజ ప్రముఖులకు. ఈ షాపింగు కాంప్లెక్సు పంచపాళిని దాటితే నౌబత్‌ఖానా చూస్తాం. ఒకప్పుడు ఇక్కడ రకరకాల వాద్య విశేషాలతో సందడిగా ఉండే ప్రదేశం. ఇప్పుడు మాత్రం ఖాళీ ప్రదేశం.

దివాన్-ఇ-ఆమ్ :

ఆనాడు పాదుషావారు ఈ ప్రేక్షక హాలు ఉచితాసనం అధిష్టించి ప్రజల గోడును వింటూ ఫిర్యాదుల్ని విచారించేవారట. పాదుషావారి ఆసన మంటపం మాత్రం అనేక రత్న మాణిక్య స్థగితమైనది. పాలరాయి నిర్మితం. చాలావరకు దుండగుల దండయాత్రల్లో వలుచుకుని పోయారు. ఈ మహా భవన ప్రాంగణాన్ని లార్డ్ కర్జన్ పునరుద్ధరించాడట.

దివానిఖాస్ :

చక్రవర్తి ఆంతరంగిక మంతనాలు, గోష్ఠులు జరిపే సభాస్థలి సుసంపన్నమైన భవనరాజం. ఇక్కడే అతిలోక ప్రసిద్ధి చెందిన నెమలి సింహాసనం రాజసాన్ని చాటుతూ ఉండేది. ఈ సింహాసనాన్ని నాదిర్షా 1739లో ఇరాన్‌కి తరలించక ముందు భవనమధ్యంలో అమరియుండేది. ఇది పూర్తిగా బంగారంతో నిర్మించబడింది. దాని వెనకాల పురివిప్పిన నెమళ్ళ బొమ్మలు, వాటిలో పొదిగిన మణులు, వజ్రాలు రంగురంగుల కాంతులను సింహాసనం మీద ప్రసరింప జేస్తూండేవి. వాటి మధ్యలో ఒకే ఒక పెద్ద యమరాల్డ్ పచ్చలో అందాల రామచిలుక నొకదానిని చెక్కించారు. శిల్ప నైపుణ్యం అద్భుతం. ఇంతవరకూ నభూతో నభవిష్యతేగా చెప్పకోవచ్చు. ఆ చిలుక బొమ్మంతా వెండి, బంగారాలతో చేయబడి ప్రసన్నమైన

ముత్యాలు, మణులు, వజ్రాలు పొదగబడి ఉన్నాయి. దండ యాత్రికుల దుండగీళ్ళ కళ్ళన్నీ దీనిమీదనే. మూసలాసిన బంగారు సింహాసనాలు, విలువైన వజ్రాల నగిషీలు ఎవరి దృష్టి నాకర్షించదు। టెహరాన్ ఇప్పుడు ప్రదర్శించబడే నెమలి సింహాసనం పూర్వపు దాని ముక్కలు మాత్రమే। సింహాసనం తరలివెళ్ళిన తరువాత రత్న మాణిక్యాల కోసం 1760లో దండెత్తిన మరాఠులు కొంత నష్టం కలిగించారు. భవనాంతర్భాగంలో సింహాసనంపైన తాపడం చేసిన వెండిరేకులు ఊడదీసికొని లాక్కుపోయారు. వైభవం వెలవెలాపోతూ పాలిపోయింది నేడు. ఈ దివానిఖాస్ గోడలమీద పర్షియా బాషలో చెక్కబడిన వాక్యాలు ఇంకా మాసిపోలేదు. స్వర్గం అంటే ఇదే, ఇదే, ఇదేనని అర్థంవచ్చే గీతం పాదాలు రెండు.

## రాజుల స్నానాల గదులు: రాయల్ బాత్స్ :

వీటినే హమ్మామ్స్ అని కూడా అంటారు. దివానిఖాస్ మందిరం తరువాత మూడు పెద్ద స్నానాల గదులున్నాయి. మధ్యలో నీటిఫౌంటెన్లు అమర్చబడ్డాయి. వీటిలో ఒకటి ప్రత్యేకం. వేడినీరు, చన్నీళ్ళు గొట్టాలు అమర్చబడి ఫిన్లాండులోని స్నానపు గదుల్లోని ఏర్పాట్లతో ప్రత్యేకంగా విశిష్టతను కలిగియున్న దానిని చూడవచ్చు. ఇది రాజరికపు హోదాలను వెలార్చటంలో ఏ మాత్రం తీసిపోదు. నీటిలోకి సుగంధస్నాన సమ్మిశ్రితాలు కూడా ఉపయోగించబడే వంటారు.

## మోతీ మసీదు :

1659లో ఔరంగజేబు చక్రవర్తి కట్టించిన ముత్యాల మసీదు రెండు మంటపాలు- సావన్ & భాదోన్ అనేపేర్లు పెట్టబడినవి. హయత్‌బక్ష్ అనే ఉద్యానవనంలో ఏర్పాటు చేయబడింది. దర్శనీయం. అంతా పాలరాయితో ముగ్ధ మనోహరంగా రూపొందించ బడింది.

ఇతరంగా- ఇక్కడే ఈ కోటలోనే వెలిసిపోయిందిప్పుడు- కాని ఒకప్పుడు కమనీయమైన చిత్రాలు, రంగు రంగులు వేయబడిన వర్ణచిత్రాలు ఉన్న రంగమహల్ చూడవచ్చు. చక్రవర్తి ఆంతరంగిక మందిరం రెండు విభాగాలుగా, గదులుగా విభజించబడింది. ఒకటి శయనాగారం, రెండు ఆరాధనలు, నమాజులు చేసికొటానికి వినియోగించబడేవి. అక్కడనే ముంతాజ్ మహల్‌లో పురావస్తు ప్రదర్శనశాలగా ఉపయోగిస్తున్నారు. దక్షిణాన ఉన్న ఢిల్లీ గేటు జామిమసీదుకు దారితీస్తుంది.

ప్రతిరోజూ సాయంత్రం సన్ ఎట్ లూమియెర్ (SON ET LUMIE'RE) ఈ కోట చారిత్రక విశేషాన్ని గురించి హిందీలోను, ఇంగ్లీషులోను సౌండ్ & లైట్ షో ప్రదర్శన జరుగుతూంది. టిక్కెట్టు రు. 4/- & రు. 8/-. కాలాన్ని బట్టి వేళలు మారుతూ వుంటాయి. టూరిస్టు ఆఫీసుల్లో విచారించి మరీ ప్రదర్శన తిలకించండి.

ఐరన్ పిల్లర్ :

కుతుబ్‌మీనార్‌కు దగ్గరిలో గల ఇనుప స్థంభం. వాతావరణంలోని మార్పులకు అతీతంగా తుప్పుపట్టనిది, మెరుగు మాయనిది చూడదగినది. క్రీ.శ. 4 శతాబ్దిలో ధార రాజావారు నిర్మించినట్టు ప్రతీతి. ఇదివాల కుతూహలాన్ని కలిగించే విషయం. ఆనాటి కాలంలోనే మూసపోసిన గట్టి స్థంభం. ప్రపంచంలోని మెటలర్జిస్టు లందరూ ఆశ్చర్య పోయారు. ఆ కాలంలో లోహ మిశ్రమాల్ని కరిగించి పోసిన మూస స్థంభంగా పేర్కొనబడింది. ఆనాడు వాసుకి తలమీద నాటిన స్థంభ మిదేనా? ఒక ప్రశ్న. 16 అంగుళాల వ్యాసం- 236.8 అం. ఎత్తుగా ఉన్నది. చంద్రవర్మ స్థంభం అని అంటారు. ఈయన గుప్తుల కాలంనాటి వాడు.

కుతుబ్ మినార్, పరిసరాలు :

ఢిల్లీకి దక్షిణంగా 15. కి.మీ. దూరంలో ఉన్న పెద్ద గోపురం. ఎన్నో రాజరిక వ్యవస్థల రాణింపు, పతనాలు ఎత్తునుండి వీక్షిస్తున్న మౌనసాక్షిగా నిలువబడి ఉన్న కట్టడం- పురాతన ఢిల్లీకి కేంద్ర బిందువుగా చెప్పబడిన మెహ్రావులీ దగ్గర ఉన్నది. తొలినాటి ఆఫ్గన్ నిర్మాణ కౌశల్యానికి మచ్చుతునక ఈ ఐదంతస్థుల బ్రహ్మాండమైన గోపుర కట్టడం. క్రింద అంతస్థు పునాది 15 మీటర్లు- పైకి పోను 2.5 మీటర్లు మాత్రమే వ్యాసంగా ఉన్న ఆకారంగా అమరినది. దీన్ని బానిసవంశపు కుతుబుద్దీన్ ఐబెక్‌దే 1193 నుండి ప్రారంభించబడి మొదటి అంతస్తు 1202 లో ముగించబడింది. మొదటి అంతస్తును మాత్రం కుతుబుద్దీన్ పూర్తి చేశాడు. మిగతా కట్టడం ఆయన వారసులు కాలక్రమేణా కొనసాగించి పూర్తి చేశారు. అయితే 1368లో పై అంతస్తుని మళ్ళీ కట్టించాడు తుగ్లక్ శిఖరాన్నొక దానిని ఏర్పరచి, 1803 లో సంభవించిన భూకంపానికి శిఖరం పడిపోగా 1829లో కొద్ది మార్పులతో మళ్ళీ కట్టించడం జరిగింది. కాని ఒక కథ ప్రకారం హిందూ రాజొకాయన తన కుమార్తె యమునానదీ దృశ్యవీక్షణకై ప్రత్యేకించి ఒంటిస్తంభం మేడగా గట్టించాడని అంటారు. కాని ఇప్పటికీ చరిత్రకారుల నిర్ణయం ఇది కుతుబుద్దీన్‌షా నిర్మించిందేనని. ఇక్కడ

దీనిచుట్టూ అమరియున్న షాపింగు కాంప్లెక్సు భవనాలు మహమ్మదీయుల పరిపాలన మొదలయిన దగ్గరినుంచీ ఉన్నాయని ప్రతీతి.

కువ్వత్-ఉల్-ఇస్లామ్ మాస్క్ :

కుతుబ్‌మినార్ చెంతనే వుంది. భారతదేశంలోనే మొట్టమొదట నిర్మించబడిందిగా చెప్పబడే 'MIGHT OF ISLAM' మసీదు. 1193లో కుతుబుద్దీన్ ప్రారంభించిన ఈ కట్టడం, తరువాతి కాలాల్లో అనేక మార్పులకూ చేర్పులకూ లోనయింది. అసలు మసీదు హిందూ దేవాలయాల పునాదుల మీద నిర్మించబడిందట. ఇక్కడ ఒకనాడు 27 విగ్రహాలు గల పెద్ద దేవాలయం ఉండేదని కొన్ని శాసనాల వలన తెలుస్తుంది. దానికి తగ్గట్లుగా ఇది నిజం అని చాటిచెప్పటానికే అన్నట్లుగా నిర్మాణ క్రమంలో కూడా అనేక హిందూ, జైనరీతుల కట్టడపు శైలులు వివరిస్తాయి. అల్లాఉద్దీన్ కుతుబ్ మీనారుని మించిన కట్టడంగా ఒక జయ స్తంభం నిర్మించాలని తల పెట్టాడు. అయితే అది 27 మీ. ఎత్తు వచ్చేటప్పటికి అతను చనిపోయాడు. అతని కోరికను పూరించటానికి తరువాత వారెవరూ మరలా పూనుకోలేదు. అందువలన అసంపూర్తిగా నిలిచిపోయింది. దీన్ని అలమ్ మినార్ అంటారు. కుతుబ్ మీనారులకు, మసీదులకు ఉత్తరంగా ఉన్నది. ఆగ్నేయంగా అల్లా ఉద్దీన్‌దే అలమ్ దర్వాజాఉంది. 1810లో ఎర్రరాయితో నిర్మించబడిన ఈ ద్వారం కాంప్లెక్సు మొత్తానికి ప్రధాన ద్వారం. గేటు ప్రక్కనే ఇమామ్ జమీన్ సమాధి ఒకవైపు ఉంటే, రెండోదిగా వాయువ్య దిశగా అల్తామిష్ సమాధి కూడా యిక్కడే వుంది- అల్తామిష్ 1235లో మరణించాడు.

ఈ కాంప్లెక్సుకు పడమర దిశగా రాణి రూప్‌మతి విషాద మరణానికి కారణమైన ఆదంఖాన్ సమాధి ఉంది. మాండు రాజ్యంమీద దండెత్తి గెలిచినప్పుడు రాణి రూప్‌మతి మరణం సంభవించింది. తరువాత అక్బరు చక్రవర్తి కోపానికి అసంతృప్తికి కినిసి ఆగ్రాకోట మీంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు ఆదంఖాన్. చివరి మొఘలు చక్రవర్తులు మరికొంత మంది సమాధులు కూడా ఇక్కడే చూడవచ్చు.

ఖాన్-ఇ-ఖానన్ మసీదు :

అక్బరు సేనాని బైరామ్‌ఖాన్ కుమార్తు అబ్దర్ రహీమ్ ఖాన్-ఇ-ఖానన్ కుమారుడి సమాధి మధుర రోడ్డులో నిజాముద్దీన్ దగ్గరవుంది. 1627లో మరణించిన

ఈతడు ఒక మహాకవి. ఈ సమాధి అసలైన పర్షియా దేశపు రీతి నిర్మాణానికి మచ్చుతునక. దర్శనీయం.

**ఖిర్కీమసీదు :**

ఢిల్లీ ఎనిమిదింటిలో నాలుగో నగరంగా పేర్కొనబడిన జహాపనా నగర అవశేషాలకు సమీపంగా ప్రస్తుత మాలవ్యానగర్ దగ్గర ఖిర్కీ అనే గ్రామంలో ఉంది. ఈ గ్రామ నామాన్ని బట్టే ఈ మసీదుకు ఈ పేరు వచ్చిందని చెప్పవచ్చు. పైగా ఈ మసీదుకు కిటికీలు గూడ ఉండటం విశేషం. ఒక రకంగా చెప్పాలంటే నాలుగు మూలలా కోట బురుజులతో కట్టబడిన కోటలాగా కట్టబడింది. నిర్మాణం 14 వ శతాబ్దంలో మహమ్మద్ తుగ్లక్ నిర్మించింది. ఇక్కడే బిజయ్‌మండల్ వేదిక, బేగంపూర్ మసీదులను కూడా చూడగలం.

**గురుద్వారా :**

శిఖ్ఖుగురు ద్వారా చాందినీచౌకు బజారులో ఖిల్లాకు కుడివైపున అమరియున్న శిఖ్ఖులకు పవిత్రస్థలం. చలువరాతితో నిర్మించబడింది. పైన బంగారు శిఖరాలు అమరియున్నవి. అందరూ దర్శించవచ్చు.

**గౌడియామఠము :**

హనుమాన్ మందిరానికి దగ్గరలో ఉన్నది. మేడమీద రాధాకృష్ణ మందిరము రమణీయంగా చూడదగినదిగా ఉంటుంది.

**ఘియాసుద్దీన్ సమాధి :**

బ్రహ్మాండమైన రాతి కట్టడం. మధ్యమధ్య పాలరాయి ఉపయోగించబడింది. ఎదురుగా షడ్భుజి ఆకారంలో కొన్ని బురుజులు ఆవరించిన ఒక అందమైన సరస్సు కూడా ఉంది. తుగ్లకాబాయి కోట ఎదురుగా బాదర్‌పూర్‌రోడ్డు మీద ఉంది.

**జంతర్ మంతర్ :**

సంసద్‌మార్గ్ (పార్లమెంటు వీధి)లో రాజా జయసింగుచే 1724లో నిర్మించబడిన నక్షత్ర వేధశాల. ఇదే విధంగా రాజా జయసింగు జైపూరు, వారణాసి, మధుర, ఉజ్జయిని నగరాల్లో కూడా ఇలాంటి నక్షత్రశాలలు నిర్మించాడు. ఆ కాలంలో ఖగోళ శాస్త్ర అధ్యయనానికి ఉపయోగకారిగా దోహదపడిన అద్భుతమైన ఆరు నిర్మాణాలు

ఇవి. కట్టడాలన్నీ గూడా ప్రఖ్యాత. వాస్తురేఖా శాస్త్రగణిత చిత్తరవులుగా కన్పిస్తాయి. దీనిలో ముఖ్యమైనది- స్మ్రాట్ యంత్రం అనే సన్‌డయల్- భాస్కర గడియారం ఇదే అన్నిటికంటే పెద్దది. మిగతా అయిదుకట్టడాలు యితరగ్రహముల చలనాలను, కదలికలను గమనించటానికి ఉద్దేశించబడినాయి. జంతర్‌మంతర్ కెదురుగా ఇటీవల ఢిల్లీ హౌసింగు కార్పోరేషన్ వారు ఢిల్లీ నగరం మొత్తంమీద మకుటాయమానంగా వుండే అతి ఎత్తైన భవనం నిర్మించారు.

జామి మసీదు :

ఎర్రకోటకు ఎదురుగా చాందినీ చౌకుకు దక్షిణంగా ఉన్న ఒక బృహత్తరమైన కట్టడం. ఇది దేశంలోనే కాదు ప్రపంచంలో కెల్లా పెద్ద మసీదుగా చెప్పుకోవటం పరిపాటి. షాజహాను చక్రవర్తిచే నిర్మించబడిన ఆఖరు నిర్మాణం అని అంటారు. క్రీ.శ. 1644 ఆరంభించబడి 1658లో పూర్తి చేయబడింది. దీనికి మూడు ప్రధాన ద్వారాలున్నాయి. నలుచదరపు గోపురాలు, రెండు స్తంభాలు 40 మీటర్ల ఎత్తున నింగిని చూస్తున్నాయి. నిలువుగా ఎర్రరాయి, పాలరాతి వరసలు ఒకదాని తరువాత ఒకటిగా పట్టీలు పట్టీలుగా పేర్చుకుంటూ నిర్మాణంసాగింది. రెండు రూపాయలు టిక్కెట్టు తీసికొని విశాలమైన మెట్లమీదుగా ఏదైనా ఒక స్తంభంమీద వరకు ఎక్కవచ్చు. అయితే స్త్రీలు గనుకయితే ఆమెలో ఎవరైనా ఆమె భర్తగానీ, రక్త సంబంధీకులైన తండ్రి, సోదరులు ఏ ఒకరైనా బాధ్యతగలిగిన వ్యక్తి తోడుంటేనే ఎక్కడానికి అనుమతి లభిస్తుంది. మసీదు తూర్పువైపు నుండి చూస్తే ఎర్రకోట వ్యూ బహు చక్కగా కనపడుతుంది. మహమ్మదీయేతరులకు మసీదు మ. 12.30 నుండి సా. 2.30 వరకు ప్రవేశం ఉండదు. గమనించవలసిన అంశము. మొగల్ శిల్ప నిర్మాణ శైలికి మచ్చుతునక. ఈ మసీదు చాల పవిత్ర స్థలంగా ఎంచబడుతుంది ఎందువలననగా మహమ్మదు ప్రవక్తయొక్క గడ్డంలోని కేశ విశేషం, ఆయన పాద రక్షలు, హోలీఖురాను నుండి ఆయన ముఖతః వెలువడిన ఒక భాగం మహా ప్రసాదంగా భద్రపరచబడ్డాయి యిక్కడ. పవిత్ర దినాల్లో కొన్నివేల మంది నమాజు చేయటానికి పెద్ద సంఖ్యలో హాజరవుతారు.

జూ :

పురానాకిల్లాకు దక్షిణంగా ఉంది జంతుప్రదర్శనశాల చలికాలంలో జంతువు లన్నింటినీ లోపలకు పంపిస్తారు. చూడటానికి సరిగా వీలుండదు. బోనులు వగయి

రాలు చాలా పాతబడి పోయాయి. వీటిలో ముఖ్యం తెల్లిబెబ్బులిని చూడవచ్చు. అరుదైనది. ఉదయం 8 నుండి సా. 6 గం. వరకు వేసవి కాలంలోనూ ఉ. 9 గం. - సా. 5 గం. ల వరకు చలికాలంలోను చూడవచ్చు. టిక్కెట్టు రు. 0-50 మాత్రం.

పార్లమెంటు భవనం :

కొత్తఢిల్లీ-దీన్నే హిందీ (నేటి జాతీయ భాష)లో 'సన్‌సద్ భవన్' అని అంటారు. సన్‌సద్‌మార్గ్ లేక పార్లమెంటువీధి చివరన ఉన్నది. రాజ్‌పథ్‌కి ఉత్తరంగా ఉంటుంది. కొత్తఢిల్లీ నిర్మాణ క్రమంలో కీలక కేంద్రం. సరిగ్గా ఒక సరళరేఖ గీస్తే క్రిందకు పార్లమెంటు వీధి- కన్నాట్ ప్లేస్‌ని దాటిపైన జామి మసీదునుకూడా కలుపుకొంటుంది. 171 మీటర్ల వ్యాసము చుట్టూ వృత్తాకారంలో నిర్మించబడిన బ్రహ్మాండ భవనరాజం. ఇక్కడే మన దేశపు ప్రజా ప్రతినిధులందరూ సమావేశమయి పూర్వ కార్యక్రమాల సింహావలోకనం, భవిష్యత్తు నిర్ణయం, దేశం మొత్తంలో కేంద్ర ప్రభుత్వ శాసనాలు వగయిరాలు, అమలు తీరులు చర్చించబడి నిర్ణయించే మంత్రాలోచన సభామందిరం. చూడదగినది.

పురానా ఖిల్లా :

మహాభారత కథానాయకులు పాండవుల రాజధాని నగరం ఇంద్ర ప్రస్థమనే నగరం. అసలైన ఢిల్లీ ఇదే. ఈ కొండమీదనే పాండవుల కోట. ఆ శిథిలాల మీదనే 1580లో హుమాయూన్ పాదుషా విశాలమైన కోటను కట్టించి ఆరంభించాడు. అయితే ఇంతలో 1588లో హుమాయూన్ పాదుషాను ఓడించిన ఆఫ్గన్ పాలకుడు షేర్‌షా ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించి ఈ కట్టుబడిని 1541లో పూర్తి చేశాడు. మరల 1548 ప్రాంతంలో హుమాయూన్ ఢిల్లీ సింహాసనాన్ని చేజిక్కించుకున్నాడు.

ప్రస్తుతం ఇండియా గేటుకి ఆగ్నేయ దిశలో హుమాయూన్ సమాధి ఉత్తరంగా నిజాముద్దీన్ రైల్వే స్టేషనుకు దగ్గరలో ఈ పురానాఖిల్లా ఉంది. ఈ బ్రహ్మాండమైన కోటలో చూడదగినవి- షేర్‌షామసీదు, (దీన్నే ఖిలా-ఇ-కుహనాన్ అంటారు) మరియు అష్టభుజి ఆకారంలో ఎర్రరాయితో కట్టబడిన 'షేర్ మంజిల్' తరువాత హుమాయూన్ లైబ్రరీగా ఉపయోగించబడింది. 'షేర్‌మంజిల్' పాదుషా వారు జారి పడి దెబ్బతిని మరణించారట. ఈ కోట ఇండో-ఆఫ్గన్ నిర్మాణ కౌశల్యా మేళవింపు

నకు ప్రతీక. షేర్‌మంజిల్ వెనకాల ఉన్నటువంటి ప్లాట్‌ఫారమ్ మీద నుంచి చూస్తే ఇక్కడ నిర్వహించబడిన త్రవ్వకాల పొరల అడుగున ప్రాచీన శిధిలాల అవశేషా లెన్నో మనల్ని చరిత్ర అడుగున దాగిన రహస్యాలు సంబోధక మవుతాయి. బహుశా ఇక్కడే పాండవుల మయసభ సుయోధనాదుల మచ్చరానికి కారణమైంది కూడా ఉండి ఉండవచ్చు.

ఫిరోజ్ షా కోట్లా :

ఢిల్లీ ఐదవ నగరం ఫిరోజాబాదు శిధిల పునాదులమీద 1354 లో ఫిరోజ్ షా తుగ్లక్ కట్టించాడు. పాత కొత్తఢిల్లీల మధ్యన ఉంది. దగ్గరలో జామిమసీదు శిధిలమై ఉంది. దండయాత్ర చేసిన తైమూరు ఇక్కడ ప్రార్ధనలు జరిపాడు. మత ఛాంద సత్వం పరాకాష్ఠలో ఉన్నప్పుడు కట్టించబడిన బ్రహ్మాండమైన కట్టడం. కోటలోపలే అశోక స్తంభం ఉంది. (చూ. అశోక స్తంభం).

తుగ్లకాబాదు :

ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాధి ఎదురుగా బాదర్‌పూర్ రోడ్డుమీద తుగ్లకాబాదు కోట శిధిలాలున్నాయి. ఢిల్లీ 3వ నగరంగా పేర్కొనబడిన ఈ నగరాన్ని తుగ్లక్ నిర్మించాడు. నగరంచుట్టూ పెద్ద గోడలున్నాయి. కుతుబ్ మీనారుకు తూర్పుదిశన అమరి ఉన్నది. 13 ద్వారాలున్నాయి. ఈ మహాకట్టడం వెనుక ఒక కథవుంది. నిజాముద్దీన్ అనే మహమ్మదీయ ఋషితుల్యుడు ఒక పెద్ద ప్రార్ధనా మందిరం కట్ట టానికి ఉపక్రమించాడు. అయితే ఘియాసుద్దీన్ అదే సమయంలో తలపెట్టిన కోట నిర్మాణానికి నిజాముద్దీన్ ప్రార్ధనా మందిరం పనిమీద ఉన్న శిల్పులను పనివారలచే ఆపని ఆపించి తన భవన నిర్మాణానికి ఉపయోగించారట. ఈ బ్రహ్మాండ భవన సముదాయం రికార్డు టైములో పూర్తిచేశారు. అప్పుడు నిజాముద్దీన్ శపించారట. ఆ శాపకారణంగా అంత మహేంద్ర భవనంలాటి కోట బూజుపట్టి 15 సంవత్సరాల్లో నిర్జనమై గచ్చులు పుచ్చులు పెరిగి దెయ్యాల కొంపలా తయారైంది. ఈ నాటికీ అలాగే వుంది. ఈలోపునే ఘియాసుద్దీన్ చంపబడ్డాడు. అతని హత్యాసంఘటన 1325 జరిగిందట. కోటలో దక్షిణ భాగంలో మానవ నిర్మితమైన సరస్సు అందులో మధ్యగా పాదుషావారి సమాధి వుంది.

రాజఘాట్ :

ఫిరోజ్‌షా కోట్లాకు ఈశాన్యంగా యమునానదీ తీరాన నల్లటి పాలరాయితో కట్టిన చతురస్రాకారపు ప్లాటుఫారం— జాతిపిత గాంధీమహాత్ముని అంత్యక్రియలు జరిగినచోటు స్మారకంగా నిర్మించబడింది. గాంధీ మహాత్ముడు మన దేశానికి స్వతంత్రం సమకూర్చటానికి అహింస, సత్యాగ్రహమనే ఆయుధాలతో పోరాడి బ్రిటిషువారిని దేశంనుండి పారద్రోలి, దేశమాత దాస్యశృంఖలాలను ఛేదించిన ధీశాలి మహాత్ముడు. 1948 జనవరి 30వ తేదీన నాధూరామ్‌గాడ్సె అనే ఆయన తుపాకి కాల్చి అంతం చేశాడు మహాత్ముని. ప్రతి శుక్రవారం అక్కడ భజనలు ఉత్సవాలు జరుగుతాయి. ప్రతి జనవరి 30వ తేదీ మహాత్ముని దేశంలోను, విదేశాల్లోను ప్రపంచ మంతటా స్మారకోత్సవాలు వర్ధంతులు జరుగుతాయి. మొట్ట మొదటి స్వతంత్ర భారతదేశ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ వారి అంత్యక్రియలు గూడ ఇక్కడనే జరిగి వారికికూడా స్మారకచిహ్నం ఏర్పరచబడింది. ఇటీవలి ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీకిగూడా ఇక్కడే అత్యక్రియలు జరుపబడింది. రాజఘాట్ ఇప్పుడు దేశ విదేశ ప్రముఖులు సైతం ఇండియా సందర్శనానికి వచ్చినపుడు మొదటగా ఇక్కడికి వచ్చి దివంగత నాయకులకు నివాళులర్పిస్తుంటారు బహూధా.

రాష్ట్రపతి భవనం :

రాజసం వుట్టిపడేవిధంగా ఈ శతాబ్దపు తొలి ఇరవైలలో 330 ఎకరాల స్థలంలో సమున్నతమైన స్థలంలో నిర్మించబడిన బ్రహ్మాండమయిన రాజభవనం. ఆనాటి బ్రిటిషు వైస్రాయిలు ఉండటానికి నిర్మించబడింది. 340 గదులు ఉన్న ఈ భవనం రిపబ్లిక్ ఇండియా ప్రెసిడెంటు నివాసంగా ఉంటుంది. ఇందులో విశాలమైన హాల్సు, విదేశీప్రముఖులను సాదరంగా ఆహ్వానించి వారి ఉన్నతికి తగినట్లుగా మర్యాదలు సలపటానికి వన్నెవాసి తగ్గకుండా ఉండే విధమయిన ఆవాసాలు, ఒక గ్రంథాలయం, మొగలు రీతుల్లో ఒక చక్కని ఉద్యానవనం చూడదగిన విశేషాలు.

విదేశీయులకు టూరిస్టు ఆఫీసు ఆఫ్ గవర్నమెంటు ఆఫ్ ఇండియా అధికారులు ప్యాసులు ఇస్తారు. స్వదేశీయులకు భవనంలోనే మిలటరీ సెక్రటరీ టు ది ప్రెసిడెంటు వారు ప్యాసులు ఇస్తారు. యధేచ్ఛగా దర్శించవచ్చు. అయితే ప్యాసులు మాత్రం తప్పనిసరి.

లక్ష్మీనారాయణ ఆలయం :

1938 లో నిర్మించబడిన ఆధునిక శాస్త్రీయ దేవాలయాలకు ప్రతీక. పండుగ లకు, ప్రతి మంగళవారం ప్రత్యేక ఆరాధనలు అర్చనలుంటాయి. కాళికాలయం ప్రక్కనగల కాళిబాడిమార్గ్‌లో ఉంది. ఆలయ కుడ్యాలమీద వేదములనుండి, ఉపని షత్తులోనుండి, పురాణేతిహాసములనుండి సూక్తులు, కీర్తనలు, ఉపదేశములు రమణీ యంగా చిత్రీకరించబడ్డాయి. మహాత్మాగాంధీ సంరంభంగా ప్రతిష్ఠించిన శ్రీ లక్ష్మీ నారాయణ మూర్తులు పాలరాతితో నిర్మించబడ్డాయి. ప్రతిష్ఠ 1938 మార్చి 18 వ తేదీన జరిగింది. ఆలయ నిర్మాతలు సుప్రసిద్ధ పారిశ్రామికవేత్త శేట్ బలదేవ్ దాస్ బిర్లా. దీనిని బిర్లామందిర్ అని అంటారు.

లోడీ సమాధులు :

ఇండియాలో అంతర్జాతీయ కేంద్రంగా ప్రసిద్ధి చెందినవి అద్భుతవనాలు లోడీ గార్డెన్స్. సుందరమైన ఈ ఉద్యానవనాల్లో 15, 16 శతాబ్దాలకు చెందిన లోడీ వంశపు చక్రవర్తుల సమాధులున్నాయి. లోడీ గార్డెన్స్ వున్న రోడ్డుకూడా లోడీ రోడ్డుగా ప్రసిద్ధి. ఇక్కడే సయీద్ వంశపువారి సమాధికూడా ఉంది. అన్నింటి లోను సికిందర్‌లోడి సమాధిని ఆయన కుమారుడైన ఇబ్రహీంలోడీ కట్టించినది దృశ్య మానంగా కళాత్మకంగా ఉంటుంది. మహమ్మదు షా సమాధి అపూర్వ కళాఖండం- తరువాతి మొగల్ రీతిలో కట్టబడిన హుమాయూన్ సమాధికి ప్రాతిపదికగా హుమా యూన్ సమాధి తదుపరి కట్టించబడిన ప్రపంచ అద్భుత కట్టడంగా ప్రసిద్ధిచెందిన తాజ్‌మహల్‌కి ప్రాతిపదిక- పునాది. సికందర్‌లోడి, ఇబ్రహీమ్‌లోడి, సద్ధర్‌జంగ్ సమాధి, ముబారక్ షా సమాధి మొదలయినవన్నీ ఇక్కడొక చోటే సముదాయంగా చూడగలం. ఇక్కడే బారాగుంబాద్ మసీదుకూడా చూడవచ్చు. పెద్ద ఉన్నతమైన డోము, గోడలన్నీ అనేక పుష్పజాతులు చిత్రించబడి సొగసులీనే వ్రాతలో పవిత్ర ఖురాను సూక్తులు లిఖించడినవి చూడవచ్చు. ఇక్కడే ఒక పేరు తెలియని మహా త్ముడి గోరీ ఉందని చెప్పుకుంటారు. ఈ మసీదు చక్కని ప్లాస్టర్ అలంకారానికి చక్కటి ఉపమానం.

సఫ్దర్‌జంగ్ సమాధి :

సఫ్దర్‌జంగ్ ఎయిర్‌పోర్టు దగ్గర 1753-54 ల్లో కట్టబడిన అవుధీ నవాబు తన తండ్రి సఫ్దర్‌జంగ్ వారికి సమాధి నిర్మించాడు మొగలాయి శిల్పకళకు ప్రత్యే

కంగా ఉపమానంగా చెప్పుకోవచ్చు. సమున్నతమైన చదరంమీద నిర్మించబడింది. ఇక్కడే దివంగత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ కుమారుడు సంజయ్‌గాంధీ ప్లేన్ ఏక్సిడెంటులో మరణించినచోటు. ఈయన అకాలమరణం 1980 లో జరిగింది.

## హజరత్ నిజాముద్దీన్ :

నిజాముద్దీన్ అవులియా సుప్రసిద్ధ సూఫీప్రవక్త. ఆనాటి రాజకీయాల్లో కూడా ఈయన ప్రభావం ఎంతోవుందని ప్రతీతి. ఆయన సమాధి, ప్రక్కనే పాల రాతితో కట్టిన అందమైన మసీదు చూడదగినవి. ఇక్కడే మధురమైన ఉర్దూకవి మీర్జాగాలిబ్ (1797-1869) వారి సమాధికూడా ఉంది. షాజహాన్‌కి అతి ప్రియమైన కుమార్తె జహనారా సమాధి, అనతి దూరంలోనే సుప్రసిద్ధ చరిత్ర కారుడు, సంగీత విద్వాంసుడు అమీర్ ఖుస్రూ సమాధికలు కూడా ఉన్నాయి. ఖుస్రూ హజరత్ నిజాముద్దీన్‌కి సమకాలికుడు.

అలి షాజహాన్ వైభవానికి హద్దుల్లేవు. ఒకసారి ఆయన కుమార్తె జహనారా కట్టుకున్న సన్నని వలిపెం నిప్పంటుకుని వళ్ళు గాయమైంది. చక్రవర్తి అన్ని పనులు మానుకుని దగ్గర కూర్చుని మందులురాస్తూ దివారాత్రాలు పరిచర్యలు చేస్తుండేవాడు. అయితే వైద్యులందరూ నిస్సహాయులయ్యారు నయం చేయలేక. ఆ సమయంలో అరీఫ్ అనే ఆయన మంత్రం వేసినట్లు మాయంచేశాడు గాయాల్ని. అరిఫ్‌ని బంగారంతో తులాభారం జరిపి బంగారమంతా ఆయనకిచ్చి ఘనంగా సన్మానించాడు. దానికి ప్రతిగా ఆమె తండ్రి కారాగారం పాలయినప్పుడు చక్రవర్తికి చేదోడు వాదోడుగా సపర్యలు చేస్తూ ఆయనతోనే చివరి వరకూ ఉండిపోయింది చెరసాలలోనే. ఇది ఒక అపూర్వ సంఘటన. తండ్రిని సాకవలసిన కొడుకు జైల్లో పెట్టాడు— ఎక్కడో వుండవలసిన ఆడపిల్ల తండ్రికి సైదోడుగా నిలిచి కష్టాల్లో పాల్గొన్న చారిత్రిక విశేషం- చెప్పుకోతగింది.

## హౌజ్ ఖాస్ :

1305 లో అల్లాఉద్దీన్ ఖిల్జీ నిర్మించిన ఒక పెద్ద రిజర్వాయర్- ఢిల్లీ రెండవ పట్టణమైన 'సిరి'కి చెందింది. ప్రస్తుతం సఫ్దర్‌జంగ్ కుతుబ్‌మీనార్ రోడ్డుమీద సరిగ్గా మధ్యలో ఉంది. దీనికి ప్రక్కనే ఫిరోజ్‌షా సమాధి చూడదగినది. ఫిరోజ్ షా 14వ శతాబ్దం చివరివాడు. దగ్గరనే ప్రాచీన కళాశాల నౌకదాన్ని కూడా చూడగలం.

హుమాయూన్ సమాధి :

హుమాయూన్ భార్య హాజిబేగమ్, 16వశతాబ్దం మధ్యలో నిర్మించింది హుమాయూన్ సమాధి. హుమాయూన్ రెండవ మొగలు చక్రవర్తి. బాబర్ కుమారుడు. మొగలు తొలినాళ్ళ శిల్ప రీతులకిది మచ్చుతునక. చుట్టూ ఉద్యానవనాలు-మధ్యలో సమాధి—పైన అమరియున్న పెద్ద దోములు—తాజ్‌మహల్ ఆగ్రాలో నిర్మించబడటానికి ప్రాతిపదిక. ఇక్కడనే హాజీబేగమ్ కూడా ఖననం చేయబడ్డారు. అందుకు చిహ్నంగా తెలుపు నలుపు పాలరాళ్ళ కలనేతతో కట్టబడింది. ఇక్కడ ఇంకా హుమాయూన్‌గారి క్షురకుడుకి, కుడివైపున ఇసాఖాన్ సమాధులు అమరియున్నాయి. ఆఫ్గన్ పఠానుల నిర్మాణ వైచిత్రికి మంచి ఉదాహరణంగా నిలుస్తుంది ఇసాఖాన్ సమాధి. ప్రవేశ రుసుం 50 పైసలు. శుక్రవారాలు ఉచిత దర్శనం. హుమాయూన్ సమాధి కట్టడం మీదినుండి చుట్టుప్రక్కల రమణీయ గ్రామీణ దృశ్యాలు కమనీయం. మొదటి వరుస మెట్లు ఎక్కంగానే ఎడమవైపున ఈ సమాధి సముదాయం నిర్మించిన నిపుణులు 5గురు ఇంజనీర్లకు కూడా సమాధులు నిర్మించి హాజీబేగమ్ వారికి ధన్యవాదాలు తెలిపినట్లుగా అందించిన నివాళిగా పేర్కొనబడింది.

హనుమాన్ మందిరం :

అతి ప్రాచీనమైన ఆలయం. ప్రతి మంగళవారం విశేషార్చనలు జరుగుతాయి.

ముఖ్యమైన మ్యూజియంలు :

ఢిల్లీ నగరం మొత్తం ఒక పురావస్తు ప్రదర్శనశాల. ఇందులో ఎన్నో విశేషాల్తో చూడదగిన మ్యూజియంలు, ప్రత్యేక ప్రదర్శన వసారాల గాలరీలు ఇంకా ఎన్నో: వాటిలో కొన్ని ఎన్నదగినవి.

నేషనల్ మ్యూజియం :

రాజపథ్‌కి దక్షిణంగా జనపథ్ మీద ఉన్నదీ పురాతన వస్తు ప్రదర్శనశాల. ఇందులో అతి ప్రాచీన కాలానికి చెందిన కంచు, ఇత్తడి మొదలైన లోహవిగ్రహాలు, జేగురు రంగు మట్టితో చేయబడిన టెర్రకోటా పనితనాల విగ్రహాలు, నగిషీలు చెక్కబడిన కొయ్య విగ్రహాలు, అనేక నగిషీ డిజైనులు, దక్షిణాదిన విజయనగరసామ్రాజ్య కాలానికి చెందిన కుడ్యచిత్రాలు, అనేక జాతుల అలంకార వస్త్రవిశేషాలు మొదలైన

వెన్నో వివిధ కాలాలకు చెందినవి మరెన్నో చూడవచ్చు. ప్రతిరోజూ గం. 10 నుండి సా. 5 గం. వరకు దర్శనీయం. సోమవారాలు మాత్రం సెలవు. శని, ఆది వారాలు ఉచితంగానే దర్శించవచ్చు. వారంలో అనేకంగా చిత్రప్రదర్శనలు కూడా ఉంటాయి.

## నెహ్రూ మ్యూజియం :

చాణక్యపురి దగ్గర తీన్‌మూర్తిరోడ్డులో మొట్టమొదటి స్వతంత్ర భారతప్రధాని నెహ్రూ జీవితానికి సంబంధించిన అనేక వస్తువులతో ఆయన జీవితం మొత్తాన్ని సమన్వయపరుస్తూ ఆయన నివాసాన్నే నెహ్రూ మ్యూజియంగా అమర్చారు. టూరిస్టు సీజనులో భారత స్వాతంత్ర్య సమరం అందులో ప్రధాని పాత్ర విశేషాలుగా సౌండ్ అండ్ లైట్ ప్రదర్శనలుంటాయి. ప్రవేశం ఉచితం. ప్రతిరోజు ఉ. 10 గం. నుండి సా. 5 గం. వరకు దర్శనీయం. సోమవారాలు సెలవు.

## రైలు ట్రాన్సుపోర్టు మ్యూజియం :

చాణక్యపురిలో వుంది. చాణక్యపురి పరిపూర్ణమైన డిప్లొమాటిక్ సెంటరు. చూచినవారు ఆశ్చర్యపోక తప్పదు. 1855 నుంచి రకరకాల రైలు ఇంజన్లు పోగు చేసి ఇక్కడ ప్రదర్శిస్తున్నారు. అనాటి రైలు ఇంజను ఇంకా నిక్షేపంగా పని చేస్తుండటం మెచ్చుకోతగింది. పిటికితోడు మరెన్నో అరుదైనవి కూడా ప్రదర్శనలో చోటు చేసుకన్నాయి. 1894లో ఒక మెయిల్‌ని మోదిన ఏనుగు తల ప్రదర్శన యోగ్యంగా అట్టిపెట్టారు. రకరకాల రైలు ఇంజన్లు, వివిధ కాలాల్లో జరిగిన అభివృద్ధి వివరాలు గల సమాచారం అందిస్తున్నారు ఇక్కడే మరో చోట. ప్రదర్శనకాల ఉ. 9. 30 గం. నుండి మధ్యాహ్నం 1 గం. వరకు మరల 1–30 నుండి సా. 5 గం. వరకు చూడవచ్చు. సోమవారాలు సెలవు. ప్రవేశ రుసుము రు. 2 లు. ఫోటోలు తీసుకోవాలంటే మరో రు. 5 లు కట్టడి.

## టిబెట్టు గృహం :

చిన్న మ్యూజియం. అద్భుతమైంది. దీనిలో దలైలామా టిబెట్టును వదిలి పారిపోయినప్పుడు అనేకమయిన సాంప్రదాయక విధుల పరమైన వస్తు సముదాయం ఇక్కడ ప్రదర్శిస్తున్నారు. క్రింది భాగంలో అనేకమయిన టిబెట్టు హస్తకళానైపుణ్యాన్ని వెలువరిచే వస్తువులు అమ్మే విక్రయశాల ఉంది. ఇక్కడ తరచుగా గోష్టులు

ఉపన్యాసాలు జరగడం కూడా కద్దు. ఈ అందాల చిన్న మ్యూజియం ఓబెరాయ్ న్యూఢిల్లీ హోటలు దగ్గర, 16 జోర్‌బాగ్‌లో వున్నది.

ఏప్రియల్ నుండి సెప్టెంబరు వరకు దర్శనీయ సమయాలు. ఆదివారాలు తప్ప మిగతా రోజుల్లో ఉ. 9-30 నుండి 1గం. వరకు, మధ్యాహ్నం 2-30 నుండి 6 గంటల వరకు-మిగతాకాలం ఉ. 9 నుండి 1గం. వరకు మధ్యాహ్నం 2గం. 5 గం. వరకు మాత్రం.

## ఇంటర్నేషనల్ డాల్స్ మ్యూజియం :

బొమ్మలు-బొమ్మలు-ఎక్కడ చూచినా బొమ్మలు- 85 దేశాల బొమ్మలు. ప్రపంచం నలుమూలలనుండి తెచ్చిన అనేకం- సుమారు 6000 బొమ్మలు- ప్రదర్శన. బహదూరుషా జఫర్ మార్గంలోని నెహ్రూ హౌస్‌లో ఈ ప్రదర్శన ఉంది. వీటిలో 3వ వంతు మన భారతదేశంలోని వివిధ ప్రదేశాల్లోవి. 500 బొమ్మలయితే ప్రత్యేకంగా భారతదేశంలో వాడే వివిధ వస్త్రాల ధారణతో కనువిందు చేస్తాయి. ఎన్నో సాంప్రదాయక వస్త్రధారణలు. సోమవారాలు సెలవు. ప్రవేశ రుసుము రు. 0-50 పైసలు పెద్దలకు, పిల్లలకు 0-25 పైసలు మాత్రం. అందరూ దర్శించవచ్చు.

## క్రాఫ్ట్స్ మ్యూజియం :

మధురారోడ్‌లో ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో అది పెవిలియన్‌కి ఇటీవలే మార్చబడింది. ఇందులో హస్తకళానైపుణ్యాన్ని, కౌశల్యాన్ని వెలువరించే వస్త్ర విశేషాలు, గృహోపయోగ అలంకరణలకు పనికి వచ్చే నగిషీ సామానులు, లోహపు తయారీలు, కొయ్య, పింగాణీ వస్తువులనేకం చూడవచ్చు. ముఖ్యంగా సంస్కృతీ సాంప్రదాయానుసారంగా తయారు చేయబడినవే యివన్నీ. ప్రత్యేక అంశంగా గ్రామీణ భారత జీవితాన్ని ఢిల్లీలో వుండే దర్శించగలం ఈ విభాగంలో. ప్రొద్దున 9-30 గం. నుండి సా. 4-30 గం. వరకు. ఆదివారాలు సెలవు దినం. ప్రదర్శన ఉచితం.

ఇవిగాక ఇంకా — నేచురల్ హిస్టరీ మ్యూజియం, నెపాలీస్ దౌత్య కార్యాలయం దగ్గర ఉన్నది. బారాకంభా రోడ్డు - పురాతన సరీసృపడైనోసారస్ మోడలు ముఖద్వారం దగ్గర దర్శనమిస్తూ భూమి మీద జీవరాసి జనించిన దగ్గరనుండి మానవుని ఆవిర్భావం, పెరుగుదల వగైరా చారిత్రక విశేషాలను తెలిపే జంతు కళేబరాలు, నమూనాలు అనేకం చూడగలం. ఉ. 10 గం. నుండి సా. 5 గం. వరకు

దర్శనీయం. తీస్ జాన్యువరీ మార్గలో గాంధీ బలిదానిస్థాన్ దగ్గర బలిదానం జరిగిన చోటు. ఆ తేదీ పేరునే రోడ్డుకి సార్థక నామధేయంగా వుంచి ఆ స్థానంలో జాతిపిత మహాత్మా గాంధీ జీవితవిశేషాలు, స్వాతంత్రోద్యమంలోను, జనజాగృతంలోను ఆయన వహించిన ముఖ్య పాత్రను తెలియజేసే విధంగా ప్రదర్శించుతున్నారు.

జాతీయ స్టాంపుల మ్యూజియం, నేషనల్ ఫీలాటెలిక్ మ్యూజియం పార్లమెంటు వీధిలో సర్దార్ పటేల్ చౌకులో 'డాక్‌తార్ భవన్'లో ఏర్పాటు చేయబడింది. ఆదివారాలు సెలవు.

పాలం విమానాశ్రమంలో ఎయిర్‌ఫోర్స్ మ్యూజియం ఉ. 10 నుండి మధ్యాహ్నం 1-30 వరకు దర్శనీయం. మంగళవారాలు సెలవు.

ప్రసిద్ధి చెందిన మ్యూజియంలకు తోడు ఢిల్లి మహానగరంలోగల ఆర్టు గాలరీలు విశేష వస్తు సముదాయం గలవి అనేకం. దేశం మొత్తంమీద పేరు పొందిన కళాకారుల, నైపుణ్యంగల పనివారల కళాఖండాలు కంటికి, ఇంటికి శోభను గూర్చేవిగా ఎన్నోకోవచ్చు వీనిలో. మన జేబువసతిని బట్టి అమర్చుకోవచ్చు. వానిలో ముఖ్యమైనవిగా :-

1. ఆల్‌ఇండియా ఫైన్ ఆర్ట్సు & క్రాఫ్ట్స్ సొసయిటీ | రఫీమార్గ్,
2. ఫైన్ ఆర్ట్సు గాలరీ | న్యూఢిల్లి.
3. బ్లాక్ ప్రింటిడ్స్, C-8, స్టేట్ ఎంపోరియా కాంప్లెక్సు, బాబాఖరన్ సింగ్ మార్గం.
4. ఢిల్లి శిల్పిచక్ర, శంకర్ మార్కెట్.
5. ధూమిమల్ ఆర్టుగాలరీ, కన్నాట్‌ప్లేస్,
6. గాలరీ చాణక్య, చాణక్యపురి.
7. గాలరీ ఆమ్రపాలి, DIA. గ్రీన్‌పార్క్.
8. గాలరీ లలిత్‌కళా అకాడమి & యవనిక, సంగీత, నాటక, అకాడమి, రవీంద్ర భవన్, ఫిరోజ్‌షా రోడ్డు.
9. గీతాగాలరీ, ఒబెరాయ్ ఇంటర్ కాంటినెంటల్, డా. జాకీర్‌హుస్సేన్ మార్గం.
10. నేషనల్ గాలరీ అఫ్ మోడరన్ ఆర్టు, జయపూర్ హౌస్.

11. కోణార్క్ ఆర్టు గాలరీ, ఇంపీరియల్ హోటల్, జన్‌పథ్.

12. కుమార్ ఆర్టు గాలరి, సుందర్‌నగర్.

13. కునిక చెమోల్డ్ ఆర్టు సెంటర్, కాటేజ్ ఇండస్ట్రీస్ బిల్డింగ్, జనపథ్.

14. శ్రీధరణి గాలరీ, తాన్‌సేన్ మార్గం.

పైవన్నీ న్యూఢిల్లీలో వయితే— పాతఢిల్లీలో, చాందినీచౌక్‌లో ఉన్న మొగల్ ఆర్టు గాలరీ, 5067 కుచ్చారెహమాన్‌లో ఉన్నది కూడా చెప్పుకోదగింది.

ఢిల్లీ ఒక పెద్ద అంతర్జాతీయ కేంద్రం. జాతీయంగా దేశం మొత్తం మీద ఎక్కడ ఏమి తయారు చేయబడినా ఈ కేంద్ర బిందువుకి అమ్మకానికి రావలసిందే, కనుక నగర బజారులో అన్నీ వస్త్రాలు, నగలు, సంప్రదాయరీతుల్లో గృహాలంకరణ వస్తువులుగానీ, దేవతామూర్తుల విగ్రహాలుగానీ అనేక రకాలయిన ఫాషన్‌ఫాన్సీ వస్తువులకు కొదువలేదు. ప్రతిషాపు ఒక ఎగ్జిబిషనే. ప్రతి బజారు చూడదగిందే. ఇక్కడ విదేశీయులుగానీ, స్వదేశీయులుగానీ అపురూపమైన వస్తువులు కొనాలంటే ఠతే మంచి చౌక బేరాలు అందరికి అన్నీ అందుబాటులో వుంటాయి. అయితే వాసిలో, రాసిలో అన్ని వస్తువులు ముఖ్యంగా వస్త్రాలు పట్టు, సిల్కు, నూలు, వస్త్రాలు, విలువైన నగలు, నాణ్యాలు, గృహోపకరణాలు, గృహాలంకరణలకు విశేషమైన డిజైన్‌లు వస్తు సామాగ్రిలు, ఏదయినా సరే, అరుదైనదైనా ఇక్కడ దొరుకుతుంది. ఢిల్లీ ఇదే మొదటిసారి అయితే నీవు బజారులన్నీ తిరిగి కావలసినవి జేబుని బట్టి కొనుక్కో. అన్నీ ఒక చోటే దొరికేచోటు. ఆఖరుసారి అయితే దేశమంతా తిరిగివచ్చి ఏదయినా కొరతవుంటే ఇక్కడ ఆ కొరతను పూర్తి చేసుకోగలరు. ముఖ్యంగా అన్నీ మంచి బజారులు మార్కెట్టులయిన విశేష ప్రాధాన్యం, తమదైన ప్రత్యేకతలుగల కొన్ని షాపింగు సెంటర్లు ఇక్కడ యిస్తున్నాము. కొన్ని కొనకపోయినా దర్శనీయాలుకూడా ప్రతి యాత్రికుడూ చూడదగినవి ప్రదేశాలు.

చాందినీ చౌకు :—

పాతఢిల్లీలో ప్రముఖమైన వ్యాపార కేంద్రం. ప్రపంచంలోని బజారు లన్నింటిలోను విలువైనదిగా కూడా ప్రసిద్ధి. ఎర్రకోటనుండి ఫతేపూరు వరకు దాదాపు 1.5 కి.మీ. పర్యంతం వుండి వెండి, బంగారు, వజ్రవైఢూర్యాలు, నవరత్నాలు ఇక్కడ ప్రశస్తం.

కన్నాట్ ప్లేస్ ;

న్యూఢిల్లీకి గుండెకాయ లాంటిది. ముఖ్య వ్యాపార కేంద్రం. మొట్టమొదట నెలవంక ఆకారంలో వుండి ఇప్పుడు పూర్తి వలయాకారంలో ఉన్నది. ఈ కేంద్రం నుండి కేంద్ర బిందువు నుండి గీచిన సెక్టర్లులాగ అన్ని చోట్లకు వెళ్ళే రోడ్డును కలుపుతూ సరళరేఖా సదృశంగా వికేంద్రీకరించబడిన రోడ్లులున్నాయి. ఈ కేంద్రంలో భూగర్భంలో ఎయిర్ కండిషన్డ్ మార్కెటు పాలికా బజారు అనే మార్కెట్టు వుంది. చుట్టూతా బ్రహ్మాండమైన షాపింగు కాంప్లెక్సులు అనేకం. వాటిలో ముఖ్యమైనవి శంకర్ మార్కెటు, సూపర్‌బజారు, జనపథ్ షాపులు వగైరా. ఇక్కడ దొరకని వస్తువులు లేవు. ఇక్కడనే సెంట్రల్ కాటేజి ఇండస్ట్రీస్ ఎంపోరియం, దగ్గరిలోనే ఇంపీరియల్ హోటల్ చేరువనే అనేక షాపులతోపాటు టిబెట్టు శరణార్థులు అమ్మే తివాచీలు, శాలువాలు, నగల విశేషాలు మరెన్నో పురాతన సాంప్రదాయ వస్తు సముదాయాలు సరసమైన ధరలకు లభ్యమవుతాయి.

సుందరనగర్ మార్కెట్టు ;

పురానాఖిల్లా దక్షిణాన డాక్టర్ జకీర్‌హుస్సేన్ రోడ్డు ప్రక్కనే ఓబెరాయ్ న్యూఢిల్లీ హోటల్ దగ్గరలోనే వున్న సెంటరు- ఇక్కడ అనేక రకాలయిన ఇత్తడి, కంచు, లోహాల పాత్రలు, బొమ్మలు, దేవతా విగ్రహాలు, నగలు, కళాఖండాలు, చిత్ర విచిత్రమైన చిత్రాలు, ఎన్నో అపురూపమైన అరుదైన వస్తు సముదాయాలు లభ్యమవుతాయి. నాణ్యతలోను, ధరలోను కొంచం ఎక్కువైనా స్తోమతు గలిగినవారు మెచ్చే, నచ్చే వస్తువులు దొరుకుతాయి.

అజ్మల్‌ఖాన్ మార్కెట్టు ;

ఇక్కడ బట్టలు దగ్గరనుంచి విలువైన ఆభరణ విశేషాలు వరకూ అన్ని రకాల వస్తువులు లభ్యమవుతాయి. ఆసియా మొత్తంమీద పెద్ద మార్కెట్టుగా పేరు పొందింది.

స్టేట్ ఎంపోరియా బిల్డింగ్ కాంప్లెక్సు :

బాబాఖరక్‌సింగ్ మార్గ్‌లో రెండు బజార్లు మొత్తం వివిధ రాష్ట్ర ప్రభుత్వాల స్టేట్ ఎంపోరియంలు నెలకొని ఉన్నాయి. ఇక్కడ ఆయా రాష్ట్రాల హస్తకళల నైపుణ్యాన్ని వెలిబుచ్చే అనేక వస్తు సామగ్రి మన మనస్సును ఆకట్టుకొంటాయి.

సరోజినినగర్ మార్కెట్టు :

అన్నిరకాల గృహోపకరణాలకు ఆటపట్టు. గృహిణుల శ్రమలను తగ్గించే అనేక రకాలు, గృహాలంకరణ సాధనాలు, గృహోపయోగకరమైన పనిముట్లు, గృహిణికి ఎన్నో వరాలు ఇక్కడ లభ్యమవుతాయనటంలో సందేహం లేదు.

## సమాచార కేంద్రాలు

టూరిస్టు ఇన్‌ఫర్‌మేషను కేంద్రములు :-

(1) గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు
88, జనపథ్. సమయం: ఉ. 8 గం. సా. 6 గం. వరకు వేసవికాలం
శీతాకాలం- ఉ. 9 గం. సా. 6 గం. వరకు

(2) గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్టు కౌంటరు
ఢిల్లీ విమానాశ్రయం. సమయం: ఎల్లప్పుడూ అన్నివేళలా.
స్వదేశీయులకు:- ఫోన్ 393481/286
విదేశీయులకు :- ఫోన్ 392745

(3) ఢిల్లీ టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను కౌంటరు వివరాలు.
a) N. Block, కన్నాట్‌ప్లేస్
b) 18A, D.D.A. షాపింగ్-కమ్-ఆఫీసు కాంప్లెక్సు,
రింగురోడ్డు, డిఫెన్సు కాలనీ.
c) న్యూఢిల్లీ రైల్వేస్టేషను
d) ఢిల్లీ రైల్వేస్టేషను
e) నిజాముద్దీన్ రైల్వే స్టేషను
f) అంతర్‌రాష్ట్ర బస్ టెర్మినస్
g) పాలమ్ ఎయిర్‌పోర్టు

ఇవిగాక వివిధ స్టేట్ గవర్నమెంటు వారల ప్రత్యేక సమాచార కేంద్రాలు.
చంద్రలోక్ బిల్డింగు, 36 జనపథ్.

హర్యానా, హిమాచలప్రదేశ్, జమ్ము, కాశ్మీరు, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలకు సంబంధించిన కేంద్రాలు

# స్థానిక స్థల సందర్శనలకు వివిధ ప్రదేశాలకు వివిధ సంస్థలు నిర్వహించే సామూహిక యాత్రిక పర్యటనలు

నిర్వాహకులు ;

ఇండియన్ టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను, యల్. బ్లాకు, కన్నాట్ ప్లేస్- ఉ. 6-30 నుండి రాత్రి 10 గం. వరకు- కరెంట్ బుకింగు, అడ్వాన్సు రిజర్వేషములు లభ్యము.

పర్యటన వివరాలు :

(1) సమయం: ఉ. 9-00 నుండి సా. 2-00 గం. వరకు
A/c కోచ్ మనిషికి రు. 20/-.
మామూలుగా ,, 8/-
న్యూఢిల్లి, జంతర్‌మంతర్, ఇండియాగేటు, హుమాయూన్ సమాధి, లక్ష్మి నారాయణ టెంపుల్, కుతుబ్‌మినార్.

(2) సమయం: మ. 2-15 నుండి సా. 4-10 వరకు.
A/c కోచ్ మనిషికి రు. 20/-
మామూలు బస్సు రు. 8/-
పాతఢిల్లి- ఫిరోజ్‌షా కోట్లా, రాజ్‌ఘాట్, ఎర్రకోట, జామా మసీదు.

గమనిక :

రెండు పర్యటనలూ ఒకేరోజున చేయవచ్చు. అప్పుడు రేట్లు
మామూలు బస్సుకి టిక్కెట్టు కి, 16/-
A/c కోచ్‌కి ,, 35/-

దానికి ఢిల్లి ట్రాన్సుపోర్టు కార్పొరేషను, ఇండియా హౌస్ వారిని సంప్రదించవచ్చు.

కాగా ఢిల్లి టూరిజమ్ కార్పొరేషనువారి నిర్వహణలో మరికొన్ని (DTDC)

(3) న్యూఢిల్లి, లక్ష్మినారాయణ మందిరం, జంతర్‌మంతర్, ఇండియా గేటు, రాష్ట్రపతి భవనం, కుతుబ్‌మినార్, సఫ్దర్‌జంగ్ సమాధి, పురానా ఖిల్లా- ఉదయం 9 గం. నుండి మధ్యాహ్నం 1 గం. వరకు టిక్కెట్టు రు. 8/-

(4) D.T.D.C. వారిదే.

పాతఢిల్లీ, జామామసీదు, ఎర్రకోట, లడక్‌బుద్ధవిహార్, శాంతివన, రాజ్‌గాట్, ఫిరోజ్‌షా కోట్లా. టిక్కెట్టు రు. 15/ సమయం మ. 2 గం. నుండి సా. 5-30. వరకూ.

గమనిక :

3, 4 పర్యటనలు ఒకే రోజున చేయవచ్చు.

(5) D.T.D.C. వారిదే సాయంత్రం పూట– సా. 6 గం. నుండి రాత్రి 10 గం. వరకు.

కార్యక్రమం :

లక్ష్మీ నారాయణ మందిరంలో హారతి, రాజ్‌పథ్ గుండా పయనం, ఇండియా గేటు, పురానాకిల్లా, సౌండ్&లైట్ షో అన్నింటికీ కలిపి.

A/C కోచ్ టిక్కెట్టు ఒకరికి— రు. 40/-
" దంపతులకు రు. 75/-

(6) విహారంగా ఆగ్రాకోటకు డీలక్స్ A/C కోచ్‌లో ప్రొద్దున బయలుదేరి అన్నీ సందర్శించి అదే రోజు మరల రాత్రి గం. 10.00 లకు. తిరిగి వచ్చేయటం.

పిల్లలకు టిక్కెట్టు— రు. 90/- (వయోపరిమితి విచారించండి)
పెద్దలకు " రు. 110/-

(7) ఇండియా టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషన్ వారు నిర్వహించే విహార యాత్రలు- తాజ్‌మహల్ ఫతేపూర్ సిక్రీలకు రాత్రి బయలుదేరి మరల మరు సటిరోజు రాత్రి 9 గం. లకు తిరిగి ఢిల్లీలో వుండేటట్లుగా.

(8) జైపూర్ a) అదే రోజున తిరిగి వచ్చేట్లుగానూ పెద్దలకు రు. 200/-
పిల్లలకు 180/-

b) ఈ రోజు బయలుదేరి-మరుసటిరోజు వచ్చేట్లు- " 340/- 320/-

పైన తెల్పిన 7&8 పర్యటనలు రెండింటిలోను A/c డీలక్స్ కోచ్‌లో ప్రయా

ఇం. ప్రవేశ రుసుములు బ్రేక్‌ఫాస్ట్, లంచ్-వగయిరాలు అన్నింటినీ కలుపుకొని పై చార్జీలు తెలుపబడినవి గమనించగలరు, పిల్లల వయోపరిమితి అడిగి తెలుసుకో గోరుతున్నాము. ఇవి కాకుండా DTDC వారు స్పెషల్‌గా LTC టూర్లు హిల్ స్టేషన్లకు నిర్వహిస్తున్నారు. విచారించి తెలుసుకో గోరుతున్నాము.

రాష్ట్ర ప్రభుత్వాలు వారి వారి ప్రత్యేక సమాచార కేంద్రాలు. (ఇన్‌ఫర్మేషన్ సెంటరులు) బాబా ఖరక్‌సింగ్ మార్గంలో గల స్టేట్ ఎంపోరియా కాంప్లెక్సు భవనంలో కలిగివున్నాయి. వానిలో మన ఆంధ్రప్రదేశ్-B 6 లో వున్నది. టెలిఫోన్ 321967. ఇవిగాక కర్నాటక, తమిళనాడు, ఒరిస్సా, మహారాష్ట్ర మొదలైన రాష్ట్ర ప్రభుత్వాల వారివి కూడా ఉన్నాయి. ఆసక్తి కలవారు విచారించ వచ్చు. వీటితోపాటు అండమన్స్, సిక్కిం రాష్ట్రాలు కూడా కస్తూర్బా మార్గం హోస్టలు, జనపథ హోటలు, జనపథలలో వున్నాయి.

## ఢిల్లీలో వసతులు :

అంతర్జాతీయ నగర ప్రతిపత్తి గలిగిన ఢిల్లీమహానగరంలో ఎన్నో హోటళ్ళు శ్రీమంతులకు, విదేశీయులకు విడిది కేంద్రాలుగా ఉపయోగపడ దగినవిగాని ఎన్నో ఉన్నాయి. అయితే మొదటగా సామాన్యులుగా ఉన్నటువంటి వారికి చౌకలో ఉండేవి వదాన్యులు ఏర్పరచిన ధర్మశాలలు చూద్దాం. తరువాత అంచెల వారీగా వున్న హోటళ్ళను పరిశీలిద్దాం.

## ధర్మశాలలు :

1. పార్శి అంజుమన్, ఢిల్లీగేటు దగ్గర, బహదూర్ షాజఫర్ మార్గం, టెలిఫోన్ : 274588. పార్శీలకు మాత్రమే. రోజుకి రు. 20-50 మనిషి 1కి. భోజనంతో కలిపి.
2. శ్రీలంక నించి వచ్చే బౌద్ధులకు మాత్రం ప్రత్యేకం అయినది. బుద్ధిస్ట్ పిల్‌గ్రిమేజ్ సెంటరు, చెమ్స్‌ఫోర్ట్‌రోడ్డు, రోజుకి మనిషి 1కి రు. 7-50.
3. గుజరాత్ సమాజ్ సదన, 2 రాజనివాస్ రోడ్డు, ఫోన్ : 220879 రు. 5/- ఒకరికి.
4. కాశీ బారీ, మందిర్‌మార్గం, ఒక్కొక్కరికి రోజుకి రు. 5/- ఫోన్ : 45274. హిందువులకు మాత్రం ప్రత్యేకం.

5. అదక్ బుద్ధవిహార్, బేలారోడ్. బౌద్ధ యాత్రికులకు ప్రాధాన్యత. రూము రోజు 1కి రు. 3/- మాత్రం.

6. మార్వారి పంచాయతీ ధర్మశాల.. నాయి సరక్, ఫోను : 264508.

7. లచ్చుమల్ జైన్ ధర్మశాల. 411 ఎస్ప్లనేడ్ రోడ్, 5 లేక ఆరుగురు కలిసి వుంటే మరీ మంచిది. మనిషికి 0-50, కరెంటు వగయిరాలు అదనం హిందువులకు మాత్రమే ప్రత్యేకం. పరిమితి 3 రోజులుమాత్రమే.

8. ఛోటామల్ ధర్మశాల, చార్కైన వాలన్, చారీ బజారు.

9. జబ్బాన్ ధర్మశాల, తేలివారా.

10. లాడ్లీ ప్రసాద్ ధర్మశాల. 1-3, బాగ్ దీవార్, ఫతేపురి.

11. లేడీ హార్డింజ్ సరాయి, న్యూఢిల్లీ రైల్వే స్టేషను దగ్గర.

12. లక్ష్మీనారాయణ్ ధర్మశాల. 77-89, ఫతేపురి.

13. లక్ష్మీనారాయణ ఆలయ ధర్మశాల, మందిరమార్గం-ఉచితం.

పై ధర్మశాలల్లో ఉండటానికి విదేశీయులు ఉండగోరితే వారి వారి దేశాల ఎంబసీల, లేక హైకమీషనుల వారి వద్ద నుండి పరిచయ పత్రాలు విధిగా ఉండాలి.

ఢిల్లీలోని కొన్ని ముఖ్యమైన దౌత్యకార్యాలయాల ఉనికి, చిరునామాలు. అన్ని దౌత్యకార్యాలయాలు చాణక్యపురిలోనే కేంద్రీకృతమై ఉన్నాయి. కనుక ఈ ప్రదేశమే ఒక గొప్ప డిప్లొమాటిక్ సెంటర్‌గా ఎన్నబడింది. ఆర్య చాణక్యుడు గొప్ప రాజనీతివేత్త అర్ధశాస్త్ర రచయిత గదా! ఈ ప్రదేశానికి ఆ పేరెంతో సముచితంగా ఉన్నదని వేరుగా చెప్పనక్కర లేదు.

భూటాన్ : చంద్రగుప్త మార్గం. ఫోను : 609217.

నేపాల్ : బారాఖంబా రోడ్, ఫోను : 381484.

పాకిస్తాన్ : 2/50 G. శాంతిపథ్ రోడ్, ఫోను : 605982.

శ్రీలంక : 27, కౌటిల్యమార్గం, ఫోను : 3010201.

బంగ్లాదేశ్ : 56, రింగ్‌రోడ్.

బర్మా : 3/50 F. నయామార్గం, ఫోను : 600251.

చైనా : 50 D. శాంతిపథ్, ఫోను : 609503.

ఇండోనేషియా : 50 A. చాణక్యపురి, ఫోను : 602352.

ఇరాన్ : 5, బారాఖంబా రోడ్.

మలేసియా : 50 M, సత్యమార్గం.

సింగపూర్ : E 6, చంద్రగుప్తమార్గం.

థాయలాండ్ : 56 N, నయామార్గం.

కెనడా : 7/8 శాంతిపథ్, ఫోను : 608161

డెన్మార్క్ : 2, గోల్ఫ్‌లింక్స్, ఫోను : 616273.

ఫిన్లాండు : 25, గోల్ఫ్‌లింక్స్, ఫోను : 616006.

ప. జర్మనీ : 6/60 G, శాంతిపథ్, ఫోను : 604861.

జపాన్ : 4/50 G, చాణక్యపురి, ఫోను : 604071.

నెదర్లాండ్స్ : 6/50 F, శాంతిపథ్, ఫోను : 609511.

న్యూజిలాండ్ : తాజ్‌ప్యాలెస్ హోటల్, 2 సర్దార్‌పటేల్ మార్గం, ఫోను : 3010101.

నార్వే : 50 C, కౌటిల్యామార్గం, ఫోను : 605982.

(U. K.) యు. కె. శాంతిపథ్ : 601371.

ఐర్లండ్ : 13 జోర్‌బాగ్, ఫోను : 617435.

USA. శాంతిపథ్, ఫోను : 600651.

USSR-శాంతిపథ్, ఫోను : 606026.

UN : 56, లోడిఎస్టేటు, ఫోను : 690410.

## విదేశీయులు—వీసాలు

### వీసారెన్యూవల్స్ పర్మిట్లు :

పాకెనర్స్ రిజిస్ట్రేషను ఆఫీసు తిలక్ బ్రిడ్జి రైల్వేస్టేషను దగ్గర హంస భవన్‌లో ఉన్నది. వీసారెన్యూలు అనేది ఏ విదేశీయుడైనా మూడు నెలల కంటే మన దేశంలో ఉండాల్సివస్తే వీసారెన్యులు చేయించుకోవాలి. విధిగా కొన్ని నిషిద్ధ ప్రదేశాలు పంజాబ్ వంటి కల్లోలిత ప్రాంతాలను దర్శించాలంటే ప్రత్యేకంగా అను మతి కావాల్సి వుంటుంది. అనుమతులు-హోమ్‌మంత్రి శాఖ ఇస్తుంది. 'ఖాన్‌మార్కెట్టు దగ్గర లోకనాయక భవన్‌లో ఇస్తారు— శని, ఆదివారాలు తప్ప మిగతా రోజుల్లో

సా. 2 నుండి 4 గం. వరకు ఈ కార్యక్రమం అమలులో ఉంటుంది. అటువంటి వాని కోసం ఇక్కడకు రావాల్సి వుంటుంది. వీసా రెన్యూలకు రెండు పాసుపోర్టు సైజు ఫోటోలు కావాలి. భవనం బయట వుండే ఫొటోగ్రాఫర్ చేత తీయించుకోవచ్చు. ఆఫీసు మధ్యాహ్నం 1–30 గం. వరకు ఉంటుంది.

టాక్సు క్లియరెన్సు సర్టిఫికెట్లు, వగయిరాలు కావాలంటే ఇన్‌కంటాక్సు విదేశీ విభాగం హంసభవన్‌కి ఆ చివరన ఉంది సెంట్రల్ రెవిన్యూ బిల్డింగులో. విదేశీ మారకం సర్టిఫికెట్లు వగయిరాలు వెంట తెచ్చుకుంటే పన్నులన్నీ అయిపోతాయి. ఈ ఆఫీసు మధ్యాహ్నం 1 గం. నుండి 2. వరకు లంచ్.

వసతులకి ధర్మశాలల తరువాత ఇతర వసతులు

విశ్వ యువక కేంద్ర :

సర్క్యూలర్‌రోడ్, చాణక్యపురి, ఫోను : 3013631. రాత్రిపూట పడక మాత్రం మనిషి 1కి రు. 12/– రూములు రు. 25 నుండి 45 రు. డబుల్ రూము రు. 60/– వరకు ఉంటుంది. రిజర్వేషనులకు మేనేజరు గారిని సంప్రతించవలెను. ఇందులోనే మంచి ఫలహారము కూడా వుంది.

యూత్ హాస్టల్ :

న్యాయమార్గ్, చాణక్యపురి, ఫోన్ : 376285. సభ్యులకు పడక సౌకర్యం రు. 15/–లకే. సభ్యులు కానివారికి రు. 18/– విదేశీయులకైతే. భారతీయులకు ఈరేట్లు మీదకొంత తగ్గింపుఉంటుంది. మెంబర్లకు 11/–మెంబర్లు కానివారికి 13/– మాత్రమే. ఢిల్లీ మహానగరంలో యాత్రికులు విడిది చేయటానికి ప్రత్యేక వసతులు గూడా ఉన్నాయి. వాటిని కాంపింగ్ గ్రౌండ్సు అని అంటారు.

టూరిస్టు కాంపులు :

పూర్వం ఇర్విన్ హాస్పటలు అనబడే జయప్రకాశ్ నారాయణ్ హాస్పటలు ఎదురుగా, జవహర్‌లాల్ నెహ్రూ మార్గ్. ఫోన్ : 278929 చాలాచౌక. ఇక్కడి నుండే ఒక రిటయిరయిన సైనికాధికారి మేజిక్ బస్ అనేది ఒకటి నడుపుతున్నాడు. కన్నాట్ ప్లేస్‌కి ఇక్కడికి రెండు కి.మీ. దూరం మాత్రమే. ఇక్కడ చౌకగా రూములు కూడా లభ్యమవుతాయి. అలాగే మరొటి.

**కుడ్సియా గార్డెన్స్ టూరిస్టు కాంపు :**

అంతర్‌రాష్ట్ర బస్సు టర్మినస్ దగ్గర, కాశ్మీర్‌గేట్, ఇక రైల్వే రిటైరింగు రూములు- రైలు ప్రయాణికులకు మాత్రం.

ఈ కాంపింగు సెంటరులో వుండటానికి పరిమితి 30 రోజుల వరకు వుంటుంది. రిజర్వేషనులుకి మేనేజరువార్ని సంప్రదించవచ్చు.

న్యూఢిల్లీ రైల్వే స్టేషను, ఢిల్లీ మెయిన్ రైల్వే స్టేషను మామూలు, A/c. రూములకు తోడు, కామన్ బెడ్‌రూములు కూడా ఉన్నాయి. 3, 5, 12 బెడ్లు కలిగిన రూములలో రాత్రిపూట పడుకోటానికి దశలవారీగా రేట్లుతో 7-50 దగ్గరినుండి 5/- వరకు దొరకవచ్చు. రిజర్వేషనులకు స్టేషను సూపరింటెండెంటును సంప్రదించాలి.

**ఎయిర్ పోర్టు రిటయిరింగు రూములు :**

ధృవీకరించబడిన టిక్కెట్టు రిజర్వేషను ఉన్నవానికి మాత్రమే ! ఢిల్లీపాలమ్ ఎయిర్ పోర్టులో వసతికి రూము 50/- నుండి 75/- వరకూ ఉంటుంది.

ఇవి కాకుండా టూరిజమ్ డిపార్టుమెంటు వారిచే గుర్తించబడిన పేయింగు గెస్టు వసతులుకూడా లభ్యం :—

పారిజాత్. C/o. శ్రీ D R మహేంద్ర B/77-A. గ్రేటర్ కైలాష్, A/c సింగిల్, డబుల్, A/c లేకుండా మామూలు గదులు రెండు విధాలయినవి లభ్యం. నాన్ A/c రు. 40 నుండి A/c 135/- వరకూ (రోజుకి) శ్రేణిలో వుంటాయి రూములు.

**C/o. శ్రీమతి సుందరీ కపూర్ :**

44, పశ్చిమి మార్గ్, వసంతవిహార్.

ఇక్కడ కొంచం రేటు ఎక్కువ- ఇక్కడకూడా A/c. A/c లేకుండా సింగిల్, డబుల్ రూములు దొరుకుతాయి. రు. 50/- నుండి 100/- నుండి 125/- వరకూ చార్జీలుంటాయి.

**క్రిష్ణా లాడ్జింగు హౌసు :**

C/o. శ్రీమతి శ్యామలా పప్పు, సింగిల్ రూము రు. 90/- డబుల్ రూము రు. 120/- లకు లభ్యం.

శ్రీమంతులకు, విదేశీ ప్రముఖులకు అనువైనవి.

వెస్టరన్ స్టైలు హోటళ్ళు :

అశోక్ : 50 B, చాణక్యపురి, గ్రామ్స్ : ASHOK HOTEL
టెలెక్స్ : 2567.
అక్బర్ : చాణక్యపురి, గ్రామ్స్ : AKBOTEL టెలెక్స్ : 2863.
ఒబెరాయ్ ఇంటర్ కాంటి నెంటల్ : డా. జకిర్ హుస్సేన్ మార్గ్,
గ్రామ్స్ : OBROTEL & INHOTELCOR, టెలెక్స్ : 2372
మౌర్యా షెరాటన్ : సర్దార్ పటేల్ రోడ్డు, గ్రామ్స్ : WELCOTEL.
స్రమాట్ : కౌటిల్యా మార్గ్, చాణక్యపురి.
సెంటౌర్ : ఢిల్లీ ఎయిర్‌పోర్టు.
సిద్ధార్థ కాంట నెంటల్ : వసంత విహార్.
క్లారిడ్జెస్ : 12, ఔరంగజేబు రోడ్, గ్రామ్స్ : CLARIDGES
ఇంపీరియల్ : జనపథ్.
ఒబెరాయ్ మెయిడెన్స్ : 7. అలిపూర్ రోడ్,
గ్రామ్స్ : OBMAIDENS.
హంస్ : 15, బారాఖంబారోడ్.
నిరులాస్ : L. Block, కన్నాట్ సర్కస్,
గ్రామ్స్ : NIRULASBROS.
జనపద : జనపద, గ్రామ్స్ : RESTWELL.
కనిష్కా : 19, అశోక్ రోడ్, గ్రామ్స్ : KANISHOTEL.
యోర్క్ : K. బ్లాకు, కన్నాటిసర్కస్ , గ్రామ్స్ : YORKS
లోధి : లాలా లజ్‌పత్‌రాయ్ మార్గ్, గ్రామ్స్: LIVWELL
రంజిత్ : మహారాజ రంజిత్ సింగ్ రోడ్,
గ్రామ్స్ : STAYWELL
డిప్లొమాట్ : డిప్లొమాటెక్ ఎంక్లేవ్, గ్రామ్స్ : DIPLOMATIC
ఎయిర్ లైన్స్ : న్యూ ఢిల్లీ రైల్వేస్టేషను ఎదురుగా,
గ్రామ్స్ : AIRLINES
విక్రమ్ : రింగ్‌రోడ్, లజ్‌పత్ నగర్,
గ్రామ్స్ : HOTEL VIKRAM

ఇతరంగా హోటళ్ళు :

సాధారణంగా ఢిల్లీలాంటి మహానగరంలో అతిచౌక అంటే 40 రూపాయలు రూము చార్జీ ఒక రోజుకి అంటే మాట్లాడాల్సిన పనేలేదు. అదే కొన్ని ఇతర పట్టణాల్లో అయితే ఈ రేటుకి అటాచ్‌డ్ బాత్‌రూముతో సహా దొరకచ్చు. గనుక ఇక్కడ హోటళ్ళు కారుచౌక అంటే రోజుకు కనీస చార్జీలు. రు. 50/– అంటే ఆశ్చర్య పోనక్కరలేదు. ఈ శ్రేణిలో ఖరీదైన హోటళ్ళు చార్జీలు వందలు వేల రూపాయల్లో ఉంటాయని చెప్పనక్కరలేదు.

ఏరియాల వారీగా అనుకూలమైన పరిసరాలుగా చెప్పుకోదగినవి. స్థాయి అంతస్థుల విభేదాలు మీకే వదిలివేస్తున్నాం.

జనపథ్ ఏరియా :

ప్రభుత్వం వారి టూరిస్టు ఆఫీసు వద్దగల కొన్ని అందుబాటులో వున్న విగాలాడ్జిలు, గెస్టుహౌస్‌లు వగయిరాలు కూడా ఉన్నాయి.

1) రింగో గెస్టుహౌస్, 17, సింధియా అవస్, ఎయిర్ ఇండియా వెనకాల.
2) సన్నీ గెస్టు అవుస్, 152 సింధియా అవస్.
3) ఆసియన్ గెస్టు అవుస్, 14 సిధింయా అవస్.
4) గాంధి గెస్టుఅవుస్, 80. టాల్ స్టాయ్ లేన్.
5) రాయల్ గెస్టు అవస్, నేపాల్ ఎయిర్‌లైన్సు దగ్గర, 44, జనపధ్.
6) శ్రీమతి S. C. జైన్‌వారి గెస్టు అవస్, 7 ప్రతాప్‌సింగ్ బిల్డింగ్, జనపధ్.
7) సోని గెస్టు అవస్, జనపధ్ లైను.
8) హోటల్ బ్రైట్, 85, కన్నాట్ సర్కస్, సూపర్ బజారుకు ఎదుట. ఇందులోనే భోజన భాజనాదులు గూడ ఉంటాయి.
9) హోటల్ బ్లు, కన్నాట్ సర్కస్.

పహార్‌గంజ్ ఏరియా :

న్యూ ఢిల్లీ రైల్వే స్టేషను ఎదురుగా మెయిన్ బజారు మొదలవుతుంది. పడమరగా సాగి ఒక కి. మీ. పొడవునా ఉంటుం ది రోడ్డు. ఈ రోడ్డులో అనేకమైన హోటళ్ళు వివిధ స్తోమతు దారులకు తగినట్లుగా అమరి చౌక, మధ్య తరగతి వారలకు అనుకూలంగా ఉన్నాయి. ఈ ఏరియాల్లో మాదక ద్రవ్యాల నిఘా విభాగంవారు

తరచూ దాడులు జరుపుతుంటారు. అయినా భయంలేదు. మీరు మత్తుమందులు సేవించేవారు కాదుకదా!

1) హోటల్ కిరన్, 4473 మెయిన్ బజారు.
2) హోటల్ నవరంగ్, మెయిన్ బజారు.
3) హోటల్ వివేక, 1541-50, మెయిన్ బజారు.
4) హోటల్ విశాల్.
5) హోటల్ సప్నా, 5153 మెయిన్ బజారు.
6) హోటల్ చాణక్య, 1684, మెయిన్ బజారు. ఇంపీరియల్ థియేటరు దగ్గర.
7) వీనస్ హోటల్, 1566, మెయిన్ బజారు.

ఇదే ఏరియాలో దేశ్‌బంధు గుప్తారోడ్డులో ఇంతకంటే కొంచం హెచ్చుధరలో వున్న వసతి గృహాలు (హోటళ్ళు, లాడ్జిలు) వున్నాయి.

1. వైట్‌హవుస్ టూరిస్టు లాడ్జి, 8177 నంబరు
2. అప్సర టూరిస్టు లాడ్జి, నం. 8501/1.
3. హోటల్ క్రిస్టల్, నం. 8126.
4 న్యూఢిల్లి రైల్వేస్టేషను ఎదురుగానే- హోటల్ ఎయిర్‌లైన్సు
5. హోటల్ లిటిల్‌స్టార్- మెయిన్‌బజారు, D.B. గుప్తారోడ్‌ల మధ్యలోఉంది సౌకర్యం పరవాలేదు.

**పాతఢిల్లీలో :**

ఖుష్‌దిల్, క్రౌన్‌హోటళ్ళు, ఫతేపూర్ మసీదువద్ద, చాందినీచౌక్ ఏరియాలోనే వున్నాయి. పాతఢిల్లి రైల్వేస్టేషను దగ్గరినుండి కొద్దిదూరంలోనే వున్నాయి. ఇక్కడే 'పాత' అనే పేరుని సార్థకం చేస్తూ మరికొన్ని వున్నాయి. చూసి మరీ చేరండి- పాత వాసనలతోపాటు నల్లులు, దోమలు నిరంతరం గుంపులు గుంపులుగా దాడి చేస్తుంటాయి.

**చాణక్యపురి ఏరియా :**

దౌత్య కార్యాలయాలన్నీ ఇక్కడ కేంద్రీకృతమైనాయి. ఇక్కడ చౌకలో గావాలంటే మాత్రం- విశ్వయువక కేంద్ర, యూత్ హాస్టల్, టూరిస్టు క్యాంపు వగయిరాలు

**పీటికితోడు ఇతర ఏరియాల్లో ఉన్న హోటళ్ళు :**

1. జుకాసో ఇన్ గెస్టుహౌస్, 50, సుందర్‌నగర్.
2. ది సెంటర్ పాయింటు టూరిస్టు హోమ్, 13, కస్తూరిబా గాంధీ మార్గం.
3, సెంట్రల్ కోర్టు, కన్నాట్ సర్కస్, N. బ్లాకు.
4. హోటల్ ఫిఫ్టిఫైవ్, H-55, కన్నాట్‌ప్లేస్,
5. YWCA ఇంటర్నేషనల్ గెస్టుహౌస్, సంసద్‌మార్గ్.
6. ఇండియా ఇంటర్నేషనల్ సెంటర్, లోడి ఎస్టేట్.
7. ఆగ్రా, 16, దర్యాగంజ్, షాకాహార్.
8. వుడ్‌స్టాల్ మోటెల్, 11, గోల్ఫ్‌లింక్స్.
9. ఏకాంత్, 3, పంచ కూజన్‌రోడ్డు.
10. టూరిస్టు హాలిడే హోమ్, Y లింక్‌రోడ్డు.
11. రుషి ఇంటర్నేషనల్ గెస్టు హవుస్, 8, సర్దాల్‌పటేల్ మార్గ్.
12. బ్లు, M 126-128, కన్నాట్ సర్కస్.
13. సౌత్‌ఇండియా బోర్డింగ్ హవుస్, M బ్లాక్, కన్నాట్ సర్కస్.
14. మేవా, క్వీన్స్ గార్డెన్స్, టౌన్‌హాలు ఎదురుగా.
15. YWCA (స్త్రీలకు మాత్రమే) అశోక్ రోడ్డు.

ఇంకా ఎన్నో ఎన్నో- మీరు వుండే ఏరియాని బట్టి, దిగే స్టేషన్ను బట్టి స్థోమతునుబట్టి ఎన్నుకొనే ఛాయిస్ మీదే।

**తపాలా సౌకర్యాలు :**

హెడ్ పోస్టాఫీసు: సంసద్‌మార్గ్ ఉ. 8 గం. నుండి సా. 8 గం. వరకు
ఈస్టరన్ కోర్టు పోస్టాఫీసు: జనపథ్, ఉ. గం. నుండి 4-గం. 7
కన్నాట్ సర్కస్ పోస్టాఫీసు: A-Block ఉ. 10 నుండి సా. 5-45 వరకు
పోస్ట్ రెస్టారెంట్: C/o. పోస్టు మాస్టరు, GPO అశోకాప్లెస్
ఉ. 8 గం. నుండి సా. 7 గం. వరకు

GPO కాశ్మీరీగేటు

ఇంకా ఎక్కడికక్కడే స్థానికంగా చిన్నా పెద్ద పోస్టాఫీసులు మీ సేవలో ఉన్నాయి.

టెలిగ్రాఫ్ ఆఫీసులు :

సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు, ఈస్టరన్ కోర్టు, జనపథ్.

ఓవర్‌సీస్ కమ్యూనికేషన్సు, బంగ్లాసాహిబ్ రోడ్డు, 24 గంటలూ మీసేవలో మరెన్నో సబ్ ఆఫీసులు కూడా ఉన్నాయి.

ప్రయాణపు రిజర్వేషనులు

విమానం :

1. ఇండియన్ ఎయిర్ లైన్సు,
   కాంచన్‌జుంగా బిల్డింగ్, బారాఖంబారా రోడ్డు.
2. ఇండియన్ ఎయిర్ లైన్సు, ఢిల్లి ఎయిర్‌పోర్టు.

రైలు :

నార్తరన్ రైల్వే, రిజర్వేషను ఆఫీసు, స్టేట్ ఎంట్రీ రోడ్డు, కన్నాట్‌సర్కస్ A/c, I క్లాస్ మాత్రం సమయం ఉ. 8 గం. నుండి రాత్రి 8 గం. వరకు, ఆది వారాలు, శెలవు దినాలు ఉ. 8 గం. నుండి మ. 1 గం. వరకు.

న్యూఢిల్లి రైల్వేస్టేషను, ఢిల్లి రైల్వే స్టేషనులలో అన్ని తరగతులకు సమయం ఉ. 7-30 గం. నుంచి రాత్రి 9 గం. వరకు

విదేశాలనుండి వచ్చేవారు రైల్వే టూరిస్టు గయిడ్ సహకరం నార్తరన్ రైల్వే బరోడా హవుస్‌నుండి పొందవచ్చు.

అన్ని సమాచారాలు– రైల్వే ఎంక్వయిరీలు, న్యూఢిల్లి, ఢిల్లి, హజరత్ నిజాముద్దీన్ స్టేషనుల నుండి సమాచారం సేకరించవచ్చు.

బస్సు సౌకర్యాలు :

ముఖ్యమయిన బస్సు స్టేషనులు :

1) స్టేట్ గవర్నమెంటు రోడ్‌వేస్, ఇంటర్‌స్టేట్ బస్సు టెర్మినస్, కాశ్మీరీ గేట్‌లోగల వివిధ రాష్ట్రాల ఆఫీసులు.

హర్యానా గవర్నమెంటు రోడ్‌వేస్, హిమాచల్ రోడ్‌వేస్ కార్పొరేషను, జమ్ము & కాశ్మీర్ గవర్నమెంటు రోడ్‌వేస్, రాజస్థాన్ రోడ్‌వేస్, బికనీర్ హవుస్, రాజస్థాన్ ఎంపోరియం, యు.పి. రోడ్‌వేస్ మరియు అజ్మీరి గేట్‌వద్ద అడ్వాన్సు బుకింగులు ఒకవారం ముందునుంచి. 3 రోజులు ముందు వరకూ రిజర్వేషనులు పొందవచ్చు.

ఢిల్లి మహానగరం ఇండియాలోని అన్ని ముఖ్య నగరాలకు రోడ్డు కనెక్షనులు న్నాయి. కొన్ని ముఖ్యమైన గమ్యాలు- మధ్యలోని మజిలీలు-దూరాలు.

## ఢిల్లి నుండి

| ముఖ్యగమ్యం | దూరం కి.మీ. | మజిలీలు-గమ్యాలు |
|---|---|---|
| ఆగ్రా | 203 | ఫరీదాబాదు-29, హోదాల్-60, మధురా-58, ఆగ్రా-56, |
| అలహాబాదు | 603 | అలిగర్-131, ఈటా-69, కాన్పూరు -208, అలహాబాదు-195. |
| ఆల్మోరా | 373 | గార్హ్ముక్తేశ్వర్-89, మొరాదాబాద్-69 రామ్‌పూర్-30, కాఠ్‌గోడాము-94, ఆల్మోరా-91. |
| అమృత్‌సర్ | 447 | అంబాలా-192, లూధియానా-113, జలంధర్-59, అమృత్‌సర్-83. |
| భాక్రా | 354 | అంబాలా-192, చండీఘడ్-46, నంగల్ -103, భాక్రా-13 |
| భరత్‌పూర్ | 190 | మధురా-147, భరత్‌పూర్-43. |
| చండీఘర్ | 238 | అంబాలా-192, చండీఘర్-56. |
| కార్బెట్ నేషనల్ పార్కు | 297 | గార్హ్ముక్తేశ్వర్-89, మొరాదాబాద్-69 రామ్‌నగర్-86, ధికాలా (కార్బెట్)-53 |
| జైపూర్ | 306 | సోనా-54, అల్వార్-110, సారిస్కా-31, జైపూర్-111. |
| ,, | 258 | కోట్‌పుత్లి-152, జైపూర్-106 |
| ఖజురాహో | 596 | ఆగ్రా-203, గ్వాలియర్-118, ఝూన్సి 103, ఛత్తర్‌పూర్-125, ఖజురాహో-47 |
| కులూ | 502 | చండీఘర్-238, బిలాస్‌పూర్-134, మండి-60, కులూ-70. |
| మధురా | 147 | పాల్వాల్-60, కోసి-43, మధురా-44, |

| | | |
|---|---|---|
| ముస్సోరి | 269 | మీరట్-65, ముజఫర్‌నగర్-51,రూర్కి-52, డెహ్రాడూన్-67, ముస్సోరి-34. |
| నైనితాల్ | 318 | గార్హముక్తేశ్వర్-89, మొరాదాబాద్-89, రాంపూర్-30, కాఠ్‌గోడాము-94, నైనితాల్-36, |
| సిమ్లా | 343 | కాల్కా-253, సోలన్-41, సిమ్లా-49, |
| శ్రీనగర్ | 876 | అంబాలా-192, లూధియానా-113, పఠాన్‌కోట-171, జమ్మూ-107, శ్రీనగర్-293. |
| ఉదయపూరు | 664 | అజ్మీరు-389, బీవారు-54, కాంక్రోలి-154, ఉదయపూరు-66. |
| వారణాసి | 738 | అలిఘరు-131, ఈటా-69, కాన్పూరు-208, అలహాబాదు-195,వారణాసి-135 |

నగరం, నగరపరిసరాలు తిరిగి చూడటానికి అనుకూలమైనవిగా-

టాక్సీలు, స్కూటర్లు, టూరిస్టుకార్లు, టాంగాలు, నలుగురు కూర్చొని ప్రయాణించటానికి వీలుగా- 4 సీటర్ ఆటోరిక్షాలు, దూరాన్ని బట్టి చార్జీలున్నాయి. ఢిల్లీ ట్రాన్సుపోర్టు కార్పొరేషనువారి నిర్వహణలో అనేక సిటీబస్సులు, టూరిస్టు బస్సులున్నాయి.

గమనిక :

ఢిల్లీ మహానగర సిటీ బస్సులు యమ రష్‌గా వుంటాయి. జాగ్రత్త చాలా అవసరం.

అన్నిటికీ తోడుగా అధీకృతమైన టూరిస్టు గైడులు లభ్యమవుతారు. వారికి సర్వీసు చార్జీలు సుమారుగా ఈ క్రింది విధంగా ఉంటాయి. సమాచారం కొరకు-గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసుల్లో విచారించవచ్చు.

గైడులకి చార్జీలు సుమారుగా యివ్వబడ్డాయి.

| | |
|---|---|
| సగం రోజుకి - 4గం. పరిమాణం | పూర్తి రోజు పరిమాణం - 8గం. |
| 4 గురు సమూహానికి - 25 రు. | 35 రు. |

| | | | |
|---|---|---|---|
| 5-15 గురు - " | 35 రు. | — | 45 రు. |
| 16-40 గురు- " | 45 రు. | — | 60 రు. |

8 గం. పరిమాణం దాటితే గం. 1కి రు. 3/- అదనంగా చార్జి చేయబడ్తుంది. పీటికితోడు లంచ్ అలవెన్సు, నగరల వెలుపలికి అయితే అదనపు చార్జీలు వసూలు చేయబడతాయి. రాత్రిపూట వుండవలసివస్తే దానికి కూడా అదనంగా స్పేయింగ్ ఎలవెన్సు ప్రత్యేకం. ఇతర విదేశీ భాషలకి - ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్, జపనీస్, రష్యా, స్పానిష్ వగైరా విదేశీ భాషల అనువాదాలు తెలిసినవారికి అదనంగా చెల్లించవలసి వుంటుంది.

## ఢిల్లీ నగర పరిసరాలు — చూడదగినవి :

ఢిల్లీ మహానగర పరిసరాల్లోని విహారయాత్రా స్థలాలు, పిక్నిక్ స్పాట్‌లు చాలా వరకు పొరుగునేవున్న పంజాబ్ మొదలైన ఇతర రాష్ట్రాలలో చేరినవైయున్నాయి. ఆ రాష్ట్రాల వివరణలో ఆయా ప్రదేశాలు చోటుచేసుకుంటాయి ముఖ్యంగా బాధ్‌కాల్‌లేక్, బల్లభ్‌నగర్, దసన, హిండన్, జక్లా, సోహనా మొదలయినవని మంచి పిక్నిక్ స్పాట్‌లుగా ప్రసిద్ధి. కొన్ని సరస్సులు, జలాశయాలు, కాలువలు చక్కని ప్రశాంత వాతావరణంలో అభిరుచి గలవారికి ఫిషింగ్, బోటింగ్ వగయిరా సౌకర్యాలతో సెలవు దినాలు ఖుషీగా, కులాసాగా గడపడానికి చక్కని వైవిధ్యంతో అలరారుతున్నాయి.

## గార్హ్‌ముక్తేశ్వర్ :

ఢిల్లి -మొరాదాబాద్ బ్రాడ్ గేజ్ లైనులో ఒక చిన్న రైల్వేస్టేషను. మీరట్ నుంచి అయితే ఇంకా దగ్గర. సుమారు 40 కి.మీ. దూరంలో ఉన్న ఈ ప్రదేశం గడ్‌ముక్తేశ్వరగా నామాంతరంతో పిలవబడుతూ వుంది. సహజంగా ఉన్నది ఉత్తర ప్రదేశ్‌లో చేరిందే. కొండ కొమ్మున రెండు దేవాలయాలు కొండ దిగువన మరో రెండు ఆలయాలున్నాయి. పురాణ ప్రసిద్ధమైన ఈ క్షేత్రంలో కార్తీక మాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. అన్ని సౌకర్యాలున్నాయి. ధర్మ సత్రములు వగయిరాలు విడిదికి సౌకర్యంగా ఉంటాయి. పైగా పావన గంగా తీరం.



# పంజాబు & హర్యానా

దేశానికి స్వతంత్రం రాకముందు పంజాబు చాలా విస్తృతమైన రాష్ట్రం. అప్పటి పంజాబుకు రాష్ట్ర రాజధాని ఇప్పుడు పాకిస్తానులో చేరిపోయిన లాహోర్. అయితే ఇప్పటికి పాకిస్తాన్‌లోని పంజాబు రాష్ట్రానికి లాహోరే రాజధాని. దేశవిభజన సమయంలో రేగిన కల్లోల జ్వాలల్లో మాడి దగ్ధమై పోయింది ఎంతో ప్రాణనష్టం ఆస్తినష్టాలు జరిగి స్మశానవాటిక సదృశంగా తయారైనది. ఈ కల్లోలాల ఫలితంగా దేశం భారత్-పాకిస్తాన్‌లుగా రెండు దేశాలుగా విడివడింది. పాకిస్తాన్ ముస్లిమ్ సోదరుల ప్రత్యేక దేశంగా వాటా పొందింది. దీని వెనుక జరిగిన దారుణ మారణకాండ ఇంతా అంతా కాదు. పంజాబు ప్రజలంతా ముస్లిములు-సిక్కులు జనాభా ప్రాతిపదికగా విభజించబడ్డారు. సిక్కులు, హిందువులు తూర్పువైపుకి వలస వస్తే, ముస్లిములు పడమటివైపుకి వలస పోయారు. రెండువైపులా మానవత్వాన్ని మరిచి కల్లోల జ్వాలల్లో మునిగి చంపుకొన్నారు. ఇరువైపులా దేశవిభజన కొంతకాలం పాటు ప్రశాంతతను ఏర్పరిచింది. తూర్పు పంజాబ్ పాకిస్తానులోను, పశ్చిమపంజాబ్ భారత్‌లోను చేరారు.

తరువాత మరలా భారత్‌లో పంజాబు నవంబరు 1, 1966 లో మూడు యూనిట్లుగా విభజించబడింది. 1) పంజాబు భాష మాట్లాడే ప్రదేశాలన్నీ కలిపి పంజాబుగాను, 2) హిందీ మాట్లాడే జిల్లాలన్నీ చేర్చి హర్యానాగాను, 3) పర్వత ప్రాంతమంతా కలిపి హిమాచలప్రదేశ్‌గాను ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పరచబడ్డాయి. కనుక పంజాబు, హర్యానా, హిమాచలప్రదేశ్ మూడు ఒక తానులోని ముక్కలే ;

ఆనాడు జరిగిన దారుణమారణ హోమంలో విధ్వంసానికీ, విపరీతమైన కష్ట నష్టాలకీ గురయిన ఈ పంజాబు ప్రాంతమంతా కూడా ఈనాడు దేశమంతా గర్వించ తగిన స్థానంలో ఉందంటే దానిక్కారణం కేవలం అక్కడివారు జరిపిన నిరంతర నిర్విరామ కృషేగాని సహజవనరులో లేక ప్రత్యేక సిరులో మాత్రం కాదని అంటే అతిశయోక్తి కాదు. పంజాబు రాష్ట్రంలోని తలసరి ఆదాయం లెక్కలో తీసుకొంటే జాతీయ తలసరి ఆదాయం కంటే 50 శాతం ఎక్కువ. జనాభా లెక్కలో తీసుకుంటే అక్కడి జనాభా దేశ జనాభాలో దాదాపు 2 1/2 శాతం, అయితే దేశం మొత్తానికి ప్రధాన ధాన్యాగారమై విలసిల్లుతూ. 60 శాతం అధికంగా గోధుమలు, 50 శాతం అధికంగా వరిధాన్యం ఉత్పత్తులతో అగ్రస్థానంలో నిలుస్తూంది. దేశంలో మూడవ వంతు పాల ఉత్పత్తులు పంజాబులోనే. ఇండియా మొత్తంలో గల బ్యాంకు నిలవల్లో 5 శాతం పంజాబువే. సగటు ఆయుఃప్రమాణం లెక్కలోకి తీసుకొంటే సగటు భారతీయునిది 47 సంవత్సరాలయితే, పంజాబు రాష్ట్రంలో మాత్రం 65 సంవత్సరాలుగా గుర్తించబడింది. ఇంతటి విజయాల వెనుక ఉన్నటువంటి వారి నిర్మాణ కృషి ఎంతో మెచ్చుకోతగింది. పారిశ్రామికంగా కూడా పంజాబు దేశానికి తలమానికంగా ఉందనటంలో సందేహం లేదు. దేశం మొత్తంలో సైకిలు ఉత్పత్తుల్లో అతి పెద్దదైన హీరో సైకిలు ఫ్యాక్టరీ, లూధియానా పంజాబులో ఉంది.

ఇక్కడి ప్రజలు మద్యప్రియులు గూడ. శిక్కులంతా 'కీడా' అనే ఇనప కడియం ధరిస్తారు. శిక్కు అనే ప్రతివారి చేతికీ ఉంటుందది. అది వారి ఆచారం. 1966 చివరి వరకూ కలిసిఉన్న ఈ రెండు రాష్ట్రాలను కలిపే చూద్దాం. యాత్రిక ఆకర్షణ సంబంధంగా ఇటీవల రూపుదిద్దుకున్న చండీగర్ పంజాబు రాజధానీ నగరం. మరికొన్ని హర్యానాలో గల చరిత్ర, పురాణ ప్రసిద్ధమైన స్థలాలు చాలా ముఖ్యం.

## రాష్ట్రాలవారీగా వివరాలు విడివిడిగా :

## హర్యానా

1966 వరకూ పంజాబు రాష్ట్రంలోని ముక్క. తూర్పున ఉత్తర ప్రదేశం. పడమట పంజాబు, హిమాచల్‌ప్రదేశ్ ఉత్తరం, దక్షిణాన రాజస్థాన్ రాష్ట్రాలు సరి హద్దులుగా గల చౌరాస్తాగా అమరియున్న చిన్న రాష్ట్రం హర్యానా. దేశం మొత్తం లోను సాంస్కృతిక, సాంప్రదాయక, ధార్మిక సంపన్నుల వారసత్వముగా గలిగిన

ప్రదేశంగా చెప్పుకోవచ్చు మహాభారతకాలంలో జరిగిన కురు పాండవ ధర్మయుద్ధ వేదిక అయిన ధర్మక్షేత్రంగా పేర్కొనబడిన కురుక్షేత్రం ఇక్కడిదే. కృష్ణభగవానుడు భారత సంస్కృతితో విడదీయరాని సంబంధ బాంధవ్యాలు గలిగి దేశసాహిత్యంలో ప్రతి భారతీయుడ్ని అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ జీవన వాహినిలో అశేష ప్రపంచాన్ని, మానవజాతిని కర్తవ్యోన్ముఖంగా ప్రేరేపించి, ఉత్తేజపరిచే జనజీవన విధానాన్ని నిర్దేశించే 'భగవద్గీత' అర్జునునికి ఉపదేశం చేసింది కురుక్షేత్రంలోనే. భగవద్గీత జ్ఞాన, భక్తి, కర్మ, వైరాగ్యాల నుపదేశిస్తూ ధర్మబద్ధమైన జీవన విధానాన్ని నిర్దేశిస్తుంది. ఇది నారాయణుడు నరునికిచ్చిన ఉపదేశంగా పరిగణించబడుతుంది.

ఈ ప్రదేశం ప్రశస్తి మనుస్మృతిలో ఉటంకించబడింది. భరతవంశ ప్రాదుర్భావం జరిగింది పవిత్ర ప్రదేశంలోనే. ఈ భరత వంశీయుల్లో అనాది పురుషుడైన భరతుని వలననే మన దేశానికి భారతదేశం అనే పేరు సంభవించింది. వేదాలు, పురాణాల్లో ప్రస్తుతించబడిన పవిత్ర బ్రహ్మావర్తం ఈ ప్రదేశానికి చెందిందే. అటువంటి పవిత్ర స్థలాన్ని పొదువుకొనివున్న ఈ రాష్ట్రం భారత రాజధాని ఢిల్లీ మహానగరాన్ని కూడా మూడువైపులా ఆక్రమించి వళ్ళో కూర్చోబెట్టుకుంది.

రాష్ట్ర వైశాల్యం : 44,212 చ. కి. మీ. సుమారు

జనాభా : 1, 29, 23, 000 సుమారు

మాట్లాడే భాష : హిందీ, పంజాబీ

అక్షరాస్యత : 36 శాతం

స్త్రీ, పురుష నిష్పత్తి : 870 : 1000

జనసమ్మర్దం : చ. కి. మీ. కి 292 మంది

జనాభా ప్రాతిపదిక మీద దేశంలోని 15 వ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

**భౌతికంగా :**

హర్యానా స్థూలంగా రెండు రకాల వైవిధ్యముల కలయికగా రూపుదిద్దుకుంది. హిమాలయ పర్వత శ్రేణుల పాదాల విభాగం, గంగాతీర మైదానాలు. మైదాన ప్రాంతం చాలా సారవంతమైనది. ఉత్తర విభాగంలోని పర్వతాలు దక్షిణంగా ఏర్పడినవాలు తలంగా ఉన్న పర్వత ప్రాంతం సముద్ర మట్టానికి దాదాపు 700 అ. నుండి 900 అ. ఎత్తు వరకూ ఉంటుంది. నైఋతి దిశ అంతా నిస్సారమైన ఇసుక

ప్రాంతం. ఈ రాష్ట్రంలో ప్రవహించే జీవనదులు అంటూ ప్రత్యేకంగా ఏమీ లేవనే చెప్పుకోవచ్చు. ఈ రాష్ట్రంలో ప్రవహించే ఒకే ఒక్క నది ఉత్తరపు జాలుతో ప్రవహిస్తుంది. ఈ నదినే వేదంలో ద్రిశద్వతిగా పేర్కొనబడింది. వాతావరణం కూడా ఎండకాలం, శీతాకాలం రెండు తీవ్ర వైపరీత్యాలు కలిగి వుంటాయి. వర్ష పాతం— జూన్‌నెల నుంచి సెప్టెంబరు వరకు, ఋతుపవన ప్రభావం వల్ల వర్షాలు కురుస్తుంటాయి. శీతకాలపు వర్షాలు డిసెంబరు-ఫిబ్రవరి వరకు ఉంటాయి. కాని అంత ప్రాధాన్యంగా ఉండవు వర్షాలు. కాని రెండవ పంటమీద నీటి ప్రభావం ఉంది.

## సంగ్రహంగా చరిత్ర :

హర్యానా రాష్ట్ర ప్రాంతం అనాదిగా వేదపురాణ యుగాల కాలం నుండి గర్వించదగిన చరిత్ర ఉంది. విశిష్ట సంప్రదాయపు వారసత్వం వుంది. మొదటినుండి మధ్య యుగాల వరకూ ముస్లిముల దండయాత్ర వరకూ ఉన్నత శోభ వైభవాలతో వెలిగిందీ ప్రదేశం. అసలు ఈ ప్రదేశంలో అతి ముఖ్యమయినది స్థానేశ్వరం— తరువాత థానేశ్వరంగా పేర్కొనబడింది. క్రీ.శ. ఆరవ శతాబ్దం పుష్యభూతి వంశ రాజుల రాజధానిగా ఉన్నదీ స్థానేశ్వర్— ఈ వంశలోని వారే ప్రభాకర వర్ధనుడు, అతని కుమారుడు హర్షవర్ధనుడు. హర్షవర్ధనుడు తరువాత కనోజ్‌కి మార్చాడు. 8 వ శతాబ్దంలో హూణుల దండయాత్ర, 1014లో మహమ్మదు గజినీ, 1192లో ఘోరీ దండయాత్రలు చేసి దోచుకొన గలిగినదంతా దోచుకున్నారు. తరువాత బాబరు మొదలైన మొగలు చక్రవర్తుల వశం అయింది. మొగలాయిల ప్రవేశంతో సమ్రాజ్య రాజధాని ఢిల్లీకి మార్చబడినా ప్రత్యేకతను నిలబెట్టుకుంటూనే వుంది. 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం వరకూ విశిష్టంగా ఉండి స్వతంత్ర పోరాటంలో బ్రిటిషు గవర్నమెంటుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో విశుద్ధమైన పాత్ర వహించింది.

పోరాటాన్ని అణచి ఆంగ్లేయులు తమ పెత్తనాన్ని పునరుద్ధరించిన తరువాత ఝుజ్జర్ నవాబులు, బల్లబ్‌గర్, రేవారిరాజు రావ్‌తులారామ్ వారి ప్రాభవాన్ని గూడా సమయించారు. వారి రాజ్యాలన్నీ బ్రిటిషువారికి విధేయులయిన పాటియాలా, నాభా, జింద్ పాలకుల పాలనలోకి కలిపేయటం జరిగింది. ఈ విధంగా హర్యానా ప్రాంతా అన్నీ పంజాబు రాష్ట్ర విభాగంలోకి లాగబడ్డాయి.

ప్రస్తుత హర్యానా రాష్ట్రం 1966 నవంబరు 1న పంజాబుని రెండు వేరు వేరు రాష్ట్రాలుగా పునర్విభజన ఫలితమే అని వేరుగా చెప్పనక్కరలేదు. పంజాబు

లోని హిందీ మాట్లాడే వారికి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయబడింది భాషా ప్రాతి పదికగా.

పాలనా పరంగా ప్రస్తుతం రాష్ట్రం 12 జిల్లాలుగా విభజించబడింది. శాసన సభ రెండంచెలు కాకుండా ఒకే శాసనసభ. 90 మంది ప్రజా ప్రతినిధులు శాసన కర్తలు.

రాష్ట్రంలోని జిల్లాలు :

అంబాలా, కురుక్షేత్ర, కర్నాల్, జింద్, సోనేపట్, రోహతక్, ఫరిదాబాదు, గుర్గావన్, మహేంద్రనగర్, భివాని, హిస్సార్, సిర్సా.

వ్యవసాయికంగా అద్భుతమైన ఫలితాలు సాధించిన రాష్ట్రం. ఈ రాష్ట్రంలోనే దేశంలో మొట్ట మొదటగా పంటల భీమా సౌకర్యం అమలు పరచిన ఘనత వీరిదే: వ్యవసాయరంగానే కాక పారిశ్రామికంగా కూడా-చక్కెర పరిశ్రమ, సిమెంటు, పేపరు, కాటన్, టెక్స్టైల్స్, గ్లాస్‌వేర్, బ్రాస్‌వేస్, సైకిళ్ళు, ట్రాక్టరులు, మోటారు సైకిళ్ళు, గడియారాలు, టైర్లు-ట్యూబులు. శానిటరీవేర్, ఎలక్ట్రానిక్స్-టి.వి సెట్లు ముఖ్యంగా నూలు, ప్రత్తి, రిఫ్రిజిరేటర్లు, వనస్పతి, నెయ్యి, కాన్వాస్‌బూట్లు ఇలా ఎన్నో ఎన్నో గృహోప కరణాలు మొదలు నిత్య జీవితావసరాలయిన వస్తూత్పత్తిలో తలమానికంగా నిలుస్తూంది. ప్రజలంతా కష్టపడి పనిచేసేవారు. వీనికి తోడుగా పింజోరి దగ్గర H.M.T. ట్రాక్టర్ల ఫ్యాక్టరీ గూడా అమరి ఉంది.

హర్యానా 42 టూరిస్టు కాంప్లెక్సులతో బ్రహ్మాండమైన నెట్‌వర్కుని కలిగి వుంది. ఢిల్లీ, ఆగ్రా, జైపూరు- ఉత్తరాన కాశ్మీరులోయ, సిమ్లా, అమృత్‌సర్, చండీ ఘర్, భాక్రానంగల్ డామ్ యాత్రికుల ముఖ్య ఆకర్షణలు- దేశ విదేశీయులకు ఈ ప్రదేశాలన్నీ కలిపి గోల్డెన్ ట్రయాంగిల్ ఆఫ్ ఇండియాగా అభివర్ణించబడింది. ఈ యాత్రా కేంద్రాలకు వెళ్ళే ప్రధాన జాతీయ రహదారులన్నీ హర్యానా గుండా వెళ్లా ల్సిందే: మరో ప్రత్యేకత ఏమంటే పసిఫిక్ ఏరియా ట్రావెల్ ఎసోసియేషన్ వారి బహుమతులు అనేకసార్లు గెలుచుకోటమే గాక ఇండియా ట్రావెల్ ఏజంట్స్ అసోసి యేషన్ బహుమతులు గూడ ఎన్నో గెలుచుకున్నదీ హర్యానా. మరి అన్నిటా అభి వృద్ధి సాధించిన రాష్ట్రం- మనదేశ రాజధాని ఢిల్లీ నగరాన్ని మూడు వైపులా పెన వేసుకొని ఎత్తుకుని వున్నదిగా అభివర్ణించ దగినది. దీనికి ముఖ్యమంత్రి సర్వశ్రీ దేవీలాల్-లోకదళ్ (B) కాంగ్రేసేతర ప్రభుత్వం.

## హార్యానాలోని యాత్రికాకర్షణలు :

చండీఘర్ హర్యానా, పంజాబు రెండు రాష్ట్రాలకు రాజధానియే। చండీఘర్ చేరబోయే ముందు హర్యానాలోని యితర ముఖ్య ఆకర్షణలను పరిశీలిద్దాం.

## బాద్ ఖాల్ సరస్సు :

ఢిల్లీనుండి 35 కి.మీ. దూరం. ఫరిదాబాదు రైల్వే స్టేషనుకు 5 కి.మీ. దూరం మాత్రం. పర్వతాల దిగువ శ్రేణిలో రేఖాగణిత చిత్రాల్లాగా ఏర్పడి వున్న వాటి మధ్య అమరియున్న చక్కని సరస్సు. మధ్య మధ్య రాళ్ళు ఎత్తుగా ఉండి చిత్రంగా ఏర్చి కూర్చిన త్రిభుజాలు, చతురాలు అనేక రీతులుగా ఏర్పడిన ఆకారాలుగా చూడ ముచ్చటగా ఉంటుంది. ఏదో ఒక కయ్యలోంచి నౌకా విహారం చేయవచ్చు. చేపలు పట్టవచ్చు, కాని చేపలు పట్టడానికి కావలసిన అనుమతి కూడా అక్కడకక్కడే లభిస్తుంది. కావలసిన సరంజామా కూడా అద్దెకు దొరుకుతుంది.

అక్కడే కొంచం ఎత్తుగా ఉన్న గుట్టమీద ఎన్నో గదులున్న టూరిస్టు బంగళాలో విడిది చేయవచ్చు. కొన్ని కాటేజీలు కూడా వున్నాయి. చక్కని స్విమ్మింగ్ పూల్, హోటలు (కాఫీ ఫలహారశాల), షాపింగ్ ఆర్కేడ్, స్టీమ్‌బాత్, సవునాబాత్ సౌకర్యాలు వంటి విలాసాలతోపాటు, మాలీసులు వగయిరాలు కూడా వున్నాయి.

## సోహ్నా :

అల్వార్-జైపూరు రోడ్ మీద ఢిల్లీ నుండి 56 కి.మీ. దూరం. ఆరావళీ పర్వత పాదాల చెంతవున్న వేడినీటి బుగ్గలకు తీసికెళుతుంది. నిలువుగా ఉండే కొండమీద గల శోభాయమానమైన గృహాలు ఈ చిన్న పట్టణానికి అలంకారం. అక్కడ మంచి పరిశుభ్రమయిన కాటేజీలు యాత్రికుల సౌకర్యార్థం ఏర్పరచబడ్డాయి. ఈ వేడినీటి బుగ్గల నీటిని పంపుల ద్వారా కాటేజీలకు సప్లయి చేస్తారు. చక్కగా స్నానాలు చేయవచ్చు. మరింత సౌకర్యం కావాలనుకుంటే హర్యానా టూరిజమ్, సోనా వారిని సంప్రతించండి. ఫోను : 56.

ఇంకా హర్యానాలో అతి పెద్దదైన సహజ సరస్సు దందమ్మ-అతి దగ్గరిలోనే ఉంది. నౌకా విహారం, ఫిషింగ్ సౌకర్యాలుండి ప్రశాంత వాతావరణంతో మనస్సుకు ఆహ్లాదాన్నిచ్చేదిగా ప్రతీతి. ఇంకొంచం వెళితే దారుహెరాకి వెళ్ళే త్రోవలో తరా

పున్ దగ్గర మోర్‌పంఖ్ కూడా చాలా హాయినిచ్చే యాత్ర. ఎక్స్‌కర్షన్‌గా వెళ్ళవచ్చు లేదా మంచి పిక్నిక్ స్పాట్.

## సూరజ్‌కుండ్ సరస్సు :

దీనినే సూర్యకుండు అని తెలుగులో చెప్పుకోవచ్చు. సూర్య దేవాలయం శిధిలావస్థలో వుంది. ఢిల్లీ నుండి ఆగ్రా వెళ్ళే త్రోవలో 16 కి. మీ. దూరం మాత్రమే వుంది. సుమారుగా 1 కి. మీ. పొడవు, 600 మీటర్లు వెడల్పుగా అమరియుండి తీర్థవిధులకు ప్రశస్తమైనదిగా ప్రతీతి. ఇక్కడనే భార్గవరాముడు క్షత్రియ రక్తంతో తండ్రికి తర్పణాలు విడిచాడట. ధర్మరాజు భారత యుద్ధానంతరం పితరులకు పిండప్రదానం ఇక్కడే చేసినట్లుగా శృతం. పాండవులు తీర్థయాత్రలు సేవించే సమయంలో వచ్చిన గ్రహణ సమయంలో శ్రీకృష్ణభగవానుడు సైతం ఈసరస్సులో తర్పణాదులు విడిచాడని ప్రతీతి. అందుకే అనుశృతంగా సూర్యగ్రహణ సమయంలో పవిత్ర స్నానాదులు ఆచరించటానికి కొన్ని లక్షలమంది యాత్రికులు వస్తారట. ఇక్కడికి దగ్గరిలోనే నెమలి సరస్సు యూకలిప్టసు చెట్లు ఆవరించుకుని యున్నది కూడా.

సూర్య దేవాలయం సమీపంలోనే, అనంగపాలుని కోట, తుర్లకాబాదు కోట, పురాతనమైన అనంగపురపు ఆనకట్టలను కూడా దర్శించవచ్చు.

## సుల్తాన్‌పూర్ బర్డు శాంక్చువరీ :

ఢిల్లీకి 46 కి. మీ. దూరం 162 ఎకరాల విశాలమైన స్థలంలో ఈ ఖగశరణ్యస్థలి అమరియున్నది. ప్రశాంత వాతావరణంలోని పక్షుల కిలకిలారావాలు, ఝున్మని సాగే పిల్లవాయువుల తెమ్మెరలు, అప్పుడప్పుడు గాలివేసే ఈలలు మృదు మధుర మురళీరవాల్ని జ్ఞప్తికి తెస్తూ ఆహ్లాదకర వాతావరణంలో సరస్సు తీరవిహారం కమనీయమే ! ఈ సరస్సు తీరంలో అనేక వలస పక్షులు, రకరకాల రంగు రంగుల వింత పక్షి జాతులు సందడి చేస్తూ తోడుగా వుంటాయి.

ఇక్కడి ప్రశాంత వాతావరణంలో గడపటానికి జలాల చెంతనే విశ్రమ గృహాలున్నాయి. విచారణకు ఫోన్ : 42.

## హత్నికుండ్ అండ్ కాలేసార్ :

ఢిల్లీకి ఉత్తరంగా250కి.మీ దూరంలో పావన యమునాతీరంలో హత్నికుండం సరస్సు ఉంది. సెలవు రోజుల్లో సర్దాగా పిక్నిక్ వేసుకోవచ్చు. అనతి దూరంలోనే తజేవారా మరోటి ఇలాంటిదే. హత్నికుండ్‌లోని గెస్టుహౌస్ ఒక ఎత్తయిన గుట్టమీద ఉంది. అక్కడినుండి చూస్తే యమున హొయలొలకబోస్తూ వయ్యారంగా దక్షిణపు జాలుగా ప్రవహిస్తూ మైదాన ప్రదేశం కనులార చూడవచ్చు. ఎంత అందమైన దృశ్యమది !

దీనికి అనతి దూరంలోనే కాలేసార్ అడవి - అందులో వన్యమృగ సంరక్షణ కేంద్రం ఉన్నాయి. ఇక్కడ చిరుతపులి, సంబార్, మెరిగే లేడి, హైనా లాంటి జంతువులను విశేషంగా చూడవచ్చు. ఇక్కడ ఒక రెస్టు హౌస్ వుంది. రిజర్వేషను లకు : డివిజనల్ ఫారెస్టు ఆఫీసరు — అంబాలావారిని సంప్రదించవచ్చు. అయితే మనకు కావలసిన సంబారాలు అన్నీ మనం వెంటతీసుకుని వెళ్ళాలి, లేకుంటే ఆకలి, అసౌకర్యం తప్పవు, జాగ్రత్త.

## యాదవేంద్రోద్యానం :

పింజోరె-17వ శతాబ్దంలో ఔరంగజేబు సేనాని మంచి నిర్మాణదక్షుడయిన ఫిదాయిఖాన్ ఏర్పాటు చేసినవి. అసాధారణమైన వ్యూహంగా తోస్తుంది. సింహ ద్వారం అన్నిటికంటే ఎత్తయిన టెర్రేస్ మీదకు తీసుకు వెళుతుంది మొదట. అక్కడినుండి ఆరు అంచెలు క్రిందికి అవరోహణ క్రమంలో దిగుడు కనబడతాయి. మూడు బ్రహ్మాండమైన విశాల ఆవరణలు- గలగల పారే జల తరంగినులు, ఉవ్వెత్తున ఎగసిపడే ఫౌంటెన్‌లు, పచ్చని పసిరికలు అందులో రంగు రంగుల రంగవల్లులు తీర్చి నట్లున్న పుష్పవృక్షాలు, వీటన్నింటినీ పర్యవేక్షిస్తున్నట్లు, కాపలాగా ఉన్నట్లుగా ఎత్తుగా నిటారుగా అటెన్షన్‌లో నిడబడిన స్ప్రెస్ వృక్షాలు-వారాంతంలో రాత్రిపూట వింత శోభను గూర్చే విద్యుదలంకారాలతో అలరారే ఈ ఉద్యానవనాలు చూడ రెండు కళ్లూ చాలవు. దీనికితోడు చిన్న జూ కూడా. పిల్లలకు మరింత వినోదం. వీటన్ని టికీ తోడు ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఎన్నో పురాతన దేవాలయాలు. పూరంటే పూరా—పూరించేది. ఢిల్లీకి 270 కి. మీ. అయితే గండీఘర్‌కి మాత్రం 22 కి.మీటర్లే!

## మోర్ని హిల్స్ :

పింజోరెకి 35 కి. మీ. దూరంలో ఉన్న చక్కని పర్వత విశ్రాంతి స్థలం. సముద్ర మట్టానికి 4000 అడుగుల ఎత్తులో కాస్తంత పర్వతారోహణకు కూడా అను వైనది.

పురాతనమైన కోట-శిథిలావస్థలో వున్నది ఒకటి - నిరామయంగా పడి ఉంది. ఇక్కడ ఒకానొకప్పుడు ఒక మహారాణి అందాల భరిణ ఉందిట. అదేదో చిదంబర రహస్యం. ఎప్పుడో-మరి? ఎవరో మరి!

ఉండటానికి PWD రెస్టు హౌస్, ఫారెస్టు రెస్టు హౌస్ రెండున్నాయి.

## కర్నాల్ :

ఢిల్లీనుండి 120 కి. మీ. దూరం. అతి పురాతన ప్రశస్తి వున్న పట్టణం. మహాభారత కాలంలోని సుయోధన సార్వభౌముని అనుంగు మిత్రుడు, దానకర్ణుని మర్చిపోకుండా జ్ఞాపికగా ఈ పట్టణం ఆయన పేర వెలసిందంటారు. కర్ణ సరస్సు, ఉచ్చన కర్నాల్‌కి 5 కి. మీ. దూరంలో ఉన్నది. అమృతసర్‌కి వెళ్ళే త్రోవకూడా - ఒక మంచి యాత్రిక ఆకర్షణ.

## కురుక్షేత్రం :

మహాభారత కాలంనించీ ప్రశస్తమైన ప్రదేశం. మహా భారత కథానాయకుల మూలపురుషుడైన కురు మహారాజు యజ్ఞార్థీ ఈ భూమిని నాగలిపట్టి దున్నిన కారణం చేత ఈ పవిత్రస్థలం కురుక్షేత్రంగా ప్రసిద్ధి చెందినది. కురు పాండవులకు జరిగిన మహాభారత యుద్ధము 18 అక్షౌహిణుల సైన్యంతో జరిగిన యుద్ధ రంగం. అయితే ఆధ్యాత్మిక తత్త్వవిదులు ఈ యుద్ధాన్ని ధర్మాన్ననుసరించి విషయవాసనలమీద అరిషడ్వర్గాన్ని జయించడానికి, జితేంద్రియత్వానికి మార్గదర్శకమైన కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలమీద మానసిక ఆధిపత్యం కోసం జరిగే యుద్ధంగా అంత రార్థం నిక్షేపించబడిందని వివరిస్తారు. నరునకు నారాయణుడు భక్తి, జ్ఞాన, కర్మ, వైరాగ్యములను బోధించిన దివ్య జ్ఞానోపదేశం గావించి భగవద్గీతోపదేశం జరిగిం దిక్కడనే. నేడు ప్రపంచ మానవాళికి ఉత్తమ కర్తవ్య నిర్దేశంగా ప్రస్తుతి పొందింది. బహుళ ప్రచారంలో వున్న మహా గ్రంథమైంది భగవద్గీత. ఈ పవిత్ర దేశంలోనే వసిష్ఠ, విశ్వామిత్రులు బ్రహ్మర్షి పదాన్ని పొంది దివ్యత్వమును పొందారు. భారత యుద్ధంలో మరణించిన భీష్ముడు ఉత్తరాది పుణ్యకాలం వరకు అంపశయ్యమీద పవ

శించి ఆఖరి క్షణాల్లో నిర్యాణం కోసం ఎదురు చూస్తూ గడిపిందిక్కడనే. పరశు రాముడు శత్రుకధానంతరం తన పరశువుని శాశనం చేసి రక్త తర్పణాలు చేసిన శమంత పంచకం ఇక్కడిదే. వాల్మీకి, వేదవ్యాసుడు, పాణిని, పతంజలి మొద లైన మహా మునులు జగత్కళ్యాణ రచనలు ఇక్కడనుంచే సాగించారు. మనువు మొదలయినవారు ధర్మశాస్త్ర ప్రవచనాలు జరిపింది కూడా యిక్కడనే. ఇన్ని లోకోపయోగ కారకమైన గొప్ప పనులు సూది గుచ్చినట్లు ఇక్కడినుంచే జరిగినవంటే ఈ స్థలమహాత్మ్యమును వేరుగా చెప్పబని లేదు. పేరు తలుచుకొన్నంతనే ప్రతి భార తీయుని హృదయం పొంగిపోతుంది. ఈ క్షేత్ర వైశాల్యం కొన్నివేల కిలోమీటర్ల పర్యంతం విస్తరించి ఉన్నది. భూమి ఎర్రగా ఉంటుంది. 300 పైగా పుణ్యస్థలాలు న్నాయి. ఒక పెద్ద సరస్సు ఉంది. మహత్వపూర్ణమైంది. ఇక్కడ పశువులను కొట్టడం, గోహింస చేయటం, చేపలు పట్టటం నిషేధం. దీన్నే జ్యోతిసర్ అని కూడా అంటారు.

గ్రీకురాయబారి మెగస్తనీసుగాని, చైనాయాత్రికులు పాహియాన్, హ్యూయన్ సాంగులుగాని భారత దర్శనానికి వచ్చి ఇక్కడి ఈ క్షేత్రాన్ని చూచి దీని ప్రాచీన శోభావిశేషాల్ని గురించి గొప్పగా చెప్పారు ప్రాచీన ఆలయాలు దర్శనీయం. ఇక్కడ దగ్గరిలోనే వున్న స్థానేశ్వరం కూడా దర్శించదగింది.

## స్థానేశ్వర్ :

క్రీ. శ. 7వ శతాబ్దంలో పాలించిన హర్షుని రాజధాని, తరువాత ఈయనే తన రాజధానిని కనోజ్‌కి మార్చుకున్నాడు. ఆనాడు విశేషమైన జన సమ్మర్ధంతో 10 లక్షల జనాభాతో శోభిల్లిన మహానగరం నేడు. కేవలం 10000 వేలలోపు గల జనాభాతో చిన్న కుగ్రామమైంది. కాలమెంత విచిత్రమైంది। కాదంబరి కృతికర్త యైన బాణ భట్టాచార్యులు వసించిన దిక్కడనే. స్థానికంగా ఉన్న స్థానేశ్వరాలయం చూడవచ్చు. ప్రస్తుతం ఇది థానేశ్వరంగా పిలవబడుతుంది.

## అక్షయ వటవృక్షం :

గీతోపదేశానికి సాక్షిభూతంగా యుగయుగాల నుంచి నిలిచింద టీ వటవృక్షం. ఈ వృక్షంక్రింద యాత్రికులు గీతాపఠనం, ధ్యానం వగయిరాలు చేస్తుంటారు శక్తి సమయాలననుసరించి. అతి పవిత్ర స్థలంగా, పుణ్యప్రదంగా ఎంచబడేదిగా పేర్కొన బడింది. ఏటా మార్గశిర అమావాస్యకు గొప్పఉత్సవాలు జరుగుతాయి. గ్రహణ

కాలంలో స్నానమాచరించటం అతి పవిత్రంగా భావించే యాత్రికులు లక్షల కొంది వస్తారు.

ఇక్కడ చూడదగినవి :

గీతాభవన్ లైబ్రరీ :

దాదాపు 300 భాషల్లో ముద్రింపబడిన భగవద్గీతా గ్రంధములు భద్రపరచ బడి వున్నవి చూడవచ్చు. వీటిలో విదేశీ భాషలైన ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి, మొదలగు భాషల్లోవి ఉండటం ప్రత్యేకత. ఈ భవనాన్ని రేవా మహారాజావారు నిర్మించారు. ఇక్కడ గల అనేక మందిరాల్లో ముఖ్యంగా గీతోపదేశ మందిర్, వ్యాసగౌడియామఠం, రాధాకృష్ణ మందిర్, సర్వేశ్వర మందిరం, బిర్లామందిర్ చూడ దగినవి.

ప్రత్యేకంగా కురుక్షేత్ర సరస్సులో మధ్యంగా అమరియున్న ఆలయం చేర టానికి ఒక చక్కని వంతెనద్వారా కలపబడి ఉన్నది. దాన కర్ణుడుగా పేరుపొంది ఇప్పటికీ గణనీయంగా కొనియాడబడుతున్న కర్ణుడు మనుగుల కొద్దీ బంగారం దానం చేసింది కూడా ఇక్కడనే. పండాలు దీనాలుకోసం బహుపీడిస్తారు.

జ్యోతీశ్వరాలయం, స్థానేశ్వర మహాదేవ ఆలయం, బాణగంగ చూడదగినవి. బాణగంగ-భీష్ముని దాహము తీర్చటం కొరకు తన బాణప్రయోగంతో పాతాళగంగను పైకి తెప్పించి పవిత్రమైన జలదారలతో ఆయన దాహశాంతిని కలిగించిన దివ్యమయి నదని ప్రతీతి. ప్రస్తుతం ఇది ఒక కోనేరుగా ఉంది. ఇక్కడే అష్టాదశ శక్తి పీఠాల్లో తొమ్మిదవది మహామాయి శక్తి నిలయంగా ప్రసిద్ధి.

అనూపు షహార్ :

ఢిల్లీకి నైఋతిమూలగా సుమారు. 125 కి. మీ. దూరంలో గంగా భాగీరధీ పశ్చిమ తీరంలో మధ్య యుగాల కాలంలో నిర్మించబడింది. దీన్ని నిర్మించిన వారు రాజా అనూపురాయ్. కార్తీక పూర్ణిమకు జరిగే ఉత్సవంలో పాల్గొనటానికి, స్నానం చేయటానికి యాత్రికులు చుట్టు పట్లనుండి అనేకమంది వస్తారు. జపానుష్ఠానానికి మంచి అనువైన తావుగా ప్రసిద్ధి.

ఇతర యాత్రిక ఆకర్షణలు :

ఢిల్లీకి 160 కి.మీ. దూరంలో హిస్సార్ జిల్లాలో వ్యవసాయరంగంలో అనేక నూతన ప్రయోగాలతో, మరెంతో సాంకేతికంగా అభివృద్ధిని సాధించిన ప్రదేశంగా

చెప్పుకోవచ్చు. ఎడారిలో పూలు పూయించి, పంటలు పండించే విధానంతో రాష్ట్రాన్ని సశ్యశ్యామలంగా చేసుకున్న ప్రదేశాలెన్నో వున్నాయి. ఇక్కడ వున్న వ్యవసాయ విశ్వవిద్యాలయం, పశువుల పెంపక కేంద్ర క్షేత్రాలు దర్శనీయం. అభిరుచి, ఆసక్తి గలవారు తప్పక దర్శించ దగిన వి క్షేత్రాలు. ఆధునిక విజ్ఞానం మానవజాతి శ్రేయస్సుకు అన్నివిధాలా సద్వినియోగపరచ బడిందన్నది సాక్షీభూతమైంది. ఈ జిల్లాలోని హన్సి ప్రాచీన దేవాలయాలకు ఆలవాలమైతే భివాని రాజస్థాన్‌కి సింహద్వారం లాంటిది.

**పానిపట్టు :**

ఢిల్లీనుంచి 88 కి. మీ. దూరంలో యమునానదీ తీరంలో అమరియున్నది. ఇక్కడే మూడు చరిత్రాత్మకమైన యుద్ధాలు జరిగాయి. మొదటి పానిపట్టు యుద్ధం 1526 సం॥లో మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరుకి ఇబ్రహీం లోడీకి మధ్య జరిగింది.

రెండవ పానిపట్టు యుద్ధం— 1556 ఆదిల్‌షాసూరి మంత్రి హిమూ—బాబరు మనుమడైన అక్బరుకి జరిగింది. ఇందులో అక్బరు విజయుడైనాడు.

మూడవ పానిపట్టు యుద్ధం 1761 లో ఆఫ్గన్ దండయాత్రికుడైన అహమ్మద్ షా అబ్దాలికి – మరాఠులకి జరిగింది. ఈ యుద్ధంతో మరాఠులు తుడిచి పెట్టబడ్డారు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమిటంటే అబ్దాలి ఆఫ్గన్‌కి తిరిగి వెళ్ళిపోయాడు. తత్ఫలితంగా బ్రిటిషు వారి ఆధిపత్యం దేశంలో సుస్థిరంగా నిలబడటానికి మార్గం సుగమంగా రాచబాట వేయబడింది.

**సమల్ఖా :**

ఢిల్లీకి 70 కి. మీ. దూరంలో పానిపట్టుకి వెళ్ళే త్రోవలో ఉన్న చక్కని టూరిస్టు కాంప్లెక్సు– ఇక్కడ క్యాంపు కుటీరాలు, రెస్టారెంటు, బార్ చౌకలో అమరిన చక్కని విశ్రాంతికేంద్రం.

**ఫరిదాబాదు :**

ఢిల్లీనుండి 30 కి. మీ. దూరంలో ఉన్నది. ఇక్కడే మెగ్‌పీ రెస్టారెంటు టూరిస్టు కాంప్లెక్సుఉంది. హడావుడిగా వచ్చే పోయేవారికి జైపూరునుండి ఆగ్రావెళ్ళేవారు ఒకంతసేపు విశ్రాంతి తీసుకోటానికి అనువైన విశ్రాంతి కేంద్రం.

ఢబ్ చిక్ కాంప్లెక్సు :

ఢిల్లీ నుండి 92 కి.మీ. దూరంలో ఆగ్రా వెళ్ళేవారు కాసంత విశ్రాంతి తీసి కోటానికి చక్కని టూరిస్టు కాంప్లెక్సు. ఆగ్రాలో చూడబోయే తాజ్‌మహల్‌ని గురించి కొంచెం సేపు మనస్సులో చక్కని ఊహలు మెదిలేందుకు సరియైన వసతి గృహం. ఈ ప్రదేశాన్ని హోడల్ అని అంటారు.

జైపూరుకి వెళ్ళే దోవలోని గోర్‌గావ్, దారుహెరా కూడా గమనించతగ్గ టూరిస్టు కాంప్లెక్సులు.

రోహతక్ :

రోహతస్ ఘర్ పేరుమీదనే దానికి రోహతక్ అనే పేరువచ్చిం దీ పట్టణానికి. ముస్లిముసోదరులకి, దీనా, అదీన మసీదులు ఆకర్షణ కేంద్రాలు ఈ చిన్ని పట్టణంలో. హిందువులకి విష్ణువు, హనుమాన్, దేవీ మందిరాలు మరో ప్రక్కన పూజనీయమైన మందిరాలు ముఖ్య ఆకర్షణలు. పట్టణం నడిబొడ్డునే రెండు యాత్రిక విశ్రాంతి కేంద్రాలున్నాయి. జైన తీర్థంకరుల విగ్రహాలతో మఠం, హిందువులకి నాథ సాంప్రదాయంలో కంఫాత జోగినుల ఆశ్రమం కూడా చూడదగినవి. క్రీ. శ. 8–9 శతాబ్దాలనాటి ప్రతీహార విద్యాలయపు శిల్ప విశేషాలు ఇక్కడ కనుగొనబడ్డాయి.

హర్యానాలోని గ్రామీణ అందాలు వీక్షించడానికి అనువుగా అమరించబడింది కాలాటీటారు టూరిస్టు కాంప్లెక్సు. ఫజిల్కా వెళ్ళే త్రోవలో అబూబ్ షెహర్ అనే పేరుగల పట్టణంలో. దగ్గరలోనే ఉన్న అసఖేరా వలస పక్షుల వింత ఆగమనాన్ని వీక్షించవచ్చు.

హర్యానా రాష్ట్రం గురించి ప్రత్యేక సమాచారం గురించి ఢిల్లీనుండి బయలు దేరబోయేముందే ఢిల్లీలోని– హర్యానా గవర్నమెంటు టూరిస్టు బ్యూరో, చంద్రలోక్ బిల్డింగ్, 36 జనపథ్, న్యూఢిల్లీ–110001 లో విచారించి వెళ్ళవచ్చు.

అటు చండీఘర్ నించి అయితే
చండీఘర్‌లోని—హర్యానా టూరిజమ్ కార్పొరేషను,
111–113, యునైటెడ్ హౌస్, సెక్టర్ 17 B,
చండీఘర్–160 017 లో విచారించవచ్చు.

# పంజాబు

ప్రస్తుతం తీవ్రవాదుల (టెర్రరిస్టులు)తో మహా అల్లకల్లోలంగా ఉన్న ప్రదేశం. ఇక్కడ నివసించే శిక్కులు రాజకీయావసరాలేమిటో ప్రపంచ ప్రజలకు అర్థం కాని పరిస్థితిలో ఉంది. ప్రతిరోజూ వార్తా పత్రికల్లో మనం చూస్తునే వున్నాం. టెర్రరిస్టుల ఆగడాలు అల్లకల్లోలాలు-ఎన్ని విధాలుగా వారిని సమాధాన పరచాలన్నా వీలు గాని పరిస్థితులకు అమాయక ప్రజలెంత మందో బలై పోతున్నా రీ రాష్ట్రంలో. వారికి ప్రత్యేకంగా 'ఖలిస్తాన్' కావాలంటున్నారు. ఈ ప్రాంతంలో దేశ విభజన సమయంలో జరిగిన దురాగతాల్లో ఎంత నష్టపోయినా, కష్టపడి దేశం మొత్తం మీద సంపన్న రాష్ట్రంగా నిలబెట్టుకున్నారు శిక్కు సోదరులు. వారి అసమాన కృషికీ, అసాధారణ ప్రజ్ఞా ప్రాభవానికి మచ్చుతునకగా రాష్ట్రాన్ని మలచుకొన్న ఘనత ఈ ప్రాంతీయులదేనన్నది నిర్వివాదం. స్వేచ్ఛాప్రియత్వం, ధీరోదాత్తత ముక్కుకు సూటిగా వెళ్లే నిర్భీకత యీ ప్రజలకు ఉగ్గుపాలతో అబ్బిన సుగుణాలు. ప్రాంతీయ దురభిమానాలు, మత ఛాందసత్వం ఒక ప్రక్కన పెడితే గాని పంజాబును సమగ్రంగా చూడలేము. అనిశ్చితత్వం, ప్రాణభయం చోటు చేసుకున్న యీ చోటుని దర్శించాలంటే అడుగడుగునా ఎదురయ్యే గడ్డు పరిస్థితుల్ని అధిగమించవలసి ఉంటుంది.

సమగ్ర స్వతంత్ర భారతావనిలో కల్లోలిత ప్రాంతంగా ఇప్పటికి అనేక ఒడుదుల్ని ఎదుర్కొవలసి వస్తున్న ఈ రాష్ట్రాన్ని గురించి-

వైశాల్యం : 50362 చ.కి.మీ.

ముఖ్యపట్టణం : చండీఘర్

జనాభా : 1,70,00,000 పైగానే సుమారు

మాట్లాడే భాష : పంజాబి, హిందీ.

అక్షరాస్యత : 41 శాతం.

స్త్రీ పురుష నిష్పత్తి : 879 : 1000

జనాభా రీత్యా- 14వ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

భౌతికంగా :

పడమట దిక్కున పాకిస్తాన్, ఉత్తరాన జమ్మూ కాశ్మీరం, ఈశాన్యంగా హిమాచల ప్రదేశం, దక్షిణాన హర్యానా (జ్ఞాతిరాష్ట్రం), రాజస్థాను రాష్ట్రాలచే ఆవ

రించబడి ఉన్నది. స్వరూప స్వభావాన్ని బట్టి రెండు భాగాలుగా విభజించవచ్చు. శివాలిక్ ఉపపర్వత ప్రాంతం – ఎగువ రోపార్ ప్రాంతము, హోషియార్‌పూర్, గురుదాస్‌పూర్ జిల్లాలు.

సట్లెజ్–ఘగ్గర్‌నదీ మైదాన ప్రాంతం :- ఈ రాష్ట్రంలో అతి సారవంతమైన భూమిగల ఈ ప్రాంతాన్ని సజలపూర్ణం చేయటానికి, రావి, సంధు, బియాస్, సట్లెజ్ మరియు ఘగ్గర్ నదులు ప్రవహిస్తున్నాయి.

సంగ్రహ చరిత్ర :

పంజాబు దేశానికి వాయువ్య దిశన ఉంది. పంచనదులు కలిసిన ప్రదేశంగా పర్షియా భాషలో రెండు పదాల కలయికయే ఈ ప్రదేశానికి సార్థక నామధేయం అయింది పంజాబు. ఈ సార్థక నామానికి ముందు ఒక్కో కాలంలో ఒక్కో పేరుతో పిలవబడుతుంది. ఇతఃపూర్వం సప్తసింధు అని పిలవబడేది. ఏడునదులు– సింధు, వితస్త (జీలం), అసుహి (చీనాబ్), పురుషిన్ (రావి), విపాశ (బియాస్), శరద్ర (సట్లెజ్), సరూరి (సరస్వతి). వీనిలో సరస్వతినది ఎండిపోయింది. భూగర్భ శాస్త్రజ్ఞుల కథనం ప్రకారం ఈ నదీచాయలు మాత్రం ప్రస్తుతం హర్యానాలో ప్రవహించే సీజనల్‌గా వుండే వాగులవంకగా పేర్కొనబడింది. గ్రీకుల ఆక్రమణ సమయంలో ఈ ప్రదేశం మొత్తంలో ఐదు నదుల ఉనికి మాత్రమే కనబడే విధంగా కుంచించుకు పోయిందని చెప్తారు అప్పటినించి పాంచ్+అబ్=పంజాబుగా పేర్కొనబడింది. ఉత్తరం వైపునించి వచ్చే దండయాత్ర చేసే వారికి ముఖద్వారంగా ఉండటంతో ప్రధాన యుద్ధవేదికగా ఉందని చెప్పవచ్చు. చరిత్ర ప్రాధాన్యం ఆర్యుల ప్రవేశంతో మొదలయింది. మధ్యఆసియా నించి వలసలు వచ్చిన ఆర్యులు తొలివేద కాలంలో నివాసాలు ఏర్పరుచుకున్నారు. సింధు పరీవాహక ప్రాంతంలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నట్లుగా చరిత్ర చెబుతుంది. మొదట ఈ ప్రదేశాన్ని క్రీ.పూ. 522 ప్రాంతంలో పర్షియారాజు 'డారియస్' దండెత్తి వచ్చి పర్షియా దేశానికి సామంతంగా చేశాడు. ప్రపంచ విజేత క్రీ.పూ. 326లో పంజాబుని వశం చేసుకొన్నాడు. కొంతకాలం మాసిడోనియా గ్రీకు సైన్యాధికారులు పాలించారు. తరువాత చంద్రగుప్త మౌర్యుడు వీరిని జయించి ఈ నేల మొత్తం మౌర్య సామ్రాజ్యంలో భాగంగా కలిపి వేశాడు. మౌర్య సామ్రాజ్య పతనం తరువాత సిథియనులు, పార్థియనులు, కనిష్కులు వరుసగా పాలకులైనారు. తరువాత అనేకమంది వివిధ వంశాల వారు, తరగతుల వారు పాలించారు. తరువాత కాలక్రమేణ జరిగిన ముస్లిము దండయాత్రలు అనేకం జరిగాయి.

ఇది ముఖ్యంగా బాబరుతో మొదలయింది. మొగలుల సామ్రాజ్య పతనాంతరం 1738 నాదిర్‌షా, అహమ్మద్‌షా, అబ్దాలి 1748, 1750, 1751ల్లో దండయాత్రలు జరిగాయి. ఈ సమయమే పంజాబ్ చరిత్రలోని అత్యంత విషాదభరిత ఘట్టం.

ఈ నేపథ్యంలో సిక్కు మతము అనేది 15-16 శతాబ్దాల్లో గురునానక్ స్థాపించారు. తరువాత ఈ మత వ్యాప్తికి 9 మంది గురువులు తోడ్పడ్డారు. తరువాతి 200 సంవత్సరాలూ ఒక సుశిక్షతమైన వ్యవస్థగా రూపొందటం జరిగింది. జాతి మొత్తం యుద్ధవీరులుగా మలచబడ్డారు. గురుఅంగద్ ఆనాడు వున్న అన్నిటినీ సమన్వయం చేసి గురుముఖిని రచించాడు. గురురామ్‌దాస్ అమృతసర్ నగరానికి శంకుస్థాపనచేసి శ్రీకారం చుట్టాడు. గురు అర్జున్‌దేవ్ శిఖ్ఖు మత ప్రమాణ గ్రంథమైన ఆది గ్రంథమును పొందు పరిచాడు. అర్జున్‌దేవ్ కుమారుడైన హరగోవిందు వీరిని యుద్ధవీరులుగా శిక్షణ నిచ్చారు. పంజాబును బ్రిటిషు ఇండియాలో చేర్చినవారు లార్డ్ డల్హౌసీ. ఆనాటినుండే పంజాబు మొత్తం వారిచేతిలో ఖడ్గమైంది. సుశిక్షితమైన వీర వర వర్గాన్ని గుప్పిటలో ఉంచుకుని పెత్తనం సాగించింది బ్రిటిషు ప్రభుత్వం మన దేశంలో. 1937లో చుట్టుప్రక్కల ఉన్న అన్నింటితోటి పంజాబ్ రాష్ట్రంగా ఏర్పాటు చేయబడింది. దేశవిభజన వరకూ ఏకరాష్ట్రంగా ఉన్నది. తర్వాత రెండు ముక్కలై ఒకటి పాకిస్తాన్ పరమైంది. రెండవది స్వాతంత్ర భారతదేశంలో చేరినదైంది. దరిమిలా రాష్ట్ర పునర్వ్యవస్థీకరణలో భాగంగా మూడు ముక్కలైంది- పర్యవసానమే 1966 నవంబరు ఒకటిన జరిగినదానికి పర్యవసానమే పంజాబు, హర్యానా, హిమాచలప్రదేశ్‌ల ఆవిర్భావం.

పాలనాపరంగా 12 జిల్లాలుగా విభజించబడింది- జిల్లాలు :-

అమృత్‌సర్, భటిండా, ఫరీద్‌కోట్, ఫిరోజ్‌పూర్, హోషియార్‌పూర్, గురుదాస్‌పూర్, జలంధర్, కపుర్థలా, లూధియానా, పాటియాలా, సంగ్రూర్, రోపార్.

రాష్ట్రం అంతా వ్యవసాయకంగా మిగులు రాష్ట్రం. పారిశ్రామికంగా మంచి అభివృద్ధి పథంలో చకచకా ముందడుగువేస్తూ దేశంలోని పెద్దపారిశ్రామిక రాష్ట్రంగా విదేశీ మారక ద్రవ్యాన్ని కూడా సంపాదించి పెడుతుంది. రాష్ట్రమంతటా లక్షకు పైగా చిన్న తరహా పరిశ్రమల కాలవాలమై 5, 6 లక్షలమంది ఉపాధికల్పనకు దోహదపడుతుంది. సంవత్సరానికి దాదాపు 2000 కోట్ల రూపాయల వస్తుసామాగ్రి విదేశీ వ్యాపారం చేస్తుందీ రాష్ట్రం.

1987 నుండి కల్లోలిత ప్రాంతంగా రాష్ట్రపతి పాలనలో వుంది. ఇప్పటికీ తీవ్రవాదులు రాష్ట్రంలో కల్లోలాన్ని సృష్టిస్తూనే వున్నారు. విదేశీయులు రాష్ట్రాన్ని సందర్శించాలంటే ప్రత్యేక అనుమతి పొందాల్సి వుంటుంది. దీనికి కావలసిన అనుమతిని ఢిల్లీలోని హోమ్‌మినిస్ట్రీ శాఖ ఇస్తుంది. మొదటగా రాష్ట్రరాజధాని చండీఘర్‌ని చూద్దాం.

## చండీఘర్

ఇంతకు ముందు చెప్పినట్లుగా హర్యానా, పంజాబులకి ఉమ్మడి రాజధాని. ఇటీవల పంజాబులోని శిఖ్ఖులని శాంత పరచటానికి జరిగిన ప్రయత్నాల్లో భాగంగా లోంగోవాల్ ఒప్పందంలోని భాగంగా సర్వే జరిపించి చండీఘర్‌ని పంజాబు రాష్ట్రానికి దత్తం చేయబడింది. అయితే హర్యానా రాష్ట్రం స్వంత రాజధాని ఏర్పాటు చేసుకునే దాకా వారి ప్రధాన కార్యాలయాలు కూడా చండీఘర్‌లో ఉండే ఏర్పాటు జరిగింది. జనులు శాశిభక్తులట. అందుకే ఈ పేరు అని ప్రతీతి.

చండీఘర్ ఎలా ఏర్పడింది? పంజాబు రాష్ట్రంలో ప్రధాన పట్టణంగా అమృత్‌సర్‌ని పేర్కొనవచ్చు. ఇదిబంగారు నగరంగా ప్రసిద్ధి. అయితే పాకిస్తాన్ సరిహద్దుల్లో వున్న కారణంగా సురక్షితమైన మరోచోటు చూసుకోవాల్సి వచ్చింది. అయితే అమృత్‌సర్ ప్రాధాన్యత ఏ మాత్రం తగ్గలేదనే చెప్పాలి. పర్యవసానంగా చండీఘర్ ఆవిర్భావం జరిగింది. హిమాలయ పర్వతపాదాల ప్రదేశంగా పేర్కొనడానికి శివాలిక్ కొండల శ్రేణి అంచున అతినూతనంగా 1950 ప్రాంతంలో ఫ్రెంచి నగర నిర్మాణ దక్షులైన శ్రీ లీకార్బ్యూయిజక్ వారి ఆధ్వర్యంలో చక్కగా ప్లాను ప్రకారం నిర్మించబడిన నగరం. నగరం మొత్తం 47 సెక్టరులుగా విభజించబడింది. రైల్వే స్టేషను వూరికి దూరంగా వుంది. 17వ సెక్టరులో వున్న బస్సుస్టేషను సౌకర్యంగా ఉంటుందనటంలో సందేహం లేదు. ఈ నగర జనాభా షుమారు 4,50,000. ఆధునికంగా అన్ని సౌకర్యాలు అమరియున్నాయి.

సెక్రటేరియట్ మొదలయిన ముఖ్య ప్రభుత్వ భవనసముదాయం 1 సెక్టరులో ఉన్నది. ఉదయం 10 గం. – 12 గం. మధ్య సెక్రటేరియట్ భవనంపైకి ఎక్కి చూడటానికి అవకాశం వుంది. నగరం మొత్తం దృశ్యమానంగా కనబడుతుంది. నగరం మధ్యలో నగర చిహ్నంగా రా రమ్మనట్లు పిలుస్తున్నట్లుగా ఊగే పెద్ద చేయి ఒకటి నిర్మించబడింది.

10వ సెక్టార్‌లో మ్యూజియం, 16 సెక్టారులోని గులాబితోట (రోజ్ గార్డెన్) బస్సుస్టాండు ప్రక్కనే అమరి ఉన్నాయి.

## రాక్ గార్డెన్ (ROCK GARDEN) :-

ఇది ఒక అద్భుతం. కాంక్రీట్ మేజ్‌తో తయారు చేయబడిన తమాషాల అద్భుతం. తప్పకుండా చూడదగినది. మొదట ఇది చాలా చిన్న గార్డెన్. సంవత్సరాలు గడిచేకొలది ఎంతో విశాలంగా తయారయింది. ఏప్రిల్ నుండి సెప్టెంబరు నెల వరకు. ఉ. 9 గం. 1 గం. & సా. 3 గం. 7 గం వరకు. టిక్కెట్టు 0-50 మనిషికి. ఇతర కాలంలో కొంచం ముందుగా మూసివేస్తారు. దగ్గరలోనే మానవ నిర్మితమైన కృత్రిమ సరస్సు సుఖ్‌నాలేక్. ఇందులో బోటుషైర్ చేయవచ్చు. చుట్టుకొలత సుమారు 2 కి.మీ. ఉంటుంది.

## మ్యూజియం & ఆర్ట్ గాలరీ :

సోమవారాలు తప్ప మిగత అన్ని రోజుల్లోనూ దర్శనీయం. గాంధార శిల్పాలు, మినియేచర్ పెయింటింగులు, ఆధునాతనమైన చిత్రకళా చిత్రాలు చూడగలం. ప్రక్కనే చరిత్ర యుగానికి ముందున్న ఆది మానవుని అస్థి పంజరాలున్నాయి. మ్యూజియం. ఉ. 10. సా. 5 గం.ల వరకు. బుధవారం, ఆదివారాలు మాత్రం చూడవచ్చు. గులాబి తోట (రోజ్ గార్డెన్) : ఆసియా మొత్తం మీద గల పెద్ద గులాబీల తోట ఇక్కడి 10 సెక్టార్‌లో వున్నది. వెయ్యికి మించి గులాబీ రకాలను పూయించారీ పుష్పవనంలో. ఈ రోజ్ గార్డెన్‌కి డా॥ జకీర్ హుస్సేన్ రోజ్ గార్డెన్ అని పేరు పెట్టారు.

## పింజోర :

చండీఘర్‌కి దగ్గరలో 20 కి.మీ. దూరంలో ఉన్నది. ఇక్కడి యాదవేంద్ర గార్డెన్స్ పురాతనంగా మొగల్ గార్డెన్స్‌గా పిలవబడుతున్నాయి. ఫిదాయిఖాన్‌చే నిర్మించ బడ్డాయి. ఫిదాయిఖాన్ ఔరంగజేబు సేనానేగాక, షాజహాన్ పెంపుడు కొడుకు. ఇతనే లాహోర్‌లోని బాద్‌షాహి మసీదుకు రూపశిల్పి. ఈ వుద్యానవనంతో చెప్పుకోతగినవి మొగలు–రాజస్థానీ రీతుల మేలుకలయికగా నిర్మించబడిన అద్దాల భవంతి– షేష్‌మహల్. దీని క్రిందగా రంగమహల్, అద్భుతమైన జాల్‌మహల్— బహు చక్కనివి చూడదగును.

వుండటానికి శ్రీమంతుల కయితే రెస్టు హౌసులో రు. 80 నుండి 150/- వరకూ ఎయిర్ కండిషన్ అద్దెకు దొరుకుతాయి. సామాన్యులకు క్యాంపు కుటీరాలు రు. 10/- నుండి 15/-లలో దొరుకుతాయి.

పాటియాలా :

ఢిల్లీ—అమృతసర్ లైనులో కొంచం దక్షిణానికి మళ్ళితే ఒకనాటి స్వతంత్ర శిక్కు రాష్ట్రానికి ముఖ్యపట్టణంగా విలసిల్లిన పాటియాలాను చూడవచ్చు. ఆనాటి రాచరిక వ్యవస్థ విలాస శోభలను వెలివరచే అనేక భవనాలు. ఉద్యానాలు ఈనాటికి ప్రాచీన వైభవ ప్రాభవాన్ని స్ఫురణకు తెస్తూ నిలిచివున్న వాటిని చూడగలం. 1925 లో జెనివాలో జరిగిన నానాజాతి సమితిలో ఇండియా రాజుల తరపున ప్రాతినిధ్యం వహించినవారు పాటియాలా మహారాజు. ఈ పట్టణం 1756 లో బాబా ఆలాసింగ్ నిర్మించిన కోటచుట్టూ పరిక్రమించి విస్తరించిందని ప్రతీతి. ఈ కోటను 'కిలాముబారక్'గా పేర్కొనబడింది. ఇప్పుడు ప్రస్తుతం ఈకోట పెద్ద ఆయుధాగారంగా ఉపయోగించ బడుతోంది.

ఇక్కడ చూడదగినవి మోతీబాగ్ భవనం, గురుద్వారా.

మోతీబాగ్ భవనం :

మహారాజా నరేందర్‌సింగ్‌చే నిర్మించబడిందీ భవనం. ముఖ్యమైన ఆకర్షణగా చెప్పుకుంటారు ఈ పట్టణంలో, భవనాంతర్భాగంలో అనేక కుడ్య చిత్రాలు, కేశవ్, భక్తసూరదాసు, బిహారివంటి మహాకవుల భక్తి పాటల చరణాలు, సూక్తులు, పురాణ గాథలు, హిందూ సంగీతరీతులు, సిక్కు గురువుల చిత్రాలు వగైరా ప్రత్యేకమయిన పాటియాలా స్కూల్ ఆఫ్ పెయింటింగ్ రీతుల్లో చిత్రించబడినవి చూడగలుగుతాం.

గురుద్వారా :

పాటియాలాకు తొమ్మిదవ సిక్కు గురువైన తేజ్ బహద్దూర్ సింగ్‌కూ విడదీయరాని సంబంధం వుంది. మోతీబాగ్‌లో ఆయన స్మృత్యుత్సవాలు నిర్వహించబడతాయి.

పట్టణంలో వెలసిన కొత్త మోతీబాగ్, పురాతనమైన బాబా ఆలాసింగ్ సమాధి, పట్టణద్వారాన అమరియున్న పెద్ద గేటు మొదలయినవి ఆసక్తి కరమైన ఆకర్షణలు.

నాభా :

ఒక చిన్న పట్టణం. చుట్టూ ఒక పెద్ద మట్టిగోడ పట్టణాన్నాక్రమించి వుంది. పాటియాలా, శ్రీనగర్ రోడ్డు మీద వున్నదీ పట్టణం. లోపల పురాతనమైన కోట అందులో అందాల రాణీమహల్ భవన ప్రాసాదం, చక్కనైన తోరుటలు నాలుగు న్నాయి దర్శించతగినవి.

రూప్ నగర్ :

ప్రస్తుత రోపార్ జిల్లా ముఖ్యకేంద్రం. పాటియాలనుండి 70 కి.మీ. దూరం చండీఘర్‌నుండి అయితే 40 కి.మీ. దూరం మాత్రమే. పురాతన చారిత్రికనామం రూపనగర్. పాతకోట ఒకటివుంది. సట్లెజ్‌నదిని నిక్కి చూస్తూంటుంది. ఇదికాక పురాతన నాగరిక కేంద్రమైన హరప్పా శిధిలాలను చూడటానికి ఆర్కియాల జిస్టులు ఉత్సాహాన్ని చూపుతారు.

సిర్ హింద్ :

ఆనాటి పఠాన్ సూర్‌వంశపు రాజుల రాజధానీ నగరంగా ప్రాధాన్యతను సంతరించు కుందొకనాడు. పానిపట్టు యుద్ధంలో అక్బరు వీరి వంశాన్ని మొదలంటా తుడిచి వేశాడు. 1709 వరకూ సిర్‌హింద్ మొగలాయి పరిపాలనలో వైభవోన్న తులు అనుభవించింది. మొగలాయీల పతనావస్థ చరమాంక దశలో సిక్కుల ఆధి క్యత పెరిగిన నేపథ్యంలో 1709లో పూర్తి వినాశనం జరిగింది. ఇక్కడ ముఖ్యంగా చూడదగినవి, మీర్‌మిరాన్, పీర్‌బంది నక్షవాలా సమాధులూ, సలాబత్‌బేగ్‌హవేలీ— ఈ హవేలీ బహుశా అతి పెద్దదైన భవంతి మొగలులకాలంనించీ ఉన్నదిగా పేర్కొన బడింది. పట్టణానికి ఆగ్నేయంగా ముఖ్యమైన మొగల్‌సరాయి (సత్రం) ఒకటుంది.

లూథియానా :

పంజాబులోని ముఖ్య పారిశ్రామిక కేంద్రం. దేశంలోనే అతి పెద్దదైన హీరో సైకిలు తయారీ ఫ్యాక్టరి ఇక్కడేవుంది. ప్రపంచ ప్రసిద్ధమైన హోజియిరీ తయారీలు ఇక్కడివే; పెద్ద టెక్స్టైలు పారిశ్రామిక కేంద్రం. మొట్టమొదటి శిక్కు యుద్ధం జరిగిన ప్రదేశంగా ప్రతీతి. ఇక్కడ వున్న వస్త్రాలు ప్రపంచ ప్రసిద్ధి చెందినవిగా కొనియాడ బడుతున్నాయి. వీటిని, జలంధరులో తయారయిన ఉన్ని వస్త్రాలను. మాస్కో, న్యూయార్క్, బాంగ్‌కాక్, మాంట్రియల్, లండన్ వంటి మహానగరాల్లోని ప్రెస్టీజియస్ షోరూముల్లో చోటుచేసు కున్నాయుంటే అతి శయోక్తి కాదు. పంజాబు

వ్యవసాయ విశ్వవిద్యాలయం లూధియానాలో ఉన్నది. రాష్ట్రంలో 'పైరుపచ్చ విప్లవం' 'గ్రీన్ రివొల్యూషన్‌'కి హితోధికమైన ప్రోత్సాహం ఈ విశ్వవిద్యాలయం ఇచ్చిందే. దేశంలోని అన్ని రాష్ట్రాలకంటే సంపన్నరాష్ట్రంగా నిలబెట్టింది.

ఖిన్ :

1191 లో మహమ్మద్ ఘోరి కట్టించిన మసీదు. చరణ్ కన్వాల్ అనే గురుద్వారా, 11 కి. మీ. దూరంలోని 'కంజీ సాహెబ్' అనే పాలరాతితో కట్టబడిన 6 అంతస్థుల ఎత్తున కట్టబడింది గురుగోవిందసింగ్ సంస్మరణార్థం. చూడదగినవి. గుర్రాలకు దాహం వేసినపుడు బాకీ ప్రయోగంతో పొంగి పొరలిన పాతాళగంగ త్రిసార్‌గా చెప్పుకొంటారు.

జలంధర్ :

ఇక్కడినుండి అమృత్‌సర్ 80 కి.మీ. దూరం మాత్రం వుంటుంది. పురాణ ప్రసిద్ధమైన సతీతులసి భర్తయైన జలంధర మహారాజుచే నిర్మించబడిందిగా కొన్ని కథల వలన విదితం. అందుకే ఇది జలంధర్‌గా ప్రసిద్ధం. జిల్లా ముఖ్యనగరం. జలంధర కథలో తులసిగా వెలసిన మహాపతివ్రత అసలుపేరు 'బృంద'. జలంధరుని శివుడు సంహరించాడు. పతి వియోగం తరువాత వైరాగ్యవతియై దుఃఖోపశమనం కోసం భగవదారాధన చేసిన ప్రదేశానికి 'బృందావన' మనే పేరు వచ్చిందని ప్రతీతి. వేయి సంవత్సరాల క్రితం ఘజినీ మహమ్మదు దండయాత్రకు వచ్చి విధ్వంసము చేశాడు. అయితే మొగలాయీల కాలంలో పుంజుకుని మరలా పట్టణంగా నిలబడింది. అయితే పురాతన చిహ్నాలేవీ మిగలలేదు. రెండు పెద్ద చెరువు లున్నాయి. 1857లో కట్టిన ఒక పెద్ద సరాయి మాత్రం ఉంది. జలంధరు ఆట వస్తువుల తయారీలో చాల ప్రసిద్ధి చెందింది. నాణ్యమైన వస్తువులకు పెట్టింది పేరు-లోక ప్రసిద్ధం. చుట్టూ చూడటానికి 800 సంవత్సరాల నాటి పాతదైన ఇమామ్‌నసిక్ మూసోలియం, 400 సంవత్సరాలనాటి జుమామసీదు, 200 సంవత్సరాల నాటి పెద్ద చెరువు—దేవీతలావ్.

జలంధర్ అమృతసర్ మార్గంలోనే బియాస్‌నది వ్యాస స్టేషను వుంది ఇది హిమాలయాల్లో పుట్టి సట్లెజ్‌లో కలుస్తూ ఉపనదిగా ఉన్నది. వశిష్ఠునకు పుత్ర వియోగము కలుగగా శోకతాపాన్ని భరించలేక ఈ నదిలో ఆత్మత్యాగం చేసుకున్నాడని భారతంలో అరణ్య పర్వంలో ఒక కథ చెబుతూంది. ఈ నదీ స్నానం సర్వ

పాప హరమట. ఈ సంగతికూడా భారతంలోనే అనుశాసనిక పర్వంలో ఉటంకించ బడింది. వుండటానికి అన్ని వసతులున్నాయి.

కపుర్తలా :

జలంధర్ నుండి 18 కి.మీ. దూరంలో వున్న 18 వ శతాబ్దపు పట్టణం. ఒక శిక్కు మహానుభావుడు కట్టించిన 'పంచమందిర్' అనే హిందూ దేవాలయాన్ని చూడవచ్చు. ఇక్కడనే ఒక మసీదు ఫ్రెంచి నిర్మాణ దక్షుడు నిర్మించాడు. షాలిమార్ గార్డెన్స్, జగజిత్ ప్యాలెస్ రెండు కూడా ఇండో ఫ్రెంచి కళాయుత నిర్మాణ కౌశల్యానికి ప్రతీకలు. చూడదగినవి. ఇక్కడికి 8 కి.మీ. దూరంలో కంజ్లి సరస్సు తీరంలో అమరిన చిన్న విశ్రాంతి కేంద్రం- చాలా అందమైంది.

జలంధర్ నుండి ఫిరోజ్‌పూర్ వెళ్ళే లైనులో 'సుల్తానపూర్ బర్డ్ శాంక్చువరి' ఒక తటాకం చుట్టూ ఉన్నది. ఇక్కడ ప్రశాంత వాతావరణంలో రకరకాల పక్షులు వాటి జీవన సరళిని గమనించవచ్చు. ప్రతి సంవత్సరం సమయం నిర్దేశించి నట్లు వచ్చి పోయే వలస పక్షులు గూళ్ళు కట్టుకోటం, గుడ్లు పెట్టటం, ఆహారసేకరణ వగయిరాలు విశేషించి చూడదగినవిగా వుంటాయి.

హోషియార్ పూర్ :

ధాంకూర్ టిటాహోలి దేవాలయంలోని రామాయణ, భాగవత కథల చిత్రాలు చూడదగినవి. 65 కి.మీ. వుంటుంది.

అమృతసర్ :

మృతిలేని ఈ అమృత సరోవరం 1577లో శిఖ్ఖు గురువు రామదాసుచే వ్యవస్థీకరింపబడిన పట్టణం. శిఖ్ఖుమత వ్యాప్తికోసం ఒక చక్కని ఆలయం కట్టించి చుట్టూ చలువరాతి మెట్లతో పెద్ద సరోవరమును నిర్మించి వృద్ధి చేశారు. ఇండియా పాకిస్తానుల సరిహద్దు అతి చేరువలో ఉంది. పాకిస్తాను భూ మార్గంలో చేరటానికి అత్యంత అనువుగా ఉన్నది. పంజాబులోని ప్రధాన నగర విశేషమే గాక- శిఖ్ఖులకు అతి పవిత్రస్థలం, ముఖ్య యాత్రా స్థలం. గురు రామదాసు కుమారుడైన అర్జున గురువు దీని అభివృద్ధికి ఎంతగానో కృషి చేశాడు. అమృతసర్ అంటే దేవతలకు ప్రీతిపాత్రమైనది. జరామరణముల నుండి కాపాడే అమృతమనే యర్థము. ఈ సరోవర మధ్యంలో ఆలయ నిర్మాణం, అందులో శిఖ్ఖుల పవిత్ర గ్రంథం 'గ్రంథ

సాహిబ్'ని ప్రతిష్ఠించటం గురుఅర్జునదేవ్ చేసినదే. అయితే దీనికి కావలసిన స్థలమును మంజూరు చేసినవాడు అక్బరు చక్రవర్తి. 1761లో అహమ్మద్‌షా మంచి ఆలయాన్ని విధ్వంసం చేశాడు. 1764లో ఆలయం పునర్నిర్మాణం జరిగింది. 1802లో ఆలయం క్రింది భాగం చలువరాతితో కట్టబడి జరిగింది. పై భాగమును రాగిరేకుతో నిర్మించి బంగారురేకుతో కప్పించారు. ఈ పనిని శిఖ్కురాజైన రాజా రంజిత్‌సింగ్ చేయించాడు. దీనికి 400 కిలోల బంగారం పట్టింది. అందువలనే దీనికి అప్పటి నుండి స్వర్ణ దేవాలయంగా కీర్తికెక్కింది. తలుపుల, ద్వారాలు అన్నీ వెండి రేకుతో తాపడం చేసినవి. దేశ విభజనకు ముందు జరిగిన రక్తపాతంలో స్వర్ణ దేవాలయం ఒక కీలకపాత్ర వహించినదని చెప్పవచ్చు పంజాబుని కుదిపివేసిన సంఘటన లెన్నో నిక్షిప్తమైయున్నాయి. దీనిని దర్బార్‌సాహిబ్ అనీ, హరిమందిర్ అనీ అంటారు. 4 వైపులా నాలుగు ద్వారాలున్నాయి. దీని అర్థం అందరూ సమానులేనని ప్రతి ఒక్కరూ లోనికి రావచ్చునని అర్థమట. కాని ఇప్పుడో ! ? స్పెషల్ పర్మిటు కావాలి.

అసలైన 'గ్రంథసాహిబ్'ను ఒక తల్పంమీద పవిత్రంగా ఉంచబడింది. నిరంతరం పవిత్రమైన సూక్తులు పఠనం, వాయిద్య విశేషాలతో పాడే భక్తి గీతాలతో పవిత్రతా వాతావరణం ప్రతిధ్వనిస్తుంది. భక్తి భావాన్ని ప్రేరేపిస్తుంటుంది.

స్వర్ణదేవాలయం పశ్చిమదిశనగల ద్వారంముందు అకల్‌తక్త్ వుంది తక్త్ అంటే సింహాసనం. ఈ సింహాసనం బంగారురేకుతో చేయబడిన టోపీలు అలంకరించబడి ఉంది. ఈ సింహాసనం మీద కూర్చొని ప్రధాన గురువు తమ ముఖ్యమయిన మతపర నిర్ణయాలను ఆదేశించటం జరుగుతుంది. సమస్యలు వచ్చినపుడు అంతిమ పరిష్కారాలు ఇక్కడి నుండే ఆదేశించబడుతుంటాయి. 1606-1645 మధ్యన గల గురు హరగోబింద్ స్థాపించారు. ఇక్కడనే పురాతన శిఖ్కురాజుల ఆయుధాలు, వెండి బంగారు నగలు చూడవచ్చు. ఈ ఆయుధాలను ప్రతిరోజూ సాయంత్రంపూట మాత్రం ప్రదర్శించుతుంటారు.

బాబా అకల్ గోపురం :

ఈ గోపురం తొమ్మిది అంతస్తులు గలది. 112 అడుగుల కైవారం, 150 అడుగుల ఎత్తుగా నిర్మించబడింది. ఆలయానికి మూడు వందల గజాల దూరంలో ఉన్నది. ఆరవ గురువయిన హరగోబింద్ సింగు కుమారుడైన బాబాఅకల్‌ధాయి ఈ

శిఖరం మీద ఎక్కి ప్రాణత్యాగం చేసికొన్నారట. ఈ గోపురంలో శిక్కుల గ్రంథాలు పెట్టి పూజిస్తూ వుంటారు.

సెంట్రల్ శిక్కు మ్యూజియం :

స్వర్ణ దేవాలయానికి అనతి దూరంలోనే సిక్కు గురువులు జరిపిన పవిత్ర యుద్ధాలు, వారి మత విశ్వాస పరిరక్షణ కోసం చేసిన త్యాగాలను వివరిస్తూ కొన్ని పురాతన చిత్రాలు ప్రదర్శిస్తున్నారు ఈ మ్యూజియంలో.

గురు కాబాగ్ :

స్వర్ణాలయానికి దక్షిణ దిశన 30 ఎకరాల విస్తీర్ణంలో బ్రహ్మాండమైన ఉద్యాన వనం వుంది. అందులోనే ఒక చెరువు, కొన్ని ఆవరణలు ఉన్నాయి. చూడవలసినది.

దుర్గియానా మందిరం :

అమృతసర్ పాత నగరం ఇరుకు సందుల్లో గుండా 10—15 నిమిషాల నడకలో దుర్గామాతా ఆలయం చేరవచ్చు. ఈ ఆలయం 16 శతాబ్దంలో నిర్మించబడిందట. గోల్డెన్ టెంపుల్ మాదిరిగానే సరస్సు మధ్యంలో ఒక పెద్ద లక్ష్మి నారాయణ మందిరం నిర్మించబడి ఉన్న దానిని చూడవచ్చు. ఆలయంలో విగ్రహ ప్రతిష్ఠ పండిత మదన మోహన మాలవ్యా 1825లో చేశారు.

ఇవి గాకుండా అనేక మసీదులు, పాత నగరం నిండా పరుచుకుని ఉన్నాయి. వాటిలో మహమ్మద్ జాన్ మసీదు ఒకటి.

రాంబాగ్ పబ్లిక్ గార్డెన్స్ :

మహారాజు రంజిత్‌సింగ్ నివసించిన భవనం పార్కు మధ్యలో ఉన్న దానిని చూడవచ్చు. దాదాపు 40 ఎకరాల విస్తీర్ణంలో అభివృద్ధి చేయబడిన అందాల వనం. ఇందులో ఒక చిన్న మ్యూజియం. అందులో నాటి ఆయుధాలు, పంజాబును పాలించిన రాజ వంశీయుల చిత్తరువులను కూడ చూడవచ్చు.

జలియన్‌వాలా బాగ్ :

స్వర్ణ దేవాలయానికి రెండు ఫర్లాంగులు దూరంలో ఉన్నది. 1919 ఏప్రిల్ 13 వ తేదీ స్వరాజ్యోద్యమ చరిత్రలో పరమ విషాద ఘట్టంగా పేర్కొనబడింది. ఆనాడే రాజకీయ సమావేశం జరిపే నిరాయుధులైన భారతీయులమీద జనరల్

డయ్యర్ కాల్పులు జరిపిన రోజు—చోటు. దీనిలో 2000 మంది పైగా నిహతులయ్యారు. ఈ దృశ్యం మహాత్మాగాంధీజీని కలచి వేసింది. యీ నాటికి స్మృతి చిహ్నంగా చరిత్ర ప్రాధాన్యాన్ని చాటుతూ, ఆంగ్లేయుల దమన నీతికి నిరసనగా తుపాకి గుండ్ల దెబ్బలు తోట ప్రాకారంలో చెదరకుండా అట్టిపెట్టేరు. యీ తోట ఒక జాతీయ స్మారకంగా, మృతవీరుల స్మారకంగా ఆరని జ్యోతి వెలుగుతూ వుంటుంది. అమృతసర్‌లో దీపావళి, శిక్కు గురువుల జయంతులు మహోత్సాహంగా జరుగుతాయి.

## అమృతసర్ పరిసర ప్రాంతాల్లో

### హరికేపట్టన్ :

అమృతసర్ నగరానికి దగ్గరలోనే ఉన్న దృశ్యమాన మయిన మంచి పిక్నిక్ స్పాట్. ఇక్కడ బియాస్–సట్లెజ్ నదిలో కలిసే సంగమ స్థానం.

### డేరా బాబానానక్ :

అమృతసర్ నుండి సుమారు 55 కి.మీ. దూరం. 1787 లో నిర్మించబడిన ఆలయం. ఆలయంలో గురువు ధ్యానమగ్నుడై తపం చేసిన చోటుగా ఆరాధిస్తారు.

### తారన్–తరన్ :

అమృతసర్ నుండి 24 కి.మీ. దూరం. ఒక గురుద్వారా ఉన్నది. ఇక్కడ అమృతసర్‌లో మాదిరిగానే ఒక పెద్ద సరస్సు వున్నది. ఈ సరస్సులోనికి ఒకసారి అటునించి ఇటుకి ఈదితే చాలుట— ఎంతటి కుష్టువ్యాధి కూడా నయమవుతుందని నమ్మిక. ఆలయం అమృతసర్‌లో మాదిరిగానే మొగలాయి రీతుల్లో రాగితో చేయబడిన డోముటోపీగా నిర్మించబడింది.

### ఆనంద్‌పూర్ సాహెబ్ :

నైనాదేవి పర్వతశ్రేణి నేపథ్యంగా ఆనంద్‌పూర్ సాహిబ్ పట్టణం ఉంది. శిక్కులకు ఇది ఒక పవిత్రమైన క్షేత్రం-యాత్రా స్థలం. స్థాపకులు గురు తేజ బహద్దూర్ సింగ్. ఉన్నతికి పాటుపడిన వారు శిక్కుల గురువుల్లో ఆఖరు వారైన గురు గోబింద్ సింగ్. 18 వ శతాబ్దంలో స్థాపన జరిగింది. ఇక్కడి నుండే శిక్కుమతం పరిపూర్ణ స్వరూపం దాల్చింది. అందువలన శిక్కులకు మూల స్థానమై విలసిల్లుతుంది. ఏటా మాఘ మాసంలో ఉత్సవం జరుగుతుంది. అనేక మంది యాత్రికులు పాల్గొంటారు.

హోలీతరువాతరోజునజరిగేమహోత్సవంలోజరిగేఉత్సవంలో"హోలామహోల్లా' వేడుకలు కనుల పండుగగా జరుగుతాయి. శిక్కులు పూర్వం తమ ఉనికిని కాపాడు కోటం కోసం జరిగిన పోరాట గాథలు-యథాతథంగా ఆయుధాలు ధరించి రూపకాలుగా ప్రదర్శిస్తూ ఉత్సవంలో పాల్గొంటారు.

ఇక్కడనే మరికొన్ని గురుద్వారా (శిక్కు ఆలయాలు)లున్నాయి. స్నిగ్ధమైన గురుద్వారా కేషాగర్ గురుద్వారా వీటిలో ముఖ్యమయినది. ఇందులో గురు గోబింద సింగు ఉపయోగించిన పవిత్ర ఆయుధాలు భద్రపరచబడ్డాయి.

రోబాల్‌సర్ :

అమృతసర్ మాదిరిగానే ఒక నదము. తూర్పున జన్మించి పశ్చిమ సముద్రంలో కలిసే ఈ నదం మధ్య కొన్ని ద్వీపాలున్నాయని, వాటిలో ఒకటి కదిలిస్తే కదలలేదని ప్రతీతి. ఈ ద్వీపాల్లో కొన్ని ఆలయాలు కూడా ఉన్నాయి.

భాక్రానంగల్ :

ఆనందపూర్ సాహిబ్ నుండి 35 కి. మీ. దూరం వుంటుంది. ప్రపంచం మొత్తం మీద అతి ఎత్తయిన ఆనకట్టగా పేర్కొనబడే 750 అ. ఎత్తుగల ఇటీవల మానవ నిర్మితమైన ఆనకట్ట- ఉరుకులు పరుగులతో ఝరీవేగంగా ప్రవహించే సట్లెజ్ నది నీటిని కళ్ళెం బిగించి ఎండిన బీడుభూములను, ఎడారి భూములను సశ్యశ్యామలం చేయటానికి తలపెట్టిన మహా యజ్ఞ కార్యక్రమం- ఆధునిక విజ్ఞాన ప్రగతి శోభలకు ప్రతీకగా నిర్మించి మన దేశ ఇంజనీర్ల నిర్మాణ దక్షతలను ప్రపంచానికి చాటి చెప్పి నది మనకు గర్వకారణంగా నిలిచిన కట్టడం. ఆనకట్టపైన 30' రోడ్డు, నీటి మళ్ళింపు సొరంగాలు ప్రపంచంలో పెద్దవిగాను అనేకంగాను కొనియాడబడ్డాయి. ఈ ఆనకట్ట ఎత్తు చెప్పాలంటే ఢిల్లీ కుతుబ్‌మీనార్‌కు 3 రెట్లు ఎక్కువ. బహుళార్థసాధక ప్రాజెక్టుగా నంగాల్ డాము, నంగాల్ హైడల్ కెనాల్, గంగువాల్, కోట్లాపవర్ హౌసులు, నయానంగాల్ దగ్గరి ఫర్టిలైజరు కర్మాగారం ఆసియాలో కెల్లా పెద్దవిగా పేర్కొనబడ్డాయి. ఢిల్లీ, చండీఘర్, ఆనందపూర్ సాహిబ్ నుండి ప్రతిరోజూ ఎన్నో బస్సులున్నాయి. తప్పక చూతదగిన దృశ్య విశేషం.

పఠాన్ కోట :

పంజాబ్ ఉత్తర దిశ కొన హిమాలయ పర్వత పాదాల చెంత అమరియున్న అందాల వాడ. అమృతసర్‌నుండి జమ్మూ-కాశ్మీర్ హైవేలో 107 కి.మీ. దూరంలో వున్నది.

జమ్మూ-కాశ్మీర్ హైరోడ్డులో అమరి యున్న ఈ పట్టణం హిమాచల్‌ప్రదేశ్ లోని కంగ్రా, కులూ, చంబా, డల్‌హౌసీ నగరాలకు ముఖద్వారం లాంటిది. వాతావరణం స్వచ్ఛంగా వుండే పఠాన్ కోట పట్టణం నుండి హిమాలయ పర్వతాల గంభీర దృశ్యంగా కాననగును.

జలంధర్ రోడ్డులో 5 కి. మీ. అవతలగా దమ్‌తాల్ ఆలయం-చుట్టూ ప్రహరీ గోడల మీద రామాయణ, మహాభారత కథలు చిత్రీకరించబడ్డాయి కమనీయంగా. 7 కి.మీ. దూరంలో షాహపూర్ ఖడీ అనే చిన్న పట్టణం రావి నదీ తీరంలో ఉన్నది అతి పురాతన కాలంలో దీన్ని షరద్‌పూర్ అని పిలవబడుతూ - షాజహాన్ చక్రవర్తి దర్శనంతో షాహపూర్‌గా మారిందని ప్రతీతి. ఇక్కడ 16 వ శతాబ్దంనాటి కోట ప్రత్యేకం. కోటలో మంచి టూరిస్టు బంగళా ఉంది. బౌద్ధుల గుహలు, శివాలయాలు చూడదగినవిగా ఉన్నాయి. ఇదే మార్గంలో ఉన్న దేరా నానక్ చోటు. బటాలా రైల్వే స్టేషనుకు సుమారు 40 కి.మీ. దూరంలో ఉంది. ఇది శిఖ్కు మత స్థాపకులైన గురునానక్‌జీ నివసించి, పరమపదించిన స్థానం. దీన్ని అతి పవిత్రంగా భావిస్తారు శిక్కులు.

తల్‌వాన్‌డి :

దేరానానక్ శ్రీ గురునానక్‌జీ నివసించి, పరమపదించిన స్థానము తల్‌వాన్‌డి శ్రీ గురుదేవుల జన్మస్థానం. నానక్ గొప్పకవి, మతకర్త. శిక్కుల మతస్థులకిది కూడా చాల పవిత్రమైన స్థలం.

ఇవే కాకుండా ఇంకా హ్యుయన్‌సాంగ్ వ్రాతల్లోని 'షె. టు. వులు' అనబడే సర్‌ఘోల్, ఒకానొకప్పటి జింద్ రాజ్యపు ప్రధాన నగరంగా విలసిల్లిన సంగ్రూర్, 700 సంవత్సరాలనాటి ఫరీద్‌కోట, అందులోని అద్దాలమేడ, ముక్తసార్‌లోని షహీద్ గంజ్ గురుద్వారాలతోపాటు ఆఖరుగా ఒక మహిమాన్వితమయిన ప్రదేశం గురించి:-

ఛాపార్ :

లూధియానానుండి 25 కి.మీ. దూరంలో ఉన్న ఛాపార్ దగ్గరలో 8 కి. మీ. దూరంలో ఒక చిన్న గ్రామం ఉంది. అక్కడ 'గోగా' అనే నాగదేవుని అర్చిస్తారు ఈ నాగదేవుని అర్చించని బాలకులు నాగుపాము కాటుకు బలి అవుతారని అక్కడి వారి నమ్మకం. ఆలయంలో ఒక కన్నం ఉంది. ఆ కన్నంలోనుండి చల్లని గాలి వస్తుంది. అది నాగదేవుడు 'గోగా' గాలి పీల్చినపుడు వదిలినపుడు వస్తుందని చెప్తారు సెప్టెంబరు మాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది-లక్షలమంది భక్తులు పాల్గొంటారు.

# హిమాచలప్రదేశ్

అనాది కాలంలో భూఖండం ఏర్పడే పరిణామ క్రమంలో మహోవాహిని లావా లహరి ఘనీభవించి ఏర్పడిన నిమ్నోన్నత స్వరూప స్వభావమే మేదినిలో ఏర్పడిన హిమాలయోత్తుంగ శిఖరాల పర్వతశ్రేణి. ఈ సమయంలో కొన్నిచోట్ల అధిగమించ లేని అంబరచుంబిత శిఖరాలు ఏర్పడితే, మరికొన్ని చోట్ల మానవుని మనస్సుకి అందని అంతులేని అగాధాలు, రహస్యపు లోయలు, బాహ్య ప్రపంచ జనజీవనానికి నోచుకో లేని దుర్గమారణ్యాలు-అతిశీతలమైన మంచు కుప్పల కప్పులు. మంచుచేత కప్పబడి నవి గనుకనే హిమాలయములు అనే పేరు సార్థకమయిందనవచ్చు.

ప్రపంచమంతా తిరిగి చూచినా ఇతర చోట్ల ఎక్కడా 28వేల అడుగులఎత్తుకి మించిన పర్వత శిఖరాలు లేవట. కాని ఇక్కడో ? ! అత్యున్నతమైన శిఖరం ఎవరెస్టు శిఖరం ఎత్తు 29, 141 అడుగులు. దీనికే మరోపేరు గౌరీశంకర శిఖరం. 24,000 అడుగుల ఎత్తుకి మించిన శిఖరాలు 40 పైగా ఉన్నాయి. ఈ భూభాగంలో వాతావ రణం కూడా అరుదైన విభిన్న వైపరీత్యాలు కలిగి ఉంటుంది. ఒకచోట గడ్డ కట్టించే చలి-ఆ ప్రక్కనే భరించలేని ఉష్ణతాపం. ఇక్కడే మహర్ఝురీ వేగంతో ప్రాణికోటి చొరలేని అతి శీతల గాఢాంధకార బంధుర తమోరి రాసుల కొండల బండరాళ్ళను చీల్చుకుని తమ మార్గాన్ని సుగమం చేసికొంటూ ఎన్నో ఓషధుల సారాన్ని తమలో ఇముడ్చుకుని, కశ్మలాలను కడిగివేస్తూ అమృత జలాలను ప్రాణికోటి కందిస్తూ సాగర సంగమాభిగాములై ప్రవహించే పావన గంగా, సింధు, యమున, సరస్వతి, బ్రహ్మపుత్ర, అలకనంద, మందాకిని మొదలయిన జీవనదులు దేశ సంస్కృతీ

సాంప్రదాయ సురభిళాల్ని వెదజల్లుతూ పుడమి తల్లికే దివ్యాభరణ భూషితమై, భరతమాతను వసుంధరగా, సశ్యశ్యామలినిగా మారుస్తూ తమ విద్యుక్తధర్మంగా ప్రవహించే వాటికి జన్మస్థలమైన పుణ్యస్థలి.

వేద వేదాంగాల్లో ఆది జీవసృష్టికీ, తుష్టి, పుష్టులకు అనంతవాహినులై అనాది నుండీ ప్రస్తుతించబడిన దేవ భూములు, సకల చరాచర సృష్టి, స్థితి లయకారకుడై, జగత్కళ్యాణ శేఖరుడైన పరమేశ్వరుని ఆవాస చిద్విలాసం-పరమశివుని వెండికొండగా పేర్కొనబడిన దివ్యధామం హిమాలయం.

ఇదంతా అనంత కాలవాహిని చక్రం. భూమి గుండ్రంగా వుంది, మొదలు పెట్టిన చోటికే వచ్చి అంతం అవుతుంది. ఆది అంతములు ఒకటే. నదులన్నీ సాగర సంగమం చెంది-సూర్యతాపంతో సముద్రపునీరు ఆవిరియై మేఘమై భూమిమీద వర్షించి నదులుగా పారి సాగరసంగమం చేస్తుంటాయి. ఈ లోపల ఎన్నో జీవరాసులు పుట్టి, పెరిగి, గిడుతుంటాయి. గిట్టినవి మరల పుడుతుంటాయి. ఇలా పుట్టి, గిట్టి, మరల పుట్టటం జరిగి 'పునరపి జననం, పునరపి మరణం' అనే శంకర భగవత్పాదుల దివ్యవాణికి ప్రాకృతిక ప్రమాణంగా భాసిస్తూ, అద్వైతానికి అక్షరమైన ప్రకృతి స్వరూపంగా భాసిస్తున్నదీ ప్రదేశం.

అట్టి హిమవన్నగ పర్వత ప్రాంగణంలో ఒదిగియున్న ప్రదేశం హిమాచల ప్రదేశ్. చాల భాగం పర్వత ప్రాంతమే।

ప్రస్తుత రాష్ట్ర స్వరూపం - 1966లో పంజాబు రెండుగా చీలి పంజాబు, హర్యానాగా ఏర్పడినప్పుడు కొన్ని పర్వత ప్రాంతాలు అంతకు క్రితంవున్న పార్టు 'C' రాష్ట్రంగా వున్న ప్రాంతాలకు జతచేసి స్వతంత్ర భారతదేశావనిలో ది. 25 జనవరి 1971న సమగ్ర రాష్ట్రంగా పంజాబు, హర్యానా, కేరళల కంటే పెద్దదిగా ఏర్పరచటం జరిగింది.

వైశాల్యం : 55, 673 చ. కి.మీ.
జనాభా : 43 లక్షల పైన
రాష్ట్ర రాజధాని : సిమ్లా
మాట్లాడే భాష : పహారి, హిందీ
అక్షరాస్యత : 42 శాతం
జనసమర్థత : 77 చ. కి. మీ. కి

జనాభాని బట్టి 18 స్థానం – వైశాల్యాన్ని బట్టి అయితే 14వ స్థానాన్ని ఆక్రమిస్తుంది దేశంలో.

స్త్రీ పురుష నిష్పత్తి : 973 : 1000

**భౌతికంగా :**

స్వతంత్ర భారతంలో హిమాచల ప్రదేశం వాయవ్య మూలగా హిమాలయాల ఒడిలో అమరియున్నది. ఉత్తరాన జమ్ము-కాశ్మీర్, ఆగ్నేయంగా ఉత్తరప్రదేశ్, దక్షిణాన హర్యానా, పడమట పంజాబు సరిహద్దు రాష్ట్రాలుగా ఆవరించబడి యున్నది. తూర్పున భారత్-టిబెట్టు సరిహద్దు రేఖను గీస్తుంది. స్వరూప స్వభావాన్ని బట్టి ఉత్తర, దక్షిణ ప్రాంతాలుగా విభజించవచ్చు. దక్షిణ ప్రాంతం మామూలు మైదానప్రాంతాల వలెనే ఉష్ణంగా ఉంటుంది. ఉత్తరప్రాంతం 460 మీటర్లనుండి 6600 మీటర్ల ఎత్తు వరకూ వివిధ శ్రేణుల్లో సముద్రమట్టానికి పైగా ఎత్తుగా ఉండి చలికాలంలో అతిశీతలమై హిమపాతం జోరుగా పడుతూంటుంది. సిమ్లా, సిర్మాపూర్ జిల్లాలు అతి సారవంతమైన భూములు కలిగి వున్నాయి. మిగత జిల్లాలన్నీ కొండలు, గుట్టలు, అడవులుగా ఉన్నాయి. వర్షపాతం కూడా 181.6 సెం.మీ. ఉంటుంది. ఇక్కడ ప్రవహించే నదీనదాలు– చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్, యమునలు. ఇవన్నీ జీవనదులు. వీటికి తోడు ఎత్తుపల్లాలుగా ఉన్న కొండ ప్రాంతం ఎత్తునుండి క్రిందికి దుముకుతూ త్రుళ్ళింతగా ప్రవాహము ఉంటుంది గనుక జలవిద్యుత్తును అతి చౌకలో తయారు చేసుకో గలిగిన హైడల్ ప్రాజెక్టులకు ఎంతో అనుకూలమైనదిగా చెప్పుకోవచ్చు.

**సంగ్రహంగా చరిత్ర :**

స్వతహాగా 1948, ఏప్రిల్ 15న దరిదాపు 32 సంస్థానాలు రాచరికపు రాజ్యాలను విలీనంచేసి కేంద్రపాలిత రాష్ట్రంగా ఏర్పాటు జరిగింది. 1951లో 'C, రాష్ట్రంగా 36 అసెంబ్లీ సభ్యులు, 3గురు లోక్‌సభ సభ్యులతో లెఫ్టినెంట్ గవర్నరు పాలనలోకి వచ్చింది. 1956లో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సమయంలో పంజాబులో కలిపేయాలని కేంద్ర నిర్ణయం జరిగింది. వ్యతిరేకంగా ప్రాంత ప్రజలందరూ ముక్త కంఠంతో ఎదురు నిల్చారు. అందరూ కలిసికట్టుగా నిరసనలు తెలిపారు. కలపాటకం ఆగిపోయింది.

కాని 1966లో పంజాబు శిఖ్ఖు ప్రజల అభిమతంగా రెండుగా విడిపోవలసి చ్చినప్పుడు పంజాబు రాష్ట్రంలోని కొన్ని కొండ ప్రాంతాలు అంతకు ముందున్న

ఆరు జిల్లాలకు తోడుగా కలిపి సమగ్ర హిమాచలప్రదేశ్‌గా ఏర్పాటు జరిగింది. ది. 25-1-71 న అమలుకి వచ్చింది. పాలనాపరంగా రాష్ట్రాన్ని 12 జిల్లాలుగా విభజించారు. అవి :-

బిలాస్‌పూర్, చంబా, హమీర్‌పూర్, కంగ్రా, కిన్నాపూర్, కులూ, లహవుల్ & స్పితి, మండి, సిమ్లా, సిర్మాపుర్, సోలన్, ఉనా.

ప్రజలందరికీ జీవనాధారం వ్యవసాయం. సహజవనరులతో పండ్ల ఉత్పత్తుల్లో అగ్రగామి. ఆపిలు పండ్లు చాలా ప్రసిద్ధి. దేశం అంతటిలోనూ సిమ్లా ఆపిల్సు అంటే శ్రేష్ఠమైనవిగా గుర్తింపు పొందినాయి.

పారిశ్రామికంగా చాలా వెనుకబడి వుందనే చెప్పుకోవచ్చు. అయితే కొన్ని రాయితీలు, అనేక ప్రోత్సాహకాలు ప్రభుత్వంవారు ప్రకటించటంతో కొన్ని చిన్న, మధ్యతరహా పరిశ్రమలు ఊపందుకుని చోటు చేసికొన్నాయి. వాటిలో గణనీయంగా పేర్కొనదగినది- పర్వానులోగల ఫ్రూట్ ప్రాసెసింగ్ ప్లాంటు. దేశం మొత్తంలోనే ఎన్నదగినవి. నహాన్ ఫౌండ్రి నహాన్, రెసిన్&టర్పెంటైన్ ఫ్యాక్టరీలు- నహాన్, బిలాస్‌పూర్‌ల్లోనివి, మోహన్ మీకిన్స్ బ్రువరీస్, సోలన్ & యునైటెడ్ డైమండ్సు లి.- పర్వానూ మొదలయినవి.

రాష్ట్ర నిర్మాణం 32 రాజరిక సంస్థానాలు ఒక్కటయిన ఈ గిరిప్రాంతంలో భిన్న విభిన్నములైన సాంఘికాచారాలు, సంస్కృతులు పరిశీలిస్తే చాల చిత్రమైన సంగతులు మనకు అవగతమవుతాయి. అవి ఈనాటికీ వాటి వాటి ప్రత్యేకతలను వెలువరుస్తూనే వున్నాయి. మచ్చుకు ఒక సంగతి ముచ్చటించుకోవచ్చు. కిన్నపూర్ జిల్లాలో జరిగే వివాహాల్లో వైవిధ్యం ఆసక్తికరమైన ముచ్చట.

యువకుడు యువతిని తనయింటికి బలవంతంగా తీసికొస్తాడు. వెంటనే అబ్బాయి తండ్రి అమ్మాయిగారి యింటికి ఇద్దరు పెద్దమనుష్యుల్ని పంపి తన కుమారుడు చేసిన దానికి క్షమాపణలు చెబుతూ రాయబారం పంపుతాడు. దానికి అమ్మాయి తల్లిదండ్రులు కాదు, కూడదు అని అనేక రకాలుగా అడ్డాలుపెట్టి తరువాత కొంత డబ్బు, దస్కం విలువైన బహుమతులు ముట్టచెప్పిం తరువాత 'సరే' నంటారు. అప్పుడు అమ్మాయి, అబ్బాయిని పెండ్లికుమార్తె యింటికి తీసికొనివచ్చి సత్కరించి బహుమతులతో సహా మరల పెండ్లికుమారుని యింటికి పంపిస్తారు. మన పురాణాల్లో చెప్పబడిన అష్టవిధ వివాహాల్లో రాక్షసవిధి జ్ఞాపకం వస్తుంది కదూ!

ప్రజలకు ఆరాధ్యదైవాలు శ్రీకృష్ణుడు, శివుడు, పార్వతి. శ్రీకృష్ణునికి సంబంధించిన కథలు కంగ్రా స్కూల్ ఆఫ్ పెయింటింగులో ప్రధాన వ్యాసంగం.

హిమాచల ప్రదేశ్‌లో రెండు నేరోగేజ్ రైల్వే లైన్లు వున్నాయి. ఒకటి చండీఘర్‌కి ఉత్తరానఉన్న కాల్కా నుండి సిమ్లవరకు ఉన్నది. రెండవది- పఠాన్‌కోట నుండి కంగ్రాలోయ పర్యంతం జోగేంద్రనగర్ వరకూ ఉన్నది. నేరోగేజ్ ప్రయాణం బహు తమాషాగా వుంటుంది.

రాష్ట్రంలో ప్రయాణానికి టాక్సీ ఉత్తమం. అయితే ఖర్చుతో గూడినది. సాధారణులకు బస్సు సౌకర్యంగా వుంటుంది. మామూలు బస్సులకు తోడు హిమాచల ప్రదేశ్ టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను వారు ఢిల్లీ నుండి, చండీఘర్ నుండి, సిమ్లనుండి వివిధ ప్రాంతాలకు రాత్రిళ్ళు బస్సులు నడుపుతున్నారు. ముందుగా రాష్ట్ర ముఖ్య పట్టణమైన సిమ్లను పరికిద్దాం.

# సిమ్లా

గ్రామదేవత- మాత శ్యామలాదేవి. ప్రకృతి పచ్చగా విరిసేన శ్యామలరాగ రంజితం బహుశా ఇందువల్లనే గాబోలు ఈ పట్టణం 'సిమ్లా' అయిందని భావన. సముద్ర మట్టానికి 7000 అడుగుల ఎత్తున అమరియున్న ఈ పట్టణం కేవలం ఒక శతాబ్దానికి ముందే ఆవిర్భవించి మనపట్టణాలన్నిటికీ గారాలముద్దు చిట్టిచెల్లెలుగా భావించబడుతుంది. ఆనాడు బ్రిటిషు ఇండియాకి వేసవి రాజధానిగా ఉన్నది. ఈనాడు హిమాచల ప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్య పట్టణం. మధ్యలో చండీఘర్ నిర్మాణానికి పూర్వం పంజాబు రాష్ట్రానికి ముఖ్య పట్టణంగా కూడా వుంది.

దేశంలో ప్రముఖ వేసవి విశ్రాంతి కేంద్రంగా ప్రసిద్ధి.

ఢిల్లీ ఉష్ణతాపాన్ని భరించలేని ఆంగ్లేయులకు మొట్టమొదటిగా కనిపించిన శీతల ప్రదేశం. 1819 వరకూ అదృశ్యంగానే వుంది. అప్పుడే ఒక ఆంగ్లేయుడు వెలుగులోకి తీసుకురావటం జరిగింది. అయినా కొన్ని సంవత్సరాల వరకూ ఒక భవనం కూడా నిర్మించబడలేదు. 1828లో మేజర్ కెన్నెడీ మొట్టమొదటగా భవన నిర్మాణం చేశారు. ఇక అక్కడినుండి అతి శీఘ్రగతిన నిర్మాణక్రమం అభివృద్ధి పథంలో చకచకా సాగింది. పట్టణం పర్వతశ్రేణి వాలుతలంలో అమరిన నెలవంకలా భాసిస్తుంది. క్రమేణా బ్రిటిషు ఇండియా వేసవి రాజధాని ప్రతిపత్తితో ప్రసిద్ధి చెందిన రాజ భవ

నాలు నిర్మాణం జరిగి మొదటగా రాణివాసపు స్త్రీల ఆవాసంగా ఉండి తదుపరి ముఖ్య పట్టణస్థాయికి చేరుకుంది. ఈ ప్రదేశంలో ఇప్పటికీ ఉన్న ముఖ్య భవనాలు వగైరా ఇంగ్లీషు సాంప్రదాయ కట్టడాల పేరు గుబాళిస్తూనే వుంది. ప్రస్తుతం జనాభా సుమారు 71 వేలుపైగా వుంది. ఇక్కడవున్న వైస్రాయి భవనంలో అనేక చరిత్రాత్మకసభలు, సమావేశాలు, ఒప్పందాలు జరిగాయి. 1857వ సంవత్సరంలో నిర్మించబడిన చర్చి, గోర్టన్‌కోట, పూర్వపు వైస్రాయి రాజభవనం 1888లో కట్టించబడింది. కిప్లింగ్స్ 'స్కాండల్ పాయింటు' ప్రస్తుతం లజపతిరాయ్ చౌకుగా ప్రసిద్ధి చెందినవి దర్శనీయాలు.

గమనిక :

హిమాచల ప్రదేశ్‌లోని కొండ ప్రాంతాలు చాలావరకు వేసవి విశ్రాంతి కేంద్రాలుగా ప్రసిద్ధి. సిమ్లా దర్శించే యాత్రికుల మార్చినుండి జూన్‌వరకు సర్వానుకూలం- ఆహ్లాదకరంగా వుంటుంది. జులై ఆగస్టులు నిరంతరం ధారాపాతంగా వర్షాలు కురుస్తుంటాయి. డిశంబరు నుండి ఫిబ్రవరి వరకు అతిశీతలంగా ఉష్ణోగ్రత 5 డిగ్రీలు సెంటిగ్రేడు వరకు పడిపోతుంది. సాధారంగా తట్టుకోలేనంత చలి. హిమపాతం చాలా ఎక్కువగా వుండి రోడ్లుకూడా మంచుచేత కప్పబడి అడ్డంగా కుప్పలు కుప్పలుగా వుంటుంది.

సిమ్లాకు కొద్దిమైళ్ళ దూరంలో సట్లేజ్‌నదీ తీరంలో గడ్డ కట్టించే చల్లటి నదీ జలాల మధ్యగా సెగల సెగలు గక్కే వేడినీటి ఊటలున్నాయి. చాలా ప్రసిద్ధి చెందినవి. ఈ ఉష్ణజల ధారల ఊటల్ని 'తట్టాపాని' అంటారు.

ఇక సిమ్‌లాలో—

వైస్రాయి రాజ నివాసము :

సిమ్లా పడమటి దిక్కున ఒక కొండగుట్టమీద నిర్మించబడింది. పూర్వపు బ్రిటిషు రాజనివాస భవనం. ఒక పెద్దకోట లాగా నిర్మించిన ఈభవనం ఆరు అంతస్తులతో సమున్నతంగా విశాలమైన చావడులతో రాజసం ఉట్టిపడే శోభాయమానమైన అలంకరణలతో ప్రత్యేకమైన డైనింగ్ హాల్సు వగయిరాలతో ఉండి ఎన్నో క్లిష్ట సమయాల్లో చారిత్రాత్మక నిర్ణయాలు గమ్యాలు నిర్దేశిస్తూ జరిగిన సభలు, సమావేశాలు ఒప్పందాలు జరిగిన ప్రదేశంగా గణుతికెక్కిందీ భవనం. ఈ భవనంలో ఒక మంచి పబ్లిక్ గ్రంధాలయం అమరియుంది. వారంలో కొన్ని రోజుల్లో మాత్రమే సా. 4-5 గం. వరకు దర్శనీయంగా ఉంటుంది.

స్టేట్ మ్యూజియం :

మాల్‌రోడ్‌లో చర్చి దగ్గర నుంచి ఒక గంట వ్యాహ్యాళిగా పిచ్చాపాటి మాట్లాడుకుంటూ కాలక్షేపంగా నడిచి వెళితే చక్కని అందమైన మ్యూజియంని చేరుకోవచ్చు. ఇక్కడ హిమాచల్‌ప్రదేశ్ వివిధ ప్రదేశాల నుండి సేకరించిన అనేక శిలాశిల్పాలు, విగ్రహాలు ప్రదర్శించబడుతున్నాయి. వీటికితోడు కంగ్రాస్కూల్ ఆఫ్ పెయింటింగ్ కళాశాల నుండి సేకరించబడిన అనేక పెయింటింగులు, చిత్రాలు కూడా చూడగలం. ఉ. 10 గం. నుండి సా. 5 గం. వరకు ప్రతిరోజూ దర్శనీయం సోమవారాలు శెలవు.

జఖ్కూ దేవాలయం :

లజపతిరాయ్– చౌకు నుండి అదే కిప్లింగ్ 'స్కాండలీ పాయింటు' నుండి రిక్షాలో వెళ్ళవచ్చు జఖ్కూ పర్వతానికి. మాల్ నుండి నడిస్తే 45 నిమిషాలు పడుతుంది. సిమ్‌లా మొత్తానికి తలమానికంగా ఉండే ఈ కొండ శిఖరం మీద వేంచేసియున్న స్వామి-రామభక్త హనుమాన్ కోతులు విశేషంగా ఉంటాయి. ఆ వానర సమూహమే ఈ ఆలయాన్ని పహారా కాస్తున్నట్లుగా అనిపిస్తుంది. వాటికి ఆహారంగా ఏమైనా పెడితే వెంటనే మీకు మచ్చికై స్నేహ పాత్రంగా ఉంటాయి. ఇక్కడి నుండి చూస్తే హిమాలయ పర్వత శ్రేణి దృశ్యమానంగా కనబడుతుంది.

కాళీబారి :

ఇది ఒక కాళికాలయం. గ్రామదేవతయైన శ్యామలాదేవికి అంకితమైనది. ఈ ఆలయం వద్ద దసరా ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. కాని ఈ నగరంలో బహుశా ఇదొక్కటే ఆలయం. అనుకోవచ్చు.

సిమ్లా పరిసరాలు :

సిమ్‌లా పరిసరాల్లో చక్కనిరోడ్ సౌకర్యాలు అమరికతో ఉన్నటువంటి ప్రకృతి దృశ్యాలు కమనీయమైన పిక్నిక్‌స్పాట్‌లు చాలా వున్నాయి. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవిగా- అన్నాడేల్ దట్టమైన అడవి గుండా ప్రవహించే కాలవ గట్టున అమరియున్న పిక్నిక్‌స్పాట్.

గ్లెన్ :

అన్నాడేల్ నుండి నయనానందకరమైన పచ్చని పసిరి కవాలుల్లో ప్రవహించే అడవి వాగుకు అతి సమీపంలో అమరియున్న దీ పిక్నిక్‌స్పాట్.

సమ్మర్ హిల్ :

కాల్కా రైల్వేలైనులో సిమ్లాకి 5 కి.మీ. దూరంలో ఉన్నదీ చిన్నకొండ.

చద్విక్ జలపాతం :

వయా సమ్మర్‌హిల్ చేరవచ్చు. 1586 మీటర్ల ఎత్తున అమరిన కొండ మీది నుండి 67 మీటర్ల దిగువను త్రుళ్ళింత నాట్యాలతో జారిపడే జలపాతం. వర్షాకాలంలో అయితే నీరు ఎక్కువగా వుండి నయనానందకరంగా ఉంటుంది.

ప్రాస్పెక్టు హిల్ :

సిమ్లా పరిసరాల్లో అమరియున్న చిన్న గ్రామం. బాయిలియా గంజ్‌నించి 15 నిమిషాల్లో ఎక్కవచ్చు. 2,145 మీటర్ల ఎత్తున కామనాదేవి ఆలయం ఉంది.

సంకటమోచన్ :

సిమ్లా నుండి 7 కి.మీ. దూరంలో అమరిన హనుమాన్ దేవళం. ఇక్కడి నుండి సిమ్లా పట్టణాన్ని సమగ్రంగా చూడవచ్చు. 1875 మీటర్ల ఎత్తునవుండే పిక్నిక్‌స్పాట్.

తారాదేవి :

స్కాండల్ పాయింటు నుండి దాదాపు 95 కి.మీ. దూరం. 1851 మీటర్ల ఎత్తున వున్న ఈ ప్రదేశానికి కారులో రావచ్చు ఇక్కడ కొండమీద రెండు దేవాలయాలున్నాయి. కొండకొమ్మున 'తారాదేవి' ఆలయం- ఉత్తర దిశగా శివాలయం చూడదగినవి. ఇక్కడనే బాయ్ స్కౌట్సు ఆర్గనైజేషన్ వారు నడిపే శిక్షణా సంస్థ వుంది. విడిదికి PWD బంగ్లా వుంది.

వైల్డ్‌ఫ్లవర్ హాల్ :

సిమ్లాకి 13 కి.మీ. దూరంలో కుఫ్రిరోడ్ మీద సముద్ర మట్టానికి 2,593 మీటర్ల ఎత్తున ఉన్న భవనం. పూర్వము ఇండియన్ కమాండర్ ఇన్ ఛీఫ్ కిచెనర్ నివాసం ఉండేవారు. చుట్టూ పైన వృక్షాలు ఆవరించి వున్నాయి. ఇక్కడ రూములు అద్దెకుకూడా రోజుకి 75 రూ. నుండి 125 రూ. వరకు వుంటాయి. కొన్ని రెండు బెడ్‌రూముల కాటేజిలు అన్ని వసతులతో 200/- నుండి 500/- రూ ల్లో వున్నాయి

దీన్ని ఒక పెద్ద టూరిస్టు హోటలుగా మలిచారు. సిమ్లా టూరిస్టు ఆఫీసులలో ముం దుగా రిజర్వేషనులు పొంది వెళ్ళాల్సి వుంటుంది. ఇక్కడ విడిది చేయాలనుకునే వారికి ఇక్కడి నుండి పేర్‌పంజాల్, బద్రినాథ్ శిఖరాలు నయన మనోహరంగా కన బడతాయి.

కుఫ్రీ :

సిమ్లా నుండి 16 కి.మీ. వైల్డ్‌ఫ్లవర్ హాలు టూరిస్టు హోటలు నుండి 3కి.మీ దూరంలో అమరియున్న హిమాచలప్రదేశ్‌లో పేరెన్నికగన్న స్కీయింగ్ కేంద్రం. శీతాకాలం క్రీడలకు పెట్టింది పేరు. అయితే జనవరి-ఫిబ్రవరి మాసాలు శీతల క్రీడ లకు అనువైన కాలంలో అప్పుడప్పుడు మంచు కుప్పలు సమస్యాత్మకంగా పరిణ మించటం కూడా కద్దు. కావలసిన స్కీయింగ్ సరంజామా ఇందిరా రెస్టుహౌస్ నుండి అద్దెకు కారు చౌకగా లభిస్తుంది. అభిలాష గలవారు పాల్గొనవచ్చు.

క్రాయిగ్నానో :

2279 మీటర్ల ఎత్తున హిల్‌టాప్ రెస్టు హౌస్ వుంది. సిమ్లా 16 కి.మీ. దూరంలో ఉన్నది.

నాల్దెరా :

సిమ్లా 23 కి.మీ. దూరంలో వున్న గోల్ఫ్ క్రీడా కేంద్రం. సముద్ర మట్టానికి 2,044 మీ. ఎత్తున వున్నది. టూరిస్టు బంగ్లా, కెఫెటేరియా సౌకర్యా లున్నాయి.

ఫాగు :

ఇక్కడ బంగాళాదుంపల పంట గురించి ఒక పెద్ద వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఉంది శీతాకాలంలో విపరీతమైన హిమపాతం వుంటుంది. సిమ్లాకి 22 కి.మీ. దూరంలో సముద్ర మట్టానికి దాదాపు 2500 మీ. ఎత్తున ఉంది.

ఛయల్ :

సిమ్లా నుండి 64 కి.మీ. దూరంలో ఛయల్ వద్ద మంచి క్రికెట్ క్రీడా స్థలం వుంది. ఇది ప్రపంచం మొత్తం మీద ఎంతో ఎత్తులో అమరివున్న క్రీడా స్థలంగా పేరు పెంపు వహించింది. సిమ్లా టూరిస్టు ఆఫీసులో విచారిస్తే విడిదిగా టూరిస్టు బంగ్లాను ఉపయోగించుకోవచ్చు.

ఇంకా ఆసక్తి గల ప్రకృతి సౌందర్యారాధక యాత్రికమన్యులకు చూడాలని అభిలాష వుంటే చూడదగిన ప్రదేశాలు — సిమ్లాకి 64 కి.మీ. దూరంలో ఉన్న నార్కొండా- హిమాలయ పర్వత శ్రేణులు ధగద్ధగాయమానంగా వెలిగే వెండి వెన్నెల కాంతుల వెలిగే శిఖరాలన్నీ గుది గుచ్చినట్లుగా కనపడే దృశ్యం చూడగలిగిన ప్రదేశం- ముఖ్య ఆకర్షణ-హంటూ, శిఖరం; 93 కి.మీ. దూరంలో ఉన్న ఆపిలు క్షేత్రాలు, 51 కి.మీ. దూరంలో వున్న తట్టాపానీ (అవే సల్ఫర్ స్ప్రింగ్స్-ఉష్ణ జలధారల ఊటలు) దర్శించదగినవి. నార్కొండా ప్రస్తుతం మంచి స్కీయింగ్ కేంద్రంగా మలచబడుతూంది. ఈ ప్రదేశాలన్నిటికీ హిమాచల్‌ప్రదేశ్ టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను వారి టూరిస్టు బస్సులున్నాయి. ఇవి మల్ దగ్గర నుండి బయలుదేరతాయి. టూరిస్టు ఆఫీసులో విచారిస్తే మరింత సమగ్రమైన మీ సమాచారం అందుతుంది. మీ సౌకర్యం, అభిరుచి, అభిలాష సమయాన్ని బట్టి కార్యక్రమ నిర్ణయంచేసికొని మీ మనోభావన ప్రకారం, జేబు నిండుతనానికి తగినట్లుగా ప్రదేశాలను దర్శించవచ్చు.

**వుండటానికి :**

సిమ్లాలో సాధారణంగా వేసవి కాలంలో రేట్లు చాల పెచ్చుగా వుంటాయి. ఇది వాటికి వేసవి విశ్రాంతి కేంద్రపు సీజనుగనుక. మిగతా చలిరోజుల్లో లాడ్జిలు, హోటళ్ళు కాళీగా- అతితక్కువ రేట్లకు లభ్యమవుతాయి. సీజను ఏప్రిల్ మధ్యనుండి మొదలయి సెప్టెంబరు వరకు వుంటుంది. జూన్, సెప్టెంబరు మధ్యల్లో అసలు వసతి దొరకటమే కనాకష్టంగా వుంటుంది ఎంతపెట్టినా.

YMCA కేంద్రం విలువకి తగినట్లుగా సౌకర్యాలు అమరివుంటాయి. నెగళ్ళు, రగ్గులు, బ్లాంకెట్లు చలికాచుకుండే నెగళ్ళు వుండి చాలా అనుకూలంగా వుంటుంది. మల్ కేంద్రంలో వున్న హోటళ్ళు చాల రద్దీగావుండి, విపరీతమైన చార్జీలు చెల్లించాల్సి వుంటుంది— సీజన్ పొడుగునా, YMCA కేంద్రం పెద్ద హోటలు మయూర్ వెనకాల వుంది. మీరు YMCA మెంబర్లు కాకపోతే తాత్కాలిక సభ్యత్వం కూడా లభించవచ్చు— సభ్యత్వ రుసుం చెల్లిస్తే, అవకాశం అదృష్టాన్నిబట్టి అందుబాటులో వుంటుంది.

**హోటళ్ళు :**

తాష్కెంటు హోటల్, హోటల్ విక్రాంత్, హోటల్ అశోకా, డ్రీమ్‌లాండ్

కొంత అందుబాటులో రు. 40/- నుండి 70/- రు. వరకూ లభ్యమయ్యే ప్రదేశాలు మధ్య తరగతి మాన్యులకు.

శ్రీమంతులకు :

స్తోమతుని బట్టి, 150 రూ. నుండి 350/-, 400/- వరకూ చార్జీలుండ వచ్చు. వాటిలో కొన్ని - మల్ కేంద్రంలో హోటల్ షింగార్, హోటల్ డిప్లొమాట్, హోటల్ స్ప్రామాన్, హోటల్ వైట్, అవుక్ లాండ్, హోటల్ మయూర్, లార్డ్స్‌గే హోటల్, ప్రభుత్వంవారు నిర్వహించే హాలీడే హోమ్- మొదలయినవి. సర్క్యులర్ రోడ్డులో ఉన్న హిమలాండ్ హోటల్ కూడా పేర్కొనదగించే ఈ శ్రేణిలో.

డల్హౌసి :

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వెలువరిచిన అభిప్రాయం ప్రకారం 'కాశ్మీర్‌ను ఒక ప్రక్కన ఉంచితే— మరో ప్రక్క ప్రశాంత వాతావరణంలో ప్రకృతి అందాలు విరబూసిన వసంతంలా వికసించిన భూతల స్వర్గంగా భావించ దగినది డల్హౌసి— దేశంలో ఏదైనా పర్వత విశ్రాంతి కేంద్రానికి వెళ్ళాలనిపిస్తే—డల్హౌసికి ప్రథమ ప్రాముఖ్యాన్నిస్తాను- అక్కడికే వెళ్తాను' అని చెప్పుకున్న వయినం తీరుని గమనిస్తే ఈ ప్రదేశపు ప్రాముఖ్యతను ఊహించుకోవచ్చు.

అసలు డల్హౌసి 1851 లో లార్డ్ డల్హౌసి పేరన నిర్మించబడినది. ఆయన ఆనాటి బ్రిటిష ఇండియా గవర్నర్ జనరల్. అందాల గనియైన చంబాలోయకు ముఖ్య సింహద్వారం లాంటి చిరుపట్టణం— ఛంజన్, ప్ట్రాన్, టెహ్రా, కాలోగ్- అనే నాలుగు పర్వతాలు గలిసి- ఏర్పడుతుంది. చంబాలోయ పాలు, తేనెలకు ప్రసిద్ధి. హిమరాసులుతో కప్పబడిన 23,000 అ, ఎత్తున గగన చుంబితంగా ఆకాశాన్నంటే పర్వత శిఖరాలు నిశ్శబ్ద ప్రశాంత వాతారణంతో మధురానందానుభూతిని కలుగజేసే వసంత వాహినిగా ప్రసిద్ధి. మధ్యమధ్య దట్టమైన అడవులు-అడవుల్లో సంచరించే కొన్ని ప్రత్యేకమయిన అరుదైన వన్య మృగాలకు తోడుగా ప్రకృతిలోని లయబద్ధమైన సంగీత మాధుర్యాన్ని మనకు చవిచూపించే వింత పక్షుల కలకూజితాలు శ్రవణానందం చేస్తుంటాయి. వసంతకాలంలో పరచిన నందనవన సదృశంగా భాసిస్తుంది.

డల్హౌసి ప్రత్యేకంగా పేర్కొనదగిన ఆరోగ్య విశ్రాంతి కేంద్రంగా ప్రసిద్ధి.

7,800 అడుగుల ఎత్తున— ఎగువ బ్రకోటా— పట్టణంలో మొత్తంమీద ఆరోగ్య కేంద్ర బిందువు. హిమాలయ శిఖరాలను నయన మనోహరంగా వీక్షించగలం. గుండెలనిండా మరపురాని, మరుపలేని అనుభూతిని సంతరించిపెట్టే ఆనందకేంద్రం డల్హౌసి.

**కాలాతోప్ :**

8,000 అ. ఎత్తున డల్హౌసికి 8 కి. మీ. దూరంలో ఉన్నటువంటి ప్రదేశం. చివర 2 కి.మీ. దట్టమైన అడవుల్లో గుండా దారి చేసికొని నడుస్తుంటే మనసునిండా నిండిన థ్రిల్ అనుభవైక వేద్యం. ఈ అడవుల్లో పెద్ద పెద్ద దేవదారు వృక్షాలు పెరిగివుండి స్వాగతిస్తూన్నట్లుంటాయి.

**ఖజ్జియార్ :**

పచ్చటి పసిరిక బయళ్ళతో డల్హౌసి నుండి 22 కి. మీ. దూరంలో 6,400 అడుగుల ఎత్తున చుట్టూ పైన్ వృక్షాలతో పరిక్రమించబడి ఒక అందమైన పళ్ళెం లాగ అమరియున్న చక్కని ప్రదేశం. ఇందులో అందాల సరస్సు, దాదాపు ఒక చదరపు కిలో మీటరు వైశాల్యంతో ఉన్నది. 1900 సం. ప్రాంతంలో బ్రిటిషు ఇండియాకి గవర్నరు జనరల్‌గా ఉన్న లార్డ్ కర్జన్ 'ఇండియాలో నేను చూసిన అందాల గని' అని ప్రసంశించారట. గోల్ఫ్ క్రీడాస్థలి, బంగారు డోమ్‌తో అలరు తున్న చక్కని దేవళం- ప్రత్యేకతలు. డల్హౌసి చుట్టు ప్రక్కల, దగ్గరిలో మరిన్ని పిక్‌నిక్ స్పాట్లున్నాయి. అవి- దాయిన్‌కుండ్, జంథారి, ఘాట్, సుఖాన్, బావోలి, పూంఙ్ పుల్లా, సాత్‌ధార- మొదలయినవి పేర్కొనదగినవి. అభిరుచి గలవారు దర్శించదగినవి.

వుండటానికి- హోటల్ దేవదార్— రూములు, పడక సౌకర్యాలు అమరి ఉన్నది. ఇక పోతే యూత్ హాస్టలు, P. W. D. రెస్టుహౌస్ ఇతరంగా ఉన్న వసతులు.

**కసౌలీ (KASAULI) :**

సముద్ర మట్టానికి 6000 అడుగుల ఎత్తున అమరియున్న మంచి వేసవి విశ్రాంతి కేంద్రం. కాల్కా లోయల సౌందర్యాన్ని కనులార గాంచగల సమున్నతప్రదేశం. వుండటానికి హోటళ్ళు వగయిరాలు చాలానే వున్నాయి. సిమ్లా, మనాలి, చండీఘర్ నుండి రోడ్డు సౌకర్యాలున్నాయి.

ఇంకా దక్షిణంగా ఉన్న ఉత్తర ప్రదేశ్ హర్యానా సరిహద్దుల్లో సిర్మూర్ జిల్లా ప్రాంతాల్లో అమరియున్న ప్రదేశాలు.

**పోంటా సాహిబ్ :**

ఉత్తర్ ప్రదేశ్ ఉత్తరపు కొసన హిమాచల ప్రదేశ్‌కి ద్వార సమానమైనది. శిక్కుల 10 వ వాడైన గురుగోబింద్‌సింగ్ నివసించిన ప్రదేశంగా పేర్కొనబడింది. ఇక్కడికి 23 కి.మీ. దూరంలో పర్వత రాజ్యాలపై సాధించిన విజయస్థలిగా ఉన్న యుద్ధ రంగంకూడా ఉన్నది. యమునానదీ తీరంలో ఉన్న గురుద్వారాలో ఆయన ఉపయోగించిన అయుధ విశేషాలు ప్రదర్శించబడే ఆలయం యమునానదీ గమనాన్ని వీక్షిస్తూ సాక్షాత్కరిస్తూంది.

వుండటానికి HPTDC వారి 'హోటల్ యమునా'లో వసతిని పొందవచ్చు. చార్జీలు సౌకర్యాలనుబట్టి 60/- నుండి 150/- రు.ల వరకు ఉండవచ్చు. కొన్ని స్థానికంగా ఉన్న హోటళ్ళు గూడ అందుబాటులో ఉన్నాయి.

**రేణుక :**

పోంటా సాహిబ్‌కి వాయవ్య దిశలో అమరియున్న రేణుకాదేవి క్షేత్రం. ఇక్కడ పూర్వపు పురాణ ప్రసిద్ధిగల జమదగ్ని ఆశ్రమం, రేణుకా జమదగ్నుల విగ్రహాలు, లక్ష్మీనారాయణుల, పరశురామ మందిరాలు, త్రిమూర్తుల మందిరాలు ఉన్నాయి. అక్టోబరు, నవంబరు మాసాల్లో గంగ దసరా, పరశురామ జయంతి, సోమవతి అమావాశ్య మేళా ఉత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. భక్త సూర దాసు మహాకవి ఇక్కడ ఈ పవిత్ర పుణ్యస్థలిలో కొన్నాళ్ళు గడిపారట యమునా నది ఇక్కడ పడమరగా ప్రవహిస్తుంది.

**నహాన్ :**

హిమాచల ప్రదేశ్‌లో ఎన్నదగిన పారిశ్రామిక కేంద్రం. ఇక్కడనుండే హిమాలయాలు ఎక్కుడు ప్రారంభం. సముద్ర మట్టానికి 932 మీటర్ల ఎత్తున అమరియున్న చిన్న పట్టణం. పర్వతారోహణోత్సాహులైన వారికి చూర్‌ధార్ శిఖరం 3,642 మీటర్ల ఎత్తులో ఉన్నదాన్ని గమించ గలిగితే సట్లెజ్ నదీతీర మైదానాలు కనుచూపు మేరలో నయనానందకర దృశ్యం చూడగలరు. 14 కి. మీ. దూరంలో ఉన్న సకేటి అనేచోట ఒక చక్కని పార్కు ఉన్నది. ప్రాచీన సరీ

స్తూపాల నమూనాలు అనేకం ఫైబర్ గ్లాసుతో చేయబడినవి చూడవచ్చు. చరిత్ర కందని పూర్వయుగాల్లోని ఆదిమానవుని ఆకృతిని కూడా కళ్ళారా చూడవచ్చు. ఇక్కడ అనేక పురాతన కళేబరాలు, కంకాళాలు త్రవ్వి తీయటం జరిగింది.

స్థానికంగా అనేక హోటళ్ళున్నాయి, వసతికి.

## ధర్మశాల — కంగ్రా లోయ

### ధర్మశాల :

1972లో టిబెట్టును చైనీయులు ఆక్రమించినప్పుడు కొంతమంది టిబెట్టు వాసులు దలైలామాతో పాటు వలసవచ్చి నివాసం ఏర్పరుచుకున్న స్థలం— ఒక చిన్న పట్టణంగా ఏర్పడింది. మూడు వైపులా 1000 మీ. ఎత్తు నుండి 2000 మీ. ఎత్తుగల పర్వత శిఖరాలతో ఆవరించబడియున్నది. దక్షిణాన దృశ్యమాన మయిన లోయకి మార్గ దర్శకంగా ఉన్నది. ఇక్కడికి 11 కి.మీ. దూరంలో 'డాల్ లేక్' అన్ పేరుతో ఒక అందమైన సరస్సు అమరియుంది.

### గమనిక :

ఇది శ్రీనగరులోని 'డాల్ సరస్సు' మాత్రం కాదని మనవి.

ధర్మశాల పట్టణాన్ని రెండు విభాగాలుగా చెప్పుకోవచ్చు. ఎగువ ప్రాంతం, దిగువ ప్రాంతం. ఎగువ ప్రాంతాన్ని మెక్‌లియోద్ గంజ్ అంటారు. ఎగువ ప్రాంతానికి దిగువ ప్రాంతానికి ఉష్ణోగ్రతా భేదాలుంటాయి. స్వతహాగా ధర్మశాల ఒకనాటి బ్రిటిషు వారి వేసవి విశ్రాంతి కేంద్రం. ఆనాటి జ్ఞాపకాల చిహ్నాలుగా ఒక అందమైన చర్చి ఉంది. ఇక్కడే 1868 నాటి లార్డ్ ఎల్గిన్‌ను ఖననం చేసిన చోటు. లార్డ్ ఎల్గిన్ ఆనాటి వైస్రాయి.

వసతికి ఇక్కడి టిబెట్టు వారు నిర్వహించే హోటళ్ళు అనేకం ఉన్నవి. అందుబాటులో ఉంటాయి. టిబెట్టు వారు తివాసీల నేతలో మంచి పనివారు. కళాత్మకంగా నేయబడిన తివాచీలు అక్కడికక్కడే ధర చెల్లించి తీసుకోవచ్చు. చిన్నా పెద్దా అవసరాన్ని బట్టి తీసికోవచ్చు.

### చాంబా లోయ :

డల్హౌసి నుండి 56 కి. మీ. దూరంలో సముద్ర మట్టానికి 926 మీటర్ల ఎత్తున - డల్‌హౌసి కంటే కొంచం తక్కువ ఎత్తులో ఉన్న లోయ ప్రాంతం. రావి

నదీతీరంకంటే పైగాఉన్న అనేకములయినఆలయాలతో మధ్యయుగాలనాటిఇటాలియన్ గ్రామంతో పోల్చదగిందిగా చెప్పబడుతూ వుంది. వీటిలో ముఖ్యంగా పేర్కొనదగిన విగా మూడు శివాలయాలు, మూడు విష్ణ్వాలయాలు చెప్పుకోదగినవి.

చాంబాలో భూరిసింగ్ మ్యూజియం ఉంది. ప్రాంతీయ సంస్కృతి, సాంప్రదాయాలను వెలార్చే అనేక కళాఖండాలుగా ఉన్న పెయింటింగులు చాలా వున్నాయి. బసోహ్లి, కంగ్రాస్కూల్, ఆఫ్ పెయింటింగ్స్ వారి చిత్రణలు ముఖ్యంగా చోటుచేసికొన్నాయి. ఎగువ భాగంలో ఉన్న రంగమహల్ భవనం అగ్ని ప్రమాదానికి గురై చాలా భాగం పాడయిపోయింది. కొన్ని కుడ్య చిత్రాలు మాత్రం మ్యూజియంలో దర్శనీయంగా ఉన్నాయి.

చాంబాలోయలో 75 మీ. వెడల్పు ఒక కిలోమీటరు పొడవు ప్రకృతి పరిచిన పూలతివాచీ అనదగిన చౌగన్ వుంది, నయన మనోహరంగా వుంటుంది. స్థానిక వ్యాపార కేంద్రంగా గ్రామం ఎప్పుడూ రద్దీగా వుంటుంది. చుట్టుప్రక్కల గిరిజన ప్రజలందరూ ఇక్కడికే వచ్చి తమ వస్తువులు అమ్మకానికి పెడుతుంటారు. ప్రతి సంవత్సరం ఆగస్టు మాసములో మింజార్ ఉత్సవం గడ్డి చరాచి, భట్టి, గుజ్జర, సమూహాలతో రంగు రంగుల హోయలలో జరిగే ఉత్సవం చాలా పసందుగా వుంటుంది. రఘువీరుని ప్రతిమ ఉత్సవ విగ్రహం ముందు దారి తీస్తుంటే ఇతర దేవుళ్ళు, దేవతలు పల్లకీల్లో అనుసరించబడతాయి.

చంబా ముఖ్యంగా గడ్డి జాతివారికి ముఖ్యమైన కేంద్రం. వీరు వంశపారంపర్యంగా వచ్చే పశువుల కాపర్లు. గొఱ్ఱెల మందల్ని తీసికొని వేసవి కాలాల్లో ఎత్తుగా ఉన్న ఆల్పైన్ పచ్చిక బయళ్ళకు మేపుకి తోలుకెళ్ళి, శీతాకాలంలో కాంగ్రా, మండి, బిలాస్‌పూర్‌లకు దిగి వస్తుంటారు. గడ్డి జాతివారు కంగ్రా, చాంబా లోయలు వేరుపడే అతి ఎత్తయిన ప్రదేశాల్లో మాత్రమే మనకు దర్శనమిస్తారు.

చాంబా పట్టణం జిల్లాకి ముఖ్య కేంద్రం. ఇక్కడ క్రి. శ. 920 సం॥లో నిర్మించబడిన దేవాలయాలు, రాణీ నైనాదేవి సమాధి, ఖాజీ నాగ్ దేవాలయం– 15 కి. మీ. దూరంలో ఉన్నది దర్శనీయాలు. మంచి వేసవి విశ్రాంతి స్థానం.

**ఆరోహణ క్రమ మార్గాలు :**

చంబా లోయ అనేక ఆరోహణమార్గాలు దగ్గరలో ఉన్నవి అనువుగా వున్నవి సరోల్, బందాల్, ఛాత్రరి మార్గాలు అనుకూలమైనవి. చ్ఛాత్రరి, బ్రహ్మపూర్

మార్గంలో అమరియున్న దేవి ఆదిశక్తికి అంకితమైయున్న దేవాలయం దర్శనీయంగా ఉంటుంది భార్తరిలో మార్గమధ్యంలో ఉన్న బ్రహ్మపూర్ శివ భూమిగా ప్రసిద్ధి. గడ్డి లాండ్‌కి గుండెలాంటిది. బ్రహ్మపూర్‌లో అనాది కాలం అలయాలున్నాయి. ఆ సమూహాలను 'చౌరాసి' అంటారు. ధర్మశాలకి 6రోజులపాటు నడక కార్యక్రమాన్నేర్పరచుకోవచ్చు.

1 రోజు – బ్రహ్మపూర్ – ఛనోట – 22 కి. మీ. దూరం

2 రోజు – ఛనోట – కువర్సి – 13 „

3 రోజు – కువర్సి – ఛట్టా – 10 „

4 రోజు – ఛట్టా – లకాగోట్ – 10 „

5 రోజు – లకాగోట్ – త్రియుండ్ – 6 కి. మీ. దూరం

6 రోజు – త్రియుండ్ – ధర్మశాల – 13 „

పంగీ లోయ :

చాంబాకి ఈశాన్యంగా 167 కి. మీ. దూరం. చీనాబ్ నది ఇక్కడ లోయల్లో ఎంతో అగాధంలో సన్నగా ప్రవహిస్తుంది. పంగీ, జనస్కార్ పర్వతశ్రేణుల మధ్య గల ఈ లోయలో జనసమ్మర్థం చాలా తక్కువగా వుంటుంది. కిలార్‌నుండి వాయవ్య దిశలో జమ్ము-కాశ్మీర్ లోయల్లో ఉన్న కిష్తవార్‌లోకి ఆరోహించవచ్చు. లేదా కిష్తవార్ త్రోవలో మధ్యలో తూర్పుకి తిరిగితే ఉమాసిలా కనుమదాటి జనస్కార్ లోయకి గాని, లేదా ఆగ్నేయ దిశలో ప్రయాణిస్తే కీలాంగ్‌మానాలిలను చేరవచ్చు. ఈలోగా కాంగ్రా గురించి ముచ్చటించుకుందాం.

# కంగ్రాలోయ – జ్వాలాముఖి

నైఋతి దిశన :

భాక్రానంగల్ డామ్ :

ప్రపంచం మొత్తం మీద అతి పొడవైన ఆనకట్టగా శతద్రునది మీద నిర్మించబడిన అద్భుతమైన మానవ నిర్మితమైన కట్టడం. పంజాబులోని విశాలమైన భూమిని సారవంతం చేసి సజలపూర్ణం చేస్తున్నది. ఆనకట్టని చూడటానికి పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు గారి అనుమతితో ఈ బ్రహ్మాండమైన కట్టడాన్ని తిలకించవచ్చు.

**బిలాస్‌పూర్ – నైనాదేవి :**

బిలాస్‌పూర్-చండీఘర్-మండి మార్గంలో ఉన్న చిన్న పట్టణం. గోబింద సాగర సరస్సు తీరంలో ఉన్నది. ఇక్కడ వ్యాసగుహ, లక్ష్మీనారాయణుల, రాధే శ్యాముని ఆలయాలున్నాయి. దర్శనీయం. నైనాదేవి నుండి మనోహరమైన సరస్సీర దృశ్యాలను చూడవచ్చు.

**మండి :**

అర్థం మార్కెట్. కాని ఇది పట్టణం. అర్థానికి తగినట్లుగానే ఇక్కడ మంచి వ్యాపారం జరుగుతుంటుంది. బియాస్ నదీ తీరంలో కులూ లోయకు ముఖ్య ముఖ ద్వారం. మండి పట్టణంలో శిలాశిల్పకృతమైన భూతనాథ్, త్రిలోకనాథ్, పంచ వక్త్రి, అర్ధనారీశ్వర, శ్యామాకలి ఆలయాలు ప్రసిద్ధి చెందినవి. శిల్ప చిత్రణ బహు రమణీయంగా శ్లాఘనీయంగా ఉంటుంది. ఇక్కడ అమరియున్న శివాలిక్ పర్వత శ్రేణి సముద్ర మట్టానికి 800 మీటర్లు ఎత్తునవున్నా వాతావరణం వేడిగానే వుంటుంది. తారణాదేవి ఆలయం మీదికెక్కి చూస్తే పర్వతశ్రేణి మహోన్నత దృశ్యమానంగా వీక్షించగలం

**రేవాల్‌సార్ సరస్సు :**

మండికి దక్షిణంగా 30 కి.మీ. దూరంలో అమరియున్న మంచినీటి సరస్సు. ఈ సరస్సు మధ్యలో చక్కని లంక. లంకలో మంచి ఆలయం. ఇక్కడికి హిందువులు, బౌద్ధులు, సిక్కులు పవిత్ర యాత్రగా వస్తారు భక్తకోటి జనులు. ఇక్కడ టిబెట్టు బౌద్ధ ఆశ్రమం వుంది. వసతిగా వుంటుంది. మండి పట్టణంలో చౌకగా అందుబాటులో కొన్ని హోటళ్ళు కూడా వున్నాయి. మంచి టూరిస్టు బంగ్లా వుంది, శేఫ్ షిరాజ్ టూరిస్టువారు నడిపే హోటలు.

**కంగ్రా :**

కంగ్రాలోయ మండి నుండి మొదలవుతుంది. మనోహరమైన ప్రకృతి విరబూసిన అందాలు లోయంతా పరచుకుని పఠాన్‌కోట-మండి- మార్గం మధ్యలో అమరియున్నది. కంగ్రాజిల్లా ముఖ్య పట్టణం (ఒకానొకప్పుడు) ఇక్కడే ఈ మార్గంలోనే ఉన్నది.

ఝరీవేగంతో ప్రవహించే వనగంగా తీరంలో సమున్నతంగా ఉన్నదీ కంగ్రా పట్టణం. కాంగ్రా అనేక పురాతన దేవళాలకు కాణాచి. వీటన్నింటిలోను పేర్కొన

దగినది, దేవీప్రతిశ్వేరి వేంచేసియున్న ఆలయం. అందరి కన్నూ ఆలయ సంపద మీదే. 1009లో మహమ్మద్ గజనీ తులలేని సంపదను ఇక్కడి నుండి కొల్లగొట్టుకు పోయాడట. 1360లో తుగ్లక్ కొంతదోచాడు. కాని జహంగీరు కాలంలో మాత్రం వెండి రేకులు కట్టించారట. 1905 సంభవించిన భయంకర భూకంపం అలయాన్ని శైథిల్యం చేసింది. ఈ లోయంతా వివిధ రకాల తరు, లతా, పుష్ప వృక్షాలతో నేత్ర పర్వమైన అందాల ప్రోవు. ఈ లోయలోని ప్రకృతే స్ఫూర్తిగా ప్రేరణగాగల చిత్ర రచన శిక్షణాలయం కంగ్రా స్కూల్ ఆఫ్ పెయింటింగ్ చాల ప్రసిద్ధి కెక్కింది. కంగ్రాకు 30 కి మీ. దూరంలో ఉన్న జ్వాలాముఖి ఆలయం పురాణ ప్రసిద్ధి చెందింది.

జ్వాలాముఖి :

శ్రీమహావిష్ణువు సుదర్శన చక్రచ్ఛేదితమైన సతీదేవి శరీర శకలాల్లోని నాలుక ఇక్కడ తెగిపడిందట అనాదికాలం నించీ ఆరని జ్వాలలు జ్వలిస్తూనే వున్నాయి. 51 శక్తిపీఠాల్లో ఇది ఒకటిగా ప్రసిద్ధి. ఇక్కడ జ్వలించే జ్వాలలు వైజ్ఞానికంగా భూగర్భ శాస్త్రవేత్తల తైలాన్వేషణ, సహజవాయు సంపదల అన్వేషణకు సూత్రాధారమై వెలసినదని ప్రతీతి. వేంచేసినదేవి విద్యేశ్వరీదేవి. కొండమీద 50మెట్లుతో దేవికి ఆలయం నిర్మించబడింది. ప్రక్కనే 40 అ. ఎత్తునగల సువర్ణ త్రిశూలం ఉంది. ఆలయం రాతి దర్వాజా గుండా చూస్తే సుమారు 1½ అ॥ చదరంలో వెలుగుతున్న మహాజ్వాలను చూడగలం. దీనికే జ్వాలాజీ అనిపేరు. పాలు, నేయితో చేసిన మధుర మైన తీపి పదార్థాలు నివేదనగా పెడతారు. ఆలయంలో జ్వాల అడుగున తెల్లగా మల్లె పువ్వులాగా ఉంటుంది. ఇదే విధమయిన జ్వాలలు ఆలయంలో మరిన్ని చోట్ల కూడా చూడగలం.

అమ్మవారికి అక్బరు మహాచక్రవర్తి ఒక రజతఛత్రం చేయించారట. దీని వెనుక ఒక మహత్వ పూర్ణమయిన కథ ప్రచారంలో ఉంది. చక్రవర్తి ఈ జ్వాలను సమయించటానికి యినుపరేకులు కప్పించటం, ఒక జలధారను జ్వాలమీదికి చిలికేట్లు చేసి ఎన్నో రకాలుగా ప్రయత్నించాడట. అయితే ఇవేమీ ఆయన ప్రయత్నాన్ని సఫలీకృతం చేయకపోగా ఆయన కళ్ళు రెండూపోయి దృష్టిహీను లయ్యారుట. తరువాత అమ్మవారిని శరణజొచ్చి స్తుతించి, దేవీ యనుగ్రహించగా దృష్టిని మరల పొందగలిగారని, ఆ సందర్భంలో అమ్మవారికి వెండిఛత్రము నొకదాన్ని చేయించి కానుకగా

సమర్పించుకొన్నారని ప్రతీతి. ఇప్పటికీ ఆ ఛత్రం ఉంది. యాత్రికులు చూడ వచ్చును.

వసతికి ధర్మశాలలు, హోటళ్ళు అనేకం వున్నాయి. హోటల్‌లో జ్వాలాజీలో 100/-, 125/- రు.లకు రూములు దొరుకుతాయి. దీన్ని HPTDC వారు నిర్వహిస్తున్నారు. PWD రెస్టుహౌసు గూడ వుంది వసతికి.

**పాలంపూర్ :**

టీ తోటలమధ్య ధర్మశాల నుండి 35 కి మీ. దూరంలో ఉన్న సుందరమైన పట్టణం. సముద్రమట్టానికి 1250 మీటర్ల ఎత్తున అమరియున్నది. చుట్టూ వ్యాహ్యాళికి అనువైన ప్రదేశాలు సుందర దృశ్యాలు కొన్ని ఉన్నాయి.

**బైజ్యనాధ్ :**

పాలంపూరుకి 16 కి.మీ. దూరంలో క్రీ.శ. 804 లో నిర్మించబడిన బైజ్యనాధుని ఆలయం ఉంది- మహాదేవుడైన శివుని ఆలయం, PWD గెస్టుహౌస్ కూడా వుంది వసతికి.

**చింత్ పూర్ని :**

ధర్మశాల నుండి 80 కి.మీ. దూరంలో బియాస్ నదీతీరంలో ఉన్న పట్టణంలో ఒక పురాతన దేవాలయం వుంది.

**మస్రూర్ :**

హిందూ-ఆర్య శిల్పరీతుల్లో మలిచిన 15 దేవాలయాలున్నాయి. చాలా వరకు జీర్ణావస్థలో వున్నాయి. అయితే వీటికి ఎల్లోరా, అజంతా గుహలకు పోలికలున్నట్లుగా వినికిడి. కంగ్రాకు 15 కి.మీ. దక్షిణాన హరిపూర్‌కి సమీపంలో ఉన్నదీ వూరు.

**నూర్పూరు :**

కొంత చరిత్ర సంబంధమైన ప్రసిద్ధి చెందింది. జహంగీరు చక్రవర్తి భార్య, నూర్జహాన్‌బేగమ్ పేరు ఈ వూరికి 1622లో పెట్టారట. వూరిలో ఒకకోట వుంది. శిధిలమయి పోయింది. కృష్ణభగవానునికి కూడా కోటలో స్థానమిచ్చారు. PWD రెస్టుహౌసు ఉన్నది వసతికి.

# కులూ & మణాలి (మనాలి)

కులు అసలు పేరు కులాంతపిత- 'నివాసయోగ్యమైన అంతిమ ప్రపంచం' అని అర్థం. కులూలోయ ప్రకృతి అందానికి నిర్వచనం అంటే అతిశయోక్తి కాదు. పుడమితల్లికిభరతమాత అలంకారమైతే భరతమాతనుఅలంకరించబడిన పచ్చలపతకం అని చెప్పుకోవచ్చు. ఒకసారి వస్తే మళ్ళీ మళ్ళీ రావాలని ప్రకృతి అందాల్ని తనివి దీర ఆస్వాదించాలనే ఆకాంక్ష బలీయమై ఎన్నిసార్లు చూచినా తృప్తితీరని అనిర్వచనానందాన్ని చవి చూస్తారు. ప్రత్యణువు తనదైన ప్రత్యేకతను సంతరించు కున్నది. అనాదిగా వున్న వృక్షసంతతి, చవులూరించే ఆపిలు తోటలు, పర్వత సానువులు, చిరుచిరు సవ్వడుల సెలయేటి గలగలలు, నిర్మల సరోవరాలు, నిత్యవసంతాలు పూచిన హరివిల్లుల సముదాయం ఓహ్- సృష్టిలోని ప్రకృతి పరువాలు విరబూసిన చోటులు పచ్చతోరణాల పసిడి వెలుగుల జల్లులు మనోహ్లాదకరంగా, నేత్రపర్వమై కనువిందు చేసే నందనాల అనంతానందాల కాణాచి.

కులు పట్టణం :

సముద్రమట్టానికి 1200 మీటర్ల ఎత్తున బియాస్‌నదీ తీరంలో అమరయున్నది. జిల్లాకి ముఖ్య కేంద్రం. పట్టణానికి నదికీ మధ్యన ఒక పచ్చిక బయలు ఉంది. దీన్ని ధాల్పూరు మైదానం అని అంటారు. ఇక్కడే బ్రహ్మాండమైన వేడుకగా దసరా మహోత్సవాలు జరుగుతాయి. 'విజయదశమి' నాడు మొదలవుతాయి. మనకు శరన్నవ రాత్రులు పాడ్యమితో మొదలయి విజయదశమితో పూర్తవుతాయి. కాని ఇక్కడ దశమితో ప్రారంభమయి పౌర్ణమివరకు జరగటం విశేషం. ఈ పండుగను దుష్ట రావణునిపై కోసలరాముడు విజయాన్ని సాధించిన పర్వదినంగా భావిస్తారు. అందుకే రఘునాథ్‌జీ (శ్రీరామచంద్ర ప్రభువు) వారి విగ్రహమును (అయోధ్య నుండి సగౌరవంగా శ్రీరాముని తీసికొనివచ్చినట్లుగా దగ్గరిలోని ఒక ఆలయము నుండి తోడ్కొని వచ్చిన తరువాత) రథము నందుంచి రథయాత్రగా ఉత్సవం చేస్తారు. పండుగ పర్వ దినాలు ఐదురోజులు ఘనమైన వేడుకలు చేస్తారు.

ఈ ఉత్సవాల మహోత్సవంలో రఘునాథజీ మూర్తికి తోడుగా అక్కడ పరిసరాల్లోని దేవాలయాల్లోని ఇతర దేవతల ఉత్సవ మూర్తులు దాదాపు 200 మంది దేవతలని రఘునాథజీకి అభినందనల నిమిత్తం తెచ్చి ఊరేగిస్తారు. ఉత్సవాల ఆరంభానికి ముందు కులూ రాజులకు కుల దైవమైన హిడింబాదేవి ముందుగా రావాలి.

ఆమె రాకపోతే ఉత్సవాలు మొదలవవు. ఈ మహత్తరమైన ఉత్సవంలో రాజు పేద భేదం లేకుండా అందరూ విధిగా పాల్గొంటారు. రథం లాగటానికి పోటీలు పడతారు. పండుగ పరవడి అన్ని రోజుల్లోనూ నృత్యాలు, సంగీతాలు, భగవద్భక్తి కాలక్షేపాలు అనేకం జరుగుతాయి. ఆఖరు రోజున మాత్రం రావణుని దహన కాండకు సూచనగా చెడుమీద మంచికి ఆధిక్యం వహించటానికి నిదర్శనంగా కొంత గడ్డిని తగల బెడతారు ఆ తరువాత రఘునాథజీని ముఖ్యాలయానికి చేరుస్తారు.

కులూ లోయలో చూడదగినవి— రఘునాథ్‌జీ ఆలయం, జగన్నాథదేవి ఆలయం. కులూ నుంచి ౮ కి.మీ. దూరంలోనున్న భేఖ్లి గ్రామంలో ఉన్నది— వైష్ణోదేవి ఆలయం— కులూమనాల్ రోడ్డులో 4 కి.మీ. దూరంలో ఉన్న చిరు గుహాలయం వైష్ణవీమాత కంకితమైనది. 'బజౌరా'లోని బాషేశ్వర మహాదేవుని ఆలయం- చక్కని శిల్పకళలు నగిషీల పనితనంతో నిర్మించబడింది. వీటన్నిటికీ తోడుగా-

### బిజలీమహాదేవుని ఆలయం ;

నది అవతలగా 8 కి.మీ. దూరంలో ఉన్న విశేషమైన వింతతో అలరారే దాన్ని చూడవలసినది వుంది. సముద్రమట్టానికి 2,4౬౮ మీటర్ల ఎత్తునగల పర్వత శిఖరం మీద బిజిలీ ఆలయం చూడగలం. ఆలయం ముందు 20 మీటర్ల ఎత్తుగా లింగాకారంలో ఒక పెద్దతెల్లటి స్తంభంలాగ వుంటుంది. ఆకాశంలో సంభవించేపిడుగు పాటును ఆకర్షించుకుని తద్వారా శివలింగాన్ని ముక్కలు ముక్కలు చేస్తుందట. అంతలో వరుణదేవుడు అనుగ్రహించి వరాలు ఇస్తాడని నమ్మిక. ప్రకృతిలో భయంకరత్వాన్ని తాను అనుభవించి ప్రజలకు ప్రశాంతతను ప్రసాదిస్తాడని నమ్మిక కాబోలు! అమృత మధన సమయంలో వెలువడిన హాలాహలజ్వాలను ఇముడ్చుకుని లోకాలను గాచి గరళకంఠుడైన జగత్ కళ్యాణేందు శేఖరుడు మహదేవుడైన శివుడు- ప్రకృతి వైపరీత్యాలనుండి కూడా రక్షించగలవాడనే నమ్మకం— సహజంగదా! ఆ ముక్కలైన లింగాకారాన్ని అతి తక్కువ సమయంలో పూజారులు పునరుద్ధరిస్తారుట విచిత్రమే మరి!

### పార్వతీ లోయ :

కులూ నుండి 45 కి.మీ. దూరంలో పార్వతీ లోయలో మణికర్ణ వేడి నీటి ధారల ఊటలున్నాయి. ఒక కథ ప్రకారం పార్వతీ అమ్మవారి కర్ణాభరణం జారి పడింది. దాన్ని సర్పరాజు పాతాళంలోకి మోసికొని వెళ్ళాడు. దివ్యదృష్టితో గ్రహిం

చిన మహాదేవుడు కర్ణాభరణాన్ని తెచ్చి యివ్వమని సర్పరాజుని ఆదేశించాడు. మహా దేవుని ఆదేశాన్ని శిరసావహించి పాతాళం నుంచి పైకివచ్చి ఆభరణాన్ని అందించా డట. సర్పరాజు వచ్చిన మార్గం పాతాళం నుండి ఎగసిపడే జలరాసి నిరంతరం అలాగే వుందట. ఇక్కడకి వచ్చిన యాత్రికులు, స్థానికులు, ఈ ఉష్ణజలధారలతో వంట చేసికొంటారట విచిత్రంగా. స్త్రీలకు పురుషులకు వేరువేరుగా స్నానపు గదులు కట్టి వాటిలోనికి పంపులద్వారా వేడినీటి సప్లయిలు జరుగుతుంది. ఇక్కడ ఒక శిఖ్కు దేవాలయం వుంది.

కట్రాయిన్ :

మణికర్ణమునుండి కట్రాయిన్ అతి దగ్గరే. ఇక్కడ తేనేటీగల పెంపకం, పండ్లతోటలు, జెల్ల చేపల పెంపకం ఉత్పత్తి కేంద్రాలు ఉన్నాయి.

మనాలి :

ప్రశాంతమైన వాతావరణంతో అమరియున్న పట్టణం. చుట్టూ దేవదారు, పైన్ వృక్షాలు ఆవరించి యున్నాయి. కులు—మనాలి మధ్య బస్సులున్నాయి. ఇక్కడ ముఖ్యంగా నోరూరించే ఆపిలు పండ్లు గుత్తులుగా వేళ్ళాడే ఆపిలు తోటలు స్వాగతిస్తాయి.

మనాలి నుండి 3 కి.మీ. దూరంలో వసిష్ట ఉష్ణ జలధారల ఊటలున్నాయి. దీన్ని గురించే ఒక పురాణగాథ వుంది. వసిష్టుడు మహాముని. బ్రహ్మర్షి. ఆయన తన కుమారుని మరణంతో ఏర్పడిన దుఃఖావేశంలో చేతులు బంధించుకొని, ఇక్కడ నదిలో ఆత్మాహుతి చేసుకుందామని దూకాడు. కాని నదీమ తల్లి ప్రత్యక్షమయి ఆయన బంధనలు ఛేధించి సున్నితంగా ఒడ్డుకు చేర్చినట్లు-అందుచేతనే దీనికి వి(బి) పాశ - 'పాశములను విడదీసినదిగా' పేరు సార్థకమయిందిన్నది ప్రచారంలోని కథ.

ఎగువనే భృగుమహర్షి పేరు మీద ఒక సరస్సుంది.

మనాలి పట్టణానికి 8 కి.మీ. దూరంలో హిడింబాదేవి దేవాలయం వుంది. దట్ట మయిన అడవి మధ్య టూరిస్టు ఆఫీసు నుండి 2.5 కి.మీ. దూరంలో చక్కని దోవ. పరచిన తివాచీలా నడుస్తుంటే బహు సరదాగా ఉంటుంది. ఈ ఆలయాన్ని 1553లో నిర్మించారు దీన్నే ధుంగ్రి ఆలయం అని కూడా పిలుస్తారు. ప్రతి సంవత్సరం మే నెలలో ఉత్సవాలు విశేషంగా జరుగుతాయి. క్రీ.శ. 9 వ శతాబ్దానికి చెందిందని మరో వాదం.

మణాలలో మే, జూన్ మాసాల్లో సీజన్ చాల ఉచ్చలో ఉంటుంది. రేట్లుకూడా ఆకాశాన్నంటుతూ వుంటాయి. జూలై, ఆగష్టు నెలల్లో కొంచం కిందకి దిగుతాయి. డిశంబరు, జనవరి, ఫిబ్రవరి నెలల్లో మాత్రం చాలా తక్కువగా ఉంటాయి. ఈ సమయంలో అతిశీతలంగా ఉంటుంది. కనుక పర్యాటకులు అసలు వుండరు.

ఉండటానికి యూత్ హాస్టలు వుంది, ఊరి బయటగా HTDC వారు నడిపే వసతి గృహాలు కూడా వున్నాయి. వీటికి తోడు నదీ తీరంలో టూరిస్టులాడ్జి సాదాసీదాగా వుండి అందుబాటులో ఉంటుంది. హోటల్ బియాస్, టూరిస్టు ఇన్, ITDC వారి ట్రావలర్స్ లాడ్జి స్తోమతుననుబట్టి- 50 రు. నుండి 200 రు. వరకు చార్జిలుంటాయి.

నొగ్గలికి 5 కి.మీ. దూరంలో అర్జున్‌గుఫా, జెమనొన్ని గ్రామీణ ప్రాంతాలు అందాలు వెదజల్లుతూ ప్రశాంత వాతావరణంతోను, స్నేహ పాత్రమైన నివాసీయులతోను స్వాగతిస్తున్నాయి.

# లాహావుల్ & స్పితి

## రోహాటాంగ్ కనుమ :

రమ్యమని వీచేగాలి, కొరికేచలి 13,000 అ. ఎత్తున మంచు రాసులు రాసులుగా ఉన్న ఈ కనుమ ప్రాంతం. మణాలి నుండి 23 కి.మీ. దూరం అన్నిటినీ సహించగలిగి ఒక చిన్న బస్సు ప్రయాణం చేస్తే లాహావుల్‌కి సింహ ద్వారంలాంటి దాన్ని చేరగలం. ఈ రోడ్ 'మధ్యఆసియా'లోని లడక్‌కి దారితీస్తుంది. దీని తరువాత మాత్రం ఏ పంటకైనా అనుకూలమైన సారవంతమైన భూమి ఫలవృక్ష సంజాతమై సశ్యశ్యామలమై గోధుమ, వరి, జొన్న మొదలైన పంటలతో సుసంపన్నంగా జనసమర్ధంగా వుండే ప్రాంతం వుంటుంది. యిక్కడ మాత్రం కనుల నిండుగా మంచు రాలు కప్పబడిన కొండలు-ఒక చెట్టు, చేమా, మొక్కగూడాలేకుండా గాలి విపరీతమైన వేగంతో భయకరంగా వీస్తున్న గాలి, ఎముకలు కొరికే చలి జీవజాల ఆవాసానికి నోచుకొని నిశ్శబ్ద నీరవం నాట్యం చేస్తుండే పర్వతాల గుట్టలు తప్పితే మరేమీ చూడలేము. పంటలు, వృక్షాలు కూడా వుండవు. కొన్ని కొన్ని చోట్ల కేవలం గడ్డి గాదం మొలిచి యథేచ్ఛగా పెరిగిన పసిరిక బయళ్ళు అక్కడ కూడా కానవస్తాయి. కాని లాహావుల్‌కి వెళ్ళాలంటే ఇదొక్కటే మార్గం. లహావుల్ మాత్రం సమున్నతమైన పర్వతాలు, లోయలుతో పచ్చని మైదానాలతో అలరారుతూ వుంది.

కొండలు, లోయలు నడుమ ఒకవంక చంద్ర, మరోవంక భాగ నదులు బారాలాచ కనుమకు అటుయిటూ ఇరుకైన లోయల గుండా ప్రవహిస్తూ తండి అనేచోట ఒక్కటై అక్కడి నుండి 'చంద్రభాగ' అనే పేరు సార్థకం చేసికొంటుంది. జమ్మూలోకి వెళితే దీనినే 'చీనాబ్' అని అంటారు. ఇక్కడ పర్వతాలన్నీ దాదాపు ఒకటే ఎత్తుగా వుంటాయి.

రోహటాంగ్ కనుమకు ఎదురే జెఫాన్ అనే శిఖరం వుంది. లాహవుల్‌కి అధి దేవత ఈ జెఫాన్ శిఖరం-మంచులేని స్పష్టమైన రోజుల్లో సిమ్లా నుండైనా చూడ వచ్చు. పర్వత పాదములకడ ఏర్పడిన సిస్సు గ్రామం, జెఫాన్ దేవతకు ఆలయం వుంది. ఈ దేవత వేంచేయక ముందు-నరమాంస భక్షణాసక్తి గల రాక్షసులుండే వారట. ఒక్క నరులనే కాదు ఏది దొరికితే దాన్ని-జీవం అనబడేదాన్ని పట్టి పీక్కు తినే వారట రాక్షసులు. వీరందరినీ దూరంగా తరిమేసి; జెఫాన్ దేవత ఇక్కడి మానవులకు వ్యవసాయ విజ్ఞానాన్ని బోధించి అనుగ్రహించిదట. లాహవుల్ జిల్లాకి ముఖ్య కేంద్రం కీలాంగ్. బార్లీ, నల్ల గోధుమ పైరులు మధ్య అమరిన చిరు గ్రామం. ఒక రకమైన అడవి చెట్లు మస్తుగా ఉంటాయి. ఈ గ్రామాల అమరిక ఎడారిలో ఒయాసిస్సుల్లాగా అక్కడక్కడ పచ్చ పచ్చగా కనబడుతుంటాయి. స్వతహాగా నల్లటి కొండలు, మంచుచేత కప్పబడి సారంలేని బీడులుగా వున్నాయి.

స్పితిలోయ కూడా స్పితి నదీ పరివాహక ప్రాంతాలు అక్కడక్కడ పలచగా పారే జలాశయాలతో చిన్న చిన్న వ్యవసాయ క్షేత్రాలతో పడియలు పడియలుగా దర్శనమిచ్చే బీడు ప్రాంతమే. దృశ్యమంతా అక్కడక్కడా నీటి గుంటలతో పర్వతమయమై వుండి జన సమ్మర్దం అతి తక్కువగా వుంటుంది. అక్కడక్కడా పచ్చలు పొదిగిన ఆభరణ విశేషంగా తోస్తుంది చూచేవారికి.

## త్రిలోకనాథ ఆలయం :

కీలాంగ్ నుండి చంద్రభాగా నదినిదాటి అవతలకు వెళితే ఎత్తయిన ప్రాంతం ఉంది. కనీసం 8 కి మీ. ఎక్కుడు ఎక్కాలి. బౌద్ధ గురువు పద్మ సంభవుని చేత నిర్మించబడిన అతి పురాతనమైన బౌద్ధుల ఆలయం త్రిలోకనాథ దేవాలయం. పద్మ సంభవుడే టిబెట్టు, చైనాల్లో బౌద్ధమత సంస్థాపన చేసిన వారని ప్రతీతి.

అభిరుచి గలవారు కీలాంగ్ పట్టణంలోని పురాతనమైన ఖార్డింగ్ ఆరామం,

దగ్గరిలోనే ఉన్న షాపూర్, తయాల్, గురుమంటాల్‌లను దర్శించవచ్చు. ఇక్కడే ఉన్న టిబెట్టు గ్రామంలో సీజన్‌గా ఉన్న సమయంలో వారంలో కొన్ని రోజులు టిబెట్టు దేశీయుల హస్తకళా ప్రాముఖ్యాన్ని ప్రదర్శించే చిత్రాలు వీడియోలో ప్రదర్శిస్తుంటారు.

హిమాచల్‌ప్రదేశ్ మరింకా చూడదగినది ఆసక్తి వున్న వారికి మరికొన్ని ప్రదేశాలు : చాంబాలోయలోని మోనిమహేష్-ఇక్కడ విగ్రహాలుండవు-కాని ఆరాధ్యదైవమైన శివుని యొక్క-త్రిశూలాన్ని మాత్రమే పూజిస్తారు-మలాస్ అక్కడ రాతిని ఆరాధిస్తారు-అక్కడ గుడి, దేవతామూర్తులు ఏవీ ఉండవు-బంజరు బయలుగా వున్న ప్రదేశంలో అనేక విలువైన వస్తువులను సైతం మొక్కుబడులుగా వదలివేసే ఆచారం గల ప్రదేశం-ఆరాధనా స్థలం; ఒకానొకనాటి కులూ రాజుల ముఖ్య రాజధానిగా ఉన్న నగ్గర్, కిన్నావూర్ జిల్లాలోని సాంగ్లాలోయ, కిన్నావూర్ జిల్లాకి ముఖ్య కేంద్రమయిన కల్పా మొదలయినవి. కిన్నావూర్ సట్లెజ్ నదీ పరీవాహక ప్రాంతమయి టిబెట్టు సరిహద్దు వరకు సాగివుంటుంది. వాంగ్టుబ్రిడ్జి దాకా ఏ రకమయిన పర్మిషనులూ అక్కర లేదు. ఇకపైకి వెళ్ళాలంటే మాత్రం-మినిస్ట్రీ ఆఫ్ ఫారిన్ అఫెయిర్స్, ఢిల్లీ వారి అనుమతి తప్పనిసరిగా ఉండాలి. హిమాచల్‌ప్రదేశ్‌లో చివరగా కల్పాని గురించి చెప్పబోయే ముందు-వీలుంటే-ఆసక్తి వుంటే-

రాంపూర్, సరహాన్, నాచార, తప్రి, ఛోల్టు టిబెట్టు సరిహద్దు పొడవునా గల ముఖ్య గ్రామాలను సందర్శించి ప్రకృతి అందాలను తనివితీర గ్రోలి కిన్నావూర్ ముఖ్య కేంద్రమయిన కల్పా చేరవచ్చు.

కల్పా :

కిన్నావూర్ జిల్లా ముఖ్య కేంద్రం. సముద్రమట్టానికి 6050 మీ. ఎత్తున వున్న కిన్నవూర్ కైలాస శిఖరానికి అతి దగ్గరలో ఉన్నది. మహాదేవుని నివాసమైన కైలాస శిఖరం-వెండి కొండ మంచు శిఖరం. శీతాకాలంలో శివుడు తన నివాసమైన హిమవత్ పర్వతంలో విశ్రాంతిగా వుండి భంగుప్రియుడై యుంటాడని ప్రతీతి. మాఘమాసంలో దేవతలందరూ మహాదేవునితో సమాగమాభిలాషులై ఇక్కడ సభ దీరుస్తారుట. వసతికి ఇక్కడ ఒక రెస్టుహవుస్ వుంది. 14 కి.మీ. దూరంలో పంగ్గి గ్రామంలో కూడా చిన్న వసతి విశ్రాంతి గృహం ఉంది. ఇక్కడి నుండి కిన్నవూర్ కైలాస శిఖరాన్ని దృశ్యమానంగా చూడగలం. 8 కి.మీ. అవతలనే వున్న రారంగ్ టిబెట్టు ముఖ్య వ్యాపార కేంద్రం

## ఉత్సాహవంతులైన పర్వతారోహకులకి కొన్ని ఆరోహణ మార్గాలు

(1) మణాలి నుండి మలానా 7 రోజుల కార్యక్రమం.

| రోజు | నుండి | వరకు | సముద్రమట్టానికిపైన దూరం | |
|---|---|---|---|---|
| 1వ రోజు | మణాలి | రుమ్సు | 2060 మీ. | 24 కి.మీ. |
| 2వ రోజు | రుమ్సు | చంద్రఖని | 3650 మీ. | 8 " |
| 3వ రోజు | చంద్రఖని | మలానా | 2100 మీ. | 7 " |
| 4వ రోజు | మలానా | కాసోల్ | 1580 మీ. | 8 " |
| 5వ రోజు | కాసోల్ | జరి | 1560 మీ. | 15 " |
| 6వ రోజు | జరి | భుంటర్ | 900 మీ. | 12 " |
| 7వ రోజు | భుంటర్ | మణాలి | బస్సులో రావచ్చు. | |

### 2. దేవ్ తిబ్బ :

చాలా సులువైన మార్గం. మణాలికి తూర్పున ఉంది. 6000 మీ ఎత్తున వుంది దేవ్‌తిబ్బ. దోవంతా మనోహరమైన దృశ్యాలు పర్వతారణ్యాల గుండా బహు ఆహ్లాదకరంగా వుంటుంది నడుస్తుంటే. మణాలినుండి జగత్సుఖ్ ద్వారా బయలుదేర మొదలు పెట్టండి. దేవ్‌తిబ్బ దిగువనే ఉంది సేరి. అక్కడినుండి చంద్రతాల్‌కి విహారయాత్ర చేయవచ్చు.

### దేవ్ తిబ్బ ఆరోహణక్రమం — 5 రోజుల కార్యక్రమం :

| రోజు | నుండి | వరకు | దూరం |
|---|---|---|---|
| 1 రోజు | మణాలి | ఖానోల్ | 8 కి.మీ. |
| 2 రోజు | ఖానోల్ | ఛిక్కా | 6 " |
| 3 రోజు | ఛిక్కా | సేరి | 5 " |
| 4 రోజు | సేరి | భనారా | 14 " |
| 5 రోజు | భనారా | మణాలి. | |

### సేరాజ్ లోయ నుండి నార్కండా :

కులూలోయ దక్షిణకొసన ఆగ్నేయ దిశగా సేరాజ్ లోయవుంది. కులూ సిమ్లా రెండోదోవ చాల ఆసక్తికరంగా ఉంటుంది. కులూ-మణాలి రోడ్డుమీద మార్గ

మధ్యంలో వుంది, ఆపుట్. ఇక్కడ మొదలు పెట్టాలి. సియాంజి, తీర్థన్ నదుల సంగమస్థానం మొదటి మజిలీ. ఇక్కడ P. W. D. రెస్టుహౌస్ వుంది. చక్కగా వుంటుంది. తీర్థన్‌లోయ దిగువభాగాన బంజార్– అక్కడ కొన్ని దేవాలయాలు న్నాయి. ఆరోహణక్రమం, ఆరు రోజులు కార్యక్రమం. మధ్యలో జలోరి కనుమలో పర్వత శిఖరం ఒక అద్భుతం. ఖనాగ్, ఆనిలవద్ద P. W. D. రెస్టు హౌసులు కూడా ఉన్నాయి. ఆనినుండి సిమ్లా నార్కండాలకు బస్సులున్నాయి. అయితే తూర్పుకు గనుక తిరిగితే నిర్మాండ్‌లోని అంబికా ఆలయాన్ని చూడగలం. ఆనినుండి బ్రహీకి కూడా బస్సులున్నాయి. బ్రహీ సట్లెజ్ నదికి ఉత్తరాన ఉంది.

ఆరు రోజుల కార్యక్రమం :

| రోజు– | నుండి– | వరకు– | దూరం |
|---|---|---|---|
| 1 రోజు– | ఆపుట్– | లర్జి– | 5 కి.మీ. |
| 2 రోజు– | లర్జి– | బంజార్– | 20 " |
| 3 రోజు– | బంజార్– | షోజా– | 13 " |
| 4 రోజు– | షోజా– | ఖానాగ్– | 10 " |
| 5 రోజు– | ఖానాగ్– | ఆని– | 20 " |
| 6 రోజు– | ఆని– | బ్రహీ– | 15 " |

బంజారు దగ్గరినుండి తీర్థాన్ నదివెంట నార్కండా వెళ్ళేత్రోవలో గోషాయిని మొదటి రోజు ఆరోహణం. కొంత దూరం బస్సులో వెళ్ళవచ్చు. బితాడ్ దగ్గర P W D రెస్టుహౌస్ కష్టపడి చేరటానికి 3250 మీటర్ల ఎత్తున బాష్లీవా కనుమద్వారా చేరాలి. 13 కి.మీ. వుంటుంది. అక్కడి నుండి నిట్టనిలువుగా కిందికి దిగితే సరహాన్ చేరవచ్చు. మూడు కి.మీ. దూరం మాత్రమే వుంటుంది. ఇక్కడో అందమైన రెస్టు హౌస్ వుంది. అక్కడి నుంచి అర్సు దగ్గర మరో రెస్టుహౌస్ వుంది. వెంటనే మెయిన్ రోడ్డుమీద వున్న రామ్‌పూర్ చేరవచ్చు. ఇది రెండోమార్గం. ఇందుకు కార్యక్రమం.

| | | | |
|---|---|---|---|
| 3 రోజు– | బంజార్– | గోషాయిని– | 18 కి.మీ. |
| 4 రోజు– | గోషాయిని– | బితాడ్– | 16 " |
| 5 రోజు– | బితాడ్– | సరహాన్– | 16 " |
| 6 రోజు– | సరహాన్– | అర్సు– | 13 " |
| 7 రోజు– | అర్సు– | రామ్‌పూర్– | 13 " |

ఇలాగే మణాలి నుండి సోలాంగ్ లోయలకు అనేక అవరోహణ మార్గాలున్నాయి. 7 రోజుల కార్యక్రమంతో బియాస్‌నది జన్మ స్థలమైన బియాస్ కుండు దగ్గరకు వెళ్ళవచ్చు. అది చూచి అక్కడవున్న మంచులో స్కీయింగ్ చేయటానికి వీలుండే ప్రాంతాలను చూడవచ్చు. అలాగే మరోమార్గం కూడా బియాస్ కుండు దగ్గర మలుపు తిరిగితే తెంటు కనుమ అసలు నర సంచారం లేని ప్రదేశం గుండా ఫులన్‌గోట్, మాణాలి కనుమదాటి రాణిసూయి భోగి, కలాత్‌చేరి అక్కడి నుండి మణాలికి వెనక్కి తిరగవచ్చు. ఇవన్నీ ఎముకలు కొరికే చలిలో శ్రమను లెక్క చేయకుండా ఆర్థిక స్తోమత, శారీరక బలం, శ్రమ, సహిష్ణుత, ఉత్సాహం గల ఆరోహకులు అన్ని సరం జమాలతో వెళ్ళగలిగిన వారికి మాత్రమే. హిమాలయాల్లోని ప్రతి అణువూ ఏదో ఒక రహస్యాన్ని, దేవతా ప్రాముఖ్యాన్ని, పురాణ ప్రాశస్త్యాన్ని — దైవసృష్టిలోని భూఖండపు రహస్యాల నెన్నో మనకు అవగతం చేసే థ్రిల్లింగ్ ప్లేస్. దీన్ని చూడటానికి ఎంతయినా శ్రమను లెక్క చేయకుండా చూచి ఉద్వేగాన్ని పొందాలనే ఉత్సాహవంతులయిన విదేశీయులు ఎంతోమంది పర్యాటక కార్యక్రమాలతో ముందుంచుకుని దర్శించటానికి వస్తుంటారు. అటువంటిది మన దేశంలో వున్నటువంటి ప్రాంతాలు, వాటి స్వరూప స్వభావాలు చూచి తెలుసుకోటం కంటే అదృష్టమేమున్నది ! ఆర్థికబలం, శారీరకబలం, చూడాలనే ఉత్సాహం వుండే వారికి ? ! జన్మ సాఫల్యమే కదా !



❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁

# జమ్ము & కాశ్మీర్

❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁❁

'లేదు-లేదు-లేదు' ముమ్మాటికీ సందేహం లేదు। భువిలోనే అలరిన అరుదైనదీ అందాల ధామం హిమాలయం. చుట్టూ మంచుచేత కప్పబడిన పర్వతాలు పెట్టని గోడలుగా అమరి- అటు ఉత్తరం వైపునుండి వీచే భయంకర చలిగాడ్పుల నుండీ, ఇటు దక్షిణాన ఉండే భూమధ్య రేఖకు దగ్గరిలో ఉన్న చండ ప్రచండమైన ఉష్ణ తాపం నుండీ రక్షించబడి వెండికొండలమధ్య భద్రంగా పదిలపరచబడిన సౌందర్యారాధకుల మనోభిరామం- ప్రకృతి అందాలన్నీ మూటగట్టి రాసపోసిన సుందర దివ్య ఆరామం కాశ్మీరం అంటే అతిశయోక్తి ఏమాత్రం కాదు. ఇక్కడ గలగల పారే సెలయేళ్ళు, నయనానంద కరమైన సరస్సులు, మధుర ఫలవృక్ష సంజాతము, వివిధ పరిమళాల విరిజల్లును గుబాళించే పుష్పజాతి సంభరితమై— ఎప్పుడో స్నిగ్ధంగా వెండి వస్త్రాలతో కప్పబడినట్లుగా- సుందర స్వప్న సదృశమైన మంచు పొగలతో వెండి వెన్నెలల ప్రోవుగా సృష్టికర్త రచనానైపుణ్యాన్ని పదేపదే గుర్తుచేస్తూ అందాలొలికించే పరమేశ్వరుని కైలాసం, పార్వతీదేవి ఆనంద గేహంగా కొనియాడబడుతూ కశ్యప సంతతియైన ముక్కోటి దేవతల దివ్యధామంగా అలరారే సుందర నందనోద్యానం, ప్రకృతి పరచిన సౌందర్యాలరాశి- అంగుళం అంగుళం- మలుపు మలుపునా చిత్రకారుని కుంచె వింతసోయగాలు, మనోభావాల రాగరంజితమై యొప్పెచిత్ర రచనాకృతి, మనిషి భాషకు, భావానికి అందని లోతుల్లో గుండె గిలిగింతలుపెట్టే మధురానుభూతి కలిపించే వింతలతో పహారాకాస్తూ స్వాగతమిచ్చే సైనికుల్లాబారులు తీరిన వృక్షసంతతితో-భరతమాత శిరోభాగాన వెలిగే పచ్చల కిరీటమై భాసించే కాశ్మీ

రపు సోయగాలను వర్ణించడం- ఆదిశేషునికైనా అలవిగాదు- అనుభవైక వేద్యంతప్ప స్వతంత్ర భారతానికి తలమానికమై విదేశీయులకు, స్వదేశీయులకు సర్వులకూ యాత్రికానంద స్వర్గమై 'ఓరియంటల్ సూపర్ స్విట్జర్లాండ్'గా పేర్కొనబడిన కాశ్మీరం ప్రఖ్యాత వేసవి పర్వత విశ్రాంతి కేంద్రంగా గణుతికెక్కింది. వేసవిలో సూర్యతాపం భరించలేని వారందరూ- శ్రీమంతులుగా ఉన్నవారు- ప్రశాంతతనూ, విశ్రాంతినీ వెదుక్కుంటూ నిర్మలమైన ఈ పర్వతాల సోయగాలను ప్రకృతి సౌంద ర్యాన్ని తనివిదీర ఆస్వాదించి సేదదీరటానికి అంగలారుస్తుంటారు.

భౌతికంగా :

నైఋతి భాగాన ఆఫ్ఘనిస్తాన్, మరింత ఉత్తరంగా రష్యా, ఈశాన్యం వైపు చైనా దేశపు సింకియాంగ్ రాష్ట్రం. తూర్పున టిబెట్టు, మిగతా భారత దేశాన్నీ, కాశ్మీర్‌లోయను వేరుపరుస్తుండే పీర్ పంజాల్ పర్వత శ్రేణులమధ్య పదిలంగా ఉన్న అందాలలోయ కాశ్మీరం.

సంగ్రహ చరిత్ర :

కాశ్మీర రాజుల వైభవాన్ని కథా గుచ్ఛంగా రచించిన కల్హణుడు తన 'రాజ తరంగిణి'లో కాశ్మీర మూలమును వివరించే కథ ఇతిహాస పురాణమైనా కాశ్మీర్ అనా దిత్వాన్ని ప్రస్ఫుటంగా ఉట్టంకించాడు.

కథ ప్రకారం కాశ్మీరు అనాది కాలంలో ఒక పెద్ద జలార్ణవంగా ఉండేదనీ, అందులో జలోద్భవుడనే దానవుడు నివసించేవాడనిన్నీ అప్పుడప్పుడు బయటకి వచ్చి చుట్టుప్రక్కల సంచరిస్తూ ఉండేవాడనిన్నీ అందిన జీవరాశిని భక్షిస్తూండేవాడనిన్నీ వానికి జలాశయంలో ఉన్నంతవరకూ చావులేకుండా వరం పొందినవాడనిన్నీ చెప్తూ అనాది దేవదానవులకు పితరుడైన కశ్యపమహాముని ఈ రక్కసుని వృత్తాంతమెరింగి భూమిమీద వాని పొలకువ లేకుండా చేయటానికి దేవతల సాయంతో పొందిన ఒక పెద్దనాగలితో ఆ సరోవరప్రాంతాన్ని దున్నివేసి నీటిని ఇంకింపజేశాడట. దానితో ఆ రక్కసుని శక్తి ఉడిగిపోయి జయించ బడ్డాడట.

ఆ విధంగా ఈ అద్భుత భూఖండం జనావాసంగా ఏర్పడింది. తదను గుణంగా కశ్యప-మార్. కశ్యప-మీర్ నుండి కాశ్మీర్ అవతరించిందని పురాణగాథ. హిందూ రాజులనేకమంది కాశ్మీర్‌ని పరిపాలించారు అనాదిగా. పురాణేతిహాసాల్లో

కాశ్మీర్ ప్రశస్తి-ప్రసక్తి వుంది. క్రీ. పూ. 3వ శతాబ్దంలో అశోకుని సామ్రాజ్యంలో భాగంగా ఉండింది. అప్పుడు బౌద్ధమతం మంచి ఉచ్ఛస్థితిలో ఉంది. ఈ ప్రాంత మంతా ఆనాటి, హిందువుల, బౌద్ధుల జ్ఞాపికలుగా ఆలయాలతో నిండి ఉంది. ఆ తరువాత క్రీ. శ. 7, 8 శతాబ్దాల్లో పాలించిన లలితాదిత్యముక్తా పీడుడు ప్రఖ్యాతిగాంచిన మహారాజు. తరువాత శతాబ్దంలో పాలించిన అవంతివర్మ ప్రసిద్ధుడయి అవంతీ పురాన్ని నిర్మించాడు. ఆఖరి హిందూ రాజయిన ఉదయనుడు అతని మంత్రియైన అహమ్మద్‌షా చేత చంపబడ్డాడు.

1586 లో అక్బరు మహాచక్రవర్తి ఈ భూభాగాన్ని జయించి తన మొగలు సామ్రాజ్యంలో భాగంగా కలుపుకొన్నాడు. 1757లో ఆఫ్ఘనిస్థాన్ దండయాత్రికుడైన అహమ్మద్‌షా అబ్దాలి జయించాడు. తరువాత 1819లో పంజాబు మహారాజు రాజా రంజిత్‌సింగ్ ఆధిపత్యంలోకి వచ్చింది. మహారాజా రంజిత్‌సింగ్ మరణం తర్వాత బ్రిటిషువారు శిక్కులతో యుద్ధంచేసి వశపరచుకొన్నారు. కాని జమ్మూ రాజైన గులాబ్‌సింగ్‌కి 75 లక్షల రూపాయల మూల్యానికి అమ్మివేశారు. దీనితో జమ్మూ, కాశ్మీర్ ఒకే రాష్ట్రమయింది. దేశవిభజన సమయంలో కాశ్మీర్ అటూ యిటూ కాకుండా నిలిచింది. ఈలోగా 'కాశ్మీర్ మాది' అంటూ పాకిస్తాన్ ససైన్యంగా దండెత్తింది. దీని ఫలితంగా కాశ్మీర్ మహారాజు 26, అక్టోబరు 1947న ఇండియన్ యూనియన్‌లో కలిసిపోతున్నట్లుగా పత్రాల్లో సంతకం చేశారు. ఈ విశేషాన్ని 1949 U. N. O.లో పెట్టారు. 1965లో మరోసారి పాకిస్తాన్ స్వతంత్ర భారతంమీద కాలు దువ్వి 1966లో తాష్కెంటు ఒప్పందం కుదుర్చుకుంది. అప్పటికీ యిప్పటికీ వదలలేదు. మరలా పాకిస్తాన్ తూర్పు, పడమర పాకిస్తానులుగా విడివడి తూర్పు పాకిస్తాన్ బంగ్లాదేశ్ అయిన సందర్భంలో మరలా భారతదేశంతో 1971లో యుద్ధం చేసింది.

అప్పుడే 1972లో సిమ్లా ఒప్పందం జరిగింది. ఏతత్కారణంగా కొత్త సీజ్ ఫైర్‌లైన్ రెండింటి మధ్య గుర్తించబడింది. కాశ్మీర్ భారత-పాకిస్తాన్‌ల మధ్యనేగాక ఇండియా చైనాల మధ్య కూడా సున్నితమైన సరిహద్దుగా గుర్తింపు పొందినది. 1962లో సింకియాంగ్ నించి లోపలికి చొచ్చుకువచ్చి మరొక దండయాత్ర చేసి సరిహద్దు గుర్తింపు సమస్యాత్మకంగా పరిణమించినట్లుగా అగ్నిలో ఆజ్యం పోశారు. ఇవి ఎప్పటికి తేలుతాయో ఏమో!

ప్రస్తుతానికి స్వతంత్ర భారతదేశంలో భాగంగా కాశ్మీర్ రాష్ట్రం ఎగువ

దిగువ రెండు అంచెల శాసనసభలతో పాలనాపరంగా 14 రాష్ట్రాలుగా విభజింప బడిన జమ్మూ–కాశ్మీర్ రాష్ట్రం.

వైశాల్యం : 2, 22, 236 చ. కి మీ.
రాష్ట్ర వేసవి రాజధాని : శ్రీనగర్, శీతాకాలపు రాజధాని : జమ్మూ నగరం
జనాభా : సుమారు 6 లక్షలు
మాట్లాడే భాషలు : ఉర్దు, కాశ్మీరి, డోంగ్రి, లదఖి మొ.
అక్షరాస్యత : 27 శాతం
జనసమ్మర్దత : 59 మంది చ. కి. మీ. కి
స్థానం : జనాభాను బట్టి–17 స్థానాన్ని ఆక్రమిస్తుంది.
స్త్రీ, పురుష నిష్పత్తి : 892:1000

జిల్లాలు :

అనంతనాగ్, బద్గామ్, బారాముల్లా, దోడ, జమ్మూ, కార్గిల్, కథువా, కుప్వారా, లదఖ్, పుల్వామా, పూంచ్, రాజపురి, శ్రీనగర్, ఉధామపూర్.

ముఖ్య జీవనభృతి వ్యవసాయం. ముఖ్యంగా వరి, గోధుమ, మొక్కజొన్న పంటలు, ఇవి గాకుండా కొన్నిచోట్ల బార్లీ, బజ్రా, జొన్నలు కూడా పండుతాయి. లదఖ్‌లో మాత్రం పప్పుధాన్యాల పంట పండిస్తారు. ఆహారధాన్యాల పంటలు అధికంగా పండించటానికి తగిన పథకాలు కేంద్రప్రభుత్వం ఎన్నో అమలు పరుస్తోంది. ఉన్నత లక్ష్యాల గమ్యంవైపు పురోగామియై నడుస్తుం దీ రాష్ట్రం. చిన్నతరహా పరిశ్రమలు ఇతోధికంగా పెంపుచేయటానికి ఎంతో దోహదం కల్పిస్తూ రాష్ట్రాన్ని సమగ్ర అభివృద్ధి పథంగా నడిపిస్తున్నాయి. కాశ్మీరు శాలువలు, తివాచీలు, కొయ్య నగిషీలు కాశ్మీరు హస్తకళా నైపుణ్యానికి హైలైట్స్. వీటి మూలంగా దేశానికి విదేశీ మారకం గూడా లభిస్తుంది.

ఇక్కడి ప్రకృతి అందాలతోపాటు యాత్రిక ఆకర్షణలు ముఖ్యమైనవి, శ్రీనగర్, పహల్‌గాం, గుల్మార్గ్, సోనామార్గ్ మొదలగు పట్టణాలు. హిందూ భక్తజన ఆముష్మిక కేంద్రాలుగా అమర్‌నాథ్, వైష్ణవి దేవిమాత ఆలయాలు పేర్కొనదగినవి. ఉత్సాహవంతులైనవారికి శీతాకాల క్రీడలు కూడా బహుజనాకర్షణీయం. పర్యటనను పరిశ్రమగా అభివృద్ధి చేసే కృషిలో ప్రథమ తాంబూలం కాశ్మీకు తోయకే ఈ బడింది.

# శ్రీనగర్

పేరులోనే ఉంది సిరికి శింగారమని, అందాల ప్రోవు అని. సార్థక నామధేయంగల నగరం. జనాభా సుమారు 4, 50, 000. జీలం నదీ తీరాన 9 వంతెనలతో కలపబడిన సుందర డాల్ సరస్తీరం. డాల్ సరస్సు 8 కి.మీ. పొడవు, 4 కి.మీ. వెడల్పుగల అందాల జలరాశి.

శ్రీనగర్ అసలు పట్టణం వ్యవస్థాపకులు ఇప్పటికి 2, 260 సంవత్సరాల క్రితం అశోక చక్రవర్తి అంకురార్పణ చేశాడంటారు చారిత్రకులు. ఇప్పుడు మనకు సాక్షాత్కరించే సుందరరూపం మహారాజు ప్రవరసేనుని ప్రసాదం. అసలు డాల్ సరస్సు ముచ్చటగా మూడు సరోవరాల కలయిక. ఏ సరోవరం ఎక్కడ మొదలవుతుందో, ఎక్కడ అంతం అవుతుందో కూడా తెలియనంతగా కలిసిపోయాయి. సరస్సు మధ్యలో గల దీవియందు నెహ్రూ పార్కు, సమీపంలోనే కబూతర్‌ఖాన్ ఉన్నాయి. సరస్సు నిండా తామరపూలు విరబూసి వుంటాయి. నీరు స్వచ్ఛమైన నీలం రంగులో ఉండి అక్కడక్కడా నాచు దిబ్బలుతో సూర్యరశ్మి పడినప్పుడు నెమలికన్ను పచ్చగా మనోహరంగా గోచరిస్తుంది. డాల్ సరస్సులో నౌకా విహారం మరువలేని మధురానుభూతి. ఈ సరస్సులో బోటు హౌసులు ప్రత్యేకం. ఇండ్లలో మాదిరిగా సర్వ ఆధునిక సౌకర్యాలతో ఉంటాయి. ఇవి అద్దెకు ఇవ్వబడతాయి. నీటి మీద తేలియాడే నగరాల మాదిరిగా ఉంటాయి. ఇటువంటి హౌస్ బోటులు డాల్ సరస్సునందేగాక, జీలమ్ నదిలోను, నగేన్ సరస్సులో కూడా ఉంటాయి. సాధారణంగా ప్రతి హౌసుబోటులోను రెండు విందు రూములు, రెండు పడకగదులు, ఎటాచ్ బాత్‌రూములు స్నానసౌకర్యానికి తోడు వసారాల్లాగా డెక్‌ల మీద నులివెచ్చని స్పర్శ గల సూర్యరశ్మి సోకుతూండగా సన్‌బాత్ సౌకర్యాలు కూడా ఉంటాయి. లోపల వేడి, చన్నీటి పంపులు, విద్యుత్తు, గృహోపకరణపు సామాన్లు, రేడియోలు ఉంటాయి ప్రతి బోటుహౌసుకి ఒక చిన్న డింగ్ పడవ ఉంటుంది. సరస్సులో ఒకచోట నుండి మరో చోటుకి ఒడ్డుకు చేరటానికి ఈ డింగ్ పడవలు ఉపయోగించవచ్చు. నదిలో నౌకావిహారం ఉద్వేగ భరితం. నదీ తీరంలో ఒడ్డున బ్రహ్మాండమైన షో రూమును, హస్తకళా నైపుణ్యం వెలార్చే వస్తుసామాగ్రి విక్రయ కేంద్రాలు ఎన్నో ఉంటాయి.

నగరం సముద్ర మట్టానికి 5, 200 అ. ఎత్తున వుంది శీతాకాలంలో విపరీత

మైన చలి. వున్ని కోట్లు, రగ్గులు లేకపోతే బతకటం కష్టం. వేసవిలో 32. 2° సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రతతో హాయిగా ఉంటుంది. వేసవి ఆదివారాల్లో, సెలవు దినాల్లో శ్రీనగరు చాల రద్దీగా ఉంటుంది.

శ్రీ నగరులో విశేషాలు చూడాలంటే కనీసం మూడు రోజులు పడుతుంది. మొదటగా డాల్ సరస్సు (అందులో నౌకావిహారం) చష్మాషాహి, నిషాత్‌బాగ్, షాలిమార్‌బాగ్, నసీమాబాగ్ మొదలైన సుందరోద్యానవనాలు, హరిపర్బత్‌కోట, హజరత్ బల్, జామి మసీదులు, ఆదిశంకరులైన శంకర భగవత్పాదుల ఆలయం, రఘునాథాలయం, దుర్గామందిరం, శిక్కుల గురుద్వారా మొదలయినవి ఆసక్తికరంగా చూడదగినవి.

ఢిల్లీ నుంచి ప్రతిదినమూ శ్రీనగరుకి విమానం వుంది. ఢిల్లీ నుండి బస్సులలో రోడ్డు మార్గంలో వెళ్ళవచ్చు- వయా అంబాలా, జలంధర్, పఠానుకోట, జమ్ము. మొత్తం 880 కి.మీ. దూరం లేదా జమ్మూ వరకు రైలుమీద ప్రయాణించి మిగిలిన శ్రీనగరు విశేషాలు చూద్దాం. ఒక్క నిముషం!

## గృహ నావలు :

వుండటాని వసతికి వీలైనవి లైటింగు, ఆధునిక సౌకర్యాలు అన్నీ వుంటాయి. శ్రీనగరు ఎప్పుడూ జనసందోహంతో రద్దీగా వుండే ఆసియా నగరంగా పేర్కొనబడింది. పట్టణపు రణగొణ ధ్వనినుంచి దూరంగా తప్పుకుని ప్రశాంతంగా వుండాలంటే ఈ గృహనావలు ఎంతో ఉత్తమం. నావల్లోనే సూపర్ మార్కెట్లు విచిత్రం. మామూలుగా సరోవరతీరం నుండి వస్తుంటేచాలు- కంట బడతాయి- ఈ గృహనావలులో స్థాయినిబట్టి తరగతులుగా విభజించబడ్డాయి. (1) డీలక్స్ 5 స్టార్, (2) A క్లాసు, (3) B క్లాసు, (4) C క్లాసు, (5) D క్లాసు లేదా దోంగాబోట్లు.

డీలక్స్ 5 స్టారు- భోజనంతోపాటు, భోజనం లేకుండాను లభ్యమవుతాయి. చార్జీలు- భోజనంతోపాటు అయితే 285 నుండి 390 వరకూ. భోజనం లేకుండా 200 నుండి 270 వరకు సౌకర్యాలనుబట్టి వుంటాయి. అక్కడినుండి తరగతుల వారీగా తక్కువ రేట్లుంటాయి. అన్నిటికంటే చౌక Dక్లాసు దోంగాబోటు- రు. 55/- ఈ నావలు సరస్సంతా పరుచుకుని వుంటాయి. రకరకాల ఆకర్షణలతో సౌకర్యాలతో మనల్ని అలరిస్తాయి.

సాధారణంగా 24 నుండి 38 మీటర్ల పొడవు, 3 నుండి 6 మీటర్ల వెడల్పు గలిగి ప్రతి గృహనావకి ముందు ఒక వరండా- లివింగు రూము- డైనింగు రూము,

దానివెనుక 2 లేక 3 బెడ్‌రూములు, అటాచ్‌డ్ బాత్ రూములు కలిగి వుంటాయి. వరండాలో కూర్చుని పరిసరాలన్నిటినీ గమనించవచ్చు. చలిలో సూర్యరశ్మి నులి వెచ్చని స్పర్శను అనుభవించవచ్చు. నీటిమీద తేలియాడే నగరంలాగా నౌకా గృహముల వెనుక ఉద్యానవనాల్లో పుష్పముల దీవిలాగా మనోజ్ఞంగా వుంటాయి. బేరమాడటం మర్చిపోకండి.

మీరువుండే ఒకచోటు నుండి మరోచోటు దగ్గరికిగాని, లేదా సూపర్‌మార్కెట్టు నావల దగ్గరికో లేక ఒడ్డుకో వెళ్ళాలంటే 'షికారా' అనే చిన్నబోట్లుంటాయి. అధికారికంగా నిర్ణయింపబడిన రేట్లుంటాయి. మంచి స్ప్రింగు సీట్లున్న చోటుకి ఒకేసారికి 2 రూపాయలు ఛార్జీ వుండవచ్చు. వీటిని నడిపే కుర్రవాళ్ళు కొంచం ఎక్కువ అడుగుతుంటారు— తప్పదుమరి. సరస్సులో విహారంగా వెళ్ళినపుడు కొంచెం వర్షం కురిసిందనుకోండి— ఇకవారిదే పైచేయి. నాలుగు డబ్బులు దండుకోటానికి వెనకాడరు. సాధారణంగా షికారులు హౌస్‌బోటుకి అనుసంధించే వుంటాయి. మీయంతట మీరు నడుపు కోగలిగితే. అయితే అదిఅంత తేలికైనది గాదని గ్రహించటానికి ఎంతోసేపు పట్టదు. అక్కడ ప్రత్యేకంగా కుర్రవాళ్ళుంటారు. అలా గనుక లేకపోతే వచ్చేపోయే పొరుగు బోట్లవారిని అడిగితే ఏర్పాటు కుదురుతుంది.

శ్రీనగరు సరస్సుల్లో నౌకావిహారం ఒక మనోహరమైన మరపురాని అనుభూతి అయితే— ఈ తేలియాడే నౌకాగృహ నివాసం మరో పసందైన విందు. అనుభవించి తీరవలసిన మధురానందం. నూతన వధూవరులకు, ప్రేమ జంటలకు అందమైన అనుభవం. ఇక్కడి హనిమూన్ యాత్రానుభవం. జీలంనదీ తీరం, డాల్, నాగిన్ సరోవర తీరాల్లోనూ వుంటాయి.

**చష్మాషాహి ఉద్యానవనాలు :**

నగరానికి 9 కి.మీ. దూరంలో అమరిన జలపాతంవద్ద మూడు అంతస్థులుగా నిర్మించబడిన వన సముదాయం. ఈ నీటిలో అపూర్వ ఖనిజ లవణం సమ్మిళితమై ఉన్నందువలన నీరుత్రాగితే జఠరాగ్ని పెరుగుతుందట. మొదట షాజహాను చక్రవర్తి అంకురార్పణ చేయగా 17వ శతాబ్దంలో జహంగీరు చక్రవర్తి అభివృద్ధి చేశారట. ఇక్కడి నుండి ఒక బ్రహ్మాండమైన దృశ్యం ప్రకృతి అందానికి సృష్టికర్త అనే చిత్రకారుని కుంచె రచించి సుందర సంధ్యాదృశ్యం సూర్యాస్తమయ బింబం మంచు కొండలపై నుండి సూర్యబింబము, డాల్‌సరస్సు స్వచ్ఛజలాల్లో ప్రతిబింబించడం చూడవచ్చు. ఇది ఒక మనోహర మధురానుభూతి. కుటీరాలు, కెఫ్టిరియా ఉన్నవి.

నిషాద్ బాగ్ :

'ఆశీః వనము' అంటారు. డాల్ సరోవరతీరంలో నగరానికి 11 కి.మీ. దూరంలో జబర్వాన్ పర్వత పార్శ్వమున నిర్మించబడింది. ఉద్యానవనం మనోహరంగా రత్నాల తివాచీ పరచినట్లుగా పచ్చిక బయళ్ళతో ఆహ్లాదకరంగా ఉంటుంది. వెనుకవైపు మంచుచేత కప్పబడిన కొండలున్నాయి. 12 అంచెలుగా నిర్మించబడిన చిరుకాలువల ఈ ఉద్యానవనం చీనార్ వృక్షాలు, అనేక మధుర ఫలవృక్ష సంతతి తోను, పుష్ప వృక్షములతోను విశాలమైన ఈ 'నిషాల్ బాగ్'ను నిర్మించినవారు షాజహాను చక్రవర్తి మామగారైన అసఫ్‌ఖానువారు. 12 అంచెలు ద్వాదశ రాసులకు చిహ్నమని ప్రతీతి. పైనించి చూస్తే డాల్ సరస్సుని దృశ్యమానంగా వీక్షించవచ్చు.

షాలిమార్ బాగ్ :

నగరం నుండి 15 కి మీ. దూరం డాల్ సరస్సుకు ఈశాన్యంగా అందమైన షాలిమార్ బాగ్‌ని నిర్మించినవారు జహాంగీరు చక్రవర్తి. వనం మధ్యంలో అందాల చలువరాతి మంటపం చూడముచ్చటగా ఉంటుంది. ఉద్యానవనం నాలుగు అంతస్థులుగా నిర్మించబడింది. నాలుగో అంతస్థు రాణివాసపు స్త్రీలకోసం ప్రత్యేకించబడింది. మే నుండి అక్టోబరు వరకు 'సౌండ్&లైట్' చిత్రప్రదర్శన ఉంటుంది. ఈ గార్డెన్‌తో నుండి పోయే ఒక కాలువ డాల్ సరస్సులో కలుస్తుంది. చలువరాతి మంటపంతో అమర్చిన ఫౌంటెన్‌లు విశేషం. దాదాపు 150 ఫౌంటెన్ లున్నాయట.

నసీమా బాగ్ :

చల్లని పిల్లవాయువుల మలయ సమీరం సమాదరించే చోటుగా ప్రసిద్ధి. చీనార్ వృక్షచ్ఛాయలు, ప్రసరించే గాలి ఎంతో ఆహ్లాదకరంగా ఉండే వీనిని అక్బర్ మహా చక్రవర్తి నిర్మించాడట.

హార్వాన్ :

షాలిమార్ బాగ్‌కి 3½ కి.మీ. దూరంలోగల చిన్నగ్రామం. అశోకుని కాలంలో ఇది ప్రసిద్ధ బౌద్ధవిహారం. కొండల వనవిహారంగా బౌద్ధ ప్రముఖుల సమావేశ కేంద్రంగా ప్రతీతి. ఇక్కడ ఈ గ్రామంలో ఇటుకలతో బహు సుందరంగా కట్టబడిన పేవ్‌మెంట్లు విశేషం. ఇక్కడ వున్న జలాశయంలోని నీరే శ్రీనగర్ పట్టణానికి మంచి నీరందించేది. చక్కని చేపల పెంపకం కేంద్రం కూడా ఉంది.

హారి పర్వతం :

ఇది పురాణకాలంలో పార్వతీ అమ్మవారు విసిరినరాయి పర్వతమై వెలసిందట. కొన్ని పురాతన దేవాలయా లున్నాయి. కొండమీద అట్టా మహమ్మద్‌ఖాన్ అనే ఆఫ్ఘన్ చక్రవర్తి నిర్మించినకోట. 18వ శతాబ్దానికి చెందింది దర్శనీయం. కొండ చుట్టూతా ప్రహరిగోడ ఒకటి ఉంది. దీన్ని 16 శతాబ్దంలో అక్బరు మహా చక్రవర్తి నిర్మించాడట.

ఈ కోటను చూడటానికి డైరెక్టరు అఫ్ టూరిజమ్, జమ్మూ&కాశ్మీర్, శ్రీనగర్ వారి నుంచి అనుమతి పొందవచ్చు.

హజరత్ బల్ మసీదు :

నిషాత్‌బాగ్‌కి ఎదురుగా డాల్ సరస్సుతీరంలో ఉన్నది. ఇక్కడ మహమ్మదు ప్రవక్తకు చెందిన 'కేశవిశేషం' భద్రపరచబడి వుంది. ముస్లిముల పవిత్ర దినాల్లో ఒకచోట ప్రత్యేకంగా సంవత్సరానికి ఒకసారి ప్రజలకు చూపిస్తారట.

జామిమసీదు :

1400 సం॥ ప్రాంతంలో నిర్మించబడిన మసీదు. రాష్ట్రమంతటిలోను పెద్ద మసీదుగా పేరు. అయితే మూడుసార్లు అగ్ని ప్రమాదాలకు గురయి మరల మరల నిర్మించబడింది.

శంకరాచార్యుల ఆలయం :

ఒకానొకప్పుడు క్రీ. పూర్వం 200 సం. క్రితం అశోకుని కుమారుడైన జాలూకుడు ఒక ఆలయాన్ని నిర్మించాడట. అది పురాతన శిథిలం. దానిమీద ప్రస్తుతం ఉన్న ఆలయం ఒక హిందూభక్త శిఖామణి తనపేరు చెప్పటానికి ఇష్టపడని మహానుభావుడు నిర్మించాడు. ఇది సుమారు ఒక వేయి అడుగుల ఎత్తున ఉన్న గుట్ట మీద అమరి ఉంది. ఇక్కడ ఆదిశంకరులు తపస్సు చేశారని ప్రతీతి. చక్కని శిల్పము ప్రదర్శితం. మరోవిధంగా ఈ గుట్ట 'సొలమన్ సింహాసనం' అని గూడ ప్రసిద్ధి. ఇక్కడి నుండి శ్రీనగరు పట్టణం నేత్రపర్వంగా చూడగలం. ప్రక్కనేగల మంచు కిరీటాలతో శోభిల్లే పంజాల్ పర్వతశ్రేణిని గమనించగలం.

శ్రీనగరు చుట్టుప్రక్కలు:

అచ్ఛాబాల్ :

శ్రీనగరుకు 6 కి.మీ. దూరంలో మొగలిశైలి గార్డెన్, పెద్ద పెద్ద నీటిఊటలుతో మనోరంజకంగా ఉంటుంది. ఇదిఒకనాడు సామ్రాజ్ఞి నూర్జహాన్ విశ్రాంతి కేంద్రంగా ఉండేదట. అయితే అంతకుముందే అషాబల్ అనేమొగల్‌రాజు పురాతనంగా ఉద్యాన వనం నిర్మించాడని చెప్పుకుంటారు. ఇక్కడ ఒక టూరిస్టు బంగళా కూడా వుంది.

అనంతనాగ్ :

శ్రీనగరునుండి 56 కి.మీ. దూరం. నీటి ఊటలు, రెండు జలాశయాలు ఉన్నాయి. శివునికి, రాధాక్రిష్ణులను ఆరాధిస్తారు. ఆలయాలున్నాయి. శ్రీ మహా విష్ణువు యొక్క శయనాగారమైన ఆదిశేషువే అనంతనాగ్. నీటిఊటల్లో మంచి ఖనిజ లవణాలు, గంధకం ఉన్నాయని ప్రతీతి.

అవంతిపూర్ :

కాశ్మీర్ పురాతన ముఖ్య పట్టణం. క్రీ.శ. 9వ శతాబ్దంలో అనంతవర్మ కాశ్మీర రాజ్యాన్ని ఏలిన మహారాజు. ఆ మహారాజుచే నిర్మించబడిం దీ పట్టణం. ఈ పట్టణ నిర్మాణం మహాభారత వీరులు, కథానాయకులైన పాండవులు నిర్మించారని చెప్పుకుం టుంటారు.

బుర్జాహోమ్ :

పురాతత్వ పరిశోధకులు ఇక్కడ త్రవ్వకాలు నిర్వహించారు. త్రవ్వకాల్లో క్రీ.పూ. 2,500 స॥ నాటి అవశేషాలు బయటపడ్డాయి. అభిరుచి కలవారికి ఆసక్తి కరం.

చరాయ్ షరాఫ్ :

యుస్మార్గ్ మార్గంలో 30 కి.మీ. దూరంలో ఉన్న సుందారుషి అనే ప్రసిద్ధి గల మహమ్మదీయ సాధు మహాశయులు షేక్ నూరుద్దీన్ పేరున ఆలయం ఉంది.

డచ్‌గామ్ వన్య మృగ సంరక్షణ కేంద్రం:

శ్రీనగర్ నుండి 22 కి.మీ. దూరంలో ఒక పెద్ద సరస్సు చక్కని అడవి- అందులో నల్ల ఎలుగుబంటి, గోధువన్నె ఎలుగు, కాశ్మీరు దుప్పి, (హంగూల్ అని కూడా అంటారు.)- ఇది స్కాటిష్ డీర్ దగ్గర సంబంధ జాతి ఇక్కడ ప్రత్యేకం.

జూన్‌నెల ప్రాంతాల్లో ఈ జంతువులను చూడగలం. ఇది రక్షిత ప్రదేశం. చూడాలంటే విధిగా అనుమతి పొందాలి. అనుమతి యిచ్చేవారు: కంట్రోలరు, తవాజా, శ్రీనగర్‌వారు. మరింత సమాచారం- గేమ్‌వార్డెన్, జమ్మూ&కాశ్మీర్ టూరిస్టు రిసెప్షన్ సెంటర్, శ్రీనగర్‌వారి వద్దనుండి పొందవచ్చు.

కోకర్ నాగ్ :

శ్రీనగర్ నుండి 70 కి.మీ. దూరం. పర్వత పార్శ్వం నుండి వచ్చే ప్రవాహం అనేక కాలువలుగా చీలి ప్రవహిస్తుంటాయి. ఈ నీటిలో ఓషధీకృతమైన వ్యాధుల నివారకాలుగా ప్రసిద్ధి ఇక్కడనే ఒక పెద్దగులాబి తోటలతో ఎన్నెన్నో రకాల గులాబులు విరిసిన అందాల బొటానికల్ గార్డెన్‌కూడా ఉంది. జీలంనది జన్మస్థలి ఇక్కడికి అతి దగ్గర. 3 కి.మీ. దూరంలోనే ఉంది. దర్శనీయం.

# గుల్మార్గ్

శ్రీనగరుకి 51 కి.మీ. దూరం మంచి ఆరోగ్యకేంద్రంగా ప్రసిద్ధి. వేసవి విశ్రాంతి కేంద్రం. చలికాలంలో హిమపాతం విపరీతంగా వుంటుంది. రోడ్లన్నీ మంచుతో కప్పబడి ప్రయాణయోగ్యంగా ఉండవు. సంవత్సరంలో 5 మాసాలు మాత్రం కాస్త ఇబ్బంది లేకుండా ఉంటుంది. మిగతా 7 మాసాలు ఇబ్బందికరంగా వుంటుంది. సముద్రమట్టానికి 2,730 మీటర్ల ఎత్తున అమరిఉన్న చక్కని కొండ. పచ్చని పసిరిక బయళ్ళు, పుష్పభరితమై నయనమనోహరంగా ఉంటుంది. ఒకమాటలో చెప్పాలంటే పుష్పవన భరితం. 1580 వరకు ఈ ప్రాంతాన్ని గౌరీమార్గ్ అనేవారు. మహాదేవుని ఇల్లాలు ప్రకృతిమాత పార్వతీదేవి పేరుతో పిలిచేవారు.

మార్గమంతా పరచిన తివాచీలాగ పుష్పవనాలతో మనోజ్ఞంగా ఉంటుంది. ఈ వనాలన్నిటినీ సంరక్షించే సైనికుల్లాగా బారులు తీరిన దేవదారు వృక్షాలు కమనీయంగా దర్శనమిస్తాయి. ఇక్కడ సహజ సిద్ధమైన గోల్ఫ్ క్రీడా కేంద్రం ప్రపంచమంతటిలోనూ ఎత్తయినదిగా పరిగణించబడుతుంది.

మంచులో స్కీయింగ్ నిపుణులకు 200 మీటర్ల పొడవుగల స్కీ-లిఫ్ట్ ఏర్పాటు చేయబడింది. 500 మీటర్ల చైర్‌లిఫ్ట్ ఏర్పరచబడింది. స్కీయింగ్ వాలు తలాలు బహువక్కనైనవి. ఇక్కడ స్కీయింగ్‌లోను శిక్షణయిచ్చే కార్యక్రమాలు కూడా ఉన్నాయి.

టూరిస్టు బంగళాకుతోడు విడిది సౌకర్యానికి మంచి హోటళ్ళున్నాయి. వాటిలో ముఖ్యంగా నిదౌస్ హోటల్, హైలాండ్ పార్కు, వుడ్‌లాండ్స్, స్నోవ్యూ, కింగ్స్‌లే మొదలయినవి పేర్కొనదగినవి.

చుట్టుప్రక్కల :

గుల్మార్గ్‌ను చుట్టుకుని సర్కులర్ రోడ్డుంది. కాశ్మీర్ లోయలోని అందాలతో పాటు నంగాపర్వత్ శిఖరం ఉత్తరాన దర్శనమిస్తుంది ఆగ్నేయదిశన హరముఖ్ శిఖరం, సూర్యాస్తమయ శిఖరం దృశ్యమానంగా గోచరిస్తాయి.

ఖిలాన్ మార్గ్ :

ఆరుమైళ్ళు హాయిగా నడిస్తేచాలు పుష్పభరితమైన లోయలను కనులారగాంచ వచ్చు. చుట్టూవున్న మంచు పర్వత శిఖరాలు నయన మనోహరంగా ఉంటాయి. సముద్ర మట్టానికి దాదాపు 10వేల అడుగుల ఎత్తున దర్శనమిచ్చే నందనవనం అన వచ్చు. వృక్షశాస్త్ర పరిశోధకులకి చాలినంత కాలక్షేపం. సరికొత్త పూల జాతులను కనుగొనవచ్చు. స్కీక్లబ్ ఆఫ్ ఇండియావారి నేలమాళిగ వసతిగృహం ఉందండోయ్!

అల్‌పథేర్ :

ఖిలాన్‌మార్గ్‌కి అవతలగా గుల్మార్గ్ నుండి 13 కి. మీ. దూరంలో అఫర్వత్ పర్వత పాదాలచెంత అమరిన మంచు సరస్సు. ఈ సరోవరం జూన్ మధ్య వరకు నీరంతా ఘనీభవించి మంచుమయమై ఉంటుంది. తరువాత కూడా ఈ సరోవరంలో మంచు దిబ్బలు దిబ్బలుగా, కొండలు కొండలుగా తేలియాడుతూ వింతైన ఆశ్చర్యానికి ఆకరమై కనువిందు చేస్తుంది. ఈ ప్రదేశాలకు సరదాగా పోనీలమీద స్వారీ చేయ వచ్చు. చార్జీలుకూడా అందుబాటులో ఉండి స్థిరంగానే ఉంటాయి.

నింగల్ నల్లా :

గుల్మార్గ్ నుండి 10 కి.మీ. దూరం మాత్రమే. అఫర్వత్ పర్వత పాదాల నుండి అల్‌పథేరాలో కరిగిన మంచు కొండవాగై ప్రవహిస్తుంది. అంతెత్తు కొండమీది నుంచి దుముకి లోయలగుండా మార్గం సుగమం చేసికొని సోపోర్ దగ్గర జీలంనదిలో కలిసిపోతుంది.

జయారత్ బాబా రేషి :

ఇక్కడ మహమ్మదీయ సాధు పుంగవుని పేర వెలసిన ఆలయం. గుల్మార్గ్

నుండి గాని, తంగ్‌మార్గ్ ద్వారాగాని చేరవచ్చు. ఈయన ఇక్కడ క్రీ.శ. 1480లో దేహత్యాగం చేరారట. ఈయన సమాధి ఇది. సన్యాసం పుచ్చుకోక ముందు కాశ్మీర రాజైన జైనుల్ అబిదిన్ ఆస్థానములో ఒక ప్రముఖుడిగా వుండేవారట.

**ఫిరోజ్‌పూర్ నల్లా :**

తంగ్‌మార్గ్ రోడ్డు నుండి చేరవచ్చు. ఇదిగూడా ఒక కొండవాగు. గుల్మార్గ్ నుండి 5 కి.మీ. దూరంలో ఉన్నది. చేపల పెంపకం కేంద్రం ఉంది. ఈ వాగు బహన్‌నదిలో 'వాటర్స్‌మీట్' అనే పిక్నిక్‌స్పాట్ దగ్గర సంగమం చేస్తుంది. ఇక్కడ నుండి మరింతపైకి కొనసాగితే 3 రోజుల్లో 50 కి.మీ. దూరంలో ఉన్న తోసా మైదానం చేరవచ్చు. మార్గం కాశ్మీర్‌లోయ అంతటిలోను బహుసుందరమైనదిగా పేర్కొనబడింది. 50 కి.మీ. దూరంలో జన్మజన్మలకు సరిపడా ఆనందానుభూతిని ప్రకృతి సౌందర్య వీక్షణతో పదిలంగా మూటగట్టుకోవచ్చు. మూడే మూడు రోజులు చాలండీ జన్మంతటికీ !

# పహల్‌గావ్

చుట్టూ దజను కంటేపైగా మంచు పర్వత శిఖరాలతో ఆవరించబడి, దేవదారు వనముతో పరివేష్టించబడిన చిను పట్టణం. అభివృద్ధి పథంలో చకచకా చురుకుగా పై మెరుగులు దిద్దుకుంటున్న ఒకనాటి పశుల కాపరుల కుగ్రామం. సముద్రమట్టానికి 2,195 మీ. ఎత్తున అమరి యున్నది. శ్రీనగరు పట్టణానికి 97 కి.మీ. దూరం. అమర్‌నాథ్ గుహాలయ యాత్రికులకు చక్కటి మజిలీ. అమరిక బహుపసందైనది. లిడ్డర్, శేషనాగ్ నదుల సంగమస్థలి.

పహల్‌గావ్‌కి 2 కి.మీ. దూరంలో బాయిసరన్‌లోయ అందమైన వనము. పర్వతానికి ఎగువభాగంలో 150 మీటర్ల ఎత్తున అమరియున్నది.

ఇక్కడికి అనతిదూరంలోనే ఒక సరోవర తీరంలో అతిపురాతన శివాలయం ఉంది. దీన్ని మామలేశ్వర ఆలయంగా చెప్పబడింది.

# అమర్‌నాథ్

కొందరి అభిప్రాయం ప్రకారం ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటి. స్వభావసిద్ధమైన గుహాలయము. దీని నిర్మాణంలో మానవ హస్తమేలేదు. ప్రకృతి శివ మహాదేవు

నికి ఏర్పరిచిన హిమధామం. దీనికి తలుపులు, దర్వాజాలు లేవు. సముద్ర మట్టానికి దాదాపు 13 వేల అడుగుల ఎత్తున 150 అ. ఎత్తు, 90 మీటర్లు వెడల్పున ఏర్పడినది. గోడలు పైకప్పు ఏదో లోహ సంబంధమైన దానితో ఏర్పడినట్లుగా తోస్తుంది. అది అంతా జిప్సమ్‌తో ఏర్పడిందని భావన. పైకప్పులలో కొద్దిభాగం తప్ప మిగతా భాగాల్లో అన్నిటినుండి నీరు బొట్లు బొట్లుగాపడి వెంటనే గడ్డకట్టి మంచుగా తయారవు తుంది. గుహ ఉత్తరభాగంలో రెండు రంధ్రాలు, వాటిలో ఒకటి కొంచెం పెద్దదిగా ఉంటుంది. ఈ రంధ్రము నుండి పడిన నీటిబొట్లతో ఏర్పడిన మంచు ముద్దే అమర నాథ హిమలింగం. చంద్రుని కళలవలెనే కృష్ణపక్షంలో క్రమంగా క్షీణించి అమా వాస్యకు అదృశ్యమయి, మరల పాడ్యమినుండి శుక్లపక్ష చంద్రుని కళల మాదిరిగానే పెరుగుతూ పౌర్ణమికి పూర్తి లింగాకారం ఏర్పడుతుంది. ఇది అనాదిగా జరుగుతూనే వుంది. ఈ శుక్లపక్షంనాటి శివలింగమునే యాత్రికులు అర్చిస్తారు.

ప్రధాన లింగమునకు ఎడమవైపున హిమగణేష్, కుడివైపున మాత పార్వతీదేవి భైరవమూర్తులు హిమరూపంలో ఉన్నారు. ఇక్కడి అమరనాథేశ్వరుని దర్శించిన స్వామి వివేకానంద అనిర్వచనీయమైన అలౌకికానందాన్ని పొందినట్లుగా సిస్టర్ నివేదిత వ్రాతల్లో గమనార్హమైన విశేషాంశం. గుహ దక్షిణాభిముఖంగా వుండ టంతో సూర్య కిరణాల స్పర్శ సోకదు. గనుక వేసవిలో గూడా లింగము కరుగ దట. ఈ గుహ మహాదేవుని కెందు కాలవాలమైనదీ అన్నది ఒక కథ.

ఒకానొక సమయంలో పార్వతీదేవి తన నాధుని అడిగిందట- నాధా-మెడలో కపాలముల ఎందుకు ధరిస్తారు? అని. మహాదేవుడు—— ఆ కపాలములన్నీ నీ పూర్వ జన్మల అవతార విశేషాల గురుతులు-అని అన్నాడట. పార్వతీదేవి తెలుసుకో గోరిం దట-ఇన్ని జన్మలు తాను ఎత్తడమేమిటి? మహాదేవుడు అమరుడై యుండగా ఎలా సంభవించిందో తెలుపమని కోరింది జగత్పితను. అప్పుడు పార్వతీదేవికి ఆ దేవ రహస్యాన్ని ఎరిగించటానికి అనువైన ప్రదేశం కోసం చూచారట. అప్పుడు ఈ గుహ తమ కనువైనదిగా కనుగొని అందు వసించ నారంభించారట. మామూలుగా వయసు మళ్ళిన భక్తులకు యాత్రికులకు బహుకష్టసాధ్యంగా ఉన్నా, శారీరక బలం గలిగిన వారికి మరో విధంగా ఉంటుంది.

పహల్‌గావ్ నుండి 46 కి.మీ. శ్రీనగరునుండి 153 కి.మీ. పహల్‌గావ్ వరకు బస్సులుంటాయి. అక్కడి నుండి దాదాపు కాలి మార్గమే। శ్రమతో కూడు

కున్నదైనా అందులోవున్న థ్రిల్ మరెందులోనూ లేదంటారు. మార్గ మధ్యంలో ప్రపంచంలో మరెక్కడా కానలేని దృశ్యములు ప్రబంధమాన మాయంగా కనబడ తాయి. సాధారణంగా ఆగష్టు యాత్రిక సమయంగా పరిగణించబడుతుంది. ఈ మాసంలో దేశం నలుమూలల నుండి యాత్రికులు విశేషంగా వస్తారు. పహల్‌గావ్‌లో సమావేశమవుతారు. ఇక్కడి ఈ శివలింగాన్ని మొట్టమొదట భృగుమహర్షి చూచా డట. శ్రావణ శుక్ల ద్వాదశినాడు ధర్మార్థ సంఘం వారు మొదలు పెట్టిన ఉత్సవాలు ఊరేగింపులు, శ్రావణ పౌర్ణమినాడు అమరనాథ ఆలయాన్ని చేరునట్లుగా ఉత్సవం జరుపుతారు. సాధారణంగా శ్రావణం వరకూ మంచుతో కప్పబడి ఉంటుంది. శ్రావణ పూర్ణిమ నాటికి ఇక్కడికి చేరుకునే విధంగా ప్రయాణ కార్యక్రమాన్ని ఏర్పరుచుకోటం శ్రీనగరు నుండి కాశ్మీర ప్రభుత్వం వారు శ్రీ శారదా పీఠ శంకరాచార్యుల 'చందన్ వారీ' ఉత్సవం సమయంలో పయనిస్తారు. వారి వెంట అనుసరించుట చాల ఉత్తమం. ఈ రోజుల్లో సర్వ సౌకర్యాలు లభిస్తాయి. విడిదినాల్లో అయితే యాత్రికులు తమంత తామే ఏర్పాటులు చేసికోవాల్సి వుంటుంది.

త్రోవలో 'చందన్‌వారి' తరువాత యాత్రికులు శేషనాగ సరస్సుకి వస్తారు. ఈ సరస్సు ఆకారంలో ఆదిశేషుని పడగలాగ వుంటుంది, తరువాత వర్షన్ లోయ లులో ప్రవేశిస్తారు. ఈ ప్రాంతమంతా సమున్నతమైన పర్వత శిఖరాలు మంచుతో కప్పబడి సూర్యకాంతి తెల్లటి మంచు మీద ప్రతి ఫలించినప్పుడు సరికొత్త సోయ గాలు కనువిందు చేస్తాయి. అక్కడ దగ్గరలోనే వున్న పంచతరణి (ఐదు నదుల సంగమం)లోను, అమరగంగలోనూ పవిత్ర స్నాన విధులను పూర్తి చేసికొంటారు యాత్రికులు. అమరనాథ యాత్ర మూడు లేక 5 రోజులు పడుతుంది. అంతా నడక తోనే చేయవలసి వుంటుంది.

శ్రీనగరు అమర్‌నాథ మార్గంలో దాదాపు 15 కి.మీ. దూరంలో కుంకుమ పూవు క్షేత్రాలున్నాయి. అనంతనాగ్ నుండి 8 కి.మీ. దూరంలో ఉన్న మార్తాండ క్షేత్రం- (సూర్యుని ఆలయం) లలితాదిత్య ప్రభువు 8 వ శతాబ్దంలో నిర్మించినది దర్శనీయం. సూర్య దేవాలయ శిల్పం సాటిలేని మేటిదై చూపరులకు అద్భుతమైతోచే కళనున్నితమై ఆనందాశ్చర్యాలను కలిగించేదిగా వుండి కాశ్మీర శిల్పములో మేటిదైన మచ్చుతునకగా అలరారుతూ వుంది. యాత్రిక భక్తులు ఇక్కడ సూర్యుని ఆరాధించి పితరులకి శ్రాద్ధములు పెడతారట. అమర్‌నాథ పండాలు అన్ని సౌకర్యాలు అమరు స్తారు.

# జమ్ము

ఢిల్లీ నుండి 585 కి.మీ. కాశ్మీర్ లోయకు ముఖ ద్వారం. అనేక పురాతనాలయాలు, చక్కని సరస్సులు, పర్వతాల మధ్య అందంగా అమరియున్న పట్టణం-తావీ నదీ తీరంలో వుంది.

ఈ పట్టణానికి జమ్ము అనే పేరు ఎందుకు వచ్చింది-బహూశా క్రీ.శ. 9 వ శతాబ్దంలో పరిపాలించిన జంబులోచన మహారాజు పేరిట వచ్చి వుంటుందని భావన. ప్రస్తుత స్వరూపం మహారాజు గులాబ్‌సింగ్ వారి కృషియే। మహారాజ్ గులాబ్‌సింగ్ 19 వ శతాబ్దపు తొలినాళ్ళలోని వారు. రాష్ట్రంలో రెండవ పెద్ద పట్టణంగా ఉండి 1,60,000 జనాభాతో శోభిల్లుతూంది. అందాల కొండల చల్లని వాతావరణం హాయిని ఆహ్లాదాన్ని అనుభవించి కాశ్మీర్ నించి తిరిగి వచ్చేవారికి నులివెచ్చని వాతావరణం ఆహ్వానం పలుకుతుంది. వేసవికాలంలో చమట పోస్తుంది. జమ్ము నగరం మైదాన ప్రాంతాల్లోనే వుందన్న సంగతి వెంటనే స్ఫురిస్తుంది. జమ్ము పట్టణంలో పాదుకొనియున్న అనేక పురాతన ఆలయాలు ప్రత్యేక ఆకర్షణలు.

స్వతహాగా పట్టణం మొత్తం రెండు పట్టణాల కలయిక. పట్టణంలో చూడదగిన విశేషాలు ప్రాధాన్యతా క్రమంలో రణబీరేశ్వరాలయం, రఘునాథ్ ఆలయం, రఘునాథ్ బజారులో వుంది. పురానిమండిలో వున్న రఘునాథ ఆలయం, రణబీర్ కెనాల్, బహుఫోర్-మొదలగునవి.

## రణబీరేశ్వరాలయం :

1883లో నిర్మించబడిన శివాలయం. ముఖ్య శివలింగానికి ఈ ఆలయంలో పన్నెండు స్ఫటిక లింగాలు-ఇంకా కొన్ని వేల శివలింగాలు రాతి పలకల మీద అమర్చబడ్డాయి.

## రఘునాథ ఆలయం :

రామాయణ గాథకు చెందిన అనేక యితర దేవతల మందిరాల మధ్యగా అన్నిటికంటే మిన్నగా రామాలయం ఒకటి వుంది. పట్టణం మొత్తానికి హృదయ తుల్యమైన నడిబొడ్డున అమరియున్న దీ ఆలయ సముదాయం. గోడల లోపలవైపున బంగారుమలాం చేయబడింది. అనేక సాలి గ్రామాలు అంచెంచెల అటకలమీద అమర్చబడ్డాయి. ఎన్నో పవిత్ర శిలలు కూడా దర్శనీయం.

మరో రామాలయం :

దీన్ని కూడా రఘునాథ ఆలయమనే అంటారు. ఆలయకుడ్యాల మీద చక్కని రంగులతో రామ కథలు, కృష్ణ కథలు మనోహరంగా పెయింటింగ్స్ చేయబడి వున్నాయి.

బహుఫోర్టు :

తావీనది ఎడమవైపు తీరాన కొండ ముఖాన అమరియున్నది బహుఫోర్టు. అనాది కాలంలో ఈ కోటకు అంకురార్పణ బహు లోచనుడు చేశాడని ప్రతీతి. కాని ప్రస్తుత కోట స్వరూపం డోగ్రా రాజ వంశీయులు సమకూర్చినది. కోటలోపల కాళి కాలయం చూడదగినది.

జమ్ము పరిసరాలు :

వైష్ణవీదేవి గుహాలయం:

జమ్మూ నుండి 62 కి.మీ. దూరంలో గల త్రికూటాచలమను కొండగుహలో ఆలయమున్నది. జమ్మూ నుండి కట్రా వరకు బస్సులున్నాయి. మిగతా దూరం పొనీల మీద గాని, నడిచిగాని వెళ్ళవలసి వుంటుంది. సముద్ర మట్టానికి సుమారు 5,300 అడుగుల ఎత్తున అమరియున్నది. త్రికూట భగవతి బహుళంగా ప్రచారంలో వున్న వైష్ణవీదేవి. నిరంతరం లక్షల మంది యాత్రికులు వచ్చి దర్శిస్తుంటారు.

గుహాంతర్భాగం చేరటానికి చాలా ఇరుకు దోవ వుంది. భక్తులు మోకాళ్ళమీద దేక్కుంటూ వెళ్ళవలసి వచ్చేది. అయితే ఇటీవల ఈ దోవను కొంచం వెడల్పు చేశారు. ఇప్పుడు మరీ అంత ఇబ్బంది లేదు.

గుహాలయంలో దేవిముమ్మూర్తులు సృష్టి, స్థితి, లయల చర్యలను సూచిస్తూ సరస్వతి, వైష్ణవి, కాళి స్వరూప దేవతా విగ్రహాలున్నాయి. చాల మహిమాన్వితమైన దిగా చెప్పుకుంటారు. ప్రకృతిశోభ చెప్పనలవిగాదు.

అఖ్నూరు :

చీనాబ్ నది తీరంలోని మంచి విహార యాత్రాస్థలం. జమ్ముకు 32 కి.మీ. దూరం మాత్రం వుంది. ఇక్కడ ఒక పురాతనమైన కోట కూడా ఉంది.

బటోటె :

సముద్రమట్టానికి 1560 మీటర్ల ఎత్తున చక్కని ఆరోగ్య విశ్రాంతి కేంద్రం జమ్మూ నుండి శ్రీనగర్ హైవే మీద. 113 కి.మీ. దూరం. విడిదికి టూరిస్టు బంగళా ఉంది.

శుద్ధ మహాదేవ్ :

సముద్ర మట్టానికి 1225 మీ. ఎత్తున అమరియున్న వేసవి విశ్రాంతికేంద్రం మంచినీటి ఊట ప్రసిద్ధం. వుండటానికి టూరిస్టు బంగళా వుంది. రిజర్వేషనులకు శ్రీనగరులోని డైరెక్టర్ ఆఫ్ టూరిజమ్ వారిని కలవాలి.

రామ్‌నగర్ :

పహారీ రీతుల్లో ఉన్న కుడ్య చిత్రాలు కనువిందు చేస్తాయి. జమ్మూ నుండి 102 కి.మీ. దూరం ఉంది.

శివఖోరి :

88 కి.మీ. దూరంలో ఉన్న గొప్ప శివాలయం. 80 కి.మీ. దూరంలో ఉన్న బారక్ బస్సులో చేరి అక్కడి నుండి మిగతా 8 కి.మీ. నడక ద్వారా వెళ్లాల్సిందే.

ఇవికాక ఈ పరిసరాల్లో స్విన్‌సార్ సరోవరం, మన్సార్ సరోవరం. పర మాండల్, 2024 మీ. ఎత్తున గల పత్నిటాప్, 129 కి.మీ. దూరంలో సన్‌సార్ 2079 మీ. ఎత్తున అమరినది. యాత్రికులకు వసతి కోసం విశ్రాంతి గృహాలున్నాయి.

చాలావరకు విశ్రాంతి గృహాలున్నాయి. యాత్రికులు ఈ విశ్రాంతి కేంద్రాలకు వెళ్ళే ముందు అన్ని అనుపానులు గ్రహించి వెళితే యిక్కట్టుల పాలుగాకుండా వుండటానికి వీలవుతుంది. సమగ్ర సమాచారం ఎంతయినా అవసరం. అందుకు తోడ్పడటానికి గవర్నమెంటు టూరిస్టు ఆఫీసువారిని సంప్రతించటం ఎంతయినా సముచితం-లాభకరం.

# లే

అనేక వ్యత్యాసాలతో అనంత రహస్యాలను దాచుకున్న అద్భుతమైన పర్వత శిఖరాలు. అతి భయంకరమైన ఎత్తుతో అధిగమించలేని విధంగా నిట్టనిలువుగా ఏర్పడినవి చూపులతోనే ఎక్కగలం. భౌతికంగా ఎక్కటానికి వీలుపడదు. పర్వతాల మధ్య బండరాళ్ళను అరగదీసి యుగాలనుండి కొండల గుట్టలమధ్య తమ మార్గాన్ని

సుగమం చేసుకుంటూ ప్రవహించే జలాలు వింతగా తోచే అనేక వంకలు వంకలుగా పాము మెలికల్లా తోచే కాలువలు ఎన్నో యుగాల చరిత్రను చెప్పక చెపుతుంటాయి. ప్రచండవాయువులు వీచి పర్వతాలన్నీ ఇంద్రదాపమైన వజ్రాయుధంఛేదించబడి కుప్పలుగా పోసిన వివిధాకృతులుగా గోచరిస్తాయి. ఇక్కడి పర్వతరాజాలన్నీ కాలానికి ఎదురు నిలిచి అనుభవాల వార్ధక్యంలో పూర్వ యుగాలనుండి పండిన ఎన్నో రహస్యాలు దాచుకున్నట్లుగా ఆరితేరిన ముదతలు స్వచ్ఛంగా చూడగలం.

కాశ్మీరలోయ నుంచి దాదాపు 434 కి.మీ. దూరం వుంటుంది లడక్ వరకూ గల రోడ్డుమార్గం. చాలాదూరం సింధు నదీ పరీవాహక ప్రాంతంలోనే రోడ్డు దోవ తీస్తుంది. వేసవి కాలంలో బస్సు ప్రయాణం చేయాల్సి వుంటుంది. కార్గిల్‌వద్ద మజిలీలో రెండురోజులు పడుతుంది కాశ్మీరు లోయనుండి లడక్ ప్రాంతం చేరటానికి ఇది ఒక మినీ టిబెట్టు.

భారతదేశం మొత్తంమీద అతి పెద్ద వైశాల్యం గలది. అతి తక్కువ జనాభా గల జిల్లా ప్రాంతం లడక్. భారత, చైనా, పాకిస్తానులకు అతి కీలకమైన సరిహద్దు ప్రాంతం. ఇటీవల కాలంలో స్వతంత్రంవచ్చిన తరువాత చైనావారు, పాకిస్తానీయులు సరిహద్దులు వివాదాస్పదంగా మారి చైనా-భారత్‌లు, భారత్ పాకిస్తాన్‌లు ఘర్షణలు జరిగిన విధంతీరును గమనిస్తే సమస్య తీవ్రత మనకు అవగతం అవుతుంది. సృష్టించబడిన సమస్య ఇంకా తెగలేదు కూడా. శ్రీనగర్-లే రోడ్డుకి అవతల ఒక మైలు దూరం కంటే పోవటానికి వీలుండదు.

ముఖ్య గమనిక :

లడక్ ప్రాంతం అంతా సముద్ర మట్టానికి 9, 000అడుగుల ఎత్తుకు పైగానే వుంటుందిగాని తక్కువ మాత్రం వుండదు. వాతావరణ వ్యత్యాసాలు విపరీతంగా ఉంటాయి. అంతలోనే చల్లబడి అంతలోనే మళ్ళీ వేడెక్కడం వంటి విపరీతాలు బహు తరచుగా జరుగుతుంటుంది. 'ఆఁ ఏముందిలే! అనుకున్నంత చలి లేదు-పాడూలేదు' అనుకునేంతలో స్వెట్టర్లు రగ్గులు ఎన్ని వున్నా చాలనంత చలిగా కొద్ది సెకండ్లలోనే సంభవించగల పరిణామాలు అనేకం. సున్నిత దేహతత్త్వంగలవారు జాగ్రత్త! నేరుగా ఢిల్లీనుండి లడక్‌కి విమాన ప్రయాణం చేసేవారూ బహు జాగ్రత్తగా వుండాలి. ఎందుకంటే శరీరం వాతావరణానుకూలంగా కొద్దిగా అలవాటు పడందే కష్టం కనుక ఉష్ణాధిక్యతకు తగినట్లుగా నెత్తిమీద సన్‌కాప్, లేక సన్ స్క్రీన్ లేకపోతే కొద్దిగంటల్లోనే

చెక్కులు పోయిన ముక్కులు తయారవుతాయి జాగ్రత్త। ఈ విషయంలో పర్యాట కులకు ముందుగా కాశ్మీర్ పర్యటన కొంత శరీర సహిష్ణుతను పెంచుతుంది గనుక అభిలషణీయం.

ఈ ప్రాంతానికి వచ్చే యాత్రికులు రగ్గులు, ఉన్ని వస్త్రాలతో పాటు సన్ బరన్ నుంచి కాపాడుకోవటానికి తగిన లోషన్‌లు, క్రీములు, కొన్ని ప్రాథమికమైన మందులు, డ్రైఫుడ్స్ వెంట తీసికొని రావటం మంచిది. అత్యవసరం కూడా. కొంత మంది అయితే గుడారాలు కూడా వెంట తెచ్చుకుంటారు.

'లే'కు చుట్టుప్రక్కల చిల్లర డబ్బులు దొరకటం చాల కష్టం. ఉపయోగానికి తగినంతగా చిల్లర జాగ్రత్త పెట్టుకోవాలి. ఇక్కడి ప్రజలు కష్టపడి పనిచేసేవారు, స్నేహపాత్రులు. సాధారణంగా మనం 'నమస్తే' అంటుంటాం. దీనికి బదులుగా లదక్ భాషలో 'జుల్లే' అనేది అలవాటు చేసికొంటే ప్రాంతీయులు మరింత అభిమానం ప్రకటిస్తారు. కార్గిల్‌లో ఇస్లాము ప్రభావం తగ్గి బుద్ధభూమిగా సాక్షాత్కరిస్తుంది. బౌద్ధమత ప్రభావం ఇంకా సజీవంగా ఉన్న ప్రాంతం. అయితే ఇక్కడి బౌద్ధం టిబెట్టు బౌద్ధ తాంత్రిక విధానాలు అనుసరించబడుతుంటాయి. బౌద్ధవిహారాలు ప్రత్యేకం. రాక్షసులు, దేవతలు, పిశాచాలు తంత్రకళ వీటి మీద నమ్మకాలు హెచ్చు– తమాషాగా వుంటాయి. ఇంతకు ముందు అంటే నిషిద్ధ సమయంతో గొంపాలు (దేవళాలు) అశ్రద్ధకు గురై పాడుబడి వుండేవి. ఇటీవల పర్యాటకుల పరంపర మొదలైన దగ్గరినుండి యాత్రికులద్వారా వచ్చిన ఆదాయంతో పరిశుభ్రంగా వుంచటం జీర్ణమైన వాటిని పునరుద్ధరించటం వగయిరాలు బాగా జరుగుతున్నాయి, భిక్షువులు కూడా యాత్రికులతో ఎంతో అనువద్ధికగా, స్నేహపాత్రంగా మెలగుతుంటారు. స్పెషల్ అట్రాక్షన్– అక్కడి 'బట్టర్‌టీ' ఎన్నటికి మరిచిపోలేనిది.

కాశ్మీర్ కులూ లోయలను కలిపే మార్గాలు అటు చైనా, టిబెట్టులను కలిపే మార్గాలు-కనుమలు కనీసం 16, 000 అడుగుల ఎత్తున వంకరటింకరలుగా అగమ్యగోచరంగా వుంటాయి. గొంఫాలనబడే బౌద్ధమఠాలు, ఆరామాలుతొ నిండి వుంటుందీ ప్రదేశం అంతా. 'లే' పట్టణానికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్నది శంకర్ గొంఫా దీనిలో అనేక సువర్ణ ప్రతిమలు, బహు అరుదైన చిత్రాలు దర్శనీయం. చుట్టుప్రక్కల 12 గొంపాలు పైగా వున్నాయి. అన్నిటికంటే పెద్దది హెమిస్ గొంఫా. 'లే' నుండి సుమారు 49 కి. మీ. దూరం ఉంది. ఇందులో అనేక సువర్ణ ప్రతిమలు, స్థూపాలు అమరి వున్నాయి. అయితే ప్రజాసందర్శనానికి అనువుగా

వుండేది, 11 సంవత్సరాల కొకసారి మాత్రమేనట. అతి దగ్గరలో వున్న ఛాన్స్ 1991లో వస్తుంది. మరో విశేషమైన విషయం—ఏసుక్రీస్తు తన చిన్నతనంలో కొన్ని సంవత్సరాలు గడిపారని ప్రతీతి.

మిగతా గొంఫాల్లో ముఖ్యమైనవి 'ధిక్సే' 'ష్యే' రెండూ 'హెమిస్ గొంఫా' దోవలోనే వున్నాయి. శ్రీనగరు నుంచి బస్సు ప్రయాణం 434 కి. మీ. కార్గిల్‌లో రాత్రి మకాం. మరుసటి రోజున మధ్యాహ్నం వరకు 'లే' పట్టణం చేరవచ్చు.

స్థల సందర్శనా నిర్వహణలు

| టూర్ నంబరు | సమయం | చార్జీలు | నిర్వాహక సంస్థ |
|---|---|---|---|
| 1. పహల్‌గావ్ | ప్రతిరోజూ 8-30 నుండి సా. 6-30 వరకు | రు. 30/- | జమ్ము-కాశ్మీర్ రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషన్, టూరిస్టు రిసెప్షను సెంటర్. ఫోన్ : 72698 |
| 2. డాక్సుమ్ వయా. అచ్చాబాల్ కోకర్నాగ్ | -డిటో- | రు. 30/- | " |
| 3. గుల్మార్గ్ | ప్రతిరోజూ ఉ. 9 సా. 7 గం. వరకు | రు. 32/- | " |
| 4. అబర్వల్ | మంగళ, గురు, శని ఉ. 8.30 నుండి సా. 6. 30 | రు. 30/- | " |
| 5. వీర్నాగ్ | బుధవారం, ఆది ఉ. 9 సా. 7 గం | రు. 27/- | " |
| 6. వులార్ సరోవరం | ప్రతిరోజు ఉ. 9 నుండి సా. 7 గం. వరకు | రు. 27/- | " |
| 7. యుస్మార్గ్ | మంగళ, గురు, శని ఉ. 8-30 - సా. 6-30 వరకు | రు. 20/- | " |

8. సోన్‌మార్గ్ రోజు ఉ.8-30 సా. 6-30వరకు రు. 31/-
9. మొగల్ గార్డెన్స్ రోజు 8-20 సా.6-30 వరకు రు. 15/-

అన్ని టూర్లు టూరిస్టు రిసెప్షన్ సెంటరు దగ్గరనే మొదలయి అక్కడితే ముగింపు. గయిడ్లు లేరు. ప్రైవేట్‌గా కాశ్మీరు మోటారు డ్రైవర్లు, భారత్‌ట్రాన్సుపోర్టు కం. సంస్థలు వెస్టరన్ బస్సు స్టాండు బట్మాలా వద్దనుండి ప్రతినిత్యం బస్సులు నడుపుతారు. పై టూర్లన్నిటినీ కూడా గమనించండి.

శ్రీనగర్‌లో నౌకాగృహాలు రోజూవారిగానే గాక నెలవారీ అద్దెలకు కూడా లభ్యమవుతాయి. కేవలం వసతి సౌకర్యం కోసమే- నెలకి రు. 1000/- నుండి 1500/- వరకు అద్దె వుంటుంది.

రిజర్వేషనులుకి మరింత సమాచారం కోసం- కమీషనర్ ఆఫ్ టూరిజమ్, జమ్ము & కాశ్మీర్ గవర్నమెంటు, శ్రీనగరువారిని సంప్రదించండి.

వీటికి తోడు వసతికి ఎన్నో హోటళ్ళున్నాయి.

## ఇతర సౌకర్యాలు :

వసతికి-భోజనానికి అన్నిటికీ- టూరిస్టు రిసెప్షన్ సెంటరు.

డబుల్ రూము 90/- అదనంగా ఉండే ప్రతి మనిషికి 10 రు. ఎక్స్‌ట్రా.

## ఛష్మాషాహి దగ్గర కుటీరాలు :

అన్ని సౌకర్యాలతో, వంటసామానులతో, అన్నిటితోసహ అందంగా అమర్చబడినవి- సింగిల్- రు. 200/- డబుల్, 300/- నుండి 360 వరకూ.

## యూత్ హాస్టల్ :

నేలమీద పడుకోటానికి మనిషి ఒకరికి రు. 2/- మాత్రం. రిజర్వేషనుకు- వార్డెన్, యూత్ హాస్టలు, హజూరి బాగ్, శ్రీనగరు.

## టూరిస్టు హోటల్ TRC :

మనిషి ఒక్కరికి 7/- మొదటి మూడురోజులు రోజుకి. తరువాత. 3 రోజుల వరకూ. రు. 11/- వారం తరువాత 16/- ప్రతి ఒక్కరికీ, రోజు 1 8- రిజర్వేషన్ల కొరకు- కమీషనర్ ఆఫ్ టూరిజమ్, శ్రీనగరు వారిని సంప్రతించండి.

## ప్రయాణపు రిజర్వేషనులు :

**విమానం :**

ఇండియన్ ఎయిర్ లైన్సు, టూరిస్టు రిసెప్షను సెంటరు, శ్రీనగర్.

**రైలు :**

N. D. రాధాకిషన్ & సన్స్, రైల్వే అవుట్ ఏజన్సీ, బాద్షా చౌకు, శ్రీనగర్. ఉ. 10 నుండి సా. 5 వరకు.

**బస్సు :**

J. & K. రోడ్డు ట్రాన్సు పోర్టు కార్పొరేషను.

టూరిస్టు రిసెప్షను సెంటరు, శ్రీనగర్. సమయం. ఉ. 10 గం. నుండి సా. 6 గం. వరకు.

శ్రీనగరు నుండి ఈ క్రింది ముఖ్య యాత్రిక కేంద్రాలతో
రోడ్డు మార్గం కలయిక లున్నాయి.

| గమ్యం | దూరం | మజిలీలు |
|---|---|---|
| అమృతసర్ — | 548 కి.మీ. | అనంతనాగ్-56, బనీహాల్-56, బటోటె-66, ఉధాంపూర్-61, జమ్మూ-66, పఠాన్ కోట్-108, గురుదాస్ పూర్-40, బటాలా-56, అమృత్ సర్-38. |
| చండీఘర్ — | 741 కి.మీ. | అనంతనాగ్-నుండే పఠాన్‌కోట వరకూ పై మాదిరిగానే- తరువాత, పఠాన్‌కోట నుండి జలంధర్-109, లూధియానా-58, అంబాలా-109, చండీఘర్-52. |
| ఢిల్లీ — | 892 ” | అంబాలావరకు — చండీఘర్ మార్గం లోనే, అంబాలానుండి ఢిల్లీ-203. |
| గుల్మార్గ్ — | 38 ” | నేరుగా |

| | | |
|---|---|---|
| కట్రా — | 353 " | జమ్ము వరకూ. అమృతసర్‌లో మాది రిగానే- జమ్ము నుండి కట్రా-48 కి.మీ |
| లే — | 434 " | సోన్‌మార్గ్-84, ద్రాస్-63, కార్గిల్-54, లే-233. |
| మనాలి-వయా కులూ | 733 " | పఠాన్‌కోట వరకూ అమృతసర్ మార్గం లోనే- పఠాన్‌కోట నుండి జోగీందర్ నగర్-154, మండి-58, కులూ-69, మనాలి-39. |
| పహల్‌గామ్ — | 98 " | అనంతనాగ్-56, పహల్‌గామ్-42. |

ప్రత్యేక గమనిక :

అవసరమయిన చోట్ల మీరు కోరితే బెడ్స్, కుర్చీలు, టేబిల్సు, స్టీలు బక్కెట్లు, వేడినీళ్ళు వగయిరాలు స్పెషల్ చార్జీలమీద సప్లయి వుంటుంది. సామాన్లన్నీ అద్దెకు దొరుకుతాయి. కలవర పడవద్దు.

శ్రీనగరు మొదలయిన పట్టణాల్లో తిరగటానికి టాక్సీలు వగయిరాలు లభ్యం.

ముఖ్యంగా అమర్‌నాథ్, అరు, బాయిసరన్, చందన్‌వారి యాత్రికులకు అవసరం వుంటుంది. బస్సులు లేనిచోట్ల- పోనీలు, కూలీలు, దండీలు కావలసినవారికి ఈ క్రింద రేట్లున్నాయి- సదుపాయంగా.

| | | |
|---|---|---|
| అమర్‌నాథ్ — | స్వారీ పోనీ | — 200/- |
| | సామాన్ల పోనీకి | — 190/- |
| | పిఠూతో కూలీ | — 100/- |
| | ప్రైవేటు దండీ | — 1,100/- |
| | గవర్నమెంటు దండీ | — 1,300/- |

| | | | |
|---|---|---|---|
| ఆరు — | స్వారీపోనీ | — | 26/- |
| వాయిసరాన్ — | " | — | 10/- |
| చందన్‌వారి — | " | — | 30/- |
| శలాహోయి — 3 రోజులు — | " | — | 120/- |
| | " | సామాన్లపోనీ | 120/- |
| లిడ్డర్‌వత్ (LIDDERWAT) 2 రోజులు — | స్వారీపోనీ | — | 50/- |
| షికార్‌గర్ — | " | | 11/- |

పైన తెలిపిన రేట్లు కాలానుగుణంగా మారుతుంటాయి. మీరు వెళ్ళేసమయాన బాగా విచారించి తెలుసుకొని వెళ్ళవలసింది. లేకపోతే మోసపోతారు జాగ్రత్త!



# రాజస్థాన్



రాజపుత్రులకు స్థానం. రాజుల స్థానం–రాజస్థాన్. స్వతంత్ర భారతదేశ పెద్ద రాష్ట్రాల్లో ఒకటి. రాజ పుత్రులు స్థూలంగా కొన్ని రామాయణ, మహాభారత కాలాలకు చెందిన రాజవంశీకుల మూల పురుషుల పరం పరాను గత సంతతి యని ప్రతీతి. శిశోడియాలు, రాథోడ్‌లు, కచ్ఛవులు రఘుకులాన్వయ రత్నదీపం శ్రీరామ చంద్రప్రభు వంశీయులని, అంటే సూర్యవంశపు రాజులని, భాటియాలు, తన్వారులు చంద్రవంశజులని, సోలంకీలు, పార్మారులు, ప్రతీహారులు, చౌహానులు యజ్ఞకుండపు అగ్నివంశ సంజాతులని చెప్తారు.

అద్భుత శౌర్య ప్రతాపాలు రాజపుత్రులకు పెట్టని ఆభరణాలు. చరిత్రలో చిరస్థాయిగా నిలిచిన మణిమందారాలు, సాహితీ ప్రపంచంలో పూచిన వీరగాథలు. 12వ శతాబ్దపు ప్రాంతాల్లో మొక్కవోని ధైర్య సాహసాల్తో మహమ్మదీయుల దండయాత్రలకు ఎదురొడ్డి నిలిచి పోరాడి అడ్డుకోగలిగినవారు. చిట్ట చివరకు ఢిల్లీ సుల్తానులకు లొంగినా తమ ఓటమిని పూర్తిగా అంగీకరించలేదు. 1526 లో మొగలు సామ్రాజ్య సంస్థాపకులైన బాబురాను తిరస్కరించిన మేవారు రాజ్యపు మహారాజు సంగ్రామసింగ్ ఇందుకు మంచి ఉదాహరణ. ఖన్వాలో జరిగిన యుద్ధంలో రాణా సంగ్రామసింగు ఓటమి మొగలులు రాజపుత్ర స్థానమును ఆక్రమించటానికి అవకాశం దొరికింది. తరువాత మిగతాదేశం మొత్తం మొగలాయిల పరిపాలనలోకి క్రమేణా చేరిపోయింది. ఈలోగా మత సామరస్యానికి దోహదం చేసిన అక్బరు షా చక్రవర్తి వీరితో స్నేహసంబంధాలు నెలకొల్పుకున్న సమయంలో కూడా

మేవారు సామ్రాజ్యాధినేతలు మాత్రం జహంగీరు కాలం వరకు ఎదురునిలిచి పోరాడు తూనే ఉన్నారు. తరువాత మతఛాందసత్వం పూర్తిగా ఆవరించియున్న ఔరంగజేబు కాలంలో ఎన్నోవిధాల పీడనకు, కష్టనష్టాలకు గురయిన రాజపుతానా మొగలు సామ్రాజ్య క్షీణదశలో కూడా స్వతంత్రం కాలేకపోయింది. కారణం ప్రక్కలో బల్లెం లాగ మరాఠుల దండయాత్రలు. ఈకారణంగా విదేశీయులైన బ్రిటిషువారు కాలుపెట్టే సాహసం చేయగలిగారు. దాదాపు 20 చిన్న రాజ్యాలకు రక్షకులుగా ప్రవేశించి చివరకు మొత్తాన్ని తమ ఎలుబడిలోకి లాక్కోగలిగారు. దీనినంతటికీ మరువలేని ముఖ్య కారణం మనకు చరిత్ర చెప్పిందీ, గోచరించే నగ్నసత్యం మనలోని పరస్పర అంతః కలహాలు దేశ పారతంత్ర్యానికి రాచబాటలు పరిచిందనేది మరువలేని చేదు నిజం.

మానవజాతి చరిత్ర మొత్తంమీద రాజపుత్రులు ఎదుర్కొన్నంత నిస్పృహ, నిస్సహాయతకు మరెక్కడ కానరాదని కొందరి అభిప్రాయం. శతాబ్దాల తరబడి ఈ నిరాశా, నిస్పృహల నీడల్లో జీవితాల పర్యంతం తరతరాలు పోరాట పటిమను పెంచు కొంటూ– రాజీలేని పట్టుదలతో, శౌర్య ప్రతాపాలు, దీక్ష ప్రదర్శించిన జాతిగా కొని యాడబడింది.

వీరత్వం, ధీరత్వం, రక్షాదక్ష దీక్షత్వం, ఓర్పు, సహనం, శత్రునిర్మూలనలో అవకాశం కోసం ఎదురుచూస్తూ ఆత్మాభిమానం తరగని సంపదగా నిలుపుకుని, అవ కాశం దొరకగానే కొదమసింగంలాగా విదికురికే రాజీలేని మనస్తత్వం గలిగిన వీరి కథలు గాథలు అనేకం. భారతీయ సంస్కృతికి, సాహిత్యాలకు సుమహారాలు వీరి సాహసగాథలు. అపురూపమైన వీరి పారంపరిక సాంప్రదాయము, నాగరికతా, రక్షణ ఎనలేని, తులలేని అభిమానం, గౌరవాదరాలు పుష్కలంగా చూపి ప్రాణాలను సైతం తృణప్రాయంగా సమిధలు చేసిన త్యాగధనులు. స్త్రీలుసైతం శత్రు రాజులకు, దండ యాత్రలకు లొంగిపోక తప్పదనుకున్నప్పుడు రాణివాసపు స్త్రీ లందరూ సామూహి కంగా అగ్ని ప్రవేశంచేసి ఆత్మాహుతులు గావించుకున్న కథలు కోకొల్లలు. అనాడు అనేక చిన్న చిన్న రాజ్యాలుగా అమరిన రాజపుత్ర స్థానం ఈనాడు దేశంలో అతి పెద్ద రాష్ట్రాల్లో ఒకటి.

**భౌతికంగా :**

పడమటి దిశవ, వాయవ్యంగా థార్ ఎడారి అవతలి భారత సరిహద్దు, పాకి

స్థాన్, తూర్పున-ఈశాన్య దిశన పంజాబు, హర్యానా, ఉత్తరప్రదేశ్, ఆగ్నేయదిశన మహారాష్ట్రములతో ఆవరించబడినది.

ఆసియా ఖండంలో అనాదికాలంలో ఏర్పడిన ఆరావళి పర్వతశ్రేణి రాజస్థాన్‌లో గుండా వెళ్తుంది.

రాష్ట్ర వైశాల్యం: 3,42,239 చ. కి. మీ.

రాష్ట్ర రాజధాని: జైపూర్

రాష్ట్ర జనాభా: 3,50,00,000పైగా

మాట్లాడేభాష: హింది, రాజస్థాని.

అక్షరాస్యత: 24.38%

స్త్రీ పురుష నిష్పత్తి: 919 : 1000

జన సమ్మర్థత: చ.కి.మీ. 100 మంది.

భౌగోళికంగా వాతావరణ వైరుధ్యాల వల్లనేమి, భూసారాన్ని బట్టి అయితేనేమి, ఖనిజాల సంపదనుబట్టి అయితేనేమి రాష్ట్రం మొత్తాన్ని ఆరు విధాలుగా విభజించవచ్చు.

1) పశ్చిమ దిశనవున్న ఎండిన బీడు ప్రాంతం. పూర్తిగా జైసల్మేర్‌జిల్లా, బార్మర్, జోద్‌పూర్ జిల్లాల వాయవ్య భాగం. బికనీర్‌జిల్లాలోని ఈశాన్య ప్రాంతం-నాగూరుజిల్లా పడమర ప్రాంతం, ఆగ్నేయం చూరుజిల్లా ప్రాంతం మొత్తం కలిపి దాదాపు ఎడారి ప్రాంతంగా ఏర్పడి రాష్ట్రం మొత్తంలో అధికమైన భాగాన్ని ఆక్రమించి ఉన్నది.

2) ఆరావళి పర్వతశ్రేణి అమరిన ప్రదేశం. దక్షిణభాగం అంతా లునీ నది ప్రవాహంతో సజలమయింది. జాలూర్, పాలి, జోధ్‌పూర్‌జిల్లా ఆగ్నేయ నాగూర్, సికార్ ఝున్‌ఝున్, చురూ జిల్లాల్లోని కొన్ని భాగాలు ఈ ప్రదేశాన్ని వేరుచేస్తున్నాయి.

3) గంగానగర్ జిల్లా, బికనీరు జిల్లాలుగుండా రాజస్థాన్ కాలువ (ఇప్పుడు ఇందిరాగాంధీ కెనాల్) ప్రవహిస్తుంది.

4) ఉదయపూర్ జిల్లా మొత్తం, పాలి, సిరోహి, దుంగర్‌పూర్ జిల్లాల భాగాలు ఆరావళీ పర్వతశ్రేణిలో ఇమిడి ఉన్నాయి.

5) తూర్పువిభాగంలో జైపూర్, అజ్మీర్, సవాయ్ మధోపూర్, భిల్వారా, బుండి, ఆల్వార్, భరత్‌పూర్ కోటా జిల్లాలో కొంతభాగం చేరివున్నాయి.

6) బన్స్‌వారా, చితోర్‌ఘర్, ఝలవార్, కోటజిల్లాలో కొంతభాగం, రాష్ట్ర ఈశాన్య ప్రాంతంగా ఏర్పడివున్నాయి. కొండచరియలను ఒరుసుకుని ప్రవహించే చంబల్‌నదీ ప్రవాహము నత ఉపనదులతో భూమిని సారవంతంచేస్తూ సస్యశ్యామలం చేస్తున్నది. చంబల్‌నదీ పరీవాహక ప్రాంతమంతా చంబల్‌లోయను ఏర్పరుస్తూ మధ్య ప్రదేశ్‌కి రాజస్థాన్ రాష్ట్రాల మధ్య సరిహద్దు రేఖను గీస్తుంది.

సంగ్రహంగా రాష్ట్ర చరిత్ర :

స్థానికంగా ఉన్న పూర్వపు చిన్నరాజ్యాలు, సంస్థానాలు అన్నీ కలగలిపితే ఏర్పడింది రాజస్థాన్ రాష్ట్రం. ప్రస్తుత స్వరూపానికి రావటానికి మొట్టమొదట ఎనిమిది సంవత్సరాలు పట్టింది. పూర్వం మత్స్యదేశంగా పేర్కొనబడినట్టిది. మొదటి విడతగా 1948 సంవత్సరం మార్చి 17న నాలుగు రాజ పరగణాలు ఆల్వార్, భరత్‌పూర్, ధోల్‌పూర్, కణాలి అనేవాటిని విలీనం చేశారు. రెండవవిడతగా మరి 9 రాజ పరగణాలు మార్చి 25 తేదీన అదేనెలలో విలీనం చేశారు. మూడవ అంచెలో ఉదయపూర్ ఏప్రిల్ 18, 1948లో ప్రైవాటికి జత కలిపారు. 1949లో బికనీర్, జైపూర్, జైసల్మేరు, జోధ్‌పూర్‌ను రెండంచెలుగా కలిపి, తరువాత మరల 1950, జనవరి 25 సిరోహికలిపి గ్రేటర్‌రాజస్థాన్‌గా మలచబడింది. చివరిఅంచెలోరాష్ట్రాలపునర్విభజనలో పనిగా 1956, నవంబరు 1కి, అజ్మీర్, ఆబూతహసీల్, సునేల్‌తుప్ప కలిపి గ్రేటర్ రాజస్థాన్ పేరుపోయి సాదాసీదాగా రాజస్థాన్ అనేపేరు మాత్రం స్థిరపడింది.

ఈ రాష్ట్రం పాలనాపరంగా శాసనసభ ఒకటిగానే ఉండి 27 జిల్లాలుగా విభజించబడింది. అవి వరుసగా.

అజ్మీర్, ఆల్వార్, బన్స్‌వారా, బార్మేర్, భరత్‌పూర్, భిల్వారా, బికనీర్, బుండి, చితోర్‌ఘర్, చురు, దుంగర్‌పూర్, గంగానగర్, జైపూరు, జైసల్మేర్, జాలోగర్, ఝల్వార్, ఝుంఝును, జోధ్‌పూర్, కోట, నాగేర్, పాలి, యస్.మధోపూర్, సికార్, సిరోహి, టోన్క్, ఉదయపూర్, ధోల్పూర్.

రాష్ట్రం చాలాభాగం ఎడారి ఆక్రమించివున్నా భారతదేశంలో చాలా రాష్ట్రాల మాదిరిగానే ఇక్కడకూడా వ్యవసాయం ముఖ్య వృత్తిగా జన జీవనోపాధి. జొన్న

మొక్కజొన్న, గోధుమ, నూనెగింజలు, ప్రత్తి, చెరకు, పప్పుధాన్యాలు ముఖ్య పంటలు. పారిశ్రామికంగా వస్త్రాలు, రగ్గులు, ఉన్నిదుస్తులు, చక్కెర, సిమెంటు, గాజు, సోడియం, ఆక్సిజన్, అసిటైలిను యూనిట్లు మరియు పెస్టిసైడ్స్, ఇన్‌సెక్టిసైడ్స్, డైస్ మొదలయినవి ముఖ్య పరిశ్రమలుగా ఉన్నాయి. ఇటీవలి కాలంలో జరిగిన అభివృద్ధి పథంలో భాగంగా కొన్ని రసాయనాలు కాస్టిక్‌సోడా, కాల్సియమ్, కార్బయిడ్, నైలాన్ టైర్‌కోర్డు, కాపర్ స్మెల్టింగ్ మొదలయినవి నూతన ఆవిర్భావ తయారీలు. వీటన్నిటికీతోడు హస్తకళా నైపుణ్యాన్ని వెలార్చే పాలరాతి పనితనం, ఉన్ని తివాసీలు, నగిషీల నగలు, ఎంబ్రాయిడరీలు, చర్మవస్తువులు, ఇత్తడి సామాగ్రి వారి పనితనానికి మచ్చు తునకలుగా కళాఖండాలై ప్రపంచ ప్రసిద్ధి పొందాయి.

అసలే రాజులకు ఆలయం- కాని రాళ్ళు, గుట్టలు, కొండలు, ఎడారి అడవులు గలిగి అనేక వైవిధ్యాలు ఒక్కచోట కలగూరగంపగా కలబోసినట్లున్న ఈ వింత ప్రదేశంలో సాహసమే ఊపిరిగా బ్రతికే ప్రజలు ఆత్మవిశ్వాసం మెండుగా దండిగా నెలకొన్న జాతిగా అనేక అద్భుతాల కలయికగా రూపొందింది. వారి కళాభిరుచి, రాజసం, ఠీవి ప్రతిచోటా ప్రస్ఫుటిస్తుంది ఈ నేలకు గర్వకారణమైన పురాతన చరిత్ర, చారిత్రిక ప్రాధాన్యతగల కోటలు, ప్రాసాదాలు మనకు ఆశ్చర్యానందాల్తో ఉద్వేగ భరితం చేస్తాయనటంలో సందేహం లేదు.

## యాత్రిక ఆకర్షణలు :

ప్రతిచోటా ఒక కోట, ఉద్యానవనాలు, రాజరికం పుట్టిపడేట్లుగా కనువిందు చేస్తాయి- చరిత్రను కథలు కథలుగా చెప్తాయి. రాజపుత్రుల రణధీరత్వాన్ని రాణివాసపు స్త్రీల పతివ్రతాత్వమును చాటిచెప్పే ఎన్నో కథలు, గాథలు, నెత్తురోడించే సాహస విక్రమాలు అంతులేని ఉద్వేగమును కల్గించి ఆనంద మందిరం చేస్తాయి. ప్రాచీన కళాసంపదలు చాలా మొగలాయి దండయాత్రల్లో విధ్వంసానికి గురికాగా అక్కడక్కడా కొన్ని అవశేషాలు మిగిలి వున్నాయి. 10, 15 శతాబ్దాలనాటి జైనాలయాలు, హిందూ దేవళాలతోపాటు మొగలు కాలాల్లో జరిగే సంతలు, పండుగలు, పర్వాలు సహజసిద్ధమైన జాతీయ దేశీతత్వాన్ని సంతరించుకుని ప్రత్యేక తరహా వైభవాలతో కనువిందు చేస్తాయి. ఆగస్టు, సెప్టెంబరు మాసాల్లో జరిగే పంటల పండుగ, పుష్కరీ పశువుల సంత చాలా బ్రహ్మాండంగా వుంటాయి. వర్షాకాలంలో రాజస్థాన్‌లోని సరోవరాలు, జలాశయాలు నీటితో నిండి మనోహరంగా కనబడతాయి.

ఇక్కడికి రావటానికి ఒక ప్రత్యేకమయిన రైలుబండి 'పాలెస్ ఆన్ వీల్స్' వారాంతంలో విహార యాత్రల నిర్వహణలో ఉపయోగపడుతుంది. ఢిల్లీ నుండి బయలు దేరుతుంది ఈ ప్రత్యేక రైలుబండి. మహారాజుల కోసం నిర్మించబడిన వైభవం, రాజసం ఉట్టిపడే విధంగా రైలు పెట్టెల అమరిక ఉంటుంది. భోజన సదుపాయం కూడా ఇందులోనే ఉంటుంది. ప్రయాణపు ఖర్చుకూడా కాస్త రాజుల ఖజానాకు తగినట్లుగా వుంటుంది.

మంచి చక్కటి నిర్వహణలో బస్సు సౌకర్యం వుంది. రిజర్వేషనులో బస్సు టిక్కెట్లు పొందటం ఎంతయినా సౌకర్యంగా వుంటుంది. ముందుగా రాష్ట్ర రాజధాని అయిన జైపూరు పట్టణాన్ని చూద్దాం

## జైపూరు

రాజస్థాన్ ముఖ్య పట్టణం. బహు సుందరమైనది. జనాభా సుమారు 6, 50, 000 పైగా. ఢిల్లీ నగరం నుండి 307 కి. మీ. దూరం. విమాన సౌకర్యం, రైలు, బస్సు సౌకర్యాలున్నాయి చేరటానికి. పురాతనమైన భాగం పాతనగరం. చుట్టూ గోడలు అనేక యుద్ధాలకు గురైన చిహ్నాలు ఇంకా మాసిపోకుండా గుర్తు చేస్తున్నాయి. లోపలగల చిన్న కొండలు, గుట్టలమీద అనేక కోటలు, బురుజులు దర్శనమిస్తాయి. దేశం మొత్తం మీద **PINK CITY** గా ప్రసిద్ధి.

ఈ నగర నిర్మాణం మహారాజా సవాయిజైసింగ్‌చే 17-18 వ శతాబ్దాలో నిర్మించబడింది. ఈయన స్వతహాగా మంచి జ్యోతిష్కులు. ఖగోళశాస్త్రం క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారు. ప్రపంచంలోని ఇతర యూరోపా పట్టణ నిర్మాణపు తీరుతెన్నులను పరికించి, పరిశీలించి వాటిని మన పురాతన శిల్ప శాస్త్రరీతుల్లో మిళాయించి నగర నిర్మాణం చేసిన ఘనుడీయన. నగరమంతా విశాలమైన రహదారులతో భవనాలు సైతం ఒక పద్ధతి ప్రకారం నిర్మింపజేశారు.

అయితే నగరంలో రోజారంగుకు అంకురార్పణ 1875లో విక్టోరియా మహారాణి పుత్రులైన ప్రిన్స్ ఆల్బర్ట్ నగర సందర్శనానికి వచ్చిన సందర్భంలో మెయిన్ బజారు అంతా 'పింక్ కలర్'తో ప్రకాశింపజేశారు. తరువాత మిగతా పట్టణ భవనాలు కూడా రోజా రంగుకే ప్రాధాన్యం యిచ్చి—నగరమంతా రోజారంగుతో శోభితేట్టు చేయటం జరిగింది.

జైపూరు నగర విశాలమైన వీధులు అనేక కళాఖండాలు-హస్తకళల ప్రాచుర్యాన్ని వెలువర్చే పాలరాతి బొమ్మలు, విలువైన ఆభరణాలు, వివిధ రకాలైన మృణ్మయ పాత్రలు, దంతపు సామాగ్రి, చందనంతో చేయబడిన నగిషీల వస్తువులు, పువ్వులు వేసి తయారు చేసిన పాదరక్షలు వగయిరాలు ప్రత్యేక ఆకర్షణలతో విలసిల్లే విపణి వీధులు.

## నగర ప్రాసాదం : (THE CITYPALACE)

నగరానికి గుండెకాయ. నగర వైశాల్యం మొత్తంలో దాదాపు ఏడవ వంతుని ఆక్రమిస్తుంది. ప్రవేశద్వారాలు అనేకం. త్రిపోలియా ద్వారం రాజవీధిని వెలారుస్తూ భవన ప్రాంగణంలోకి దారి తీస్తుంది. మొట్టమొదటగా దర్శనీయమైనది మహారాజా మాధోసింగ్‌చే నిర్మితమైన ముబారక్ మహల్. హిందూ శిల్ప చాతుర్యానికి తార్కాణం. అద్భుతమైనదిగా కొనియాడబడింది. ఇది ఒకానొకప్పుడు రాజావారి దర్బారు హాలట. త్రిపోలియా ప్రవేశద్వారం దగ్గరనే అవరిన గొప్ప స్తంభం 'ఈశ్వరి మినార్ స్వర్గసూల్' అంబరాన్ని చుంబించే విధంగా నిర్మించబడినది తరువాత భవనాలు దివాన్-ఇ-ఖాస్, దివాన్-ఇ-అమ్. దివాన్-ఇ-అమ్‌లో అనేక అలంకరణలతో పాటు, పర్షియన్, సంస్కృత భాషల్లోని వ్రాతప్రతులు దర్శనీయంగా అమర్చబడి ఉన్నాయి. వీనిలో అబుల్ ఫజల్ మహా భారతానువాదం వ్రాతప్రతులు ప్రత్యేకం. దివాన్-ఇ-ఖాస్ రాజావారు అంతరంగికులతో ఇష్టాగోష్ఠి ముచ్చటలు సలిపే భవనం. ఇక్కడ ఒక గడియారం స్తంభం పాలరాతితో నిర్మించబడిన గాలరీ దర్శనీయాలు. భవనం వెలుపల పూర్వపు మహారాజావారు ఇంగ్లండు మొదలైన ఐరోపా దేశాల పర్యటనకు వెళ్ళినప్పుడు త్రాగేనీరు ఇక్కడినుండే తీసుకుని వెళ్ళేవారట. అందుకు ఆయన ఉపయోగించిన పెద్ద రజిత పాత్ర వుంది. ఆయన ఇంగ్లీషు నీరు త్రాగేవారు కారట. హిందూ దేశమును అమితంగా ప్రేమించేవారు. హిందూ నీటినే త్రాగేవారట.

## చంద్ర మహల్ :

తరువాత మకుటాయమానంగా సాక్షాత్కరించేది అక్షరాలా స్నిగ్ధసౌధము. ఏడంతస్తులతో నిర్మించబడింది. ఈ భవనం మీదకు ఎక్కితే జైపూర్ మొత్తాన్ని పానోరమిగా చూడవచ్చు. దాంతోపాటు పూర్వపు రాజధాని 11 కి. మీ. దూరంలో ఉన్న అంబర్ పట్టణాన్ని కూడా చూడగలం.

చంద్రమహల్‌కి ఉత్తరంగా గోవింద్ దేవ్‌జీ ఆలయంగా ప్రసిద్ధి చెందిన కృష్ణాలయం ఉంది. ఔరంగజేబు ఛాందసత్వానికి బలికాకుండా మధురలో ఉన్న కృష్ణస్వామి విగ్రహాన్ని ఇక్కడికి భద్రంగా చేర్చారని ప్రతీతి. నగర ప్రజలు విశేషంగా దర్శిస్తుంటారు.

చంద్రమహల్‌కి బాదల్ మహల్‌కి మధ్యన సుందరోద్యానాలు కమనీయం.

భవనాంతర్భాగంలో అమరిన 'శిలేఖానా' పూర్వపు ఆ రాజులుపయోగించిన ఆయుధ విశేషాలు-రకరకాల నగిషీలతో పొదగబడిన కరవాలాలు, పిడిబాకులు, అరుదైన విచిత్రములుగా దర్శనీయం.

**జంతర్ మంతర్ :**

నక్షత్ర గణితశాల. (ఇలాటివే మరి నాలుగు కాశీ, ఢిల్లీ, మథుర, ఉజ్జయిన్ లలో ఇక్కడి జంతర్ మంతర్ నిర్మాత అయిన రెండవ సవాయ్ రాజా జయసింగే నిర్మించారు) నగర ప్రాసాదానికి అతి చేరువలోనే ఉన్న త్రిపోలియా స్క్వేర్‌లో నిర్మించబడింది. ఇది ప్రపంచంలోని ఎనిమిదవ వింతగా చెప్పుకుంటూండేవారు. ప్రిన్స్ ఆఫ్ దయిల్స్‌గా అభివర్ణించబడే దీని ఎత్తు 90 అడుగులు, 147 అ. పొడవాటి ప్లాటు ఫారమ్మీద నిర్మించబడింది. ప్రపంచంలో దీనికిదేసాటిగా చెప్పుకోవచ్చు ఇక్కడి ఉపకరణాలతో ఖగోళ సంబంధమైన గణితాలు ఖచ్చితంగా సాధించటానికి ఎంతో ఉపయుక్తమైనవిగా పేర్కొనబడ్డాయి. గుండ్రంగా, వర్తులాకారంలో ఉన్న గోడల్లో అమరిన మెట్లు ఉత్తర ధృవతార దిశను నిగిడించి చూపునట్లుగా అమర్చబడ్డాయి.

**రామ్‌బాగ్ ప్రాసాదం :**

ఒకనాటి రాజకుటుంబీకులకు వారి, ముఖ్య అతిథులకు విశ్రాంతి గృహంగా వాడబడింది. ఈనాడొక పెద్ద హోటలు. శిల్ప కళామయం. పెద్ద పెద్ద హాల్పు, విలాసవంతంగా అలంకరించబడిన గదులు- విందు వినోదాల ఆహ్వాన వేదికలు రమణీయంగా ఏర్పరచబడ్డాయి.

**రామ్‌ని వాస్ గార్డెన్ — మ్యూజియం :**

70 ఎకరాల వైశాల్యంలో 1968లో వ్యవస్థీకరించబడిన జంతు, పక్షి విభాగాలతో అలరారుతుంది. మంచి కాలక్షేపం. పిల్లలకు, పెద్దలకు అహ్లాద విశేషాలెన్నో ఉన్న మహోద్యానవనం.

సెంట్రల్ మ్యూజియం :

రాజస్థాన్‌లో అన్ని కేంద్రాలనుండి సేకరించబడిన వివిధ రకాలయిన కళా ఖండాలు, చిత్రపటాలు, దంతంతో చేయబడిన నగిషీల విశేషాలు, ఆభరణ విశేషాలు మృణ్మయ పాత్రలు, లోహ పాత్రలు రకరకాల నగిషీలు పొందుపరచబడిన పురాతన వైభవాన్ని కండ్లకు కట్టినట్లుగా చూపే వస్తు విశేషాలు-ఆయుధాలు-వివిధ కాలాలకు చెందినవి, శిల్ప విశేషాలు, ఎన్నెన్నో వున్నాయి. ఇందులో జైపూరును పాలించిన మహారాజుల వివిధ వంశాలవారి చిత్రపటాలు, వారు ధరించిన ఆభరణ విశేషాలు, వస్త్రాలంకారములు ప్రత్యేకంగా సేకరించబడి ప్రదర్శనా యోగ్యంగా భద్రపరచ బడ్డాయి. రమారమి 1833లో మొదలయిన సేకరణ ఇత్తడి పాత్రలు, కంచు పాత్రలు కొనియాడదగినాయి. సోమవారాలు ఉచిత ప్రదర్శన. మిగతా రోజుల్లో ఉదయం 10 గం. నుండి 5 గం. వరకు దర్శనీయం. శుక్రవారం సెలవు. టిక్కెట్టు 1 రూపాయి. దీన్నే ఆల్బర్ట్ మ్యూజియం అని కూడా అంటారు.

మ్యూజియం, జూలకు ప్రక్కనే ఆధునిక లలిత కళాకేంద్రంగా చెప్పుకోదగిన మంచి థియేటర్ కూడా ఉంది. అనతి దూరంలోనే ఉన్నది 18. A. శివ్ మార్గంలో ఉన్న కృపాల్ కుంభ్‌ని కూడా చూడవచ్చు. ఇక్కడ జైపూరులో ప్రసిద్ధి చెందిన నీలం రంగు మట్టిపాత్రలు విశేషంగా తయారుచేసే చోటు.

హవామహల్ :

జైపూరు వచ్చినవారు ఇది చూడకపోతే జైపూరును చూచినట్లు గాదు. దీని పేరే 'సమీర మందిరం' అని అర్థం వచ్చేది. మహారాజా సవాయి ప్రతాప్‌సింగ్ 1799లో నిర్మించిన అయిదు అంతస్థుల రాజభవనం. వంకులొంకులుగాతీరిన పైకప్పులు పాతనగర మెయిన్‌రోడ్‌లో సమున్నతంగా నిలిచిన భవనరాజం-రాజభవనం. ఎర్ర కారు రాయితో నిర్మించబడింది. రోజారంగు పులమబడినట్లున్న ఈ రాయితో ఏర్పాటు చేయబడిన కిటికీలు, గవాక్షాలు ప్రత్యేకంగా చల్లని గాలి వీచటానికి అనువుగా తేనె పట్టు రంధ్రాలతో అర్ధాష్ట భుజాకారంలో ఏర్పరచబడ్డాయి. రాణివాసపు స్త్రీలు అక్కడ నుంచి నగరశోభను, రాజ వీధిలో జరిగే విశేషాలను ఔత్సుక్యంగా వీక్షించ టానికి అనువుగా వుండేది. పైకి పూర్తిగా ఎక్కితే శోభాయమానమైన నగర దృశ్యం కన్నుల పండుగగా చూడగలం. క్రింద విశాలమైన నగర ప్రధాన రాజవీధి ఎడారి ఓడల (ఒంటెల) బండ్లు, సవారీలు నేత్ర పర్వం చేస్తాయి. రాజస్థాన్ భూభాగం

అంతా చాలా వరకు థార్ ఎడారి మింగివేసింది కాబట్టి ఈ ఒంటెల అవశ్యకత ఎడారి ప్రయాణానికి ఎంతో అవశ్యకం. ఐదంతస్తుల అందాల భవనం చూడటానికి ఒక్క రూపాయి టిక్కెట్టుంటే చాలా చౌకే.

ఈ నగరంలో ఇతరంగా చూడదగినవి :

మాధవబిహార్ మందిరం. గోముఖం నుండి నీటియూట పడే గల్తాగాట్, జైపూర్ రాజుల సమాధి స్థలాలు, సవాయి ఈశ్వరసింగు గారు 1709లో నిర్మించిన 'ఈశ్వర్‌లాల్' నాలుగు రోడ్లకూడలి సాంగ్నియో – కి చోపార్ అనే మానక్ చౌక్.

జైపూర్‌లో సైకిలు రిషాలు గురించి జాగ్రత్తగా వుండాలి. లేకపోతే వాళ్ళకు ఇష్టమై, కమీషనులు ఎక్కువగా ఇచ్చే హోటళ్ళకు లాక్కెళ్ళి పడేస్తారు. వుండటానికి చౌకలో 'ది జైపూర్ ఇన్' బనీపార్కులో వున్నది. సామాన్యులకు అందుబాటులో వున్నది. 15 రు. లకు పడక సౌకర్యం, రూములు రోజుకు రు. 35/– నుండి 50 రు. వరకు మంచివే దొరుకుతాయి.

ప్రభుత్వం వారు నిర్వహించే 'స్వాగతం టూరిస్టు బంగళా' రు. 40/– డబుల్ రూమ్‌లు అటాచ్‌డ్‌బాత్ రూములతో దొరుకుతాయి. రు. 12/– పడక సౌకర్యం దొరుకుతుంది. రైలుస్టేషనుకు దగ్గరిలో అందికలో వున్నది.

ఇంకా దిగువకు వెళితే క్వాలిటీ రెస్టారెంటు, ఎవర్‌గ్రీన్ రెస్టుహౌస్, ఎవర్ హాపీ గెస్టుహౌస్, మిల్కీవే కెఫే. M.I. రోడ్‌లోని టూరిస్టు హోటలు, తీజ్ టూరిస్టు బంగ్లా, బస్సుస్టాండు మార్గంలోని హోటల్ అస్సామ్, హోటల్ రాజధాని (రైల్వే స్టేషను దగ్గర) మరికొన్ని.

కొంచం ఖరీదు పెట్టగలిగే వారికి హోటల్ చంద్రలోక్, బనీపార్కు దగ్గర హోటల్ రాజ్ మొదలయినవి చౌకలో. ఇంకా చౌకలో సరిపుచ్చుకునే వారికి యూత్ హాస్టలు–అయితే చాలా దూరం. పోతే రైలు ప్రయాణికులకు రైల్వే రిటయింగ్ రూములు చెప్పనే అక్కరలేదు.

మధ్య తరగతి మరియు శ్రీమంతులకు

గంగౌర్ టూరిస్టు బంగ్లా, తీజ్ టూరిస్టు బంగ్లా. హోటల్ ఆర్యనివాస్, ఖాసా కోఠి, హోటల్ బస్సావు ప్యాలెస్, క్షేత్రిహౌస్ హోటల్, హోటల్ ఇంపీరియల్,

బస్టాండు దగ్గరలో వున్న హోటల్ షాలిమార్, హోటల్ మంగళ్ మొదలయినవి రోజుకి 100/– పైగా చెల్లించగల వారికి.

మరింత ఎక్కువలో శ్రీమంతులకు మాత్రం- రామ్‌బాగ్ ప్యాలెస్, రాజమహల్ ప్యాలెస్ హోటలు, వెల్‌కం హోటల్ మాన్‌సింగ్, హోటల్‌జైపూర్ అశోక, హోటల్ క్లార్క్స్ అమెర్ మొదలయినవి రోజుకి కనీసం రు. 450/- నుండి 700/– వరకు వెచ్చించగలిగే వారికి మాత్రం ప్రత్యేకం. జైపూర్‌కి అనతి దూరంలోనే వున్న చారిత్రిక ప్రసిద్ధి చెందిన అంబర్ చూడదగినది.

**అంబర్ :**

అంబర్ అనే పేరు ఎలా వచ్చింది- దీనికి రెండు మూడు సార్ధక్యాలు వినికిడిలో వున్నాయి. అమీర్ నుంచి వచ్చిందనీ, పార్వతీదేవి పేరయిన 'అంబ' నుంచి వచ్చిందనీ, మరో కథనం ప్రకారం రామాయణంలోని శ్రీరామచంద్ర ప్రభువు చిన్న కుమారుడైన కుశుని వంశ సంజాతులైన కచ్ఛవుల వంశీయుడైన అయోధ్యరాజుగా పాలించిన అంబికేశ్వరుని పేరుమీద వచ్చిందనీ అంటారు. ఏది ఏమయినా ఈ పేరుని పైన చెప్పిన కారణాలన్నీ సార్థకం చేస్తూనే వున్నాయి. దానికితోడు స్థలం చాలా పురాతనమైనదని, పురాణ ప్రసిద్ధినీ తెలియజేస్తుం దనటంలో సందేహం లేదు.

రాజస్థాన్‌లో ముఖ్యమైన ఆకర్షణల్లో చెప్పుకోదగింది అంబర్‌కోట. జైపూర్ వెలవకముందు కొన్ని శతాబ్దాల పర్యంతం రాష్ట్ర ముఖ్య ప్రాంతానికి రాజధానిగా శోభిల్లింది.

కోట ఒక చక్కని లేతగులాబీ రంగు గల పర్వతంమీద నిర్మించబడింది. అనేక ప్రత్యేకతలు—ఆకర్షనీయమైన విశేషాలను పొదువుకొని ఉన్నది. దక్షిణంగాజయగర్, పడమటి వైపున సమున్నతంగా కుంతలఘర్ వున్నది. దీని నిర్మాణం వేయి సంవత్సరాలకు పూర్వమే జరిగిందని ప్రతీతి. ఈ ప్రాంతాన్ని రాజ పుత్రులకు పూర్వం ఈ ప్రాంతాన్ని పాలించిన మినారాజుల కాలంలో నిర్మించబడిందట. కోటను చుట్టూ పరిక్రమించిన గోడలు కోటకు కొండచిలువ చుట్టినట్లుగా ఉంటుంది. గోడల వెంటనే ఒక బ్రహ్మాండమైన పాలరాతి భవనం. చిన్న చిన్న అద్దాలు పొదగబడి వింత కాంతులను విరజిమ్ముతూంది.

ఇక్కడే సవాయి జైసింగు వారి ప్రధాన స్థపతి పేరట ఏర్పరచబడిన దిలారామ్ ఉద్యానవనం చూడగలం. నడిచి వెళ్ళినా వెళ్ళవచ్చు. లేదా ఏనుగు అంబారీ మీద వెళ్ళవచ్చు. ఎప్పుడూ సిద్ధంగా ఉంటుందొక ఏనుగు అక్కడ.

పైకి వెళితే మోహన్‌బారి అనే వనం మహోటా సరస్సు తీరంలో వున్నది. ఒక మూలగా పైకెక్కటానికి మెట్లున్నాయి. భవనానికి మొత్తంమీద మూడు ద్వారాలున్నాయి. మెట్లమీదుగా వెళితే 'కాళికాలయం' ఒకటుంది. దీన్నే 'శిలాదేవి' ఆలయం అని కూడా అంటారు. తరువాత తెల్లపాలరాతి స్థంభాలతో చక్కని పైకప్పుతో ఒక పెద్ద మండపం వుంది. ఇది దీవాన్-ఇ-అమ్. ఇక్కడకు చేరి చూస్తే నగరమంతా శోభాయమానంగా కనబడుతుంది.

దక్షిణాన ఉన్న ద్వారము ప్రపంచంలో పేరెన్నికగన్న వాటిలో ఒకటిగా వర్ణించబడింది ఆంగ్లేయులైన ఫెర్గుసన్ గారిచే.

**జయమందిరం :**

పూర్తిగా తెల్లటి పాలుగారే పాలరాతితో నిర్మించబడింది. గోడలమీద చిత్ర విచిత్రాలైన నగిషీలు పొందుపరచబడ్డాయి. క్రిందనేల ప్రత్యేకంగా మొజాయిక్ ఫ్లోరింగ్‌తో బహు రమణీయంగా వుంటుంది. ఏది ఎలావున్నా అంబరు తప్పనిసరిగా చూడదగినది. చుట్టుపట్ల వున్న శిలలు, శిల్పాలు పుంఖానుపుంఖాలుగా వీరకథలను వల్లిస్తాయి. చరిత్రలో మాసిపోలేని ఘట్టాలెన్నో. ఇక్కడికి వచ్చి ఈ ప్రాంత దర్శనం ఒక దివ్యానుభూతి అని చెప్పవచ్చు.

## జైపూరు చుట్టుప్రక్కల చూడదగినవి

**నహారగర్ కోట :**

6 కి.మీ. దూరం. రెండంతస్థులుగా కట్టబడిన కోట. చుట్టూ పరచుకుని ఉన్న గుర్రపుడెక్క ఆకారంలో అమరియున్న పర్వతశ్రేణి మధ్యలో సమున్నతంగా నిలబడింది కోట. చక్కని రూములు ఆసక్తి రేకెత్తించే చిత్రవర్ణ చిత్రాలు, రంగుల్లో ఎంతో ఆధునికత సంతరించుకుని ఆహ్వానిస్తుంటాయి.

దగ్గరిలోనే గాయిటర్ లోయలో విఘ్నేశ్వర స్వామికి చక్కని దేవాలయం వుంది చూడవచ్చు. దీనికితోడు జయ్‌పూర్‌ని పాలించిన రాజుల సమాధులు కూడా చూడగలం.

**సిసోడియా రాణి ఉద్యానవనం, రాజ ప్రాసాదం :**

జయపూర్-ఆగ్రారోడ్‌లో 10 కి.మీ. దూరంలో వున్నది. ఒక కొండకొమ్మున పెద్దతోట, భవనం అమరియున్నవి కనబడతాయి. కొండవాలులో శ్రీమహావిష్ణు, శివుడు

రామభక్తి హనుమాన్ దేవాలయాలున్నాయి. దగ్గరిలోనే వ్యాధి నివారకమైన పావన జలాల ఊటలున్నాయి. స్నానం చేస్తే మంచి ఆరోగ్యకరం.

సంగనేర్ :

ఎత్తైన చెట్టు. పట్టణం వునికిని కప్పేస్తుంటే జైపూరుకి దక్షిణాన 11 కి.మీ. దూరంలో అమరియున్నది. ఇక్కడొక ప్రసిద్ధ జైన దేవాలయం వుంది. ప్రతిఇల్లూ ఒక కలంకారిపరిశ్రమ. వస్త్రాలకు రంగులు అద్దటంలోను, చిత్రవిత్రాలైన డిజైనులు ప్రింట్సులో అందవేసిన వారు అందరూ కూడా చాలా కష్టించి పని చేసేవారు.

గాల్టా :

పట్టణానికి తూర్పు దిశన కొండమీద సూర్యదేవాలయం వుంది. గాల్టా పర్వతలోయను నిక్కి చూస్తుంది. 1500 సంవత్సరాల క్రితం జీవించి గణుతకెక్కిన గాలవ మహర్షి ఇక్కడ సంచరించాడట.

## ఉ ద య పూ ర్

బహూ అందమైన పట్టణాల్లో ఒకటిగా ప్రపంచమంతా కొనియాడింది. ఏ చిత్రాలు గాని, ఫొటోలుగాని ఉదయపూర్ అందాలను ఒకచోట గుదిగుచ్చి బంధించ లేక పోయామంటే అతిశయోక్తికాదు. దేనికదేసాటి. ఎవరయినా ఒకసారి కనులారా గాంచనిదే వర్ణన అసాధ్యము.

ఉదయపూర్ అనంత సాహసిక గాథలకు ఊపిరివంటిది. ఈ పట్టణనిర్మాణం మహారాణా ఉదయ్‌సింగ్ 1559 లో నిర్మింప జేశారు. ఢిల్లీ నుంచి దాదాపు 786 కి.మీ. దూరం. రోడ్డు, రైలు, ఆకాశ మార్గాలున్నాయి ఇక్కడికి చేరటానికి. మహా సాహసులు, ప్రతాపుడు, అమేయశక్తి సంపన్నులు అయిన ఉదయపూరు మహారాణాలు రఘుకులాన్వయ రత్నదీపమైన రఘురాముని పెద్ద కుమారుడైన లవుడు మూల పురుషుడుగా వెలయించినవాడట అసలైన సూర్యవంశ సంజాతులని ప్రతీతి. వారి శక్తి సామర్థ్యాలు అడుగడుగునా ప్రతిబింబించేట్లు, అమేయమైన పురాణ ప్రశస్త ప్రసక్తికి మొక్కవోక దీటు రాగలిగినదిగా 'సరోవరాల నగరం', 'బాలభానుని ఉదయ కిరణాల వెలుగులను పొదివి పట్టుకున్న నగరం' 'నిశ్చల ప్రశాంత వన భూమి'గాను కొనియాడబడింది నగరం. ఈ నగర శోభతో, అందాల భవనాలను, ప్రాసాదాలను తనివిదీరచూచి ప్రాచీన కళావైభవాస్వాదనలో మునిగి తేలుదాం— ఒక్కసారి రండి.

నగర ప్రాసాదం (THE CITY PALACE) :

పిఛోల సరస్తీరంలో సమున్నతంగా ఉన్న తూర్పుదిశన అమరియున్న రాజ ప్రాసాద భవన సముదాయంగా చెప్పుకోవచ్చు. ఒకటికాదు అనేక భవనాల కలయిక. అన్నీ ఒక తీరుతెన్నులో అమర్చబడినవిగా కనబడటం ఒక విశేషమేమరి. రాజసం ఉట్టిపడే ఒక రాజభవనం 1500 అడుగుల పొడవు, 800 అడుగుల వెడల్పుగల అతి విశాలమైనది. నిర్మాణంలో పొందుపరచబడిన విశిష్టత వలన అదేమాదిరిగా మరెన్నో యితర భవనాలను పెంచి కట్టడానికి వినియోగపడిందని అంటారు. ఒక్కో పాలకుడు, ఒక్కో మహారాణా ఒక్కొక్కటిగా అనేక విధాల అభివృద్ధి చేయటం జరిగింది. కొత్తవి ప్రక్కనే నిర్మించటమూ జరిగింది.

ప్రవేశద్వారం 'త్రిపోలియా' అని పిలవబడే ఎనిమిది ఆర్చిలుదించి ఇక్కడే మహారాణా వారు బంగారంతోను, వెండితోను తులాభారాలు తూగి ఆ విలువైనలోహం కానుకలుగా ప్రజలందరికీ పంచిపెట్టేవారట.

లోపల 'రాయ్ ఆంగమ్' అనే భవనం ఒకటుంది. రాణాప్రతాపుడు పోరాడిన యుద్ధం దృశ్యాలు అనేకం చిత్రించి వారి నిర్మాణాన్ని కూడా చక్కగా చిత్రీకరింప జేశారట, నిర్మాణ నిర్మాత మహారాణా ఉదయ్‌సింగ్.

బడే మహల్ :

దీన్నే గార్డెన్ ప్యాలెస్ అనికూడా అంటారు. దాదాపు 90 అడుగుల ఎత్తున ఒక చక్కని ఉద్యానవనంలో అమరిన అందాల భవనరాజం, రాజభవనం. ఒకే రాతిలో మలచిన రెండు పెద్ద పాలరాతి తొట్లు కూడా మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. దిల్‌కుష్ మహల్ మహదానందాన్ని కలిగించి హృదయమంతా సంతోషంతో నిండిపోయే ఆహ్లాదకరమైనది. రాకుమారి రాణీ కృష్ణకుమారి మహారాణా భీమ్‌సింగ్ ముద్దులతనయ. ఇద్దరు వీరులు ఆమెని చేపట్టాలని పంతం పట్టారు. కాని వారిద్దరి మధ్యా రేగిన మచ్చరం కలహం చూడలేక యువరాణీ ఆత్మాహుతి చేసికొన్నదిట. ఆమె పేరన వెలసినదే కృష్ణమహల్. ఇంకా చూడదగినవి చిత్రశాల, ప్రియాత్మ విలాస్, మాణిక్య మహల్ దర్శనీయాలు.

భవనంలోని చాలా భాగంలో పురాతన వస్తువులు భద్రంచేసి మ్యూజియంగా ఏర్పాటు చేశారు. అందులో పురాతన నాణేలు, వివిధ రకాలైన వస్త్రాలు, ఉడుపులు, చిత్రపటాలు వగయిరా చూడవచ్చు.

పిఛోలా సరస్సు-దీవి భవనాలు :

పిఛోలా సరస్సులోని దీవుల్లో నగరానికి పడమర దిశగా జగ్ మందిర్, జగ్ నివాస్ వున్నాయి. తులలేని అందాల ప్రోవులు. జగ్ మందిర్ షాజహాన్ చక్రవర్తి యువరాజుగా ఉండి తన తండ్రితో విభేదించినప్పుడు ఒక సంవత్సరంపాటు ఇక్కడే వున్నారట. పెద్ద సమున్నతమైన గోపుర శిఖరం భవనానికి తలమానికం. సహజ సిద్ధమైన సెట్టింగ్ గ్లాసు మొజాయిక్స్‌తో అందాల తాజ్‌మహల్ నిర్మాణానికి ఊహలు మెదిలిన మనోహర మందిరం.

జగ్‌నివాస్ రాజసం ఉట్టిపడే మరో విలాసవంతమైన భవనరాజం. దీన్ని ప్రస్తుతం ఫైవ్‌స్టార్ డీలక్స్ హోటలుగా మార్చి, 'లేక్ ప్యాలెస్ హోటల్' గా నామకరణం చేశారు. ఉండగలిగితే ఒక రోజయినా ఉండి అందాలను తనివిదీర ఆస్వాదించవచ్చు. లేదా కనీసం ఒకసారి భోజనమైనా చేసి చుట్టూ చూడగలిగే అవకాశం కొనితెచ్చుకో గలిగితేచాలు.

జగదీశ్ ఆలయం :

శ్రీ మహావిష్ణువుకి స్థిర నివాసం కల్పించిన ఆలయరాజము. 32 మెట్లు పైకెక్కితేగాని ఆలయం చూడలేము. నీల మేఘ శ్యాముని నల్ల పాలరాతితో నిర్మించి గరుడవాహనం ఇత్తడితో నిర్మించబడిన వాటిని దర్శించవచ్చు. ఈ ఆలయంలో శిల్పాలు, చిత్రాలు, మానవజన్మ సాఫల్యాన్ని, అలౌకికానందాన్ని పొందే ఆధ్యాత్మిక చింతన ప్రోదిగా మలచిన చిరుచిరు కథామందారాలు దృశ్యాలు.

ఫతేసాగర్ సరోవరం :

నెహ్రూ ఐలండ్ పార్కు, జెట్ ఫౌంటెన్ :

1678 లో మహరాణా జైసింగ్ ఒక చిన్న తటాకాన్ని త్రవ్వించారట నిజంగా. అయితే దీన్ని మహారాణా ఫతేసింగ్ విస్తృత పరచారు. 1889 లో డ్యూక్ ఆఫ్ కన్నాట్ సరస్సీనానికి కరకట్టకు శంఖుస్థాపన చేశారు. దీనితో సరస్సీరమంతా చక్కని రోడ్డుమార్గంగా తయారయింది.

సరస్సు మధ్యలో ఒక దీవిలా ఉన్నచోట చక్కని పార్కు ఒకటి ఉంది. 'నెహ్రూ ఐలెండ్ పార్కు' దీని పేరు. చక్కని పచ్చిక బయళ్ళు ఫౌంటెన్‌లు చూత

ముచ్చటగా ఉంటుంది. మరో చిన్న దీవిలో 150 అడుగుల ఎత్తున నీటిని చిమ్మే జెట్ ఫౌంటెన్ వుంది. రంగుల విద్యుద్దీపాలతో రాత్రిళ్ళు స్వప్న జగత్తులో వింత లోక సదృశ్యంగా వుంటుంది.

రాణాప్రతాప్ స్మారకం :

ఫతేసాగర్ సరోవరాన్ని అవలోకిస్తున్నట్లుగా కనిపించే కొండ మోతిమగ్రి. మహారాణా ఉదయసింగ్ ఇక్కడికి ఈ కొండమీదికి వచ్చినప్పుడు అంకురించిన మొలకభావం ఈ సుందరనగర నిర్మాణానికి పురికొల్పిందని చెప్తారు.

ప్రస్తుతం ఈ కొండ హైందవ ధర్మరక్షణకు దీక్షాకంకణుడై మహమ్మదీయులతో రాజీలేని పోరాటం సలిపిన మహాతేజసవంతుడు, పరాక్రమ సాహసోపేతుడు అయిన మేవార్ మహారాణా ప్రతాప్‌సింగ్ సంస్మరణార్థం ఇక్కడొక కంచువిగ్రహం ప్రతిష్ఠించబడింది. ఎత్తయిన వేదికమీద రాణా తన గుర్రంమీద అధివసించిన భంగిమలో మలచబడింది విగ్రహం. ఈ గుర్రం పేరే చేతక్. ఈ ప్రాంతం నిర్మల ప్రశాంత వాతావరణంలో, దూరాన నిలిచిన పర్వతాలు, అక్కడక్కడ పరచుకుని ఉన్న చిన్ని చిన్ని సరస్సులు చూపు ఆనినంతమేర ప్రకృతి అందాలు పరవశింపజేస్తాయి.

సహేలియోంకి బాది :

సరస్సు తూర్పు తీరంలో 'కన్యావనం' (GARDEN OF MAIDS) అని ముద్దుగా పిలవబడే చక్కని ఉద్యానవనం ఉంది. యువరాణి కోసం ఎదురు చూస్తూ చెలికత్తె లందరూ గుమి గూడేవారట— ఆమె రాగానే అందరూ కలకల విరిసిన పువ్వుల్లా, పరచిన రెక్కల గువ్వల్లా కేరింతలాడుతూ సరదాగా, సంతోషంగా ఆటలాడుకుంటూ గడిపేవారట. ఈవనంలో అనేకమయినఫౌంటెన్‌లున్నాయి. సాయంకాలాల్లో ఇవన్నీ ఒక్కసారిగా పనిచేయటం మొదలయ్యేటప్పటి సన్నని నీటి తుంపరలతో చిరుజల్లుల విరిపూవులు విరిసినంత ఆనందహేల నాట్యమాడుతుంది మన హృదయాల్లో. ఒక చిన్న విశేషం— ఒకే పాలరాయితో మలచిన నాలుగు ఏనుగులు జీవచైతన్యంతో వుట్టి పడుతున్నట్లు దర్శనమిస్తాయి.

ఉదయపూర్ అనేక సరస్సులు, ఉద్యానవనాలు, చారిత్రిక అవశేషాలు, జ్ఞాపిక లతో నిండి హృదయ స్పందనను మీటే మహత్తరమైన ప్రదేశంగా చెప్పుకోవచ్చు.

## ఉదయపూర్ చుట్టు ప్రక్కల

### ఆహార్ :

ఉదయపూరుకి పూరిబయట 3 కి. మీ. దూరంలో దాదాపు 400 ఆహార్ వంశీయుల స్మారకాలున్నాయి. ఇది ఒకానొకప్పుడు అతి పురాతనమైన నగరం. ఈ స్మారక చిహ్నాలు అనేక తరాల వీరగాథలను చెప్తున్నవి. మేవారు మహారాజాల సాహస గాథలు గాలిగుసగుసలు ఇంకా వినిపిస్తున్నాయి.

### ఏక్ లింగజీ దేవాలయం :

ఉదయపూర్ నుండి 22 కి.మీ. దూరంలోని కైలాసపురి ఏకలింగ్‌జీ అధివసించిన పవిత్ర స్థలం. ఇక్కడి మూర్తి నల్లపాలరాయితో ఉన్న శివునికి నాలుగు ముఖాలున్నాయి. ఎదురుగా నందీశ్వరుడు పరిసరాల్లో మరికొన్ని దేవతా విగ్రహాలు ప్రతిష్ఠించబడి పరివేష్టించి ఉన్నాయి. వాటిలో లకులీష్ ఆలయం ఒకటి. మేవారు రాజుల కులదైవంగా నేన్నబడతాడు ఏకలింగ్‌జీ. మహారాణులంతా స్వామివారికి పరమ భక్తులు.

ఈ ఆలయానికి పడమటి దిశన మూడు కిలోమీటర్ల దూరంలో 'సాస్‌బహు' ఆలయం క్రీ. శ. పదవ శతాబ్దంలో నిర్మించబడిందని ప్రతీతి. ఎదురుగా పెద్ద సరస్సు పురాతన మేవారు రాజ్యానికి రాజధానిగా విలసిల్లిన 'నాగదా' పట్టణంగా పేర్కొన బడింది. దీని సంస్థాపకులు నాగాదిత్యుడు.

### నాథ్‌ద్వారా :

ఏకలింగనాథ్‌జీ ఆలయానికి 26 కి.మీ. ఉదయపూర్ నించి అయితే 48 కి. మీ. దూరం. 600 సంవత్సరాల క్రితం ప్రతిష్ఠించబడిన నల్ల పాలరాతితో మలచబడిన శ్రీకృష్ణుని విగ్రహం గల దేవాలయం.

మూర్తిని 1660లో మధుర వించి తెచ్చారట. తెచ్చేటప్పుడు రథం ఇక్కడికి వచ్చి ఇక కదలలేదట. అందువలన భగవానుని ఆదేశంగా స్వీకరించి ఇక్కడనే ప్రతిష్ఠించి ఆలయ నిర్మాణం జరిపించారుట. హిందూదేశంలో సంపన్నమైన దేవాలయాల్లో ఇది ఒకటిగా పేర్కొనబడింది.

### హాల్దిఘటి :

నాథ్‌ద్వారానుండి 24 కి.మీ. ఉంటుంది. గొప్ప చారిత్రక ప్రాముఖ్యం కలి

గింది. మహారాణా ప్రతాప్‌సింగ్ - అక్బరుతో పోరసలిపిన ప్రదేశం. దృశ్యమానమైన పర్వతశ్రేణుల కనుమలలో ఒక గృహం ఉంది. ఇక్కడ మహారాణా సాహసోపేతంగా అక్బరు చక్రవర్తి నెదురొడ్డి పోరాడిన యుద్ధదృశ్యాలు బహుకేతుకంగా ఒక చిత్రంగా చూపిస్తున్నారు. రాణాకు విశ్వాసపాత్రమైన హయం 'చేతక్' తన స్వామిని రక్షించే ప్రయత్నంలో నేలకొరిగి అసువులు బాసిన చోటుని స్మారక చిహ్నంతో గుర్తించబడినది.

**జయ్‌సమండ్ :**

ఆసియా మొత్తం మీద పెద్ద మంచినీటి సరస్సుగా పేర్కొనబడిన ఈ మహా సరోవరం 14 కి.మీ. పొడవు, 9.5 కి.మీ. వెడల్పు గలిగి చుట్టూవున్న పర్వతాలే తీరంగా ఏర్పడింది. మధ్యమధ్యలో చిరు పర్వతాలు గుట్టల దీవులు దీవులుగా కనబడుతూ వుంటాయి. ఒక సమున్నతమైన పర్వతాగ్రం మీద ఈ సరస్సును అవలోకిస్తున్నట్లుగా స్నిగ్ధత్వాన్ని వలగబోసి కట్టినట్లుగా ఒక తెల్లటి పాలరాతి భవనం దర్శన మిస్తుంది రాజా జయసింగ్ దీనిమీద ఒకఆనకట్ట కట్టారట. ఏతత్ సుముహూర్తంలో రాజావారు తనయెత్తు బంగారంతో తులతూగి చుట్టూ తిరుగుతూ ఆ బంగారాన్నంతా పేదసాదలకు పంచిపెట్టారట.

దగ్గరిలో రాజ కుటుంబీకులు సరదాగా వేటాడటానికి 66 కి.మీ. వైశాల్యంగల పెద్ద అరణ్యం ఉంది. ఆనాడు రాజుల విలాసార్థం మృగయాసక్తుల క్రీడాస్థలిగా వున్నది. ఈనాడు వన్యమృగ సంరక్షణ కేంద్రంగా మారింది. అడవిలో వేట నిషిద్ధం వన్యమృగములను సహజ వాతావరణంలో వీక్షించటానికి ఎత్తయిన గోపుర గవాక్షలున్నాయి.

**కుంభాల్‌గర్ :**

1458లో మహారాణా కుంభవారు కట్టించినకోట. దుర్గమమైన కొండ కొమ్మున ఉంది. సముద్రమట్టానికి 1080 మీటర్లు ఎత్తులో ఉంది అక్కడినుంచి చూచేవారికి ఆరావళి పర్వత శ్రేణులబారులు, మేవారు ఎడారి ప్రాంతం దృగ్గోచర మౌతాయి. కోటలో నీలకంఠ మహదేవునికి, కుంభస్వామికి ఆలయాలున్నాయి. అందులోనే మొయిలు ప్రాసాదం (BADAL MAHAL) పైన పలచని రంగులలమిన గదులతో మనస్సుకు అహ్లాదాన్ని కలిగిస్తుంది.

జగత్ ఆలయం :

సుమారు వేయి సంవత్సరాల క్రింతం నిర్మించబడిన జగన్మాత పార్వతీదేవి ఆలయం. పంచముఖాకృతిగా నుండి 17 గోపురాలతోను, పగోడాకృతిగల కప్పుతోను ఉన్నది. దర్శనీయం.

రణక్ పూర్ :

15వ శతాబ్దపు తొలినాళ్ళల్లో ధరమ్ షా అనే వణిక్ శ్రేష్ఠుడు నిర్మించింది. జైనాలయాల సముదాయం. శిల్పకారుని మనోవికాస వైచిత్రి మనోజ్ఞం. శిల్పం అతి రమణీయం. వైభవం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. వీటన్నింటిలోను ఆదినాధుని ఆలయం ముఖ్యంగా చూడదగిన విశేషం. 1444 స్థంబాల నిలువుమీద నగిషీలు చెక్కబడిన జైన సంప్రదాయ కధాచిత్రాల చిత్రణ చూడముచ్చటైంది. లోపల చతుర్ముఖ ఆదినాధుని మూర్తి ఉంది.

# చి త్తో ర్ ఘ రు

ఉదయ్‌పూర్‌కి 112 కి.మీ. దూరంలో వున్న సంఘటనాత్మకమైన కోట. 500 అ. ఎత్తుగల కొండమీద నిర్మించబడింది సముద్ర మట్టానికి 1350 అడుగుల ఎత్తున ఉంది. కోట 700 ఎకరాల వైశాల్యాన్ని ఆక్రమించింది. శత్రు దుర్భేద్యంగా నిర్మించబడింది. కోటలోపల వ్యవసాయ క్షేత్రాలున్నాయి. దగ్గరిలోవున్న గ్రామాలకి సైతం రహస్య మార్గాలున్నాయి. కోట లోపలనుండే బయటివారికి సమాచారం అందించవచ్చు. బయటివారి నుండి రహస్య సేకరణ చేయవచ్చు.

పురాణ కథ ప్రకారం కుంతీ మధ్యముడైన భీముడు మొట్టమొదట ఈ కోటకు అంకురార్పణ చేసినట్లుగా చెప్పబడుతుంది. ఏదిఎలా వున్నా మౌర్య సామ్రాట్టుల్లో ఒకరైన చిత్రాంగదుడు ఇక్కడ సుస్థిర స్థానం ఏర్పరుచ కున్నారు. చిత్రకూటమనే పేరును సార్థకం చేశాడు. కాలక్రమేణా అది చిత్తోర్‌గా మారిందని చరిత్ర పండితుల అభిప్రాయం. కోట అద్భుత చారిత్రక సాహసకములకు క్రీ.శ. 8వ శతాబ్దంలో ఆక్రమించిన యువరాజు ఇదార్ బప్పారావల్‌తో ప్రారంభమయింది. చితోర్‌ఘర్ గొప్ప గొప్ప రాజులపాలనను చవిచూసింది. చరిత్రలో చిరస్థాయిగా నిలిచిన ఇద్దరు మహిళల గాథలకు నిలయంగా భాసించింది. ఒకరు రాణీ పద్మిణీ, రెండవవారు భక్తమీరా. హైందవ నారీమణుల చరిత్రలో మణిమకుటాలుగా నిలిచారు.

రాణీపద్మిని రావల్ రతన్‌సింగ్ దేవేరి. 1302లో అల్లావుద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సుల్తానుగా ఈ ప్రాంతంమీద దండెత్తాడు. రాజపుత్ర వీరులు నిష్కళంక శౌర్యప్రతాపాలతో ఎదుర్కొన్నారు. రాణి పద్మినీదేవిని చూడాలని రాయబారం పంపాడు. ఇందుకు ఒప్పుకోలేదు రాజపుత్రులు. ఆమె ప్రతిబింబాన్ని అద్దంలో చూపించటానికి మాత్రం ఒప్పుకున్నారు. ఖిల్జీ ఇందుకు అంగీకారం తెలిపాడు. ఏర్పాట్లు జరిగాయి. ఖిల్జీ ఏం చూశాడో మాత్రం తెలియదు. ఆమె చెలికత్తెల్లో ఎవరో ఒక అందమైన అమ్మాయిని చూపివుంటారని అంటారు. సరే అంతా అయిపోయిం తరువాత రావల్ రతన్‌సింగ్ సౌమనస్య పూర్వకంగా ఖిల్జీని చూడటానికి వెళ్ళేటప్పటికి పొంచివున్న సుల్తాన్ సైనికులు ఆయన్ను బందీగా పట్టుకుని కబురంపాడు. రాణిపద్మినీదేవి తన వద్దకు వస్తేగాని కుదరదని వర్తమానం పంపాడు. అంతవరకు రాజుగార్ని వదిలేది లేదని చెప్పిపంపాడు. సుల్తాన్ 'సరే' అన్నారు. కాని ఒక షరతు. రాణీవారు 700 పల్లకీలలో కన్యా పరివేష్టితమయి రాజసం వుట్టిపడేట్లుగా వూరేగింపుగా వస్తుందని చెప్పారు. పల్లకీల్లో వున్న కన్యామణులను మోసేందుకు ఒక్కో పల్లకీకి ఆరుగురు బోయీలుంటారని వివరం చేశారు. 'సరే' రమ్మన్నాడు సుల్తాను. అయితే పల్లకీ బోయీలు, పల్లకీల్లో వున్నకన్యలు మెరికలుదీరిన సైనికులయ్యారు. అందరూ ఒక్కుమ్మడిగా సుల్తాను గుడారం మీద వుప్పెనలా పడిపోయారు. ఘోరమైన యుద్ధరంగం తయారయింది. అల్లావుద్దీన్ కొంచెంలో తప్పించుకో గలిగాడు. రావల్ రతన్‌సింగ్ తన కోటలోకిరాగలిగాడు. రాణిపద్మిని వేషంలో వెళ్ళిన రాణీమేనమామ గోరా మాత్రం బలి అయిపోయాడు. ఘోరంగా పగబెంచ బడ్డాడు. తరువాత కొన్నాళ్ళకు తన సర్వశక్తులన్నీ కేంద్రీకరించుకుని మళ్ళీ దండయాత్ర చేశాడు. కాషాయవస్త్రాలు ధరించిన రాజపుత్ర వీరులు సాహసోపేతంగా పోరాడారు. కాని విధి బలీయం. కోట సుల్తాను వశమవక తప్పలేదు. పరబలం పరాక్రమించింది. ఓడిపోక తప్పలేదు. రాణివాసంలో వున్న తన ముఖ్య అనుచరులతో సహా రాణి పద్మినీదేవితోగూడ అగ్ని ప్రవేశంచేసి తమ స్వచ్ఛతను కాపాడుకో గలిగారు. ఆ విధంగా చరిత్రలో జోహారుగా నిలిచారు ఆ రాజపుత్రవీర స్త్రీలు.

మీరాబాయి 16వ శతాబ్దానికి చెందిన కృష్ణభక్తురాలు. భోజరాజు పట్టమహిషి. కృష్ణభక్తిలో తాదాత్మ్యం పొంది ప్రతి అణువులోను తన ఆరాధ్య దైవమయిన శ్రీ కృష్ణభగవానుని చేరుకుంది వాచా, మనసా వివశత్వం పొందిన ఆమె మధురభక్తి అనేక గీతాలుగా వెలువడినవి. సంగీత సాహిత్యంలో సుస్థిరమైన స్థానాన్ని సంపా

దించుకున్న భక్తమీరా గేయాలు వినని భారతీయు డున్నాడంటే సందేహమే: ఆమె కోసం కోటలోనే ఒక కృష్ణ మందిరాన్ని వెలయించాడు ఆమె భర్త. కాని ప్రకృతి లోని ప్రతి అణువులోనూ భగవంతుని రూపం సాక్షాత్కారం పొందిన మహా భక్తు రాలు ఆ ఆలయ ప్రాంగణంలోనే కట్టుబడ లేకపోయింది. తన్మయభక్తి భావంతో ఆమె అనేక పవిత్ర స్థలాలను సందర్శించింది. కృష్ణభగవానుడు నడయాడిన ప్రదేశా లెన్నిటినో సందర్శించి పునీతం చేసింది ఆ మహాభక్తురాలు. ఆఖరుగా ఆమెని ద్వారకలో చూడటం జరిగిందని చెప్పుకుంటారు. ఈ లోగా ఆమెభర్త ఇహలోకాన్ని వీడి స్వర్గస్థులయారు. ఆమె బంధువర్గం ఆమెను చితోర్‌ఘర్‌కి తీసుకురావాలని ప్రయ త్నించారు కాని ఆమె మాత్రం భగవదారాధనలో మునిగి అదృశ్యమయింది. మంది రాంతర్భాగంలో వున్న మూర్తిలో ఐక్యమయి పోయిందనీ మరల ఆమెని భౌతికంగా చూడటం జరగలేదని చెప్పుకుంటారు.

మొగల్ చక్రవర్తి అక్బరు మహాచక్రవర్తి 1563లో చితోర్‌ఘర్‌ని ముట్టడించి చాలాకాలం వరకు దండయాత్ర కొనసాగించాడు. అయితే దుర్భేద్యమయిన కోట లోకి కాలుపెట్టలేక పోయాడు. అయితే కొన్నాళ్ళకు కోటలో ఆహార ధాన్యాలు పూర్తిగా నిండుకున్నాయి. బయటినుండి వచ్చే మార్గంలేదు. ఈ సమయంలో కోటలో ఒక పెద్ద దావానలం వ్యాపించింది. ఈ కార్చిచ్చులో వేలకొలది మహిళలు ఆత్మాహుతి చేసుకొన్నారు పురుషులు బయటవున్న సైన్యాలమీదపడి యుద్ధం సాగించారు. శత్రు బలాన్ని ఛేదించక పూర్వమే అందరూ వీరమరణం పాలయ్యారు.

ఈ కోటకు సప్తద్వారాలున్నాయి. ఒక్కొక్కటి చూద్దాం ఈ చరిత్రాత్మక మైన చిత్తోర్ కోటను.

**మహారాణా కుంభ ప్రాసాదాలు :**

ఈ భవనాల శిధిలావశేషాలే మనకు మొట్టమొదట సాక్షాత్కరించేది. ఈ భవ నాన్ని కుంభరాణా కట్టకపోయినా అభివృద్ధి చేశాడు. అందుచేత వీని కి పేరు కలిగిం దట. భవన నిర్మాణమంతా రక్షణ, దుర్భేద్యతలు ప్రాతిపదికగా నిర్మాణంగాని, వ్యాప్తి గాని జరిగినట్లు తెలుస్తుంది. రాజభోగాలకు, విలాసాలకు ప్రాధాన్యత కనుపించదు. అతి చిక్కు ముడులుగాఉన్న రహస్యద్వారాలు, సొరంగాలు చోటుచేసికొన్నాయి ప్రస్తుతం ఇవన్నీ మూసివేశారు. కాని ఒక నేలమాళిగ రాణిపద్మినీదేవి జోహారుగా ఆత్మార్పణ చేసికొన్న స్థలంగా గుర్తించబడింది చూడగలం.

సాత్ బీస్ దవేరా :

విశేషమైన శిల్ప చాతురితో నిర్మించబడిన 27 జైన ఆలయాల సముదాయం. కళా వైశిష్ట్యాన్ని కమనీయంగా దర్శించవచ్చు.

కుంభశ్యాముని ఆలయం :

1449లో మహారాణా కుంభ వారిచే నిర్మించబడిన విష్ణ్వాలయం. శ్రీ మహా విష్ణుని దశావతారాల్లోని వరాహ స్వామి అధిదేవత. మహమ్మదీయుల దండయాత్రల్లో విధ్వంసానికి గురయి అసలు మూర్తివిగ్రహమై ఇప్పుడున్న నూతన కుంభశ్యాముని విగ్రహం ప్రతిష్ఠితమైందని ప్రతీతి.

మీరాబాయి ఆలయం :

భక్తమీరా తన గిరిధారుని అర్చించే విధం మూర్తిమంతం చేయబడింది.

జటాశంకర మహాదేవుని ఆలయం :

కొండ అంచున కట్టించబడిన ఈ శివాలయ ప్రాంగణం నుండి ప్రకృతి దృశ్యమును చూపు ఆనినంత మేర తిలకించవచ్చు.

విజయ స్తంభం:

కుంభ మహారాణావారు మాల్వాసుల్తాను అయిన మహమ్మద్‌షా ఖిల్జీతోను, గుజరాత్ సుల్తాను కుతుబుద్దీన్‌షాలతో యుద్ధం చేసి గెలిచినందులకు విజయచిహ్నంగా 1448లో ఈ అంబర చోదిత గోపుర నిర్మాణం చేశారు. తొమ్మిది అంతస్తులు, 122 అడుగుల ఎత్తున ఉన్న ఈ గోపురం ఎక్కి చూడటానికి మెట్లున్నాయి. హైందవ శిల్ప చాతుర్యానికి మంచి తార్కాణం. గోడల బయట, లోపల హిందూ పురాణ గాథలెన్నో చిత్రాలుగా వెలయించారు.

కీర్తి స్తంభం :

క్రీ. శ. 12వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ 75 అడుగుల ఎత్తుగల స్తంభం మొదటి జైన తీర్థంకరులైన ఆదినాథుని కంకితమైనది.

కాళీ మందిరం :

కోటలో ఉన్న అతిప్రాచీన ఆలయం కాళీమాత ఆలయం. మొదట ఈ ఆలయం సూర్యదేవునికి నిర్మించబడి, కాలక్రమేణా దండయాత్రల్లో నష్టానికి గురయి తరువాత కాళీమాత విగ్రహం ప్రతిష్ఠించటం జరిగి ఉంటుంది.

ఇతరంగా :

రాణీ పద్మినీదేవి ప్రతిబింబం అద్దంలో చూపటానికి నిర్దేశించిన చిరు భవనం. తటాకం మధ్యలో ఉన్నది, సమిధేశ్వర మహాదేవుని ఆలయం- దీన్నే మోకల్ మంది రం అని కూడా అంటారు. శివుడు అధిదేవత. సుల్తాన్ బహదూర్‌షా దండెత్తి వచ్చి నప్పుడు రాణీ కర్మావతి మరి కొంతమందితో జోహారుగా ఆత్మహుతి చేసికొన్న చోటు. గోముఖంలో నుంచి ప్రవహిస్తున్న నిర్మల జలధారలు చూడదగిన ఇతర ప్రదేశాలు.

కాంక్రోలి — రాజాసముండ్ :

ఉదయపూర్ నుండి 65 కి. మీ. దూరం. నాథ్ ద్వారాకు దగ్గరే ప్రక్క స్టేషను. శ్రీ మహావిష్ణువు అవతార విశేషం శ్రీ కృష్ణభగవానుని ద్వారక. ద్వారకాధీశునికి ఒక ఆలయం - నాథద్వారాలో మాదిరిగానే వుంటుంది. శ్రీ ద్వారకా ధీశ వైష్ణవ ధర్మప్రచార పీఠాలల్లో తృతీయస్థానం. రాజ్‌సింగుచే ఏర్పరచబడిన విశాల మైన సరస్సు కూడా ఉంది. కృష్ణభక్తులు శ్రీ వల్లభాచార్య కృతమైన సాంప్రదాయ గ్రంధములు ప్రచారం చేస్తుంటారు. ఆచార్యులవారు ధరించిన వస్త్ర విశేషం కూడా యిక్కడ వుందని ప్రతీతి. స్వతహాగా వల్లభాచార్యులు తెలుగువారు. గోదావరీతీరం లోని కంకరవాడలో జన్మించారట. అందుచేతనే ఇక్కడ ఈ ప్రదేశానికి కాంక్రోలి అనే నామం సార్థకమయిందని శృతం. వసతికి ధర్మశాలలున్నాయి.

శ్రీ రామనారాయణజీ :

శ్రీరామచంద్ర ప్రభువు ఇక్కడ రూపనారాయణుని పేరుతో సుప్రసిద్ధుడు. దగ్గరి పర్వత లోయనుండి గోమతి అనే నది పారుతుంది. ఆలయంలో స్వామి విగ్ర హం శ్యామవర్ణంలో ఉంటుంది. ఉదయపుర మహారాణా కడుభక్తితో సింహాసనమధి ష్టించబోయేటప్పుడు స్వామి దర్శనం చేసిగాని సింహాసనం ఎక్కరట. ఇక్కడి విగ్ర హానికి వెంట్రుకలు మొలిచినట్లు-వెంట్రుక లాగితే రక్తం చిప్పిలినట్లు ఒక కథ ప్రచా రంలో ఉంది. ఈ కథకు, రాణా సింహాసనం మీద కూర్చోబోయేటప్పుడు స్వామి దర్శనం చేయటానికి సంబంధం వుందని అంటారు. ఏది ఏమయినా మహత్తుగల స్వామియే గదా !

# ఆబూ పర్వతం

అబూ పర్వతం ఆరావళీ పర్వతశ్రేణిలో అహరిన జైనుల పవిత్ర తీర్థ యాత్రా స్థలం. రాజస్థానంలో ఉన్న ఒకే ఒక పర్వత విశ్రాంతి కేంద్రంగా ప్రసిద్ధి. అబూ శిఖరం సముద్ర మట్టానికి సుమారు 4. 500 అడుగుల ఎత్తు పైగా ఉన్న ఆరోగ్యప్రదమైనది. పర్వత పాదాల వెంత 13 కిలోమీటర్ల పొడవునా, 5 కిలో మీటర్ల వెడల్పులో ఒక సుందరమైన లోయ పరచుకుని ఉంది. గుబురు చెట్లు లోయంతా నిండిపోయి నేత్రపర్వంగా ఉంటుంది. విశేషమైన పురాతన చరిత్ర కలిగి పురాణప్రసిద్ధమైన 1009 సంవత్సరాలకు పూర్వపు చరిత్ర కలిగిన జైన ఆలయాల సముదాయం అచ్చమైన పాలరాతి శిల్పాలతో మలచినవి ప్రసిద్ధమైనవి.

ఢిల్లీనుండి 759 కి.మీ. దూరంలో ఉన్న అబూ రైల్వేస్టేషనుకు స్వతహాగా 29 కి. మీ. దూరంలో ఉన్నది. కమనీయమైన శిల్పాల కాణాచి. కళ్యాణ ప్రద మైన కమనీయ కళా నిలయం. శిల్ప చాతురికి అత్యద్భుతం. శిల్ప చమత్కృతిలో తాజ్‌మహల్‌తో సరితూగకలది ఇది ఒక్కటేనంటారు. ఎటువంటివారికైనా ఆధ్యాత్మిక దృక్పథం కలిగింప జాలినవిగా ఉన్న ఆలయాలు చూడదగినవి ముఖ్యంగా—

## దిల్వారా జైన ఆలయాలు :

ఆబూ శిఖరంమీద దిల్వారా వద్ద 5 జైన ఆలయాలున్నాయి. బహు సున్నిత మైన నగిషీల జిలుగుల శిల్పవిశేషాల్లో అగ్రగామిగా చూపరులకు అత్యంతాశ్చర్యాన్ని కల్గించేవి. ప్రపంచం మొత్తం మీద పేరెన్నికగన్నవిగా విమలవాసి, తేజపాల్ ఆల యాలు.

## 'విమల్‌వాసి' ఆలయం :

గుజరాతు సోలంకి వంశపు మహారాజు రాజా భీమ్‌దేవ్ అమాత్య శేఖరులు విమల్‌షా క్రీ. శ. 1031లో నిర్మింపచేశారు. జోధ్‌పూర్ మక్రానా క్వారీల్లో సేకరిం చిన అచ్చమైన తెల్లపాలరాయితో ఆనాడే 18 కోట్ల 53 లక్షల రూపాయలు వ్యయం చేసి విశేషమైన శ్రద్ధాసక్తులతో కట్టించారు. 52 గదులు, ప్రతిదానిలోను ఒక్కొక్క తీర్థంకరుని ప్రతిష్ట చేయబడింది. ప్రధానమండపం చిత్ర విచిత్ర తరు లతాగుల్మాలు నగిషీలుగా మలచిన పాలరాతి స్తంభాలు నిలిచి ఉన్నాయి. ఆలయం బాహ్య ప్రదే శంలో ఒక పెద్ద అష్టముఖాలుగల డోమ్ 11 వలయాలుతో అనేక రకాలైన జంతు

వుల బొమ్మలు, ఏనుగుల వూరేగింపు, మనుషుల ఆహార విహార విశేషాలతోను నిండిన శిల్పాలు కనుల పండువగా దర్శనమిస్తాయి.

**తేజ్ పాల్ ఆలయం :**

విమల్‌వాశి ఆలయ నిర్మాణం తరువాత 200 సంవత్సరాలకు గుజరాతు రాజు వీర్‌ధవల్ మంత్రులైన, తేజ్‌పాల్ వస్తుపాల్‌లు ఇద్దరూ కలిసి తేజ్‌పాల్ అనుజుని భార్యయైన అనుపమాదేవి యిచ్చిన స్ఫూర్తితో ఆలయ నిర్మాణం చేశారు. విమల్‌వాశి ఆలయాన్ని పోలిందే ఇది కూడా. 23 జైనతీర్థంకరులకు అంకితం చేయబడిందీ ఆలయం. దీనిలో ప్రత్యేకం డోము మధ్య భాగంలో స్ఫటిక సముచ్చయం వేలాడ దీసినట్లుగా వుంటుంది.

**అచలేశ్వరీ మహాదేవ్ :**

అతి పురాతనమైన ఆలయం. ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరుల కంకితమైనది. విగ్రహాలు కూడా ఆలయం ముందే సాక్షాత్కరిస్తాయి. ఇక్కడ లోతు తెలియని ఒక కోనేరు ఉంది. దీని పేరు బ్రహ్మకుండు. పేరుకి తగ్గట్టుగా అగాధమై వుంటుంది. ఇంతవరకూ లోతు కనుక్కున్న వారెవరూ లేరు. పవిత్రమైన స్నానాలకు సరస్సు 'మందాకినికుండు' అనేది.

**అచల్‌గర్ :**

అచలేశ్వరాలయం నుండి ఒక చిన్న దోవ అచల్‌గర్ కోటకు దారి తీస్తుంది. ఈ కోట 15వ శతాబ్దానికి చెందినది. ఇందులో 4 జైనాలయాలున్నాయి. వీటిలో ముఖ్యమయినది 15వ శతాబ్దానికి చెందిన చౌముఖజీ ఆలయం. అక్కడ 570 క్వింటాళ్ళుతూగే మిశ్రిత లోహ విగ్రహాలు 14 ఉన్నాయి.

**గురు శిఖరం :**

సమున్నతమైన శిఖరం. ప్రాంతపు పరిసరాలన్నిటినీ పానోరమిక దృశ్యంగా చూడగలం.

**గోముఖం :**

వసిష్టుని కామధేనువుగా భావించబడే గోముఖం నుండి నిర్మలమైన స్వచ్ఛ జలాలు క్రింద ఉన్న సరస్సులోకి ప్రవహిస్తుంటాయి. ఈ సరస్సును అగ్ని కుండ్ అని అంటారు. దీనిలోంచి ప్రముఖ రాజపుత్ర వంశోద్భవం జరిగిందని ప్రతీతి.

ఇక్కడే రామాయణ మహాకావ్య రచయిత వాల్మీకి మహర్షి ఆశ్రమం, రఘునాథజీ ఆలయం, రామానంద వైష్ణవ సాంప్రదాయ స్థలమైన ధర్మశాల కూడా ఉంది. దగ్గరిలోనే దులేశ్వరీ మహాదేవుని ఆలయం, దుర్గామాత కంకితమైన అర్బుదాదేవి ఆలయం చూడదగిన విశేషాలు.

**అంబికాజీ :**

అబూ రోడ్డు స్టేషన్నుండి సుమారు 20 కి.మీ. దూరం ఉంది. బస్సులున్నాయి. ఆరాసుర్ పర్వతంవద్ద ధేలాఘడ్వార్ అమ్మవారి పురాతనాలయం అంబికాజీ ఆలయం ఉంది. గుజరాతీయులకు ఆరాధ్య దేవత. భాద్రపదం, ఆశ్వయుజం, కార్తీకం, చైత్రమాసాల పూర్ణిమల్లో గొప్పగా ఉత్సవం జరుగుతుంది. ఈప్రాంతంలో చూడదగినవి :— మాన సరోవరం, గహ్వార్స్థాన్, ఉధంబర్వాన్ అనే సరస్వతీనది జన్మస్థలం, మధుసూదన మందిరం, జలపాతం, ఋష్యాశ్రమం మొదలగునవి. తిరిగి అబూస్టేషన్ రోడ్చేరి మిగతా ప్రాంతం పర్యటించవచ్చు. అభిరుచి, ఆసక్తిగల భక్తయాత్రికులకు ప్రత్యేకంగా మలుపు మార్గంలోగల ప్రదేశం దర్శనీయం.

## ఆల్వార్

1771 లో ఆల్వారు రాజసంస్థానం స్థాపించబడింది. జైపూరునుండి 148 కి.మీ. వుంటుంది. ఆల్వారు-సంస్థానానికి ముఖ్యపట్టణం. వన్యమృగ సంరక్షణా కేంద్రానికి, సుందర భవనములు, ప్రాసాదాలకి ప్రసిద్ధి.

**నగరప్రాసాదం—మ్యూజియం :**

పర్వత పాదాల చెంత అమరిన సరస్సు అందాల సాగరం—— సాగర్ దీని పేరు. ఇక్కడి భవనంలో వస్త్రప్రదర్శనశాల అమరిఉంది. మ్యూజియంలో మొగలు చక్రవర్తులు అక్బరు, జహంగీరు, షాజహాను, దారాసికో, నాదిర్షా, ఔరంగజేబు మొదలయినవారు ఉపయోగించిన ఆయుధ విశేషాల్తోపాటు అనేక చిత్రాలు, పెయింటింగులు వివిధ కాలాలకు చెందినవాటిని దర్శించవచ్చు.

**సిలిసేఢ్ :**

ఆల్వారు నగరానికి 13 కి.మీ. దూరంలో అమరిన సరస్సు— పిక్నిక్స్పాట్.

సరిస్కా :

37 కి.మీ. దూరం ఉంటుంది. చక్కని అడవిప్రాంతం. వన్యమృగ సంరక్షణాకేంద్రం. చిరుతపులి, పెద్దపులి, ఏంటిలోప్ (ఆదిమానవాకార విశేషం) అడవి ఏనుగు మొదలయిన జంతువులను చూడగలం.

పాండుపోల్ :

సరిస్కా నుండి 30 కి.మీ. దూరంలో ఉన్న పురాణ ప్రసిద్ధమైనదీ స్థలం. వెనుక పాండవులు ఒక సంవత్సరం ఇక్కడ నివాసం ఏర్పరుచుకుని ఉన్నారట. నీరు దొరకక పోయేసరికి మహాబలశాలి అయిన భీముడు తన గదాదండం చేత ఒక్కదెబ్బ చరిచేసరికి పెద్ద కుంటలాగా ఏర్పడి నీటితో నిండి పోయిందిట.

# భ ర త్ పూ రు

మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబు రాష్ట్రాలకు తూర్పు సింహద్వారం సదృశమైంది భరత్‌పూర్. ఒకనాటప్పటి భరత్‌పూర్ పేరుతో ఉన్న చిన్న రాజ్యానికి భరత్‌పూర్ రాజధాని. భవనాలు విశేషం.

భరత్‌పూర్ కోట :

శత్రుదాడులనుండి రక్షణకోసం కోటచుట్టూ రెండు మట్టిగోడలుతో సరికొత్త తరహాలో నిర్మించబడింది. కోటకు రెండు ద్వారాలున్నాయి. రెండు ద్వారాలు కూడా 18వ శతాబ్దంలో మహారాజా జవహర్ సింగ్‌చే బహుమానంగా పొందబడినవి. రెండింటిలో అష్టధాతు నిర్మితమైన దానిని అల్లావుద్దీన్ ఖిల్జీ ఢిల్లీకి తరలించుకుపోయాడు. ఇది చితోర్‌గర్‌కు చెందిందని అంటారు.

కోటలో గల బురుజులన్నింటిలో 'జవహర్ బురుజు' మహారాజా జవహర్ సింగ్ ఢిల్లీ సుల్తానులమీద జరిగిన ముట్టడిలో పొందిన విజయానికి చిహ్నంగా కట్టించబడింది.

రెండోది వతే బురుజు 1805 లో బ్రిటిషువారిని జయించినందుకు చిహ్నంగా కట్టించబడింది.

కోటలో ఒక మ్యూజియం వుంది. అందులో అతి అరుదైన వస్త్రాలను కొన్నిటిని చూడగలం.

భరత్‌పూర్ కెలాడియో బర్డ్ శాంక్చ్యువరీ :

ఒక పెద్ద సరోవరంతోసహా మొత్తం 31 చ.కి.మీ. వైశాల్యంలో అమరిన పక్షుల శరణ్యాలయం. ఇక్కడికి ప్రతి సంవత్సరం సైబీరియానించి వచ్చి విడిది చేసి వెళ్తుంటాయి. మధ్య ఆసియా, టిబెట్టు, చైనా, సైబీరియా కొంగ, బూడెదరంగు కాళ్ళుగల బాతులు, మరెన్నో రంగురంగుల పక్షులు నేత్ర పర్వాలుగా వీక్షించవచ్చు. దగ్గరిలోవున్న అడవిలో నీలిరంగు ఎద్దు, మచ్చల లేడి వగైరా జంతువులను కూడా చూడవచ్చు.

డీగ్ :

భరత్‌పూరు నుండి 5 కి.మీ. దూరంలో ఉన్నది. ఇక్కడ 18వ శతాబ్దంలో వెలయించిన బ్రహ్మాండమైన భవనాలు, చుట్టూ తరులతా వృక్షసంపన్నమైన అడవులు, వెలసిన అందాల సరస్సులు మనోహరమైన ప్రకృతిలో పొదగబడినాయి. మీగడ తరగలా నున్నని పాలరాతి కట్టడాలు, కారు రాయితో కట్టబడిన భవనాలు విశేషమైన కళాసంపత్తికి ఆకారామై, చక్కని ఉద్యానవనాలు ప్రకృతి పరచిన తివాచీలు, వాటిలో అమరియున్న ఫౌంటెన్‌లు, ఈ చారిత్రిక ప్రాధాన్యతను సంతరించుకున్న భవనాలు సౌందర్యాన్ని ఇనుమడించే దివ్యాభరణాలు వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవి— గోపాల భవన్. ఎన్నో మణిమాణిక్యాలు తాపడం చేయబడిన సూరజ్ భవన్ కోటలోని తలమానికాలు.

# అజ్మీర్, పుష్కర్

పురాతన కాలంలో అజయ్‌మేరు అని పేరు. పట్టణం క్రీ.శ. 7 శతాబ్దంలో అజయపాల్ చౌహాన్ నిర్మించారు. ఢిల్లీ నుండి 444 కి.మీ. దూరం, జైపూర్ నుండి 132 కి.మీ. చితోర్‌ఘర్ నుండి సుమారు. 180 కి.మీ. దూరం వుంటుంది. పట్టణం మొత్తానికి తారాఘర్ కోట తలమానికం. అక్బరు చక్రవర్తి నిర్మించారు. 1024 లో ఘజినీ మహమ్మదు, 1193 లో మహమ్మదుఘోరి దండెత్తి చేసినంత ఘోరం చేయగా— 1398 లో అందినంత దోచుకునిపోయి, ప్రజల్ని ఊచకోత కోశాడు తైమూరు.

అజ్మీరు మేవార్ రాథోర్ పాలకుల చేతుల్లోకి వచ్చేంతవరకు అనేక రకాలుగా

చేతులు మారింది. 1556 లో అక్బరు మహాచక్రవర్తి తన ఏలుబడిలోకి తీసి కొన్నాడు.

ముస్లిములకు పవిత్ర యాత్రాస్థలం 'అజ్మీర్ షరీఫ్', దగ్గరిలో ఉన్న పుష్కర్ హిందువులకు పవిత్ర యాత్రాస్థలం.

చూడదగినవి :

అగ్బరు ప్యాలెస్, బాద్‌షా భవనం, అనాసాగర్ సరస్సు, పరశురామ పురం వగైరాలతోపాటు ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తి దర్గా :— 1190 నుండి 1236 వరకు అజ్మీరులో నివసించిన 91 సం. వృద్ధ మహమ్మదీయ సాధువునికి ఏర్పాటయినదర్గా. హిందువులు కూడా ఎంతో భక్తి ప్రపత్తులు కనబరుస్తారు. 1464 నుండి అనేక మహమ్మదీయ చక్రవర్తులు మసీదు, భవనాలుతో విస్తరింపజేశారు, మహాచక్రవర్తి అక్బరువారి హస్తం 23 ఎత్తునగల బులంద దర్వాజా నిర్మించి తన భక్తి ప్రపత్తులను ప్రకటించుకున్నారట. ప్రతిసంవత్సరం యాత్ర జరిపేవారటకూడా.

అడయీా దిన్ కా ఝూంప్రా :

అర్థం రెండున్నర రోజుల కుటీరం. మహమ్మదు ఘజినీ ఆదేశం మేరకు ఆదర బదరాగా రెండున్నర రోజుల్లో నిర్మించారట— హిందూ పనివారల పనితనాన్ని శ్లాఘనీయంగా స్ఫుటీకరించిన కట్టడం. ఈ పేరు మరోరకంగా కూడా సార్థకం— పంజాబ్ షా ఉర్సు ఇక్కడ రెండున్నర రోజులు జరుగుతుందట— ఆవిధంగాకూడా. ఒక ప్రత్యేకమయిన తరహాలో నిర్మించబడింది.

అనాసాగర్ :

రెండు కొండలమధ్య మానవ నిర్మితమైన సరస్సు. ఒక చౌహాను రాజు 12 శతాబ్దంలో నిర్మించారు. జహంగీరు చక్రవర్తి ఒక చక్కటి ఉద్యానవనాన్ని ఏర్ప రిస్తే, షాజహాను చక్రవర్తి పాలరాతి పిట్టగోడ కట్టించారు.

పుష్కర్ రాజ్ :

ఒక మహాసరోవరం. అజ్మీరు పట్టణానికి 11 కి. మీ. దూరంలో అమరి యున్న దృశ్య మానమయిన లోయలో ఏర్పడిన పవిత్ర పుణ్యజలాశయం. సృష్టి స్రష్ట బ్రహ్మదేవుడు ఒక యజ్ఞం సంకల్పించి మూడు తామర పూలను విసిరారట. మూడు పడిన చోటులో మొదటిస్థలం అనువైనదిగా తోచిందట. పుష్కర రాజమై

వెలసింది. బహుశా ఇక్కడొక్క చోటనే కాబోలు ఇండియా మొత్తంమీద బ్రహ్మ దేవునికి ఆలయమున్నది. ఇందులోనే గాయత్రి అమ్మవారి ఆలయంకూడా ఉంది. సరస్సు తీరంలో అనేక భవనాలున్నాయి. ధర్మశాలలున్నాయి. తెలుగు, ఇతర ద్రావిడ భాషలు మాట్లాడే బ్రాహ్మణులు ఇక్కడ వున్నారు. నవంబరు మాసంలో పెద్ద ఉత్సవం జరుగుతుంది. పుష్కర్ చుట్టూ అనేక ఘాట్లున్నాయి. మొత్తం 52. యాత్రికుడు బద్రీనాథ్, పూరి, రామేశ్వరం, ద్వారక యాత్రలు చేయునపుడు మొదట ఇక్కడ స్నానం చేసి పునీతుడైతేగాని యాత్రా సాఫల్యం పూర్తిగా లభించదని గాఢమైన నమ్మకం. ఎన్నో హిందూ దేవాలయాలున్నాయి. చుట్టు ప్రక్కలగల పాండన కుండము, గోముఖ కుండం, బుడ్డా పుష్కర్, సావిత్రి ఆలయం, పాప విమోచనదేవి, ధ్రువనారాయణ, నందకేశ్వర మహాదేవ్ మొదలయిన క్షేత్రాలు దగ్గరలోనే వున్నవి, దర్శనీయాలు. దగ్గరి కొండమీద ఉన్న పార్వతీదేవి మందిరానికి విహారయాత్రగా వెళ్ళి ఆనందించవచ్చు. పుష్కర్ దగ్గర జరిగే పశువుల సంత ముఖ్యంగా గుర్రాల సంత ప్రసిద్ధం. ఈ సంవత్సరం నవంబరు 10 నుండి 13 వరకు జరుగుతుంది.

# జోధపూరు

ఒకానొకప్పుడు రాజస్థాన్‌లో జోధపూరు పెద్దస్టేట్. ఆబూ పర్వతం నుండి 250 కి.మీ. దూరం. రాష్ట్రంలోని ధార్ ఎడారిని ఆనుకుని వుంది పట్టణం. పట్టణం జనాభా ప్రస్తుతం నాలుగు లక్షలు. జైపూరు తర్వాత రాష్ట్రంలో ఇదే పెద్ద పట్టణం. నిర్మాణం మార్వారు రాజ్య పాలకులు ఇక్ష్వాకు వంశీయులైన రాథోర్ రాజు రావ్ జోధచే 1459లో వ్యవస్థీకరించబడింది. మార్వారుకు రాజధాని నగరంగా శోభిల్లినది. ఈపట్టణం మధ్యలో 490 అడుగుల ఎత్తయిన ఒక పెద్ద రాతిగుట్ట వుంది. గుట్టమీద బలిష్ఠమైన కోట. ఇదే పట్టణానికి తలమానికం. ప్రాకారపు గోడ 120 అడుగుల ఎత్తున దుర్గమగామిగా కట్టబడింది. సప్త ద్వారాలు అమరి వున్నది. జయపోల్, లోహపోల్, ఫతేపోల్ ద్వారాలు ఎన్నదగినవి. కోటలోకి ఫతేపోల్ ద్వారం గుండా ప్రవేశించటం అనువుగా వుంటుంది. కోటలో భవనాలన్నీ శిల్పకళా రమణీయత-ఏర్పరచబడిన కిటికీలు, గవాక్షములు మేడమీది వసారాల్లో వేలాడదీసినట్లుగా వుండి-వాటికి అమర్చిన జిగిబిగి అల్లికలు శోభాయమానంగా ఇనుమడిస్తున్నవి. రాజసౌధాల్లో గిర్దికోట్, ధాన్‌మండ్ దగ్గరి ఆలయం. తైలాతీమహల్, మోతీమహల్, ఫూల్‌మహల్ (పుష్ప భవన ప్రాసాదం)-పైన సీలింగులో రంగు రంగుల రకరకాలైన డిజైన్లలో ఉన్న

మొజాయిక్ మనోహరంగా వున్నవి, మానమహల్, శృంగారచౌకి (అలంకరణలకోసం ప్రత్యేకించిన అటకలు), కొండకోనలో గల చండికాలయం వివిధ రకాలయిన ఆయుధ విశేషాలు గల ఆయుధాగారం—దీన్ని శిలేఖానా—అంటారు—రాణీ సాగరమనే కొలను చూడదగినది పట్టణంలో గల ఇతరమైనవి సర్దారు మ్యూజియం, కుంద విహారాల యము, రణచోర్‌జీ మందిరం చాలా విశాలమైనవి—దర్శనీయం. పట్టణంలో సొగసైన సరస్సులు—తీరాల్లో రాజభవనాలు చూడదగినవి.

ఉమ్మాయిద్ భవనం :

ఇటీవల 1948 సం. నుండి 20 సంవత్సరాలు శ్రమించి బ్రిటిష నిర్మాణ నిపుణులు H.C. లంకాస్టరు గారిచే వ్యూహరచన చేయించి కట్టించబడింది. అందాల రోజాతోట ప్రత్యేకాలంకారం. ఈ భవనానికి కుడ్య చిత్రాలు, కొంతమంది జోధ్‌పూర్ రాజ వంశీకుల చిత్రాలు చోటు చేసుకున్నాయి పెయింటింగు రంగులలో. కొంత భాగం హోటలు క్రింద మార్చబడింది.

మండోర్ వనం :

పురాతన మార్వారుకు జోధపూర్‌కి ముందు రాజధాని. జోధ్‌పూరుకు 8 కి మీ. దూరంలో వుంది పూర్వనామం మాండవ్య—ఇక్కడ క్రీ.శ. 4 శతాబ్దపు ఆలయ అవశేషాలు పరికించవచ్చు. దగ్గరిలోనే ఒక భవన రాజంలో అన్ని దేవుళ్ళ, వీరుల చిత్రాలున్నాయి. ఒక పెద్ద ఉద్యానవనంలో రాజ వంశీకులందరికీ స్మారకములున్నాయి. నిర్మాణం అంతా బౌద్ధ, హిందూ శిల్పరీతుల్లో జరిగింది. వాతావరణం చాలా ఆహ్లాదకరంగా వుంటుంది.

మరింకా :

కోటకు దగ్గరిలోనే జస్వంతతాడా అనే ఒక విశాలమైన పెద్ద పాలరాతి భవనం, బాలక్‌రావు గారిచే త్రవ్వించబడిన బాలసముంద్ సరోవరం, ఆవెంట చక్కని తోట చూడదగిన విశేషాలు. వీటి నిర్మాణం 1159లో జరిగిందని ప్రతీతి.

ఓసియా :

ఇక్కడికి 67 కి.మీ. దూరంలో 16 జైనాలయాల సమూహమున్న గ్రామం. వీనిలో కొన్ని హిందూ, వైష్ణవాలయాలున్నాయి. పురాతన చరిత్ర గలిగి పురాణ ప్రాశస్త్యం ఇనుమడించినవి. క్రీ.పూ. 5శతాబ్దానికి చెందినవిగా భావించబడుతూంది.

రావ్‌పూర్ :

జోధపూరుకు ఆగ్నేయంగా నట్టనడి ఎడారిలో కట్టబడిన ఆదినాధుని ఆలయం, జైనాలయం.

# జైసాల్మీర్

ఎడారిలో ఒయాసిస్సు. అందమైన మొలక. పాకిస్తానుకు దరిదాపుల్లో ఉన్న సరిహద్దు పట్నం జైసాల్మీర్. పురాతన పురాణ ప్రసిద్ధి చెందిన త్రికూట పర్వతాగ్రం అమరిన పట్టణం. ఇతరులకు 'గిరిదుర్గ పట్టణం' అయితే పశ్చిమ ఆసియా ఎడారి బిడారులకు ఒక ఒయాసిస్సు లాంటిది. ఈ పట్నానికే నామ సార్థకీయులు రావల్ జైసాల్‌సింగ్ క్రీ.శ. 12 వ శతాబ్దానికి చెందినవారు. రోడ్ మీద అయితే పొఖరన్ నుండి చేరవచ్చు. రైలుమీద బార్మేర్ నుండి చేరవచ్చును. జోధపూరు నుండి 287 కి.మీ. దూరం.

పట్టణం చుట్టూ 5 కి.మీ. దూరం పొడవుగల కోట ప్రాకారపు గోడ కట్టబడి వుంది. కోట లోపలకు వెళితే ఇరుకు గల్లీలు, ఎదురు బదురుగా భవనాల మేడమీద వసారాలు ఒకదానికొకటి తాకుతూ ఎండపొడ తాకటానికి గూడా వీలు లేనంతగా ఒకచేకప్పుగా సందులను కప్పివేస్తుంటాయి. ఈ మార్గమే త్రికూట పర్వతాగ్రానికి గూడా చేరుస్తుంది. కోట చిత్తూరుకోట తరువాతదేనని అంటారు. కోట లోపలికి సూరజ్‌పోల్ ద్వారం గుండా వెళ్ళాలి. ఏడంతస్తుల భవనం కనబడుతుంది. అంతా గొడుగులు పరిచినట్లు గమ్మత్తయిన రాతి పనితనంతో ఏర్పరచబడిన బాల్కనీలతో రాజపుత్ర నిర్మాణ కౌశల్యానికి మచ్చుతునకగా భాసిస్తుంది. కోట లోపలనే శ్రీకృష్ణ భగవానుడు త్రవ్విన బావిగా చెప్పకోబడిన బావి, విష్ణ్వాలయం, శివునికి, గణేశునికి ఆలయాలున్నాయి.

పరాశనాధుడు, సంభవంజజీ, రిషభదేవ్‌జీ, మహావీర్, శ్రీ చంద్రప్రభువుల జైన తీర్థంకరుల ఆలయాల్లో ప్రసిద్ధి చెందాయి. కళాత్మకంగా మలచబడినాయి.

జైసల్మేరులో ఒక ప్రసిద్ధమైన గ్రంధాలయం వుంది. దీనిలో అతి అరుదైన తాళపత్ర గ్రంధ వ్రాత ప్రతులనేకం వున్నాయి. 1000 కాగితం వ్రాతప్రతులున్నాయి. కొన్ని తాళపత్రాలు 34 అ. పొడవున ఉన్నాయట. వీటిని ఇండోనేషియా నించి ప్రత్యేకంగా తెప్పించారట. ఒక్కొక్క ఆకుమీద నాగరలిపిలో నాలుగులైన్‌లు వ్రాయబడి వున్నాయి. చూడవచ్చు.

# ఖేడ్ లేక క్షీరపురం

జోధపూర్ నుండి లూకీ జంక్షను మీదుగా ఖేడ్ టెంపిల్ స్టేషను దగ్గర దిగి వెళ్ళవచ్చు.

చూడదగినవి :

శిల్పసౌందర్యానికి కాణాచియైన రణచోరాలయం దర్శించనగును. పురాతన ప్రశస్తి గల ఈ ప్రదేశం ఒకానొక సమయంలో మహానగరంగా విలసిల్లిందట. ఆనాటి అవశేషాలు ఇంకా మిగిలియున్నాయి. రణచోడరాయ మందిరం దగ్గర మూడు జీర్ణాలయాలున్నాయి. గర్భగృహ ప్రదక్షిణ మార్గంలో అనేక దేవతా విగ్రహాలున్నాయి. మందరపు శిఖర మధ్యంలో పాపపుణ్యముల కిటికీ ఒకటుందట. ఎప్పుడో అద్దంలా పాలిష్ చేసిన చిత్రమైన రాయి ఒకటుంది. ఈ పాలిష్ రహస్యమింత వరకూ ఎవరికీ అంతుపట్టని రహస్యం.

# బికనీరు

జోధపూరుని నిర్మించిన జోధసింగ్ కుమారుడు అయిన బికాజీ నిర్మించిన పరమాద్భుతం ఈ ఎడారిలోని పట్టణం. జైపూరు నుండి 450 కి.మీ. దూరం నగర నిర్మాణం మానవునికి ప్రకృతి విసిరిన సవాలుకు జవాబు అంటే అతిశయోక్తికాదేమో? వాసయోగ్యం కాని ప్రదేశంలో మహానగర నిర్మాణం సాధ్యమా! మనిషిఅనుకుంటే ఏదయినా సుసాధ్యమేనని నిరూపిస్తుందీ సుందర నగరం. నీరింకిపోయిన సరస్వతీ నదీ తీరంలో అమర్చబడిందీ నగరం. ఇక్కడ కూడా కోట ఒకటుంది.

1571-1611 లలో రాజా రాయ్‌సింగ్‌చే కోట నిర్మాణం జరిగింది. తరువాతి కాలంలో అనేక చేర్పులూ మార్పులూ జరిగాయి.

కోటలో చూడదగినవి :

హారమందిరం : ఇక్కడే రాజకుమారుల, రాజకుమార్తెల వివాహములు జరిగే చోటు. దీనికితోడు అనూప్‌మహల్, రంగమహల్, విజయమహల్ శిలా శిల్ప నగిషీల స్తంభాలుతోను, ఆర్చీలతోను రమ్యంగా నిర్మించబడినాయి. అద్దాలుతో ప్రత్యేక అలంకారములతో శోభిల్లేవి చంద్రమహల్, పూల్‌మహల్‌లు.

ఎర్రటి రాయితో నిర్మించబడిన లాల్ మహల్ అనే సుందరభవనం హోటలుగా మార్చబడింది.

బికనీరు చుట్టు ప్రక్కల :

ఒంటె ఎడారిఓడ. ఒంటి పాలను రుచి చూడాలని ఉందా ! ఒకసారి ఒంటె మీద స్వారిచేసి సరదాతీర్చుకోవాలనుందా- 10 కి. మీ. దూరంలో ఉన్న కామెల్ బ్రీడింగ్ ఫారమ్‌కి వెళ్ళండి. అనుభవయోగ్యం.

దేవికుండ్ :

బికనీరుకి ఎనిమిది కి.మీ. దూరంలో ఉన్న కొలను. తత్తీరంలో అనేకమంది స్మారక మందిరాలున్నాయి. ఇవి ఒక ప్రత్యేకమైన అరుదైన షేపుల్లో నిర్మించబడ్డాయి.

శ్రీకరణీదేవి :

జోధ్‌పూరు రోడ్డుమీద 38 కి. మీ. దూరంలోఉన్న దేష్‌నోకె శ్రీకరణీదేవి ఆలయానికి ప్రసిద్ధి చెందింది. శ్రీకరణిమాత మహామాయ స్వరూపమని అంటారు. బికనీరు రాజుల కులదేవతగా భాసించే ఈ దేవి ఆశీర్వాదమువలనే బికనీరు రాజ్యం స్థాపించబడిందట. మందిరం చాలా విశాలమైంది. ప్రవేశద్వారం నుండి లోనికి వెళ్ళగానే యోగమాయ దర్శనం అవుతుంది బంగారు గద్దెమీద శ్రీకరణీదేవి విగ్రహము ఆసీనయై ప్రకాశిస్తుంది. ఇక్కడ కొన్ని వేల కొలది ఎలుకలున్నాయి. యాత్రికులు వానిని పరమ పవిత్రంగా చూచి ఆహారాన్నిస్తూ దేవీభక్తుల ఆత్మలు వానిలో ఉన్నాయనే భావంతో వానిని ఆహారాదులతో సంతృప్తిపరుస్తూన్నామని తృప్తి పడతారు. వీనిని 'కాబా' లంటారు.

శ్రీ కోలయాతజీ :

బికనీరునుండి మీటరుగేజి రైనులో 50 కి. మీ. దూరంలోగల స్టేషను. ఇక్కడ కపిల-మహర్షి తపస్సు చేసిన పవిత్రస్థలం. కార్తీక మాసంలో గొప్ప ఉత్సవం- ఆసమయంలో సంత విశేషాలు. ధర్మశాలలున్నాయి.

రాజస్థాన్‌లోని ఇతర దర్శనీయ స్థలాలు :

రాజస్థాన్‌లో బుండి, కోట రెండు ప్రదేశాలుకూడా చక్కని యాత్రాకేంద్రాలు. బుండిలో పాలరాతికోట, అందులో పాలరాతి భవనాలు— ప్రత్యేకంగా సరస్సులో ప్రతిబింబించేవి చూడదగినవి.

జైపూరు నుండి 250 కి.మీ. దూరంలో ఉన్న 'కోట' చంబల్‌నదీ తీరంలో అమరియున్న పారిశ్రామిక నగరం. పురాణ ప్రసిద్ధిగల ఎన్నో ఆలయాలున్నాయి.

బుంది-చిత్తోర్‌ఘర్ రోడ్డుమీద నేత్రానందం కలిగించే మెనాల్- 9వ శతాబ్దం నాటి జైనాలయాల సమూహం- దగ్గరిలోనే బండరాళ్ళమీద ఉరుకులు పరుగులుతో ప్రవహించే నీటి ప్రవాహం, నూరు దేవాలయాల సముదాయంలో అతి పురాతనమైన మూడు దేవాలయాలు ఆసక్తిని రేకెత్తించేవి.

రాంతాంభోర్ :

ఒంటరిగానున్న కొండమీద అమరిన చౌహాన్ రాజుపుత్రుల రక్షణ కవచంగా ఉన్న బలిష్ఠమైన కోట- దర్శనీయం.

స్థానిక స్థల సందర్శనాసక్తులకు :-

అజ్మీరులో :

సమయం : ఉ. 7-45 నుండి మధ్యాహ్నం 1-10 వరకు.

టిక్కెట్టు : రు. 15/-

నిర్వహణ : రాజస్థాన్ గవర్నమెంటు టూరిస్టు బ్యూరో.

యాత్ర మొదలు : ఖదీమ్ టూరిస్టు బంగళా.

స్థలాలు : ఖ్వాజా మొయినుద్దీన్ దర్గా, అఢయా దిన్‌కా జోంప్రా, బారాదరి, అనాసాగర్, సుభాష్ బాగ్, సోనిజీకానిసయన్ (జైనాలయం) మ్యూజియం, పుష్కర సరోవరం.

అజ్మీరులోని వసతులు :

ధర్మశాలలు : తిలక్‌చంద్ జైన్ ధర్మశాల, లోధి ధర్మశాల, హిందూ ధర్మశాల, సింధి ధర్మశాల.

పీటికితోడు :

హోటళ్ళు – నాగ్‌పాల్ హోటల్, స్టేషను రోడ్డు, రతన్ హోటల్, పృథ్వీ రాజ్ మార్గ్, మినార్ హోటల్, రాజస్థాన్ లాడ్జి, లక్ష్మి హోటల్, మరీనా హోటల్ వగయిరాలు.

ఇతర వసతులు :

సర్క్యూట్ హౌస్, దౌలతాబాద్ గార్డెన్స్, ఫోన్ : 20795
ఖదీమ్ టూరిస్టు బంగళా, సావిత్రి గరల్స్ కాలేజి రోడ్, రైల్వేస్టేషను దగ్గర, ఫోన్ : 30490

ఖదమ్ గెస్టుహౌస్, దర్గా దగ్గర.

కింగ్ ఎడ్వర్డు VII మెమోరియల్ హోటల్, స్టేషను రోడ్, ఫోన్ : 20936
రైల్వే రిటయిరింగు రూములు— రైలు ప్రయాణీకులకు మాత్రం.

అజ్మీరు రాష్ట్రంలో అన్ని ముఖ్యకేంద్రాలు చక్కని రోడ్డు మార్గాలతో కలయిక వుంది. అందులో ముఖ్యమయినవి కొన్ని.

| వరకు | దూరం కి.మీ. | మజిలీ కేంద్రాలు–గమ్యం |
|---|---|---|
| ఆగ్రా — | 370 | జైపూరు–138, దౌసా–51, మహ్వా–63, భరత్‌పూర్–60, ఫతేపూరు సిక్రీ–21, ఆగ్రా–67. |
| భరత్‌పూర్ — | 312 | జైపూర్ నుండి మహ్వా వరకు పై మాదిరిగానే. మహ్వా నుండి భరత్‌పూర్–60. |
| బికనీరు — | 234 | నాగూర్–128, నౌఖా–57, బికనీర్–49. |
| బుందీ — | 139 | కెక్రి–56, దేవ్‌లీ–35, బుందీ–48. |
| చితోర్‌ఘర్ — | 182 | భిల్వారా–128, చితోర్‌ఘర్–54. |
| ఢిల్లీ — | 444 | జైపూరు–138, సరిస్కా–105, ఆల్వార్–37, సోనా–108, ఢిల్లీ–56. |
| జైపూర్ — | 138 | కిషన్‌ఘర్–30, దుదు–43, జైపూరు–65 |
| జైసల్మేర్ — | 458 | బివార్–53, జోధ్‌పూరు–110, షాయిత్రవ–111, దీహా–24, పొకారన్–51, జైసల్మేర్–109. |

| | | |
|---|---|---|
| కోట — | 178 | కెక్రి–56, దేవ్‌లి–35, బుంది-48, కోట–39. |
| అబూ శిఖరం — | 371 | బీవార్-53, పాలి–112, సిరోహి–111, అబూ శిఖరం–95. |
| ఉదయపూర్ — | 269 | బీవార్-53, తోడ్‌గర్–69, కాంక్రోలి-84, ఉదయపూర్–63. |

## జెసాల్మేర్ నుండి

| | | |
|---|---|---|
| అజ్మీర్ — | 500 | పొకారన్–109, దీచు–51, షాయిత్రవ–24, జోధ్‌పూర్–111, బీవార్–152, అజ్మీర్–53. |
| ఢిల్లీ — | 897 | అజ్మీరు వరకు పై మాదిరిగానే- అజ్మీర్ నుండి జైపూర్–138, కోట్‌పుత్లి –106, ఢిల్లీ–153. |
| బికనీర్ — | 328 | పొఖారన్–109, రామ్‌దేవ్రవ–10, ఫాకోడి –47, నోఖా–71, గజ్నేర్–62, బికనీర్–29. |
| జైపూరు — | 638 | అజ్మీరు వరకు పైమాదిరిగా – అక్కడి నుండి జైపూర్–138. |
| జోధ్‌పూరు — | 295 | అజ్మీరు మాదిరిగా జోధ్‌పూరు వరకు. |
| ఉదయపూర్ — | 663 | అజ్మీరు– బీవార్ వరకు పై మాదిరిగా- బీవార్ నుండి తోడ్‌గర్–69, కాంక్రోలి-94, ఉదయపూర్–63. |

## బికనీర్ నుండి

| | | |
|---|---|---|
| అజ్మీర్ — | 234 | నౌకా–49, నాగపూర్–57, అజ్మీర్–128 |

| | | |
|---|---|---|
| ఢిల్లీ — | 494 | జోధ్‌సర్-51, రతన్‌గర్-76, సర్దార్ షహర్-42, రాజార్-93, హిస్సార్-71, రోహతక్-90, ఢిల్లీ-71. |
| ఢిల్లీ — | 457 | (కొంచం షార్ట్‌కట్‌లో) జోధ్‌సర్-51, రతన్‌గర్-76, చురు-48, ఝున్‌ఝును-45, పిలాని-41, భివాని-74, రోహతక్-47, ఢిల్లీ-71. |
| జైపూరు | 316 | జోధ్‌సర్-51, రతన్‌గర్-76, సికార్-82, జైపూరు-107. |
| జైసల్మేర్ | 328 | గజ్నేర్-29, నోఖా-62, ఫాలోడి-71, రామ్‌దేవ-47, పొఖారన్-10, జైసల్మేర్-109 |
| జోధ్‌పూర్ | 245 | నౌఖా-49, నాగాపుర్-59, ఖైరాస-77, జోధ్‌పూరు-60. |





# గుజరాతు



వెనుకెప్పుడో క్రీ.శ. 5 శతాబ్దికాలంలో ఘూర్జరులు అనే జాతి ప్రజలు స్థిర నివాసం ఏర్పరచుకున్నారట ఇక్కడ. అందువలన గుజరాతు అనే పేరు వచ్చిందంటారు. అయితే ఈ ప్రదేశం ప్రాచీన సింధు నాగరికత దివ్యంగా వెలిగిన అతి పురాతన పట్టణాలయిన హరప్పా, మొహంజోదారోల ప్రాచీనత్వాన్ని, చరిత్రను కలిగియున్నట్లుగా 'లోథల్' అనే ప్రదేశంలోని త్రవ్వకాల్లో బయల్పడిన ప్రాచీనావశేషాలు ప్రస్ఫుటీకరిస్తున్నాయి–సుమారు 5000 సంవత్సరాలు దాటి ఉజ్జ్వలతకు ప్రోది చేస్తున్నాయి. ఈ ప్రాంతానికి విశేషమైన పురాణ ప్రశస్తి వుంది. క్రీస్తు పూర్వం బౌద్ధ మతావలంబించి యైన అశోక చక్రవర్తికి ఆతిథ్యమిచ్చిన ఈ ప్రదేశం- జైనమతానికి బలమైన పునాదిస్థలం. పేరెన్నికగన్న జైనాలయాలు సుప్రతిష్ఠితం. మహాభారత కాలంలో ద్వాపరయుగం చివరికాలంలో శ్రీమహావిష్ణువు దశావతారాల్లో ఒకటిగా భావించబడుతున్న శ్రీకృష్ణభగవానుని ద్వారక ఇక్కడే వుండటం విశేషం. అసలు ద్వారక సముద్రంలో మునిగిపోయిందని చెప్తున్నా (యుగాంతంలో), ఈనాటిద్వారక ఆ ద్వారకకు చేరువలో ఉండటం గమనార్హం. ద్వాపరయుగంలో శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతను బోధించి మానవులను కర్తవ్యోన్ముఖులను చేస్తూ జీవన సాఫల్యానికి రాజమార్గం పరిస్తే, కలియుగంలో ఈ ప్రాంతంలోనే ఉద్భవించిన గాంధీ మహాత్ముడు సత్యాహింసల శాంతిమార్గమును తాను ఆచరించి- ఇతరులకు బోధించి భరతమాత దాస్య శృంఖలాలను ఛేదించి మానవోత్తముడుగా ప్రపంచ మానవకోటి చరిత్రలో చిరస్థాయిగా నిలిచారు. రెండు యుగాల మహాపురుషులు అవతరించిన పుణ్యభూమిగా గణుతికెక్కి- దేశంమొత్తంమీద సుసంపన్నమైన ఈ రాష్ట్రం–

భౌతికంగా :

స్వతంత్ర భారతంలో పశ్చిమోత్తర మూలగా అరేబియా సముద్రపు అంచుల్లో వాయవ్య దిశలో పాకిస్తాను, ఉత్తరాన రాజస్తాన్, తూర్పున మధ్యప్రదేశ్, దక్షిణాన; ప్రాక్ దక్షిణదిశన మహారాష్ట్రములచేత ఆవరించబడి యున్నది. భౌగోళిక స్వరూపాన్ని బట్టి ఈ రాష్ట్రాన్ని ముచ్చటగా మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. 1) సాంప్రదాయాను సారంగా 'సౌరాష్ట్ర'గా పిలవబడే ద్వీపకల్పం- అక్కడక్కడ ఎత్తు తక్కువయిన గుట్టలు, చిన్న చిన్న కొండలుగల ప్రదేశం. 2) బీడు, ఎడారి బాడవరాతి ప్రాంతమయిన కచ్, ఎక్కువభాగం ఉత్తరానికి విస్తరించి, తూర్పువైపున తక్కువ స్థలాన్ని ఆక్రమించినది. 3) కచ్ ఎడారి, ఆరావళి పర్వతాలనుండి పారి విస్తరించిన నదీపరీవాహక మైదానప్రాంతం ముఖ్యమైనది. సారవంతమైనది. రాష్ట్రంలో ప్రముఖపాత్ర వహిస్తున్న ప్రదేశం.

గుజరాతు రాష్ట్రంలో పెద్ద నదులుగా పేర్కొనబడే- మాహి, సబర్‌మతి, నర్మదా, తపతి నదులు. చిన్న చిన్నవిగా ఉన్న బనాస్, సరస్వతి, దామనగంగా నదులు తమ జలాలతో సుభిక్షం చేస్తున్నాయి. అయనాంశమైన కర్కాటరేఖ రాష్ట్ర ఉత్తర సరిహద్దు గుండా ప్రయాణిస్తుండగా వాతావరణం వైరుధ్యాలు విపరీతంగా ఉండవలసిన ప్రదేశం. అయితే పశ్చిమాన అరేబియా సముద్రం, కాంబే అఖాతం, తూర్పున ఉన్న పర్వతారణ్య ప్రాంతాలు వాతాతపాల్ని నియంత్రించడం ప్రకృతి వరం ఈ రాష్ట్రానికి.

సంగ్రహంగా రాష్ట్రచరిత్ర :

1960 మే 1న బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టాన్ననుసరించి గుజరాతు రాష్ట్రం ఆవిర్భవించింది. బొంబాయి రాష్ట్రంలో గుజరాతు భాష మాట్లాడేవారిని వేరు పరుస్తూ గుజరాతు, మహారాష్ట్రలుగా విడగొట్టడం జరిగింది. పూర్వపు బొంబాయి రాష్ట్రంలోని బనాస్కాంత, మెహసానా, సబర్‌కాంత, అహమ్మదాబాదు, కైరా, పంచ మహాలులు, వడోద్రా, బారూచ్, సూరత్, దాంగ్స్, అమ్రేలి, సురేంద్రనగర్, రాజ్ కోట్, జామ్‌నగర్, జునాగఢ్, భావనగర్, కచ్, బుల్సార్ జిల్లాలు గుజరాతులో చేరి పోయాయి. వీటితోపాటు స్థానికంగా మరికొన్ని జిల్లాలు మొత్తం రాష్ట్రాన్ని పాలనా పరంగా 19 జిల్లాలుగా విభజించారు. రాష్ట్రానికి ఒకేఒక చట్టసభ ఉంది. లెజిస్లేటివ్ అసెంబ్లీ- 182మంది ప్రజా ప్రతినిధులుంటారు.

రాష్ట్ర వైశాల్యం: 1,95,984 చ.కి.మీ.

రాజధాని: గాంధీనగర్

జనాభా: మూడుకోట్ల 50 లక్షలుపైనే

మాట్లాడేభాష : గుజరాతి, మరాఠి, హిందీ

అక్షరాస్యత : 47 శాతం.

స్త్రీ పురుష నిష్పత్తి : 942 : 1000

జనసమ్మర్దత : 174 మంది చ.కి.మీ.కు

ముఖ్య జీవనోపాధి : వ్యవసాయం, పరిశ్రమలు

గుజరాతు కొత్తగా ఏర్పడిన రాష్ట్రం- ప్రాంతాలను అనేకమంది రాజవంశాలు పరిపాలించాయి. ఉత్తరాన గూర్జరులు, దక్షిణ ప్రాంతాన్ని చాళుక్యులు, సౌరాష్ట్రమును మైత్రికులు- వీరికి తరువాతివారు ప్రతీహారులు, రాష్ట్రకూటులు పరిపాలించిన ముఖ్య రాజవంశాలు. బ్రోచ్, కాంబే, సూరత్, సోమనాథ్, ద్వారక ప్రసిద్ధి చెందిన వ్యాపార కేంద్రాలు. అరబ్బు దేశీయులు, ఐరోపీయులు ఎప్పుడూ నిరంతరం బజార్లలో విశేషంగా కనబడుతుంటారు. సముద్రతీరం గుజరాతు రాష్ట్రంలో దేశం మొత్తంలో మూడవవంతు నిడివి 1290 కి.మీ. పొడవునా ఆవరించి ఉండి ప్రసిద్ధి కెక్కింది. బ్రిటిష దేశస్థులు మొట్టమొదట తమ వ్యాపార కేంద్రం సూరత్‌లో ప్రారంభించి తరువాత తమ సామ్రాజ్య విస్తరణ గావించారు. ఏ ప్రాంతంలో అయితే మొదట కాలుపెట్టారో ఆ ప్రాంతీయోద్భవమైన జాతిరత్నమే దేశమాతను దాస్య బంధనం నుంచి విమోచన కలిగించగలటం యాదృచ్ఛికమా! విశేషమా!! వింతా!!! ఏమిటో ఈ విచిత్రం! పోరుబందర్‌లో జన్మించిన మహాత్మాగాంధి పేరునే వారి రాష్ట్ర రాజధానికి పేరు పెట్టుకోవడంలో ఎంతయినా ఔచిత్యం కానవస్తుంది. పూర్వపు రాజధాని అహమ్మదాబాదుకు 23 కి.మీ. దూరంలో అమరియున్న గాంధీనగర్.

ప్రజలు సౌమ్యులు, నాగరీకులు, సంస్కృతీ సంప్రదాయాల్లో విశిష్టతను వెలారుస్తూ నిజాయితీగల వాణిజ్యవేత్తలుగా ప్రసిద్ధి. ప్రపంచం నలుమూలలా విదేశాల్లో సైతం ప్రముఖ వ్యాపారస్తులుగా చలామణీ అవుతున్నవారు గుజరాతీయులు. అమెరికాలో ఇండియన్ అంటే పటేల్ అనే! ముఖ్యమయిన పండుగలు- మకర సంక్రాంతి, దేవీ నవరాత్రులు, శారదా పూర్ణిమ, జన్మాష్టమి, కార్తీక పున్నమి మొదలయిన హైందవ సాంప్రదాయాల పర్వదినాలతోపాటు మొహరం మొదలయిన మహ

మ్మదీయ పర్వదినాలు కూడా వైభవంగా పండుగలు చేసికొంటారు. ముందుగా ముఖ్యమయిన ఇండియన్ మాంచెస్టర్ అని పేరుగల-

# అహమ్మదాబాదు

గుజరాతు రాష్ట్రంలో ఒక ప్రధాన నగరం. గొప్ప పారిశ్రామిక నగరం. వస్త్ర పరిశ్రమలో అగ్రగామిగా వర్ధిల్లుతున్నది. నగరాన్ని కాలుష్య భారం క్రమంగా ఆవరిస్తున్నట్లు ఇటీవలి పరిణామాలు తెలియపరుస్తున్నాయి. నగరానికి 500 సంవత్సరాలపైగా చరిత్ర వుంది. నగరం 1411లో అహమ్మద్‌షా స్థాపించాడు. 1615 సంవత్సరంలో సర్ థామస్‌రో అభిప్రాయం ప్రకారం- ఇండియాలోని అందమైన నగరాల్లో ఒకటిగా పేర్కొనబడింది. సబర్‌మతి తీరాన అమరియున్న మహాత్మాగాంధీ గారి సబర్మతీ ఆశ్రమం దర్శనీయం. అందులోనే ఒక చిన్న మ్యూజియం కూడా ఉంది. నగరంలో ముఖ్యంగా చూడదగినవి- మొట్టమొదటగా ఇంగ్లీషువారు వ్యాపారాంగీకారం కుదుర్చుకున్న స్థలం.

పాతనగరం అంతా ఇరుకైన వంకర టింకర్లుగా ఉన్న సందుల్లాంటి వీధుల్తో నిండి ఉంటే కొత్తగా అభివృద్ధి చెందిన నూతన నగరం విశాలమైన రాజవీధులతో మెరిసే స్టీలు, గాజుపలకలు అమర్చిన అద్దాల సౌధాలు కనువిందు చేస్తాయి. పాత నగరంలో-

**భద్రకోట :**

ఒకప్పుడు ద్వాదశ ద్వారాలతో రాజభవనాలతో నిండిన ఉద్యానవనాలు చూడదగినవి. కొటలోగల భద్రకాళి ఆలయం, ఆసక్తికరమైన గడియార స్థంభం విశేషాలు.

**హాథీసింగ్ దేవాలయం :**

ఢిల్లీగేటు బయట పాలరాతితో కట్టించబడిన దేవాలయం. శిల్పాల నగిషీలు మనోహరం. 1848లో సేట్ హాథీసింగ్ నిర్మించారు. అధిదేవత 15వ తీర్థంకరులైన ధర్మనాథ్. జైనమత వ్యాప్తికి మూలస్థంభాల్లాంటి 12 మంది తీర్థంకరుల పాలరాతి ప్రతిమలున్నాయి. ప్రశాంతంగా మనస్సుకు ఆహ్లాదకరంగా వుంటుంది.

**జామా మసీదు :**

1423లో నగరనిర్మాత అయిన సుల్తాన్ అహమ్మద్‌షా నిర్మించినది దేశంలో పెద్ద మసీదుల్లో ఒకటిగా పేర్కొనబడింది. 260 స్థంభాల మోముతో 16 డోము

ంతో హైందవ-మహమ్మదీయ శిల్పకళా వైచిత్రిమిళితం స్ఫుటంగా కానవస్తుంది. తీన్ దర్వాజా దగ్గర వుంది.

కంకరియా సరస్సు :

జహంగీరు చక్రవర్తి, ఆయన సతీమణి నూర్జహానులు ఎన్నో మధురమైన సాయంకాలాలు గడిపిన చోటుగా ప్రసిద్ధి. మంచి పిక్నిక్‌స్పాట్. మధ్యలో ఒక చిన్న దీవిలో సుల్తాన్ కుతుబుద్దీన్ 1453లో నిర్మించింది.

బాలవాటిక :

పిల్లల పార్కు. పెద్దలు వెళ్ళాలంటే పిల్లలను తీసికొనివెళ్తేనే సరి. లేకుంటే లేదు. బాలల స్వప్నలోకంగా కీర్తించబడే ఈ పార్కులోనించి సుందరమైన సరస్సును దృశ్యమానంగా వీక్షించవచ్చు.

కదిలే స్తంభాలు :

బహుచిత్రమైన కట్టడం పని. సారంగపూర్ గేటు దగ్గర బయటఉన్న రెండు గోపురాలున్నాయి. ఒకదాన్ని కదిలిస్తే రెండోది దానంతటదే కదులుతుంది. ఒక దానిలో చప్పట్లు చరిస్తే రెండో దానిలో ప్రతిధ్వనిస్తుంది. రెండూ పక్క పక్కనే వున్నాయి. 1450లో నిర్మించబడినవి. ఏమి ఇంజనీరింగో మరి!

సిది సయీద్ మసీదు :

ఇండో సార్సనిక్ కళావైశిష్ట్యానికి మచ్చుతునక. బయటకు చొచ్చుకొని వచ్చినట్లున్న బాల్కనీలలో ఏర్పరచిన కిటికీలు, గవాక్షాలు విచిత్రమైన రీతుల్లో నిర్మించబడ్డాయి. చెట్ల కొమ్మలని రాతిలో కలిపి కలనేత నేసినట్లుగా నిర్మించబడి ఉండటం గొప్ప చిత్రం.

రాణి రూపమతిమసీదు :

సుల్తానువారి హిందూ భార్య-ప్రియురాలు. ఆమె స్మృతి చిహ్నంగా నిర్మించబడిన మసీదు. 1819లో జరిగిన ఘోర భూకంపం మసీదులో చాలా భాగాన్ని కూలగొట్టింది.

రాణి సిప్రి మసీదు :

మసీదుల్లో మణిహారం. 'మస్‌జిద్–ఎ–నగినా'గా భావించబడే ఈ మసీదు దర్గా బహు రమణీయంగా ఉంటుంది. సుల్తాన్ మహమ్మద్ బేగడ 1514లో కట్టిం

చారట. ఆమె కుమారుడు చేసిన చిన్న తప్పిదానికి కినిసిన సుల్తాను కన్న కొడుకని కూడా చూడకుండా శిక్షగా చంపివేశాడట. ఆతనికి స్మృతి చిహ్నం. వ్యూహంతోను కట్టడంలోని పనితనం విశేష ప్రశంసలందుకొన్నది. హిందూ-మహమ్మదీయ శిల్ప చాతురీమేళనం ఇక్కడ కూడా దర్శనీయం.

## సబర్మతి ఆశ్రమం :

సబర్మతీ నదీ తీరంలో నెలకొన్నది. మహాత్మాగాంధీ ఆశ్రమం. స్వతంత్రానికి పూర్వం అనేక ముఖ్య రాజకీయ కలాపాలకు, నిర్ణయాలకు చరిత్రాత్మక ప్రాముఖ్యం పొందివికొన్నది. 1918 నుండి 1930 వరకు గాంధీజీ, కస్తూరిబాయి దంపతులు ఇక్కడ నివసించారు. ఈ ఆశ్రమ వాటికలో గాంధీ మహాత్మునికి సంబంధించిన అనేక వస్తువిశేషాలు భద్రంగా దర్శనీయంగా అట్టిపెట్టారు.

ఇంకా చూడదగినవి—దాదాహరీ మెట్లబావి—చిత్రమైన కట్టడం, సుల్తాన్ మొహమ్మద్ బేగడ్ సమాధి (సర్కిజ్ రేజా) షా ఆలం సమాధి— పాలరాతితో ఫ్రేముల్లో బిగించబడిన ఇత్తడి దర్వాజాలతోను, నేలంతా నలుపు, తెలుపు పాలరాతి ఫలకాలు పరిచినది చూడవచ్చు. సబర్మతిలో స్నానం చేయదలచిన యాత్రికులు బస్సుమీద వెళ్ళి విక్టోరియా గార్డెన్సు దగ్గర దిగి వెళ్ళి, స్నానం చేసిరావచ్చు. మ్యూజియంలను దర్శించవచ్చు.

## అదాలజ్ వావ్ :

500 సంవత్సరాలనాడు జరిగిన ఎయిర్‌కూల్ ప్రక్రియ. ఒక పెద్ద బావిలో నేల మాళిగలో నీటికి దగ్గరిలో అనేక గదులు కట్టించబడినాయి. 1466 రాణి రుడాబాయి నిర్మింప చేశారు. ఎండాకాలంలో ఈ గదుల్లో చేరి చల్లగా సేదదీరటానికి ఉపయోగించే వారు.

## గాంధీనగర్ :

అహమ్మదాబాదుకు 19 కి మీ. దూరంలో సబర్మతీ తీరంలో నిర్మించబడిన ఆధునిక నగరం- రాష్ట్ర రాజధాని. ముఖ్యమయిన ప్రభుత్వభవనాలు ఆధునిక నిర్మాణ రీతుల్లో నిర్మించబడినాయి. పార్కులు, ఉద్యానవనాలు, తోటలు రమణీయం. 1970 నుండి రాష్ట్ర రాజధానిగా ఉంటోంది.

## అహమ్మదాబాదుకు దగ్గరలో

**లోథాల్ :**

80 కి.మీ. దూరంలో 4000 సంవత్సరాల పురాతన వైభవం కళ్లారా చూచే భాగ్యం కావాలంటే ఇక్కడి రాక తప్పదు. లోథాల్‌లోను, సౌరాష్ట్రలోను, కచ్‌లోను కొన్ని ప్రదేశాలను పురాతత్త్వ శాస్త్ర విభాగంవారు త్రవ్వించిన త్రవ్వకాల్లో నాగరికతావశేషాలెన్నో బయటపడ్డాయి. బారులు తీరిన ఇళ్ళు మంచి ప్లాను ప్రకారం నిర్మించబడిన గృహసముదాయాలు, ప్రతి యింటికీ ఒక స్నానాల గది, నీరు బయటకు పోవటానికి తూముల నిర్మాణం గమనార్హమైన విషయాలు – ఆసక్తిని రేకెత్తించేవి. ప్రసిద్ధి చెందిన ప్రాచీన సింధు నాగరికతకు ఆటపట్టుగా కనుగొనబడిన ప్రదేశం హరప్పా (ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉన్నది) కు లోథాల్‌లోని వారికి అతి సన్నిహిత సంబంధాలుండేవని తెలుస్తుంది. స్థానిక వస్తుప్రదర్శనశాలలో అనేకమైన మృణ్మయ పాత్రలు, ఆభరణ విశేషాలు, ముద్రికలు మొదలయినవి ప్రదర్శనాయోగ్యంగా ఉంటాయి. దర్శనీయం.

## అహమ్మదాబాదులో ఉండటానికి వసతులు :

**ధర్మశాలలు :**

రైల్వేస్టేషనుకు ఎదురుగా భాటియాని-వడి, దగ్గరిలోనే రేవాభాయి ధర్మశాలలు ముస్లిములకు, ముసాఫిర్‌ఖానాలు.

గాంధీ ఆశ్రమ్ రెస్టుహౌస్, ఆశ్రమం రోడ్డు,

యూత్ హాస్టలు – గాంధీనగర్

సర్క్యూట్ హౌస్, షాహిబాగ్, మునిసిపల్ విశ్రాంతి గృహం,

గీతామందిరం రోడ్డు, స్టేటు బస్సుస్టాండు.

రిజర్వేషనులు ఆయా మేనేజర్లను సంప్రతించి పొందవచ్చు.

**హోటళ్ళు :**

**సామాన్యులకు అందుబాటులో ఉన్నవి :**

క్వాలిటీ రెస్టారెంటు. రిలీఫ్ రోడ్డు

ప్లాజా హోటల్,

దగ్గరిలోనే :

హోటల్ షియానా, అలిటా గెస్టుహౌస్,

హోటల్ నటరాజ్,

అలంకార్ హోటల్ మొదలయినవి సామాన్యులకు అందుబాటులో ఉండేవి- రు. 30 నుండి 50 రూపాయల వరకు.

మరికొంచం ఎక్కువ పెట్టగలిగేవారికి-

మెట్రోపాల్ హోటల్, హోటల్ మెహుల్, హోటల్ మోతిమహల్, హోటల్ గుల్మార్గ్, హోటల్ ఎస్క్వైర్ మొదలయినవి రోజుకి 100/- వరకు ఆపైన కొంచం వసతినిబట్టి చార్జీలుంటాయి.

శ్రీమంతులకు :

హోటల్ కామా, కాన్పూర్ రోడ్డు, దగ్గరిలోనే కొత్తగా కట్టించబడిన రివేరా హోటల్, రిట్జ్ హోటలు, హోటలు క్షాప్రి, హోటలు కర్నావతి, హోటలు నటరాజ్ వగైరాలు రోజుకి రు. 200/- నుండి 5 లేక 6 వందలు రూపాయలవరకు పెట్టుకోగలవారికి ప్రత్యేకం.

సమాచారం :

1) టూరిస్టు ఆఫీసు, అహమ్మదాబాదు మునిసిపల్ కార్పొరేషను, దానాపాత్
2) టూరిజమ్ కార్పొరేషను ఆఫ్ గుజరాతు LTD., H. K. హౌస్, జీవాభాయి ఛాంబర్స్, ఆశ్రమ్ రోడ్డు.
3) రీజనల్ మేనేజరు, టూరిజమ్ కార్పొరేషన్ ఆఫ్ గుజరాతు లి. ఎయిర్‌లైన్సు హౌస్, లాల్ దర్వాజా.
4) టూరిస్టు కౌంటర్లు - ఎయిర్‌పోర్టు, రైలుస్టేషనులలో

రిజర్వేషన్లు :

ఎయిర్‌లైన్సు హౌస్, లాల్‌దర్వాజా, అహమ్మదాబాదు రైల్వే రిజర్వేషను ఆఫీసు- ఉ. 8గం. నుండి సా. 4-30 వరకు మధ్యలో మధ్యాహ్నం 1 గం. నుండి 1-30 వరకు లంచ్.

మొదటి తరగతి రిజర్వేషనులు : ఉ. 9-30 నుండి సా. 6 గం. వరకు.

బస్సులకు :

గుజరాతు రాష్ట్ర ట్రాన్సుపోర్టు డిపో, గీతామందిర్ రోడ్డు,

గయిడు సర్వీసులుకోసం అవసరమనుకునేవారు మునిసిపల్ కార్పొరేషనులో ఉన్న టూరిస్టు ఆఫీసులో సంప్రతించాలి.

అహమ్మదాబాదు రాష్ట్రంలోని అన్ని ప్రధాన నగరాలను కలుపుతూ బస్సు సౌకర్యం వుంది.

వడోద్రాకు – వయా కైరా – 112 కి. మీ. దూరం.
మౌంటు ఆబూకు — వయా పాందిపూర్ — 229 కి. మీ. దూరం
ఉదయపూరుకు – వయా హిమ్మతీపూరు – 253 కి. మీ. దూరం
జైపూరుకు – వయా ఉదయపూరు – 664 "
బొంబాయికి — " వడోద్రా — 581 "
ఢిల్లీకి — " ఉదయపూర్ — 1076 "

వూరిలో తిరగటానికి టాక్సీలు, టూరిస్టు కార్లు, టూరిస్టు టాక్సీలు లభ్యమవుతాయి.

## మొ ఢే రా

ఒకనాడు ఇది పట్టణంగా శోభిల్లినా నేడు ఒక కుగ్రామంగా వున్నది. పుష్పావతి అనే చిన్న నది తీరంలో నిర్మితమైన సూర్యాలయం శిల్పకళా కేంద్రమై ప్రసిద్ధికెక్కింది. 1027లో నిర్మింపబడిందని అభిజ్ఞుల అభిప్రాయం. ఆలయం ఎదురుగా రామకుండమనే సరస్సు కూడా వుంది. తూర్పు తీరంలో కోణార్క సూర్య దేవాలయం కంటే కూడా శిల్ప సౌందర్యంలో మించిపోయి వున్నదట. ఆలయం స్తంభముల మోపుతో కట్టించబడిన ఒక వేదికమీద నిర్మించబడింది. గర్భగుడిలో అసలు మూర్తి మాత్రం మృగ్యం. సూర్యుని అద్భుతమైన పన్నెండు ప్రతిమలు అత్యద్భుతంగా వున్నవానిని చూడవచ్చు. పండితుల అభిప్రాయం ప్రకారం ఇరాన్‌లోని సూర్య మహాదేవుని భావన ఇందులో ఇమిడియున్నది. సరస్సును త్రవ్వటంతో పురావస్తు శాఖవారికి ఆసక్తికరములైన అనేక విషయములు బయల్పడినాయట. ఆలయం నిర్మించింది శిల్ప ప్రియులైన బాణుక్యులు నిర్మించి ఉండవచ్చునంటారు కొందరు కాని ఇదమిద్ధంగా తెలియదు.

# పట్టాన్

మొధేరా నుండి 30 కి.మీ. దూరంలో అమరియున్నది. వ్యూహం ప్రకారం నిర్మించబడిన ఈ నగరం క్రీ.శ. 8 వ శతాబ్దంలో నిర్మించబడిందని ప్రతీతి. క్రీ.శ. 1000 సం. ప్రాంతంలో మహా విశాలమై వైభవంగా వెలిగిన పట్టణం. మంచి వ్యాపార కేంద్రం, 14 వ శతాబ్దం వరకు గుజరాతుకు రాజధానిగా వున్నది. అహమ్మదాబాదు నగర నిర్మాణం తరువాత రాజధానిని సమకూర్చటం జరిగింది. అప్పటినుండి ప్రాము ఖ్యత తగ్గిపోయింది. ఇక్కడ పెద్ద సరోవరం, జైనాలయాలు ప్రశాంత వాతావర ణంలో తిలకించవచ్చు. పటోలా పట్టు చీరెలు ఇక్కడివే।

# బరోడా

ప్రస్తుతం వడోద్రా అని పిలువబడే నగరం. బరోడా సంస్థానంను పాలించిన వారు గైక్వాడ్ రాజుల ముఖ్య పట్టణం. పూర్వం బరోడా సంస్థానం అని పిలవబ డేది. బొంబాయి నుండి, విమాన సౌకర్యం వుంది. బొంబాయి—ఢిల్లీ, బొంబాయి-అహమ్మదాబాదు లైన్లమీద రైల్వే స్టేషను వుంది. చక్కని పార్కులు, భవనాలు, తీర్చిదిద్దినట్లుంటాయి. అందమైన ప్రశాంత నగరం.

**భవనాలు — ప్రాసాదాలు**

**లక్ష్మీవిలాస భవనం :**

ఇండో-అరబ్బీల మేలు నిర్మాణ వైచిత్రుల మేళవింపు, ఇటాలియన్ మొజా యిక్‌తోను, రోమన్ నిర్మాణ శిల్ప వైచిత్రితో వెలయించిన మకరపూర్ భవనం, గైక్వాడ్ వంశీయుల చిత్ర పటాలుతో ఉన్న నజర్‌గర్ గృహం, దాంతోపాటు ప్రతాప్ విలాస భవనం ఆసక్తికరమైనవి.

**M. S. విశ్వవిద్యాలయం :**

ఒకనాడు ఈ యూనివర్సిటీ కాలేజీలో మహర్షి శ్రీఅరవింద ఘోష్‌వారు ఉపా ధ్యాయులుగా వున్నారు. లలితకళా విభాగం, ఆర్కియాలాజికల్ విభాగం మధ్య యుగాల నాటి చిత్రకళా చిత్రాలు పరమాద్భుతాన్ని కలిగిస్తాయి.

**కీర్తిమందిరం :**

గైక్వాడ్ రాజులుపయోగించిన గది ప్రత్యేకంగా చూడదగినది. కుడ్య

చిత్రాలు ప్రముఖ చిత్రకారులు నందలాల్‌బోస్ చిత్రించిన చిత్రాలు కమనీయం. చూడ దగినవి.

**రాజా ఫతేసింగు మ్యూజియం :**

రాఫేల్, టిషియన్, మ్యురిల్లో మొదలయిన విదేశ చిత్రకారులు రచించినచిత్రాలుతోపాటు, శిల్పకళా విభాగంలో రోమన్, చైనా, జపానీయుల కళాఖండాల్తో భారత కళాఖండాలు కూడా ప్రదర్శించబడుతున్నాయి.

దీనితోపాటు బరోడా మ్యూజియం కూడా చూడనగును.

బరోడా చుట్టు ప్రక్కల

**చంపానీర్ :**

15, 16 శతాబ్దాల్లో గుజరాతు దేశానికి రాజధానిగా వెలిగిన నగరం. బరోడా నుండి 40 కి.మీ. దూరం వుంది. అరణ్యక పర్వతపాదాల చెంత అమరిన ఈ ప్రదేశంలో శిథిలమైన కోట వుంది. నగరం ఉచ్చదశలో వున్నపుడు 20 కి.మీ. చుట్టుకొలత గలిగి మహానగరంగా విలసిల్లిందట. కొండమీద కాళికాలయముంది. శక్తి ఆలయం. నవరాత్రుల్లో జరిగే ఉత్సవాలకు యాత్రికులు విశేషంగా వస్తారు.

గాధినందనుడు బ్రహ్మర్షి పదమునకు ఈ శిఖరంమీద కొన్నాళ్ళు తపస్సు చేశాడని ప్రతీతి. విశ్వామిత్ర నది కూడా పుట్టినది. దర్శనీయిం.

**డభోయ్‌కోట :**

బరోడాకి ఆగ్నేయదిశగా 25 కి.మీ. దూరంలో వుంది. ఈ కోట 13వ శతాబ్దంలో నిర్మించినదైనా ఇంకా మాసిపోలేదు. గుజరాతు హిందూ శిల్పరీతులను వెలార్చే శిథిలాలున్నాయి. నాలుగు ద్వారాలుతో వున్న కోటలో కాళికామాత ఆలయం వుంది.

**పావ్‌గడ్ :**

పావ్-అంటే నాలుగోవంతు. రామరావణ యుద్ధకాలంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు రామభక్త హనుమాన్ సంజీవనీ పర్వతం మోసుకొని వచ్చే సమయంలో కొంతభాగం విరిగి పడిందట. అదే యీ పావ్‌గడ్ అని కథనం. సంజీవనీ పర్వతం హిమాలయాల్లో వున్న ఔషధనిలయం అని తెలుసుగదా! ఈ కొండకు ఈ విధంగా పురాణ ప్రసిద్ధి కలిగింది. కొండమీది కోటలో వేంచేసియున్న కాళికాదేవికి మహాసంరంభంగా ఉత్సవం జరుగుతుంది.

చందోడ్ :

డభోయ్‌కోట నుండి సుమారు 20 కి.మీ. దూరంలో ఒరేసాంగ్, నర్మదా నదుల సంగమ స్థానం. ప్రతి పౌర్ణమికి 'మేళా' జరుగుతుంటుంది. శేషసాయి, రాధికా మాత, కాశీ విశ్వనాథాలయాలు దర్శనీయములు. నావమీద బ్రోచ్‌కి కూడా వెళ్ళవచ్చు.

## డా కో రు

అహమ్మదాబాదు నుంచి గాని, బరోడానించి గాని 10 కి.మీ. దూరంలో ఉంది. పెద్ద గ్రామం లేక ఒక చిన్న పట్టణం. ఒకానొక కథనం ప్రకారం ఒకానొక భక్త శిఖా మణి ద్వారక నుండి శ్రీకృష్ణ భగవానుని విగ్రహం తీసికొని వచ్చి ఈ ప్రసిద్ధాలయంలో ప్రతిష్ఠించాడని నమ్మకం. ఇక్కడ సాధువుల మఠాలు చాలా ఎక్కువ. చూడదగిన ఆలయాలు—త్రివిక్రమ మందిరం, దావూజీ మందిరం అనే బలరామాలయం, రామానుజకూటం, రామ్‌టేకిడి, నరసింహటేకిడి మొదలగునవి వున్నాయి. నిత్య సంకీర్తనం జరిగే రామనామ క్షేత్రం వుంది. సాధు పుంగవులకు భోజన వసతి ఉంది. సత్రాలు కూడా చాలా వున్నాయి.

కృష్ణ భగవానుని ఇక్కడ రణచోడరాయు డంటారు. సమ్మతి మీద అన్ని కులాలవారు దర్శించవచ్చు. సమ్మతి తేలికగానే దొరుకుతుంది.

ఇక్కడ 100 మీ. దూరంలో వున్న లక్ష్మీఆలయం, బోడానాథ మందిరం ఉన్నాయి. రణచోడరాయని విగ్రహం డాకోర్ తెచ్చింది ఈ మహాభక్తుడేనని చెప్పుకుంటారు పవిత్ర శారద పూర్ణిమనాడు గొప్ప ఉత్సవం, సంత జరుగుతాయి.

డాకోరు నుండి 32 కి.మీ. దూరంలో కపడన్వాజ్ పట్టణం ఉంది. మధ్యలో 115 డిగ్రీల ఉష్ణోగ్రత గల వేడినీటి ఊటలున్నాయి. చర్మవ్యాధి నివారకమని ప్రతీతి. పట్టణంలో మసీదులు, దర్గాలున్నాయి. అన్నిటితోపాటు ఉన్న జైనాలయం దర్శనీయం.

## సూ ర త్

బరోడా నుండి 129 కి.మీ. దూరంలో వున్న ప్రముఖ జవుళిమిల్లుల కేంద్రం. గుజరాతులోని రెండవ పెద్ద నగరం సూరత్. విదేశీయులైన డచ్చి, పోర్చుగీసు, ఇంగ్లీషు వారు మొట్టమొదటగా కాలుపెట్టిన చోటు. ఇక్కడ శవన విశ్రాంతిలో మూడు

దేశాల నిర్మాణపు రీతులు మేళవింపు స్ఫుటంగా కనబడుతుంది. వెండి, బంగారు జరీలతో నేసిన వస్త్రాలకు ప్రసిద్ధి ఆనాటి నుండీ, మహమద్ బిన్ తుగ్లక్ కట్టించిన కోట ఆసక్తికరం. దగ్గరలో హజీరా, ఉభ్రత్ బీచిలు-అందులో కుటీరాలు ఆనందదాయకం. సూరత్‌కి అహమ్మదాబాదు నుండి, బొంబాయి నుండి, బరోడా నుండి రోడ్లు సౌకర్యం వుంది. ఇంకా అనేక నగరాలను కలుపుతూ రోడ్లు, రైలు మార్గాలున్నాయి.

## జాం న గ రం.

అహమ్మదాబాదు నుండి 331 కి.మీ. దూరంలో సముద్ర తీరంలో ఉన్నది. టై అండ్ డై పనితనం వస్త్రాలకు ప్రసిద్ధి. నగర మధ్యంలో 'సూర్‌సాగర్' సరోవరం ఉంది. సరోవరం మధ్యలో ఒక ఆయుధాగారం వుంది. పట్టణం విశాలమైన రాజవీధులతో నిండుగా ఉంటుంది. అందమైన భవనాలు వూరికి పెట్టని ఆభరణాలు-జ్యూయల్ ఆఫ్ కథియవార్‌గా పేర్గాంచింది. పిక్చర్‌గాలరీ, సోలేరియం, లకోటకోట, బేడీరేవు, జనాబాయి టవర్, జూబ్లీగార్డెన్స్, జూ మొదలయినవి దర్శనీయం. కచ్ వెళ్ళటానికి మంచిరోడ్డుంది. నగరపు బజారులో చక్కని జైన ఆలయం దర్శనీయం.

**సోలేరియం గురించి :**

సోలేరియం అంటే సూర్య చికిత్సాలయం. సూర్యకిరణాలతో రోగులకు వ్యాధి నివారణోపాయంగా చికిత్స జరుగుతుంది నిర్మాణం రెండు భాగాలు- క్రింద కదలని భాగం. పైన తిరిగే భాగం. సూర్యుని గమన దిశకు త్రిప్పుతూ గదులలో అమర్చబడిన రంగురంగుల అద్దాలద్వారా సూర్యకిరణాలు రోగులమీద ప్రసరించి రోగ నివారణం జరుగుతుంది. ఇటువంటిది తూర్పు ఖండం మొత్తంమీద ఎక్కడా లేదని ప్రతీతి.

## జు నా గ ఢ్

ఒక సంస్థానానికి ముఖ్య పట్టణం. పేరులోనే ఉంది అర్థం పురాతన కోట అని- పేరుని సార్థకం చేస్తూ ఈ పురాతన కోటలో ఉన్న శిలాశాసనాలు క్రీ. పూ. 250 ఏళ్ళనాటివి, 12 శతాబ్దం నాటివి పురాతనాలయాలు చరిత్రను పుంఖాను పుంఖాలుగా వినిపిస్తాయి.

దామోదర కుండం :

ఒక పవిత్రమైన జలాశయం చుట్టూ దేవాలయాల సమూహం ఉంది. వాటి మధ్యలో తలమానికంగా అతి అనాదియైన ఆలయం. ఈ నీటిలో స్నానంచేస్తే ఎక్కడలేని పవిత్రత చేకూరుతుందని గాఢమైన నమ్మకం.

అశోక శాసనాలు :

గిర్నారు ఆలయాలకు వెళ్ళేదోవలో ఒకపెద్ద గండశిల కానవస్తుంది. ఆ శిల మీద క్రీ. పూర్వం 3 శతాబ్దానికి చెందిన అశోకుని సందేశం చెక్కబడి ఉంది. దీనికి చరిత్ర ప్రాధాన్యత ఎంతవుందో చెప్పనక్కరలేదు.

గిర్నారు కొండలు—ఆలయాలు :

జునాగఢ్‌కు తూర్పుదిశన ఐదు శిఖరాలున్నాయి. ఇది గొప్ప జైనతీర్థం. ఐదు శిఖరాలమీద అయిదు ఆలయాలున్నాయి. నిమినాథ్, గోముఖ, గంగ, అంబాజీ, గోరకనాథ్, గురు దత్తాత్రేయ, కాలికా శిఖరాలున్నాయి. వీటన్నిటిలో 12 శతాబ్దంలో నిర్మించబడిన నిమినాథుని ఆలయం శిఖరాయమానంగా ఉంటుంది. ఈ ఆలయం చుట్టూ మరెన్నో ఆలయాలున్నాయి. అన్నిటిలోను నిమినాథ విగ్రహాలున్నాయి. ఇంతకంటే చిన్న శిఖరాలమీద కొన్ని హిందూ దేవాలయాలు కూడా ఉన్నాయి. వానిలో అంబాలయం తప్పక చూడదగింది. పర్వతంపైకి ఎక్కిపోవటం కష్టమైనదే; కాని అక్కడ కూడా విశ్రాంతి తీసుకోడానికి వీలుగా ఉంటుంది. శ్రమ వృథాపోదు.

మక్బారా :

జునాగఢ్ పాలకుల స్మారక మందిరాలున్నాయి. అనాటి ఆయుధాలు చూడ వచ్చు- ఒకగదిలో భద్రపరచబడి ఉన్నవి.

నరసింహామెహతా ఆలయం :

గుజరాతులోని గొప్ప భక్తకవి శిఖామణి. స్మారక మందిరం. ఈయన పాటలు భక్తపారవశ్యంలో ముంచెత్తేవిగా గుజరాతు అంతా బహుళ ప్రచారంలో ఉన్నవి. ఆయన అర్చించిన నరహరి మందిరం కూడా ఉంది. దర్శనీయం.

జునాగఢ్ కోట :

జునాగఢ్‌కోట ఒక రాజపుత్ర రాజు నిర్మించారు. దీన్నే ఊపర్‌కోటీ కోట అంటారు చుట్టూ పరిక్రమించిన గోడ 20 మీటర్ల ఎత్తున ఉంటుంది. కోట లోపల

1500 సంవత్సరాలనాటి బౌద్ధ గుహలున్నాయి. రెండస్థుల గుహాలయం ఆరు అందాల నగిషీల స్థంభాలమీద ఉంది. కోటలో ఇద్దరు అక్కచెల్లెళ్ళ పేరుతో -ఏటి-చేటి అని రెండు లోతైన బావులున్నాయి. కోటలో ఆంజనేయస్వామి, దుర్గ ఆలయాలున్నాయి. పట్టణంలో ఉన్న మ్యూజియంలో ప్రభువులు వాడిన వెండి, బంగారపు మంచాలు, కుర్చీలు, మేనాలు, అంబారీలు మొదలయినవి ప్రదర్శితం. పూర్వపాలకుల చిత్తరువులు గూడ ఆసక్తికరం.

గిర్ అడవులు :

అద్భుత విశ్రాంతి కేంద్రం. ఆసియా సింహం జాతికి ఆఖరు విశ్రాంతి కేంద్రం. జాతి మొత్తం క్షీణించిపోగా బ్రతికున్నవి ఇక్కడ మాత్రమే చూడగలం. జునాగఢ్ నుండి 127 కి.మీ. దూరం. అహమ్మదాబాదు నుండి వెర్‌వెల్ ద్వారా 700 కి.మీ. దాదాపు 1295 చ.కి.మీ వైశాల్యంలో పరచుకుని ఉన్న ప్రకృతి కాంత వయ్యారాలు యాత్రిక నేత్రాలకు కమనీయమైన పసందాల విందు. అనేక అడవి మృగములను వాటి స్వభావసిద్ధమైన చలనాదులు గాంచవచ్చు. అక్టోబరు మధ్యనుండి జూన్‌మధ్య వరకు దర్శించటానికి అనువైన కాలం. వసతికి అనేకమయిన ప్రభుత్వ బంగళాలు వివిధ శాఖలకు చెందినవి లభ్యం.

పాలిటానా-శత్రుంజయ పర్వతాలు :

శత్రుంజయ పర్వతపాదాల చెంత విరిసిన పాలిటానా అతి ముఖ్యమయిన జైన తీర్థం. శత్రుంజయ పర్వతాలు దేవతా నివాసాలుగా వుండి పవిత్ర దేవభూమిగా కీర్తించబడినవి. ప్రక్కనే శత్రుంజయనది ప్రవహిస్తుంది. పావనజలాలు ఆరోగ్య ప్రదమైనవి. వ్యాధి నివారకాలుగా ప్రసిద్ధి. మొత్తం 863 ఆలయాలున్నాయి అన్నీ జైనమతానికి చెందినవే. కొన్ని 11వ శతాబ్దానికి చెందినవిగా చెప్పబడుతున్నాయి. చూడటానికి సూర్యరశ్మిలో మెరుస్తున్న మీగడ తరకల్లాగా, మేఘమాలికల్లా గోచరిస్తాయి. అన్నిటిలోను తలమానికం ఆదీశ్వరాలయం. ఆదీశ్వరుడు జైనమత వ్యవస్థాపకులు. ఆదినాథుడుగా ప్రసిద్ధి. స్వామివారి ఆభరణాలు అనేకం. అమూల్యనిధి ముందుగా అనుమతి పొందితే నిధిని దర్శించవచ్చు. మిగతా వాటిలో ఎన్నికయిన ఆలయాలు-కామర్ పాల్, వినల్‌షా, సంప్రీతిరాజా చౌముఖి. సాయంకాలం ఆరు దాటితే పూజారి సైతం క్రిందకు రావాల్సిందే! కొండమీద నరపురుగుండదు శిఖాగ్రం దేవతల కోసం ప్రత్యేకించినట్లు చెబుతారు. కొండమీదికి పూర్తిగా అందరూ ఎక్కలేరు, వెళ్ళలేరు. ఎంతో శ్రమతోకూడిన పని. మోతకుర్చీయో- దండీయో చేసికొని పైకివెళ్ళటానికి అవకాశం

వుంది. కాంబే అఖాతం 56 కి.మీ. వుంటుంది. అహమ్మదాబాదు నుంచి 214 కి.మీ దూరం.

# సోమనాథ్

ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటిగా కొనియాడబడుతున్న 'సోమనాథ్' ప్రఖ్యాతమైన అనాదియైన శైవక్షేత్రం. చారిత్రకంగాను, మతపరంగాను ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నది. వెరావల్ దగ్గర ఉన్నది ప్రభాస పట్టణం- సాగరతీరంలో ఉంది. ఒకనాటి పురాతనమైన కోటకూడ ఉంది. సోమనాథాలయం ప్రభాసపట్టణంలో ఉంది. ప్రభాస పట్టణం అతి పవిత్రమైనదిగా పురాణ ప్రసిద్ధి కలిగియున్నది. సరస్వతీనది ఇక్కడ సాగర సంగమం చేస్తుంది. వేద, పౌరాణిక యుగాల్లో అనంతఖ్యాతిని గాంచి మహాభారత కావ్యంలో పదేపదే ప్రస్తుతించబడింది. సోమనాథునికు దేవతలకు అవినాభావ సంబంధం వున్నట్లుగా పురాణకథలు చెప్తున్నాయి.

'సోమ' అంటే చంద్ర భగవానుడు. మహాదేవుని జటాజూటంలో మౌళిగా అమరిన వాడు. చంద్రుని మామగారు దక్షుడు. దక్షునికి అల్లుడిగారి మీద కోపం వచ్చింది. తత్ఫలితంగా శపించాడు. శాపానుసారంగా కరిగి బలహీనమవసాగాడు చంద్రుడు. చంద్రుడు లేనిలోకాల ఉనికికి భీతిచెందిన దేవతలు అందరూ కలిసి శాప విముక్తి కోసం దక్షుని ప్రార్థించారు. ప్రసన్నుడయ్యాడు- శాపవిముక్తిని అనుగ్రహించాడు- చంద్ర భగవానుడు సరస్వతీనది సాగరసంగమం చేసే ముఖద్వారం వద్ద స్నానంచేసి శివారాధన అంకితమైతే శాపవిముక్తి కలుగుతుందని సెలవిచ్చారట. ఆ సందర్భంగా పవిత్ర స్నానమాచరించటానికి ఈ ప్రభాస పట్టణానికి వచ్చి స్నానమాడి మహాదేవుని అర్చించి ఆరాధించాడు. భక్తసులభుడు ప్రత్యక్షమయ్యాడు భోళాశంకరుడు. జగన్నాథుడు సోమనాథుడయ్యాడు. ప్రతి అమావాస్యకు దివినుండి భువికి దిగివచ్చి ఈ పవిత్రస్థలంలో స్నానమాచరిస్తాడని ప్రతీతి.

అనాది ఆలయంగా ప్రసిద్ధి చెందిన పునాది ఆలయం మీద 6వ శతాబ్దంలో నూతనరూపు దిద్దుకుంది. తరువాత మరల 8 శతాబ్దంలో రూపంలో మరింత నూతనత్వం సంతరించుకుంది. సంస్కృతీ సంప్రదాయాలకు నిలయమైంది. ఘజనీ మహమ్మదు దండయాత్ర 1026లో జరిగింది. సంపదనంతా దోచుకున్న ఘజనీ ఆలయం చాలావరకు అనేకసార్లు దండెత్తి కలిగించిన నష్టానికి గురైంది. ఆలయ పునరుద్ధరణ మరల జరిగింది. తరువాత అల్లావుద్దీన్ ఖిల్జీ సైన్యాలు 13వ శతాబ్దంలో మరల నేల

ప్టం చేశారు. జునాగఢ్ మహారాజు రాణామహీపాల్ మరల కట్టించాడు. 18వ శతాబ్దం తొలిభాగంలో మతచాందసుడైన ఔరంగజేబు పాలబడింది. ఎన్ని విధాలుగా ఎన్నిసార్లు నేలమట్టమయినా ఆ శకలాల మీద వెంటనే మరల ఆలయం వెలుస్తూనే వుంది. ఔరంగజేబు వల్ల బూడిద అయిన కుప్పమీద ఇండోర్ మహారాణి అహల్యాబాయి ఆధ్వర్యంలో మరల ఆలయం కట్టించబడింది. ఇప్పుడు మనకు సాక్షాత్కరిస్తున్న ప్రస్తుత రూపం 1951లో సంతరించుకున్నది.

ఒక త్రోవ దేవదారు వృక్షతతిగుండా ఒక అనిర్వచనీయమైన పవిత్ర స్థలానికి దారి తీస్తుంది. అదే పరశురామ తపోభూమి. ఒకప్పుడు భార్గవరాముడు తన తపస్సును ఇక్కడే వుండి కొనసాగించాడట.

ఉండటానికి వసతిసౌకర్యాలకు 'సోమనాథ్' గెస్టుహౌసు, అనేక ధర్మశాలలున్నాయి. గెస్టు హౌసులో వుండటానికి ప్రభాస్‌లోని సోమనాథ్ ఎస్టేట్స్ మేనేజరు వారి వద్ద నుండి రిజర్వేషను పొందవచ్చును.

## భాలక తీర్థము :

సోమనాథ సమీపమున ద్వాపర యుగాంతరమున కృష్ణ నిర్యాణ సమయంలో భగవానుని కిరాతుడొకడు బాణంతో కొట్టిన ఫలితంగా భగవానుడు పాదంలో బాణం దిగి గాయమైన భాగం చూపే విగ్రహమున్న ప్రదేశం.

కపిల, సరస్వతి, హిరణ్య అనే త్రివేణి సంగమం కూడా ఉన్నది.

భగవానుడు అవతారం చాలించిన చోటును 'దేహోత్సర్గ' అని అంటారు. దానికెదురుగా ఉన్న గుహలోకి వెళ్ళి బలరాముడదృశ్యుడై పోయినట్లు చూపుతారు.

## ప్రాచిపిప్లి :

ప్రభాస పట్టణానికి 25 కి. మీ. దూరంలో ఉన్న సముద్ర స్నానమునకు అనువైన ప్రదేశం. సుభద్రార్జునుల వివాహం జరిగిన చోటుగా ప్రసిద్ధి. సముద్ర స్నానం, పిండప్రదానం చాల ముఖ్యంగా చేస్తారు.

సూర్యమందిరం, శారదాపీఠము, చంద్రమౌళీష్, నరసింగస్వామి, శ్రీ వేంకటేశ్వరస్వామి మొదలయిన హిందూ దేవాలయాలున్నాయి. తోడుగా కొన్ని లక్షల వ్యయంతో ఇటీవలి కాలంలో నిర్మించిన పాలరాతి జైనాలయం దర్శనీయాలు.

## 5.8

# ద్వారక

మహాభారతంలో, భగవద్గీతలో 'ద్వారక'ను గురించి వినని భారతీయుడుండడు. భగవద్గీత రూపంలో మానవునికి భక్తి, జ్ఞాన, కర్మ, వైరాగ్యములను బోధించి మానవ జీవిత గమనంలో ధర్మం పునాదిగా అర్ధ కామ మోక్ష విధులను నిర్దేశించిన భగవానుడు- శ్రీకృష్ణుడు పాలకుడై సింహాసనాన్ని అధివసించిన పరమ పునీత పవిత్ర స్థలంగా ఎంచబడుతూ, పేరు వినినంతనే ప్రతి భారతీయుని శరీరం పులకాంకితమై, భక్తిభావంతో అవనతమై. అనిర్వచనీయ అలౌకికానందతుందిలమౌతుందనటంలో సందేహంలేదు.

అటువంటి ద్వారక గుజరాతు రాష్ట్రంలోని పశ్చిమ కోస్తా తీరంలో అమరియున్న దీ స్థలం. హిందూ దేశంలో అతి పవిత్ర నగరాల్లో ఒకటిగా పేర్కొనబడివుంది. విశేషమైన పురాణ ప్రశస్తి, ప్రసక్తి ఉన్న పుర్వనామం 'ద్వారవతి' అని పిలవబడేది. ఈ ద్వారకేనని అంటారు. ఇదే ఇప్పటికి మిగిలింది. 'అసలు ద్వారక' సముద్రంలో యుగపరిసమాప్తి కాలంలో మునిగిపోయిందని అంటారు ప్రత్యక్షంగా మన ఎదుటనున్న ద్వారక యుగాలనుండి భారతీయుల మనసుల్లోను, హృదయాల్లోను సుస్థిరంగా సింహాసనాన్ని వేసుకొని అధివసించిన శ్రీకృష్ణ భగవానుడుకి ఆలయం ద్వారకాధీశ ఆలయం. దీన్నే జగత్మందిరం అని కూడా అంటారు. ఆలయ నిర్మాణం ఎవరు చేశారు? పురాణకథల ప్రకారం శ్రీకృష్ణుని మనుమలైన వజ్రనాభుడు గోమతీ నదీ ముఖ ద్వారంలో నదీమ తల్లికి ఎదురుగా స్వర్గద్వారం, మోక్ష ద్వారం అని పిలువబడే ప్రధాన ద్వారంలో ఆలయ నిర్మాణం గావించారని చెపుతారు ఇక్కడ మహాకర్షణీయమైన స్వామి ఆలయానికి తోడు-దేవతా మందిరం, వేణీమాధవాలయం, బలరామ దేవాలయములు దర్శనీయాలు.

### రుక్మిణి ఆలయం :

శ్రీకృష్ణుని అష్ట పట్టమహిషుల్లోను ఎన్నదగినదిగా, మహా భక్తురాలు, పతివ్రతగా, శ్రీ మహాలక్ష్మి అవతార విశేషంగా కొనియాడబడిన రుక్మిణీ అమ్మవారి ఆలయం ద్వారకాధీశుని ఆలయానికి 2 కి.మీ. దూరంలో ఉన్నది. అష్టాదశ పీఠాల్లో ఇది ఒకటి.

### శంకరాచార్యుల మఠం :

ఆదిశంకరులు స్థాపించిన నాల్గు శారదా పీఠముల్లో ఇది ఒకటి. ద్వారకాధీశుని

ఆలయం వెనుక భాగంలో అమరియున్నది. మఠముకు రెండువైపులా ఆలయాల మందిరాలు ఎన్నో వున్నాయి. గోమతీ నదిలో తప్పకుండా స్నానమాడతగినది. వేసవిలో చల్లగా ఉండి వేసవి విశ్రాంతిగా కూడా గణుతికెక్కింది. గోమతి అవతల ఒడ్డున లక్ష్మీనారాయణాలయం ఒకటున్నది. ఆలయములో 'రామనామ పత్తర్' అనే రాయి నీటిలో తేలుతుందట. బయటకు తీస్తే మామూలు బరువు వగయిరాలుంటాయి. ఇటువంటి రాళ్ళనేనా వానర ప్రముఖులు సేతుబంధ నుపయోగించినరాళ్లు అయి వుండవచ్చు.

బేట్ ద్వారక :

టిక్కెట్టు రుసుము చెల్లించి పోవాలి గనుక బేట్‌ద్వారక అనే పేరు గలిగినది అంటారు. గోమతీ తీరంలో 32 కి. మీ. దూరం వుంటుంది. ఓఖా (OKHA)పోర్టు దగ్గరిలో గల దీవి. పడవలో వెళ్లాల్సి వుంటుంది అరేబియా సముద్రంలో. శ్రీకృష్ణ భగవానుడు శంకాసురుని సంహరించిన చోటుగా ప్రసిద్ధి. పరమాత్మ బంగారు విగ్రహ ముంది ఆలయంలో. అన్ని వసతులున్నాయి. చక్కగా ద్వారకనుండి మధ్యాహ్న భోజనానికి అక్కడికి చేరవచ్చు. సరదాగా వుంటుంది సముద్రయానం.

## పోరుబందరు

'జాతిపిత మహాత్మాగాంధీ' జన్మస్థలంగా ఆధునిక కాలంలో ప్రసిద్ధి.

ఒకానొకప్పుడు అరబ్బు దేశాలతో వ్యాపారాలు ముమ్మరంగా జరిగిన ప్రదేశం ముఖ్య వ్యాపార కేంద్రం. పూర్వకాలంలో శ్రీకృష్ణుని బాల్యస్నేహితుడు 'సుదాము'నికి కానుకగా పేదరికంలో మునిగి అధిక సంతానుడై కుచేలునిగా పిలవబడుతున్న వానికి ఐశ్వర్యమునిచ్చిన సుందర నగరంగా అనాదికాలంలో 'సుదామ పురి'గా పిలవబడేది.

కీర్తి మందిరం :

గాంధిజీ పుట్టిన గది పవిత్రంగా ఎంచబడేది ఇక్కడ వుంది. గాంధీజి జీవించిన 79 సంవత్సరాలకు గుర్తుగా నూతన మందిరం ఎత్తు 79 అడుగుల ఎత్తుగా కట్టించబడింది. 79 దీపాలు వెలుగుతుంటాయి. ప్రవేశద్వారం దగ్గర ఆయన బాల్యంలోని విశేషాలు గోడలమీద చిత్రాలుగా వ్రాయించబడినాయి. భవనంలో గాంధీ సాహిత్యం, చరకా (గాంధీగారు నూలు వడికినది), ఒక చిన్నపిల్లల స్కూలు చూడగలం.

సుధామాలయం :

విశాలమైన ఆలయం. పద్మవ్యూహమును నిర్మించారు. యాత్రికులిందు ప్రవేశించి బయటకు రావటానికి ఎంతో ఉత్సాహాన్ని చూపుతారు. 1903లో భావసింగ్‌జీ ఆలయాన్ని పునరుద్ధరించారు.

ఇంకా ఇక్కడ చూడదగినవి అశ్మవతీఘాట్, మాధవజీ ఆలయం, మెరీనా బీచ్, కమలా నెహ్రూ పార్కు, మరెన్నో హైందవాలయాలు దర్శనీయం.

గుజరాతులోని వన్యమృగ సంరక్షణ కేంద్రాలు :

భావనగర్ జిల్లాలోని గిర్‌ఫారెస్టు-వెల్వధార్, దాంగ్స్ ఫారెస్టు, దాంగ్స్ జిల్లాలోనిదే అహ్వా, కచ్ తీరంలోని పక్షుల శరణ్యాలయం వీటికితోడు చూడదగినవి.

నాల్ సరోవరం :

అహమ్మదాబాదునుంచి 64 కి.మీ. దూరం. వలస పక్షుల విడిదిగా ప్రసిద్ధి.

సతపురా పర్వత విశ్రాంతి కేంద్రం :

సముద్ర తలానికి 1000 మీటర్ల ఎత్తున అమరిన పీఠభూమి, సతపురాలోయ ఇక్కడ నివసించే గిరిజన, ఆదిమవాసుల తెగలు ఒక ప్రత్యేక జానపద సంగీత నాట్యరీతి జనాకర్షకం. ప్రక్కనే చిక్కని అడవులు, అనేక వన్యప్రాణులలోకరం. ఆలం దగ్గరి రైల్వేస్టేషను మహారాష్ట్రంలో ఉన్న 'నాసిక్'. సెలవు దినం సరదాగా గడపదగిన ప్రదేశం. వసతికి హాలిడే హోమ్ లేదా ఆర్యనివాస్‌లో ఒక గదిని బుక్ చేసుకోవచ్చు. అసిస్టెంటు డైరెక్టరు అఫ్ ఇన్‌ఫర్‌మేషన్, సతపురా, దాంగ్స్ జిల్లా, గుజరాతు వారిని సంప్రతించండి ముందుగా.

## ఇతర యాత్రిక ఆకర్షణలు :

రాజకోట్ :

సుందరనగరం. సంస్థానానికి ముఖ్యనగరం. పట్టణం మధ్యలో మ్యూజియం, లైబ్రరీ, పబ్లిక్‌హాలు గల జూబిలీ గార్డెన్స్ చూడదగినవి. గాంధీజీ చిన్నతనంలో విద్యాభ్యాసం చేసిన స్కూలు బాలమండల్. గాంధీగారి తండ్రి రాజకోట్ సంస్థానానికి దివానుగా పనిచేశారు. రాజ్‌కోటలో ఒక యూనివర్శిటీ వుంది. అనేక

రకాలయిన చిన్న తరహా పరిశ్రమలుకూడా నెలకొన్నాయి. జామ్‌నగర్‌నుండి బస్సులో గాని, రైలులోగాని వెళ్ళవచ్చు.

భావనగర్ :

మరో సంస్థానపు ముఖ్యనగరం—— పూర్వకాలంలో అంటే స్వతంత్రం రాక ముందు. పురాతన కాలంలో వాడిన ఆయుధ విశేషాలు ఆసక్తిని రేకెత్తిస్తాయి బార్టన్ మ్యూజియంలో. కొండమీద తక్తేశ్వర ఆలయం చూడదగింది. ఇతర స్థలాలుగా సెంట్రల్ బెట్, మెరైన్ కెమికల్స్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, లాక్ గేటు, గౌరీశంకర్ సరస్సు మొదలయినవి. పోర్ బందర్‌నుండి రైలులో వెళ్ళవచ్చు. బొంబాయి నుండి ప్రతిరోజూ విమానం వుంది.

భావనగర్‌నుండి కాంబే అఖాతంలో కనుక్కొన్న నూనె నిక్షేపాల దగ్గరకివెళ్ళి దర్శించవచ్చు.

భుజ్ :

కచ్ సంస్థానం (స్వతంత్రం రాకముందు) కు ఒకానొకప్పుడు రాజధాని. వెండి వస్తువులకు, అద్దకం వస్త్రాలకు ప్రసిద్ధి. గుజరాత్‌నుండి ఏ పట్టణం నుండైనా బస్సులో చేరవచ్చు. బొంబాయి, పోర్ బందర్ పట్టణాలనుండి విమాన సౌకర్యం వుంది. కచ్ ప్రాంతంలో ప్రధానపట్టణం. వూరిచుట్టూ కోటగోడ వుంది. ఇటీవలి వరకూ రాత్రిళ్ళు కోట ద్వారాలు చక్కగా తాళంవేసి వుండేవి. రాజస్థాన్‌కి జెసల్మేర్ ఎలాంటిదో అలాంటిది- గుజరాత్ జెసల్మేర్ అనుకోవచ్చు. ఒంటెలబండ్లు ఇక్కడ ఎక్కువ. 1877 లో నిర్మింపబడిన కచ్ మ్యూజియం ఫెర్గుసన్ మ్యూజియంలో అనేక అరుదైన వస్తువులు భద్రపరచబడి ప్రదర్శిస్తున్నారు. అందాల పాలరాతి భవనం- చూడదగింది. రావ్ ప్రగ్మాల్ జీ గారిది- ప్రస్తుతం ప్రభుత్వ కార్యాలయంగా వాడబడుతుంది.

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

# మహారాష్ట్రం

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

పేరుకు తగ్గట్లుగానే సార్థక్యాన్ని వహిస్తుంది. దేశం మొత్తంమీద మూడవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఉత్తరప్రదేశ్, బీహారు రాష్ట్రములు జనాభాల్లో పెద్దవి. మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లు వైశాల్యంలో పెద్దవై అగ్రస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి.కాని రెండింటిలోను సమతౌల్యంగా నిలుస్తూ మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్న మహారాష్ట్రం తన ప్రత్యేక ప్రతిపత్తిని నిలబెట్టుకొంటుంది. సుసంపన్నమైన 720 కి.మీ. పొడవున 80 కి.మీ. వెడల్పున వున్న కోస్తాతీరం సారవంతమైంది. పచ్చని వరిపొలాలు, కొబ్బరి తోటలు విస్తారంగా కానవస్తాయి. పడమటి కనుమలుగా పేర్కొనబడే సహ్యాద్రి పర్వత శ్రేణులు, చక్కని దట్టమైన అరణ్యాలతో నిండి సముద్ర తీరానికి సమాంతరంగా వుంది. ఒక విధమైన అసమ బాహు త్రిభుజాకారం ఏర్పడుతుంది. రాష్ట్రంలోని ఎత్తయిన పీఠభూమి మధ్య భాగమయి మహానదులయిన కృష్ణా, గోదావరి, భీమనదులుద్భవించి ప్రవహించి బంగాళాఖాతంలో కలిసేట్లుగా ప్రాచీగాములై పయనించి రాష్ట్రాన్ని సుజల పూర్ణంగాను, సుఫలవంతంగాను సశ్య శ్యామలం చేస్తున్నాయి.

**భౌతికంగా :**

పడమట అరేబియా సముద్రం. వాయవ్యంలో గుజరాతు రాష్ట్రం, ఉత్తరాన మధ్యప్రదేశ్, ఆగ్నేయ దిశన ఆంధ్రప్రదేశం, దక్షిణాన కర్నాటక, గోవాలు, సరిహద్దులుగా ఆవరించబడిం దీ రాష్ట్రం.

చారిత్రిక పరిస్థితుల్నిబట్టి మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. పశ్చిమ మహారాష్ట్ర, విదర్భ, మరాఠ్వాడా. పురాణాల్లో మనకు ప్రశస్తంగా అనేక ప్రశంసల ప్రసక్తిగలది అనాదిగా ఉన్నది విదర్భదేశంగా పేర్కొనబడింది. జానపద కథా సాహిత్యంలోనూ, మహాభారతంలోనూ విశిష్టంగా మాటి మాటికి పేర్కొనబడింది. శ్రీకృష్ణ భగవానుని వరించి వివాహం చేసికుని మహాపతివ్రతగాను పేర్కొనబడిన రుక్మిణీదేవి విదర్భదేశానికి యువరాణి.

సంగ్రహంగా రాష్ట్ర చరిత్ర :

మౌర్య సామ్రాజ్య కాలంలో మహాసామ్రాజ్యంలో భాగంగా మహారాష్ట్రం మొత్తం వెలకొనిఉంది. ఆనాడు బొంబాయి నగర శివార్లలో ఉన్న సౌపారా, చౌల్ (చంపావతి) బౌద్ధమత అధ్యయన కేంద్రాలుగాను, విశిష్ట వ్యాపార కేంద్రాలుగాను వర్ధిల్లిన దాఖలాలున్నాయి. మౌర్య సామ్రాజ్య పతనానంతరం వివిధ రాజవంశాల్లో పేర్కొనదగిన శాతవాహనులు, త్రికూటకులు, వాకాటకులు, చాళుక్యులు, యాదవులు పరిపాలించారు వివిధ దశల్లోను, కాలాల్లో. ఆఖరివారైన యాదవ వంశరాజుల పాలన 1294 లో అంతమైంది. అక్కడి నుండి మహమ్మదీయ పాలకుల వశంలోకి వచ్చింది.

చరిత్రలో ఛత్రపతి శివాజితో సరికొత్త అధ్యాయం ప్రారంభమైంది. శివాజీ మహారాజు మహరాష్ట్ర దేశాన్ని ఒక శక్తివంతమైన రాజ్యంగా తయారు చేశారు. పాలితులుగా ఉన్నవారు పాలకులైనారు. శివాజీ అనంతరం మహారాష్ట్రను ఏలిన పీష్వాలు రాజ్యాన్ని బహుధా విస్తరించారు. ఉత్తరాన గ్వాలియర్‌నుంచి దక్షిణాన తంజావూరుదాకా సువిశాలమైంది. 1761 లో జరిగిన పానిపట్టు యుద్ధంలో అఫ్గన్ రాజు అహమ్మద్ షా అబ్దాలి మరాఠా సైన్యాలను ఓడించి వెనక్కి తరిమాయి. తరువాత కూడదీసుకుని బ్రిటిషువారికి ఎదురునిలిచి పోరాడినా 1818 లో ఘోరపరాజయాన్ని రుచిచూడవలసి వచ్చింది. తదనంతరం బ్రిటిషువారి ఏలుబడిలో బొంబాయి ప్రెసిడెన్సీ రాష్ట్రంగా దేశస్వతంత్రం వచ్చేవరకు కొనసాగింది.

స్వతంత్రం వచ్చినతరువాత రాష్ట్రాల పునర్విభజన సమయంలో రెండుభాషల వారిని అంటే గుజరాతీయులను, మహారాష్ట్రులను కలిపి ఉమ్మడి రాష్ట్రంగా ప్రయోగాత్మకంగా నిర్మించబడింది. అయితే ఈ ప్రయోగం విఫలమైంది. తత్కారణంగా 1960 బొంబాయి రి ఆర్గనైజేషన్ చట్టం తయారైంది. మే 1, 1960 సంవత్సరంలో బొంబాయి రాజధానిగా మహారాష్ట్రం ఏర్పడి, గుజరాతు విడివడింది.

ఈ సువిశాలమైన సంపన్న రాష్ట్రం పాలనా పరంగా ఆనాడు ఈ క్రింది జిల్లాలుగా విభజించబడింది. తరువాత కొన్ని జిల్లాలు పునర్వ్యవస్థీకరించ బడ్డాయి. ఈ విధంగా మార్పులూ చేర్పులూ నిన్న మొన్నటి 1983 దాకా జరుగుతూనే వుంది.

స్థూలంగా ఆనాటి జిల్లాలు :-

గ్రేటర్ బొంబాయి, థానే, రాయ్‌గడ్, రత్నగిరి, సింధుదుర్గ్, నాసిక్, ధూళే, జనగావన్, అహ్మద్ నగర్, పూనె, సతారా, సాంగ్లి, సోలాపూర్, కొల్హాపూర్, ఔరంగాబాద్, జాల్నా, పర్బని, బిద్, నాందేడ్, ఉస్మానాబాద్, బుల్దానా, లాతూర్, అకోలా, అమరావతి, యవత్మల్, వార్థా, నాగపూర్, భండారా, చంద్రపూర్, గండ చిరోలి.

రాష్ట్రం ప్రజలు ముఖ్యంగా 70 శాతం వరకూ వ్యవసాయాధారితం. పారి శ్రామికంగా రసాయనాలు, రసాయనోత్పత్తులు, మిషనరీ, ఎలక్ట్రికల్స్, పెట్రో లియం ఉత్పత్తులకు సంబధించినవి, ఫార్మ స్యూటికల్స్, మెషీన్‌టూల్సు, ఐరన్ & స్టీల్ కాస్టింగ్స్, ప్లాస్టిక్స్, ఎలక్ట్రానిక్స్ మొదలయినవి ఒకటేమిటి అన్నిరకాల ముఖ్యమయిన ఉత్పత్తులు ఇక్కడి నుండే ! వీటికి తోడు మూడు పూవులూ, ఆరు కాయిలుగా వర్ధిల్లుతున్న వస్త్ర పరిశ్రమ, ప్రపంచం మొత్తంమీద ఎన్నదగిన రెండవ హాలీవుడ్‌గా పేరుపొందిన సినిమా పరిశ్రమ ఇక్కడే దినదినాభివృద్ధి చెందు తున్నాయి.

ముఖ్యమయిన యాత్రికా ఆకర్షణాలు :

ప్రధానంగా గుహలు, గుహాలయాలు— అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, కన్హేరి, కరాలా, పర్వత విశ్రాంతి కేంద్రాలు మహాబలేశ్వర్, మాథెరాన్, పంచాగ్ని, మతపరంగా విశిష్టమైనవి. పండరిపురం, నాసిక్, షిర్డి, ఔధా (అవుంధా) నాగ నాథ్, గణపతిపూలె మొదలయినవి. రాష్ట్ర సమాచారం-

వైశాల్యం : 3,07,690 చ.కి.మీ.
రాజధాని : బొంబాయి మహానగరం.
జనాభా : 6,50 లక్షలపైగా.
భాష : మరాఠి, గుజరాతి, హిందీ.
అక్షరాస్యత : 47 శాతం.

స్త్రీ పురుష నిష్పత్తి : 937 : 1000.
జనసమ్మర్థత : చ.కి.మీ.కి 204 మంది.

ఒక చిన్న మనవి : మహారాష్ట్ర సందర్శనం చేయబోయేముందు— గుజరాతుకి ఆనుకుని మహారాష్ట్రం మొదట్లోనే ఉన్న దయ్యూ, డామన్ వివరాలు ఇస్తున్నాం. ఇది యాత్రిక సౌలభ్యంకోసం మాత్రమే. గోవా, దయ్యూ, డామన్ ప్రత్యేక ప్రతిపత్తిగల రాష్ట్రం. మహారాష్ట్రం కిందగా వున్న గోవా మహరాష్ట్రం చివరన అలంకరిస్తుంది. ప్రకృతి సౌందర్యానికి పట్టుగొమ్మలు. సౌందర్యా రాధకుల మనోజ్ఞ ఆరామాలుగా ప్రపంచ ప్రసిద్ధి. కనుక గోవా, దయ్యూ, డామన్ మహారాష్ట్రలోనే చేర్చదలచాం.

## దయ్యూ, డామన్

డామన్, దయ్యూలు గోవా నుండి వేరు చేయబడి గోవాకు పూర్తి రాష్ట్ర ప్రతిపత్తి కలిగించబడింది. 1987లో. 1961లో పోర్చుగీసు వారి వలస పాలన బంధాల నుండి విడివడిన మూడు విడివిడి ప్రాంతాలు గోవా, దయ్యూ, డామన్‌లు.

డామన్ గుజరాతు కోస్తా తీరంలో అమరియున్నది, దయ్యూ కథియవార్ ద్వీపకల్పంలోని దక్షిణ కొసన ఉన్న చిన్న దీవి. డామన్ ఉత్తర దక్షిణాలలో భగవాన్, కాలెమ్ నదులు సరిహద్దులుగా వుంటే, తూర్పున గుజరాతు రాష్ట్రం, పడమట అరేబియా సముద్రంచే ఆవరించిన ప్రదేశం.

మొదట 1534లో పోర్చుగీసు వారు దయ్యూను ఆక్రమించారు. తరువాత 1559లో డామన్‌ను కలుపుకొన గలిగారు. ప్రస్తుతం ఇవి రెండూ కూడా ఒకే కేంద్ర పాలిత రాష్ట్రంగా ఉన్నవి.

దయ్యూ నగరం జనాభా 30 వేలు పైగా వుంటుంది. ఇప్పటికీ ఇండియాలో మట్టిలో వున్న మాణిక్యంగా భావించవచ్చు. పర్షియానించి పారిపోయి వచ్చిన పార్సీ లకు నిలయమైంది— వాళ్ళు అక్కడ వున్నది మూడు సంవత్సరాలు. దయ్యూదీవి 11 కి.మీ. పొడవు, 3 కి.మీ. వెడల్పు గలిగింది. దీన్ని వేరుచేస్తూ సముద్ర తీరానికీ, దీవికి మధ్య ఒక సన్నటి కాలువ ఉంది. దయ్యూ దీవిని ప్రవేశించాలంటే మొదటగా మనకు కనబడేది ఘోగ్లా గ్రామం–ఉనా పట్టణం వైపు నించి ప్రవేశించాలనుకుంటే, దయ్యూ పట్టణంలో తలమానికంగా ఉండేది విశాలమైన ఒక పెద్ద కోట. పోర్చుగీసు

ప్రాధాన్యత ఏమాత్రం లేని ఈ పట్టణంలో ఈ దీవిలో ఎందుకు ఇంత పెద్దకోట కట్టారో అనేది చితంబర రహస్యం-ఎవరికీ అంతుపట్టనిది. గుజరాతును చూస్తుండే వైపు ఉప్పు క్షేత్రాలు ఉత్తరంవైపు ఉంటే, దక్షిణంవైపు అంతా సున్నపురాయి కొండలు, నల్లరాతి గుహలు, సముద్రపు బీచ్ మొదలయినవి గోవాలో కనబడతాయి. కొబ్బరిచెట్లు, తాటిచెట్లు, ఈతచెట్లు విశేషం.

దయ్యూ నగరం :

ఈ దీవిలో అభివృద్ధి చెందిన పరిశ్రమ-మద్యపాన ప్రియులకు కావలసిన పసందైన 'రమ్' పానీయం, దగ్గరలో పండే చెరకు నుండి తయారుచేస్తారు. పాపం మద్య నిషేధం ఉన్నచోట్ల ఏమీ సరిగా దొరకక బోరుకొట్టి ఇబ్బందిపడే మిత్రులకు మంచి విందు. పట్టణం సరిగ్గా చెప్పాలంటే తూర్పున బ్రహ్మాండమైన కోట, పడమటి దిక్కున కోటగోడ, ద్వారం దగ్గర పురాతనమైన గేటు-అక్కడి గోడమీద సింహాలు, దేవతలు, దేవదూతల స్వరూపాలు చెక్కబడి వున్నాయి. 1702కి చెందిన మూర్తితో ఒక మినియేచర్ చర్చి వున్నాయి. దయ్యూ టవునులో సెయింట్ పాల్ చర్చి, సెయింట్ ఫ్రాన్సి చర్చి రెండున్నాయి. పట్నం అంతా వంకరటింకర సందులతో గొప్ప పజిలింగ్‌గా వుంటుంది. ఇళ్ళన్నీ నీట్‌గా పెయింటింగులతో కళ కళ లాడుతూంటాయి. టౌన్‌లో పోర్చుగీసు బంధనాల నుండి విముక్తి కలిగించిన మార్వారు స్మారక విగ్రహం ఒకటుంది. పోర్చుగీసు వారు కోటను 1517లో నిర్మించారు. పేర్చిన ఫిరంగి గుండ్ల వరుసలు ఇంకా వున్నాయి బారుగా పేర్చిన ఫిరంగి గొట్టాలు కూడా వున్నాయి. ఫిరంగులన్నీ ఏది ఎప్పటిదో తెలియపరుస్తూ చక్కగా ASI నంబర్లు వేయబడివున్నాయి, ఈ విషయంలో పురాతత్త్వ శాఖవారి కృషి అభినందనీయం. కాని కొన్నిటిమీద వ్రాతలను కప్పివేస్తూ సిమెంటు పూయబడి వుంది-దారుణంగా. సరిగా మరింత శ్రద్ధ చూపాల్సిన అవసరం ఎంతయినా వుంది.

దీనిలో ఇతర గ్రామాలు :

ఫుడామ్ : ఒక పెద్ద చర్చి వుంది-నిర్లక్ష్యానికి గురయింది. కొయ్యతో చేసిన ఒక పెద్ద దీపం శెమ్మె వుంది.

వనక్ బారా :

పడమటి కొసన 'OUR LADY OF MERCY' (కరుణామయి) చర్చి, ఒక చిన్న కోట, లైట్‌హౌస్, పోస్టాఫీసు ఉన్నాయి. తెరచాప పడవ కోట్లా గ్రామానికి తీసుకెళ్ళడానికి ఎప్పుడూ తయారీగా వుంటుంది.

బుచర్ వాడా :

అల్లంత దూరాన ఉత్తరకొసన ఉన్న గ్రామం. బ్రిడ్జికి అవతల ఇవతల గూడా చెక్‌పోస్టు లున్నాయి.

నాగోవా :

చక్కటి తాటి, ఈత తోపులున్న బీచ్. ఆదివారాలు, సెలవు దినాలు బహు రద్దీగా వుంటుంది.

వుండటానికి :

PWD రెస్టుహౌస్, నీలేష్ గెస్టుహౌస్, హరేకృష్ణ గెస్టుహౌస్, బరోన్స్ గెస్టు హౌస్, అపర్నా గెస్టుహౌస్, నగోవా బీచ్ మీద గంగాసాగర్ గెస్టుహౌస్ వగాయిరా లున్నాయి.

అతి దగ్గరి విమానాశ్రయం-కెషోద్. 150 కి.మీ. దూరం వుంటుంది.

దగ్గరిగా వున్న రైల్వేస్టేషను-డిల్వాడా : 8 కి.మీ. దూరం వుంటుంది. దయ్యూ.

ఇక బస్సులయితే వెర్వెల్, కోడినార, ఉనా, రాజకోట్‌లకు నిరంతరం ఉన్నాయి.

ఘోగ్లా దగ్గర టౌన్ ఫెర్రి (తెరచాప పడవలు) లంగర్లు వేసి వుంటాయి.

గోవా కర్నాటకకు దగ్గరలో వుంది గనుక తరువాత చూద్దాం. ప్రస్తుతం మహా రాష్ట్ర రాజధాని, అంతర్జాతీయ నగరంగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన బొంబాయి మహా నగరంతో మొదలు పెడదాం.

# బొంబాయి

బొంబాయి అంతర్జాతీయ ప్రఖ్యాతి చెందిన మహా నగరం. మహా రాష్ట్రము నకు రాజధాని, పడమటి అరేబియా సముద్రపు కోస్తా తీరంలో ఉన్న అందాల నగ రం. స్వతంత్ర భారదేశానికి తలమానికమైన నగరం. దేశంలో ఉన్న నాలుగు మహా మహా నగరాల్లో విశిష్టమైనది, దేశానికి గర్వకారణం. ప్రస్తుత జనాభా కోటికి పైగానే. ఒక ప్రత్యేక చరిత్ర గలిగి అరుదైన ప్రత్యేకతను సంతరించుకుని వున్నది. అనాది కాలంలో క్రీ.శ. 2 శతాబ్దాల కాలంలోనే ప్రముఖంగా విదేశ వ్యాపారంలో ప్రముఖ

పాత్ర వహించినట్లు చారిత్రక సాక్షాధారాలున్నాయి. ముఖ్యంగా అస్సీరియా, పర్షియా రోము సామ్రాజ్యాలతో సన్నిహిత వ్యాపార సంబంధం చిరస్మరణీయం – చరిత్ర పుటల్లో ప్రత్యేక ప్రతిపత్తి. ఆనాడే గ్రీకు తత్త్వవేత్త, చారిత్రకులు–సప్తద్వీప పురిగా తమ వ్రాతల్లో ఉగ్గడించారు.

నగరానికి పేరు ఎలా వచ్చింది? ముంబాదేవి లేక ముంబాబాయి మరీకాకపోతే ముంబాయి–జగదాంబ పేరుకి ప్రత్యామ్నాయాలుగా వాడబడే నామాలు–నగరానికి గ్రామదేవత. ఆ కారణం చేత ప్రాచీన కాలంలో ముంబయిగా పేరు సార్థక్యం కలిగిందనేది భావన. కాలక్రమేణా ముంబయి బొంబాయిగా మారిందని పరిశీలకుల వాదం. పూర్వ కాలంలో కోలీజాతి జాలరులకు ఆరాధ్య దేవతగా విలసిల్లింది. ఆమె పేరున వెలసిన ఆలయం ప్రముఖమై చెరిగిపోని శాశ్వతమైన గుర్తు.

నగరానికి అత్యాసక్తికరమైన పూర్వ చరిత్ర వుంది. మధ్య యుగాలుగా చెప్పబడే 16 శతాబ్దంలోకి తొంగిచూస్తే ఈ విషయం స్పష్ట మవుతుంది. పోర్చుగీసు జనరల్ అల్బుక్వెర్క్ 1510లో గోవాను జయించాడు. గుజరాతు సుల్తాను బహదూర్‌షాతో జరిగిన సంధి ఒడంబడిక ప్రకారం ప్రస్తుతం బొంబాయి ఉన్న ప్రాంతంమీద ఆధిపత్యాన్ని సంపాదించాడు. బొంబాయి ప్రాముఖ్యాన్ని పోర్చుగీసు వారెప్పుడూ సరిగా గుర్తించినట్లు కానరాదు. ఆనాడు 1661లో యువరాణి కాథరీన్ డి బ్రగాంజా ఇంగ్లండు యువరాజు ఛార్లెస్–2 ని ప్రేమించి పెళ్ళి చేసుకున్నపుడు బొంబాయి దీవిమీది సర్వాధికారాలు దత్తం చేస్తూ యువరాజుకి కట్నంగా సమర్పించారు. తమది కాదుగా ? ; దీనికి పోర్చుగీసువారు ఇక్కడ స్థిర నివాసం ఏర్పరుచుకున్న వారు బొంబాయిని స్వాధీనం చేయవద్దని నెత్తి నోరూ మొత్తుకున్నారు. రాజు తలచుకుంటే దేనికి కొదువ– వినకుండా ఇచ్చేశారు. 1665 ఫిబ్రవరి మాసంలో బొంబాయి నగర పోర్చుగీసు మేయరు– ఈ 'అందాల రాశి'ని ఇంగ్లీషు రాజ ప్రతినిధి హంఫ్రీకుక్‌కి తాళంచెవి ఇచ్చేసి బొంబాయిని వప్పగించాడు. 2 వ ఛార్లెస్ తూర్పు ఇండియా కంపెనీకి పది పౌన్ల పెంపుతో అద్దెకిచ్చాడు. ఇక పూర్తిగా వారి అధీనంలోకి అక్షరాల చేరిపోయింది.

3 శతాబ్దాల క్రితం పోర్చుగీసు జనరల్ కుమార్తె అందాలరాసి, ఒప్పులకుప్ప, అన్నులమిన్నకు సంబంధించిన భగ్న ప్రేమకథ పోర్చుగీసు వారు కట్టిన కోటలో ఇంకా గుస గుసలు చెపుతూనే వుందట. చనిపోయిన ప్రేమికుని ప్రేతాత్మ ఇంకా అక్కడే తిరుగాడుతుందని అనుకుంటుంటారట.

ఆ రోజుల్లో సప్తద్వీపదీవి బొంబాయిదీవి ఏడు దీవులూ దేనికదే విడివిడిగా కనబడుతుండేవి. దీనికి దీవికి మధ్య కాలువలు, కయ్యలు, బురదగుంటలు, వగయిరా లుండేవి.

ఈ బురద గుంటలు, కాలువలు క్రమంగా పూడ్చి, కంపెనీవారు బొంబాయి అభివృద్ధికి ఎంతో దోహదం చేశారు అన్నది నిర్వివాదం. బ్రిడ్జిలు కట్టారు, భూమిని చదును చేశారు. రేవులు నిర్మించారు. పరిశ్రమలు నెలకొల్పారు. బొంబాయి ప్రసిడెన్సీకి ప్రధాన నగర ప్రాముఖ్యతను అనేక విధాలుగా పెంపుచేశారు. ఈ కృషి అంతా బ్రిటిషువారిదే। ఎంత స్వలాభానికి ఉద్దేశించినదైన నగర అభివృద్ధి పథంలో బహు త్వరితగతిన ఉరకలు పరుగులు పెట్టింది.

నగర విశిష్టతకు ముఖ్య ఘట్టాలు రెండు చోటు చేసుకున్నాయి. స్వతంత్ర పోరాటం నడిపిన జాతీయ కాంగ్రెసు 1885లో ఏర్పడింది బొంబాయిలోనే। 1853లో దేశంలోని మొట్టమొదటి లోకోమోటివ్ రైలింజన్ థానా వరకు నడిచింది. బొంబాయి 'గేట్‌వే ఆఫ్ ఇండియా'గా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంది. సూయజ్ కాలువ 1869లో ప్రారంభించినప్పుడు ఐరోపా దేశాలనుండివచ్చే ఓడలకు భారతంలో ప్రథమ మజిలీ అయి విశేష ప్రాముఖ్యతను సంతరించుకుంది.

కొద్ది నూనెమిల్లులు, జౌళి పరిశ్రమలతో మొదలయిన పారిశ్రామికీకరణ దేశానికే కాదు ప్రపంచ మొత్తంలో ఒక అగ్రగామి పారిశ్రామిక నగరంగా పెంపొందింది. ప్రపంచం మొత్తంమీద రెండవ హాలీవుడ్‌గా పేరుగాంచిన 'సినీ పరిశ్రమ' నేటికీ తులలేని మకుటాయమైన స్థానం ఆక్రమించి ఉన్నది. దేశంలో ఇక్కడ నిర్మాణమయినన్ని కథాచిత్రాలు ఇంకెక్కడా లేవు అంటే అతిశయోక్తి కాదు. మహారాష్ట్రీలు, గుజరాతులు, దక్షిణ భారతీయులు, పర్షియనులు, పార్శీలు మొదలుగాగల అన్ని జాతులవారు, జాతీయతలవారు సమిష్టిగా నగర అభివృద్ధిలో పాలుపంచుకున్నారు. ఇక్కడి ప్రజాజీవనంలో చరిత్ర వేసిన ముద్ర చెరగనిది. అతి అద్భుతమైనది.

నేటి కాలానికి వచ్చేటప్పటికి అనేక మార్పులూ, చేర్పులూ జరిగాయి. కాలం మారింది. పరిస్థితులు తమపాత్రను ప్రముఖంగా ప్రభావితం చేశాయి. ఆధునికత్వం పుణికి పుచ్చుకుంది.

బొంబాయి యాత్రికాకర్షణలు విశేషంగా పొదుపుకుని ఉండటమే కాకుండా ప్రాచీన చారిత్రక చిరస్మరణీయ దీపికలుగా ఎలిఫెంటా గుహలు, కన్హేరి గుహలు తుల లేని ప్రాధాన్యతను సంతరించి పెట్టాయి చుట్టుప్రక్కల అమరియుంది.

బొంబాయిలో చూడదగిన స్థలాలు

అనేకం- ఎక్కడ మొదలుపెట్టాలి అనిమం చెప్పేదానికంటే ఈ మహా నగరంలో మనకు ఎక్కడ వీలయితే అక్కడ మకాంచేసి అవకాశాన్నిబట్టి ఎంత త్వరగా చూడగలమో ఎవరికివారు తోచిన కార్యక్రమం నిర్ణయించుకోటం మంచిది. నగరంలో ఉండాలంటే చాలా ఖర్చుతో గూడిన పనిగూడా. తమతమ స్తోమతల్ని బట్టి వినియోగించగల సమయాన్నిబట్టి కార్యక్రమం నిర్ణయించుకోవలసిందిగా మనవి. ముఖ్యంగా కేంద్రీకరించదగిన విశేషస్థలాలుగా ఎన్నో దేవాలయాలు, మసీదులు, చర్చిలు, జైన దేవాలయాలు, బౌద్ధ విహారాలుతో సర్వమతాల వారికి ప్రాధాన్యత స్థలాలుగా ఉన్న గొప్ప ఆధ్యాత్మిక కేంద్రం. ప్రత్యేకంగా THE BOMBAY SPIRITUAL CENTRE కూడా వుంది. ప్రపంచ ప్రజా సమ్మేళన కేంద్రం. మాతోంగ, దాదర్ లలో ఆంధ్ర సమాజం మన దక్షిణదేశ సంప్రదాయముల ప్రచార వేదిక, ఆస్తిక సమాజము.

హైందవులకు :

శ్రీ వెంకటేశ్వరాలయం, మహాలక్ష్మి ఆలయం, శ్రీ గౌడియామఠం, బాబుల్ నాథాలయం, ముంబాదేవి ఆలయం, ఆధ్యాత్మిక కేంద్రం వగయిరాలు.

చారిత్రక ప్రాధాన్యత గలవిగాను— విశేషంగా దర్శించదగినవిగా ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం, జహంగీర్ ఆర్ట్ గ్యాలరి, ది గేట్‌వే ఆఫ్ ఇండియా, ఆఫ్‌గన్ చర్చి, రాజబాటి గోపురం, హైకోర్టు భవన సముదాయం, మింట్, టౌనుహాల్, విక్టోరియా టెర్మినస్, మున్సిపల్ కార్పొరేషను బిల్డింగు. J.J. స్కూల్ ఆఫ్ ఆర్ట్సు, మెరైన్ డ్రైవ్‌లో అమరియున్న క్వీన్స్ నెక్లెస్, చౌపాటిబీచ్, ఫిరోజ్‌షా మెహతా గార్డెన్స్, కమలానెహ్రూ పార్కు, మలబార్ హిల్స్ ప్రాంతం, హాజీఅలీ మసీదు, రేస్‌కోర్సు, నేషనల్ స్పోర్ట్సుక్లబ్, తారాపోర్‌వాలా అక్వేరియం, ఘూన్‌స్లే ఉద్యానం మొదలైన ఎన్నో ఎన్నెన్నో! అనేక పరిశ్రమల వాడలతో విలసిల్లే గొప్ప పారిశ్రామిక నగరం విదేశీ స్వదేశీ వ్యాపార కేంద్రం. నిత్యం ప్రపంచం నలుమూలల నుండి సముద్ర మార్గంలోను, ఆకాశ మార్గంలోను ఎందరో ప్రముఖులు నిత్యం వచ్చే పోయే నగరం. శాంతాక్రజ్ విమానాశ్రయం 26 కి.మీ. దూరం.

## విశేషాలు వివరంగా :

### గేట్ వే ఆఫ్ ఇండియా :

ఇండియా మహా ద్వారం. నిజంగా ఆనాడు రేవులలో దిగిన వారందరికి ద్వార సదృశమయింది. అక్షరాల సార్థక నామధేయం. 1911లో ఇంగ్లాండు రాజదంపతులు 5వ జార్జి మహారాజు తన క్వీన్ మేరీతో మొట్టమొదటిగా భారతదేశం సందర్శించటానికి వచ్చిన శుభ సందర్భంలో బ్రహ్మాండమైన స్వాగత సన్నాహాల కార్యక్రమంలో నిర్మించబడింది. నిర్మాణవైచిత్రిలో 16వ శతాబ్దంనాటి గుజరాతు ముస్లిముల సాంప్రదాయశైలిలో కళాత్మకంగా భారీగా నిర్మించబడింది. నిర్మాణం అప్పుడు జరిగినా అధికారిక ప్రారంభోత్సవం మాత్రం 1924లో జరిగింది. ద్వారం వెనుకనే అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన టాజ్‌మహల్ హోటలు భవన సముదాయం ఉంది. ప్రాముఖ్యతను మరింత ఇనుమడిస్తూ హిందూ మతోద్ధరణకు దీక్షాకంకణబద్ధుడై మహమ్మదీయులతో అనేక దీర్ఘ యుద్ధాలు సాగించిన యేటి జోదు మహారాష్ట్రి రాజు ఛత్రపతి శివాజీ మహారాజు అశ్వారూఢులైయున్న విగ్రహం. హిందూ నగారాను విశ్వవిఖ్యాతిగా మ్రోగునట్లు వివరించిన జిజ్ఞాసువు, శ్రీవివేకానంద స్వామి విగ్రహాలు వన్నెలు చిన్నెలు కూర్చాయి. యాత్రికులు చాలామంది తమస్థల సందర్శనా కార్యక్రమం చాలావరకు ట్రావల్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియావారు టాజ్‌మహల్ హోటలు ప్రాంగణం నుండి నడిపే బస్సులతో మొదలు పెడుతుంటారు ఈ మహాద్వార ప్రశస్తి ఈ విధంగా కూడా సార్థకమయింది అంటే వింతేమిలేదను కుంటాము.

### కొలాబా కాజ్ వే :

టాజ్‌మహల్ హోటలు భవనాల వెనుక చాలావరకు సామాన్యుడికి అందుబాటులో ఉండే హోటళ్ళు చాలా వున్నాయి. ఈ రోడ్డు ఇప్పుడు షహీద్ భగత్‌సింగ్ రోడ్డుగా మార్చారు. ససాన్‌డాక్ తూర్పు వెలుగు రేకలు విచ్చుకొనే ప్రాతఃకాల సమయాన చాల మనోహరంగా ఉంటుంది. చేపలు పట్టుకొని వచ్చిన జాలరులు ఆ రోజు పట్టితెచ్చిన మీనసంపదలను రాసులు రాసులుగా పోస్తుంటారు. పురాతనమైన పాత లైట్‌హౌస్ ఉంది.

### ఆఫ్ఘన్ చర్చి :

దీన్నే సెయింట్ జాన్స్ చర్చి అని అంటారు. 1857లో కట్టారు. సింధ్–ఆఫ్ఘన్ల మధ్య 1838, 1843ల్లో జరిగిన యుద్ధాల్లో బ్రిటిషు సిపాయిలు అనేకమంది

చనిపోయారు. వారి సంస్మరణార్థం కట్టించబడిం దీ చర్చి. ప్రశాంత వాతావరణం మనస్సుకు ఆహ్లాదకరంగా వుంటుంది.

## ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం :

కింగ్‌జార్జ్ వేల్స్ యువరాజుగా ఉన్న సమయంలో 1905లో ఒకసారి భారత దేశాన్ని సందర్శించారు. వారిరాకను పురస్కరించుకుని నిర్మించబడినది. మొదటి విభాగం 1914లో ప్రారంభించబడింది. ఆర్ష-మహమ్మదీయ శిల్పరీతులు మేళవించి నిర్మాణం జరిగింది. ప్రస్తుతం మొత్తం మూడు విభాగాలుగా ఉంది. ఆర్టు, ఆర్కియాలజీ, నేచురల్ హిస్టరీ విభాగాలు మినియేచర్ పెయింటింగ్స్, ఎలిఫెంటా గుహల్లోని కొన్ని నమూనాలు, బుద్ధుని ప్రతిమలు, ఇతర పురాతన శిల్పకళకు పూపిరిపోసిన అనేక యితర ప్రతిమలు కౌతుకాన్ని రేకెత్తిస్తాయి. మహత్తరమైన మొగలు, రాజపుత్ర దర్బారుల్లోని పెయింటింగులు, జేగ్‌పచ్చ, పురాతన కాశ్మీర్ ఉన్ని రగ్గులు వాటిమీద కళాత్మకమైన జిలిబిలి అల్లికల నేతలు, నేపాలు, టిబెట్లలోని మినియేచర పెయింటింగులు, ఇత్తడి, కంచు విగ్రహాలు అనేకం సేకరించి ప్రదర్శిస్తున్నారు. నాటికి నేటికి వారధిగా భాసిస్తున్నాయీ సేకరణలు.

మ్యూజియం ఉ. 10-15 ని.ల నుండి సా. 5-30 వరకూ యాత్రికుల దర్శనార్థం తెరచి ఉంచుతారు. పెద్దలకు టిక్కెట్టు రు. 2/- మంగళవారాలు మాత్రం ఉచితంగా దర్శనీయం. సోమవారాలు సెలవు.

కొలాబా విల్లింగ్టన్ సర్కిల్‌లో ఉన్న హోటళ్ళ వరుసకు సమీపంలో ఉంది.

## జహాంగీర్ ఆర్టు గ్యాలరీ :

మ్యూజియం ఆవరణలోనే బొంబాయి నగరంలో ప్రముఖంగా పేర్కొనదగిన వాటిలో ఒకటి, ఇప్పుడు ఆధునిక కళాఖండాలను, చిత్రపటాలను ప్రదర్శిస్తున్నారు, దర్శనీయం.

## హైకోర్టు యూనివర్శిటీ :

K. B, పటేల్ మార్గ్‌లో గల మైదానాన్ని శిరమెత్తి చూస్తున్నట్లుగా రోడ్డు మీదనే ప్రభుత్వ భవనాలున్నాయి. వీటి నిర్మాణం బొంబాయి నగరం అభివృద్ధి పథంలో ముమ్మరంగా ఉరకలు వేసే సమయంలో బ్రిటిషువారు కట్టిన భవనరాజాలు.

యూనివర్సిటీ భవనాల నిర్మాణం మొత్తం 14-15 శతాబ్దాలనాటి గ్రీకు శిల్పరీతులైన గాధిక్ నిర్మాణ వైచిత్రితో నిర్మించబడ్డాయి. సమున్నతంగా ప్రముఖమైన పాత్ర వహించేది ఇక్కడ ఉన్న రాజాబాయి గడియార స్తంభ గోపురం. యూనివర్సిటీ లైబ్రరీ భవనం మీద అమరియున్నది. శ్రమ అనుకోకపోతే ముందుగా అనుమతి తీసికొని పైకి ఎక్కగలిగితే బ్రహ్మాండమయిన నగరదృశ్యం కండ్లకుమిరుమిట్లు గొలుపుతూ ఉన్నది చూడగలం.

వెనుకనే అదే రీతిలో నిర్మించబడిన బొంబాయి హైకోర్టు భవనాలున్నాయి. 1878లో పూర్తి చేయబడిన ఈ భవనాలు ఎత్తు దాదాపు 54 మీటర్లు పైగా ఉంది. న్యాయము-దయలను ప్రతిబింబించే విగ్రహాలు కమనీయం.

## ఫ్లోరా ఫౌంటెన్ :

పెద్ద పెద్ద బ్యాంకులు ప్రముఖ వ్యాపార సంస్థలన్నీ కేంద్రీకరించబడిన ప్రదేశం. ఇప్పుడు దీనిపేరు హుతాత్మచౌకు. 1862 నుండి 1867లో బొంబాయి గవర్నరైన సర్ బార్ట్‌లీ ఫ్రెరె వారి కాలంలో అతిశీఘ్రగతిన జరిగిన అభివృద్ధికి అభినందన కారకంగా నిర్మించబడింది. అప్పుడు అమెరికాలో అంతఃకల్లోలాలు రేగాయి. తత్కారణంగా ప్రపంచం మొత్తంపీద ప్రత్తికి పెద్ద గిరాకీ ఏర్పడింది. ఈ కారణం నగరాభివృద్ధికి ఇతోధికంగా తోడ్పడింది. దగ్గరిలోనే సెయింట్ థామస్ కెథెడ్రల్ 1672లో ప్రారంభించి 1718లో పూర్తి చేయబడింది చూడదగిన విశేషం. లోపల అనేక ఆసక్తికరమైన స్మారకములు. ఏళ్ళు పైబడిన కొలదీ చాలా మార్పులూ చేర్పులూ జరిగాయి.

ఎన్నో ఆసక్తికరమైన భవనాలు హార్నిమాన్ సర్కిల్ సమీపంలో నెలకొని ఉన్నాయి. ఒక్కసారి G.P.O. దగ్గరినుండి కొలాబాకాజ్‌వే వైపు నాలుగడుగులు వేసి కాలు సాగిస్తే భవనాలు ఆకర్షణీయంగా చూపును ఆకట్టేస్తాయి. 1829లో పూర్తిచేయబడిన మింట్ గ్రీకు శిల్పరీతుల్లో నిర్మించబడింది 1823లో గొయ్యి పూడ్చి సమతలం చేసి కట్టించారు. దానికితోడు ప్రక్కనే పురమందిరం కూడా వెలయించారు.

## పురమందిరం ( టౌన్ హాలు):

ఎత్తుగా ఉన్న భవనానికి మెట్ల వరస మీదగా భవనంలోకి ప్రవేశించవచ్చు. లోపలికి వెళ్ళి చూస్తే అనేకమంది అధికారుల ప్రతిమలు మనకు సాక్షాత్కరిస్తాయి.

వీరందరు బొంబాయి నగరం అభివృద్ధిపథంలో అగ్రగామియై సువర్ణయుగంను అను భవించిన కాలానికి నేతలు చాలామంది టౌను హాలులో రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి గ్రంథాలయం, సభలకు వినియోగించే హాలు చూడవచ్చు. దీని వెనుకనే 17వ శతాబ్దంలో నిర్మించబడిందిగా చెప్పుకొనే పోర్చుగీసు చర్చి ఒకటుంది. కరక్టుగా ఒంటి గంటకు కాలనిర్ణయ సూచకంగా గంట మ్రోగుతుంది. ఇక్కడనే సముద్రంలో వచ్చే ఓడలకు రేవు గుర్తుగా జెండాలను ఎగుర వేస్తారట.

## మెరైన్ డ్రైవ్ :

బ్యాక్ బే తీరపు అంచునే నారిమన్ పాయింటు దగ్గర మొదలయి చౌపాటీ బీచ్‌ని చుట్టుకుంటూ మలబార్ హిల్స్ వరకూ సాగుతున్నదీ రోడ్డు. రోడ్డుమీద బ్రహ్మాండమైన భవనాలు తీరంవారనే మనకు నేత్రోత్సవం చేస్తుంటాయి. చాలా ఖరీదైన స్థలం. చాలా ప్రసిద్ధి చెందిన ప్రదేశం. అలా హాయిగా చూచుకుంటూ విహారంగా నడువదగింది. ఇప్పుడు ఈ రోడ్డు పేరు అధికారికంగా నేతాజీ సుభాష్‌చంద్ర బోసు రోడ్డుగా ప్రసిద్ధి. ఈ ప్రాంతమంతా కూడా నేలను విశేష శ్రమకోర్చి చదును చేసిన మీదట కట్టబడ్డాయి. మలబార్ కొండలమీద నుంచి చూస్తే రాత్రులందు నగరానికే రత్నమణిహారంగా భాసిస్తుంది.

## తారాపోర్ వాలా ఎక్వేరియం :

1951లో నిర్మించబడింది. ఇక్కడ దేశం మొత్తంమీద దొరికే మంచినీటి చేప, ఉప్పునీటి చేపలు ప్రశస్తమైనవిగా ప్రతీతి. ఉదయం 11 గం. నుండి రాత్రి 8 గం. వరకు దర్శనీయం. సోమవారాలు సెలవు దినం. టిక్కెట్టు రు. 1/- మెరైన్ డ్రైవ్ అంతా క్రికెట్ పిచ్‌లు అనేకం.

## చౌపాటి బీచ్ :

సాయం వ్యాహ్యాళికి వచ్చేవారు అనేకం. ఈ బీచ్‌లో రక రకాల మనుషులు అల్లరి చిల్లరివాళ్ళ దగ్గరినించి అందరూ వుంటారు. పెద్దపెద్ద రాజకీయ సభలు జరుగుతుండటం కద్దు. వినాయక చతుర్థికి జరిగే గంగేశ నిమజ్జనోత్సవం ప్రత్యేకతను సంతరించుకుందిక్కడ.

## మణి భవన్ :

1917 నుండి 1934 వరకూ మహాత్మాగాంధీగారు బొంబాయి వచ్చినప్పుడల్లా

ఇక్కడ మకాం చేసేవారట. ఇప్పుడు గాంధీజీ జీవిత విశేషాలను గురించి చిత్రపట ప్రదర్శన వుంది. మహాత్ముని రచనలు బోధలు గల సాహిత్యం ఇక్కడి గ్రంధాలయంలో వుంది. ఉదయం 9-30 నుండి సాయంత్రం 6 గం. వరకు దర్శనీయం.

మలబార్ హిల్స్ :

బ్యాక్ బే చివరన మలబార్ హిల్స్ పైకి త్రోవ వుంది. బొంబాయి వెళ్ళినవారు ఎవరూ కూడా మలబార్ హిల్స్ వైభవోపేతమైన రాజభవనాలను తలదన్నే సంపన్న గృహాలను చూడకుండా రాలేరు. నగరంలోని యితర ప్రాంతాలకంటే కొంచం చల్లగా వుంటుంది. కొండల మీదినుంచి బాక్ బే దృశ్యం, చౌపాటి బీచ్ దృశ్యాలు కమనీయం. కొండమీది నుండి దిగే రోడ్డు రిట్జ్ రోడ్డులోని సుందరమైన ఉద్యాన వనాలు, అరేబియా సముద్ర దృశ్యం ప్రకృతి సౌందర్యారాధకులకు కనువిందు. పగటి పూలు 'క్వీన్ నెక్లెస్' అమరియున్న సొగసు తిలకించటానికి చేరేవారితో బహు సందడిగా ఫాషన్ పెరేడ్‌లా వుంటుంది. చివరగా బ్రిటిష ప్రభుత్వం హెడ్ క్వార్టర్సుగా వుండే రాజభవనం ఉంది.

దగ్గరిలోనే వాకేశ్వర దేవాలయం వుంది. ఇది హిందువులకు యాత్రాస్థలం. రామాయణ కాలంలో శ్రీరాములవారు సీతామాత రక్షణార్థం వెళ్ళేటప్పుడు ఒకింతసేపు విశ్రమించిన స్థలంగా ప్రతీతి. రాములవారు ప్రతిష్టించిన సైకతలింగం-శివాలయం చూడదగినది. ఆలయం 1000సంవత్సరాలక్రితం కట్టించబడిన దానిని తరువాత ఇటీవల 1715 సంవత్సరంలో పునర్నిర్మించారు. ఈ రోడ్డులోనే పండిత జవహర్లాల్ నెహ్రూ సతీమణి కమలానెహ్రూ పేరున వెలసిన చక్కని పార్కు, హాంగింగ్ గార్డెన్స్ విశ్రాంతికి చక్కని ప్రదేశాలు, శ్రమోపశమనాలు.

హాంగింగ్ గార్డెన్సనే పిరోజిషా మెహతా గార్డెన్స్ 1881లో బొంబాయి నగరమునకు నీటిని సరఫరా చేసే జలాశయం, పైన అమరియున్నాయి. ఇక్కడ పొదలు చక్కని జంతువుల ఆకారాల్లో మలచబడి కత్తిరించబడి నయన మనోహరంగా వుంటాయి.

కొండమీద పార్సీ గుట్ట ఉంది. ఇక్కడ పార్సీ జాతివారిలో చనిపోయిన శవాలను గద్దలకు ఆహారం కావాలని వదిలి వేస్తుంటారు. అదే వారి జాతిలో అంతిమ సంస్కారం, దీన్ని టవర్ ఆఫ్ సైలెన్స్ అని అంటారు. గుట్టమీదికి పూర్తిగా పైకి వెళ్ళటానికి నిషిద్ధం-అని వేరుగా చెప్పనవసరం లేదు.

జైనాలయం :

ప్రప్రథమ జైనతీర్థంకరులు శ్రీ ఆదినాథ స్వామికి కైంకర్యమయిన జైనాలయం-పాలరాతి నిర్మితమైంది ఉంది. గోడలమీద తీర్థంకరుల జీవితాల విశేషాలు కథలు కథలుగా చిత్రీకరించబడి ఉన్నాయి. లోపల అద్దాల మందిరాలు ప్రత్యేకంగా చూడదగినవి.

మహాలక్ష్మి దేవాలయం :

సముద్రం అంచునే మలబారు కొండలనుండి వచ్చే త్రోవలోనే కొంచం దూరంలో అమరి యున్నది పురాతనకాల నిర్మితమైన శ్రీ మహాలక్ష్మికి అంకితమైన దేవాలయం. కుంబల్లా హిల్‌కి వాయువ్య మూలగా భూలాభాయి దేశాయి రోడ్డులో ఉంది. అనేకమంది వచ్చి సిరుల శ్రీదేవిని పూజించి అర్చించి దేవి అనుగ్రహానికి పాత్రులవుతూ వుంటారు. జనం విశేషంగా దర్శించిపోతూ వుంటారు. ఇక్కడికి దగ్గరిలోనే ఉన్న రేస్‌కోర్సుని మహాలక్ష్మి లేస్‌కోర్సు అని అంటారు. నవంబరు నుండి మార్చివరకు ప్రతి సంవత్సరం ప్రతి ఆదివారం గుర్రం పందాలు నిర్వహించబడుతుంటాయి. బురదగుంటగాఉన్న ఈ ప్రదేశాన్ని అభివృద్ధిచేసి చక్కజరిచి రేస్‌కోర్సు కట్టించారు.

హాజీ అలీ సమాధి :

సమాధితోగూడిన మసీదు. ఒకానొకప్పుడు మహమ్మదీయ సాధువు మునిగిపోయాడట. ఆయనపేరు మీద వెలసింది. యాత్రికులు నిరంతరం వచ్చి దర్శించిపోతుంటారు. దోవకు అటుప్రక్క, ఇటుప్రక్క యాత్రికులకు పుణ్యం సంపాదించిపెట్టేందుకు బిచ్చగాళ్ళు బారులుతీరి కూర్చుని ఉంటారు. ఇది మామూలే! మనదేశంలోని అన్ని కాకపోయినా చాలావరకు ధార్మిక కేంద్రాల చుట్టూ కనబడే దృశ్యమే-అనివార్యమైంది కూడా!

విక్టోరియా గార్డెన్స్ :

ఉద్యానవనాలకు సరికొత్తపేరు 'వీరమాత జీజాబాయి భోన్‌స్లే గార్డెన్స్' అని పేరుపెట్టారు. ఇందులో విక్టోరియా మ్యూజియం- ఆల్బర్ట్ మ్యూజియాలు ఉన్నాయి. పాత బొంబాయిని గురించి అనేక విశేషాలు మ్యూజియంలో దర్శించవచ్చు. పెద్దరాతి

ఏనుగు విగ్రహం ఎలిఫెంటా దీవినుండి తరలించబడింది మ్యూజియం బయట దర్శనీయం. ఈ తరలింపు 1864 లో జరిగింది. సరదాగా తిరగటానికి ఏనుగు, ఒంటె పోనీలమీదసవారీ, బోటు షికారు సౌకర్యాలున్నాయి. సూర్యోదయం నించి సూర్యాస్తమయం వరకూ తెరిచే వుంటుంది.

యం. జె.పి. మార్కెట్టు : ప్రస్తుతం మహాత్మా జ్యోతి బాపూలే మార్కెట్టుగా పిలవబడుతూన్న దీని పాతపేరు. ఆర్థర్ క్రాఫర్డ్ మార్కెట్టుగా ప్రసిద్ధి. కూరగాయలు, పండ్లు, పువ్వులు దగ్గరి నుంచి చేపలు మాంసాహారాలు వగైరాలతోపాటు కుండలు, కూజాలు, ఇత్తడి, కంచు, రాగి పాత్రలు, వస్త్రాలు వరకు అన్ని జీవితావసర వస్తువులు విక్రయించే విపణికేంద్రం. 1867-70 ప్రాంతాల్లో మంచి ఫోటోజెనిక్‌గా వుండే విధంగా నిర్మించబడింది. స్వదేశీ కోపరేటివ్ స్టోర్సు, గృహపరిశ్రములకు, చేతి పనుల వస్తు సముదాయాలకు ప్రత్యేకమయిన ఎంపోరియంలున్నాయి. ఎప్పుడూ జనసందోహంతో కళకళలాడుతూ వుంటుంది. బేరసారాలు చతురోక్తులతో ఉచ్చైస్స్వరంలో సాగుతుంటాయి. చాలా తమాషాలా మాసాలాల కలగూర గంపలాగా వుంటుంది.

నెహ్రూ ప్లానెటోరియం :

వర్లీలో డా. అనిబిసెంటు రోడ్డులోని హాజి అలీ మసీదు దగ్గరిలో ఉన్నది. దర్శనీయం. టిక్కెటు రు. 5/- సోమవారాలు సెలవు. మిగతారోజుల్లో సాయంత్రం 3 గం. నుండి 6 గం.ల వరకు ఇంగ్లీషులో చిత్ర ప్రదర్శనవుంది.

ఇతరంగా :

రౌదత్ తహిరా పాలరాతి మసీదు- సైద్నా తహీర్ సైపుద్దీన్ గౌరవస్మారకంగా నిర్మించబడింది. తాజ్ మహల్ హోటల్ ప్రాంగణంలోని తాజ్ అర్ట్ గాలరీ, భూలాభాయి దేశాయి రోడ్‌లోని సిమ్రోజా ఆర్టు గాలరీ మొదలయినవి.

బొంబాయి అంతర్జాతీయ ప్రతిపత్తి పొంది, నాగరికతలో ముందంజవేసి వివిధ భాషల, వేషాధారణల, సంస్కృత సంప్రదాయాల సమ్మేళనా వేదికగా పెంపొందుతున్న మహానగరం. ఫాక్‌లాండ్‌దీవుల జలసంధి దగ్గర లైసెన్సుడ్ ప్రొస్టిట్యూటరీ 'రెడ్ లైట్ ఏరియా' ఉంది. జాగ్రత్త.

## బొంబాయి నగర శివార్లలో - చుట్టు ప్రక్కల సందర్శించ తగిన స్థలాలు :

### ఎలిఫెంటా దీవి :

అపోలో బందరు నుండి దాదాపు 10 కి.మీ. దూరం ఉంది. బొంబాయిలో అత్యంత ప్రసిద్ధిచెందిన గొప్ప యాత్రికాకర్షణా కేంద్రం. అపోలో బందరు-గేట్‌వే ఆఫ్ ఇండియా వద్దనుండి స్టీమ్ లాంచీలుంటాయి. మామూలు బోట్లులో అయితే రు. 16/- చార్జీ, డీలక్స్ బోటు అయితే రు. 30/- ఎయిర్ కండీషన్డు బోటు అయితే మరింత జాస్తితో నిత్యం తిరుగుతుంటాయి. ఎందుకయినా మంచిది సరదాగా అన్ని విషయాలు తెలిసిన గయిడ్ ఒకరుండటం వినోద భరితంగా ఉంటుంది. ప్రాంత ప్రాముఖ్యాన్ని గురించి సవివరంగా, సాభినయంగా వివరించగల వారున్నారు. మొదట పోర్చుగీసువారు కాలుపెట్టిన ఈ దీవి చిరుపర్వతాల ముఖ ద్వారంలో ఒక పెద్ద ఏనుగు విగ్రహం ఉందట. అందుకని దీనికి పేరు పెట్టారు. ఏనుగు విగ్రహం ప్రస్తుతం విక్టోరియా గార్డెన్స్‌లో ఉన్నది.

ప్రాచీన కథనం ప్రకారం ఇది బాణాసురపురం. బాణాసురుడు మహాదేవుని గురించి తపం చేసినప్పుడు బంగారు వర్షం కురిసిందని దీనికి సంతుపురి అనే నామం వున్నట్లు తెలుస్తుంది. ఇక్కడ అయిదు గుహాలయాలున్నాయి. మామూలుగా దేవళాలు అన్నీ కొండలమీదనుంచి మరింత పైకి కట్టిన ఆలయాలు చుస్తున్నాం. ఇక్కడ కొండలను తొలిచి గుహలుగా మలిచి ఆలయ నిర్మాణం జరగటం ఒక గొప్పవిశేషం. కొంతమంది అంటున్నట్లు ఎల్లోరా అంతటి అందాలు లేవని అంటున్నా రాశిలోను వాసిలోను దీటైనవి, గొప్పవి గూడా అని కొందరి అభిప్రాయం. క్రీ.శ. 8వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ గుహాలయాలు అన్నీ ఒకే రాతిలో మలచబడి ఉండటం విశేషం. గుహాద్వారం అమరియున్న ప్రదేశంలో నిలబడి బొంబాయి హార్బరు చుట్టు ప్రక్కల పరిసరాలన్నీ హృద్యమైన దృశ్యంగా కాంచవచ్చు. ఇక్కడ మొత్తం అయిదు ఆలయాలున్నాయి. అన్నీ మహాదేవుని కంకితమైనవే।

ప్రధాన గుహాలయం కళావైశిష్ట్యానికి ప్రతీక. సృష్టి, స్థితి, లయాలకు అన్నింటికీ మూలం ఆ పరాత్పరు డొక్కడే- అతడే శివ మహాదేవుడు- అనేఅర్థం స్ఫురించే విధంగా ఒకే రాతిలో మలచబడిన మూడు ముఖాలతో నిర్మించబడిన శివుని విగ్రహం పరమానందకరం. మూల విరాట్టుకు వెనుక శోభాయమానమైన అపురూప శిల్పాలతో అలరారుతున్న కుడ్యం శిల్ప సంపదలో సాటిలేని మేటి. అవరణం

మధ్యలో కుడి ఎడమల శిల్పాలు హృద్యంగా మలచబడ్డాయి. ఎడమ భాగంలో యోగ ముద్రాంకితుడైన మహాదేవుడు. కుడి భాగంలో మాత విగ్రహం- వెనుక భాగంలో దేవర్షి గణాలు స్తోత్రములు చేస్తున్నట్లుగా- గంభీరాకృతితో సజీవంగా భాసిస్తాయి. వీటితో పురాణకాలంలో రావణబ్రహ్మ కైలాసగిరిని కదిలించేకథ కమనీయంగా ప్రతిక్షేపించబడింది. రావణుని ప్రయత్నాన్ని మహాదేవుడు కైలాసగిరిని తన కాలిబొటన వ్రేలితో నొక్కిపెట్టి రావణుని గర్వాన్ని అణచివేశిన ఉదంతం, అనేక పురాణ కథలు చిత్రాలుగా శిల్పాలుగా మలచబడినవి చూడవచ్చు. ప్రాచీన శిల్పకళ అక్షరాలా నిక్షిప్తం చేయబడింది గుహల్లో.

ఒకానొకప్పుడు దీన్ని 'ఘరపురి' అనికూడా అనేవారు.

జుహూబీచ్ :

అంతర్జాతీయ విమానాశ్రయం శాంతాక్రజ్‌కి సమీపంలో అమరియున్న సముద్రతీరపు బీచ్. దాదాపు 5 కి.మీ. పొడవునా ఉంటుంది. నగరం మొత్తానికి అతి ఖరీదయిన, విలాసవంతమైన హోటళ్ళుంటాయి. మామూలు పని దినాల్లో చాలా ప్రశాంతంగా, నిర్మానుష్యంగా ఉంటుంది. ఆది వారాలు సెలవు దినాల్లో జనసమర్థంగా ఉంటుంది. కళకళలాడుతూ వుంటుంది. ఒంటెలు, కంచర గాడిదలు, ప్రోనీలు సవారీకి తయారుగా ఉంటాయి. వినోద భరితం. ప్రసిద్ధి చెందిన పిక్నిక్ కేంద్రం.

ఆరీ మిల్క్ కాలనీ :

ఆధునిక పాలశీతలీకరణ కేంద్రం. పాల ఉత్పత్తులకు ముఖ్యకేంద్రం. ఆసియా ఖండంలోనే అతి పెద్దదిగా ప్రసిద్ధి. చక్కని ఉద్యాన వనాలమధ్య అమరి యున్నది. ప్రవేశంలోని వీక్షణా గవాక్షంగల చిరుపర్వతాగ్రం నుండి చూస్తే పాల శీతలీకరణయోగం వగయిరాలను చూడగలం.

కృష్ణగిరి నేషనల్ పార్కు :

బోరివిలి స్టేషనుద్వారా చేరవచ్చు. ఉద్యానవనంలో చివరగా అమరియున్న కన్హేరి గుహలుకూడ చూడవచ్చు. ఇంకా బొంబాయి మహానగరానికి నీటిసరఫరాచేసే తులసి, పొవారి, విహార్ సరస్సులుగూడా చూడవచ్చు. మంచి సరదాఅయిన పిక్నిక్‌స్పాట్స్. పార్కు ప్రవేశద్వారం దగ్గరిలో 'లయన్ సఫారిపార్కు' కూడా ఉంది. మొదట్లోనే

ఒక అవుట్‌డోర్ మూవీ యూనిట్ పాతనూనె పీపాలతో కట్టింది ఉంది. ప్రతి సోమవారం సెలవు. సోమవారం ప్రభుత్వ సెలవు దినం అయితే మంగళవారం సెలవు. ప్రతిరోజూ ఉ. 9 గం. నుండి 5 గం. వరకు విహారణీయం.

**కన్హేరి గుహలు :**

నేషనల్ పార్కులో చివరగా 109 బౌద్ధ గుహలున్నాయి. క్రీ. శ. రెండవ శతాబ్దంనుండి 9వ శతాబ్దం వరకూ నిర్మించబడినవి. వాటన్నిటిలో అతి ప్రధానమైనది 'మహాచైత్యగుహ' 3వ నంబరు గలది. మిగతావి పెద్దవి కొన్ని, కొన్ని మరీ చిన్నవి. గుట్టల మీదనుంచి చూస్తే పరిసరాల దృశ్యం గమనించదగింది. కన్హేరి గుహలు యాత్రికులను ప్రాచీన కాలంలోకి తొంగిచూసేట్లు చేస్తాయనటంలో సందేహంలేదు. కృష్ణశైలం- అంటే 'నల్లశిల' అనేఅర్థం ఈ గుహలకి పేరు తెచ్చింది. ఈ గుహల్లో ఒకదానిలో అరుదైన గద్దాల గబ్బిలాలు నివసిస్తున్నాయి.

**కర్లా గుహలు :**

బౌద్ధ వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన విశేషాలను తెలిపేవి రాతిలో తొలిచి మలచిన గుహలు. లోనావ్లా స్టేషను చేరితే అక్కడి నుండి 8 కి.మీ. దూరం. చివరి రెండు కి.మీ. దోవ అంత సవ్యంగా ఉండదు.

**మౌంట్ పెజీర్, జోగేశ్వరి గుహలు :**

మండపేశ్వరీ గుహలు, జోగేశ్వరీ ఆలయం, వేడినీటి ఊటలు, రామేశ్వర ఆలయం మొదలయినవి హిందుగుహలు, జోగేశ్వరి గుహలు అంధేరి స్టేషనుకు దగ్గరిలో ఉన్నాయి. మిగతా హిందూగుహలు మౌంట్ పెజీర్ దగ్గరిలో ఉన్న పోర్చుగీసు చర్చి వెనకాల ఉన్నాయి.

**బస్సెయిన్ :**

బొంబాయి ప్రధానదీవిని వేరుచేస్తూ ఏర్పడిన నదీతీరంలో 1534 లో పోర్చుగీసువారు కట్టిన కోట పట్టణం. పెద్దపెద్ద అధికారులు, రాజప్రతినిధులు మాత్రమే కోటగోడ లోపలవైపునగల భవనాల్లో ఉండటానికి అనుమతి ఉండేది. 17వ శతాబ్ధాంతానికి 800 మంది పోర్చుగీసులు, 400 ఇండియన్ క్రైస్తవ కుటుంబాలుండేవి. కొన్ని చర్చిలు, కాన్వెంటులతోసహా.

1739లో మరాఠులు వశం చేసుకొన్నారు. ఈ నాటికి ఆ శిథిలావశేషాలున్నాయి. దర్శించనాసక్తి గలవారు దర్శించవచ్చు. ఇక్కడికి ఒక గంట ప్రయాణ

వ్యవస్థతో చేరే విధంగా HOT SPRINGS వున్నాయి. వీటికి వజ్రేశ్వరి HOT SPRINGS అని పేరు.

చౌల్ :

బస్సెయిన్‌తోపాటు పోర్చుగీసియులు వశం చేసుకొన్న ప్రదేశం. బస్సెయిన్‌తోపాటు దీన్ని గూడా మరాఠులకు అప్పగించ వలసి వచ్చింది. శిథిలమైన చర్చిలు, నగయిరాలను చూడవచ్చు. ఆసక్తి ఉన్నవారు చూడవచ్చు.

బొంబాయి అతి ఖరీదైనది. అభివృద్ధి చెంది అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన గొప్ప వ్యాపార కేంద్రం. ఛార్జీలు, వసతులు బహు ఎక్కువగా వుంటాయి. సామాన్యుడు తట్టుకోలేడు. ఎంత వీలయితే అంత త్వరగా చూచి వెళ్ళడం మంచిది. కార్యక్రమం త్వరితంగా పూర్తి చేసికొని వెళ్ళాలి.

ఇక ఇతర వివరాలు :

ప్రత్యేక సమాచారం. యాత్రిక సమాచార కేంద్రాలు :

(1) గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు.
123-M. కార్వేరోడ్, చర్చిగేటు స్టేషను దగ్గర, బొంబాయి- 400020.

(2) టూరిస్టు కౌంటర్లు.
a. న్యూ ఇంటర్నేషనల్ పాసెంజర్ టర్మినల్, సహర్.
b. బొంబాయి ఎయిర్‌పోర్టు, శాంతాక్రజ్ (డొమెస్టిక్)
c. టాజ్ ఇంటర్ కాంటినెంటల్ హోటల్, అపోలో బందరు.

(3) రాష్ట్ర ప్రభుత్వ టూరిస్టు కార్యాలయాలు.
1) మహారాష్ట్ర టూరిజమ్ డెవలప్‌మెంటు కార్పొరేషను,
CDO హట్‌మెంట్స్, మేడమ్‌కామా రోడ్,
2) 2, ఎక్స్‌ప్రెస్ టవర్స్,
9 th ఫ్లోర్, నారిమన్ పాయింటు.

(4) ఇతర రాష్ట్ర టూరిజమ్ కేంద్రాలు :
1) గవర్నమెంటు ఆఫ్ గుజరాతు టూరిస్టు ఆఫీసు,
ధనరాజ్‌మహల్, ఛత్రపతి శివాజి మహరాజ్ రోడ్,

2) గవర్నమెంటు ఆఫ్ గోవా, డామన్, దయ్యూ టూరిస్టు కౌంటరు,
బొంబాయి సెంట్రల్ స్టేషను.

3) జమ్మూ&కాశ్మీర్ గవర్నమెంటు టూరిస్టు ఆఫీసు.
వరల్డ్ ట్రేడ్‌సెంటరు, కఫ్ పెరేడ్.

4) గవర్నమెంటు ఆఫ్ రాజస్థాన్ టూరిస్టు ఆఫీసు
230, D.N. రోడ్.

5) గవర్నమెంటు ఆఫ్ హర్యానా టూరిస్టు ఆఫీసు,
ఎయిర్ ఇండియా బిల్డింగు.

6) సిక్కిం సెంటరు, ఎయిర్ ఇండియా బిల్డింగు, 5 వ అంతస్తు, నారిమన్ పాయింటు.

ప్రయాణాల రిజర్వేషనులు

**విమానం :**

ఇండియన్ ఎయిర్‌లైన్సు, ఎయిర్ ఇండియా బిల్డింగు, నారిమన్ పాయింటు.

**రైలు :**

సెంట్రల్ రైల్వే, విక్టోరియా టెర్మినస్.

విక్టోరియా టెర్మినస్ స్టేషను, బోరిబందరు.

మొదటి తరగతి : సమయం : 9 గం. — 4-30 వరకు.

రెండవ తరగతి : సమయం : ఉ. 8 గం. - రాత్రి గం. 8 గం. వరకు.

మధ్యాహ్న విరామం మధ్యాహ్నం 1-30 నుండి 2 గం. వరకు.

(విదేశీ యాత్రికులు గయిడ్ సేవల కోరకై విచారించ గలరు.)

**వెస్టరన్ రైల్వే :**

వెస్టరన్ రైల్వే రిజర్వేషను ఆఫీసు, చర్చిగేటు.

I వ తరగతికి సమయం : ఉ. 8 గం. నుండి రాత్రి 8 గం. వరకు.
మధ్యాహ్న విరామం 1-45 నుండి 2-45 వరకు.

రెండవ తరగతి- బొంబాయి సెంట్రల్ స్టేషను.

సమయం : ఉ. 8 గం. నుండి - 4-30 వరకు. మధ్యాహ్నం విరామం 1 గం. నుండి 1-30 వరకు.

అనుమతించబడిన గయిడ్ సర్వీసు చార్జీలు :

యాత్రిక సమూహాలును బట్టి చార్జీలు వివరణ :

| వినియోగపు సమయం | — 1-4 గురుకి | — 5 నుండి 15 గురుకి | -16 నుండి 40మందికి |
|---|---|---|---|
| సగంరోజు (4 గంటలు) | రు.25/- | రు. 35/- | రు. 45/- |
| రోజు మొత్తం (8 గం.) | 35/- | 45/- | 60/- |

ఫ్రెంచి, జర్మను, ఇటాలియన్, జపనీస్, రష్యా, స్పానిష్ మొదలైన విదేశీ భాషలలో వివరించగల వారికి ప్రత్యేకంగా రు. 15/- అదనం. మరిన్ని వివరాలు ప్రభుత్వ టూరిస్టు ఆఫీసులో సంప్రతించి పొందగలరు.

విదేశీ కాన్సులేట్, హైకమీషనులు, చిరునామాలు :

ఆస్ట్రేలియా :

మేకర్‌టవోట పర్ర్స్, E బ్లాకు, కఫ్‌పెరేడ్, ఫోన్ : 211071.

వెస్టు జర్మని :

హోచెస్ట్ హౌస్, నారిమన్ పాయింటు, ఫోన్ : 232422.

నెదర్లాండ్సు :

16, M. కర్వేరోడ్, ఫోన్ : 296840.

U. K. :

మర్కంటైల్ బ్యాంకు బిల్డింగు, మహాత్మాగాంధీ రోడ్, ఫోన్ : 274874.

USA :

లింకన్‌హౌస్, భులాభాయిదేశాయ్ రోడ్, ఫోన్ : 8223611.

ఆఫ్గనిస్తాన్ :

115 వాకేశ్వర రోడ్, ఫోన్ : 818577.

ఫ్రాన్స్ :

మార్కంటైల్ బ్యాంకు బిల్డింగు, మహాత్మాగాంధీ రోడ్డు, ఫోన్ : 271528.

జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ :

మిస్త్రీభవన్, D. వాచారోడ్డు, ఫోన్ : 222343.

పోర్చుగల్ :

మోతిమహల్, 3 వ అంతస్తు, 195, టాటారోడ్, ఫోన్ : 221868.

సౌదీఅరేబియా :

మేకర్‌టవర్స్, F-బ్లాకు, 4 వ అంతస్తు, కఫ్‌పెరేడ్, ఫోన్ : 217768. & 211598.

USSR :

పామ్‌బీచ్ రోడ్, 42, L జగమోహన్‌దాస్‌మార్గ్, ఫోన్స్ : 363627&-28

ఫారినర్స్ రీజినల్ రిజిస్ట్రేషన్ ఆఫీసు :- మహాత్మా పూల్ మార్కెట్ (క్రాఫోర్డుమార్కెటు), ఫోన్ : 263111.

ఆసక్తి అభిరుచి గల వారికి కొన్ని ఆరోగ్య కేంద్రాలు.

(1) కైవల్యధామ్ : ICY హెల్త్‌సెంటర్, నేతాజి సుభాష్ రోడ్, ఫోన్ : 310494.

(2) రామతీర్థయోగాశ్రమం, దాదర్, ఫోన్ : 442899.

(3) యోగా ఇన్‌స్టిట్యూట్, శాంటాక్రజ్, ఫోన్ : 532185.

స్థానిక స్థల సందర్శనానికి నిర్వహించబడుతున్న టూర్ల వివరాలు :

నగరంలో విహరించటానికి అనువైన వాహనాలు :- ప్రైవేట్, పబ్లిక్.

పసుపు పచ్చరంగు పైన గల-మీటరు అమర్చబడిన టాక్సీలు - 4గురు ప్రయాణించ వచ్చు. మినిమమ్ రు. 3/- మిగతా కాలాను గుణ్యంగా మార్చబడిన రేట్ల ప్రకారం.

ఆటోరిక్షాలు :

పరిమితి ఇద్దరు-కనీసం రు. 2/- మిగతా కిలోమీటరుకు నిర్ణయించబడిన రేటు ప్రకారం.

విక్టోరియా టాంగాలు :

గుర్రాలు లాగే బండ్లు బొంబాయి సెంట్రల్, చౌపాటి, గేట్‌వే ఆఫ్ ఇండియాల వద్ద మాత్రమే లభ్యం. బేరమాడి కుదుర్చుకో వలసిందే ;

ఎలక్ట్రిక్ ట్రెయిన్ :

పొదుపైన సౌకర్యం. త్వరలో గమ్యం చేరగలిగేది పశ్చిమంవైపు వెళ్ళటానికి చర్చిగేటు స్టేషనులో ఎక్కాలి, తూర్పువైపు వెళ్ళటానికి బొంబాయి VT స్టేషనులో ఎక్కాలి.

బస్సులు :

మహారద్దీగా వుంటాయి. నిర్వహణం అంతా బాంబే ఎలక్ట్రిక్ సప్లై మరియు ట్రాన్సుపోర్టు అండర్ టేకింగ్ (BEST)ః మహా బొంబాయి అంతా నిండి ఉన్నవి సిటీ బస్సులు.

ఇండియా టూరిజమ్ డెవలెప్మెంట్ కార్పొరేషను వారి నిర్వహణలో టూర్లు :

సోమవారాలు తప్ప ఇతర రోజుల్లో ఉ. 9 గం. నుండి 1 గం. వరకు మధ్యాహ్నం 2 గం. నుండి 6 గం. వరకు.

చార్జీ పెద్దలకు రు. 25/- పిల్లలకు రు. 15/-

కార్యక్రమం :

1) గేట్ వే ఆఫ్ ఇండియా, అక్వేరియం, జైనాలయం, హాంగింగ్ గార్డెన్స్, కమలానెహ్రూ పార్కు, మణిభవన్, ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం.

2) పై కార్యక్రమాన్ని చివరన కొద్ది మార్పుతో మహారాష్ట్ర టూరిజం డెవలప్మెంటు కార్పోరేషనువారు నడిపే లగ్జరీకోచ్‌లో రు. 30/- చార్జీతో వెళ్ళవచ్చు. పై కార్యక్రమానికి చివర వరల్డ్ ట్రేడ్ సెంటరు కూడా కలుపబడింది.

3) M T.D C వారి నిర్వహణలోనే రోజూ సా. 2 గం. నుండి 7 గం. వరకు నిర్వహించే టూరులో కలిసిన విశేషాంశాలు.

నెహ్రూ సైన్స్ సెంటర్, వొర్లీ డయిరీలు కలుపుకుని.

లగ్జరీకోచ్‌లో రు. 30/- చార్జీకే దర్శించవచ్చు.

4) కొద్ది మార్పుతో బేసి సంఖ్యల తేదీల్లో సంఘీ ఇంటర్నేషనల్ ట్రావల్సు నిర్వహణలో రూ. 25/- చార్జీపై- సోమవారాల్లో అయితే ఆనంద కేంద్రం కూడా దర్శించవచ్చు. సరిసంఖ్య తేదీల్లో ట్రావల్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా- వారి నిర్వహణ.

పై విహారాలన్నీ గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు, చర్చిగేటు దగ్గర ప్రారంభమై ఓబరాయ్‌టవర్స్, టాజ్‌మహల్‌దగ్గర వారిని ఎక్కించుకుని మరల చర్చిగేటు దగ్గరనే అంతమవుతాయి.

5) నగర పరిసరాలలో :

BEST వారి నిర్వహణంలో- సాధారణ కోచ్‌లలో :

సమయం: ఉ. 8-45 నుండి సా. 5-30 గం. వరకు

చార్జీ పెద్దలకు: 15/- పిల్లలకు రు. 7-50 (12 సం॥లోపు)

కార్యక్రమం :

జుహూబీచ్, ఆరిమిల్క్ కాలనీ పిక్నిక్‌స్పాట్, విహార సరస్సు, పోవాయి సరస్సు.

6) MTDC వారి నిర్వహణలో :

అగ్గరీకోచ్‌లో రు. 50/- పై కార్యక్రమం.

సమయం: ఉ. 10 గం॰ నుండి సా. 7-30 వరకు.

7) నేషనల్ పార్కు, పోవాయి సరస్సు, విహార్ సరస్సు, NIPT, వార్లి డయరీ, ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టు, వరల్డ్ ట్రేడ్ సెంటరు.

గమనిక :

వరల్డ్ ట్రేడ్ సెంటరు ఆదివారాల్లోను, అక్వేరియమ్ సోమవారాల్లోను తెరచి వుంచరు- సెలవుదినాలు.

8) ఎలిఫెంటా గుహలు: ప్రతిరోజూ ఉ. 9 గం.ల నుండి మ. 2 గం. వరకు

చార్జి రు. 25/-

లాంచీలు వర్షాకాలంలో మామూలు లాంచీలు, సాయం సమయాలలో నిర్వహణలు రద్దు. సాధారణంగా జూన్ to సెప్టెంబరు వరకు వర్షాకాలం. వాతావరణ పరిస్థితులు సరిగా లేకపోతే అన్ని విహారాలు రద్దు చేయబడతాయి. పూర్తి సమాచారం సేకరించి మరీ కార్యక్రమం నిర్ణయించుకోటం మంచిది.

బొంబాయిలో వసతి :

ధర్మసత్రాలు/ముసాఫిర్ ఖానాలు :

1. మహమ్మద్ జాఫర్ సులేమాన్ ముసాఫిర్‌ఖానా, వాడిబందర్.
2. ఇస్మాయిద్ బేగ్ ముసాఫిర్‌ఖానా, మజగావన్.
3. రంగారి మొహల్లా జమత్‌ఖానా, మీరామసీదు, పైధోని.
4. సేఠ్ M.M. ధర్మశాల, చారిటీట్రస్టు, C.P. TANK రోడ్డు.

ఇతరం :

Y.W.C.A. :

1. మేడమ్‌కామారోడ్డు, కూసరేజి ఫోన్: 230445
   రు. 22/- రూముకు, పడకకు రు. 16/-
2. అచ్చమ్మ భవన్ హాస్టల్, 34, మోస్తిబాయ్‌వీధి, ఫోన్: 372744
   చార్జి రు. 16-50+సర్వీసు చార్జి 10 శాతం.
3. 12, నోడహౌస్ రోడ్డు, ఫోన్: 230079
   చార్జీలు రు. 15/- సింగల్‌రూము, ప్రతి అదనపు మనిషికి 10/-

యూత్ హాస్టళ్ళు : మెంబర్‌షిప్ వుందా! వుంటేనే అర్థం.

1. భవాన్స్ కాలేజి, వెర్సోవారోడ్డు.
2. భవాన్స్ కాంపు – అంధేరి,
3. యూనివర్సిటీ హాస్టల్, L–A కిద్వాయ్‌రోడ్డు.
4. పొద్దర్‌కాలేజి ఆఫ్ కామర్స్ హాస్టలు, 193, సియాన్-కొలివాడా ఎస్టేట్స్

చౌకలో హోటళ్ళు :

బొంబాయిలో చౌక అంటే రోజు 1కి మనిషికి 100/- బహు చౌకకిందే లెక్క. కనుక 100/- కొంచెం అటూ యిటూ :

1) కొలాబాలో – రెక్స్, స్టెఫిల్స్
2) కారల్టన్ హోటల్
3) హోటల్ ప్రోస్పర్
4) వాలీస్ గెస్టు హౌస్
5) కేపీస్ గెస్టు హౌస్
6) ఆలివర్ గెస్టు హౌస్
7) మోతీ హోటల్ ఇంటర్నేషనల్
8) సీషోర్ హోటల్
9) జనతా గెస్టు హవుస్
10) హోటల్ ముకుంద్
11) గేట్‌వే గెస్టు హవుస్
12) గల్ఫ్ హోటల్ మొదలయినవి.

కొలాబా కాక ఇతర ఏరియాల్లో

1) లారెన్స్ హోటల్, అశోక్‌మమార్‌లేన్, ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం వెనుక.

2) డిమెల్లోరోడ్డుకో విక్టోరియా టెర్మినస్ స్టేషను ప్రాంతంలోగల అనేక యితర హోటళ్ళు, రైల్వే హోటల్, రూపమ్‌హోటల్, హోటల్ మనామా మొదలయినవి.

3) కొలాబా- బాల్లార్డ్ ఎస్టేట్‌ల సమీపాన ఉన్న ఫెర్నాండేజ్ గెస్టు హౌస్, వగైరా వగైరా.

**మధ్యస్థంగా :**

రు. 200/- పైన రు. 500/- లోపు ఒక రోజుకి

**కొలాబాలో :**

ఎస్క్వైట్ హోటల్, గార్డెన్‌రోడ్డు.

గాడ్విన్ హోటల్, గార్డెన్ రోడ్డు.

గార్డెన్ హోటల్, కేవీస్ గెస్టుహౌస్, వాల్టన్‌రోడ్డు.

హోటల్ డిప్లొమాట్, మెరెవెదర్ రోడ్డు.

సీ పేలస్ హోటల్, 26, P.J రామచంద్రాని రోడ్డు.

షెల్లీస్ హోటల్, 30, P.J. రామచంద్రానిరోడ్డు.

హోటల్ ఎపోలో, M. భూషన్‌మార్గ్, (లాంస్డౌన్ రోడ్డు)

**సుభాష్‌చంద్ర రోడ్‌లో :**

సీ గ్రీన్ హోటల్, నార్మన్, గెస్టుహౌస్

అస్టోరియా హోటల్, 4, జంషెడ్జీ టాటారోడ్డు.

వగైరా వగైరాలు.

**శ్రీమంతులకు :**

టాజ్‌మహల్ హోటల్, అపోలో బందర్.

దీనికి అనుసంధించబడినది— టాజ్ ఇంటర్ కాంటినెంటల్. ఇప్పుడు టాజ్‌మహల్ హోటల్ & టాజ్ ఇంటర్ కాంటినెంటల్ ఫోన్ : 243366.

నారిమన్ పాయింటులోని :

హోటల్ ఒబెరాయ్ టవర్స్, స్విమ్మింగ్ పూల్‌తో ఉన్నది. ఫోన్: 234343.

కొంచం అవతలగా :

హోటల్ ప్రెసిడెంట్, 90, కఫ్‌పెరేడ్. ఫోన్ : 4950808

హోటల్ ఫరియాస్, 25 ఆఫ్ ఆర్థర్‌బందర్ రోడ్డు. ఫోన్: 242680.

బాంద్రాలో లాండ్స్‌యండ్ (LANDS END)వద్దగల.

వెల్‌కం గ్రూప్ సీరాక్, ఫోన్ : 6425421.

ఎయిర్‌పోర్టు, జుహూ ఏరియాలోనివి

సెంటార్ హోటల్, ఫోన్ : 612660.

హోటల్ ఎయిర్‌పోర్టు ప్లాజా, హోటల్ ఎయిర్‌పోర్టు ఇంటర్నేషనల్, ఫోన్ : 6122891.

హోటల్ ఎయిర్ క్రాఫ్ట్ ఇంటర్‌నేషనల్, ఫోన్ : 6120667.

హోటల్ జాల్, ఫోన్ : 6123820.

దగ్గరిలో లీలా పెంటా—ఫైవ్‌స్టార్ హోటల్

కింగ్స్ హోటల్, 5 జుహూతారా రోడ్, ఫోన్ : 579141.

సీసైడ్ హోటల్, జుహూతారా రోడ్, ఫోన్ : 621972.

సౌత్‌యెండ్ హోటల్, జుహూతారా రోడ్-వగయిరాలు.

బల్‌రాజ సాహ్నిమార్గంలో :

హాలిడే ఇన్, పామ్‌గ్రోవ్ హోటల్ వగయిరాలు.

హోటల్ ఇన్‌ఫోమ్ కూడా వీనిలో చేరిందే.

ప్రైవస్సీ చౌక అంటే 400/- పైనే-ఖరీదుకి. రోజుకి 1200 రూపాయలు వరకూ పెట్టగలిగిన ఆర్థికస్తోమత గలవారికి మాత్రమే అని గ్రహించగలరు.

గుహాలయాల విశిష్టత :

కొండల్ని తొలిచి గుహలగా ఏర్పరచి అందులో ఆలయాలు నిర్మించిన హైంద వార్య శిల్పకళల నైపుణ్యానికి పరాకాష్ఠగా చెప్పుకోవచ్చు. మహారాష్ట్రలోని గుహలు వివిధ చిత్ర విచిత్రాలైన నగిషీలతో చెక్కిన శిల్పాలు. రంగు లద్దిన వర్ణచిత్ర వైచిత్రి ఆనాటి మానవుల మనస్సుల్లోని భావ శబలత్వానికి చెప్పిన భాష్యం.

బౌద్ధ గుహలుగా పేర్కొనబడిన గుహాలయాలు ముఖ్యంగా రెండు విధాలుగా చెప్పుకోవచ్చు. (1) చైత్యములు : దేవాలయములు. (2) విహారాలు : బౌద్ధ భిక్షువులు నివాసం చేస్తూ భగవానుడ్ని ఆరాధించుకోటానికి ఒక చిన్న గర్భ గుడిలాంటి ఆలయం సంధించబడి వున్నవి. గదులు గదులుగా కట్టించబడిన కట్టడాలు. అజంతా గుహలు నిట్ట నిలువుగా ఉన్న కొండను నిలువుగా తొలచి గుహలేర్పరచబడ్డాయి. ప్రధానమైన గుహ ద్వారం దగ్గర ప్రవేశాన్ని నిర్దేశిస్తూ ఒక చిన్న వరండాలా లోగిలి గుమ్మంలా అమర్చియుంటుంది.

హైందవుల గుహాలయ నిర్మాణ వైచిత్ర, వైభవం, నిర్మాణంలోని గాంభీర్యత శిఖరాగ్రాన్ని అందుకున్న వైనం ఎల్లోరా గుహల్లో ప్రతిబింబించిన దనడం యుక్తి యుక్తం. ముఖ్యంగా కైలాస నాధుని ఆలయం పరమాద్భుతం - ప్రపంచంలోని నిర్మాణ దక్షుల్ని సైతం ముక్కున వేలు వేయించిన ఘనతని సంతరించుకుంది.

ప్రపంచం మొత్తం విశేషాకర్షణలో యాత్రికుల మనస్సును ఆకట్టుకొని, వారి జన్మధ్యేయ లక్ష్యాలుగా తోపింపజేసి నేటికి నాటికీ సాటిలేని కళావైశిష్ట్యాన్ని వెలుగు కిరణాలుగా విరజిమ్ముతున్న అజంతా, ఎల్లోరా గుహలు 18'9 వరకూ దాక్కుని ఉన్నాయి. అక్కడికి వెళ్ళబోయే ముందుగా గుజరాతు రాష్ట్రాన్ని ఆనుకుని ఉన్న కొన్ని ప్రదేశాలు చారిత్రిక విశేషాలు గమనించి ముందుకు సాగుదాం.

## మా ధే రా న్

బొంబాయికి 171 కి.మీ. దూరంలో బొంబాయి-పూనా రైల్వేలైనులో నెరాల్ ద్వారా చేరవచ్చు. చలచల్లని నీడనిచ్చి సేదదీర్చే గుబురు చెట్లు అల్లుకుని వున్న ప్రశాంత పర్వత విశ్రాంతి కేంద్రం. సముద్ర మట్టానికి 700 నుండి 800 మీటర్ల ఎత్తున అమరిన కొండ ప్రాంతం. నెరాల్ నుండి నేరోగేలైను రైలులో వెళ్ళటం బహు తమాషా అయిన అనుభవం అనుభూతులు. ఉత్తర, దక్షిణాలుగా వ్యాపించి వుంది. వైపరీత్యాలు లేని వాతావరణం గల దినాల్లో నైఋతి దిశగా చూస్తే బొంబాయి నగర విద్యుద్దీప కాంతులు దృశ్యమానంగా చూడగలగటం ఒక విశేషం. పడమటి దిక్కు నుండి నెరాల్ రైల్వేలైను ఎన్ని మెలికలు తిరిగిందీ స్పష్టంగా చూడవచ్చు. శివాజీ నిచ్చెనగా ఉపయోగించబడిన ఒక కొండకొమ్మున గల వృక్షాగ్రం నుండి పరిసరాలను శివాజీ మహారాజ వారు పరికించేవారట. వుండటానికి, తినటానికి హోటళ్ళున్నాయి.

కర్లాగుహాలు, భజగుహాలు :

పూనా మెయిన్‌లైనులో లోనావ్‌లా లేక లోనావాలా అనేచోట నుండి కర్లా, భజగుహాలున్నాయి. మొదట కర్లా, తరువాత భజ గుహాలున్నాయి. కర్లా గుహల్లో హీనయాన బౌద్ధ సంప్రదాయానికి చెందినవి. దాదాపు క్రీ.పూ. ఒకటో శతాబ్దం చివరి భాగంలో నిర్మించబడినట్లుగా తెలుస్తుంది. అప్పటి నుండి చెక్కు చెదరకుండా దర్శన మిచ్చే ఆలయం. పైన ఒక గవాక్షం గుండా జారే సూర్య కిరణాల వెలుగులు లోపల ఒక చిన్న స్తూపం మీద కరెక్టుగా పడుతుంటాయి. స్తంభాలమీద మదకరీంద్రములమీద ఇద్దరు గంధర్వులు కూర్చుని ఉన్నట్లుగా మలచబడిన విగ్రహాలున్నాయి. పైకప్పులో అసలైన టేకు దూలాలున్నాయి. అక్కడే అశోక స్తంభాలు నాలుగు సింహపుతలలు గలవి కూడా నిక్షిప్తంగా ఉన్నాయి. కొన్ని ఇతర గుహలు విహారంగా కట్టించబడి నవి ఉన్నాయి. అయితే వీటి స్థానంలో కొన్ని హిందూ దేవాలయాలు వెలసినట్లు తెలుస్తుంది. ఇదే విధంగా ఇక్కడకి అనతి దూరంలోనే 18 భజ గుహలున్నాయి. దాదాపు క్రీ.పూ. 200 సంవత్సరాల నాటి బౌద్ధ చైత్యం చూడదగినది. దీనికి దక్షిణంగా అరుదైన 14 స్థూపాలున్నాయి. 5 లోపల, 9 బయట ఉన్నాయి. ఈ దోవలోనే ఇంకొంచం పైకి వెళ్ళే కామ్‌షెట్ స్టేషను దగ్గర దిగి ఆరు కి.మీ. దూరంలో వున్న బేద్సాగుహలు కూడా చూడవచ్చు. దగ్గరిలోనే పురాతనమైన కోటలు లోహజెన్, విసాపూర్ కోటలున్నాయి. లోనావ్‌లాకు ముందు ఖండాలా కొండ కనుమలను సాధికారంగా చూస్తున్నట్లు ఖండాలా ఒక దృశ్యమానమైన వీక్షణ. వర్షాకాలంలో మాత్రమే కనబడే ఒక చక్కని జలపాతం కూడా వుంది.

పూణె (పూనా) :

జనాభా 17 లక్షలు పైగా వున్నది. పడమటి కనుమలో భద్రంగా ఉన్నటువంటి గూడు. ఒకానొకప్పుడు శివాజీ మహారాజుకు రాజధానిగా శోభిల్లిన ఈ పట్టణం నేడు మహారాష్ట్రకు సాంస్కృతిక రాజధాని. పురాతనపు నామం 'పూర్ణక' అంటే పరిపూర్ణమయినది అనే అర్ధంతో విలసిల్లిన ఈ మహానగరం పశ్చిమ భారతంలో మూడవ మహా నగరంగా గణుతికెక్కిన గొప్ప విద్యా కేంద్రం. నాటి పీష్వాలు పరిపాలన చేసిన ఈ మహానగరం 'స్వాతంత్ర్యమే నా జన్మహక్కు' అని ఎలుగెత్తి చాటిన బాలగంగాధర తిలక్ మహాశయుని జన్మ స్థలం. సముద్ర మట్టానికి 1900 అడుగుల ఎత్తున ఉన్న ది పట్టణం భారతదేశంలో ఒక పెద్ద సైనిక స్థావరం. (మిలటరీ

కన్‌టోన్‌మెంటు) చాల అందమైన పట్టణం. జూలై నుండి అక్టోబరు వరకు గుర్రం పందాలు జరుగుతున్నాయి.

ఇక్కడ అమరియున్న ముఖ్యాకర్షణలు- నేషనల్ ఫిల్మ్&TV ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా, సెంట్రల్ వాటర్&పవర్ రిసెర్చి స్టేషను, నేషనల్ కెమికల్ లేబరేటరీ, రాజా దినకర్ కేల్కార్ మ్యూజియం, ఆగాఖాన్ ప్యాలెస్, సింహఘాత్రి, పార్వతీ ఆలయం, టోవలోనే గల శంభాజీపార్కు, పేషోఉద్యాన్ మొదలయినవి. ఆధ్యాత్మికంగా మహోన్నతిని సాధించి దేశవిదేశాల్లో అనుచరవర్గం గల 'మెహర్‌బాబా' ఆశ్రమం, ఇటీవల కాలంలోనే అతి వివాదాస్పదమైన గురువుగా ప్రఖ్యాతి చెంది ప్రపంచంలోని విదేశీ అనుచర వర్గాన్ని మిక్కుటంగా సంపాదించినా ఎక్కడా నిలువలేక మరల భారతదేశములోనే ఉన్న 'బాబా రజనీష్' ఆశ్రమం కూడా వున్నాయి. 'రజనీష్' అనేక విమర్శలకు గురయిన వారు.

నగరం మూలానదీదక్షిణ భాగంలో అమరి మూలా-ముత్తా నదుల సంగమ స్థానం అయివున్నది. ఇక్కడే ఒక పెద్ద బండ్‌గార్డెన్ వున్నది. పబ్లిక్ గార్డెన్సు తోటు క్లబ్బున్నది.

## రాజా కేల్కార్ మ్యూజియం :

శ్రీ దినకర్ కేల్కార్ సేకరించిన అనేక వస్తు సముదాయాలు ప్రదర్శించబడుతున్న చిన్న మ్యూజియం. ఇందులో పీష్వాలకు సంబంధించిన వస్తు సముదాయాలు ముఖ్యంగా చేపల ఎముకలతో తయారు చేయబడిన కవచం, సంగీత వాయిద్య విశేషాలు, అనేక రకాల అదక తెరలు వగయిరాలు దర్శించగలం.

## షానివార్ వాడా :

పీష్వాల ప్రాసాద భవనాల శిధిలావశేషాలు 18వ శతాబ్దం నాటివి ఉన్నాయి. 1827లో పరశురామ్ప్రీతి చేయబడింది.

## విశ్రంబాయి వాడా :

2వ బాజీరావు పీష్వా 1808లో నిర్మించింది. ఇది 'మేఘదుంబారి' అనే పేరుతో పిలువబడే మహారాష్ట్ర నిర్మాణ వైచిత్రికి తార్కాణం.

## ఆగాఖాన్ భవనం :

నది కవతలగా యరవాడలో ఉన్న అందమైన చక్కని భవనం. భారత స్వాతంత్రోద్యమ వీరులను కొందరిని మహాత్మాగాంధీతో పాటుగా నిర్బధించిన స్థలం.

ఇక్కడే మాత కస్తూరీబాయి గాంధీ అసువులు బాసిన ప్రదేశం. ఈమె సమాధి స్మారక చిహ్నంగా నిర్మించబడింది. ఈ కారణంచేత జాతీయ ప్రాముఖ్యతను సంతరించుకున్న భవనంగా పేర్కొనబడింది.

పాటలేశ్వర గుహాలయం :

గుంగ్లిమహారాజ రోడ్డులో అమరియున్న శైవ గుహాలయం.

పార్వతీ అమ్మవారి ఆలయం :

పట్టణ శివార్లలో దాదాపు 2 కి.మీ. లోపువున్న చిరుపర్వతంమీద ఏటవాలుగానున్న కొండమీదకు మెట్ల మీదుగా ఎక్కి చేరగలం. పార్వతీ అమ్మవారి ప్రధానాలయంతో బాటుగా విష్ణుఆలయం, విఠల్ ఆలయం, కార్తికాలయం మొదలయినవి ఉన్నాయి. మాధవరావు బలాల్ పీష్వా కార్తికాలయమును 1766లో కార్తీక స్వామి ప్రతిష్ఠ జరిగినట్లుగా చెబుతారు. కాని 1753లో పార్వతీ అమ్మవారి ఆలయాన్ని బాలాజీరావు పీష్వా నిర్మించినట్లు తెలుస్తుంది. ఆలయంలో శివపార్వతుల స్వర్ణ విగ్రహం చూడచక్కనైనది. కొండమీది నుండి పట్టణ దృశ్యం కడు రమ్యంగా కనబడుతుంది. కొండ క్రింద పీష్వాల వినోద భవనం, శివాజీ మిలిటరీకాలేజి, రే మ్యూజియం, మెథలాజికల్ అబ్జర్వేటరీ, జలపాతం వగైరాలు చూడదగినవి.

పూనా చుట్టుప్రక్కలల :

దోవలోనే వున్న కర్లా, భజగుహలు, చరిత్ర ప్రసిద్ధి చెందిన సింహగడ్, రాయగడ్ కోటలు, ఛత్రపతి వీరగాధలకు పెట్టని ఆభరణాల నిలయాలు. సింహగడ్ కోట 1270 మీటర్ల ఎత్తున అమరివుండి చుట్టూ బలిష్ఠమైన గోడలతో దుర్భేద్యంగా ఉండేది. 1670లో శివాజీ సేనాని వీరతానాజీ మల్సూర్ ఒకరోజులో తనబుద్ధి కుశలతతో ముట్టడించి పట్టుకోగలిగారు. కాని కోటలో ప్రాణాలు ఒదిలాడు. అప్పుడు శివాజీ మహారాజు మోయలేని హృదయ భారంతో 'కోట దక్కింది-సింహం ప్రాణాలు పోయాయి' అని ఆవేదన చెందాడు. మరాఠవీరులు కోటగోడలు ఎగబ్రాకటానికి ఉడుముల నడుములకు మోకులుకట్టి గోడలను ఎగబ్రాకించి పట్టుకొని ఉంటే- ఆ తాళ్ళ మీదుగా గోడల మీదిగుండా చకాచకా ఎగబ్రాకేవారు. పూనాకు 27 కి.మీ. దూరంలో ఉన్నది మరోకోట ఇలాంటిదే పురందర్ కోట

ఆళంది :

ఇంద్రాణీ నదీతీరంలో ఉన్న దేవ్వకాఆళంది క్షేత్రం పూనానుండి దాదాపు 25 కి.మీ. దూరంలో ఉంది. నదీతీరంలో చక్కని మెట్లతో ఘాట్ వుంది. నదికి అవతలి ఒడ్డున గాడ్గేబాబా ధర్మశాల వసతిగా వుంటుంది. ఇక్కడ ముఖ్యంగా చూడదగినది పాండురంగ భక్తులు జ్ఞానేశ్వర మహారాజ్‌గారి పవిత్ర సమాధి. జ్ఞానేశ్వర మహారాజ్ మరాఠీభాషలో ప్రసిద్ధిచెందిన గీతా వ్యాఖ్యాన కర్త. సమాధి వెనుకగా పాండురంగ రుక్మిణీబాయి విగ్రహాలున్నాయి. ఆలయ ప్రాకారం లోపలనే గణపతి ఆలయం, ముక్తాబాయిదేవి మందిరం వగైరాలతోబాటు పవిత్ర వృక్షరాజాలున్నాయి. వీనిలో అజాంగ వృక్షమునుండి రాలిన ఆకులు యాత్రిక భక్తులకు వరప్రసాదంగా భావించ బడుతుంది.

చాంగదేవుని పుండరీక వాహనం నిర్మించిన గోద, పుండరీక, నారసింహ సరస్వతీ ఆలయాలు దర్శనీయం.

ఉత్సవాలు :

కార్తీక శుద్ధఏకాదశి, శుద్ధత్రయోదశి, ఆషాఢ శుద్ధఏకాదశిల పర్వదినోత్సవాలు జరుగుతాయి.

దగ్గరిలోనే నామదేవుని జన్మస్థలం, ఏకనాధుని జన్మస్థలం దర్శించదగినవి. ఏకనాధుడు పాండురంగని భక్తులు. స్వామి భక్తునింట కొన్ని సంవత్సరాల పర్యంతం నీళ్ళకావిడి మోసి భక్తసేవ చేసినట్లుగా కథలు ప్రచారంలో ఉన్నాయి.

దేహూ :

భక్తతుకారాం సంకీర్తనలు బహుప్రసిద్ధి చెందినవి. భగవద్భక్తులకు ఆరాధనీయ మైన ఈయన చరిత్ర లోకప్రసిద్ధం ఈ భక్త చింతామణి జన్మించిన స్థలంగా పునీత మైనది. ఈ తుకారాం వంశజులు సేవించుచున్న విఠల్ ఆలయం. ఈ ఆలయంలో ఛత్రపతి శివాజీ మహారాజు, భక్త తుకారాంతో గూడి సంకీర్తనా నందంలో ఉండగా ఆలయాన్ని శత్రువులు ముట్టడించగా భక్తపరాధీనుడైన శ్రీ పాండురంగస్వామియే మాయా శివాజీ వేషంలో వచ్చి శత్రువులను మార్గ్రతోవ పట్టించినట్లుగా చెప్పు కుంటారు.

భక్తతుకారాంతో సన్నిహిత సంబంధాలున్న గోపాలపురం, మచ్చిఘాట్,

భండారా పర్వతాలు మహిమోపేతములయిన పవిత్రస్థలాలుగా పేర్కొనబడ్డాయి. పూనా–దేహూ మార్గమంతా మిలటరీ కంటోన్మెంటు భవనాలున్నాయి.

**జెజూరి :**

రాణి అహల్యాబాయిచే నిర్మించబడినదని చెప్పుకుంటున్న కొలను, ధర్మశాల గల ఈ పుణ్యక్షేత్రం. మహారాష్ట్ర కులదైవమైన 'ఖండోబా' స్వామికి నిర్మించబడిన సుందర దేవాలయం దర్శనీయం. అనేక వార్షికోత్సవాలతో నిరంతరం సందడిగా ఉంటుంది.

**మహాబలేశ్వరం :**

పడమటి కనుమల్లో అమరియున్న ఈ ప్రదేశం బొంబాయి ప్రెసిడెన్సీకి వేసవి కాలం రాజధాని. 1372 మీటర్ల ఎత్తులో ప్రకృతి సౌందర్యంతో అలరారుతున్న పర్వతాలు పడిమటి కనుమలు. ఛత్రపతి శివాజి మహారాజు జీవితగాథలతో చారిత్రక ప్రాముఖ్యం సంతరించుకున్నది. 1828లో జాన్ మాల్కొమ్‌చే వ్యవస్థీకరించబడింది. కొంకణి సముద్రతీరం, చినమన్ జలపాతం, ధోబి, లింగమల జలపాతాలు నేత్రపర్వం చేస్తాయి. వృద్ధ మహాబలేశ్వరం కృష్ణానది జన్మస్థలం. ఇక్కడ పురాతన దేవాలయాలున్నాయి క్రిష్ణాబాయి ఆలయం పంచగంగల సంగమమై కృష్ణా నదీ పుట్టుకకు ఆకరమైంది ఉన్నది.

**ప్రతాప్ ఘుర్ కోట :**

మహాబలేశ్వర్ నుండి 24 కి.మీ. దూరం. ఈ కోటలోనే శివాజీ మహారాజు జీవితంలో ఒక ప్రధానమైన ఘట్టం జరిగింది. మోసాన్ని మోసంతోనే జయించిన ఉదంతం అఫ్జల్‌ఖాన్ బీజపూర్ సుల్తాన్ సేనాని. కోటనిర్మాణం 1656లో జరిగింది. ఖాన్‌వారి సమాధికితోడు శివాజీ మహారాజు భక్తితో అర్చించిన మాత భవానీఆలయం దర్శనీయాలు.

మహాబలేశ్వరంలో వుండటానికి హోటళ్ళు వగయిరా లున్నాయి. ప్రభుత్వం వారు నిర్వహించే హాలిడే క్యాంపు వసతికి టూరిజమ్ డెవలప్‌మెంటు అధికారి వారితో సంప్రదించి రిజర్వేషనులు పొందవచ్చు.

**పంచగని :**

సముద్రమట్టానికి 1334 మీటర్ల ఎత్తుగావున్న ఐదు పర్వత శిఖరాల సముదా

యం. మహాబలేశ్వరం నుండి 19 కి.మీ. దూరం. మంచి పర్వత విశ్రాంతి కేంద్రం. ముఖ్యంగా శ్రీమంతు లనేకమంది విశ్రాంతిని వెదుక్కుంటూ ఇక్కడికి వస్తుంటారు. ప్రశాంతమైన చలచల్లని వాతావరణం మానసిక విశ్రాంతిని, ఆహ్లాదాన్ని కూర్చేదిగా ప్రసిద్ధి. అయితే బహుళంగా ప్రచారోద్ధతిగల మహాబలేశ్వరం నీడలో ప్రాకృతిక ప్రాధాన్యత అంతగా కనబడకపోయినా ప్రాముఖ్యంలో ఏ మాత్రం తీసిపోని దీ ప్రదేశం.

సజ్జన్‌గడ్ :

శివాజీ మహారాజుగారికి ఆధ్యాత్మిక ప్రబోధం చేసిన సద్గురు సమర్థ రామదాసు వారు నివసించిన స్థానంగా ప్రసిద్ధి. సజ్జన్‌గడ్ సముద్ర మట్టానికి దాదాపు 900 మీ. ఎత్తున ఉన్నది. పూనానుండి బెల్గామ్ గోవా వెళ్ళేదారిలోగల సతారారోడ్డు స్టేషనుకు దగ్గరలో 15 కి.మీ. దూరంలో అమరివున్నదీ ప్రదేశం. మహారాష్ట్రవీరుడు ఛత్రపతి జీవితంలో అనేక ఘట్టాలకు సన్నిహిత సంబంధం వున్న జ్ఞాపికలకు నిక్షిప్తంగా వున్న భవనం కూడా వుంది. ఈ భవనంలో ఆనాడు శివాజీ ఉపయోగించిన ఆయుధ విశేషం, ఖడ్గం, అఫ్జల్‌ఖాన్‌ను యుక్తితో చంపటానికి ఉపయోగించిన ఇనుప పులి పంజా మొదలయినవి ప్రదర్శితం. సజ్జన్‌గడ్‌కి అశ్వలాయన్‌గడ్, పార్లగడ్, నవరాస్ తరా అనే కొన్ని నామాంతరాలు గూడా వున్నాయి. చూడదగిన విశేషాలుగా జల మందిరం, రామ మందిరం, శివాజీ ప్యాలెస్, కోట, అంగలైదేవి హిందూ దేవాలయం, సమర్థ రామదాసు వారి సమాధి— ఇది రామాలయం క్రింద భూగర్భంలో నిర్మించ బడింది— గురువుల విశ్రాంతి గృహం— అందు భద్రపరచబడిన అనేక వస్తువులు వారి ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించినవి దర్శనీయం— సమర్థ రామదాసువారు సాక్షాత్తు రామభక్త హనుమాన్‌వారి అవతార విశేషంగా కొనియాడబడినవారు మహిమో పేతులు, మహాత్మ్యాపూర్ణులు.

ఉత్సవాలు :

ఫిబ్రవరిలో వచ్చే దాసనవమి, చైత్రమాసం శుక్లపక్షంలో వచ్చే శ్రీరామ నవమి, మహాశివరాత్రి, వైకుంఠ ఏకాదశి, కార్తీక ఏకాదశి పర్వదినాలలో సాంప్రదాయ ఉత్సవాలుగా జరుపబడతాయి. సమర్థ సేవామండలివారు ప్రచురించిన ఆధ్యాత్మిక గ్రంథములు వానిలో ప్రఖ్యాతి వహించిన 'దాసబోధ' సద్గురువుల సంభాషిత రత్నా లుగా ఉన్న పుస్తకరాజం బహుళ ప్రసిద్ధి గాంచింది.

వసోటా కోట :

సతారా రోడ్డు పట్టణానికి దక్షిణాన అమరి ఉన్న పురాతన కోట— అనేకమయిన యుద్ధాలు నడిచి రక్తము ఏరులై పారిన రక్తపరిప్లావితమైన చరిత్రకు సంబంధించిన శిలాక్షరాల చరిత్రకు తాణాచి. మరాఠా వీరుల శౌర్య ప్రతాపాలకు రక్తతిలకం దిద్దిన చోటుగా ప్రసిద్ధి.

దక్షిణంగా ఉన్న ముఖ్య యాత్రాకర్షణాలు :

కొల్హాపూర్ (కొల్హాపురం) :

మహానగర ప్రతిపత్తికి చేరువ అవుతున్న పట్టణం. సముద్ర మట్టానికి 500 మీటర్ల ఎత్తునగల ప్రదేశం. అరేబియా సముద్ర తీరప్రాంతంలో అమరియున్న కొల్హాపూర్ శ్రీ మహాలక్ష్మి ఆలయానికి ప్రసిద్ధి చెందింది. ఆలయంలోనే సరస్వతి, మహా కాళీ మందిరాలు గూడా ఉన్నవి. ప్రతి మంగళవారం అమ్మవారిని విశేషంగా దర్శించటానికి భక్తులు వస్తుంటారు. ఒకానొకప్పుడు మరాఠా రాజ్యానికి ప్రధాన రాజధానిగా విలసిల్లిన క్షేత్రరాజం. పురాతన భవనంలో కొల్హాపూర్ రాజులు వాడిన ఖడ్గ విశేషాలు చూడదగినవి. ఇక్కడ 1800 సంవత్సరాల్లో జరిగిన త్రవ్వకాల్లో బౌద్ధ మతం ఉచ్ఛదశలో ఉన్న వైనం తెలిపే విశేషాలెన్నో బయటపడినాయట. ఆలయం చుట్టూ అనేక పురాతన శిలా విగ్రహాలున్నట్లు అవి అశోకుని కాలానికి చెందినట్లుగా తెలియవచ్చింది. ఇక్కడ లక్ష్మి అమ్మవారికి బంగారు పాదుకలున్నాయి. భక్తులు పాదుకల నర్చించటానికి వీలుగా బయటకు తీసి మరల అలంకరించటానికి వీలుగా ఉన్నవి.

పురాతన నామం 'కరవీరపురం'గా ప్రసిద్ధి. అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటిగా గణ్యత. ఆలయ విశేషాన్ని గురించి ప్రశస్తి గురించి చెప్పక చెపుతున్న అంశాలు. కొల్హాపురం వద్ద అమరివున్న నది పంచగంగ. అనేక యితర రాజభవనాలు దక్కను సంస్థానాలకు బ్రిటిషువారి రెసిడెన్సీగా కూడా ప్రసిద్ధి.

రత్నగిరి :

అర్థం రత్నరాసులకు గని అని. ఈ ప్రదేశంలోనే భరతమాతకు అనుంగు బిడ్డలై చరిత్రలో చిరస్మరణీయమైన సుస్థిరస్థానాన్ని సంపాదించుకున్న అనర్ఘ భారత రత్నాలు లోకమాన్య బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలేలకు జన్మస్థలమై పునీతమై అక్షరాల తనపేరును సార్థకం చేసుకున్న పావని. ఇక్కడే బర్మా

రాజు 'తిబా' అనే ఆయన్ని 1866నుంచి 1916లో ఆయన మరణపర్యంతం బ్రిటిషు వారు నిర్బంధించిన చోటుగా ప్రసిద్ధి. ఆ భవనం కూడా 'తిబా' నిర్మితమే. ఇక్కడ 'సుఫియెన్' అనే రుచిగల మామిడిపండ్లు జగత్ప్రసిద్ధం.

**గణపతి పూలె :**

ఇక్కడికి దగ్గరిలో 30 కి.మీ. దూరంలో కొండప్రక్కనే గల బీచ్ విశ్రాంతి కేంద్రంగా పేర్కొనబడే చోట గణేశ్వరుని గుహాలయం ప్రసిద్ధి చెందింది.

**పన్హాలా-పావన్ ఖుడ్ :**

ఆసక్తికరమైన పర్వత విశ్రాంతి కేంద్రాలు. పన్హాలాలో పురాతనపు కోట-ప్రాచీన కాలంలోని రెండవ భోజమహారాజుకి 1192లో బలిష్ఠమైన కేంద్రంగా ప్రసిద్ధి దగ్గరిలోనే బుద్ధ గుహాలయాలు, మరికొన్ని గుహలు ఉన్నాయి. పురాతత్త్వ పరిశోధకులకు ఆసక్తిని కలిగిస్తాయి.

**అహమ్మద్ నగర్ :**

పూనా-ఔరంగాబాద్ లైనులో రసమయ చిత్ర చరిత్రగలిగిన నగరం. పూనా నుండి 82 కి.మీ. దూరంలో ఉంది. ఔరంగజేబు చక్రవర్తి తన 97వ ఏట మరణించిన చోటు. పట్టణంలో మకుటాయమానంగా తోచే కోట 1550లో కట్టబడింది. భారత స్వాతంత్ర్య నేత, ప్రథమ ప్రధాని భారతరత్న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూని స్వాతంత్రసముపార్జనా రణరంగంలో మేటి పాత్రను వహించుచున్న సమయంలో బ్రిటిషు పాలకులు కొన్నాళ్ళు నిర్బంధించిన చోటుగా చరిత్ర ప్రాముఖ్యతను పొందింది ఇటీవలి కాలంలో కూడా. కోట నిర్మాణం నైజాం నవాబులు నిర్మించారు.

# నాసిక్

అతి పురాతన పట్టణం. బొంబాయి నుండి 185 కి. మీ. దూరం. ఔరంగాబాదు, పూనా పట్టణం చక్కని మార్గాలతో కలుపుకొ పుంది. పశ్చిమ కాశిగా ప్రసిద్ధి అయిన పరమ పావన ప్రదేశం. నాసిక్ జిల్లాకు ముఖ్య కేంద్రం. అతి సుందరమైన పట్టణం. పురాతనకాలం నుండీ పరమ పవిత్రమైన స్థలంగా ప్రసిద్ధి. 'నాసిక్' అనే పేరు రామాయణ కాలంలో శ్రీ సీతా మహాసాధ్వితో పాటు తండ్రిమాట జవదాటని శ్రీరామచంద్ర ప్రభు వనవాసకాలంలో లక్ష్మణ సమేతుడై పర్ణశాలలో నివశించే సమయంలో శూర్పణఖ రావణాసురుని చెల్లెలు—శ్రీరాములవారి ఎదుట వేసిన వెకిలి వేషా

లను శిక్షగా ముక్కు చెవులు కోసిన చోటుగా చెప్పకోబడే ఈ ప్రదేశానికి 'నాసిక్' అనే పేరు సార్థకమయినట్లుగా పురాణ కథనం. ఈ పట్టణం గోదావరి తీరంలో అమరి ఉన్నది. గోదావరి ఇక్కడ చిన్న కాలువలాగా ప్రవహిస్తుంది. ఈ అనాది క్షేత్రానికి ప్రతిదినమూ యాత్రిక సందోహాలు అనేకంగా వచ్చి దర్శిస్తుంటారు. ప్రతి పన్నెండు సంవత్సరాలకొకసారి గోదావరీ పుష్కరం జరుగుతుంది. యుగాల పూర్వం సాగరమథనం తర్వాత లభించిన అమృతభాండాన్ని మోసికొనివచ్చే గరుత్మంతుని మూపున వున్న అమృతభాండంలో నుండి వొలికి పడిన నాలుగు చుక్కలు నాలుగు ప్రదేశాల్లో పడినవని-ఆ నాలుగు ప్రదేశాలు-అలహాబాదు, హరిద్వార్,నాసిక్, ఉజ్జయినీలని- ప్రతి మూడు సంవత్సరాలకు ఒక్కొక్క చోటుగా పన్నెండు సంవత్సరాలకొకసారి రొటేషను పద్ధతిలో జరిగే 'కుంభమేళా' విశేష ప్రాధాన్యత గల ప్రదేశంగా గణ్యం. 12 సంవత్సరాలు అంటే దేవతలకు ఒక రోజు అని లెఖ్ఖ. దేవతలకు ఒక రోజుగా భావించబడే ఈ రోజు పరమ పవిత్రంగా ఎంచబడుతుంది. లక్షలాది యాత్రికులు కూడి పవిత్రస్నానాలాచరించే చోట్లుగా ప్రసిద్ధి ఈ నాల్గు క్షేత్రాలు కూడా.

ముఖ్యంగా చూడదగినవి :

పురాణ ప్రసిద్ధి గల ప్రదేశాలు. గోదావరి పుష్కరం జరిగే పవిత్ర ప్రదేశం గనుక ఇక్కడ శ్రాద్ధ విధులు - తర్పణాలు ముఖ్యంగా సాంప్రదాయబద్ధంగా నిర్వహిస్తుంటారు యాత్రికులు. నది అవతలి ఒడ్డున పంచవటి, మరికొంత దూరంలోగల తపోవనం, సీతాగుహ, నీలమేఘశ్యాముడుగా శ్రీరామచంద్రుని ఆలయం, కపాలేశ్వర స్వామి ఆలయం, రామకుండం-యాత్రికులు పవిత్ర స్థలంగా నెంచి స్నానమాచరించే చోటు, పాండవ గుహలు, చంభార్ గుహలు, అతి దగ్గరలోనే వున్న గాన్గాపూర్ జల పాతం వగైరాలు.

వీటిలో సీతా గుహ లోపలికి కొంచం సాహసించి వెళ్లాల్సిన చోటు. భయం లేదులెండి. చాలామంది వెళ్తుంటారు. లోపలికి వెళితే శూర్పణఖ విగ్రహం కూడా చూడవచ్చు.

రామాలయం చాల విశాలంగా ఉండి అనేక ఆర్చిలతో నయన మనోహరంగా ఉంటుంది. కొండపై పడమటి దిశన వున్నది- కపాలేశ్వరాలయం- చాలా పాతది.

**పంచవటి :**

అక్షరాల ఐదు మర్రిచెట్లు అమరిన ప్రదేశం. పర్ణశాల గూడ ఇక్కడికి దగ్గరిలో ఉన్న చోటుని చూపిస్తారు. అయితే గోదావరి తీరంలో భద్రాచలం దగ్గర ఒక పర్ణశాల ఉన్నట్లుగా చెబుతారు – ఏది సరియైనది? అని ఆలోచించనక్కర్లేదు, రెండింటినీ సేవించవచ్చు. రెండూ గోదావరి తీరాలే. పంచవటి దగ్గరనే రావణుడు సీతమ్మవారిని గద్దతో సహా తీసికుని వెళ్ళిన చోటుగా అభివర్ణిస్తారు.

**జటాయువు మోక్ష స్థానం :**

సుమారు 18 కిలోమీటర్ల దూరంలో ఉంది. ముఖ్యంగా ఇక్కడ పిండ ప్రదానాలు వగయిరా జరిపించే ఆచారం వుంది. దగ్గరిలోనే అగస్త్యకుండు, శాయి బేదాలతో సుందర నారాయణ మొదలగు దేవాలయాలున్నాయి.

## త్ర్యంబకేం

నాసిక్ నుండి 30 కిలోమీటర్ల దూరంలో ఉంది. పావన గోదావరీ పుట్టుక స్థానం, అతి చిన్నదిగా, సౌమ్యంగా ఇక్కడ పుట్టి – మహా ప్రవాహమై మూడు రాష్ట్రాలను సుజలపూర్ణం చేస్తూ చివరకు ఆంధ్రప్రదేశ్‌లో తూర్పు గోదావరి జిల్లాలో బంగాళాఖాతంలో సాగరసంగమం చేసే అతి పెద్ద నదుల్లో ఒకటైనది. ఇక్కడ వున్న శివాలయాన్ని త్ర్యంబకేశ్వరునిఆలయంగా ప్రసిద్ధి చెందిన దేవళాన్ని మహారాష్ట్ర రాజు బాలాజి బాజీరావు అనే ఆయన బ్రహ్మగిరిని అనుకుని ఉన్న ప్రదేశంలో నిర్మించారు, త్ర్యంబకేశ్వరాలయం ద్వాదశ జ్యోతిర్లింగాలలో మూడవది. గోదావరి నది ఇక్కడి కొండలమీది నుంచి బొట్లు బొట్లుగా జారి ఒక సరస్సులాగ ఏర్పడింది ఆ సరస్సు సర్వ పాపహారిణిగా ఎంచబడి పవిత్ర స్నానాలుగా చేస్తారు యాత్రికులు. శ్రమించి 500 మెట్లుపైగా ఎక్కి వెళ్ళితే బ్రహ్మగిరి శిఖరం చేరగలం.

వుండటానికి వసతిగా ఎన్నో సత్రాలున్నాయి. అన్ని వస్తువులు దొరుకుతాయి. హోటళ్ళు కూడా వున్నాయి.

**ఇక్కడ దగ్గిరిలో చూడదగినవి :**

గంగాద్వార్–కొండమీద గోదావరి అమ్మవారి ఆలయం, గురుగోరఖనాధుని గుహ, మచ్ఛింద్రనాధ్ చరణ పాదుకలు, 108 మహాదేవుని లింగముల స్థానం–గౌత

ముడు, అహల్యాదేవి పూజాలందుకున్న పుణ్యస్థలంగా ప్రతీతి చెందినది-నీలగిరిమీది అంబికాలయం, విశాలమైన త్ర్యంబికేశ్వరాలయం-గర్భాలయంలోకి స్త్రీలను రానివ్వరు-త్రికాలములు అర్చనలు జరుగుతుంటాయి-పండాలు విశేషంగా ఉంటారు.

# షిర్డి

'సబ్‌కా మాలిక్ ఏక్' అని 'సర్వమానవులకు తండ్రిఒక్కడే'. అతడే అందరినీ కాచి రక్షించే భగవంతుడు అనే శ్రీ సాయిబాబా గొప్ప అవతార పురుషుడుగా గణుతికెక్కినవారు. అనేక మహిమాన్వితములైన విశేషములు గల మహత్తర వ్యక్తిగా, ఆర్తిజన బాంధవుడుగా బహుళ ప్రచారం పొంది భారతదేశమందంతటా విశేష ప్రాచుర్యాన్ని పొందిన మహానుభావులు 'షిర్డి సాయిబాబా' సిద్ధి పొందిన చోటు. బాబా వారి సమాధి విశాలమైన చలువరాతి కట్టడం. సమాధిమీద జీవకళ వుట్టిపడే బాబాగారి విగ్రహం చలువరాతితో మలచబడింది. మహిమాన్వితమై భక్తులకు దర్శనమిస్తుంది. బాబావారి ప్రసాదంగా పవిత్రభస్మాన్ని యిస్తారు. భక్తులకు అపారమైన నమ్మకం, విశ్వాసం-బాబావారు దైవస్వరూపులై తమ కోర్కెల సాఫల్యాన్ని అనుగ్రహించ గలరనే విశ్వాసం అందరి మనసుల్లో ప్రతిబింబిస్తుంది. బాబావారి అనుచర వర్గం అన్ని మతాల వారిలోనూ ఉన్నారు. షిర్డి వెళ్ళినవారు మానసిక ప్రశాంతతను వరంగా పొంది దివ్యభావనల్తో తిరిగివస్తారు

ఇక్కడికి దగ్గరిలోనే శకోరి- శ్రీ సాయిబాబా శిష్యులుగా ప్రసిద్ధి పొందిన వీరు వచ్చి నిలిచిపోయిన చోటు. ప్రతి శనివారం బ్రాహ్మణపూజ, తైలాభిషేకం జరిగే శనిదేవుని మందిరం దర్శనీయాలు. ఆసక్తిగల వారు దర్శించనగును.

**అష్ట వినాయకులు :**

పాలి, మధ్, లెన్యాద్రి, ఒఝర్, రంజన్‌గామ్, థెయ్యూర్, మోర్‌గావ్, సిద్ధటేక్. వీనికితోడు ప్రసిద్ధి చెందిన జ్యోతిర్లింగములుగా గణుతికెక్కిన శివాలయాలు మహారాష్ట్రులకు ఆరాధనీయ స్థలాలు.

# ఔరంగాబాదు

ప్రస్తుత జనాభా సుమారు 2 లక్షలలో వుంటుంది. కేవలం ఎల్లోరా, అజంతా గుహలకు వెళ్ళేటప్పుడు తగిలే ముఖ్య మజలీగా అనుకోవటం కద్దు. కాని ఔరంగా

బాదుకు వీటిన్నిటినీ మించిన తగదైన ప్రత్యేక చరిత్ర వున్నదన్నది నిర్వివాదమయిన సంగతి. పట్టణం పేరు ఔరంగజేబు మరణానంతరం ఆయన పేరుని స్మరణీయంగా పెట్టబడింది. పట్టణం పాత కొత్త విభాగాలుగా వుంటుంది. విమానాశ్రయం వుంది. స్టేషను రోడ్డు మూలలోవున్న గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసును ఒక సారి దర్శించితే అనేక విశేషాలు తెలుసుకో గలుగుతారు.

## బీబీకా మక్బారా :

1679లో ఔరంగజేబు కుమారుడు అజింషా తన తల్లి రబియా-ఉద్-దరాని జ్ఞాపకార్థం తాజ్‌మహల్‌ని పోలిన కట్టడం మామూలు రాతితో నిర్మింపజేసి తెల్లరంగు వేయించాడు. ఆనాడు దానికయిన ఖర్చు అణాపైసలతో సహా రు. 6,65,283-7-0 (నేటి నయాపైసలు లెక్కలో అయితే 7 అణాలు=నలభైరెండు పైసలు)గా లెక్కించి మరీ వదిలారు. దక్కను పీఠభూమి మీద మొగలాయి నిర్మాణాలకు ప్రతీకగా నిలుస్తుంది ఈ కట్టడం.

## పాంచక్కి :

ఒక నీటిమర. ఔరంగజేబు గురువుగారైన సూఫీసాధువు షాముసాఫిర్‌సాహెబ్ దర్గాను ఆనుకుని ఉన్నది. దర్గా నిర్మాణం దాదాపు 1687 తరువాత జరిగింది. ఎండా కాలం ఎండిపోయినా చల్లగా వుంటుంది కూడ.

## ఔరంగాబాదు గుహలు :

బీబీకామక్బారా నుండి 2 కి.మీ. దూరంలో తూర్పువైపున కొన్ని, పడమర వైపున కొన్ని ఔరంగాబాదు గుహలున్నాయి. అన్నీ బుద్ధ గుహలే; క్రీ.శ. 7 లేక 8 శతాబ్దాలలో నిర్మించబడ్డాయి. అజంతా, ఎల్లోరా గుహలంత ప్రాచుర్యం లేకపోయినా ప్రాచీన విశేషాల్లో మాత్రం తీసిపోవు. తూర్పు, పడమరల గుహల సముదాయాల మధ్య ఒక కిలోమీటరు దూరం వుండవచ్చు. తూర్పున మరింత దూరంలో మరికొన్ని కూడా ఉన్నాయి. అవి చిన్నవి. ఆసక్తి ఉన్నవారు చూడవచ్చు.

## పడమటి గుహలు :

4 వ గుహతప్ప మిగతా అన్నీ కర్లా గుహలు మాదిరిగానే విహారములను పోలి వున్నాయి. నాలుగో నంబరు గుహ ప్రాంగణంలో ముందు ఒక స్థూపం వుంది, స్థూపం సగం విడిపోయి శిథిలావస్థలో వుంది. 8 వ గుహ నలుచదరంగా వుంది 12

స్తంభాల మోపుమీద ఉంది. జాతక కథల్లోని దృశ్యాలు కమనీయంగా మలచిన శిల్పాలతో ఆశ్చర్యం గొలిపేటట్లుగా వుంది. దర్శనీయం.

తూర్పు గుహాలు :

ఈ గుహల్లో స్త్రీలను ప్రత్యేక తరహాగా మలచారు. వస్త్రధారణ కొద్దిగా వుంచి మిగతా శరీరభాగాన్ని నగల విశేషాల్తో కప్పివేసినట్లుగా ఉన్నాయి శిల్ప విశేషాలు. ఎడమవైపున బోధిసత్త్వుని విగ్రహం చాలా పెద్దది వుంది. బుద్ధుని ఎదుట అంజలి ఘటించి ప్రార్థనామగ్నుడై అష్టకష్టాలనుంచి రక్షించమని వేడుకుంటున్నట్లుగా చిత్రీకరించబడింది. ఔరంగాబాదు నుండి లోక ప్రసిద్ధి చెందిన అజంతా ఎల్లోరా గుహలకు అనేక ప్రయాణ సౌకర్యాలున్నాయి. వసతికి హోటళ్ళు అనేకం వున్నాయి.

దౌలతాబాదు :

పూర్వం 'దేవగిరి' అని పిలవబడే ఈ పర్వత దుర్గం ఔరంగాబాదు నుండి 13 కి.మీ. దూరంలో వుంది. 1187లో యాదవ వంశీయుడైన ఒక రాజుగారు కట్టించారు. కోటలోపల అనేక భూగర్భ సొరంగపు త్రోవలున్నాయి. కోట దర్వాజా ద్వారాలు బలిష్టంగా నిర్మించబడ్డాయి. తలుపులకు ఈటె మొనలు అమర్చబడి ఏనుగులు తాకకుండా పటిష్టపరచబడి ఉన్నాయి. కోటచుట్టూ పటిష్ఠమైన గోడ, కందకం 100 అడుగుల లోతుగలది అమరి ఉన్నాయి. ఎంతో శత్రు దుర్భేధ్యంగా నిర్మించబడింది. 1294లో అల్లావుద్దీన్ ఖిల్జీ ముట్టడించి ఆక్రమించాడు. 'దేవగిరి' అంటే దేవతల నివాస స్థలం అని అర్థం వచ్చే ఈ కోటకు మహమ్మద్-బిన్-తుగ్లక్ మహాశయులు తన రాజధానిని ఢిల్లీ నుండి ఈ కోటకు మార్పిడిచేసిన సందర్భంలో ప్రజలను, సేనావాహినిని నడిపించి చేర్చారు. 'దేవగిరి'ని 'దౌలతాబాదు'గా పేరు మార్చించాడు. 'దౌలతాబాదు' అంటే సిరులకు నిలయమైన 'అదృష్ట శ్రీపర్వతం' అని అర్థం. తరువాత మరల కొన్నాళ్ళకి ఇక్కడి నుండి ఢిల్లీకి మార్చుకున్నారు తన రాజధానిని. మరలా అదే విధంగా జనాన్ని, సేనలను నడిపించారు. మార్గ మధ్యంలో రెండు పాళ్లు ఎంతో మంది ప్రజలు చనిపోయారు అన్న సంగతి సుల్తాను విజ్ఞతను సవాలు చేసిన ఉదంతం-చరిత్రలో ఈ నాటికీ చెరగకుండా వున్న సత్యం.

కోటలోని సొరంగమార్గాలు, 65 మీటర్ల ఎత్తున అమరియున్న చాంద్‌మినార్ యాత్రికులను ఆసక్తిగా ఆకర్షించేవి.

పైథాన్ :

'ప్రతిష్ఠాన్' అని పిలవబడే ఈ ప్రదేశం ఈనాడు జిగిబిగి అల్లికలుగల వెండి, బంగారు జరీ వస్త్రాలకు ప్రతిష్ఠాత్మకంగా నిలిచింది. ఈ వస్త్రాలు లోక ప్రసిద్ధి. ఔరంగాబాదుకు 56 కి.మీ. దూరంలో ఉంది.

ఎల్లోరా గుహలు :

ఔరంగాబాదుకు 30 కి.మీ. దూరంలో అమరియున్నవి. అజంతా గుహలు వర్ణ చిత్రాలకు ప్రసిద్ధి అయితే ఎల్లోరా గుహలు శిల్పకళా చమత్కృతిలో మిన్న. అజంతాగుహలు బౌద్ధులవి. ఎల్లోరా గుహలు హిందూ, జైన దేవలయాల సముదాయం. కొన్ని బౌద్ధ గుహలు కలిసి ఉన్నాగూడా—ఎల్లోరా గుహల నిర్మాణం రోజులకి బౌద్ధ మతం క్షీణ దశకు చేరుకున్న దాఖలాలు స్పష్టంగా కనబడుతున్నాయి. పురాతన కాలపు పని తనానికి ప్రతీకలుగా రంగుల బొమ్మలు గల అజంతా గుహలను మొదట దర్శించి తరువాత ఎల్లోరా గుహలు వైపు వెళదాం.

అజంతా గుహలు :

ఔరంగాబాదు నుండి జలగాం వెళ్ళే త్రోవలో 106 కి.మీ. దూరం ఉన్నది. జలగాం నుండి 59 కి.మీ. దూరం. ఔరంగాబాదు రైల్వేస్టేషను నుండి ప్రత్యేక విహారయాత్రా సౌకర్యాలున్నాయి. విశిష్ట సమాచారం కోసం ఇండియా టూరిజం డెవలప్‌మెంటు కార్పొరేషను ఆఫీసులో విచారించవచ్చు. అజంతాలో వసతియైన రెస్టు హౌసులున్నాయి వుండటానికి.

అజంతా గుహలు ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఫ్రెస్కో పెయింటింగులు అని ప్రతీతి. గుహలన్నీ కూడా శిల్పము, చిత్రకళ రెండింటిని మేళవించిన మేలు కలయిక. ప్రకృతిసౌందర్యం పరమ రమణీయం. గుహలు దాదాపు 600 మీటర్లుకొండను తొలిచి ప్రత్యేకమయిన వీథిలాగా కన్పడుతుంది. నాగార్జునకొండ, అమరావతిలలో పనిచేసిన ఆంధ్ర శిల్పులే ఇక్కడి శిల్పం, చిత్రణ పనులను నిర్వహించినట్లుగా చరిత్రకారుల విశ్వాసం. గుహలు మొత్తం 29. అన్నీ బౌద్ధమత సంబంధమయినవే. బౌద్ధమతం క్షీణించి, ఎల్లోరా గుహలు ప్రాచుర్యం వెలుగులోకి వచ్చిన పిదప అజంతా గుహలు చాలాకాలం మరుగున ఉన్నవనే చెప్పవచ్చు. నాటకీయంగా 1819లో వేటకు వచ్చిన తెల్లదొరలు అలసిసొలసి దిక్కుగానక పడిఉన్న ప్రదేశం నిక్షిప్త కళాఖండాల భాండాగారంగా కనుగొనబడింది. ఈ చిత్రణలు క్రీ.పూ. 200 సంవత్సరాల నుండి క్రీ.

శ. 650 వరకూ సాగిన అద్భుత చిత్రీకరణలుగా కనుగొనబడ్డాయి. ఆనాడు ఏమి వుపయోగించారు? రంగులు చెక్కు చెదరకుండా ఉండటానికి ఏ రస ప్రక్రియను అమలు పరిచి రంగులు కలిపారు అన్నది ఇప్పటికీ తెలియని రహస్యమే! ఫ్రెస్కో అంటే సామాన్యంగా ఒక రాయినిగాని, గోడను గాని తడి పదార్థంతో చదునుచేసి రంగు ఆ తడిమీదనేవేసి చిత్రీకరించినది, తడిపొర ఆరిపోయినప్పుడు రంగును కూడా తనలో ఇముడ్చుకునే విధంగా చేయబడినవని అర్థం. కాని ఇక్కడ అజంతా గుహల్లోని వర్ణచిత్రాలు తడి పూర్తిగా ఆరిన అద్దంలాంటి నున్నని ఉపరితలంలో చిత్ర రచన గావించినట్లు పరిశోధనల్లో వెలువడింది. ఆనాటి నుండీ ఈనాటి వరకూ చెక్కు చెదరని కాంతులు వెదజల్లుతూ మాయని, తరగని కీర్తి ప్రతిష్ఠలకు ఆకారమై ప్రపంచ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్న వర్ణచిత్రాల వైచిత్రి విదేశీయుల సైతం ఆశ్చర్యాంబుధిలో ముంచెత్తిస్తూన్న పురాతన కళాభిజ్ఞతకు తార్కాణంగా నిలిచి ఉన్నవీ గుహలు. గోడలకు, కప్పులకు, స్థంభాలకు వేసిన రంగులు ఇంకా యిప్పటికీ చెక్కు చెదరలేదు. చూడదగినవిగా 1, 2, 9, 10, 16, 18 గుహలు చాలా ముఖ్యమయినవి.

## కమనీయమైన గుహాలయ దృశ్యాలు కొన్ని :

మొదటి గుహలో శ్రీలంకలోని సిగిరియాలోని పెయింటింగులలోని చిత్రాలు కానవస్తాయి. జాతకకథల చిత్రాలు, నీలాసుందరి, బోధిసత్వుని పద్మపాణిగాను, వజ్రపాణిగాను చిత్రీకరించిన చిత్రాలు కమనీయం. ఇటీవలిదిగా కనపడుతుంది.

2వ గుహలోని కుడ్యచిత్రాలు దర్శనీయం. చాలావరకు చెరిగిపోయినట్లున్నవి. షణ్ముఖుడైన విఘ్నేశ్వరుడు బుద్ధుని తల్లికివచ్చిన కలలోని దృశ్యం కమనీయంగా చిత్రించబడింది. ఇంకా మరెన్నో జాతక కథల చిత్రాలున్నాయి.

4వ గుహలో 28 స్థంభాల మోపుతో అసంపూర్తిగా కనబడుతుంది. అవలోకితేశ్వరుని అష్టకష్ట పరంపర నుంచి రక్షించే దృశ్యం. కొన్ని శిల్పాలు కమనీయమైనవి కూడా మిళితమై ఉన్నాయి. 6వగుహ రెండతస్తులది. ఈగుహ అన్నింటిలోను ఇది ఒక్కటే రెండతస్తులది.

## 9 గుహ :

విహారంగా కాకుండా ఇది చైత్యంగా మలచబడింది. గుహల్లో పురాతనమైనవిగా 9, 10 గుహలు గుర్తించబడ్డాయి. హీనయాన కాలంలోను, మహాయాన కాలంలోను కొన్ని దృశ్యాలు చేర్చబడ్డాయి. గుహబయట గుర్రపుడెక్క ఆకారంలో వెలుతురు

కోసం కిటికీ అమర్చబడి ఉన్నది. 10వ గుహదగ్గరనే బ్రిటిష సిపాయిలు దారితెన్ను కానక పడిపోయి గుహల ఉనికిని కనుక్కొన్నచోటు. ఇది గూడా ఒక పెద్ద చైత్యము.

**16వ గుహ :**

విహారంగా నిర్మించబడింది. ఈ గుహాలయ సముదాయం మొత్తానికి ద్వారం వంటిది. అద్దకం వేస్తున్న రాచకుమారి, బుద్ధుని భార్య మిగతా కుటుంబ సభ్యులు కమనీయంగా చిత్రించబడినాయి. హృదయాంశమంగా దర్శనీయమై ఉన్నాయి.

17, 18వ గుహల్లో ఎన్నో రకాలయిన సామాన్య జనజీవితానికి సంబంధించిన చిత్రాలు గూడా ఉన్నాయి. స్థంబాలను కొంతమంది మరుగుజ్జులు మోస్తున్నట్లుగా శిల్పీకరించ బడింది. తథాగతుడు జ్ఞానోదయమైన తరువాత దివ్యమైన తేజస్సుతో తిరిగివచ్చే దృశ్యం రమణీయం.

**19వ గుహ :**

ఒక చైత్యము. ఎన్నో విశేషాలు వివరంగా చిత్రించబడ్డాయి. ద్వారం రెండు వైపులా రెండు బుద్ధ విగ్రహాలున్నాయి. గుర్రపుడెక్క ఆకారంలో కిటికీ అమర్చ బడింది. వెలుతురు దారాళంగా గుహలోకి కాంతిని విరజిమ్ముతోంది. అన్ని చిత్రాలతో పాటు నాగరాజు దంపతులు, ఏడుతలల నాగుపడగ శిరస్సుమీద ధరించినట్లుగా చిత్రీ కరించబడి ఉంది. నాగరాజు భార్య ఒకేపడగ గలిగిన నాగాభరణం శిరోభూషణంగా ధరించి ఉన్నది. దంపతులిద్దరూ ప్రక్క ప్రక్కనే కూర్చున్న వైనం చూడముచ్చట.

26వ నంబరు గుహలోని పెద్ద బుద్ధవిగ్రహం జీవకళ ఉట్టిపడుతూ నేత్రా నందం చేస్తుంది. ఈ రంగు రంగుల చిత్రాలు యుగాంతాల నుండి ఇంకా మనకు సజీవంగా దర్శనీయంగా ఉన్నాయంటే ఎంత ఆశ్చర్యకరమైన విషయం!

**ఎల్లోరా గుహలు :**

హైందవ గుహాలయాలు, జైన, బౌద్ధ గుహాలయాలు మొత్తం కలివిడిగా ఉన్నాయి. మొత్తం 34 గుహలున్నాయి. వాసిలో 12 బౌద్ధమతానికి సంబంధించినవి 17 హిందూ ఆలయాలు, 5 జైనాలయాలున్నాయి. అన్నీ ఉత్తరం నుండి దక్షిణానికి 2 కి.మీ. పొడవునా వలయాకారంలో కొండను తొలిచి నిర్మించబడ్డాయి. బౌద్ధ గుహలు క్రీ.శ. 600 నుండి 800 వరకూ నిర్మించబడినవయితే హైందవ గుహాలయాలు క్రీ.శ. 900 సం. ప్రాంతంలో నిర్మించబడినవిగాను, జైనగుహలు క్రీ.శ. 1000 సం. ప్రాంతంలో నిర్మించబడినవిగానూ కనబడుతున్నాయి. దీన్నిబట్టి విచారించిచూస్తే

బౌద్ధమతం క్షీణదశకు చేరుకున్న తరువాత హిందూ, జైనగుహలు క్రమశః అనుస రించి నిర్మించబడినవిగా తెలుస్తూంది. బౌద్ధగుహలన్నీ దాదాపు విహారాలుగా నిర్మించ బడ్డాయి. హిందూ దేవాలయాలన్నీ శిల్పప్రధానాలు. బౌద్ధగుహలు చాలవరకు వర్ణ చిత్రాలతో పరిమితమైనవి. 2వ గుహలో బుద్ధుని విగ్రహం మలచినతీరు ప్రశంస నీయం. 5 గుహ చాలపెద్ద బౌద్ధవిహారం. అందులో అమర్చబడిన రాతి బల్లలను చూస్తే సమావేశాల మందిరమా- భోజనశాలయా అని అనిపిస్తుంటుంది. 6వగుహలో ఆసీనముద్రలో మలచిన బుద్ధవిగ్రహం చాలా పెద్దది. దగ్గరిలో నిలుచున్న భంగిమలో ఉన్న స్త్రీ దేవతామూర్తి హిందువుల సరస్వతీదేవియా అని మనస్సులో సందేహం రాకమానదు. అయితే బౌద్ధంలో ఆమెకి సరిజోడుగా ఎన్నబడే 'మహామాయూరి'అని చెప్పుకోవచ్చు.

పదవ గుహ మాత్రం విశ్వకర్మ గుహగా చెప్పబడేది చైత్యం. కొన్ని మెట్లు ఎక్కి ఆలయ ప్రధాన మండపంలోకి వెళ్ళవచ్చు. గుర్రపునాడా ఆకారంలో అమర్చ బడిన కిటికీగుండా అక్కడ గర్భగుడిలో వున్న బుద్ధవిగ్రహం, దాని ముందున్న ఎత్తయిన స్తూపంమీద సూర్యరశ్మి ద్వారా వెలుగు కిరణాలు పడేవిధంగా అమర్చ బడి వుంది.

11వ గుహ రెంతతస్తులు, 12వ గుహ మూడంతస్తులుగా నిర్మించబడి ఉన్నాయి. 12వ గుహలో గోడలమీద కుడ్యచిత్రాలు మలచబడి ఉన్నాయి.

**హిందూ ఆలయాలు :**

సైజులోను, డిజైనులోను చాలా పెద్దవి. బౌద్ధ, జైన గుహ అన్నిటికన్నా విభిన్నంగా శిల్పకళను పొదివికొని ఉన్నవి. బుద్ధగుహలు నిరామయమైన ప్రశాంతతకు ప్రతీకలైతే హిందూ గుహలు విపరీతమైన శక్తియుక్తుల కాలవాలంగా నిరూపించ బడి నవి. ముఖ్యంగా 16వ గుహాలయమైన కైలాసగుహ పరమాద్భుత రమణీయకతను సంతరించుకుని ఉన్నది. హైందవ గుహాలయాలన్నీ కూడా కొండపై నుండి లోపలికి తొలుచుకుంటూపోయి నిర్మించబడినవి. సరియైన ప్లాను పకడ్బందీగా లేకపోతే ఒక చిన్న పొరపాటు జరిగినా సరిదిద్దుకోటానికి వీలులేనటువంటి విధానం. ఏథెన్సులోని ప్రపంచ ప్రసిద్ధిచెందిన పార్థినన్ గుహాలయం కంటే వాసిలో $1\frac{1}{2}$ రెట్లు ఎక్కువ. పెద్దహాలు 250×150 అడుగుల వైశాల్యంతోను 100 అడుగుల ఎత్తుగల గోపురం తోను అన్నింటికీ తలమానికమై కన్పట్టుచున్నది. ఆనాటి శిల్పుల నైపుణ్యం, నిర్మాణ దక్షతలకు, శక్తికి చక్కని తార్కాణం. ఎల్లోరా గుహల్లోకెల్లా ముఖ్య ఆకర్షణ-.

హిమాలయాల్లోని శివునిధామంగా వర్ణించబడే కైలాసశిఖరం ఇందులో ప్రతిష్ఠింపబడింది. విశాలమైన ఆవరణల మధ్యలో ప్రధానాలయం నిర్మించబడి బాహ్యంగా ఉన్న వాటిలో రాతివంతెనల్తో కలుపబడి ఉండటం గొప్ప విశేషం. ఇందులో కమనీయంగా చెక్కబడిన శిల్పాల్లో ముఖ్యమైంది రావణ గర్వభంగం దృశ్యం. గర్వించి రావణుడు కైలాసాన్ని ఎత్తుకుని పోవటానికి ప్రయత్నించి నప్పుడు మహాదేవుడు తన బొటనవేలితో కైలాసగిరిని నొక్కిపెట్టి అసురుని ప్రయత్నం నీరు గార్చటం కథా విశేషం. శివకేశవులకు అభేదత్వాన్ని కల్పిస్తూ మరోవంక విష్ణుమూర్తి దశావతారాల్లో హిరణ్యకశిపుని వధించిన ఉదంతం కూడా శిల్పకథగా మలచబడింది. ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ ఘట్టాలు, పాచికలాడే పరమ రసవత్తర ఘట్టం, గంగాదేవి తన మొసలి వాహనంమీద అధివసించి ఉండటం ఇలా అనేక శిల్పాలు, రమణీయంగా చిత్రకథలుగా మలచబడి నయనానందకరంగా చూడగలం. కైలాస గుహ నిర్మాణ సమయంలో కొండను తొలిచి బయటవేసిన రాళ్ళు మొత్తం 2 లక్షల టన్నులుంటుందని అంచనా.

జైనగుహలు ఇక ఆఖరి అంశం. ఎల్లోరాగుహల్లో 5 జైనాలయా లున్నాయి. సైజులో అంత పెద్దవి గాకపోయినా శిల్పకళ మాత్రం విశిష్టమైనదే. దర్శనీయం. ఇంకా ఇతర గుహలు అన్నీకూడా కైలాస గుహను అనుకరించినవే। సమగ్రంగా చూడదగిన విశేషాలే।

ఘుశ్మేశ్వరం :

ఎల్లోరాకు దగ్గరిలోనే వెరుల్ గ్రామంలో 18వ శతాబ్దపు శివాలయం ఒకటున్నది. ఇది ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటిగా ప్రసిద్ధి. దీన్నే ఘుశ్మేశ్వరాలయం, ధృష్ణేశ్వరాలయం, ఘశ్వేశ్వర్‌లుగా పిలుస్తుంటారు. కాని మరో సంగతి- ఎల్లోరాలో ఉన్న కైలాసగుహాయే ఘుశ్మేశ్వరంగా కొందరు చెపుతుంటారు

## నాగపూర్

ఒకానొకప్పుడు మధ్యప్రదేశ్‌కి రాజధాని. భౌగోళికంగా కరెక్టుగా ఇండియాలో మధ్యగా అమరియున్న పట్టణం. బొంబాయి-కలకత్తా మార్గంలోను, మద్రాసు-ఢిల్లీ మార్గంలోను కలుస్తుంది. నాగపూర్ కమలాఫలాలు ప్రసిద్ధి. చాలా రుచికరమైనవి, శ్రేష్ఠమైనవిగా పేరుపొందాయి. నగరం అందాన్ని ఇనుమడిస్తూ దాదాపు అరడజను సరోవరాలున్నాయి. నాగా నదీ తీరంలో 10 లక్షల జనాభాతో ప్రతిదినం సందడిగా

ఉండే నాగపూర్ పట్టణం మధ్యలో సెక్రటేరియట్ భవనాలు ప్రత్యేక అందం. రైల్వేస్టేషనుకి తూర్పున చిన్న పర్వతంమీద సీతాబుల్డీన్‌కోట ఉంది. పురాతన కాలంలో గోండురాజులకు ప్రధాన స్థావరం. 18వ శతాబ్దం వరకు వీరి అధీనంలోనే ఉండి కాలక్రమేణా వచ్చిన మార్పుల తరువాత క్రమంగా బ్రిటిషువారి చేతుల్లోకి పోవటం జరిగింది. ఇప్పటికీ ఇంకా కొంతమంది గోండు రాజవంశీయులు సజీవంగా మారుమూలన ఉన్నారు.

రామ్‌టేక్ :

నాగపూరు నుండి 40 కి.మీ. దూరం. 500 అడుగుల ఎత్తునగల పర్వతం మీద దాదాపు 600 సంవత్సరాల క్రితం దేవాలయాల సమూహం పర్వతం చుట్టూ అమరియున్నవి. మహాకవి కాళిదాసు 'మేఘ సందేశం' సంస్కృత మహాకావ్య రచన యిక్కడ ఉండి చేశాడని కొంతమంది అభిప్రాయం. ఇది కొంత వివాదాస్పదంగా ఉంది. ఇతమిద్ధము తేలలేదు. అటూయిటూ పటిష్టమైన వాదనలున్నాయి. బ్రిటిషు కాలంలో తొలి కంటోన్మెంటుగా కూడా ఉంది. రఘుకుల తిలకుడు శ్రీరామచంద్ర ప్రభువు ఇక్కడ కొన్నాళ్ళు నివసించినట్లు చెపుతారు. ఆయన ఆకృతి మేఘావృతమై యున్న రోజుల్లో మెరుపుతో సాక్షాత్కారం ఉందని గాఢనమ్మకం.

సేవాగ్రామ్ :

సేవకు అంకితమైన చిరు గ్రామం. నాగపూరు నుండి 151 కి.మీ. దూరం ఉంది. జాతిపిత గాంధీ మహాత్ముని నిరాడంబరతను ప్రతిబింబిస్తుంది. భారతదేశ స్వాతంత్ర్య చరిత్రలో అనేక ముఖ్యకీలక నిర్ణయాలు ఇక్కడే తీసికోబడ్డాయి. గాంధీ మహాత్ముని జీవితంలోని అంశాలను గుర్తు చేసే అనేక జ్ఞాపికలుగల ఈ ప్రదేశం నేడొక చక్కని జాతీయ అధ్యయన కేంద్రం. మహాత్ముని కుటీరం, నివాసం ఒక మ్యూజియం. ఆదినివాస్, ఆశ్రమనివాస్, బాకుటీర్ (కస్తూరిబాయి కుటీరం), బాపు కుటీర్, గాంధీ స్థంభం, మహదేవ్ కుటీర్, ప్రార్ధన మందిరం, శాంతి భవన్ ఇవన్నీ జాతిపితను మనకు నిరంతరం స్మరణకు తెచ్చే జ్ఞాపికలు. ఫొటో ఎగ్జిబిషన్ కూడా వుంది. సేవాగ్రాం దగ్గరిలో 3 కి.మీ. దూరంలోనే అసలైన గాంధేయవాది, భూదాన యజ్ఞ సమారోహణ కర్త అయిన ఆచార్య వినోబాభావే ఆశ్రమం కూడా ఉంది. దర్శనీయం.

ఇంకా మహారాష్ట్రంలో చూడదగినవి ఆసక్తికరమైనవి ఎన్నో వున్నాయి. వాటిలో ముఖ్యంగా—

# పండరీపురం

దక్షిణ మహారాష్ట్రంలో పూనా-షోలాపూర్ లైనులో ఉన్న దీ పాండురంగ క్షేత్రం. యావద్భారతంలోనూ నామ సంకీర్తనకు ప్రసిద్ధమైన క్షేత్రరాజం. నామ సంకీర్తనాసక్తిపరులు చేయు పండరి భజనలు జగద్విఖ్యాతము. ఇక్కడి స్వామిని పాండు రంగస్వామియని, విఠోబాయని భక్తిమీర పిలుస్తుంటారు. భక్త సులభుండైన పాండు రంగస్వామి అనేకమంది భక్తులను ఉద్ధరించి మోక్షమొసగిన మహాప్రభువు. స్వామి భక్తుల్లో చరితార్థులైనవారు ఎంతోమంది. వారిలో భక్తాగ్రగణ్యులుగా వారి చరిత్రలు పునీతం చేసుకున్న వారిలో పుండరీకుడు, నామదేవుడు, జ్ఞానదేవు, తుకారాం, సక్కూ బాయి, జనాబాయి వంటి వారి చరిత్రలే స్వామి మహాత్మ్య విశేషాన్ని చెప్పక చెప్పే మహత్వపూర్ణ గాథలు. తన్మయత ఈ నామంలోనే వుంది. చంద్రభాగా నదీతీరంలో ఉన్న ఈ పవిత్రస్థలంలో అనేక తీర్థాలు, ఆలయాలున్నాయి. నదీగర్భంలో పుండరీక భగవాన్, లోహదండ తీర్థం, బ్రహ్మపురుష అమ్మ షేర్కార్, పుండరీకుని తలిదండ్రుల సమాధులు మొదలయిన ఆలయాలున్నాయి. అయితే వరదల సమయంలో అన్నీ నీట మునిగి ఉండి వరదతీయగానే సాక్షాత్కరిస్తాయి. పవిత్ర చంద్రభాగ నదికి ఎన్నో ఘాట్లు. నదికి అవలి ఒడ్డున శ్రీ వల్లభాచార్య సమాధి, మందిరం ఉన్నవి.

చంద్రభాగా నదీ పుష్కరిణిలో స్నాన మాచరించి చూడదగిన ఆలయములు- ప్రదక్షిణ మార్గంలో నామదేవాలయం, మూడు అంతస్తులు గలది. రామ మందిరం, కాళికా మందిరం, సంత్‌తుకారాం మందిరం, వెంకటస్వామి మందిరం, హనుమాన్ మందిరం, జ్ఞానేశ్వరి మహారాజ మఠం వగైరాలన్నీ చూచి మహాద్వారం గుండా ప్రధాన ఆలయం చేరవచ్చును.

## శ్రీ విఠోబా ఆలయం :

350×150 అడుగుల వైశాల్యం గలిగి పట్టణమధ్యలో తలమానికంగా ఉంది. మొదట ద్వారంలోనే చోకామేలుని విగ్రహం, నామదేవు విగ్రహం దర్శించి లోపలికి వెళ్తే పెద్దహాలు. హాలుఅంతా చలువరాతితో నిర్మించబడింది. హాలులో ఆంజనేయ స్వామిని, శ్రీ గణేశుని దర్శించి వెండిరేకు తాపడం చేయబడిన ధ్వజస్తంభమును దర్శించి నమస్కరించి స్వామి గర్భాలయంలోనికి ప్రవేశించ నగును. గర్భాలయం చాల విశాలంగా ఉంటుంది. చక్కగా గాలి, వెల్తురు వచ్చే ప్రత్యేకమయిన ఏర్పాట్లు న్నాయి. స్వామిని నేరుగావెళ్ళి ఆలింగనము చేసుకోవచ్చును. స్వామి సుందరరూపం కనులార గాంచవచ్చును. శరీరం పులకితమై మనసంతా భక్తిభావంతో నిండి పరవశం

జెందుతుంది. స్వామి మహాశక్తి సమన్వితుడు. ఆధ్యాత్మికులకు ఉత్తేజాన్ని గల్గించు వాడు. మంగళమూర్తి. గర్భాలయం దగ్గరిలోనే ఉన్న 'కాన్హాపాత్ర' వృక్ష రాజాన్ని దర్శించి రుఖుమాబాయి ఆలయం దర్శించనగను. దగ్గరిలోనే ఉన్న గోపాలపురంలో జానాబాయి, సక్కుబాయిలు వాడిన బిందెలు, తిరుగలి, కుండలు మొదలయినవి చూడ వచ్చును.

చిన్న మనవి :

పండాలు ముసిరి పీడిస్తారు. మరి తప్పదు.

మంగల్‌వాడ :

గోపాల్‌పురం నుండి దాదాపు 19 కి.మీ. బస్సులో ప్రయాణం చేసి దామాజీ పంత్ జీవసమాధియైన మంగల్‌వాడ్ చేరవచ్చును. ఆలయం ముందు విశాలమైన సంకీర్తనహాలు, వెనుక పంత్‌గారి సమాధియైన ప్రదేశం చూడవచ్చు. వీరి చరిత్ర మన ఆంధ్రప్రదేశ్‌లోని భద్రాచల రామదాసు చరిత్రను పోలియున్న దనుకోవచ్చు. శ్రీ కంచర్ల గోపన్న శ్రీరామాలయానికి ప్రభుత్వ తహసీలు పైకమువాడితే, పంత్ గారు ప్రభుత్వధనం కరువుకాటకాల సమయంలో తల్లడిల్లిపోతున్న బీద ప్రజలకు కైంకర్యం చేసిన మానవతావాది. ఇక్కడ పురాతనమైన కోట, కొన్ని ఆలయాలు దర్శనీయం.

ఇతరంగా :

సోలాపూర్‌చేరి బస్సుమీద వెళ్తే తుల్జాపూర్ చేరవచ్చు. తుల్జాపూర్ భవాని మహిమగల శక్తిపీఠం. శివాజీ మహారాజు ప్రార్థించగా ఈభవాని తన వరప్రసాదంగా ఒక ఖడ్గాన్ని సమర్పించిందట. నవరాత్రికి ఉత్సవం విశేషంగా జరుగుతుంది. మహా తపో మహిమలగల శ్రీ నారాయణ మహారాజ్‌గారి భేట్– నారాయణభేట్, చిన్‌చివాడ కోయినాడామ్, లోనావ్లా, ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటిగా పేర్కొన బడిన శ్రీభీమశంకర్– (నేరాల్ దగ్గర అమరియున్నది) భీమానది పుట్టిన సహ్యాద్రిపై వెలసిన శంకర మహదేవుని ఆలయం, బొంబాయికి సమీపంలోని అంబర్‌నాధ్, 1060 ప్రాంతంలో నిర్మించబడిన గొప్ప మహిమాన్వితమైన శివాలయం– సుందర శిల్పకళ శోభించిన సాటిలేని మేటిదని ప్రతీతి చెందినది. పూర్లీ వైద్యనాధ్ ధామం– పవిత్ర యాత్రాస్థలం మొదలగు పవిత్ర స్థలాలు దర్శనీయం.



# గోవా



మహాభారతంలో 'గోమంత' అనే ప్రసక్తితో ప్రస్తుతించబడిన దేశం. శ్రీ మహావిష్ణువు యొక్క అరవ అవతారం విశేషంగా కొనియాడబడే పరశురాముడు సహ్యాద్రి నుంచి బాణమొకటి సంధించి లాగి వదిలారట. అది మహోగ్రమై సముద్రుణ్ని అవతలికి జరిపి ప్రస్తుత గోవా ఆవిర్భావానికి కారణమైనట్లుగా పురాతన పురాణ గాథ. ఆ బాణం పడినచోటు- 'బాణ-హళ్లి' నేటి 'బాణాలిం'గా ప్రతీతి.

బొంబాయికి 320 కి.మీ. దూరంలో అమరియున్న అత్యంత సారవంతమైన సముద్ర తీర ప్రాంతం గోవా. గ్రాహంగ్రీన్‌లాంటి ప్రముఖ పాశ్చాత్యులు సైతం గోవా ప్రకృతి అందానికి దాసోహమని 'మానసిక వ్యథలన్నిటినీ మాపు చేసేది' అని కీర్తించటం గూడ అతిశయోక్తి కాదేమో!

**భౌతికంగా :**

కర్నాటక, మహారాష్ట్రముల మధ్యగా అమరిన అందాల శైశవరాష్ట్రం. ఉత్తరాన టెరిఖాల్ నది, దక్షిణాన, తూర్పున కర్నాటక రాష్ట్రంతోను, పడమరన అరేబియా సముద్రంతోను ఆవరించబడిన ప్రదేశం. తూర్పు భాగంలో అంతా ఉత్తరపు కొస వరకూ వ్యాపించిన సహ్యాద్రి పర్వతశ్రేణి పరచుకున్న పర్వతాలతో కొండ ప్రదేశంగా అమరివుంది. ఈ అందాల భూమిని సస్యశ్యామలం చేయటానికి మండోవి, జువారి, టెరిఖోల్, ఛాపోరా, బేయిల్ నదులు ప్రవహిస్తూ రాష్ట్రాన్ని సుసంపన్నం చేస్తున్నాయి. గోవా నుండి ముఖ్యమయిన ఎగుమతులు ఇనుము, మాంగనీసు, 258 కి.మీ. దూరంలో ఉన్న మార్మగోవా తీరం రేవునుండి జరుగుతాయి. నౌకాయానానికి వీలుగా జువారి, మాండోవి నదులు సంగమ స్థానం తోడ్పడుతుంది.

గోవాలోని శీతోష్ణస్థితి వెచ్చగాను, తేమగాను వుంటుంది. శీతోష్ణస్థితి విభేదాలు అట్టే లేవు. ఈ ప్రదేశం పురాణ ప్రశస్తి గలిగి శోభాయమానమైన చరిత్ర వుంది.

సంగ్రహ చరిత్ర :

సంస్కృత సంప్రదాయాలలోకి వెళ్ళాలి. వెళ్ళి తెలిసికోవాలంటే చరిత్రలో పూర్వపు మౌర్య సామ్రాజ్య కాలానికి క్రీ.పూ. 3 శతాబ్దంలోకి తొంగి చూడవలసి వుంది. ప్రసిద్ధమైన కొంకణ దేశాన్ని శాతవాహనుల వంశమైన కృష్ణ శాతకర్ణి మహారాజు పరిపాలించాడు. గోవా గోపకా పట్టణం లేక గోమంతగా పేర్కొనబడింది. మహాభారత కథలో భీష్మ పర్వంలో ప్రసక్తి వుంది. మరో పురాణనామం గోవపురి. క్రీ.శ. రెండవ శతాబ్దంలోని గ్రీకు యాత్రికుడు, చరిత్ర కారుడు టోలమి ఈ ప్రాంతాన్ని 'గౌబా'గా పేర్కొన్నాడు. క్రీ.శ. 4 నుండి 6 శతాబ్దాల వరకు మౌర్యుల వంశంలో ఉన్న కొంకణ ప్రాంతంనించి బాదామి చాళుక్యులు తరిమివేశారు. తరువాత అనేక రాజ వంశాలు పరిపాలించాయి. చంద్రపూర ఈనాటి 'చాందోర్'ని రాజధానిగా చేసికొని కదంబులు పరిపాలించారు. వారి పాలనలోనే గోవపురి ఒక ముఖ్య వ్యాపార కేంద్రమై వర్ధిల్లింది. 1312లో బహమనీ సుల్తానులు జయించి ఆక్రమించారు. 1470లో బహమనీ సుల్తానులను పారద్రోలి విజయనగర సామ్రాజ్యాధినేతలు వశపరుచుకున్నారు. మాండోవినది తీరంలోని ఏలా వారి ముఖ్య పట్టణమయింది. తరువాత యూసుఫ్ ఆదిల్ షా బీజపూరు సుల్తాను ఆక్రమించాడు. 1510లో అల్ఫాన్సో ఆల్బ్ కర్క్ పోర్చుగీసు గవర్నరు జయించి వారి అధీనంలోకి తీసికొన్నాడు. నేటి గోవా ముఖ్య పట్టణమయిన పానాజీలోని సుల్తాను ఆదిల్‌షాకి సంబంధించిన ఫిరంగి కంపాల్ దగ్గర పడివుంది. గోవా పోర్చుగీసులోని మహాకవులు సైతం గోవా రామణీయకతను వర్ణించే విధంగా ఒక పెద్ద కథగా తయారయింది. 'ప్రాచ్య దేశాల్లోని మకుటాయమైన రాణి'గా అభివర్ణించారు. తరువాత 1809లో నెపోలియన్‌తో జరిగిన యుద్ధాల కారణంగా బ్రిటిషువారు వశపర్చుకుని తరువాత 'వియన్నా' ఒడంబడిక ప్రకారం మరల పోర్చుగీసువారి పరం చేశారు. దేశానికి 1947 ఆగష్టు 15న స్వాతంత్ర్యం వచ్చినా పోర్చుగీసు మాత్రం తమ స్థావరాలను వదలలేదు. 1961 డిశంబరు చివర తేదీన సైనిక చర్యతో గోవాను విముక్తం చేయటం జరిగింది. గోవాతోపాటుగా ఇతర స్థావరాలైన దయ్యూ, డామన్, దాద్రా, నాగర్ హవేలీలుతో సహా విముక్తం అయినాయి. 1962 రాజ్యాంగంలో 12వ సవరణ ప్రకారం గోవా, దయ్యూ, డామన్ ఒకే అధికారి పాలన క్రింద ఈ మూడు ప్రాంతాలు ఇండియన్ యూనియన్‌లో విలీనం చేయ

బడ్డాయి. తరువాత ఆనాటి ప్రధాని భారతరత్న పండిట్ జవహర్‌లాల్ సందర్శనం, గోవా అసెంబ్లీకి ఎన్నికలు జరగటం వగైరా వగైరా చకచకా జరిగిపోయాయి. తరువాత కాలక్రమేణా జరిగిన చట్టాల్లో మార్పులు ఫలితంగా మార్పులకు గురయి 1987 లో ఆగష్టు 12న జరిగిన పార్లమెంటు చట్టం ప్రకారం గోవా 25 వ రాష్ట్రంగా అవతరించిన శైశవరాష్ట్రం.

వైశాల్యం : 3702 చ.కి.మీ.

జనాభా : 10,07,749.

మాట్లాడే భాషలు : కొంకణి, మరాఠీ.

రాజధాని :

పానాజి. పూర్వం ఇంగ్లీషులో 'పాంజిమ్'గా ఉచ్చరించబడేది–కొంకణి భాషలో ముద్దుగా పోన్‌జి అని పిలువబడుతుండేది.

అక్షరాస్యత : 57 శాతం.

గోవాలో ముఖ్య యాత్రిక ఆకర్షణలు –

## పానాజి–దాని చుట్టు ప్రక్కల

పానాజి :

(పాంజిమ్) అతిచిన్న రాష్ట్రాల్లో ఒకటైన గోవా రాష్ట్రరాజధాని కూడా తగినట్లుగానే చిరుపట్టణం. విశాలమైన మాండోవినదీ తీరంలో వెలసినది. చాలా ఆహ్లాదకరమైన వాతావరణం దానికితోడు పట్టణవాసులు స్నేహపాత్రులు. యాత్రికులు గోవా పర్యటనకి వచ్చే వారికి సరియైన మొదటి మజిలీ. 1759లో ఆదిల్‌షా భవనం తమ ముఖ్య కేంద్రంగా చేసికొన్నా 1843లో మాత్రమే అధికారికంగా రాజధాని పట్టణమైంది. అప్పటినుండి పానాజీయే గోవా రాజధాని. విదేశీయులైన పోర్చుగీసు వారి వారసత్వాన్ని, సాంస్కృతీ సంప్రదాయాల ననుసరించి పట్టణ వీధులలో ఇంకా సన్నగా ఇరుకుగా వుండి చుట్టుకుని వున్నట్లుంటాయి. పాతకాలంలో కట్టిన ఇండ్లు ప్రవేశానికి ఉన్నట్లున్న బాల్కనీలు, చిన్న చిన్న బార్లు, టీ దుకాణాలు. పోర్చుగీసు సంప్రదాయాలను పునికి పుచ్చుకున్నట్లుంటాయి. మధ్య మధ్య మంచి మంచి పార్కులు ఒక వింతయైన అందాన్ని తెచ్చుతుంటాయి.

ఒక చర్చిలో ప్రవేశించి ఎత్తుగావున్న గోపుర భాగంలో నుండి చూస్తే పట్టణమంతా దృశ్యమానంగా కనబడుతుంది. పట్టణమంతా తాటిచెట్లు, ఈతచెట్లు మెండు.

గోవా పట్టణం బొంబాయి త్రివేంద్రం పట్టణాల నుండి విమాన సౌకర్యం వుంది రోడ్, జలమార్గాల గుండా కూడా చేరవచ్చు, 24 గంటల ప్రయాణంతో.

గోవాలో ప్రకృతి అందాలతోపాటు ముఖ్య ఆకర్షణలుగా కొండ ప్రక్కన గల మునిసిపల్ గార్డెన్సు చివరన గల ఇమ్మాక్యులేట్ కన్సెప్షన్ చర్చి, మహాలక్ష్మి దేవాలయాలు చూడదగినవి.

మాండోవి నదీ ప్రవాహం సముద్రంలో కలియబోయే ముందు ఉప్పునీటి కయ్యలమధ్య ఇసుక తిన్నెలు గస్పార్‌డియాస్ బీచ్‌గాను, జువారి నదీ ముఖంలో ఉన్న దోనాపాపులా ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.

కలాంగ్యుటేబీచ్ :

గొప్ప ప్రకృతి అందాన్ని ప్రతిబింబించే దృశ్యమానమయిన బీచ్‌గా ప్రసిద్ధి. ఇక్కడికి వచ్చినవారు మరిచిపోలేని అనుభూతికి గురవుతారు. దగ్గరనే వున్న అగ్వాడా కోట బీచి విశ్రాంతి గృహం సౌకర్యంగా ఉండే వసతి.

అగ్వాడాకోట :

సమున్నతమైన ప్రదేశంతో 450 సంవత్సరాల క్రితం పోర్చుగీసు వారు కట్టిన కోట. ఫల, పుష్ప, వృక్ష సంతతిలో చక్కని ఉద్యానవనాలతో ఫౌంటెన్‌లు, ఊటలు వగయిరాలతో ఆహ్లాదకరంగా వుంటుంది. కోటమీద ఒక విశ్రాంతి కేంద్రాన్ని ఇటీవలే ప్రారంభించారు. కొన్ని ఆధునిక వసతులతోపాటు, బీచి వెంట గుర్రపు స్వారి, జలక్రీడల ఏర్పాటు వగయిరాల ప్రత్యేక ఆకర్షణలు పొందు పరిచారు.

అగ్వాడాకోట పాత గోవాలో వున్నది. ఇతర చారిత్రిక ఆకర్షణలుగా బాసిలికా ఆఫ్ బోమ్ జీసస్, సెకెథిడ్రెల్, సెయింట్ కాజిటాన్ కాన్వెంటు, సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిస్సి కాన్వెంటు, చర్చిలు, సెయింట్ కాథరిన్ ఛాపెల్, ఆర్కియాలాజికల్ మ్యూజియం, ఆర్చిఆఫ్ వైశ్రాయిస్, పోర్ట్రెయిట్ గాలరీ వగయిరాలు.

సెకెండ్రథిడల్ :

1558లో నిర్మించబడిన అసాధారణ కట్టడం. నిర్మాణంలో హిందూ ముస్లిముల నిర్మాణాల వైచిత్రుల ప్రభావం బాగాస్ఫుటంగా కనబడుతుంది. చర్చికి ఐదు గంటలున్నాయి. స్వర్ణఘంట అని పేర్కొనబడింది. ప్రపంచం మొత్తం మీదనే అతి పెద్దదిగా అభివర్ణింపబడింది. చర్చి లోపలిభాగంలో 17, 18 శతాబ్దాలనాటి వైభవం శంఖ్దను కట్టినట్లుగా కనబడుతుంది. లోపలఉన్న శిలువమీద 1319లో ఏసుక్రీస్తు కనబడ్డారని ప్రతీతి.

సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిస్సీ చర్చి :

వైభవోపేతంగా నిర్మించబడింది. మధ్యలోగల ప్రార్థనా మందిరం విశేష అలంకార సదృశమై ఒప్పుతున్నది.

బోమ్ జీసస్ :

ప్రాచ్యదేశాల దేవుడు, మహామానవతా వాదిగా కొనియాడబడిన సెయింట్ ఫ్రాన్సిస్‌గ్జేవియల్ శరీరం భద్రపరచబడి ఉన్నచోటు. ఆయన 1540లో గోవావచ్చి, 1552లో చైనాలో మరణించారు. వారి భౌతికకాయాన్ని గోవా తీసికొని వచ్చినప్పుడు కాయాన్ని బహు జాగ్రత్తగా భద్రపరచబడినట్లున్నూ చెక్కుచెదరని కాయం తీసికొని రాబడిందట. 1974 వరకూ దర్శించగోరి వచ్చే యాత్రికులను 10 సంవత్సరాల కొకసారి వాసలికా బోంజీసస్ దగ్గర ప్రార్థనలు సలపటానికి వీలుగా ప్రదర్శించేవారు.

ఒకానొకప్పుడు అనేక దేవాలయా లుండేవి. పోర్చుగీసువారు వచ్చిన కొత్తల్లోనే వాటిని నేలమట్టం చేశారు. ఇటీవల పురాతత్వ శాఖవారు త్రవ్వకాలు జరిపించి కొన్ని విశేషాలను బయటకు తీయగలిగారు. వాటిలో చాందోర్‌లోని ఒక పెద్ద రాతి నందిని బయటకు తీసికొనివచ్చారు. కదంబుల కాలానికి చెందిన దీ నంది.

దేవతా మూర్తులను ఇష్టం వచ్చినట్లు వరిపొలాల్లోను, దగ్గరి చిట్టడవుల్లోనూ పారవేయటం జరిగింది. జాతి అహంకారమా లేక పాలితుల తూష్ణభావమా ?

శ్రీ మంగేష్ ఆలయం :

మార్డోల్ దగ్గరి పర్వతాలమధ్య ఉన్న శివాలయం. ఈ ఆలయానికి సంబంధించిందే ఒక పవిత్రసరోవరం లోపల శిల్పకళ సెకెన్షిదల్లోని విశేషాంశం కనబడతూవ్వంది.

శ్రీ మహాల్సా దేవాలయం :

శ్రీ మహావిష్ణువు అధిదేవత. మార్దోల్‌కి దగ్గరిలోనే అమరియున్నది.

శ్రీ శాంత దుర్గాలయం :

దుర్గామాతకు అంకితమైన ఆలయం. 1713లో నిర్మించబడింది. ప్రశాంత చిత్తంతో భక్తులను అనుగ్రహించే మహామాత పార్వతీదేవి అవతారాంశం. మూర్తికి అటువైపు, ఇటువైపు శివకేశవుల విగ్రహాలున్నాయి. పానాజీ నుండి 33 కి.మీ. దూరం ఉంటుంది.

సప్తకోటేశ్వర ఆలయం :

గోవాలో అతి ప్రాచీనమైన దేవాలయం. శివాజీ మహారాజు దీన్ని పునరుద్ధరించారు. కదంబ రాజులకు ఆరాధ్యదేవత, కులదేవత.

ముఖ్యంగా గోవాలో ఉత్సాహదినాలనేకం. జనవరి నెలలో 6 తేదీన జీసస్ క్రీస్తు బాల్యంలో ఆయన దగ్గరకు ముగ్గురు జ్ఞానులువచ్చి దర్శించిన రోజును పరవడిగా జరుపుకుంటారు.

వాస్కోడిగామా :

మొదటి పోర్చుగీసు నావికుడయిన వాస్కోడిగామా భారతదేశానికి పోర్చుగల్ నుండి సముద్ర మార్గాన్ని కనిపెట్టిన ఘనుడుగా ఆయన పేర్న వెలసిన ఆధునిక పట్టణం.

బొయినా బీచ్‌లో ఈత కొట్టడం, సాన్‌కోలే చర్చిని సందర్శించటం జరిగాక పానాజీకి ఫెర్రీ స్టీమ్‌బోటులో రావచ్చు.

దక్షిణ గోవాలోని ముఖ్య వ్యాపార కేంద్రం మార్గో మంచి ఉద్యానవనాలు, పార్కులతో చూడముచ్చటయిన పట్టణం, ప్రతి శుక్రవారం సంత జరిగే మపూసా, టిరాకోల్ కోట విశ్రాంతిగా దర్శించదగిన ప్రదేశాలు.

పానాజి అన్ని ముఖ్య నగరాలతో రోడ్డు కలయిక ఉన్నది వాటిలో కొన్ని-

| | | |
|---|---|---|
| సదాశివపూర్: | 100 కి.మీ. | మార్గో, చాందల ద్వారా. |
| బెల్గామ్ : | 157 ,, | అన్‌మోడ్, లోండాలమీదుగా. |

మంగుళూరు : 371 ,, మార్గో, కర్వాడ్‌ద్వారా.
బొంబాయి : 594 ,, పాన్వెల్, మహద్, సవంత్‌వాడిల ద్వారా.
బెంగుళూరు : 598 ,, లోండా, హుబ్లి, హిరియార్‌ల ద్వారా.
డామన్ : 787 ,, వాపి, బొంబాయి, పాన్వెల్, మహద్, సవంత్ వాడిల ద్వారా.

## షిప్ సర్వీసు : (జలమార్గం) :

మంగళవారాలు తప్ప మిగతా రోజుల్లో అక్టోబరు మాసం నుండి మే మాసం వరకు M/s. మొగల్ లైన్సువారు బొంబాయి నుండి పానాజివరకు నౌకాయాన నిర్వహణ చేస్తారు. 20 గంటల ప్రయాణం. రిజర్వేషనులకు : M/s. V.S. డెంపో&Co. షిప్‌జెట్టి ఎదురుగా, పానాజీలోగాని, బొంబాయిలోని మొగల్‌లైన్సు, న్యూ ఫెర్రీ వార్ఫ్ బొంబాయి వద్దగానీ పొందవచ్చు.

స్థానికంగా తిరగటానికి- టూరిస్టు కారులు, టాక్సీలు, ఆటోరిక్షాలు, మోటారు సైకిళ్ళు (అద్దెకు) దొరకుతాయి.

సెప్టెంబరు నుండి మే మాసంవరకు ప్రతిదినమూ డోనాపావులా నుండి మార్మగోవా రేవువరకూ జలమార్గం తెరిచి యుంచబడుతుంది. లాంచీలు కూడా లభ్యం.

## ప్రత్యేక యాత్రల నిర్వహించేది :

టూరిజమ్ డైరెక్టరేట్, గవర్నమెంట్ ఆఫ్ గోవా, గయిడ్ సర్వీసుల్తో, లగ్జరీ కోచ్‌ల ఏర్పాట్లు కూడా ఉన్నాయి.

**పానాజీ నుండి :**

ఉదయం: 8-30 నుండి మధ్యాహ్నం 12-30 వరకూ. ఛార్జి రు. 11/-
ఇంతకు ముందు ఛార్జిలు అంచనా కోసం ఇస్తున్నాం- గమనించగలరు.

(1) అగ్వాడాకోట: కాలంగూటే బీచ్, మియమ్ సరోవరం, మపూసా, పానాజి.

(2) సాయంత్రం గం. 2-30 నుండి 7 గ.ల వరకు.
డోనాపావులా- మీరామార్‌బీచ్, బాసిలికా ఆఫ్ బోంజీసస్, సె కెథీడ్రల్, శ్రీ మంగేష్ ఆలయం, శ్రీమహల్సా, శ్రీశాంతదుర్గా, రామనాధ్ దేవాలయాలు ఛార్జి రు. 11/-.

(3) ఉ. 8-30 గం. నుండి సా. 3 గం. వరకు.
మార్గో, కోల్వాబీచ్, మార్మగోవా హార్బరు, వాస్కో-డిగామా, పిలర్ సెమినారీ

(4) బొండ్లాఅడవి: ఉ. 9 గం. నుండి సా. 4 గం. వరకు. చార్జీ 14/-.

(5) వాగేటర్‌బీచ్, అంజునాబీచ్-సా. గం. 4-15 నుండి 7-15 వరకు.
చార్జీ రు. 8/-

(6) ఉ. 9 గం. సా. 7 గం. వరకు. చార్జీ రు. 21/-

దక్షిణ గోవా విహారం- పానాజి, బాసిలికా ఆఫ్ బోమ్ జీసస్, సెకెథ్రిడల్, మంగేష్, శాంతదుర్గా ఆలయం, మార్గో, కోల్వాబీచ్, వాస్కో-డిగామా, మార్మగోవా రేవు, పిలార్ సెమినరీ, మీరామార్, డొనాపావ్‌లా-

మొదలయిన వాటికి రిజర్వేషన్లు : డైరక్టోరేట్ ఆఫ్ టూరిజమ్, గవర్న మెంటు ఆఫ్ గోవా, టూరిస్టుహోమ్, పట్టో బ్రిడ్జి, పానాజి.

గోవాలో వుండటానికి రోజుకి 100/- నుండి 600/- రు.వరకు చిన్నా పెద్దా హోటళ్ళు, రెస్టుహౌసులు, గెస్టుహౌసులు ఎన్నో వున్నాయి. అవి ఎన్నుకోవటం మీకే వదిలివేస్తున్నాము.



# కర్ణాటక



హిందూదేశ సంప్రదాయ సంగీతం రెండు మహా వాహినులు. ఒకటి కర్ణాటక సంగీతం– రెండవది ఉత్తర హిందూస్తాన్ సంగీతం. కర్ణాటక సంగీతానికి పుట్టినిల్లు హంపి అని విశ్వసించబడుతుంది. దక్షిణాదిన సంకరం లేకుండా నిలిచిన ఉత్తమ సాంప్రదాయపు రీతుల్ని చెక్కుచెదర కుండా తనదైన ప్రత్యేక బాణీలో బహుళ ప్రచారంలో వున్నది కర్ణాటక సాంప్రదాయ సంగీతం. ఒక్క సంగీతమే కాదు, సంస్కృతిలోను, సాహిత్యంలోను, ప్రాచీన శిల్పకళలలోను ప్రశంసా పూర్వకమైన పాత్ర వహించింది కర్ణాటక. భారత భారతి సాంప్రదాయాల ఒరవడిలో ప్రపంచానికి సైతం అక్షరాలు దిద్దిపెట్టిన వైభవాన్ని చాటే పూర్వచరిత్రగల ఎన్నో ప్రదేశాలు ఈ రాష్ట్రంలో ఉన్నాయంటే అతిశయోక్తి కాదు.

'కరునాడు' అంటే ఉన్నతమైన భూమి అని అర్థం. అందునించే వచ్చింది 'కర్ణాటక' పీఠభూమిగా అమరిన ఈ ప్రాంతానికి పేరు ఎంతయినా సముచితం, సార్థకం. 1973, నవంబరు 1న రాష్ట్ర అసెంబ్లిలో ఆమోదించబడిన శాసనంతో పూర్వపు 'మైసూరు' రాష్ట్రంగా పిలవబడే ఈ రాష్ట్రం 'కర్ణాటక'గా ఎంతో యుక్తియుక్తమయింది. కేవలం భాషాపరంగానేగాక, అనేక యితర ప్రతిపత్తులు ప్రత్యేకంగా ఈ పేరులో ఇమిడియుండటం మరింత వన్నెచిన్నెలు చేర్చి బహుళార్థ సార్థక్యమైందనేది నిర్వివాదం.

భౌతికంగా :

ఉత్తరంగా మహారాష్ట్ర గోవాలు, తూర్పున ఆంధ్రప్రదేశ్, దక్షిణాన తమిళ నాడు, కేరళలు సరిహద్దులుగా గలిగి పశ్చిమాన అరేబియా సముద్రపు తీరాన్ని అను కుని దక్కను పీఠభూమి పడమటి చివరగా అమరియున్న ఈ రాష్ట్రం అతి ప్రాచీనకాలంలో అనాదిగా 'కుంతల' దేశంగా విశిష్టతను, పురాణ ప్రసిద్ధి చెందినది. శోభాయమానమైన పూర్వ వైభవం, చారిత్రిక ప్రాముఖ్యతను సంతరించుకున్న విశేష రాష్ట్రాన్ని నాలుగు ముఖ్య ప్రాంతాలుగా విభజించవచ్చు.

(1) కోస్తా ప్రాంతం, (2) మల్నాడు, (3) ఉత్తరమైదానాలు, (4) దక్షిణ మైదానాలు. కృష్ణ, కావేరి నదులు తమ ఉపనదులతోసహా ప్రవహిస్తూ సుజల పూర్ణం గాను సస్యశ్యామలం చేస్తున్నాయి. భీమ, ఘటప్రభ, మాలాప్రభ, తుంగభద్ర, వేద మతి, కృష్ణానదికి ఉపనదులైతే, హేమావతి, షింషా, అర్కావతి, లక్ష్మణతీర్థ, కాబినీ నదులు కావేరికి ఉపనదులై రాష్ట్రాన్ని సుసంపన్నం చేస్తున్నాయి. రెండు మహా నదులు తూర్పుగా ప్రవహించి కృష్ణానది ఆంధ్రప్రదేశ్‌లోను, కావేరి తమిళనాడు లోను బంగాళఖాతంలో సాగరసంగమం చెందుతున్నాయి.

పశ్చిమ ప్రవాహికలుగా శరావతి, కాళీనది, నేత్రవతీ నదులు అరేబియా సము ద్రంలో సాగర సంగమం చేస్తూ ముఖ్యంగా కర్నాటకలో జల విద్యుదుత్పత్తి కారక ములై ప్రధానపాత్ర వహిస్తున్నాయి.

ఇక్కడ ప్రవహించే ముఖ్య నదులు ఆంధ్రప్రదేశ్, కేరళ. తమిళనాడులు గుండా ప్రవహించడంతో ఈ దక్షిణాది రాష్ట్రాలు తరచూ నదీ జలాల వినియోగ వివాదాలతో సతమత మవుతుంటాయి.

సంగ్రహంగా చరిత్ర :

కర్నాటకను గురించి చెప్పుకోబోయే ముందు ఒకసారి పురాణ యుగంలోకి తొంగి చూద్దాం. రామాయణ కాలంలో వానర రాజులైన వాలి, సుగ్రీవుల రాజధాని హంపీనగరంగా చెప్పబడుతూంది. రాష్ట్రంలోని వాతాపి పేరు చెప్పగానే అగస్త్య మహాముని మన మనసుల్లో మెదలుతాడు. బీజపూరు జిల్లాలోని బాదామికి చెందిందని ప్రతీతి.

క్రీస్తుపూర్వం కర్నాటక ప్రాంతం మౌర్య సామ్రాజ్యంలోని భాగమైంది. 'సివమగిరి' (రాయచూరు జిల్లాలోని 'కనకగిరి') మౌర్యుల దక్షిణాది రాజధానిగా

పేర్కొనబడింది. క్రీ.పూ. ఒకటవ శతాబ్దంలో ప్రభవించిన శాతవాహనుల వంశాలు దాదాపు 300 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా రాజ్యమేలారు. వారిలో చెలరేగిన అంతః కలహాల వలన ఉత్తర ప్రాంతాన్ని కదంబులు, దక్షిణ ప్రాంతాన్ని గాంగులు ఆక్ర మించి పరిపాలించారు. శ్రావణ బెలగోలాలో ప్రతిష్ఠించబడిన గోమఠేశ్వరుని గొప్ప ఏకశిలా విగ్రహం గాంగులు కాలంనాటిదని ప్రతీతి.

క్రీ.శ. ఆరవ శతాబ్దం వచ్చేసరికి చాళుక్య సామ్రాజ్యం ఆవిర్భవించింది. చాళుక్యుల తరువాత కర్నాటక ప్రాంతాన్ని దేవగిరి యాదవులు, ద్వార సముద్రపు హోయసలులు వాటా తీసుకొని రెండు రాజ్యాలుగా పరిపాలించారు. 14 శతాబ్దంలో విజయనగర మహాసామ్రాజ్య స్థాపనం జరిగింది. దీనికి ఆద్యులు హరిహర బుక్క-రాయలు. విజయనగర రాజుల కాలంలో స్వర్ణయుగంగా అభివర్ణించబడింది. కర్నా టాంధ్ర సామ్రాజ్యంగా కీర్తించబడింది. అక్కడి నుండి ముస్లిము దండయాత్రలకు గురయింది. 1565లో జరిగిన తల్లికోట యుద్ధంలో విజయనగర సామ్రాజ్యం అంత రించింది.

క్రీ.శ. 1399లో ఒక చిన్నరాజు యదురాయలు మైసూరును రాజధానిగా చేసి కొని ఒదయార్ వంశీయుల పాలనకు శ్రీకారం చుట్టారు. 1578–1612 ల్లో రాజా వదయార్ శ్రీరంగపట్నం రాజధానిగా చేసికొని రాజ్య విస్తరణ గావించాడు. వీరిని హైదరాలి జయించి రాజ్యచ్యుతుల్ని చేశాడు. హైదరాలి సుతులు టిప్పుసుల్తాన్ బ్రిటిషువారితో జరిగిన యుద్ధాల్లో సుల్తాన్ ఓటమితో వదయార్‌లను తమ ప్రతినిధు లుగా మైసూరు సింహాసనంమీద కూర్చో బెట్టారు. బ్రిటిషువారి పాలనలో కర్నాటక ప్రాంతాన్ని ఎన్నో సంస్థానాల మధ్య రాష్ట్రం మధ్య పంచారు. ఈనాడు రూపు దిద్దుకున్న రాష్ట్రం కన్నడభాష మాట్లాడే వారి ఆశయాలు, అభిరుచుల కనుగుణంగా మలచబడిన సమగ్రరూపంగా చెప్పుకోవచ్చు. చాళుక్యులు మహానిర్మాణ దక్షులు. వీరి అధ్వర్యంలో దిద్దిన శిల్పకళా ఒరవడులు ఇతర దక్షిణాది ప్రాంతాల ఆలయ నిర్మా ణాలకు అనేకంగా పునాది. పాలనాపరంగా ఈ రాష్ట్రాన్ని 20 జిల్లాలుగా విభజిం చారు. శాసనసభ రెండు అంతస్థులుగల వ్యవస్థ. లెజిస్లేటివ్ అసెంబ్లీలో 224 ప్రజా ప్రతినిధులు, ఎగువశాసన సభకి 63 మంది సభ్యులు.

**జిల్లాలు :**

బెంగుళూరు పట్టణం, బెంగుళూరు గ్రామీణం, బెల్గాం, బళ్లారి, బీజపూర్, బీదర్,

చిక్‌మంగుళూరు, చిత్రదుర్గ, దక్షిణ కన్నడ, ధార్వార్, గుల్బర్గా, హసన్, కొడగు, కోలారు, మాండ్య, మైసూరు, రాయచూరు, షిమోగా, తూంకూరు, ఉత్తరకన్నడ.

రాష్ట్ర వైశాల్యం : 1,91,791 చ.కి.మీ.

రాజధాని : బెంగుళూరు.

జనాభా : 3,71,36,000 పైన.

మాతృభాష : కన్నడ.

అక్షరాస్యత : 39 శాతం.

స్త్రీ పురుష నిష్పత్తి : 963 : 1000.

ముఖ్యమయిన యాత్రికాకర్షణలు :

బెంగుళూరు నగరం, మైసూరు, శ్రీరంగపట్నం, బందీపూరు, బేలూరు, హళీబేడు, శ్రావణ బెళగోల, జోగ్ జలపాతం, కోలారు బంగారు గనులు మొదలయిన వాటిలో హంపి, విజయనగరం, కృష్ణరాజసాగర్ ఆనకట్ట, బృందావనం గార్డెన్స్- ఎన్నో ఆలయాలు, చరిత్ర ప్రసిద్ధి చెందిన ప్రదేశాలు ఆసక్తిని రేకెత్తించే యాత్రికా స్థలాలు ఏన్నో... మొదటిగా రాష్ట్రరాజధాని అయిన-

# బెంగుళూరు

జనాభా : 29,00,000.

తీర్చిదిద్దినట్లుండే ఉద్యానవనాలు, పార్కులు, చక్కని ఇండ్లు, భవనాల వరుసలతో ఆహ్లాదకరమైన భారతదేశ మహానగరాల్లో 6 వ స్థానాన్ని ఆక్రమిస్తున్న నిత్య నూతనంగా సందడించే పట్టణరాజం. సముద్ర మట్టానికి దాదాపు 1000 మీటర్ల ఎత్తులో అమరి మంచి వేసవి మకాముగా కూడా ప్రసిద్ధి. వాతావరణం అందరికీ నచ్చుతుంది. సేదలు దీరుస్తుంది. స్వదేశీయులు, విదేశీయులు పారిశ్రామికంగాను, విద్యా వైజ్ఞానికరంగాల్లోను, మేధావంతుల నిలయంగా పేరుపొందిన బెంగుళూరు నగరం నిరంతరం రాకపోకలు సాగించే చోటు. దేశరక్షణలో కీలకపాత్ర వహించే ఎయిర్ క్రాఫ్ట్, ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్స్, హిందుస్థాన్ మెషిన్ టూల్స్‌వారి కర్మాగారాలు, పారిశ్రామికంగా దేశప్రగతిలోకి ముందంజ వేస్తున్న కర్మాగారాలు నగర ప్రాముఖ్యాన్ని ఇనుమడించేవి.

నగరం 16 వ శతాబ్దంలో కెంపగౌడ వ్యవస్థీకరించారు. ప్రస్తుత సుందర రూపానికి, అభివృద్ధికి కృషి ఇటీవలె జరిగిందని చెప్పవచ్చు. నగరంలో చూడదగిన

విగా. లాల్‌బాగ్(బొటానికల్ గార్డెన్సు, నందీశ్వరాలయం, ఉల్సూరు సరోవరం, విధాన సౌధ, కబ్బన్‌పార్కు, టిప్పుసుల్తాన్‌వారి కోట, మ్యూజియం-ఆర్టుగ్యాలరీలు వగయి రాలు.

నగర సందర్శనంలో భాగంగా అనేక సాంస్కృతిక ప్రదర్శనలు కూడా తిలకించనగును. నాట్యం, సంగీతం, నాటకం, ప్రతి సాయంత్రం ప్రదర్శితమవుతూంటాయి నగరంలో అనేకచోట్ల. నగర జీవితం అంతా ముఖ్యంగా కెంపగౌడ సర్కిల్ మెజిస్టిక్ సర్కిల్స్ చుట్టూ సందడిగా పరిభ్రమిస్తుంది.

**విధానసౌధం :**

సంప్రదాయ సిద్ధమైన వాస్తు శిల్పరీతితో నల్లరాతితో కట్టబడిన బ్రహ్మాండమైన భవనరాజం. 5 అంతస్తులుంటుంది. శాసనసభా సమావేశాలు ఇక్కడే జరుగుతాయి. ద్రవిడ భవన నిర్మాణ దక్షతకు ప్రతీకగా నిల్చింది. సచివాలయం కూడా ఇక్కడే వుంది. ఇందులో కాబినెట్ రూము తలుపు అసలైన చందనపు కట్టెతో తయారుచేయబడింది. చూడాలంటే ప్రతి సాయంత్రం 5-30 నుండి 6-30 వరకు క్యూలో నిలుచుని వెళ్ళి చూడవచ్చు. ఆదివారాలు, సెలవు దినాల సాయంత్రాలు భవనమంతా విద్యుద్దీప కాంతితో మెరిసిపోతూ వుంటుంది. నిజంగా ఒక గంభీరమైన కట్టడం.

**కబ్బన్ పార్కు, మ్యూజియం :**

దాదాపు 3000 ఎకరాల వైశాల్యంలో అమరిన సుందరోద్యానవనం. పార్కు లోపలే చక్కటి గ్రంథాలయం, ఒక మ్యూజియం కూడా ఉన్నాయి. పార్కు అంతా అనేక పుష్పజాతుల వృక్షాలతో నయన మనోహరంగా వుంటుంది. పార్కులో ఒక పెద్ద ఫౌంటెన్ కూడా వుంది. సాయంకాలాలు రంగురంగుల విద్యుద్దీపాలంకరణతో మిరుమిట్లు గొలుపుతుంది. మ్యూజియం 1866 లో స్థాపించబడినది, పురాతనమైనది. 5000 సంవత్సరాలనాటి సింధు నాగరికతకు సంబంధించిన విశేషాలు చూడగలం. దీనికిప్రక్కనే ఒక టెక్నోలాజికల్ & ఇండస్ట్రియల్ మ్యూజియం కూడా ఉంది. ప్రభుత్వ సెలవు దినాలు, సోమవారాలు సెలవులు.

**లాల్‌బాగ్ బొటానికల్ గార్డెన్స్ :**

బెంగుళూరు నగర దక్షిణ శివార్లలో 96 హెక్టార్ల వైశాల్యంలో అమరిన సుందర నందనం. ఈ వనం హైదర్‌అలీ అంకురార్పణతో ప్రారంభమై కొన్ని

ప్రత్యేక అలంకారాలుగా అభివృద్ధి పనులు టిప్పుసుల్తాను చేయించారు. 240 ఎకరాల్లో ఒక పెద్ద పుష్పప్రదర్శనా భవనం ఉంది. ఆగస్టునుండి మే మాసం వరకూ చూడవచ్చు. ఇది ఒక అద్దాల మందిరం. ఉద్యానవనంలో అతి పురాతనమైన వృక్షరాజాలున్నాయి. వాటి బుడిపెలమీద వాటి వయస్సులను తెలిపే చీటీలుగూడా ఉన్నాయి. దేశవిదేశాల నుండి సేకరించిన అనేక వృక్ష జాతులను చూడగలం. వనంలో అందాల సరోవరం, పద్మ సరోవరం, డీర్‌పార్కు దర్శనీయాలు. వనంలో అనేకచోట్ల కాలక్షేపం తినుబండారాలు అమ్మేవి కూడా ఉన్నాయి. చాలా సరదాగా గడిచిపోతుంది కాలం.

## టిప్పు భవనం, కోట :

నగర మార్కెటుకు అనతిదూరంలో క్రిష్ణరాజేంద్ర రోడ్డులో ఉన్నది. మొదట నగర నిర్మాత కెంపగౌడ మహారాజు 1537లో నిర్మించింది- కేవలం మట్టి గోడల్తో నిర్మించిన కట్టడం. రెండు శతాబ్దాల తరువాత హైదరాలీ ప్రస్తుత రూపంలో కట్టారు. తరువాత టిప్పు సుల్తాన్ అభివృద్ధిపరచాడు. బ్రిటిష్‌వారు టిప్పుసుల్తానుతో జరిపిన యుద్ధాల్లో కొంత నష్ట పరిచారు. చూడదగిన చార్రిత్రిక స్థలం. 18 వ శతాబ్ధపు నిర్మాణ వైచిత్రి స్పష్టంగా కానవస్తుంది. క్రిష్ణరాజేంద్ర రోడ్డులోనే ఆల్బర్టు విక్టర్ రోడ్డులో టిప్పుసుల్తాను వేసవి మకాంగా ఉపయోగించారు. శ్రీరంగ పట్టణంలోని దరియాదౌలత్ కట్టడానికి సమూనాగా తోస్తుంది. ప్రతిరోజూ కోట ఉదయం 8 గంటలకు, వేసవి మకాం భవనం ఉదయం 6 గంటలకు తెరచి ఉంచుతారు. దీన్ని ఆనుకునే ఉన్న మహానందీశ్వరాలయం మంచి ఆసక్తికరంగా ఉంటుంది.

## మహానందీశ్వరాలయం :

హైందవేతరులకు ప్రవేశంలేదు. కెంపగౌడ మహారాజు నిర్మించిన దేవాలయం. దక్షిణాది శిల్పరీతుల్లో నిర్మించబడింది. ఒకే రాతిమీద చెక్కిన నందీశ్వరుని విగ్రహం గంభీరంగా దర్శనమిస్తుంది. ఇలాంటి నందీశ్వరుని విగ్రహమే మైసూరు చాముండీ ఆలయంలో కూడా వుంది. ఇంకా ఇక్కడికి దగ్గరిలో నాలుగు గాలి గోపురాలు కూడ దర్శనీయం. దాదాపు ఆలయానికి 400 మీటర్ల దూరంలో ఉన్నవి. కబ్బన్ పార్కుకి తూర్పుదిశన ఉల్సూరు సరోవరం బోట్ షికారు సౌకర్యంతో వున్న మంచి పిక్నిక్ స్పాట్. ఈతకొలను ప్రత్యేకం. కర్నాటక జానపద నృత్య ఆహార్యం, బొమ్మలు, రికార్డు చేయబడిన జానపద సంగీతం వినవచ్చు.

## బెంగుళూరు పరిసరాల్లో :

**సరోవరాలు, జలాశయాలు :**

నగరానికి 35 కి.మీ. దూరంలో చామరాజసాగర్ రిజర్వాయర్, అక్కడే అర్కావతి నదిమీద ఆనకట్ట. 29 కి.మీ. దూరంలో హేసరగుట్ట సరోవరం, 69 కి. మీ. దూరంలో కణ్వ రిజర్వాయర్ మంచి విహార స్థలాలుగా ప్రసిద్ధి. రిజర్వేషనులు బెంగుళూరులోని ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, వాటర్ సప్లై సేవేజిబోర్డు, ఆనందరావు సర్కిల్ బెంగుళూరు వారివద్దనుండి సరోవర, జలాశయాల దగ్గరవున్న బంగ్లాలకు పొందవచ్చును. కణ్వ రిజర్వాయర్ దగ్గర బంగ్లా రిజర్వేషనులు అసిస్టెంటు ఇంజనీరు P.W.D, చెన్నపటన వారివద్దనుండి పొందవచ్చు.

**నంది హిల్స్ :**

బెంగుళూరుకు దగ్గరిలో ఉన్న వేసవి విశ్రాంతి కేంద్రం. టిప్పుసుల్తాను వారు వేసవిలో ఇక్కడ విశ్రాంతి తీసుకునేవారట. సముద్ర తలానికి 1475 మీటర్ల ఎత్తున అమరియున్నదీ పర్వత విశ్రాంతి కేంద్రం. బెంగుళూరుకు 69 కి.మీ. దూరం. ప్రతి రోజూ బస్సు లున్నాయి. కర్నాటక స్టేటు టూరిజమ్ డెవలప్‌మెంట్ వారు ప్రత్యేక యాత్రా నిర్వాహణలు చేస్తున్నారు.

**సవనదుర్గ :**

సముద్రమట్టానికి 1400 మీటర్ల ఎత్తున పర్వతగుహల్లో అమరియున్న గుహాలయము. గంగాధరేశ్వరస్వామి, హోన్నదేవిలకు అంకితం. పాతాళం నుండి పైకి వచ్చిన జలాలుగా విశ్వసించబడే 'పాతాళగంగ' ఊట ఉన్నది. ఇక్కడ చల్లగా హాయిగా వుంటుంది.

ఇతరంగా పియర్‌వ్యాలీ లేక ముత్యాలమడువు 40 కి.మీ. దూరంలో ఉన్నది. దగ్గరినే ఒక చక్కటి జలపాతం, 28 కి.మీ. దూరంలో పెద్ద వటవృక్షం వున్న రామహల్లి ఆసక్తిగలవారు దర్శించదగిన ప్రదేశాలు.

**కోలారు బంగారు గనులు :**

బెంగుళూరుకు తూర్పుగా 100 కి.మీ. దూరం వుంటుంది. భారతదేశంలో బంగారం ఉత్పత్తిచేసే గనులు– ప్రపంచం మొత్తం మీద అతి లోతైనవిగా ప్రసిద్ధి. ఉపరితలం నుండి సుమారు 800 మీటర్ల లోతుగా అమరి ఉన్నాయట సొరంగాలు. అనుమతితో వెళ్ళిచూడవచ్చు.

## బెంగుళూరులో వుండటానికి వసతులు, సౌకర్యాలు:

**ధర్మశాలలు—సత్రాలు :**

| | |
|---|---|
| 1) గుబ్బితోటదప్ప చౌల్ట్రి స్టేషను రోడ్డు<br>2) మహారాష్ట్ర మండలి గాంధీనగర్<br>3) పార్సి ధర్మశాల కీన్స్‌రోడ్డు<br>4) వాసవి ధర్మశాల వాణివిలాస్ రోడ్డు బసవన్గుడి. | గమనిక :<br>ఈ ధర్మశాలల్లో అతి పరిమిత కాలంవరకు మాత్రమే వసతి దొరుకుతుంది. |

**పేయింగ్ గెస్టు వసతులు :**

వివరములు- టూరిస్టు డిపార్టుమెంటు ఆఫీసులో సమాచారం సమగ్రంగా పొందవచ్చు.

**ఇతరంగా :**

1) YWCA గెస్టుహౌస్, ఇన్‌ఫాన్ట్రి రోడ్డు.
2) YMCA (కుటుంబాలకు) 57, మిల్లర్స్‌రోడ్డు.
3) YMCA 31, ఇన్‌ఫాన్ట్రి రోడ్డు.
4) రీజెంటు గెస్టుహౌస్, బ్రిగేడ్‌రోడ్డు.

రిజర్వేషనులు ఆయా మేనేజర్లను సంప్రదించి పొందవచ్చును. పైవాటికితోడు బెంగుళూరులో స్థోమతనుబట్టి హోటళ్ళు అనేకం.

**అతి సామాన్యులకు :**

రైలుస్టేషనుకు, బస్సుస్టేషనుకు దగ్గరిలో :

1) సుధాలాడ్జి, కాటన్‌పేట రోడ్డు.
2) గణేష్‌లాడ్జి
3) సంధ్యాలాడ్జి, బస్సుస్టాండు ఎదురుగా.
4) బస్సుస్టాండు దగ్గరిలోనే- సుదర్శన్ హోటల్

5) కెంపగౌడ సర్కిల్‌కి దగ్గరిలోనే- రామకృష్ణ లాడ్జి.
6) హోటల్ టూరిస్టు, సుబేదార్‌రోడ్డు జంక్షన్‌కలిసే దగ్గర రేసుకోర్సు రోడ్డు లోనిది.
7) దగ్గరిలో హోటల్ సుప్రభాత్.
8) హోటల్ లక్ష్మి, గాంధీనగర్ 2వ అడ్డరోడ్డు.

**శ్రీనరసింహరాజా రోడ్డులో, సిటీమార్కెట్ ఏరియాలో :**

బిలాల్, రెయిన్‌బో, డెల్లీభవన్, చంద్రవిహార్, నటరాజ్, ఇసాకియా.

**మహాత్మాగాంధీ రోడ్డు ఏరియాలో :**

1) హోటల్ అజంతా, 2) హోటల్ బృందావన్, 3) హోటల్ కామధేను.

పై హోటళ్ళన్నీ రోజుకి మనిషి 1కి సుమారు 30/- నుండి 70, 80 వరకు గల శ్రేణిలో.

**మధ్యే మార్గంగా :**

టారిఫ్ రు. 60/- లేక 70/- పైన రోజుకు 170/- వరకు గల శ్రేణిలో
హోటల్ ఆసియా ఇంటర్నేషనల్, 6 OTC రోడ్.
హోటల్ బ్రెరి, 46/1 చర్చ్‌స్ట్రీటు,
న్యూ విక్టోరియా హోటల్, 47-48, రెసిడెన్సి రోడ్,
హోటల్ నీలగిరిస్ నెస్ట్, 171, బ్రిగేడ్ రోడ్,

**శ్రీమంతులకు రోజుకి 150 నుండి 500 రూ. వరకు:**

(1) హోటల్ వెస్ట్‌లాండ్, రేసుకోర్సు రోడ్. ఫోన్ : 29281.
(2) హోటల్ టాజ్ రెసిడెన్స్, M.G. రోడ్, ఫోన్ : 563566.
(3) వెల్‌కం గ్రూపు విండ్సార్ మనోర్, శాంకిరోడ్.
(4) ITDC హోటల్ అశోక్, కుమారకృప (నగరం సెంటరు దగ్గర)
(5) ది బెంగుళూరు ఇంటర్‌నేషనల్, 2 A-B, క్రిసెంటు రోడ్.
(6) కావేరి కాంటినెంటల్, 11/37, కన్నింగ్‌హాం రోడ్, (29350-9)
(7) హోటల్ రామూ, లెవెల్లిరోడ్, ఫోన్ : 53381
(8) హోటల్ హర్ష, 11, వెంకటస్వామినాయుడు రోడ్, శివాజినగర్, ఫోన్ : 565566.

ప్రత్యేక సమాచారం :

(1) కర్నాటక స్టేటు డిపార్టుమెంటు ఆఫ్ టూరిజమ్,
52, శృంగార్ షాపింగ్ సెంటరు, 12-12A, M.G. రోడ్.
ఫోన్ : 579186.

(2) కర్నాటక స్టేటు టూరిస్టు కౌంటరు.
పబ్లిక్ యుటిలిటీ బిల్డింగ్సు, M.G. రోడ్. ఫోన్ . 52377.

(3) కర్నాటక స్టేటు టూరిజమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషను.
10/4, కస్తూరిబా రోడ్, క్వీన్స్ సర్కిల్, ఫోన్ : 578753.

కర్నాటక రాష్ట్ర టూరిజమ్ కౌంటర్లు :

(1) ఎయిర్‌పోర్టు, రిసెప్షన్ కౌంటరు, (2) సిటీ రైల్వేస్టేషను, (3) తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రం, సిటీమార్కెటు బిల్డింగు, ఫోన్: 70022.

ఎయిర్ :

ఇండియన్ ఎయిర్‌లైన్సు, కర్నాటక స్టేటు హౌసింగు బోర్డు బిల్డింగు, డిస్ట్రిక్టు ఆఫీసు రోడ్, ఫోన్ : 79431.

రైలు :

బెంగుళూరు రైల్వేస్టేషను.

బస్సు :

(1) కర్నాటక స్టేటు రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషను.

(a) సుభాష్‌నగర్ బస్సుస్టాండు. (సిటీ రైల్వేస్టేషను ఎదురుగా) ఫోన్ : 23377.

(b) సాగర్‌టాకీసు బిల్డింగు, కెంపగౌడ రోడ్, ఫోన్ : 71480.

బెంగుళూరులో నిర్వహించబడే విహార సౌకర్యాలు :

యాత్ర వివరం :

ప్రతిరోజు ఉ॥ 7-30 నుండి రా॥ 8-30 వరకు. టిక్కట్టు 20/-.

(1) సిటీసైట్ సీయింగ్

బర్డ్ శాంక్చ్యుయరీ (సీజనయితే), సోమనాథపూరు, శ్రీరంగపట్నం, మైసూరు మహానగరం, చాముండీ పర్వతం, బృందావనోద్యానాలు-(లైటింగుతో)

(2) శుక్రవారాలు, ఆదివారాలు మాత్రం—
సమయం. ఉ. 7–15 నుండి సా. 8-30 వరకు. చార్జి. 33/-
శ్రావణ బెలగోల, హళీబేడు, బేలూరు.

(3) ఉదకమండలం శనివారాలు మాత్రం టిక్కెట్టు- రు. 33/-
(సీజనులో మాత్రం) సమయం శనివారాలు-ఉ. 7 గం. నుండి 9 గం. వరకు.

(4) తిరుపతి, తిరుమల, మంగాపురం, కాళహస్తి-చార్జి రు. 80/-
శుక్రవారం నుండి ఉ. 7 గం. నుండి ఆదివారం రాత్రి 8 గం. వరకు

# బేలూరు

యగాచి నదీ తీరంలో సముద్ర మట్టమునకు 1000 మీటర్లు ఎత్తున మనోహరమైన ప్రకృతి అందాలు విరబూసిన చోట ఈ శిల్పకళా విశిష్ట సంపదగల చిరు పట్టణం అమరియున్నది. ప్రకృతి వసంత శోభ వికసిన నందనంలాగా తోపింపజేసే ఈ ప్రదేశం బెంగుళూరుకు 222 కి.మీ. దూరంలో వుంది. ఆనాటి హోయసల రాజుల హోయల వన్నెచిన్నెలు తరగని నిధిగా అడకువగా ప్రదర్శిస్తున్న చిరు పట్టణం.

ప్రపంచ పర్యాటకులను విశేషంగా ఆకర్షించే ఖజురాహో, కోణార్కులకు శిల్ప సంపదలో ఏ మాత్రం తీసిపోని విధంగా ఒక రకంగా చూస్తే మిన్నగా కనబడు తుంది. శిల్పము చాల సున్నితము, భావయుక్తము. గోడలమీద రామాయణ, భారత, భాగవత కథలు చిత్రములుగా చెక్కబడియున్నవి. ప్రతి యంగుళము కళాత్మకంగా మలచిన శిల్పాల ప్రతిభ కొట్టవచ్చినట్లు కనబడే ఈ దేవాలయ నిర్మాత విష్ణుభక్తుడైన విష్ణు వర్ధన మహారాజు క్రీ.శ. 1116లో కట్టించారు. ప్రధాన ఆలయం శ్రీచెన్న కేశవ స్వామి ప్రతిష్ఠతో చెన్న కేశవాలయంగా ప్రసిద్ధి చెందింది. దీనిని నిర్మించిన శిల్పి జక్కనాచార్యుడు చిరస్మరణీయుడు. ప్రధానాలయము ఎత్తుగా ఒక నక్షత్రాకారంలో అమర్చి దానిమీద నిర్మించబడింది. తూర్పువైపున ఉన్న ద్వారము, ఉత్తర, పశ్చిమ ద్వారములు శిల్ప నైపుణికి పరాకాష్ఠ. ఆలయంలోని నవరంగహాలు 136 చదరముతో 20 అ. ఎత్తునగల పైకప్పున ఎన్నో లతలు, పుష్పములు చెక్కబడి ఉన్నాయి. లోపల మోహినీ స్తంభము, నృసింహ స్తంభములు మహత్తరమైన నగిషీలు కమనీయం.

ఆండాళ్ దేవాలయం దక్షిణ ప్రాకారం మీది వేణుగోపాల స్వామి విగ్రహం అతి చక్కనిది. శిధిలావస్థలో ఉన్న ఆలయమును చూచి శ్రీకృష్ణరాజ వడయారు పునరుద్ధరించారు. ఆవరణంలోనే కప్పె చెన్నిగరాయ ఆలయం గణేశ్, దుర్గ, సరస్వతి దేవేరులతో అందమైన శిల్పాలను పొందు పరిచియున్న ఆలయం దర్శనీయం.

## హళిబేడు

బేలూరు నుండి 16 కి.మీ. దూరం. హోయసల రాజుల మరో రాజధానిగా శోభిల్లింది. ఆనాటి ప్రముఖ వ్యాపార కేంద్రమై మహోన్నత దశ ననుభవించిన పట్నం. 1327లో దండెత్తిన మహ్మద్‌బిన్ తుగ్లక్ ధ్వంసం చేశాడు.

ఇక్కడ మహోన్నత శిల్పకళను వెలార్చే హోయసలేశ్వరాలయం. (శివాలయం) కేదారేశ్వర ఆలయం హిందూ దేవతల విగ్రహాలు, చిత్రాలు అణువణువు పులకింపజేసే సుందరమందిరానికి ప్రపంచ కళాస్రష్టలు సైతం సీరాజనాలెత్తిన చోటుగా గణ్యం. ఇక్కడి శిల్పాలు హోయసలుల రమణీయ భావనా చమత్కృతిని భావగర్భితంగా మనోజ్ఞంగా రాణకెక్కి శిల్పచరిత్రలో ఉత్కృష్టతను సాధించింది. ఒక శిల్పానికి మరో శిల్పానికి పోలిక వుండదు. ప్రతి అణువూ మధుర భావనా నిష్యందనా స్యందనం. మానవునిలో మహత్తర శక్తి, విశ్వాసములు మనోహర శిల్పాకృతి దాల్చి మహా మనీషిత్వమును చాటుతున్నవి. ప్రపంచ కళారాధకుల అభిప్రాయం చూస్తే ఏథెన్సులోని పార్థినాన్‌ను మించిపోయిందని, దీనికిసాటి వేరొకటిలేదని తెలుస్తుంది. ఆనాటి భారతీయ శిల్ప శాస్త్రజ్ఞుల ప్రతిభా విశేషములు ఖండ ఖండాతరరాల యశశ్చంద్రికలను ప్రసరింప జేయగల కళాఖండము. శిధిలావస్థలో ఉండటం మన దురదృష్టం.

ఆలయ ప్రాంగణంలోనే ఆర్కియాలజికల్ మ్యూజియం ఒకటుంది. దానిలో విశేష ప్రతిభను వెలార్చి ప్రాచీన వైభవాన్ని చాటే కొన్ని ఖండికలను ప్రదర్శిస్తున్నారు.

## శ్రావణ బెలగొల

ఇంద్రగిరి, చంద్రగిరి మధ్యలో అమరివున్నదీ జైనమతస్థుల ముఖ్య తీర్థయాత్రా స్థలం, పవిత్ర పుణ్యక్షేత్రం. బేలూరు, హళిబేడులతో పోలిస్తే శిల్పము చాలా సీదాసాదాగా కనబడుతుంది. 'శ్రావణ బెలగొల' అంటే 'మహోన్నత పర్వ

తం మీద మహానుభావుడు' అర్థం, ఈ క్షేత్ర ప్రాశస్త్యాన్ని గురించి తెలుసుకోవాలంటే బహు విలంబిత పూర్వ చరిత్రలోకి వెళ్లాలి. క్రీ.శ. 3వ శతాబ్దం వెనుకకు వెళ్లి చంద్రగుప్త మౌర్యుడు, ఆయన గురు దేవులు భద్రబాగు స్వామిల దగ్గరకు తీసుకెళుతుంది. మౌరసామ్రాజ్యాధినేత శ్రీ చంద్రగుప్త మౌర్యుడు రాజ్య పరిత్యాగం చేశాక గురుశ్రీ భద్రబాగు శిష్యులయినారు. భద్రబాగుస్వామి శిష్యులు దేశం నలు చెరగులా జైనమత వ్యాప్తిని చేశారు. అదే విధంగా ఇక్కడ దక్షిణ ప్రాంతంలో గూడ బహుళ ప్రచారం గావించి పటిష్టమైన పునాదిని వేయటం జరిగింది. నలు గురు శిష్యులు ఇద్దరూ ఆ సమయంలో ఇక్కడికి వచ్చి కొన్నాళ్ళు ఇక్కడ నివసించారు. తదుపరి 4 నుండి 10 శతాబ్దం ప్రాంతంలో కర్నాటకను పాలించిన గాంగ రాజుల జైనమతావలంబనచేసి పటిష్ఠం చేశారు. గాంగ వంశపు రాజైన రాచమల్లుడు బహుబలి విగ్రహం 'అదిస్తనేమి' అనే శిల్పి తయారుచేసిన ఈ గొప్ప విగ్రహాన్ని క్రీ.శ. 981లో రాచమల్లు సేనాని తన సైన్య సహాయంతో విగ్రహావిష్కరణం చేశారని చెపుతారు.

ఇంద్రగిరి పర్వతాగ్రాన గోమతేశ్వరుడు లేక బహుబలి ప్రభు విగ్రహం 57 అడుగులి ఎత్తున వున్నది. ఇంత పెద్ద ఏకశిలా విగ్రహం ప్రపంచం మొత్తంమీద ఎక్కడాలేదని అంటారు. జైనమత వ్యవస్థాపకులలో ఆది పురుషుడైన వృషభ దేవునికి ఇద్దరు కుమారులు. బాహుబలి, భరదుడు. వృషభదేవుడు రాజ్యాన్ని వదలి తపస్సుకోసం అరణ్యాలకు వెళ్ళగా రాజ్యం పంపకాల విషయంలో తగాదాలు వచ్చి ఇద్దరూ యుద్ధం చేసుకున్నారు యుద్ధంలో బాహుబలి గెలిచాడు. అయితే విజయంతో పాటు మనస్సు ప్రాపంచికాలమీద విరక్తిచెంది వైరాగ్యభావం వరించింది. అన్నీ భరతునికి వదిలేసి ఘోరమైన తపస్సు చేయటానికి అరణ్యాలకు వెళ్లాడు.

దీనికితోడు ఈ కొండల మధ్య ఉన్న చిరు గ్రామంలో అనేక జైన దేవాలయాలున్నాయి. గోమతేశ్వరుని విగ్రహం ధ్యానమగ్నుడైన యతి మాదిరిగా చేష్టలుదరి సర్వము త్యజించిన వైరాగ్యమూర్తియైన దిగంబరేశ్వరుడయిన స్వామి విగ్రహం విశాల వక్షస్థలం గలిగి అన్ని అవయవములు పరిపుష్టంగా వుండి నిర్వ్యాజత్వమును ప్రకటించే విధంగా సర్వసంగ పరిత్యాగియై సర్వాంతర్యామి తత్త్వమును దర్శిన మహామనిషిగా నిమీలిత నేత్రుడై యున్నట్లు చెక్కబడింది. కాళ్ళు పద్మము నందుడినట్లు చెక్కబడింది. శ్రావణ బెళగొల చాల చిన్న వూరు ప్రతి 12 సంవత్సరాలకు ఒకసారి మహామస్తకాభిషేకం జరుగుతుంది. కనుల పండువగా మహావైభవంగా

జరుగుతుంది. మూల మూలల నుండి యాత్రికులు లక్షలాదిగా ఈ ఉత్సవాల్ని తిల కిస్తారు. ఇటీవల 1981లో జరిగిన మహామస్తకాభిషేకోత్సవం సహస్రాబ్దోత్సవం రెండూ కలిసి వచ్చాయి. మస్తకాభిషేకం చేయాలంటే ఇంత పెద్ద విగ్రహం తలమీది నుండి కడవల కొద్దీ పాలు, పెరుగు, వెన్న, నేయి, అరటిపండ్లు, చందనం వగయి రాలతో అభిషేకించాలంటే విగ్రహం నిలువెత్తునా పెద్ద పరంజా వేసికొని చేయాల్సి వుంటుంది ఈ మహోత్సవం తిలకించటానికి దాదాపు పదిలక్షలు పైగా యాత్రికులు వచ్చి దర్శించారు ఉత్సవం తిలకించటానికి వచ్చిన ప్రజలకు వుండటానికి ప్రత్యేక ఏర్పాట్లు గొప్పగా జరిగాయి చుట్టూరా ఉప పట్టణాలు అనేకం వెలిశాయి. పూర్ణ పుత్సవానంతరం మళ్ళీ మామూలు. 1993 తరువాత గాని మరల మహామస్తకాభి షేకం జరుగదు. నిరీక్షిద్దామా! లేక ఈ లోపలే వెళ్ళి విగ్రహ విశేషాన్ని ఒకసారి చూచి వద్దామా! మీ యిష్టం. కాని ఎప్పుడైనా వెళ్ళి చూడవచ్చు. కొండ క్రిందనే ఉన్న రిసెప్షను సెంటరులో మహాబాహుబలి విగ్రహం ఫోటోను అమ్ముతారు. కార్డు సైజు రు. 1/- కర్నాటకలో అన్ని ప్రధాన నగరాల నుండి బస్సులున్నాయి. బెంగు ళూరు నుండి 160 కి.మీ. బేలూరు నుండి 88 కి.మీ. హాళీబేడు నుండి 102 కి.మీ. మైసూరు నుండి 93 కి.మీ. దూరం వుంది.

## మైసూరు

మైసూరు అనగానే వైభవోపేతంగా జరిగే దసరా మహోత్సవాలు, ఊరేగింపు ఉత్సవంలో రాజావారు ఏనుగు అంబారీ మీద ఊరేగుతూ పాల్గొనడం లక్షలాది మంది యాత్రికులు విశేషంగా తిలకించటానికి నలుమూలల నుండి ఉత్సాహంగా వ్యయ ప్రయాసలకోర్చి వెళ్ళడం, మహావైభవం కళ్ళముందు నడయాడుతూంది.

స్వతహా మైసూరు మహానగరం అంతా చందనాగరు సుగంధ సమ్మిశ్రితమై నదిగా పేరు. భగవంతుని ఎక్కడ ఆరాధించినా చందనాగరు ధూపం వేయాల్సిందే. అగరువత్తులు రకారకాల సువాసనలు వెదజల్లేవి శ్రేష్ఠమైనవి ఇక్కడ తయారయేవే శ్రీకృష్ణభగవానుని జయదేవుని అష్టపదుల్లో సైతం 'చందన చర్చిత నీలకళేబర పీత వసన వనమాలి'గా కీర్తించాయి. మనిషి జీవితంలో చందనం ప్రాముఖ్యం అంతు లేనిది.

మైసూరు స్వతంత్రం వచ్చేంతవరకూ మహారాజు సంస్థానానికి ముఖ్య పట్టణం. మహారాజ నివాస స్థలం సముద్ర మట్టానికి 2,500 అడుగుల ఎత్తునవున్న ప్రదేశంలో అమరియున్నది.

మైసూరు అద్వితన కాలంలో నిర్మించబడిన అత్యద్భుత భవన శ్రేణితో, భువన మనోహరమైన నందనోద్యాల సముదాయంతో అలరారే అందాల పట్టణంగా ప్రసిద్ధి. మైసూరు అనే పేరు మహిషాసురుని పేర బరగిన పట్టణమయి కాల క్రమేణా మహిషూరు 'మైసూరు'గా మారిందని ప్రతీతి. మహిషాసురుడు మహా బల వంతుడు అయిన రాక్షసుడు. వరబలదర్ప గర్వితుడై ప్రజా కంటకుడుగా మారిన వానిని సంహరించుటకు పరమేశ్వరి శ్రీ దుర్గాదేవి అవతారమెత్తి సంహరించింది. ఈ దేవినే మహిషాసుర మర్దని చాముండేశ్వరిగాను ఆరాధనీయమైన దేవతగా ప్రసిద్ధి. శ్రీ చాముండేశ్వరి ఆలయం (చాముండేశ్వరి పర్వతం పైన వెలసిన దేవి) మైసూరు ప్రభువులకు కులదైవమై ఆరాధ్య దైవమయినది. కొండ సముద్ర మట్టానికి సుమారు 1200 మీటర్లు ఎత్తున వున్నది. ఆలయం దర్శనానికి వీలుగా కొండపైన రోడ్ మార్గం వుంది. బస్సులో వెళ్ళవచ్చు. శుక్రవారాలు, మంగళవారాలు అమ్మవారికి విశేష అలంకారాలు చేస్తారు. శరన్నవరాత్రములలో జరిగే దేవీనవరాత్రులు మహా వైభవంగా జరుగుతాయి. ఇంత వైభవంగా దేశం మొత్తంమీద మరెక్కడా జరగవని ప్రతీతి. కొండమీదికి ఎక్కేమెట్లు 17వ శతాబ్దంలో దొడ్డరాజానావు నిర్మించినట్లుగా చెపుతారు.

ఇక్కడ వున్న నందీశ్వర శిలా విగ్రహం 16 అ. ఎత్తున ఏకశిలా నిర్మిత మయినది. 300 సంవత్సరములనాడు నిర్మించబడిన సజీవకళ ఉట్టిపడుతున్న శిల్ప రాజం. నందీశ్వరుని మెడలోని మువ్వల పట్టెడ, చిరుగంటలు, అవయవాలు అన్నీ అద్భుత శిల్ప చాతుర్యాన్ని వెలార్చేవిగా ఉన్నది. మూడోవంతు మెట్లెక్కేసరికి సమున్నతంగా కనబడుతుంది. తంజావూరు, చిదంబరంలో నందీశ్వరుల విగ్రహాలకు దీటుగాగలిగినదై ఒక్కోసారి చూపరులను సౌందర్యంలో మించినదా అన్నంత ఆశ్చర్యాంబుధిలో ముంచివేస్తుంది.

మైసూరు పట్టణం చాల అందమయినది. విద్యుద్దీపముల వెలుగులు నిరంతరం పట్టణాన్ని శోభాయమానంగా మెరిసే తారకలాగ తోపింపజేస్తుంది. చూపరులకు మహాకర్షణీయంగా వుంటుంది. చూడదగినవిగా-

చాముండేశ్వరాలయం 1827లో పునరుద్ధరించబడి సింహ వాహనాదులతో

పాటుగా సంస్కృత భాషలో బంగారు నక్షత్రమాల సమర్పించారు ఒడయారు మహారాజు. దేవాలయ సమీపంలో రాజు, రాణీ గార్ల విగ్రహాలు నెలకొల్పబడియున్నవి దర్శనీయం.

## మైసూరులో చూడదగినవి

**మహారాజా వారి భవనం :**

ఈ శతాబ్దపు తొలినాళ్ళల్లో నిర్మించబడింది. హిందూ-ముస్లిము సాంప్రదాయ నిర్మాణ వైచిత్రితో నిర్మించబడిన మహాద్భుత భవనరాజం. హైందవ శిల్పాలు, దంతము, కొయ్యలతో చేసిన నగిషీ పనుల సామానులతో, అనేక వర్ణ చిత్రాలు అలంకరించబడి యున్నవి. దర్వాజాలమీద, తలుపులమీద వెండి, బంగారం వంటి విలువైన లోహములుపయోగించి దంతపు తాపడాలు చేసి నగిషీ పనులతో అమర్చినవి చూడవలెనేగాని చెపితే తీరదు. చిత్రవిచిత్రములైన అద్దాల మందిరం చూచి తీరవలసిందే. రాజసంఉట్టిపడే విలాసవంతమైన భవనం. ప్రతి యంగుళం ఆశ్చర్యం గలిగించేదే! భవనంలో పూర్వపు రాజులు వాడిన ఆయుధ విశేషాలు, ఫిరంగులు వగయిరాలు గూడా దర్శనీయం. భవన దర్శనానికి ముందుగా అనుమతిపొంది ప్యాసు సంపాదించాల్సి వుంటుంది.

**లలితామహల్ :**

రాజావారి తాల్కు మాననీయులైన అతిధులు విడిసే భవనం. జగన్‌మోహన్ ప్యాలెస్‌లోగల ఆర్టు గ్యాలరిలో అనేక చిత్ర పటాలు ఎంతో మంది కళాకారుల దివ్య సృష్టితో మనోహరమైన చిత్ర పటాలు, సంగీత వాయిద్యాలు రకాలకాలు భద్రపరచబడిన కళానిలయం. రాజభవనం కట్టించే సమయంలో మహారాజావారు ఇందులో కొన్నాళ్ళున్నారట.

ఆర్టు గాలరిలో సజీవకళతో ఉట్టిపడే చిరు దీపమును చేతబట్టుకొని ఉండే చిత్రము చూడబోతే ఆ చిత్రములోని మహిళే మన దగ్గరకు వస్తున్న భ్రాంతికి లోనవుతాము. మహాశ్చర్యకారకమైంది.

మహారాజ భవనంలోని దర్బారుహాలు, కళ్యాణ మండపం– ఇందులో దసరా ఊరేగింపు వైభవదృశ్యాలు కుడ్యచిత్రాలుగా మలచబడినవి దర్శనీయం. అద్భుతమైన బంగారు సింహాసనము మ్యూజియంలో చూడగలము.

ప్రభుత్వమువారి నిర్వహణలో శాండల్‌వుడ్ ఆయిలు ఫ్యాక్టరీ, మైసూరు

సిల్కు ఫ్యాక్టరీలతో శ్రీ రాజేంద్ర టెక్నికల్ ఇన్‌స్టిట్యూటుగా ప్రసిద్ధి చెందిన వాటితోపాటు—

**రాజేంద్ర జులాజికల్ పార్కు :**

వన్యమృగాలు సైతం స్వేచ్ఛగా విహరించునట్లుగా ఏర్పాటు చేసియున్నారు. స్వాభావిక పర్యావరణంలో సహజసిద్ధమైన కదలికలతో జీవజంతువులను చూడగలం.

ఒంటికుప్పెలోగల శ్రీరామకృష్ణ మఠము గూడ దర్శనీయం.

మైసూరు మొత్తమును చూడటానికి రెండు రోజులు పడుతుంది. ఇందులో దగ్గరిలోవున్న శ్రీరంగపట్నం కూడా వెళ్ళి రావచ్చును.

## శ్రీ రం గ ప ట్నం

మైసూరుకు 12 కి.మీ. దూరంలో ఉన్న ఈ ప్రదేశం టిప్పుసుల్తాను ప్రాసాదంలో అత్యంత చారిత్రిక ప్రాధాన్యత సంతరించుకున్నది. కావేరినది రెండు పాయల మధ్యన ఉన్న దీవిలాంటి దానిలో అమరియున్నది. మహిమాన్విత కావేరి పట్టణం చుట్టూ ప్రవహిస్తున్నది. టిప్పుసుల్తాన్ వారికోట వేసవి మకాము యిక్కడ వున్నదంటారు. గౌతమ మహర్షి ఇక్కడ తపస్సు చేసినట్లుగా పురాణ ప్రశస్తి వుంది. క్రీ.శ. 894 సంవత్సరంలో శ్రీ తిరుమలరాయుడు రంగనాదుని ఆలయం నిర్మించి రంగపురంగా వెలయింపజేశాడు. శ్రీరంగపట్నం 1120లో విష్ణువర్ధనుని సోదరులు ఉదయాదిత్యుడు కట్టించాడని ప్రతీతి. 1495 శ్రీరంగపట్నం విజయనగర రాజుల ఆధీనంలోకి వచ్చి, 1610లో మైసూరు రాజు ఒడయారు వశం చేసుకొన్నారు. తరువాత మహమ్మదీయులైన హైదర్అలీ, టిప్పు సుల్తానుల కాలంలో వారి ఆధీనంలో ఉండి తరువాత 1799లో బ్రిటిషువారి హస్తగతమయింది. ఇక్కడ ముఖ్యంగా చూడదగినవి -

టిప్పుసుల్తాన్‌వారి వేసవి విశ్రాంతి భవనం. చిత్రకళ అందంగా పొందుపరచబడింది. హైదర్అలీ, ఆయన భార్య సమాధులున్నాయి. దానిపై రెండు ఎత్తయిన గోపురాలు నిర్మించబడినాయి. ఈ భవనం అమరియున్న తోట దరియాదౌలత్ బాగ్‌గా పిలవబడుతుంది.

**శ్రీరంగనాథుని దేవాలయం :**

ద్రావిడ శిల్పరీతుల్లో నిర్మించబడిన ఈ ఆలయము మహమ్మదీయుల కాలంలో

గూడ పోషించబడి అనేక జాగీర్లు యిచ్చినట్లు ప్రతీతి. విశిష్టాద్వైత మతాచార్యులు శ్రీరామానుజుల వారు ఇక్కడ కొంతకాలం ఉన్నారట. స్వామివారి పాదాలచెంత గౌతమ మహర్షి చిత్రమును చూడగలము. శ్రీరంగనాధుడు ఆదిశేషునిమీద పవళించి యున్నట్లుగా ఉంటాడు.

ఆలయ సమీపంలోనే కోట. కోటలో మసీదు. మసీదులో పర్షియాభాషలో శాసనాలు టిప్పుసుల్తాను బ్రిటిషు ఆఫీసులను బంధించిఉంచిన చీకటికొట్లు దర్శనీయం.

స్టేషనుకు వెనుకగల కోటగోడలకు బ్రిటిషువారి ఫిరంగిదెబ్బలు చూడవచ్చును శ్రీరంగ పట్టణమునకు దిగువనే ఉన్నవి.

**సోమనాధపూర్ :**

35 కి.మీ. దూరం. ఆంగ్ల చారిత్రికులు ఫెర్గూసన్‌గారి అభిప్రాయం ప్రకారం బేలూరు, హళిబేడులను మించిన శిల్పసోయగాలు నిక్షిప్తం చేసుకున్నదిగా అభివర్ణించబడింది. హోయసల రాజుల ప్రధాన సైన్యాధికారి సోముడు అనే వారిచే శిల్పశాస్త్ర ప్రవీణుడుగా గణుతికెక్కిన జక్కనాచార్యునిచే నిర్మింపజేశారు. 1268లో కట్టబడింది. ఆలయంలో పిరమిడు ఆకారంతో మూడు డోములతో నిర్మించబడింది. త్రిమూర్తుల ఆలయంగా భాసిస్తుంది. మధ్యలో చెన్నకేశవస్వామి, ఒకవైపు వేణుగోపాల స్వామి రెండవవైపు జనార్ధనుడు ఉన్నారు. దేవాలయ కుడ్యముల మీద మలచిన శిల్పాలుఅతి సున్నితంగా గుడ్డమీద లేసులల్లినట్లు లతలు, భారత, భాగవత, రామాయణ కథలు చిత్రవిచిత్రంగా మలచబడ్డాయి. బయట గోడలమీద మహత్తరమైన శిల్పనైపుణ్యమును వెలార్చే పెద్దపెద్ద విగ్రహాలు దాదాపు 190 పైగా ఉన్నాయి.

## శివసముద్రం

సోమనాధ పురంనుండి 27 కి.మీ దూరం. గొప్ప జల విద్యుత్కేంద్రం. మైసూరునుండి అయితే 80 కి.మీ. దూరం. ఇక్కడ కావేరి రెండుగ చీలింది. దాదాపు 200 అడుగుల ఎత్తునుండి క్రిందకు దుముకుతూ ప్రవహిస్తుంది. ఈ రెండు పాయల మధ్య ఏర్పడిన పట్టణం శివసముద్రం. ప్రాంతమంతా ప్రకృతి సౌందర్యంతో అలరారుతుంది. ఉత్తర ప్రవాహం గంగచుకి అని, దక్షిణ ప్రవాహమును బార్‌చుకి అని అంటారు. చుట్టూ కొండలు, అరణ్యాలు ఉన్నాయి పట్టణంలో రెండు దేవాలయాలున్నాయి. గంగచుకి మార్గంలో పీర్‌సాహెబ్ దర్గా ఉంది. దర్శనీయం.

బందిపూర్ శాంక్చువరీ :

మైసూరు నుండి 80 కి.మీ. దూరంలో నైఋతి దిశన ఉంది. ఒకానొకప్పుడు మైసూరు రాజుల వినోదార్థం వేటకువెళ్ళే అడవి ప్రాంతం. ఈ అటవీ ప్రాంతం ఇప్పుడు వన్యమృగ రక్షణా శరణ్యకేంద్రం. రిజర్వుడు. ఈ వన్యమృగాలను చూడ టానికి ప్రత్యేకంగా అమరియున్న కారుగాని, లేక ఏనుగుసముమీద అడవిలో తిరిగి చూడవచ్చు. అయితే ముందుగా అనుమతి పొందాలి. పర్మిషనుకు : ఫీల్డు డైరక్టరు, ప్రోజెక్టు టైగర్, గవర్నమెంటు హౌస్ కాంప్లెక్సు, మైసూరు వారిని సంప్రతించాలి.

మైసూరుకు వాయువ్య మూలగాఉన్న కృష్ణరాజసాగర్ డామ్, బృందావనో ద్యానం- మైసూరు నుండి అరసకెరి లైనులో వున్నది. 130 చ.మై. వైశాల్యంగల పెద్ద రిజర్వాయరును నీటిని నిలువచేయటానికి జలాశయము ఏర్పరచారు. డాముకు దిగువభాగంలో నీటిధారల్లో రంగురంగుల ఎలక్ట్రిక్ దీపాలతో బహుమనోజ్ఞంగా ఏర్పాటు చేయబడి భూతలస్వర్గం, ఇంద్ర లోకంలోని దేవేంద్ర వైభవాన్ని తలపించే నందనోద్యానాన్ని తలదన్నే విధంగా మానవ నిర్మితమైన మనోహర సౌందర్యరాశిగా కొనియాడబడినవి. ప్రతి శని, ఆదివారములు, దసరా, క్రిస్మస్ మొదలగు పర్వదిన ములందు మాత్రమే నీటిలో వెలుగు కాంతులను ప్రసరింపజేసే విద్యుద్దీపములు వెలి గించుతారు. డాముకు దిగువనే కృష్ణరాజసాగర్ హోటలు కూడా ఉన్నది. ఈ వసతి గృహంలో బసచేసి క్రింది నీటియూటలను (ఫౌంటెన్‌లను) చూడవచ్చు. భారత దేశంలో ముఖ్యంగా దక్షిణాదిన ప్రేమజంటల ప్రణయగీతికా సన్నివేశాలు అనేకం సినిమాలలో సందర్భశుద్ధితో మనోజ్ఞంగా ఎన్నో విధాలుగా చూపించారు.

మేలుకోట :

48 కి.మీ. దూరంలో అమరియున్న ప్రసిద్ధ విహారయాత్రా స్థలం. మేలు కోట అంటే ఎత్తుగా ఉన్నకోట అని అర్థం. యదుగిరి అనే కొండ, కొండ క్రింద కావేరి, ముత్యాల సరస్సు ఉన్నాయి. గొప్ప పుణ్యక్షేత్రం. వైష్ణవుల పురాణాల్లో అతి పవిత్ర స్థలంగా పేర్కొనబడింది. ఇక్కడ నెలకొనియున్న ఆలయాలు- నృసింహ నారాయణాలయం- యదుగిరిమీద ఉన్నది. శ్రీరామానుజాచార్యులు ఇక్కడ సుమారు 14 సు॥ ఉన్నారట. ఇక్కడనే జైనమతావలంబి అయిన హోసలరాజును విష్ణుమతస్థులుగా మార్చగా ఆయనే విష్ణువర్ధనుడుగా పేరు గాంచినవాడు ఆయన తన మహిమ లనేకం ప్రదర్శించిన చోటు. ఈ ఆలయమును రామానుజులవారు హరిజనుల దర్శనార్థం కూడా స్వేచ్ఛ విడిచినట్లుగా ప్రతీతి.

మహారాజులు సమర్పించిన అనేక వెండి, బంగారు వస్తువులు స్వామిసేవలో నిత్యము ఉపయోగించబడుతున్నాయి. ఫాల్గుణ మాసంలో వచ్చే పుష్యమీ నక్షత్ర దినాన వైరముడిసేవ మహోత్సాహంగా జరుగుతుంది.

**వైష్ణవులకు తెల్లటి పట్టినామాలకు నామము :**

రామానుజాచార్యుల వారికి స్వప్నంలో కనిపించి ఆ ప్రాంతపు అడవిలో ఒక 'నామ'గని ఉందని, అక్కడొక స్వామి విగ్రహం ఉన్నదని తెలిపారట. అలాగే రాజుగారిని తోడుకొని విగ్రహానికి ఒక ఆలయం నిర్మించటం జరిగింది. ద్వారకలో గోపీతలావులో గోపీచందనం, దక్షిణదేశంలో పవిత్రమైన ఇక్కడి నాముని ధరించి సంప్రదాయ చిహ్నంను తెలియజేయటం జరుగుతుంది. ఇక్కడ పవిత్ర పుష్కరిణిలు 13 వున్నవి.

**మాండ్యా :**

జిల్లాకు ముఖ్య పట్టణం. పెద్ద పంచదార ఫ్యాక్టరీ ఒకటున్నది. దేశం మొత్తం మీద ఆనాటికి రెండవదిగా గుర్తింపు. ఇక్కడ హుళికెరె అనేచోట కొండల్ని తొలిచి కాలువ నేర్పరిచి నీటిని ప్రవహింపజేశారు. ఇది నాటి ఇంజనీరు శ్రీ విశ్వేశ్వరయ్యగారి నిర్మాణ నైపుణికి నిదర్శనం.

**ముళుబాగల్ :**

తిరుపతి వెళ్ళే మార్గంలో ద్వారసమానమైంది. ఫకీరు హైదరువలి దర్గా ఉంది. ఉర్సులకు అనేకమంది యాత్రికులు వస్తుంటారు.

**కుడుమేలె :**

ముళుబాగల్‌కి 6 కి.మీ. దూరంలో ఉంది. సోమేశ్వర, గణేశ దేవాలయాలున్నాయి. ఆలయ నిర్మాణం జక్కనశిల్పి చేతులమీదుగా జరిగిందని ప్రతీతి. దేవతలు త్రిపురాసురులు మీదికి దండెత్తి వెళ్ళినపుడు ఈపర్వతంమీద కలుసుకున్నారట కనుకనే కుడుమేలి అనేపేరు కలిగిందని చెప్తున్నారు. తిరుపతి యాత్రికులు నృసింహ తీర్థంలో స్నానంచేసి కొంతమంది క్షురకర్మను గూడ యిక్కడనే పూర్తి చేసుకొని వెళ్తుంటారు. దేవతలు కూడిన స్థలం కనుక "కుడుమలై"లో జరగటం కదువింత అయినది. ఇంకా ఇక్కడికి దగ్గరిలోనున్న అవని, ఆగుంబె, కైదల, పూర్వనామం క్రిదపురమని పిలువబడే ఈ గ్రామమే మహాశిల్పి జక్కన పుట్టిన పుణ్యస్థలి, దేవనహళ్ళి-టిప్పుసుల్తాను జన్మస్థలంగా పేర్కొనబడింది. శివగంగ, విదురాశ్వత్థము— అనే పురాతన రావిచెట్టు వీటున్నవారు దర్శించదగిన స్థలాలు.

# హంపీ - విజయనగరం

బెంగుళూరు నుండి 408 కి.మీ. దూరంలో ఉంది. ఆంధ్రప్రదేశ్‌లోని గుంటకల్-హుబ్లి మార్గంలో అయితే దగ్గరగా వుంటుంది. హోస్పేట దగ్గరగా దిగి వెళ్ళవలసివుంటుంది. తుంగభద్రా నదీతీరంలో హంపి ఒక చిన్న కుగ్రామం. దక్షిణతీరంలో ఉన్న పంపాపతి ఆలయం చుట్టూ ఏర్పడిన గ్రామం. విజయనగర సామ్రాజ్యం రాజధాని అయిన విజయనగరమునకు అతి దగ్గర. విజయనగర పట్టణం పూర్తిగా శిథిలమైనది. ఒకానొకప్పుడు విశాలమైన కర్నాటక ఆంధ్ర సామ్రాజ్యానికి తలమానికంగా ఎన్నో గుహలు, ఆలయములు, కోట బురుజులు, రాజభవనాలతో ఎటు చూచినా తొమ్మిదిమైళ్ళ పర్యంతం వ్యాపించియున్న మహానగరంగా ప్రసిద్ధిచెంది నేడు చరిత్ర పుటల అడుగున కాలగర్భంలో మరిచిపోయిన మహోన్నత వైభవాలకు చిహ్నం. ఈ నగర శిథిలాలను చూడాలంటే కమలాపురం వెళ్ళాలి. మార్గమధ్యంలో 'అనంత స్వామి ఆలయం' ఉంది. 350 సంవత్సరాల క్రితం శిథిలమయిన ఈ నగర విశేషాలు చూస్తే ఆనాటి స్వర్ణయుగపు శేముషీ వైభవాలు తలపుకివచ్చి మనస్సుకలుక్కుమనక తప్పదు. 1336కు ముందు హిందూ రాజ్యాలు- రాజ్యాలనేలిన రాజులు శాశ్వతత్వం కోసం చేసిన ఎన్నో జ్ఞాపికలు మనకున్నాయి- మధురలో పాండ్యులు, తంజావూరులో చోళులు, ఇంకా ఎందరో ఎన్నో రకాలయిన చిరస్మణీయంగా నిలిచేట్లు చేసి కోగలిగారు కాని విజయనగర సామ్రాజ్యం ఆవిర్భవించి అంతలోనే చరిత్రగర్భంలో కలిసిపోయింది. శిథిలమయి విశీర్ణమయి పోయింది. నాటి గంభీరమైన కొన్ని శిథిలాలయాలు హంపీవద్ద చెల్లాచెదురుగాపడి వుండటం చూస్తే కంటనీరు రాకమానదు.

హంపికి దగ్గరిలో కిష్కింధ పట్టణం వున్నదనీ, మతంగమహర్షి నివసించిన మహాపర్వతానికి మాతంగ పర్వతమనీ రామాయణ కథకు ఎంతో సన్నిహిత సంబంధంగల వాలి, సుగ్రీవులు, రామభక్తహనుమాన్ శ్రీరాములవారికి ప్రథమ పరిచయంగా కలవటం, పురాణ ప్రశస్తిని తెలియజేస్తుంది. ఈ శిథిలాలలో ముఖ్యంగా మనకు కనబడేవి-

## పట్టాభి రామాలయం :

1530-42 సంవత్సరాల్లో అచ్యుతరాయలు నిర్మించిన గొప్ప ఆలయం. ముంగిట పెద్ద ఆవరణ కలదు.

**హజార రామాలయం :**

శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు కట్టించిన దేవాలయం. ఆంధ్ర చరిత్రలోను, తెలుగు సాహిత్యంలోను అభినవ భోజుడుగా కీర్తించబడి, మహోన్నత కీర్తి శిఖరాల నందుకున్న మహాచక్రవర్తి విజయనగర రాజవంశీయులలో మణిమకుటం. ఆయన పరిపాలించిన కొద్ది సంవత్సరాలే ఈ ప్రాంతం మహోన్నత దశ, వైభవాలను చవి చూచి అంతలోనే కనుమరుగయి పోయిన మహా సామ్రాజ్యావశేషాల గురించి ఏమని చెప్పగలం? ఎంతని వివరించగలం? ఆలయం గోడల వెలుపలి భాగాల్లో ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు, మామూలు మనుషుల చిత్రాలు శిల్పాలుగా మలచితుంటే, లోపలి వైపున రామాయణ, మహాభారత కథాదృశ్యాలను హృద్యంగా శిల్పీకరించ బడినాయి. రాజుల రాజ్యాలు, వైభవాలు కాలగర్భంలో కలిసిపోయిన వెన్నో !

**నారసింహ :**

ఏకశిలలో మలచబడిన శ్రీమహావిష్ణువు నరసింహావతారపు మూర్తి.

ఈ శిధిల భవనాల సముదాయంలో ఇంకా ఆనాటి రాణీవారు జలకమాడేచోటు, సంతోష సమయాల్లో తిరిగ్గా విశ్రాంతి తీసికొనేచోటు, విజయభవనం, సింహాసనం అమర్చేవేదిక దర్శనీయాలు.

ఆంధ్ర భోజునకు ఆలయాలు, శిల్ప కళాఖండాలు మిగలకపోయినా, తెలుగు సాహితీరంగంలో నిరంతరం ప్రకాశించే వెలుగుకిరణమై, కావ్యదీపమై జాతి హృదయాల్లో శాశ్వతంగా గూడుకట్టుకుని నిలచిపోయారంటే అంతకంటే గర్వోన్నతింకేమి కావాలి ? మనుషులు కట్టుకునే గూళ్ళకన్నా మనుషుల హృదయాల్లో గూడు కట్టుకోవటం మహత్తరం కాదా !

# బీజపూరు

మహమ్మదీయులు రాకముందు హిందూ రాజులు ఘనంగానేలిన ఈ ప్రదేశం బెంగుళూరుకు 613 కి.మీ. దూరం ఉంది.

**ఈలోపల ఒకచిన్న కథ :**

ఆదిల్‌షా వంశస్థాపకుడైన యూసఫ్ టర్కీసుల్తానుకు ఒక కుమారుడు. ఒక ప్రత్యేకమయిన మూఢాచారం ప్రబలి ఉందక్కడ— రాజ్యార్హుణ్ణి తప్ప మగతా కుమారులందరినీ సుల్తాను మరణానంతరం చంపి వేయాలన్నదే అక్కడి ఆనాటి

సదాచారం। ఈ దీని ప్రకారం యూసఫ్ చంపి వేయబడాలి. యూసఫ్ తల్లి మమకారంతో తనయుడ్ని తప్పించి ఒక బానిసకొడుకుని తలారుల కలదించిందట. బిడారు వ్యాపారుల గుంపుతో ఇండియాకు తప్పించుకుని వచ్చాడు. బహమనీ సుల్తానుల కొలువులో చేరి తరువాత ఆదిల్‌షా అనే బిరుదుతో రాజయ్యాడు. ఈ ఘట్టం 15వ శతాబ్దాంతానికి జరిగినది.

ఆదిల్‌షా కోట శిథిలావశేషాలు బహుఆసక్తిని రేకెత్తించేవి-ముఖ్యంగా చరిత్ర అధ్యయనపరులకు- కోటలోపలకు వెళ్తే మరెన్నో కట్టడాలు, కుహకాల విశేషాలు, చారిత్రకాంశాలు మనకు శ్రవణానందం చేస్తాయి. బీజపూర్‌లో ఘనమైన కట్టడం ప్రపంచంలోనే రెండవ స్థానాన్ని ఆక్రమించేది ఆదిల్‌షా సమాధి అయిన–

## గోల్‌గుంబాజ్ :

ప్రధాన కట్టడమును ఆవరించివున్న పైడోమ్ ప్రపంచం మొత్తంమీద రెండవ విశాలమైనదిగా పేర్కొనబడింది. సెయింట్ పీటర్స్ డోమ్- రోములోని వాటికన్ సిటీలో ఉన్నది. వ్యాసం 42 మీటర్లు, లండన్‌లోని సెయింట్‌పాల్స్ వ్యాసము 33 మీటర్లు కాగా బీజపూర్‌లోని గోల్‌గుంబాజ్ డోము వ్యాసం 30 మీటర్లుట. క్రింద నేల వైశాల్యం కూడా రోములోని పార్థినాన్ కంటే ఎక్కువయింది. 18,332 చ.అ. లుగా గుణించబడింది. ఇందులోని మహాద్భుతమైంది విస్పరింగు గ్యాలరీ. ఇక్కడ ధ్వని నియంత్రణ శాస్త్రంలోని ప్రావీణ్యం మెచ్చుకోతగింది. ఇక్కడ చిన్నగా ఒక శబ్దంచేస్తే 10 రెట్లు ఎక్కువగా వినబడుతుంది. కొంతమంది లెక్క ప్రకారం పన్నెండు రెట్లు ఎక్కువమోత. దీని విశిష్టతను గమనించి పూర్వపు MSM రైల్వే వారి చిహ్నంగా గ్రహించారట. దీనిని 1627-55లలో 20 సంవత్సరాల శ్రమ ఫలితంగా ఆవిష్కరించబడిం దీ కట్టడం.

## జుమ్మా మసీదు :

నగరం కట్టడాలన్నింటిలోనూ పెద్ద దయినది.

## ఇబ్రహీం రాజా :

రెండవ ఆదిల్‌షా సమాధి. వైభవంలో దీనికిదేసాటి. తాజ్‌మహల్ కట్టడంలో దీనినుండి పొందిన స్ఫూర్తి కొంత ఉందని ప్రతీతి. కుడ్య చిత్రాలు, గోడల్లో ప్రత్యేకంగా అమర్చబడిన కిటికీలు అద్భుతమైన పనితనాన్ని వెలారిస్తున్నాయి. దీనికి దగ్గరిలోనే ఒక మసీదుకూడా వుంది.

ఇవేగాకుండా, మెహతార్ మహల్– సుస్నిగ్ధమైన భావగర్భితమైన జీలుగా నగిషీలు చెక్కబడినవి. రాతిమీద ఇవి సాధ్యమేనా ? అనిపించకమానదు. అస్సార్ మహల్, తాజ్‌బౌడీ చెరువు, హైదర్ బురుజు, ఇబ్రహీంరోజా మొదలయినవి దర్శనీయం.

హైదరాబాదు వైపునుండి వచ్చేవారుగాని, అటు షోలాపూర్ నుండి క్రిందికి వచ్చేవారుగానీ ముందుగా బీజపూర్ చూచి రావచ్చును.

## సిద్ధప్ప మహారాజు మఠము :

లింగాయత మతస్థుడైన శ్రీసిద్ధప్ప మహారాజు మహనీయుని మఠము. సమాధి దినం వచ్చే సెప్టెంబరు మాసంలో జరిగే ఉత్సవానికి యాత్రికులు వెల్లువలాగా వచ్చి సేవించుకుని వెళతారు.

కర్నాటకలో దర్శనీయా లనేకం. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవిగా–

## శృంగేరి :

తుంగానది తీరంలో అద్వైత మతస్థాపనాచార్యులు శ్రీ శంకర భగవత్పాదులు స్థాపించిన మొట్టమొదటి మఠం. శృంగగిరి కాలక్రమేణా శృంగేరి అయిందంటారు. కాశ్మీర దేశంనుంచి తెచ్చిన సువర్ణ శారదాదేవి విగ్రహము శారదాదేవి ఆలయంలో ప్రతిష్ఠించారు. ఈనాటికీ ఆరాధనలు, అర్చనలు ఈ మూర్తికే జరుగుతున్నాయి. శారదాలయానికి తోడు మరెన్నో ఆలయాలున్నాయి. ఈ పర్వతం ఋష్యశృంగ పర్వతంగా పురాణప్రసిద్ధి. బ్రహ్మర్షులైన వసిష్ఠ, విశ్వామిత్ర, విభాండకాది మహర్షులు తపస్సు చేసిన చోటుగా చెపుతారు. విభాండక మహర్షిచే అర్చించబడిన శ్రీమల్లికార్జున స్వామి ఆలయం, శ్రీ శారదాదేవి ఆలయం ప్రక్కనే విద్యారణ్యులవారు స్థాపించిన విద్యా శంకరాలయం మొదలయినవి కలవు. ఇంకా ఇక్కడ దర్శనీయమైన ముఖ్యాలయాలు– శ్రీదుర్గాలయం, కాలభైరవాలయం, కాళీ ఆలయం, శంకరాచార్య స్థాపితమైన కళాశాల వగైరాలు చూడదగినవి.

## తరికెరె :

తరికెరెకి 10 కి.మీ. దూరంలో గల అమృతేశ్వరాలయంలో అమృతేశ్వరుని మీద ప్రతి శివరాత్రికి సూర్యకిరణములు ప్రసరించినట్లు నిర్మించబడింది. శిల్పకళలో చాలా ఉన్నత సంప్రదాయాలననుసరించి నిర్మింపజేసారు.

గెర్‌సొప్పా జలపాతము :

దీన్నే జోగ్ జలపాతం అని అంటారు. వర్ణనాతీతమైన ప్రకృతి సౌందర్యముతో 830 అడుగుల ఎత్తు నుండి క్రిందకు దుముకుతూ భీతావహంగా వుంటుంది. యిరోపా దేశాల్లో పేరెన్నికగన్న జలపాతాల సరసన వుండి జలపాతాతిశయంలో నయాగరా, సెర్సోలి మొదలయినవాటిని గూడ అధిగమిస్తుంది. ప్రకృతి భీకరత్వమును వీనులారా గాంచి ఒక అపూర్వ మయిన మంత్రముగ్ధులు కాక తప్పదు. ఇక్కడ మహాత్మాగాంధీ హైడ్రో ఎలక్ట్రికల్ వర్క్సు గలదు. ఈ జలపాతము శరావతీ నదిమీద ఉంది. ఉండటానికి రహదారి బంగళావుంది. ముందుగా తెలిపిన తగిన వసతి దొరుకుతుంది. సంప్రదించవలసిన చిరునామా. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు. 3 వ నంబరు డివిజను, జోగ్‌ఫాల్స్. P.O.

భద్రావతి :

కర్నాటక ప్రభుత్వము వారి స్టీలు ప్లాంటు, మైసూరు పేపరు మిల్సు లి. వారి కర్మాగారాలున్నాయి.

మెర్కారా :

కూర్గు జిల్లాకి ముఖ్య పట్టణం. కూర్గతేనె చాల ప్రసిద్ధం. పడమట కనుమల్లో కేరళ కర్నాటకల మధ్యనున్న ఒకప్పటి చిన్నరాజ్యము. బ్రిటిషు కాలంలో ఒక సంస్థానం. ఇక్కడ దృశ్యమానమయిన కాఫీగింజల తోటలు ప్రకృతికి వింత వన్నెలు కూర్చిన కొండప్రదేశం. నారింజతోటలు, బంగారు పంటలు పండే వరిపొలాలు ప్రాంతమంతా పచ్చగా కనువిందు చేస్తుంది. సముద్రమట్టానికి 3,000 అడుగుల ఎత్తున అమరియున్న ప్రసిద్ధ వేసవిమకాము. దేశం మొత్తంమీద పండే కాఫీపంటలో సింహ భాగం కూర్గులోనే పండుతున్నదంటే అతిశయోక్తి కాదు.

చూడదగినవి :

కోట, సెక్రటేరియట్ భవనాలు వగయిరాలతోపాటు, ఓంకారేశ్వరాలయం – హిందూ ముస్లిముల శిల్ప సమ్మేళనంలో నిర్మించబడింది.

తలకావేరి :

మెర్కారా నుండి దాదాపు 40 కి.మీ. దూరంలో ఉంది పవిత్రస్థలం. కావేరి నదీ జన్మ స్థలం. తులా సంక్రమణంలో వచ్చే పుష్కరానికి యాత్రికులు విశేషంగా వస్తారు. భాగమండలానికు 5 కి.మీ. దూరంలో ఉన్న పర్వతారణ్య మార్గంలో గుండా

వెళుతుంటే మధ్యలో వున్న ఏలక, లవంగ, కాఫీ, వక్కల తోటలతో, పుష్పవృక్ష తతితో రమణీయమైన ప్రకృతి దృశ్యము కనులారాగాంచుచు జన్మ ధన్యమైనదిగా భావించుచూ యాత్రికులు ప్రయాణం చేస్తారు. ఇక్కడ అమరియున్న శక్తి ఆలయంలో అఖండదీపం నిరంతరం వెలుగుతూ వుంటుంది. ఉరుకులు, పరుగులతో ప్రవహించిన మేర సస్యశ్యామలం చేస్తూ సముద్ర సంగమాభిముఖంగా ప్రవహించే పవిత్ర నదీమ తల్లి కి యాత్రికులు పసుపు, కుంకుమలు, పండ్లు నీటిలో వదిలి నమస్కరిస్తారు. తొలిస్నాన ఘట్టానికి సమీపంలో గల విశ్వనాధాలయం దర్శనీయం. ఆలయంలో విశాలాక్షి, డుంఢి విఘ్నేశ్వరుడు, స్వర్ణ కాలభైరవుడు, దండపాణి మొదలగు దేవత లందరు నెలసిన ఈ చోటును దక్షిణ కాశిగా ప్రసిద్ధి.

### ధర్మస్థల :

కోర్టుల్లో సైతం పరిష్కారంకాని తగాదాలు వాది ప్రతివాదు లిద్దరు వచ్చి యదార్ధములు చెప్పుకుని తగాదాలు తీర్చుకుని సమస్యలకు పరిష్కారం చేసికొనటం పరిపాటి. అసత్యమాడితే ఫలితం అనుభవిస్తారట. ఇదియొక గాధ నమ్మకం.

### కుక్కే సుబ్రహ్మణ్య క్షేత్రం :

శిథిలమయిన కుక్కే పట్టణంలోని సుబ్రహ్మణ్యేశ్వరాలయము స్కాంద పురాణంలో క్షేత్రమహాత్యం ప్రసంశ వుంది. 'కుక్కే' అంటే కన్నడంలో 'బుట్ట' అని అర్థము. బుట్టలో దొరికిన లింగముల వలన ఈ క్షేత్రానికి పేరు వచ్చిందని ప్రతీతి. ఇక్కడ సేవించదగిన ఎన్నో ఆలయాలు, తీర్థములున్నాయి. మంగుళూరుకు దాదాపు 100 కి.మీ. దూరంలో వున్న దీ క్షేత్రం. మార్గశిరశుక్లపక్ష షష్ఠినాడు బ్రహ్మోత్సవం, కార్తీక మాసంలోను విశేషోత్సవం జరుగుతుంది.

## గోకర్ణం

సముద్ర తీరం ఆవుచెవిని పోలివున్నది గనుక ఈ క్షేత్రానికి పేరు సార్థకమయిన దంటారు. పురాణకథ ప్రకారం పరమేశ్వరుడే ఈ క్షేత్రానికి పేరు పెట్టినట్లుగా చెప్పుకుంటారు భక్త సులభుడైన పరమశివుడు రావణునికి ఆత్మలింగము ప్రసాదించినట్లు, లింగములోని భాగమని పురాణ కథలు చెప్తున్నాయి. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటిగా ప్రశస్తి. పవిత్రమైన గోకర్ణ క్షేత్రంలో అనేక పావన తీర్థాలు, వినట్ మందిరం, శ్రీ వెంకటేశ్వర మందిరం, విఘ్నేశ్వరుడి గుడి చూడ

నగరు. గోకర్ణక్షేత్రంలో స్వామిలింగము ప్రతిష్ఠిత మవటానికి శ్రీ విఘ్నేశ్వరుని ప్రయత్నమని గూడ కథలు చెప్తున్నాయి.

కోటతీర్థం వద్ద ప్రాయశ్చిత్త కర్మగా క్షురకర్మ చేయించుకొని పశ్చిమ సముద్రంలో స్నానమాడి పిండ ప్రదానాలు చేయటం ఆస్తిక జనుల ఆచారం.

హుబ్లిలోని సిద్ధ ఆరూఢస్వామి ఆలయం దర్శనీయం.

## మంగుళూరు

కర్నాటకలో నేత్రవతీ నదీతీరంలో అమరియున్న దక్షిణ కెనరాజిల్లాకుముఖ్య కేంద్రం. మంగళాదేవి ఆలయ ప్రసిద్ధి వలన మంగుళూరు అనే పేరు వచ్చిందని అంటారు. సార్థకమే! సముచితమే! జనాభా 3 లక్షలుపైగా వుంటుంది. పశ్చిమ తీరంలోని రైల్వేలైను కేరళలో ప్రవేశించబోయే ముందు ఇక్కడే ఆగిపోతుంది. హైదరాలీ రాజ్యంలో ప్రముఖపాత్ర వహించిన రేవుపట్టణం, నౌకా నిర్మాణకేంద్రం. ఇక్కడి నుండి జీడిపప్పు, కాఫీగింజలు విరివిరిగా ఎగుమతి జరుగుతుంటాయి. మంగుళూరు నుండి బొంబాయి వరకు నౌకా మార్గం తీరం వెంబడే పయనిస్తుంది. ఇక్కడికి రావటానికి జలమార్గమే గాకుండా, బెంగుళూరు నుండి ప్రతిరోజూ విమాన సౌకర్యం, బొంబాయి నుండి ప్రతిరోజూ రెండు విమానాలు ప్రయాణ సౌకర్యంతో తోడ్పడుతున్నాయి. వుండటానికి సత్రాలు, హోటళ్ళు, రహదారి బంగళా వగయిరాలున్నాయి. మైసూరుకు బస్సులున్నాయి మార్గం ప్రకృతి రమణీయంగా కనువిందు చేస్తుంది. దారి పొడుగునా కాఫీతోటలు, కలపవృక్షాలు, ఏలక, లవంగ, మిరియపు లతలతో చూడ ముచ్చటగా ఆహ్లాదకరంగా వుంటుంది. మంగుళూరులో మంగుళూరు పెంకులు తయారీ ఇక్కడే శ్రీకారం చుట్టుకుంది. మంగుళూరు కెమికల్స్&ఫర్టిలైజర్స్ వారి ఎరువుల కర్మాగారం, మంగళాదేవి ఆలయం, పెద్ద పెద్ద చర్చిలు, విశాలమైన భవనాలు చూడదగినవి. తీరంలో నిర్మించబడిన భవనాలు సముద్రంలోకి తొంగి చూస్తున్నట్లుగా వుండి నేత్రోత్సవం చేస్తుంటాయి.

### చుట్టు ప్రక్కల

**ముదిబిద్రి :**

జైనుల పుణ్యక్షేత్రం. దాదాపు 20 కి మీ. వుంటుంది. ఇక్కడ వున్న వేయి స్తంభాల మండపం, ఇతర శిథిలజైనాలయాలు చూడదగును. ఇక్కడ గొప్పదైనగౌతముని విగ్రహం వుంది. పురాతనకోట వగయిరాలు దర్శనీయం.

కార్కళ :

ఉడిపికి వెళ్లే మార్గంలో ఉన్న చిన్న పట్టణం. బస్సులో నుండే 60 అ. ఎత్తున ఉన్న తిన్నె మీద గల గోతమేశ్వరుని విగ్రహం, అనంత పద్మనాభస్వామి దేవాలయం చూడవలసినవి.

కదిరి :

కదిరిలో మంజునాథేశ్వరుడు కొబ్బరితోటలు, చిన్నకొండ జలపాతం, పాండవ గుహలు ఆసక్తి గలవారు చూడవచ్చును.

## ఉ డి పి

రజతపురమని పేరు 13 వ శతాబ్దంనాటి శ్రీకృష్ణ భగవానుని మందిరం ఉంది. ఇక్కడ మధ్వాచార్యుల వారిచే ప్రతిష్ఠించబడిన బహు సుందర రూపమైన బాలకృష్ణ స్వామి విగ్రహము కలదు. స్వామి భక్తసులభుడై కనకదాసు అను భక్తుని కరుణించటానికి తూర్పు ముఖంగా ఉండే స్వామి పశ్చిమాభిముఖుడైనాడని ఒక భక్తుని కథ. స్వామిని కనకదాసు ఎక్కడ నుండి చూచాడో అక్కడ మండపం కట్టించి దానికి కనకదాస మండపం అని పేరు పెట్టారుట. స్వామిని అర్చించటానికి ఆచార్యులవారు 8 మఠములు ఏర్పరిచారని అందులో వుండే యతీశ్వరులే రెండు సంవత్సరాల కొకసారిగా వంతుల వారిగా అర్చన చేయటానికి నియోగించబడినట్లుగా చెప్తారు. మారేటప్పుడు పర్యాయోత్సవమని చేస్తారు. యాత్రికులు విశేషంగా పాల్గొంటారు. ఇక్కడ దర్శించదగినవి-పవిత్ర వాదిరాజ స్వామివారి సోదెమఠము, శ్రీకృష్ణ మఠము-అందు ఆచార్యుల వారు వాడిన వస్తువుల ప్రదర్శన. దగ్గరిలోని సముద్ర తీరము దర్శించి పవిత్ర స్నానమాచరించుట, మాల్పి, మారవంతె, అంకోలా అనే మూడు బీచిలున్నాయి. సుందర సముద్రతీరంలో దర్శించదగినవి నిదర్శనం వీరి కాలంలో బౌద్ధ, జైన మతాలు కూడా పోషించబడటం। పాజక క్షేత్రం-10 కి మీ. దూరంలో ఉన్నది. విమానగిరి దుర్గాలయం-అక్కడి మధ్వాచార్యుల వారు స్నాన మాడిన నాలుగు తీర్థములు- మరి కొంచం దూరం వెళితే గల కోటిలింగాలు గల కోటీశ్వర క్షేత్రం. పగియురాలతోపాటుగా ఇటీవలే అతి ప్రాముఖ్యమును ప్రచారమును పొందిన-

మూకాంబికా క్షేత్రం :

ఉడిపికి ఈశాన్యంగా 80 కి.మీ. దూరంలో ఉన్న పుణ్యక్షేత్రం. మూకాంబికా

దుర్గాదేవి అవతార విశేషమే। స్వయంగా ఉద్భవించిన శివలింగము వెనుక మహాతేజస్సుతో విరజిల్లే దుర్గాదేవిని శ్రీశంకరాచార్యుల వారు స్వయంగా ప్రతిష్ఠించినది. నవరాత్రుల్లో మహాసంరంభమైన ఉత్సవాలు జరుగుతాయి.

చారిత్రికాభిలాషులకు-ఎంతో ఆసక్తికరములైన చాళుక్య గుహలు-ఆలయాలు చూడదగినవి ఉన్నాయి. క్రీ.శ. 4 శతాబ్దం నుండి 8 వ శతాబ్దం వరకు పీఠభూమిని చాలా వరకు తమ రాజ్యంగా పరిపాలించిన గొప్ప రాజవంశము చాళుక్యరాజవంశము. చాళుక్యుల మహా నిర్మాణ దక్షత ఈ నాటికీ వైభవోపేతమైన శిల్ప సౌందర్యంతో విరాజిల్లే దేవాలయాలు, గుహాలయాలు పరమ రమణీయాలై కనువిందు చేస్తున్నాయి. వారి రాజధానులుగా శోభిల్లిన అయిహోల, బాదామి, పట్టాదకల్ మహోన్నత దశ ననుభవించి ఇప్పుడు మౌన ముద్రను దాల్చినాయి. ఒకసారి వాటివైపు వెళ్ళి చూదాం.

అయిహోల :

క్రీ.శ. 4 నుండి 7 శతాబ్దం వరకూ రాజధాని. హైందవాలయ నిర్మాణం శైశవదశలో నుండి పరిణతి చెందిన వరకూ ఎన్నో దాక్షిణాత్య ఆలయశిల్పాలకు ఒరవడిదిద్దిన ఘనత వీరిదే। ఈ గ్రామం చుట్టుప్రక్కల దాదాపు 70 ఆలయాలున్నాయి. చాళుక్యుల పరిశోధనాశక్తి గమనార్హం.

బాదామి :

చాళుక్యులను త్రోసిరాజని క్రీ.శ. 757లో రాష్ట్రకూటులు శిల్పశాస్త్ర ప్రావీణ్యంలో సరికొత్త పుంతలు తొక్కి గుహాలయాల నిర్మాణం గావించారు. రాతితో కట్టిన అనేక బావులున్నాయి. వీరి కాలంలో శిల్పము, వర్ణచిత్ర రచన పోటాపోటీగా నడిచాయి. ఇటువంటి వాటికి ప్రత్యక్ష నిదర్శనం బాదామిలోని నిర్మాణాల్లోనే గమనించగలం. త్రిమూర్తులలో శివకేశవులను ఇద్దరినీ సరిసమానంగా ఆరాధించిన సమరసులు. కొండలను తొలిచి కోటలు కట్టి, సొరంగాలు కలిపించి శత్రు దుర్భేద్యంగా కోటలు కట్టగలిగిన వారు. రాష్ట్రకూటుల తరువాత కళ్యాణ చాళుక్యులు వశం చేసికొన్నారు. కాలచూర్యులు, దేవగిరి యాదవులు, విజయనగర సామ్రాజ్య నిర్మాతలు ప్రతివారు తమదంటూ ఒక ముద్రను సృష్టించారు.

పట్టాదకల్ :

7, 8 శతాబ్దాల్లో మహోచ్ఛ దశను అనుభవించింది. బాదామి చాళుక్యుల రెండవ రాజధానిగా శోభిల్లింది. లోకేశ్వరి లేక విరూపాక్ష ఆలయం. గోడలపైన

చెక్కబడిన పురాణకథలు శిల్పాలు శిల్ప కళలో విశిష్టత పరాకాష్ట నందుకొన్నది. కిరీటాయమానమై భాసించింది. కథలన్నీ హిందువుల జీవనాడులనదగిన భారత, భాగవత, రామాయణ కథలు హృద్యంగా శిల్పీకరించబడినాయి. వీటిన్నిటిలోనూ కొట్టవచ్చినట్లు కనబడే సత్యం–మత సామరస్యం–అన్ని మతాలను సమాదరించారు–ఈ రాజశేఖరులు హిందువులయినా ఇవన్నీ చూచినపుడు వెలలేని మన ప్రాచీన కళా వైదగ్ధ్యాన్ని నిర్లక్ష్యానికి గురిచేసి విలువలు తెలియకుండా మన కళ్ళు మనమే పొడుచుకుంటున్నామేమో। ఇటీవల కాలంలో ప్రభుత్వం వారు కూడా ప్రత్యేక శ్రద్ధతీసికొని అనేక విధాలుగా ప్రచారపు ప్రభావితం చేసి ప్రజల చూపును అటు వైపు మరల్చటానికి చేసిన ప్రయత్నం హర్షించదగింది.

ఇక చివరగా ఆసక్తి గలవారికి–

బెల్గామ్ :

12, 13 శతాబ్దాల్లో ప్రాంతీయ రాజధాని–పూర్వపు పాత పట్టణం ఒకవైపు మరోవైపు అత్యాధునిక కంటోన్మెంటు. పాత రేస్ ట్రాకులో సూర్యాస్తమయ దృశ్యం అద్భుతం. బస్సుస్టాండు దగ్గర పాతకోట, 1519లో నిర్మించబడిన సాటా మసీదు, జైనాలయం దర్శనీయం.

కొంచం ఉత్తరంగా వెళితే గోకా జలపాతం రమణీయ దృశ్యాన్ని తిలకించవచ్చు.

ఈశాన్య దిశలో :

బీదర్, బీదర్ కోట–బహమనీ సుల్తానులకు చెందింది, వారి రాజధాని. కోటలో రంజనీమహల్, చీనిమహల్, టర్కిష్‌మహల్ రమ్యహర్మ్యాలు మొగలుల సౌరు గుబాళించేవిగా దర్శించగలం. సుల్తానుల మసీదులు కూడా చూడవచ్చు.

రాయచూరు :

కాకతీయుల శౌర్య ప్రతాపాలు 13 శతాబ్దంలో పొంగిపొరలిన బహమనీ రాజ్యం. రాయచూరు ఒకనాడు బహమనీ రాజుల రాజధాని, తరువాత విజయనగర రాజుల అధీనంలోకి వచ్చినది. ఒక చక్కటి కోట వుంది దృశ్యమాన మయిన దృశ్యాలు చూడటానికి.

కర్నాటక రాష్ట్రి రాజధానీ నగరం బెంగుళూరు నుండి రాష్ట్రిమందు, దేశం లోని వివిధ నగరాలకు రోడ్ మార్గం కలయిక వుంది. వాటిలో ముఖ్యంగా బెంగుళూరు నుండి.

| గమ్యం | దూరం కి.మీ. | మజిలీలు |
|---|---|---|
| అయిహోల | 483 | తూముకూరు 70, చిత్రదుర్గ 130, హోస్పేట 140, హూంగుండ 120, అయిహోల 22. |
| బాదామి — | 516 | తూముకూరు నుండి హూంగుండ్ వరకు పై మాదిరిగా అక్కడి నుండి బాదామి 55. |
| బందీపూర్ — | 220 | మైసూరు 140, బందీపూర్ 80. |
| బేలూరు — | 222 | నీలమంగళ 27, చెన్నరాయిపట్న 121, హసన్ 37, బేలూరు 37. |
| కొచ్చిన్ — | 568 | మైసూరు 140, ఉదకమండలం 159, కోయంబత్తూరు 84, పాలఘాట్ 48, త్రిచూర్ 52,కొచ్చిన్ 80. |
| దండేలి — | 481 | తూముకూరు 70, చిత్రదుర్గ 130, హరిహర 87, ధార్వార్ 141, దండేలి 53. |
| హంపి — | 350 | తూముకూరు 70, చిత్రదుర్గ 130 హోస్పేట 140, హంపి 10. |
| హలిబేడు — | 216 | నీలమంగళ 27, చెన్నరాయపట్న 121, హసన్ 37, హలిబేడు 31. |
| హైదరాబాదు — | 568 | అనంతపూరు 207, కర్నూలు 145, హైదరాబాదు 216. |
| జోగ్‌జలపాతం — | 377 | తూముకూరు 70, అరసకెరె 90, షిమోగా 129, జోగ్ 88. |

| | | |
|---|---|---|
| మ(దాసు — | 334 | కోలారు 66, పలమనీరు 73, చిత్తూరు 39, కాంచీపురం 85, మ(దాసు 71. |
| మంగుళూరు — | 357 | నీలమంగళ 27, చెన్నరాయపట్న 121, హసన్ 37, మంగుళూరు 172. |
| మెర్కారా — | 264 | మైసూరు 140, హూన్సూర్ 45, మెర్కారా 79. |
| ముదుమలై — | 239 | మైసూరు 140, ముదుమలై 99. |
| మైసూరు — | 140 | చెన్నపట్న 59, (శీరంగపట్న 65 మైసూరు 16. |
| ఉదకమండలం (ఊటి) — | 299 | మైసూరు 149, బందిపూరు 80, గూడలూర్ 29, ఉదకమండలం 50. |
| పట్టాదకల్ — | 509 | తూముకూర్ 70, చి(తదుర్గ 180 హోస్పేట 140, హూంగుండ్ 121, పట్టాదకల్, 48. |
| (శావణ బెలగొల — | 160 | నీలమంగళ 27, చెన్నరాయపట్న 121, (శావణ బెలగొల 12. |
| శృంగేరి — | 327 | నీలమంగళ 27, చెన్నరాయపట్న 121, బేలూరు 74, చిక్మంగుళూరు 24, శృంగేరి 80. |
| తిరుపతి — | 248 | కోలారు 66, చిత్తూరు 112, తిరుపతి 70. |





# కేరళ



కేరళ రాష్ట్రం రాసిలో చిన్నది, వాసిలో గొప్పది. వైశాల్యంలో దేశం మొత్తం మీద 1.2 శాతం మాత్రమే వుంది, దేశ జనాభాలో 3.7 శాతం జనాభాను పోషిస్తున్నది. ప్రకృతి తన సహజ సంపదనంతా రాసిపోసి ఈ రాష్ట్రంలోనే నిక్షిప్తం చేసిందేమో అన్నంత సంపన్న మయినది. 483 కి.మీ. పొడవు గల కోస్తా తీరం అమరివుంది. అరేబియా మహాసముద్రం, పడమటి కనుమల మధ్య అమరియున్నది. పడమటి కనుమల పర్వత శ్రేణులు చిన్నా చితకా అన్నీ కలిసి దాదాపు 2000 మీటర్ల ఎత్తు వరకూ ఉన్నవి. రాష్ట్రంలో సముద్రపు నీటి కాలవలు అతి ప్రధానమైన పాత్రను వహిస్తున్నాయి.

## భౌతికంగా రాష్ట్రం ఉనికి :

పడమటి కనుమల మధ్యను, అరేబియా మహాసముద్రం మధ్యను ఉన్న ప్రాంతపు రాష్ట్రానికి ఉత్తరాన వాయవ్య మూలగా కర్నాటక రాష్ట్రం, తూర్పున, దక్షిణాన తమిళనాడు రాష్ట్రాలు చుట్టుకొని వున్నాయి. భౌగోళిక పరిస్థితులను బట్టి మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. (1) ఎత్తయిన పర్వతప్రాంతాలు. (2) మధ్యేరకంగా పూర్తిగా పల్లముగాక అటు ఎత్తుగాక ఉన్నటువంటి ప్రాంతములు. (3) పూర్తి పల్లపు ప్రాంతాలు. ఎత్తయిన ప్రాంతాలు పడమటి కనుమల పర్వత శ్రేణుల నుండి ఏటవాలుగా క్రిందికి 2000 మీటర్ల ఎత్తు నుండి 1000 మీటర్ల ఎత్తు వరకు వాలుతలంగా ఉన్నవి. ఈ ప్రదేశమే టీ, కాఫీ, రబ్బరు, ఏలక మొదలయిన సుగంధ ద్రవ్యాల పంటలకు అదర్శమైనవి.

1000 మీటర్ల ఎత్తునుండి పూర్తి పల్లపు ప్రాంతాంవరకు ఏటవాలుగా విస్తరించి పరుచుకున్న ప్రదేశాలు మిడ్‌లాండ్సుగా పేర్కొనబడ్డాయి. పర్వతోన్నతాల నుండి లోయలు మెట్లుమెట్లుగా ఏర్పడిన ప్రదేశాలు. చూడటానికి నిమ్నోన్నతాలతో ఎగసి పడే కెరటాలులాగా కానిస్తాయి. ఈ ప్రదేశమంతా జీడిమామిడి, కొబ్బరి, పోక, అల్లం, మిరియాలు, చెరకు మొదలయిన తోటలు విస్తారంగా పెంచటానికి అనువైనవి.

పల్లపు ప్రాంతాలుగా గణించబడినవి సముద్ర తీరం ప్రాంతం- నదీ మైదానాలు పరివాహక మైదానాలు, సారవంతమైన డెల్టా ప్రాంతాలు, మత్స్య పెంపకం, కొబ్బరితోటలు, వరి పంటలకు అనువైనవి. ఈ ప్రాంతాలే మత్స్య పరిశ్రమ, కొబ్బరి పీచు పరిశ్రమలు విస్తరించటానికి దోహదమయినవి.

కేరళలో ఎక్కడ చూచినా సిరి సమృద్ధిగా ఉంటుంది. సముద్రపు నీటి కాలువలకు తోడుగా 44 నదీనదాలు జలజలా పారే చోటు వాటిలో 41 పశ్చిమాభిముఖంగా ప్రవహిస్తూ అరేబియాలో సముద్రపు సాగరసంగమం చెందేవి. 3 నదులు మాత్రం తూర్పు మార్గగాములై ప్రవహిస్తున్నాయి. ఈ నదుల, నదాలు అన్నీ వర్షాధారితమైనవి. ఎత్తుగా వున్న ప్రదేశాల్లోని ప్రవాహికలు వేసవికాలం వచ్చేసరికి రాళ్ళు, గుట్టలు బయటపడి ఎండిపోయి వుంటాయి. కేరళ రాష్ట్రంలో సముద్రపు నీటిలో ఏర్పడిన కాలువలు, చెరువులు రాష్ట్ర ఆర్థిక వనరుల పెంపుతో అద్వితీయమైన ప్రాముఖ్యాన్ని వహించాయనటంలో సందేహం లేదు. ఇలా-ఏర్పడిన మహా సరస్సు అన్నిటికంటే విశాలమైనది-గొప్పది. దాదాపు 80 చ.కి.మీ. వైశాల్యం ఉంటుంది. ఈ సరస్సు అరేబియా సముద్రపు ముఖ ద్వారంలోనికి చొచ్చుకుని పోతుంది కొచ్చిన్ రేవు దగ్గర. ఈ సరస్సులోకి ప్రవహించేవి పెరియార్, పంచి, మణిమాల, అచ్చెన్ కోయిల్, మీనాచ్చిన్, మూవట్టుపుళ మొదలయిన నదులు. వేలి, కటినాంకులం, అంజెంగో, ఏడవ, నడయార, పరపూర్, అష్టముడి, కాయంకులం, కొడుంగల్లూరు (క్రంగనోరు) చేతువా మొదలయినవి ఇతర కాలువలు. నౌకా ప్రయాణానికి త్రివేంద్రం నుండి ఉత్తరాన తిరూరు వరకూ 228 మైళ్ళ పొడవునా సౌకర్యం వుంటుంది. ఈ పరవశించిన ప్రకృతి అందాల రాశికి పూర్వ చరిత్ర ఏమిటో ఒకసారి పరిశీలిద్దాం.

**సంగ్రహంగా చరిత్ర :**

శ్రీ మహావిష్ణువు యొక్క అవతార విశేషమైన పరశురాముడు తన పరశువును విసరగా అది కింద పడినంత దూరం వరకు సముద్రుడు వరంగా యిచ్చిన భూమిగా పురాణప్రసక్తిగల ప్రాంతము. ఈప్రాంతములో క్రీ.శ. 9 శతాబ్దంలో చేరరాజులు బల

వంతులై రాజ్య స్థాపనం చేశారు. ప్రాంతంలో అనేకచోట్ల వారి ప్రతినిధులను ఏర్పాటు చేసి పాలన సాగించారు. 1498లో పోర్చుగీసు నావికుడు కాలికట్‌లో కాలు మోపటం జరిగింది. శక్తివంతమైన హిందూ రాజులైన జమోరిన్‌లకు రాజధాని అనాడు ఈ కాలికట్. వారి రాజ్యంలో వ్యాపార లావాదేవీలు నడుపుకోటానికి పోర్చుగీసు వారికి అనుమతియీయబడింది. 1512లో వారివ్యాపార కార్యకలాపాలు కొత్త ప్రాంతానకు విస్తరించుకోటానికి కొచ్చిన్ మహారాజు అనుమతించారు. 1662లో డచ్చివారు ప్రవేశించి పోర్చుగీసు వారిని వ్యాపారంలో ఎక్కిరానీయకుండా అణగ ద్రొక్కారు. 18 వ శతాబ్దంలో బ్రిటిషు వారి యీస్టిండియా కంపెనీ వారు వారిద్దరినీ కూడా అణచి వేసి కొచ్చిన్, ట్రావన్‌కూరు రాజులను తమ విధేయులుగా మార్చుకో గలిగారు. 1947లో తిరువాన్కూరు, కొచ్చిన్‌లకు మలబారు కలిపి సరికొత్త రాష్ట్రంగా చేసి నేరుగా బ్రిటిషువారి పాలన క్రిందికి తెచ్చుకున్నారు. భారతదేశం స్వతంత్రం వచ్చిన తరువాత తిరువాన్కూరు, కొచ్చిన్‌లను కలిపి 1949లో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు జరిగింది. రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ జరిగిన 1956 నవంబరు 1న ఇప్పటి కేరళ సమగ్ర స్వరూపం ఆవిర్భవించింది. ఈ సందర్భంలో కొన్ని సర్దుబాట్లు గూడా జరిగాయి. తత్ఫలితంగా తోవల, అగస్తేశ్వరం, కల్‌కులం, విలవంకోడు తాలూకాలు దక్షిణకొసన, తూర్పున షెన్‌బాట్ట, తమిళనాడులో కలవగా, మలబారు జిల్లా, దక్షిణ కనరాలో కాసర్‌గోండ్ తాలూకాలు కేరళలో కలిశాయి. లక్షదీవులు, మినికాయ్, అమిందీవి మలబారు కోస్తాలు కలిపి కేంద్రపాలిత రాష్ట్రాలుగా ఏర్పాటు చేయబడింది.

పశ్చిమంలో ఉన్న అరేబియా సముద్రపు కోస్తా వలన కేరళ రాష్ట్ర ప్రాంతానికి అనాదిగా ఎన్నో ఇతర దేశాలలో వర్తక వాణిజ్య సంబంధాలున్నట్లు చరిత్ర చెబుతుంది. 3 వేల సంవత్సరాల క్రితమే క్రంగనోరు, క్విలన్, కొచ్చిన్, కదలుండి మొదలయిన ప్రదేశాలు ప్రముఖ వ్యాపార కేంద్రాలుగా శోభిల్లి అస్సిరియా, బాబిలోనియా మహా సామ్రాజ్యాలతోపాటు గ్రీసు, రోము, పట్టణాలు, ఈజిప్టు, చైనా వారితో సన్నిహిత సంబంధాలున్నాయి. అసలు క్రైస్తవ మతం దేశంలో మొదటి పాదం మోపింది కేరళలోనే. సాలమన్ మహారాజు ప్రయాణించిన ఓడలో ఎంతో మంది యూదులు (జ్యూస్) కేరళ దేశానికిచేరి స్థిరనివాసం ఏర్పరుచుకున్నట్లు ప్రతీతి. చాలామంది మరల ఇజ్రాయేల్ చేరుకున్నారు. ఏసుక్రీస్తు శిష్యులు సెయింట్ థామస్ శిలువ సంవత్సరాల్లో కేరళకు వచ్చిన మొదటి క్రైస్తవ ప్రముఖునికి స్వాగతించినది

కేరళయే! క్రైస్తవం ఇక్కడ మొదలయినా ఇక్కడి వారికి 'పోప్' గురించి తెలియక పోవటం చిత్రమే! ఇక్కడి జాలరులు వాడే వలలు చైనావి అట.

సాంస్కృతిక వారసత్వంలో తనదైన ప్రత్యేకబాణి గల కథాకళి నృత్య సంప్రదాయం, కేవలం హస్త ముద్రలతో పురాణ గాథలను అన్వయించి యిచ్చే ప్రదర్శన.

ఇక్కడ జరిగే పడవ పందాలు చాల ఉత్కంఠ భరితంగా ఉంటాయి. పడగ లెత్తిన సర్పాకారంలో తయారు చేయబడిన బోట్లు-వానిలో ఒక్కొక్క దానిలో దాదాపు నూరుమంది యువకులు తెడ్లువేస్తూ పోటాపోటీగా మృదంగ ధ్వనులు అనుసరిస్తుండగా పాటలు పాడుకుంటూ శరవేగంతో ఒకరిని మించిన మరొకరు గెలుపు కోసం ఉత్సాహంగాసాగే పోటీ దేశంలో మరెక్కడా కానరాదు. దేశంలోనే కాదు ప్రపంచంలోనే అని చెప్పవచ్చు- చూచి తీరవలసిందే!

ఈ రాష్ట్ర వైశాల్యం 14 జిల్లాలుగా విభజించబడింది.

అవి- త్రివేంద్రం, క్విలన్, అల్లెప్పి, పతనంతిట్ట, కొట్టాయం, ఇడుక్కి, ఎర్నాకులం, త్రిచూర్, పాలఘాటు, మలప్పురం, కోజికోడ్, వ్యానాడు, కెన్ననూరు, కాసర్‌గోడ్.

ఒకే శాసన సభ, 141 మంది ప్రజా ప్రతినిధులు.

రాష్ట్ర వైశాల్యం : 38,863 చ.కి మీ.

రాజధాని : త్రివేంద్రం.

జనాభా : 2,55,00,000 పైగా.

మాట్లాడే భాషలు : మలయాళం, తమిళం.

స్త్రీ పురుష నిష్పత్తి : 1032 : 1000. (దేశం మొత్తంమీద ఈ ఒక్క రాష్ట్రంలోనే పురుషుల కంటే స్త్రీలెక్కుగా వున్నది.)

జన సమ్మర్దత : చ.కి.మీ. 655 మంది.

ముఖ్యంగా రాష్ట్రమంతటా పర్వతాలు, సరస్సులు, నదులు, కాలువలతో పచ్చని వృక్షసంపదతో అరణ్యాల గుండా, కొండలు, గుట్టలు ఎక్కుతూ దిగుతూ ప్రయాణం చేస్తుందే ఎంత మార్గాయాసమైనాసరే భరించే, ఉత్కంఠ భరితమైన ఉద్వేగము మనస్సంతా నిండిపోయిన ఒక థ్రిల్ అనుభవించక మానడు. త్రివేంద్రము (కేరళ రాజధాని 'తిరువనంతపురం' అని నామాంతరం గలది) దేశం మొత్తంమీద

పాతిపత్యానికి పేరుగాంచిన పట్టణంలోని ఆలయాలు, మసీదులు, చర్చిలు, కోవలం బీచ్, విశ్రాంతి కేంద్రం, నయ్యారం ఆనకట్ట, పొన్‌ముడి, పద్మనాభపురం ప్యాలెస్, ఇడుక్కి జిల్లాలోని తెకుండి దగ్గర పెరియార్ వన్యమృగ సంరక్షణా కేంద్రం, స్వామి అయ్యప్ప అధివసించిన శబరిమల, కొచ్చిన్ దగ్గరి విల్లింగ్టన్ దీవి, ఎర్నాకులం జిల్లాలోని కాలడి- శ్రీ శంకరభగవత్పాదుల జన్మస్థలం. గురువాయూరులోని కృష్ణ మందిరం, చరిత్ర ప్రసిద్ధిగల ఘటనాపూర్వకమైన కళ్ళికోట (కాలికట్ లేక కొఘికోడ్) అవశ్య దర్శనీయాలు. కర్నాటక రాష్ట్రం దిగువనే ఉన్న దక్షిణ ప్రాంతం వచ్చే వారికి మొదటిగా ఆహ్వానం పలికేది ఫ్రెంచి (పూర్వం) స్థావరమైన మాహె. మంగళూరు కాలికట్ అమధ్య ఉంది. రాష్ట్ర సందర్శన విషయాలను ముచ్చటించుకునే ముందు రాష్ట్ర రాజధానిని గురించి చూచి మాహె దగ్గరనుండి మొదలయి కన్యాకుమారి వరకు వద్దాము. కేరళ, తమిళనాడులు రెండూ ఒకదాని ప్రక్కన ఒకటి అతి సన్నిహితంగా అంటుకొని వున్నందువలన ఎక్కడి నుండయినా గబుక్కున తమిళనాడులోకి ప్రవేశించవచ్చు. అయినా తమిళదేశాన్ని గురించి వివరంగా చూద్దాం. ముందుగా- ప్రధానమైన రాష్ట్ర రాజధాని-

## త్రి వేం డ్రం

కేరళ రాష్ట్రానికి రాజధాని నగరం. పురాతననామం తిరు-అనంతపురం-లేక తిరువనంతపురం- శ్రీమహావిష్ణువు శయనమైన అనంతుని శాశ్వత (నిత్య) నివాసం- అని అర్థం. అనంతశయన మని గూడ వాడుక. 86వ దివ్యదేశంగా పరిగణన. దక్షిణ రైల్వేలకు చివరి స్థానం. సహజ వృక్షసంపదతో గూడిన అరణ్యాలుగల సప్తనగముల మీద నిర్మించబడిన పట్టణం. తూర్పు తీరవాసుల ప్రాచ్య నిర్మాణాధిక్యాన్ని వెలార్చే పగోడా రీతుల్లో నిర్మించబడిన భవనాలతో బహు సుందరమైన పట్టణం. మద్రాసు నుండి రైలుమార్గం, విమాన సౌకర్యం మిగతా యితర ప్రధాన నగరాలతో స్పష్టమైన దారులతో కలుపబడియున్నది. ముఖ్యంగా ఇక్కడకు దగ్గరలో 16 కి.మీ. దూరంలో వున్న కోవాలం అందాలను చూస్తూ ప్రకృతి సౌందర్యారాధకులుగా విదేశీయుల్ని సైతం ఆకర్షిస్తున్న సముద్రతీరం వీక్షించి వస్తుంటారు. ఇక్కడ చూడదగినవి-

**పద్మనాభస్వామి దేవాలయం :**

తిరువాన్కూరు ఒక రాజసంస్థానం. మహారాజా మార్తాండవర్మ 1750 సం॥ కులదైవంగా కొలిచి స్వామి సన్నిధిని సర్వము అర్పణచేసి ఆయన ప్రతినిధిగా

మాత్రమే రాజ్యపాలనం చేసినట్లుగా చెబుతారు. స్వామి ఆలయం అనాదియైనది. లోపలికి వెళ్ళాలంటే చొక్కాలు విడిచి వెళ్ళాలి. ఒకప్పుడీ ప్రదేశం పెద్ద అరణ్యంగా వుండేదట. సనాతన అంచులుగల గోపురాలతో శ్రీమహావిష్ణువన కంకితమైనదేవాలయం పూజారులు నంబూద్రి బ్రాహ్మణులు. శాస్త్రప్రకారం మహాశుచిగా పూజాదికాలు నిర్వర్తిస్తారు. మనం ప్రస్తుతం చూచే ఆలయ స్వరూపం మహారాజు మార్తాండవర్మచే పునరుద్ధరించ బడింది. 68 నల్లరాతి స్థంబాలమీద మోపుతో పసారా లున్నాయి. హిందువులు మాత్రమే ప్రవేశార్హులు. ఇతరులకు ప్రవేశంలేదు. శ్రీ పద్మనాభస్వామిని మూడు ద్వారాలగుండా దర్శించాలి. మొదటి ద్వారంలో ముఖం, రెండవ ద్వారంలో నాభి ప్రాంతం- అందుండి ఉద్భవించిన కమలములోని బ్రహ్మదేవుడు, మూడవ ద్వారంలో స్వామిపాదాలు దర్శించవలె. పాదాల క్రిందుగా పూజారిగారు కూర్చుని భక్తులకు తులసితీర్థం, తులసిదళాలు ప్రసాదంగా యిస్తారు. ఇందులో కొన్ని రహస్య మార్గాలు కూడా ఉన్నాయట. గోపురాని కెదురుగా పద్మతీర్థం గలదు. సముద్రతీరంలో శంఖుతీర్థము వుంది. స్నానమాడి స్వామిని దర్శించవలెను. శ్రీ కంఠేశ్వరంలో శివుని, వరాహ క్షేత్రంలోని విష్ణువుని తప్పకుండా దర్శించనగును.

**చిత్రాలయ ఆర్టు గ్యాలరీ, మ్యూజియం :**

చైనా, జపాను, టిబెట్టు మొదలైన దేశాలనుండి సేకరించిన చిత్రాలు, తంజావూరి చిత్ర కళాధ్యయన కేంద్రపు చిత్రాలతోబాటు- మొగలాయిల, రాజపుత్రుల చిత్రకళా రూపాలు దర్శించనగును. తిరువాన్కూరు మహారాజా స్థానములో ఉంది లోకప్రసిద్ధి గాంచిన రాజా రవివర్మ చిత్రాలను ప్రదర్శించేందుకు ప్రత్యేక విభాగం ఉంది. చిత్రకళా ప్రపంచంలో మహోన్నతిని, ఖ్యాతిని సంతరించు కొన్నవారు శ్రీరాజా రవివర్మ. భారతీయ ఆధునిక చిత్రకళా ప్రపంచానికి సరికొత్త వూపిరిపోసిన వారు- చిరస్మరణీయులు.

**అక్వారియం, బీచ్ :**

త్రివేంద్రం సిటీలో రకరకాల, రంగు రంగుల చేపలను, జలచరాలను ప్రదర్శించే అక్వారియం ఉంది.

**కావడియార్ భవనం :**

ఇది రాజవంశీయులకు చెందిన స్వంతఆస్తి. చూడాలంటే ముందుగా వారి అనుమతిని పొందాలి. ఇది ఒక అధ్యయనాసక్తులకు విశేషంగా తోచేది. రాజ వంశీయులు, రాజ కుటుంబాల నివాసపు తీరుతెన్నులు గమనించడానికి అనువైనది.

**త్రివేంద్రం చుట్టుప్రక్కల :**

**కోవాలం బీచి :**

దేశం మొత్తంలోనే ఒక అందమైన ప్రశాంతమైన బీచి. పట్టు కుసంలాగా జారిపోయే మెత్తని యిసుక మైదానాలు దీని ప్రత్యేకత. దగ్గరిలోనే విశ్రాంతి కుటీరా లనేకం వున్నవి. ఆయుర్వేద సిద్ధాంతాలమేరకు తైలమర్దన చికిత్సా సౌకర్యం, జల క్రీడాసక్తులకు మంచి సౌకర్యమైన ఏర్పాటులు, యోగాభ్యాస కేంద్రం ప్రత్యేకతలు. ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో ప్రదర్శించే కథాకళి నృత్య ప్రదర్శనలు తిలకించవచ్చు.

ఇంకా యితరమైనవి వరుసక్రమంలో వచ్చినపుడు వివరించగలం. ప్రస్తుతానికి ఇక పైనుండి కిందకు వద్దాం.

**కేసర్ గాడ్ :**

మంగుళూరు-కాలికట్ మార్గంలో ఉంది. ఇక్కడవున్న శ్రీ మల్లిఖార్జున దేవా లయం దర్శనీయం. దగ్గరలో 'బిన్నార్‌గి' అనే జలపాతం వుంది. స్నానంచేస్తే కీళ్ళ నొప్పులు మాయ మవుతాయట- ఈ ఓషధీకృత జలాల్లో. తాలూకా ముఖ్య పట్టణం. ఇక్కడ కొబ్బరి పరిశోధనాలయం కూడా ఒకటుంది.

**టెల్లిచ్చేరి :**

కాలికట్-కెన్ననూరుల మధ్య 52 కి.మీ. దూరం వుంటుంది. ఇక్కడ శ్రీజగ న్నాథస్వామి ఆలయం వుంది. బ్రిటిషవారు మలబారు తీరంలో ఒక ఫ్యాక్టరీని కట్టారు. రోడ్డుమీద పశ్చిమ సముద్రతీరంలో కొబ్బరితోటల గుండా చక్కని ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ చేసే ప్రయాణం ఎంతో ఆహ్లాదకరం.

పడమటి కనుమల గుండా తూర్పుగా ప్రయాణించేటప్పుడు టిప్పు సుల్తాన్ బాటరీ, కోట వున్నాయి. కాలికట్‌కి 88 కి.మీ. దూరంలో ఉన్న కెన్ననూరు ఒక రేవు పట్టణం. వాస్కోడిగామా మొట్టమొదట యిక్కడే దిగింది. పోర్చుగీసు వారు సెయింట్ ఏంజిలో చర్చి 1505లో కట్టించారు. తరువాత డచ్చివారి స్వాధీనంలోకి పోయి తదనంతరం బ్రిటిషవారు కైవసం చేసికొన్నారు.

## కా లి క ట్

వస్త్ర పరిశ్రమలో చాల ప్రఖ్యాతి గాంచినది. కాలికో- మాట కాలికట్ నుంచి వచ్చిందే. కాలికో వస్త్రములు బహుళ ప్రచారం, ప్రసిద్ధి చెందినవే। 1498లో

వాస్కోడిగామా దిగిన ప్రదేశం. హిందూ దేశానికి, జిల్లాకు ముఖ్య కేంద్రం. జనాభా దాదాపు 3,60,000. చారిత్రిక ప్రాముఖ్యంగల యుద్ధాలు అనేకం జరిగాయి. పోర్చుగీసు ఇక్కడి మలబారు 'జమోరిన్' రాజులతో యుద్ధాలు చేశారు. 2 సార్లు విజయవంతంగా త్రిప్పికొట్టారు. రెండవ యుద్ధంలో పట్టణం అనేక విధాల నష్టాలకు గురయింది. 1513లో జమోరిన్‌లు, పోర్చుగీసువారు ఒక ఒప్పందం చేసికొన్నారు. పోర్చుగీసు వారొక ఫ్యాక్టరీ కట్టుకొన్నారు. ఈ కాలంలో బ్రిటిషువారు కూడా అవకాశం కోసం వెన్నంటి ఉన్నారు. 1766లో జమోరిన్‌లు ఓడించబడ్డారు. స్థానికంగా రేగిన అలజడులవల్ల పట్టణం ధ్వంసమయింది. దీనిమీద టిప్పుసుల్తాన్ 1789లో జరిగిన యుద్ధంలో కొబ్బరితోటలను, చందనవృక్షాల్ని, మిరియాల పంటలను నామరూపాలు లేకుండా చేశాడు. ఏది ఎలావున్నా చూడటానికి ఏమీ మిగలలేదు. జమోరిన్ అంటే 'సముద్రపు రాజు' అని అర్థం. సముద్రతీరంలో అప్పుడప్పుడు వాతావరణం బాగా ఉన్నప్పుడు లంగరువేసిన స్టీమర్లను చూడవచ్చు. స్టేషను నుండి 4 కి.మీ. దూరంలో జమోరిన్ రాజభవనం చూడవచ్చు. పెంకుల తయారీ, అల్లం, కలప, కొబ్బరి, కాఫీ తోటలు విస్తారంగా వుండటం వలన ఇక్కడినుండి ఎగుమతులు జరుగుతుంటాయి.

కాలికట్ తరువాత మార్గమధ్యంలో ఉన్నవి :

**తిరునావాయి :**

మళయాళ దేశంలో నాలుగు దివ్య తిరుపతులుగా గణించేవాటిలో ఆఖరుది. 96వ దివ్యదేశం. సముద్రతీరంలో మంగైయ ళ్వారు మంగళాశాసనం ఆలయం వుంది. అమ్మవారికి కండ్లు శిల్పి పెట్టకముందే వచ్చినట్లున్నా విగ్రహ ప్రతిష్ఠ వెంటనే అమలు జరిగినట్లున్నా చెపుతారు. దర్శనీయం. ఇక్కడ మంగుళూరు టైల్స్ తయారు చేసే ఫ్యాక్టరీ లున్నాయి.

**విట్టుకోడు :**

పట్టాన్‌బి స్టేషను నుండి 3 కి.మీ. దక్షిణంగా అమరియున్న క్షేత్రం. కులశేఖరాళ్వారు మంగళా శాసనం. సత్రాలున్నాయి వసతిగా. చూడదగినవి తత్వకాంచన విమానం, చక్రతీర్థం, భుజంగశయనం వగయిరాలు.

## త్రిచ్చూరు

ఎర్నాకులానికి 74 కి.మీ. దూరంలో వుంది. నయనానందకరమైన పూరం పండుగ జరిగేచోటు. ఇక్కడ గురవాయూరు పురాతన దేవాలయం వుంది. శ్రీకృష్ణ

భగవానునికి అంకితమైన ఆలయం. హిందువులకు మాత్రమే ప్రవేశం. త్రిచ్చూరులో పరమెక్కావు, వడక్కునాథన దేవాలయాలున్నాయి. పూరం పండుగ ప్రతి సంవత్సరం ఏప్రిల్-మే మాసముల్లో వస్తుంది. రంగ రంగ వైభోగంగా మృదంగ నాదాలతో సంప్రదాయ సంగీత వాయిద్యాలతో, చక్కగా అలంకరించిన భద్రగజాలతో శోభాయమానంగా జరుగుతుంది. పట్టణ నిర్మాణం ఆదిలో పరశురాముడు నిర్మించారట. త్రిచూరుకు ఉత్తరాన కథాకళి నృత్యం అభ్యసించేవారికి కేరళ కళామండపం చెరుతురొత్తిలో వుంది. త్రిచూరులో వుండటానికి టూరిస్టు బంగళా, జయాలాడ్జి, హోటల్ ఇలైట్ ఇంటర్‌నేషనల్ వగయిరాలు వసతిగా ఉంటాయి. గురవాయూరు దగ్గరిలోనే పేచి, మలంపురుయీ మంచి పిక్నిక్ స్పాట్స్.

ఒల్వకోట్టు :

కాలికట్ నుండి కొచ్చిన్‌కు వచ్చే త్రోవలో షోరనూరు నుండి తూర్పుగా ఒల్వకోట్ట వుంది. ఇక్కడ ఆమైంఅమ్మన్ దేవాలయం ఉన్నది. శిల్పము రమణీయం. దగ్గరిలోనే ఒక జైనదేవాలయం కూడా వుంది చూడనగును.

పాలఘాట్ :

ఆసక్తి కలవారు అక్కడవున్న కోట, కందకం కట్టుదిట్టంగా ఉన్నవి చూడవచ్చు. ఒక చిన్న పట్టణం. ఒల్వకోట్ట పొల్లాచిల మధ్య కొలన్‌గాడ్ గాయత్రినదీ తీరంలో ఉన్న జమీందారీ సంస్థానం, రాజభవనం, దేవాలయం ఉన్నాయి. ఆర్ద్రోత్సవం ఘనంగా జరుగుతుంది, దర్శనీయం.

పాలఘాట్ నుండి ఒల్వకోట్ట, షోరనూరు వచ్చి మార్గాన్ని సాగించవచ్చు. మధ్యలో అనాసపండ్లు, మెంగుళూరు పెంకు వగయిరాలు ఎగుమతిచేసే ఒల్లూరు, కలప దిట్టంగా ఎగుమతి చేసే చాలకుడిని దాటివస్తే- శ్రీశంకర భగవత్పాదుల వారి పుట్టుక స్థలం-

## కాలడి

రావాలంటే దగ్గరిలో ఉన్న అంగమాల స్టేషనులో దిగాలి. అక్కడనుండి 8 కి.మీ. దూరం. పెరియారు నదీతీరంలో అమరియున్నది. జగద్గురు శంకరాచార్యుల వారు పుట్టిన పవిత్రస్థలం. పెరియారులో స్నానము చేయవచ్చు. చక్కని ఘట్టాలున్నాయి. ఇక్కడ ముఖ్యంగా చూడదగినవి— శ్రీ శంకరాచార్యుల దేవాలయం, శ్రీ

రామకృష్ణ మఠము, శ్రీశారదాదేవి ఆలయం, శంకరులవారు తమతల్లిని దహన మొనర్చిన చోట కట్టించిన తులసికోట దర్శనీయం. మరో ఆవరణంలో సంస్కృత పాఠశాల, వేదపాఠశాల లున్నాయి. వైదిక మతోద్ధారణకు దీక్షాకంకణులై అతి పిన్న వయసులోనే సర్వశాస్త్ర పారంగతులై ఆసేతు హిమాచలం వరకూ పాదచారులై తిరిగి తమ అద్వైత మతస్థాపన ద్వారా హిందూ మతోద్ధరణ గావించిన దివ్యపురుషులుగా ప్రసిద్ధిచెందిన శంకరులు సాక్షాత్తూ ఆ పరమేశ్వరుని యవతారమేనని హైందవుల గాఢమైన నమ్మకం. వారి అవతారంలో అనేక అద్భుతాలు వెలయించారు. వాదంలో మహా మహా పండితులను సైతం ఓడించి మానవత్వపు మహితత్వాన్ని, కులమత రహిత సమాజాన్ని నిర్మించడానికి ఎంతో కృషిచేసినట్లు నాటి కథలు, స్వామివారి బోధనవలన తెలుస్తుంది. ఈనాటికే కాదు ఏనాటికి మానవలోంతరాలు ఉన్నంతవరకూ మారు మ్రోగుతూనే వుంది.

వైశాఖ శుద్ధ పంచమినాడు శ్రీ శంకర జయంతి జరుగును. ఇది దేశంలో పలు చోట్లకూడా జరుపుతుంటారు.

పిటికితోడు కాలడిలో ప్రవహిస్తున్న నదీజలాలు వ్యాధి నివారకములనీ ఇక్కడ వుండి స్నానం చేస్తేవారు సర్వరోగములు నివారించబడునని ప్రతీతి. ఇక్కడ జరిగే పూజలు వైదిక మతానుసారం జరుగుతాయి. తాంత్రికోవిధులను దగ్గరికి కూడా రానీయరు. ఇక్కడ బృందావనికి శృంగేరి మఠంవారు చాలగృహాలు నిర్మించారు. కాలడిలో సరియైన భోజనం దొరకక పోవచ్చు. తగిన సరంజామాతో రావాలి.

**తిరుకాట్కరై :**

ఇక్కడి నుండి ఎర్నాకుళం స్టేషను ప్రక్క స్టేషను అయిన యిడెప్పల్లి అనే చోట దిగి 8 కిలోమీటర్లు పైగా నడవాలి. చూడదగినవి: వాట్కాతియప్పన్, పెరుంశెల్వ నాయకి, పుష్పల విమానం, కపిలతీర్థం- కపిమునికి స్వామి ప్రత్యక్షమయిన చోటు, సమ్మోళ్వారు మంగళా శాసనం దర్శనీయాలు. పెరియారు నదీతీరంలో అమరియున్న అల్వాయ ఒకనాటి కొచ్చిన్ ప్రభువుల వేసవి మకాముగా ప్రసిద్ధి కెక్కినది. ఇక్కడే ఒక శివాలయం వున్నది. శివరాత్రికి యిక్కడ ఉన్న శివక్షేత్రంలో గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. ఈ నదిలో స్నానంచేసిన వెంటనే సర్వవ్యాధులు నివారణ కాగలవని ప్రసిద్ధి. ఇక్కడ చూడదగినవి- క్రిస్టియన్ కాలేజి, సంస్కృత కళాశాల శ్రీ చిత్రా పిపింగు ఫ్యాక్టరీ మొదలగునవి.

# కొచ్చిన్ - ఎర్నాకుళం

ఘటనాత్మకమైన చరిత్ర ప్రాముఖ్యంగల దీవుల సముదాయం. కొచ్చిన్ సహజమయిన రేవు పట్టణం. ప్రపంచం మొత్తంమీద పేరెన్నికగన్న నౌకాస్థావరం. మొట్టమొదట ఐరోపీయులు కాలుపెట్టిన ప్రదేశం. వాస్కోడిగామా ప్రయాణాన్ని అనుసరించి పోర్చుగీసువారు స్థావరాలు ఏర్పరుచుకోగలిగినది. క్రీస్తుశకం ఆరంభ కాలంలోనే క్రైస్తవ ప్రార్థనా మందిరం చోటుచేసుకున్న దిక్కడే. నేలమీద పరచిన తెలుపు, బులుగు పలకలు చేతితో రంగులు వేసిన చైనా పలకలు నేలంతా పరిచివున్నవి. ఇది అతి పురాతన కాలానికి చెందినది. కొచ్చిన్‌లో పోర్చుగీసువారు కట్టించిన సెయింట్ ఫ్రాన్సిస్ చర్చి, రోమన్ కాథలిక్ పనుగుణంగా మధ్యయుగాల కాలంలో మొదటిగా వెలసిన క్రీస్తుమందిరం. 1644 నుండి 18[illegible]4 వరకు డచ్‌వారి ఆధీనంలో ప్రొటెస్టెంటు చర్చిగా మారి తరువాత బ్రిటిషువారి కాలంలో ఆంగ్లికన్ చర్చిగా మార్చారు. ఇక్కడే వేయి సంవత్సరాలకు పూర్వం యూదుజాతి స్థావరం ఏర్పరుచుకున్న దాఖలాలు అనేకం. కొచ్చిన్‌రేవు అయిన మట్టాన్‌చేరిలో అలముకున్న మధ్యయుగాలనాటి పోర్చుగీసు, హాలండ్ దేశాల పాశ్చాత్య సంస్కృతులు ప్రభావితం చేసిన సంప్రదాయం మలబారు ప్రాంతంలో వెలసిన కొచ్చిన్ పాతకోట అవశేషాల్లో ఇప్పటికీ ప్రతిబింబిస్తూ ఉంటే ప్రక్కనే ఉన్న ఎర్నాకుళం అందుకు విరుద్ధంగా మెయిన్‌లాండ్ అంతా పెద్దపెద్ద హోటళ్ళు, కండ్లు మిరుమిట్లు గొలిపే నియాన్ సైన్ బోర్డులు, విద్యుద్దీప కాంతిలో ధగద్ధగాయమానంగా మెరిసిపోతూ ఆధునికతను పట్టం గట్టుకొని దర్శనమిస్తుంది. ఇది చాల విచిత్రం. ప్రాచీనత, ఆధునికతలు చెట్టాపట్టా లేసుకొని పోటీపడుతూ వింత ఆకర్షణలతో శోభిల్లే ఈ దీవి ప్రాంతం హిందూదేశంలో వెలసిన అతి ముఖ్యమైన అందాల సహజ రేవు పట్టణం అంటే అతిశయోక్తి కాదు. అప్పుడప్పుడు తరచుగా పెద్దపెద్ద వాణిజ్య నౌకలు అనతిదూరంలో లంగరు వేసికొని కొచ్చిన్‌రేవులోకి ప్రవేశం చేయటానికి తయారుగా ఉన్నవి చూడగలం. కొచ్చిన్ రేవు ఉన్న ప్రాంతం వెల్లింగ్టన్‌దీవి అంటారు. రేవును అభివృద్ధి పరచటానికి తోడిన మట్టి అంతా కలిసి దీవిగా ఏర్పడింది. విమానాలకు కూడా ఇదే ఆశ్రయమైంది. మామూలుగా మన దేశంలో అతి ప్రియంగా అమ్మబడే విదేశీ వస్తువులు సాధారణంగా దొరకనివి అతి చౌకలో తేలిగ్గా దొరుకుతాయంటే ఆశ్చర్యపోనక్కర లేదు. ఈ రేవులోనే బోల్‌గట్టి, గుండుదీవులు, దక్షిణ ద్వీపకల్పాలుగా పురాతనమైన కొచ్చిన్‌కోట, మట్టాంచేరిలు, దానికి ఉత్తరంగా వైపీన్ ద్వీపం అమరియున్నాయి. చారిత్రిక

స్మృతులు, శిల్పాలు అన్నీ దాదాపు కోటలోను, మట్టాంచేరిలోను ఉన్నాయి. కాంటి లివర్ పద్ధతిలో ఉన్న చైనా చేపల వలలు ఇక్కడ ప్రత్యేకం. బోల్‌గట్టి ద్వీపంలో ఉన్న బోల్‌గట్టి పాలెస్ హోటల్ అతి ఆధునికమైంది. ఇక్కడ ఒకదీవి నుండి మరో దీవికి చేరాలంటే లాంచీలున్నాయి. పోర్చుగీసు కోటగా పిలవబడేదాన్ని చూడాలంటే వైపీన్‌దీవికి లాంచిలో వెళ్ళి చూడవచ్చు.

ఎర్నాకుళంలో [illegible] రోడ్డులో టూరిస్టు రిసెప్షన్ సెంటరు వుంది. ఫోన్ నెం. 32234 సమాచారంతోపాటు బోల్‌గట్టి ప్యాలెస్ హోటల్ రూము, చుట్టు ప్రక్కల విశేషాలు చూడటానికి కావలసిన లాంచీ ఏర్పాటు వీరు చేయగలరు. ప్రధాన సమాచార కేంద్రం విల్లింగ్‌టన్ దీవిలో ఉన్నది. దక్షిణ భారతదేశంలోనే గణ్యత పొందింది.

చూడదగినవిగా క్రీ.శ. ఆరంభనుండి ప్రాముఖ్యతను సంతరించుకున్న కథలు, గాథల కాణాచి కొచ్చిన్ కోట. శతాబ్దాల చరిత్రగల క్రైస్తవ మత ప్రాబల్యాలు ఎన్నో తెలుసుకోవచ్చు. మట్టాన్‌చేరి భవనం 1557లో నిర్మించి కొచ్చిన్ రాజైన రాజా వీర కేరళ వర్మకు కానుకగా యివ్వబడింది; 1568లో నిర్మించబడిన యూదు ప్రార్థనా మందిరం–ఏకాంతంగా వుంది 2000 సంవత్సరాల పూర్వంనాటి యూదుల వలస చరిత్రను ఉత్కంఠ భరితంగా దాచుకుని ఉన్నది; మలబారు తీరంలో మొట్ట మొదట వ్యాపార సంబంధాలు ఏర్పరుచుకున్న వైనం, క్రీ.శ. 962–1020 నాటి రాజా భాస్కర రవివర్మ అంజువణ్ణం గ్రామం యూదుల వ్యాపారి జోసఫ్ రబ్బాన్ కిచ్చిన శాసనం వగైరాలు ఎన్నో వున్నాయంటారు. రాజావారి పల్లకీలు వ్యాపారులను మర్యాద పూర్వక ఆహ్వానాలుగాను, అతిథి మర్యాదగా వారి ఉపయోగానికివ్వడం వంటి విశేషాలు కూడా అవగతం అవుతాయి. గుండుదీవిలో అమరియున్న రబ్బరు పీచు తయారీ ఫ్యాక్టరీ— పూర్వపు దర్బారు హాలులో అమరి యున్న కొచ్చిన్ మ్యూజియం-దర్శనీయం. పురాతన కేరళ నిర్మాణ రీతిలో నిర్మించబడిన భవనం ఉంది. అనేక శిలా శిల్పాలు, పెయింటింగులు, కొచ్చిన్‌రాజులు వాడిన వస్తు విశేషాలు చూడదగినవి. ఇక్కడికి 35 కి.మీ. దూరంలో వున్న క్రంగనూర్ ఫెర్రీ బోటుమీద జలమార్గంలో అయితేనే. రోడ్డుమీద 77 కి.మీ. దూరం వుంటుంది. పోర్చుగీసుకోట, కొన్ని హిందూ ఆలయాలు, అతి పురాతనమైన మసీదు వున్నవి.

పశ్చిమ సముద్ర తీరంలో బొంబాయి వలె ప్రఖ్యాతిగాంచిన ఈ రేవు పట్ట ణం చేరటానికి త్రివిధ మార్గాలలో అన్ని ప్రధాన నగరాల కలయిక వున్నది. రాష్ట్ర రాజధాని అయిన త్రివేంద్రమునకు 218 కి.మీ. దూరం వుంది.

వైక్కం :

దక్షిణ కాశిగా ప్రఖ్యాతి. ఇక్కడి నుండి క్విలన్ దాదాపు 20 కి.మీ. పైన వుంటుంది. జలమార్గంలో ప్రయాణించవచ్చు. మలబారు ఉప్పునీటి కయ్యలో ప్రయాణం సుందరమైన ప్రకృతి రామణీయకతను అవలోకిస్తూ చేసే ప్రయాణం ఒకమధురానుభూతి. వైక్కం ఒక శైవక్షేత్రం. వైక్కం గ్రామం దట్టమైన వనాలు, ప్రకృతి శింగారంతో అలరారుతూ, కొబ్బరి పీచుపట్టాలు, త్రాళ్ళకు ప్రసిద్ధి చెందింది.

ఇక్కడికి దగ్గరలోనే దివ్యక్షేత్రాలయిన అరాన్ముల-ధర్మరాజుచే ప్రతిష్ఠించబడిన పార్థసారథి దేవాలయం- పక్కన హిమలను వర్షప్రదాయైన అరాన్ముల అప్పన్ స్వామిగా వాసికెక్కినది. తిరుక్కడిత్తానం, అద్భుత నారాయణస్వామి, నమ్మాళ్వారు మంగళాశాసనం, తిరువల్లాయి-విభూతివాడే వైష్ణవక్షేత్రం-తిరుమంగ యాళ్వారు మంగళాశాసనం-స్త్రీలకు లోపలికి అర్హత లేదు-బయటి నుండే సేవించ తగినది; తిరువమున్నూర్-పాంబణైయప్పన్, కమలవల్లి తాయారు-నమ్మాళ్వార్ మంగళాశాసనం, పులియూర్, తిరువారన్‌విళై మొదలయినవి దర్శించదగిన హిందూ పుణ్యక్షేత్రాలు దివ్య దేశాలుగా ప్రసిద్ధి. వీటికి తోడుగా దగ్గరిలోనే చెంగన్నూర్‌లో ఒక నమ్మాళ్వార్ మంగళాశాసనం కూడా దర్శించదగిన పవిత్ర క్షేత్రం. వీటిలో అరాన్ముల పడవ పందేలు చాలా ప్రసిద్ధి.

## కొట్టాయం

కొచ్చిన్ నుండి అయితే 68 కి.మీ. దూరం. త్రివేంద్రం నుంచి 154 కి.మీ. దూరం. సిరియన్ క్రైస్తవచర్చి సంప్రదాయ కేంద్రం. దగ్గరలో వలియపల్లి పర్షియా శిలువలతో అమరియున్న దీపపు సెమ్మెలు చూడదగినవి. ఇది చాల పెద్ద చర్చి. చెరియపల్లి చర్చి కుడ్య చిత్రాలు అమోఘమైనవి. ప్రాక్పశ్చిమాల కలయిక స్పష్టంగా కనబడుతుంది. అనేకమయిన దీపారాధన దీపపు సెమ్మెలున్నాయి. కనీసం 400 సంవత్సరాల క్రితం నిర్మించబడింది.

పెరియార్ వన్య మృగ సంరక్షణా కేంద్రం :

కేరళ గంజాయి తోటలకు కూడా చాలా ప్రసిద్ధి. కుమిలి-మున్నార్ మధ్య ఇడుక్కి జిల్లా ముఖ్య కేంద్రం. ఇడుక్కి వుంది. కొచ్చిన్‌కి తూర్పుగా 100 కి.మీ. పొడవు వుంటుంది. దట్టమైన అరణ్యాలున్నాయి. ప్రకృతి సౌందర్యం చూస్తూ ఒక దమ్ము గంజాయి పీల్చాలంటే వెళ్ళవచ్చు. పోలీసులుంటారు జాగ్రత్త! కొట్టాయం

నుండి పెరియార్ వన్యమృగ సంరక్షణా కేంద్రానికి బస్సులున్నాయి. మధురై వెళ్ళేవారికి మార్గ మధ్యంలోనే ఈ వనప్రాంతం.

దాదాపు 800 చ.కి.మీ. వైశాల్యం మేర తమిళనాడుకు అతి సమీపంలో సరిహద్దునే అమరియున్న ఈ తెక్కాడి జిల్లాలోని పెరియార్ వన్య మృగ సంరక్షణా కేంద్రం. ఇది ఒక అతి ముఖ్యమయిన ప్రదేశం. ఇక్కడ ఏనుగులు సమూహాలు సమూహాలుగా కనబడతాయి. దేశంలో మరెక్కడా మత్త గజాలు గుంపులు గుంపులుగా కనబడవు. మహా సరస్సులో లోతైన ప్రాంతంలో గజరాజులు సహకుటుంబ పరివార సమేతంగా జలక్రీడలు సలపటం ఇక్కడ తప్పితే మరెక్కడా చూడలేము. శృంగార చేష్టలు కూడా. మామూలుగా మచ్చిక చేయబడిన భద్రగజాలు దేవళ్ళల్లో భగవంతుని అంబారీలో ఊరేగించటానికి రకరకాల ఆభరణాలు, తళతళా మెరిసే ఇత్తడి తొడుగులు కుంభస్థలం దగ్గర నుండి తొండం చివరదాకా అలంకరించి, రంగు రంగుల దుస్తులతో సోదా ఏర్పరిచిన గణేశమూర్తులను సాధారణంగా చూచిన మనం— ఇక్కడ సహజవాతావరణంలో—అడవిలో-వాటి ప్రవర్తన-నగ్నంగా దర్శనమిస్తాయి. సృష్టిలో ఈనాడు మిగిలిన అతి స్థూలకాయపు జంతువు మరొకటి లేదనే చెప్పాలి. మధ్యలో ఒక పెద్ద మహా సరోవరం చుట్టూ పరచుకున్న ప్రకృతిలో వనదేవత తన యిష్టారాజ్యంగా ఏలుకునే మహావృక్ష సంతతితో విరిసిన ప్రత్యేకలోకం. ఏనుగులతో పాటుగా అనేక అడవి మృగాలను చూడవచ్చు. అడవిదున్న, సాంబారు, అడవి పందులు, అడవి జాగిలాలు, చిరుత, పెద్దపులి, నీలగిరి నల్లకోతులు, కొంచం లోతు తక్కువ నీటిలో స్వేచ్ఛగా తిరుగాడే తాబేళ్ళు, చేపలుపట్టే అనేక పక్షులు, కొంగలు అనేకం ప్రత్యక్షంగా చూడగలం.

**ఉండటానికి :**

పెరియార్ హౌస్, అరణ్యనివాస్ లేక ప్యాలెస్ వగైరా హోటళ్ళున్నాయి. ప్రభుత్వం వారి టూరిస్టు బంగళా కూడా ఉంది. మరింత సమాచారం తెక్కడిలోని వైల్డ్ లైఫ్ ప్రిజర్వేషన్ ఆఫీసరు గారిని సంప్రదించవచ్చు పెరియార్ హౌస్‌కి కామిలి నుండి బస్సులున్నాయి. అయితే సరదా వుంటే ఏనుగెక్కి వెళ్ళవచ్చు.

**ఇంకా కొన్ని ఇతర శాంక్చువరీలు :**

తట్టెక్కాడు బర్డ్ శాంక్చువరీ, పరాంబికుళం వైల్డ్ లైఫ్ శాంక్చువరీ, తునకాడవు

పెరుకరిపట్లం అనకట్టలు పగయిరాలు. అనకట్ట ఓజ్యాయారుల్లో భయంకరమైన మొసళ్ళు విపరీతం. ఈ కేంద్రంలో అన్నిటికీ ముఖ్య కేంద్రం తుసకాడవు.

## అల్లెప్పీ :

చూట్టానికి ఏముంది? అని అనవచ్చు. సంవత్సరంలో ప్రతి ఆగస్టు మాసం లోను రెండవ శనివారం నిర్వహించబడే నెహ్రూ ట్రోఫీ పడవ పందాలు ఉత్కంఠభరితంగా సాగేవి చూస్తేనేగాని తనివి తీరదు. సర్పాకారంలో నాగసర్పుడు పడగెత్తి పరుగెత్తే మాదిరిగా తయారు చేయబడిన పడవల్లో ఒక్కొక్క పడవకు 100 మంది సమూహం తెడ్లువేస్తూ పోటాపోటీగా పరుగులెత్తించే పడవ పందేలు చూట్టానికి కొన్ని వేలమంది ప్రేక్షకులు చుట్టూచేరిన సంరంభ వైభవం చూస్తేనేగాని తనివి తీరదు. ఇతర రోజుల్లో అల్లెప్పీ నుంచి నేరుగా సముద్రపు కాలువలో క్విలన్ వరకూ బోటులో వెళ్ళటం మహానందదాయకం.-ఈ పట్నం దాదాపు 2 లక్షల మంది జనాభాతో వర్థిల్లుతూంది. పొడుగాటి పేట, నేపాలు దేశంలో వున్న మాదిరిగా విశేషంగా కొయ్య నగిషీలు, కళా నైపుణ్యం వెల్లడి దేవాలయం దర్శనీయాలు.

## క్విలన్ :

అష్టముడి సరోవర తీరాన వరసగా పచ్చటి కొబ్బరి, జీడిమామిడి తోటలమధ్య కనీ కనపడకుండా ఒదిగివున్న పట్టణం. జనాభా దాదాపు 1 లక్షా 60 వేలు. మంగళూరు పెంకులు పై కప్పులతో ముందువాలుగా పురాతనమైన చెక్కలతో కొయ్యలతో నిర్మితమైన ఇండ్లతో నిండి ఉన్నది పట్నం. కేరళ రీతుల్ని అచ్చంగా ప్రతిబింబించే చిరు పట్టణం. అయితే చారిత్రకంగా ఒక ప్రత్యేక ప్రాముఖ్యాన్ని సంతరించుకుని ఉంది. కేరళ ఉప్పునీటి కయ్యలకు సింహద్వారం. బోటులో ఇక్కడి నుండి అల్లెప్పి ప్రయాణం ఒక మధురానుభూతి. దాదాపు 16 వ శతాబ్దం కాలంనుంచీ పోర్చుగీసు, డచ్చి, ఇంగ్లీషు వారల కీచులాటలకు, తగాదాలకు ఆధిక్యతకోసం జరిగిన యుద్ధాలకు సంబంధించిన ఘట్టాలెన్నింటినో పొదువుకుని ఉన్నది. దగ్గరిలో 8 కి. మి. దూరంలో తంగస్సేరిలో పోర్చుగీసు వారు కట్టినది— తరువాత డచ్చి, ఇంగ్లీషు వారు స్వాధీనాల్లో ఉన్న పాతకోట శిథిలావశేషాలు ఎన్నో సంగతులు చెప్తుంటాయి. అష్టముడి సరోవరంలో చేపలుపట్టే చైనా వలలు-కొచ్చిన్‌లో ఉన్న రకం-ఇక్కడ కూడా చూడగలం. మలయాళ భాష ఉచ్చారణ ప్రకారం—కొయిలోన్-అని పిలుస్తుంటారు. వుండటానికి ఒక టూరిస్టు బంగళా, ఊరికి కొంచెం దూరంగా వుంది.

పూరిలో నడిబొడ్డులో గల కొన్ని హోటళ్ళు సౌకర్యంగా ఉంటాయి. పూర్వం బ్రిటిష వారు రెసిడెన్సీగా ఉపయోగించిందానికి ప్రస్తుత స్వరూపమే టూరిస్టు బంగ్లా.

## వరక్కల్లయ్ — లేక జనార్దనం :

త్రివేంద్రం వెళ్ళే త్రోవలో త్రివేంద్రం నుండి అయితే సుమారు 45 కి.మీ. దూరం వుంటుంది. క్విలాన్ నుండి 30 కి.మీ. దూరం వుంటుంది. అనాది క్షేత్రము లలో ఒకటిగా ప్రసిద్ధి చెందిన జనార్ధనస్వామి దేవాలయం— సుందరవనములు, సర్వ తాలు, పచ్చని ప్రకృతి విరిసిన వసంతశోభతో అరేబియా సముద్రతీరంలో అమరిన క్షేత్రరాజం. సముద్రతీరంలో ఉన్న స్వామి ఆలయం ఒకప్పుడు సముద్రంలో కొట్టు కొని పోయిందట. మధురరాజుకు స్వప్నంలో స్వామి సాక్షాత్కరించి తన జాడ తెలుపగా మధురరాజు మరల ఒక తిన్నెమీద ప్రతిష్ఠించారట. విగ్రహం కుడి చెయ్యి విరిగిఉంటే దానిని బంగారంతో అంటించి ప్రతిష్ఠ చేశారుట. ఆలయం ఉత్తర హిందూస్థాన శిల్పరీతుల్లో నిర్మాణం. యాత్రికులు చక్రతీర్థంలో స్నానముచేసి స్వామిని దర్శిస్తారు. పురాణ ప్రసిద్ధి- కణ్వమహర్షి తపస్సుచేసిన చోటుగాను, బ్రహ్మ యజ్ఞం చేసిన చోటుగాను, సముద్ర తర్పణములు చేసిన చోటుగాను ప్రసక్తి వుంది.

కొండలు నానుకొని ఉన్న సముద్రం— కొండలలో అనేక ప్రదేశాల్లో భూమి లోంచివచ్చే స్వచ్ఛజలాలు ఊరుతుంటాయి. ఈ ఊటజలాల్లో స్నానంచేస్తే ఎంతో ఆరోగ్యకరంగా భావిస్తారు. ఈ ఊటజలాల్లో స్నానమాడిన తరువాతనే సముద్ర స్నానం చేస్తారు ఇక్కడ కొంతకాలం గడిపితే స్వామి సాక్షాత్కారం కలుగుతుందనే ఆశతో కొంతమంది ఇక్కడ కాలం గడుపుతుంటారు.

కొండలను తొలిచి సొరంగ మార్గం ఏర్పరచిన దారిలో ప్రవహించే జలాల్లో పడవమీద సుమారు 600 మీటర్ల దూరం ప్రయాణం చేస్తే సముద్రతీరం లోపలికి వెళతారు. సొరంగ ద్వారానికి దగ్గరలో ఒక మఠం అమరియున్నది అదే—

## శివగిరి మఠము :

శ్రీ గురునారాయణ ప్రవక్త— భగవంతుడొక్కడే అని ఆధ్యాత్మిక ప్రచారం చేసి— సర్వమానవ సమానత్వమును చాటిన మహానుభావుల సమాధి ఒక చిన్నకొండ మీద అమరియున్న దానిని దర్శించవచ్చును మఠంలోని శారదాలయం, గురువుగారి సమాధిఉన్నవి. 1904లో స్థాపించిన ఈమఠంలో అనేక కుటీరాలున్నాయి. జాతిపిత మహాత్మాగాంధీ, విశ్వకవి రవీంద్రుడు మొదలగు మహామహులు దర్శించిన చోటుగా

ప్రసిద్ధి. మఠంవారి ఆధ్వర్యంలో అనేక బ్రాంచీలు, విద్యాలయాలు, క్విలాన్‌లోని ఒక స్త్రీల కళాశాల నిర్వహించబడుతున్నాయని చెపుతారు.

డిసెంబరు మాసంలో జరిగే ఆధ్యాత్మిక సభలకు అనేకమంది అనుచరవర్గం సమావేశమవుతారు. స్వామివారు దీనజనోద్ధరణ గావించినవారుగా ప్రసిద్ధి. ఎన్నో ఆధ్యాత్మిక గ్రంధాలు రచించారు. అన్నింటిలోనూ మహా మానవతావాదం నిండి ఉంది.

త్రివేంద్రమును గురించి ఇంతకు ముందుగానే ముచ్చటించటం జరిగింది.

### త్రివేంద్రం చుట్టుప్రక్కలగల :

### పద్మనాభపురం :

అవశ్యం దర్శించదగినది. నిజంగా చెప్పాలంటే ఇది ప్రస్తుతం తమిళనాడులో చేరినాగాని త్రివేంద్రం నుండి చాలదగ్గర. ఒకనాటి పాలకులు నివసించిన రాజప్రాసాదం చూడదగినది. కుడ్యాలమీద మలచిన అనేక చిత్ర శిల్పాలతోను, కంచు విగ్రహాలు, రాతిశిలా శిల్పాల నగిషీలు బహురమ్యమైన కళాభిజ్ఞతను ప్రదర్శిస్తున్నాయి. చూడదగినది.

బంగారు శిఖరంగా అభివర్ణించదగిన పొన్ముడి అందాలుచిందే రమణీయ ప్రకృతిలో మామిడి కొబ్బరి తోటలుతోపాటు అనేక ఫలవృక్షాల తతితోగూడి మనోజ్ఞంగా వుంటుంది మార్గం.

# లక్షద్వీపములు

కేరళ సముద్రతీరానికి ఆవల 200 నుండి 800కి.మీ.దూరంలో అమరియున్న 27అందాల దీవులు. మార్గపుంతకు ఉత్తరపు విస్తరణ. దాదాపు పదిదీవులు జనావాసాలై ఉన్నాయి. అవరోహణ క్రమంలో- పెద్దనుంచి చిన్నవరకు— మినికాయ్, అంద్రుత్, కవరాట్టి, కద్మాత్, అగాతి, అమిని, కల్పేని, కిల్తాన్, చెట్లాట్, బిట్రలీలు. మొత్తం మీద జనాభా సుమారు 40 వేలు. నూటికి 90 శాతం మహమ్మదీయులే. ఈ దీవులను దర్శించాలంటే కేంద్రప్రభుత్వం హోమ్ మినిస్ట్రీ, న్యూఢిల్లీ వారినుండి పరిమిషన్ విధిగాపొందాల్సి వుంటుంది. తీర విశ్రాంతి కేంద్రాలుగా కద్మత్, కవరాట్టి కుటీరాలు వసతిసౌకర్యానికి వీలుగా వుంటాయి. దీవుల్లో విహరించటానికి షిప్పింగ్ కార్పోరేషన్

ఆఫ్ ఇండియావారి M V. భారత్‌సీమ, M.V. అమిందీవి కొచ్చిన్ నుండి నడుపు తారు. M/s. జయరాం & సన్స్, విల్లింగ్టన్ ఐలాండ్‌వారు టిక్కట్లు అమ్ముతారు. ఏకాంతాన్ని కోరే శ్రీమంతులు కొత్తగా వివాహాలు చేసుకున్నవారు 'హనీమూన్' విహారానికి వస్తుంటారు.

చివరగా :

తమిళనాడు చేరినా ఇక్కడికి దగ్గరిలో ఉన్నవి- చూడదగిన ప్రదేశాలుగా-

శుచీంద్రం- కన్యాకుమారి అగ్రము దర్శించ దగినవి. పూర్తి వివరాలు తమిళ నాడులో వివరించబడు తున్నవి.

కేరళలో—కెన్ననూర్ :

కొచ్చిన్ నుండి 288 కి మీ. దూరం- పురాతనకాలంలో పడమటితీర రేవు పట్టణం- చేరమన్ పెరుమాళ్ళకి రాజధాని. పోర్చుగీసు కోట ఉన్నది.

మున్నార్ :

ప్రసిద్ధి చెందిన టీ తోటల పెంపకం కేంద్రం. సముద్రమట్టానికి 1525 మీ. ఎత్తులో అమరిన పర్వత ప్రాంతం. ఇక్కడ టీ తోటల్లో పనిచేసే వారందరు అనేకంగా కొండ జాతులవారు నివాసముండే ప్రదేశం. అందమైన గోల్ఫ్ క్రీడా కేంద్రం కుండలే దగ్గర వున్నది.

కేరళరాష్ట్ర యాత్ర ముగించబోయే ముందు ఒక ముఖ్యమయిన యాత్ర— దేశంలోని అన్ని దక్షిణాది రాష్ట్రాల నుండి విశేషంగా భక్తులను ఆకర్షిస్తున్న శబరి మల అయ్యప్ప స్వామి యాత్ర గురించి ప్రత్యేకంగా యిస్తున్నాము, గమనించగలరు.

# శబరిమల - అయ్యప్ప స్వామి

ప్రతి సంవత్సరం- నవంబరు చివర, డిశంబరు మాసం వచ్చిందంటే చాలు- చాలామంది ఒక నల్లలుంగీ, నల్లచొక్కా, మెడలో ఒక తులసిమాల పైన ఒక నల్లని తుండుతో 'స్వామి శరణం' అని పలకరించుతూ, 'స్వామి శరణం'తో జవాబును మొదలుపెట్టే శ్రీ అయ్యప్ప స్వామి భక్తులు దక్షిణాది రాష్ట్రాల్లో ప్రతినగర, పట్టణా ల్లోను దర్శన మిస్తుంటారు. 'స్వామి అయ్యప్ప' ప్రధాన ఆలయం కేరళ రాష్ట్రం లోని 'శబరిమలై' అనే కొండమీద ఉన్నది. కలియుగ శ్రీవైకుంఠము, శ్రీవెంకటేశుని

సన్నిధానంఅయిన తిరుమలతిరుపతితర్వాత ఆంధ్రప్రదేశ్‌లోని భక్తజనాకర్షకయాత్రగా ప్రసిద్ధిచెందిన శబరిమల చేరటానికి కేరళ రాష్ట్రంలోని కొట్టాయంనుండి ఆగ్నేయ దిశలో అమరియున్న పర్వతారణ్య ప్రాంతంలో ప్రయాస భరితమైన మార్గం గుండా వెళ్ళాల్సి వుంటుంది.

ప్రతి సంవత్సరం మకర సంక్రాంతి దినమున జరిగే 'మకర విళక్కు' (మకరజ్యోతి) దర్శనం అతి ప్రధానంగా ఎంచబడుతుంది. కొన్ని లక్షలమంది యాత్రికులు విశేషంగా దర్శిస్తారు. శ్రీస్వామి అయ్యప్పను దర్శించే భక్తజనావళి 41 రోజులు కఠోరదీక్షతో లక్షించిన గమ్యం- శ్రీ అయ్యప్ప స్వామి దర్శనం.

నవంబరు మాసం కేరళలో ఋతుపవనాలు ఉధృతం తగ్గి నిర్మల శీతల వాయువులు ప్రసరిస్తుంటాయి. ప్రకృతి అంతా నూతనంగా పరిచిన పచ్చని తివాచీ లాగ యాత్రిక సందోహాలకు సుమనోహరంగా స్వాగత గీతాలాలపిస్తుంది. చల్లచల్లగ వీచే మలయ సమీరం యాత్రికుల మార్గాయాసాన్నపనయించి సేద దీరుస్తుంటుంది. ప్రవహించే నిర్మల స్వాదుజలాలు ఎన్నో ఓషధుల సారాన్ని తనలో లీనం చేసుకుని పవిత్రతను, పావనత్వాన్ని అంతర్నిహితం చేసుకుని యాత్రికుల సర్వపాప హరణములు, దోషనివారణంఅయి ఆహ్లాదాన్ని చేకూరుస్తుంటాయి. శ్రీస్వామినిగురించి ఆయన అద్భుత లీలలను స్మరిస్తూ ఎనలేని భక్తిప్రపత్తులతో స్వామిని కీర్తిస్తూ, పాటలు పాడుకుంటూ దివ్యానుభూతితో నిండిన సుమనస్కులైన యాత్రికులు మహాజన సాగరంగా కొండలు, గుట్టలు స్వామి భజనల్తో మార్మోగిపోతూ పవిత్రతను దీప్తంచేస్తూ ఉల్లాసకరంగా సందడి సందడిగా ఉంటుందీ ప్రదేశం. సంవత్సరం సంవత్సరం శబరిమల స్వామి అయప్ప దర్శనాభిలాషులై చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా, సంపన్నులు, మాన్యులు, సామాన్యులు అందరూ కులమత భేదాలన్నిటినీ మరచి సమూహాలు, సమూహాలుగా యాత్రలు సాగిస్తారు. యాత్ర సాగించాలనుకునేవారు ముందల దినాల్లో శ్రీ స్వామి దీక్ష స్వీకరించాలి. దీక్షను ఒక గురుస్వామి వద్ద తీసుకోవాల్సి వుంటుంది. శ్రీగురుస్వామి దీక్షను యిచ్చేటప్పుడు ఒక నల్లచొక్కా, నల్లలుంగీ, నల్లతుండు, తులసిమాలధారణకు అనుమతి యివ్వడంతోపాటు నియమనిష్ఠలు చెబుతారు. కాళ్ళకు చెప్పులు ధరించకూడదు. మధుపానాలు, పొగత్రాగటం, అబద్ధమాడక, రజస్తమోగుణాలకు దూరంగా ఏవిధమైన మానసిక వత్తిడులకు లోనుగాక పాపాలన్నింటికీ దూరంగాఉండి స్వామికి సర్వము అర్పణచేసి ఋజువర్తనులై చరించాలనే నియమాలు మరికొన్ని అంతర, బాహ్య నియమావళితో రూపొందిన దీక్షను అనుగ్రహిస్తారు.

ఈ దీక్షను తీసికొని స్వామి దర్శనానికి లభించిన రోజువరకు పరమ పవిత్రమైన జీవితాన్ని గడపవలసి వుంటుంది యాత్రిక భక్తుడు. ఈ దీక్షలలోను, యాత్రలోను సర్వమానవ సమానత్వం, మాననీయమైన మహా మానవతావాదం, ఎన్ని కష్టాలైనా ఎదుర్కొనగలిగిన సమిష్టి జీవన విధానంలోని పరమార్థత, జాతీయత, జాతీయ సమైక్యత, సమగ్రతలు ఈ దేశంవరకే పరిమితం కాకుండా సకల భువనాన్ని సమ్యక్ దృష్టితో చూడగల విశాలదృష్టి, సృష్టిలోని సకల జీవుల్లోనూ, ప్రతి అంగుళంలోను, ప్రతిరాయిలోను, నీరు, గాలి, సర్వం తానేయయి వెలిగే పరమాత్మ దివ్యతత్వం బోధ పరిచేదిగా వుండటం ఒక గొప్ప విశేషం.

అందువలననే గాబోలు ప్రతి సంవత్సరం భక్తకోటి సంఖ్య ఇనుమడిస్తూ యాత్రికుల సంఖ్య స్థిరంగా పెరుగుతూంది. కొత్తగా దీక్షతీసికొని, మొట్టమొదటిగా స్వామి సన్నిధికి వెళ్ళేవారిని 'కన్ని అయ్యప్ప' అని అంటారు. స్వామి మహిమాన్వితుడుగా ప్రసిద్ధి.

'శబరిమల' చేరటానికి మూడు ముఖ్య మార్గాలున్నాయి. ఈమూడు మార్గాలు యాత్రికుని సౌలభ్యం అభిరుచిని బట్టి ఎన్నుకోవచ్చు.

(1) అతి ప్రాచీనమార్గం- ప్రధానమైంది- భక్తి, శక్తి గలవారు- అద్భుత సాహస యాత్రాభిలాష లైనవారు ఎన్నుకునే 'ఎరుమేలి' మార్గం. ఎరుమేలి నుండి అయ్యప్ప స్వామి ఆలయం సుమారు డెబ్బయి కిలోమీటర్ల దూరం వుంటుంది. అంతా నడిచి దుర్గమ పర్వతాలమీదుగా వెళ్ళవలసింది ఒక అద్భుత సాహసయాత్రేనని చెప్పుకోవాలి. కొట్టాయం స్టేషనుకు చేరాలి. కొట్టాయంనుండి ఎరుమేలికి బస్సులు, టాక్సీలు వానులు ఉంటాయి. విజయవాడ నుండి, హైదరాబాదు నుండి నేరుగా కొట్టాయం రైలులో చేరవచ్చు. 'ఎరుమేలి' స్వామి అయ్యప్ప 'ధర్మశాస్త'గా వెలిసిన చోటు. హరిహరసుతుడు అయ్యప్పస్వామి అద్భుత లీలలను ప్రదర్శిస్తూ ఆడి, నడయాడి వీరవిహారం చేసిన పుణ్యస్థలాలెన్నో వున్నాయి. పురాతన స్నానఘట్టాలలో స్నానం చేసి పునీతులైన యాత్రికులు మార్గంలోని కష్టాలను ఉత్సాహంతో అధిగమిస్తూ ఎనిమిది రోజులు ప్రయాణించి 'శబరిమల' లోని స్వామి సన్నిధికి చేరుకుంటారు. ఎరుమేలిలో 'పెట్టతుళ్ళియి' నృత్యంతో ఉత్సాహభరితంగా ప్రారంభ మవుతుంది. ఈ మార్గం జనవరి 6వ తేదినుండి 13వ తేదివరకు తెరచి యుంచుతారు. మిగతా రోజుల్లో మూసి వుంటుంది. గమనించవలసిందదు మిగతా రోజుల్లో- గమనార్హమైన విషయం.

(2) తేని, కంభంల ద్వారా వండి పెరియూరులోగల శబరిమలై యాత్రలోని మొదటి మజిలీ చేరవచ్చు. ఇక్కడినుండి 45 కి మీ. దూరం నడక మార్గం. అయితే యిక్కడ టీ తోటలు విస్తారంగా పెంచబడటంతో 25 కి.మీ. దూరం వరకు జీపులు, వ్యానులు వెళతాయి. ప్రయివేటు వాహనాల్లో వెళ్ళవచ్చు. అక్కడి నుండి 20 కి.మీ. దూరం నడిచి స్వామి సన్నిధిని చేరగలం. చాలా కష్టతరమైన మార్గం. నిట్టనిలువైన కొండలు గుట్టలు ఎక్కవలసి వుంటుంది. ధర్మశాస్త తిరుగాడిన పుణ్యస్థలాలు ఈ మార్గంలో తగలవు. కనుక అనేకమంది మొదటి మార్గంలో స్వామి సన్నిధిని చేరి తిరుగు ప్రయాణానికి ఎక్కువగా ఉపయోగిస్తారు.

(3) శబరిమలై 'పంబ' నదితీరంలో అమరియున్నది. పంబ సుమారు 120 కి.మీ. దూరం వుంటుంది. కొట్టాయం నుండి. బస్సులు, వేన్లు, టాక్సీలు విరివిగా దొరుకుతాయి. పవిత్రస్నానం పంబానదిలో నిర్వర్తించుకుని సీలిమల దగ్గర సద్ది వండుకుతిని వృద్ధులు, త్వరగా ఇల్లు చేరాలనేవారు, కొంత అనారోగ్యంతో బాధ పడే వారు ఈ మార్గాన్నెన్నుకోటం పరిపాటి.

మొట్టమొదటిగా దీక్షతీసుకుని స్వామి దర్శనార్థులై వచ్చే 'కన్ని అయ్యప్ప'లు కష్టభూయిష్టమైనా ఒక్కసారియైనా ఎరుమేలి మార్గం గుండా పయనించాల్సిన అవశ్యకత ఎంతయినా వుందంటారు. పంబనుండి స్వామి శబరిమల ఎనిమిది కిలోమీటర్లు మాత్రమే వుంటుంది.

శ్రీ స్వామి కారణజన్ముడు. మహిషాసురుని వధానంతరం మహిషి అతని భార్యయైన రక్కసి ప్రజాకంటకురాలిగా మారింది. దీనిని సంహరించటానికి కావలసిందొక కొత్తరకమైన పుట్టుక. అదే ఇద్దరు పురుషులకు అవతరించిన విచిత్ర జన్మ. మోహిని అవతారంలో ఉన్న శ్రీ మహావిష్ణు స్వరూపాన్ని చూచి క్షణకాలం చలించగా స్ఖలించి శివుని వీర్యకణం హరిహర సుతుడైన అయ్యప్పగా రూపొంది పందలరాజుకి సంతాన భాగ్యంగా అమరించబడి నట్లుగాను, మణికంఠుడనే నామ ధేయంతో పెరిగి పెద్దవాడైన వానిని సవతితల్లి పనుపున పులిపాలకై వెడలి అరణ్యాల్లో తిరిగి మహిషిని సంహరించిన మణికంఠుడు స్వామి అయ్యప్పగా వెలిసి భగవంతుని అవతార విశేషంగా కొనియాడబడిన దేవుడుగా గణుతికెక్కాడు స్వామి. అయితే యిక్కడ ఒక విషయం పరిశీలనాంశంగా ముచ్చటించడం అప్రస్తుతం కాదని అనుకుంటాము. ఇది మా భావన మాత్రమే: శైవమతం, వైష్ణవమతం విడివిడిగా కాలానుగుణ్యంగా అభివృద్ధి చెంది ఛాందస ప్రవృత్తివైపు మనిషిని అయస్కాంతం

లాగ పట్టి లాగుతుండే సమయాన, ఆ పరిస్థితుల్లో ఆవిర్భవించే విభేదాలు వికృత రూపం దాల్చిన సమయంలో శివునికి సమాన ప్రతిపత్తి గలిపించి పరమాత్మ సృష్టి లోని సమైక్యభావాన్ని చాటటానికి, ఆధిక్యతా విభేదాలను రూపుమాపటానికి ఒక దివ్యా యుధంగా ఉపయోగపడిన భవ్యావతార విశేషంగా భావించటంలో గల యుక్తాయుక్తం, సముచితత్వాన్ని గురించి ఒకసారి సాలోచనాపరుడై ఒక్క క్షణం ఆలోచించి ఉచి తంగా భావించేవారికి ధన్యవాదములు. భావనలో దోషముంటే విజ్ఞులైనవారు మన్నిం చాలని ప్రార్థన. 'ఓం శ్రీ స్వామియే శరణం అయ్యప్పా'— నీపదునెట్టాంపడి ఎక్కి ఒక్కసారైనా దర్శించటానికి అనుజ్ఞ యిమ్మని మనసారా కోరుతూ- కేరళ రాష్ట్రం నుండి తమిళనాడుకు వెళ్తున్నాం. చిత్తగించండి. ఒక్క నిముషం- ఇంతలోగా కేంద్రపాలిత ప్రాంతమైన పాండిచ్చేరిని గురించి కొంచం—

# పాండిచ్చేరి

దేశమాత దాస్యశృంఖలానిబద్ధం గావించబడిన కొద్దినాళ్ళకే ఫ్రెంచివారి ఆధీ నంలో ఉన్న వలస స్థావరాలైన పాండిచ్చేరి, మాహె, కారైకాలే, యానాములను గూడా తమంతటాముగా వదలి దేశ సమగ్ర స్వరూపానికి సంపూర్ణత చేకూరడానికి తోడుపడిన ఫ్రెంచివారు ప్రశంసా పూర్వకపాత్ర వహించారు. ఈ 4 ప్రాంతాలు కలిపి యూనియన్ టెరిటరీగా ఏర్పడింది. అన్నీ సముద్రతీరాలే. ఒక్కొక్కటి ఒక్కొక్క దక్షిణాది రాష్ట్రమునకు చేరువలో ఉంది. బంగాళాఖాత తీరంలో ఉన్న పాండిచ్చేరి, కరైకాలె, యానాంలు బంగాళాఖాతం కోస్తాతీరంలో తమిళనాడుకు సమీ పంలో పాండిచ్చేరి, తమిళనాడులోనే చేరిన తంజావూరు జిల్లాలో కరైకాలె, యానాం ఆంధ్రప్రదేశ్‌లోని కాకినాడ తీరానికి దగ్గరగాను, మాహె కేరళలోను ఉన్నాయి. ప్రస్తుతం పాండిచ్చేరిని గురించి ముచ్చటించు కుందాము. బంగాళాఖాత తీరంలోని మద్రాసుకు 197 కి.మీ. దూరంలో ఆగ్నేయదిశలో అమరి ఉన్నది పాండిచ్చేరి. యాత్రికులకు ముఖ్యమయిన ఆకర్షణ శ్రీ అరవిందాశ్రమం. భారతీయ ఆధ్యాత్మిక తత్వమహర్షియై ప్రసిద్ధిగాంచిన శ్రీ అరవిందయోగి, ఫ్రెంచి దేశానికి చెందిన మాత శ్రీలు రూపొందించిన ఈ ఆశ్రమానికి పురాణప్రసిద్ధి చెందిన అగస్త్య మహాముని వింధ్య పర్వతాలనుదాటి ఉత్తర భారతాన్నించి వచ్చి ఇక్కడే తమ ఆశ్రమం నిర్మిం చుకున్న స్థలమహత్య ప్రభావం ఇమిడియున్నదనే అభిప్రాయం ఎంతయినా సముచి

తంగా గోచరిస్తుంది. ఫ్రెంచి పురాతత్వ శాస్త్రజ్ఞులు ప్రొఫె- దూబ్రియోలె మహ శయుల ఉద్దేశం ప్రకారం- ప్రస్తుత అరవిందాశ్రమ వనం అగస్త్య మహాముని ఆశ్ర మం పునాదిగా ఉన్న చోటేను- అని నొక్కి చెపుతూ దాని కారణాలు కూడా వివరించారు.

పూర్వనామం పుదు-చ్చేరి. అంటే కొత్త- ఊరు అనబడే ఈ ప్రాంతానికి పురాతననామం వేదపురిగా ఉన్నట్లు తెలుస్తుంది. పెదూపట-పట్నంలో ఉన్న అనాది దేవాలయంలో వేంచేసియున్న వేదపురీశ్వర స్వామి. అరికమేడులో జరిగిన త్రవ్వ కాలలో అనేకవిషయాలు బయటపడ్డాయి. పూర్వం రోమనులు ఇక్కడ వలస ఏర్పరచు కొని పాండిచ్చేరి- రోము నగరాలమధ్య వ్యాపారాలు జోరుగా సాగినట్లుగా వెలువడిన వివరాలు గమనించతగినవి.

పోర్చుగీసు వారిని, డేనియన్లును అనుసరించి ఫ్రెంచివారు కాలుపెట్టారు. 1693లో డచ్చివారు జింజి పాలకుల దగ్గర కొంత మూల్యానికి కొనుక్కొన్నారు. తరువాత 4 సంవత్సరాలకు ఫ్రెంచివారితో జరిగిన ఒడంబడికను అనుసరించి, ఫ్రెంచివారు తమ ఆధీనంలోకి తీసుకొన్నారు. అప్పుడు దీని పాలకులు ఫ్రాంకాయిస్ మార్టినే.

యూరోపులో ఇంగ్లాండు, ఫ్రాన్సుల మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. వాటి ప్రభావం ఇక్కడకూడా ప్రతిస్పందింపాయనడంలో సందేహం లేదు. ఫ్రెంచివారిని ఇంటికి పంపాలని బ్రిటిష్‌వారు ఎన్నోసార్లు ప్రయత్నించారు. దాని ఫలితంగా పట్నం ఎన్నోసార్లు చేతులు మారింది. కాని ఇక చివరగా 1816లో ఫ్రాన్సువారి చేతిలోకి వచ్చి ఇటీవల వదులుకునేంత వరకూ వారి ఆధీనంలో ఉంది.

ఇంతగా ఫ్రాన్సువారి అధీనంలో ఇన్నాళ్ళున్నా, ఆ జాతియుల ప్రభావం ఈ గడ్డమీద ఎంతవరకూ ఉందనే ప్రశ్నకి- ఏమీలేదు- అని చెప్పవలసిందే. అందరూ ఇంగ్లీషు బాగా మాట్లాడుతారు. అక్కడక్కడ ఫ్రెంచి భవనాలు, పాఠ్యాలు వగయి రాలు అన్నింటినీ కూడా ఇక్కడి ప్రధాన హైందవాధ్యాత్మిక కేంద్రం శ్రీ అరవింద ఆశ్రమం అన్నిటిని మింగివేసి అధిక్యంగా సమున్నతంగా నిలబడింది. ఆశ్రమకార్య కలాపాలు, ఉనికి యాత్రీకులకు ఒక వింతైన ఆశ్చర్యానందానుభూతి. వసతికి ఆశ్రమంవారు నిర్వహణలోని కుటీరాలు, మంచి హోటళ్ళు ఉన్నాయి.

## పాండిచ్చేరిలో చూడదగినవి :

### శ్రీఅరవిందాశ్రమం :

భారత జాతీయతా మహాప్రవక్త శ్రీ అరవిందులు మహాయోగి. గొప్ప తాత్త్వికులు, బోధకులు. 'యోగము'లోని అనేక రహస్యాలను విప్పిచెప్పే సూత్రాలను కనుగొని వాటన్నిటినీ ఒకచోటచేర్చి సమగ్ర స్వరూపం ఏర్పరచిన మహోపాధ్యాయులు. దీన్నే 'సమగ్రయోగ' అని అంటారు.

విద్యాభ్యాసము అంతా ఇంగ్లాండులోనే జరిగింది. స్వాతంత్ర్య సముపార్జనలో విప్లవపంథా ననుసరించిన వారి మన్ననలను పొందిన శ్రీ అరవిందులు కొన్నాళ్ళు బరోడాలోను, కలకత్తాలోను ఉన్నారు. తరువాత ఆత్మతత్వ ప్రేరితులై 1910లో ఇక్కడికి ఈ ఫ్రెంచి వలస ప్రాంతానికి వచ్చి స్థిరపడ్డారు.

మానవుడు నిరంతర పరిణామజీవి. అతనిలో అనంతమైన శక్తులు దాగియున్నవి. అవి నిగూఢమైనవి. సాధనతో వాటిని సాధించగలడు మానవుడు. సృష్టిలో ఉత్తమ కారుణ్య భావానికి ప్రోదిచేసి మనిషిలోని దైవత్వాన్ని ప్రేరేపించి మానవాతీతుడుగా మనగలడు మనిషి. తనతోటి జీవరాసు లన్నింటిమీద కారుణ్యభావం ప్రదర్శించి మానవోత్తముడు అయి దేవదేవునికి ప్రీతిపాత్రమై చరించి ముక్తుడు కాగలడు. ఈ తత్వము అరవిందుని బోధనల్లోనిది మనిషిని కేవలం మనిషిగాకాక మనీషిగా మలచే తత్వ దర్శనం ఆయన చూచారు. ఇతరులకు దాన్ని బోధించారు. ఈ పరమార్థ సాధనంలో వారు ఈ ఆశ్రమస్థానంలో ఎంతోమందికి మార్గదర్శకులైనారు. దేశ విదేశాల్లో అనుచరులు, శిష్యులు ఉన్నారు. 1910లో వచ్చిన శ్రీ అరవిందులకు తోడుగా 1920 మాతశ్రీ ఫ్రెంచినుండి వచ్చారు. ఈమె మాత (MOTHER) గానే ప్రసిద్ధి. అసలు పేరు ఏమిటో చాలామందికి తెలియదు. మాతరాకతో ఆశ్రమం పరిపుష్టమై సమగ్రాభివృద్ధివైపు నిరంతరం పురోగమిస్తూనే వుంది. 1950లో శ్రీఅరవిందులు దేహత్యాగం చేసిన తదుపరి మాతశ్రీయే ఏకైక మార్గదర్శిని అయింది. లోపరహితంగా ఆశ్రమ కార్యక్రమాలు నిర్వహిస్తూండేది. 1973లో ఆమెకూడా ఇహలోకం నించి కనుమరుగైనారు. ఆశ్రమ వాతావరణం ఆధ్యాత్మికతతో నిండి నిబిడీకృతమైంది. దార్శనికుల ఇద్దరి సమాధులూ నిరంతరం పుష్పాలతో అలంకరించబడి, చందనాగరు ధూప, కర్పూర నీరాజనాలతో ఆధ్యాత్మిక తత్వసుగంధ సమ్మిళితమై వుంటుంది. ప్రత్యేక అనుమతితో శ్రీ అరవిందుల వారు నివసించి నడయాడిన ప్రదేశాలు ఆయన గదిని చూడవచ్చు.

ఆశ్రమంలో సంవత్సరంలో నాలుగు రోజులు ఆశీర్వచన దినాలుగా పరిగణి స్తారు. ఫ్రిబవరి 21 మాతృశ్రీ జన్మదినం. ఏప్రిల్ 24వ తేది- ఆమె యిక్కడకు శాశ్వతంగా వుండిపోవటానికి వచ్చినతేది, ఆగస్టు 15, దేశానికి స్వతంత్రం వచ్చిన రోజు- శ్రీ అరవిందులవారి జన్మదినం, నవంబరు 24 శ్రీ అరవిందులవారు జ్ఞాన సిద్ధి పొందిన దినం. ఈ దినాలలో ధ్యానాలు చేస్తారు, అరవిందుని గదిని పరమ పావనంగా దర్శిస్తుంటారు.

శ్రీ అరవిందులు, మాతృశ్రీ యిద్దరూ భారతీయాధ్యాత్మికతలో పరిపక్వం చెందిన పరిపూర్ణ మనీషులు.

విద్యార్థులను పరిపూర్ణ వ్యక్తిత్వంతో సమగ్రంగా తీర్చిదిద్దటానికి సరియైన విద్యా కేంద్రము- శ్రీ అరవింద ఇంటర్‌నేషనల్ సెంటర్ అఫ్ ఎడ్యుకేషన్ సంస్థగా మహాగణ్యత పొందింది. యువకులకు ఆశ్రమంలో ఉన్న ఆటస్థలం, జిమ్నాసియంలు ఔత్సుక్యాన్ని కలిగించేవి. ఇక్కడ విద్యాబోధన కూడా A SOUND MIND IN A SOUND BODY అనే సూత్రంమీద ఆధారితమైంది.

కుటీర పరిశ్రమలు :

చేతితో తయారుచేయబడే కాగితం పరిశ్రమ, కొన్ని పరిమళ ద్రవ్యాలు, ఎంబ్రాయిడరీ కుట్టుపనులు, లేసుఅల్లికలు, బాటిక్ అద్దకాలు, చలువరాతితో శిల్పాలు సుగంధాలీనే అగరువత్తులు ఆశ్రమవాసులు నిర్వహించే కొన్ని కుటీర పరిశ్రమలు. యాత్రికులకు ఇవన్నీ చూపించటానికి ఒక ఆహ్వాన సంఘం ఉంటుంది. వారి సేవలు ఉ. 8 గం. నుండి లభ్యం.

అక్కడ కొన్ని దినాలువుండి ఆధ్యాత్మిక సురభిళాన్ని అమూలాగ్రం ఆస్వా దించాలంటే ముందుగా వ్రాసి అనుమతి పొందాల్సి వుంటుంది.

ఆరోవిల్లి :

పాండిచ్చేరి శివార్లలో 6 కి.మీ. దూరంలో మానవోత్తములుగా జీవించాలను కునేవారి ఆశయాల కనుగుణంగా వర్ధిల్లుతున్న పట్టణరాజం. శంఖుస్థాపన 1968 లో జరిగింది. ప్రతిదేశం నుండి ఒక బాలుడు, ఒక బాలిక ఆయా దేశాల పవిత్ర మృత్తి కలుతెచ్చి మహాపద్మంలో నింపుతారు. శ్రీ అరవిందాశ్రమ వాటికా నిర్వాహకులు శ్రీ అరవింద్ సొసయిటీవారు శ్రీ అరవిందుల యొక్కయు- మాతృశ్రీ యొక్క సార్వ జనీనతా ధర్మములను చాటే విధంగా సమిష్టిగా సర్వమానవ జీవన ప్రాతిపదికగా

విశ్వమానవ వాటికగా పెంపొందటానికి వ్యవసాయం, తోటపని వగయిరాలతో అనేక సమిష్టి జీవన విధానాలు నిర్దేశించేవాటిని పటిష్టంగా అమలు జరుపుతూ అభివృద్ధికి కృషి గణనీయంగా జరుగుతుంది. ఎంతో ఆదర్శనీయం, మాననీయం. మహోన్నత మానవతా విలువలు పెరగాలంటే పరిపూర్ణ వ్యక్తిత్వం సిద్ధించిన పౌరులు తయారవటానికి ఇటువంటి సంస్థ లెంతయినా ఉపయుక్తం.

మ్యూజియం :

పట్టణంలో రోమయిన్ రోలండ్ రోడ్డులో అమరియున్న ఈ మ్యూజియంలో ఎన్నో చారిత్రక పురాతత్వ వస్తువిశేషాలు దర్శనీయం.

1826లో వ్యవస్థీకరించిన బొటానికల్ గార్డెన్ కనులకు ఆహ్లాదకరంగా రంగు రంగుల పుష్పాలతో కనబడే కమనీయమైన పుష్పవనం. వనంలో ఒక చిన్న అక్వేరియం- జలజంతు ప్రదర్శనశాల కూడా ఉంది. దర్శనీయం.

కేంద్ర ప్రభుత్వము వారిచే స్థాపించబడిన జవహర్‌లాల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్టు గ్రాడ్యుయేట్ మెడికల్ కాలేజి & రిసెర్చి గొప్ప పరిశోధనా కేంద్రం. దీనికి తోడు ఫ్రెంచి ఇండోలజిస్టు డా॥ J. ఫిలియోజాట్ స్థాపించిన ఫ్రెంచి ఇన్‌స్టిట్యూట్ హైందవ సంస్కృతి సంప్రదాయాల అధ్యయన కేంద్రం, THE ALLIANCE FRANCAISE ఫ్రెంచివారి సాంప్రదాయాలను చాటే అనేక సాంస్కృతిక సమావేశాలు, ఫ్రెంచిభాషా బోధనకేంద్రం, వీటితో పాటు కొన్ని హైందవ దేవాలయాలు.

పురాతన నామాన్ని సార్థకంచేసే అనాది శివాలయం వేదపురీశ్వర స్వామి ఆలయం, 12 శతాబ్దానికిచెందిన వల్లి యనూర్ ఆలయం, తిరుకామేశ్వర, తిరువండార్ ఆలయాలు 7వ శతాబ్దానికి చెందిన శిల్పవిశేషాలు ఈ ఆలయాల్లో దర్శనీయం. శ్రీ విఘ్నేశ్వరుడు వెంచేసియున్న మానకుల వినాయగర్ ఆలయం మొదలయినవి హిందూ ఆరాధనా స్థలాలు.

పాండిచ్చేరి చుట్టుప్రక్కల :

పొదుకి, అరికమేడు- పురాతత్వ పరిశోధనల కొరకు అనేక త్రవ్వకాలు నిర్వహించబడ్డాయి. అనాదికాలపు చారిత్రక విశేషాలెన్నో ఇటీవల వెలుగు చూసినవని చెప్తారు. ఈ రెండు ప్రదేశాల్లో శిథిలావస్థలో జీర్ణమైన దేవాలయాలు- దక్షిణాది రాజ వంశాలు, పల్లవ, చాళుక్య, చోళరాజుల కాలమను ప్రతిబింబిస్తూ వివిధ శిలా శిల్పాల వైభవాల కాంతులను విరజిమ్ముతున్న వైనం గమనించగలం.

**తిరు భువనం :**

చోళులనాటి విద్యాకేంద్రం- సంస్కృతాధ్యయనాలు జరిగిన చోటుగా ప్రసిద్ధి. విష్ణ్వాలయం ఉంది. చాలా చిన్న గ్రామం.

**తిరువందర్ కోయిల్ :**

శివాలయం. తిరుజ్ఞాన సంబంధర్ కీర్తించినది. ఇది కూడా ఒక చిన్న గ్రామమే.

మదగాదిపత్తులోని శివాలయమైన 'ఒదయార్ కోయిల్' చోళుల ప్రారంభ కాలంలోని సముద్రతీర ఆలయమును ప్రతిబింబించేవి దర్శనీయం.

తమిళనాడు తంజావూరు జిల్లాలో చేరిన-

**కారైకాల్ :**

కారైకాల్లో రామాయణంలోని జటాయు పక్షీంద్రునకు గుర్తుగా జటాయేశ్వర స్వామి ఆలయం ఉంది. రావణాసురుడు సీతాపహారియై గగనమార్గంలో వెళ్తుండగా చూచిన జటాయువు అడ్డగించిన దీచోటనే అని ప్రతీతి. పక్షీంద్రుడు చేసిన సాహస ప్రయత్నం- మానవులను కర్తవ్యోన్ముఖులను చేసే ఒక దివ్యసందేశంగా భావించ వచ్చు.

**కేరళలో అమరిన మాహె :**

ఇక్కడ 1736లో కట్టించిన హిందువులు, క్రైస్తవులు, మహమ్మదీయులు అందరూ తమ తమ విభేదాలను మరచి అర్చించే చర్చి సెయింట్ థెరిసా ఆవ్ అవిలా- చూడదగింది.

కేరళలో అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకొన్న ప్రధాన రేవు పట్టణం కొచ్చిన్. కొచ్చిన్నుండి దేశంలోని వివిధ ప్రాంతా లను కలిపే రోడ్డు మార్గములు.

| గమ్యం | దూరం(కి.మీ.) | మజిలీలు |
|---|---|---|
| అల్లెప్పి | 64 | షెర్తాల-30, అల్లెప్పి-25. |
| బెంగుళూరు | [illegible] | త్రిచూర్-8[illegible], పాలిఘాట్-1[illegible], మైసూరు-201, బెంగుళూరు-180. |

| | | |
|---|---|---|
| కోయంబత్తూరు | 223 | త్రిచూర్-80, చేరుతురుత్తి-29, పాలఘాట్-54, కోయంబత్తూరు-60. |
| గురువయూరు | 109 | త్రిచూర్-80, గురువాయూర్-29. |
| గోవా | 848 | కాలికట్-225, కన్నానూరు-89, మంగళూరు-138, కుందపూరు-92, కార్వార్-175, గోవా(పానాజి)-129 |
| కన్యాకుమారి | 309 | అల్లెప్పి-64, క్విలన్-86, త్రివేంద్రం-73, కన్యాకుమారి-86. |
| కొడై కెనాల్ | 444 | కొట్టాయం-76, తెక్కాడి-114, మధుర-134, కొడై కెనాల్-120. |
| మద్రాస్ | 694 | త్రిచూరు-80, పాలఘాట్-83, కోయంబత్తూరు-60, మద్రాసు-471 |
| మధుర | 324 | కొట్టాయం-76, తెక్కాడి-114, మధుర-134. |
| మైసూరు | 470 | త్రిచూర్-80, పాలఘాట్-83, కోయంబత్తూరు-60, మెట్టుపాలెం-38, ఊటి-51, మైసూరు-158. |
| ఉదకమండలం (ఊటి) | 312 | త్రిచూరు-80, పాలఘాట్-83, కోయంబత్తూరు-60, మెట్టుపాలెం-38 ఉదకమండలం-51. |
| తెక్కాడి | 190 | కొట్టాయం-76, తెక్కాడి-114. |
| త్రివేంద్రం | 223 | అల్లెప్పి-64, క్విలన్-86, త్రివేంద్రం-73. |
| తిరుచురాపల్లి | 476 | కొట్టాయం-76, తెక్కాడి-114, మధుర-134, తిరుచురాపల్లి-152. |



# తమిళనాడు



'తమిళ' అనే మాట పూర్వచరిత్రను తీసుకుంటే కనీసం ఆరువేల సంవత్సరాల వెనక్కి వెళ్ళాలి. ఆసియా మైనరు ప్రాంతాల్లో 'టిర్మిలి' అనేవారి పూర్వపు చరిత్రను పరిశీలించితే వెలువడే విశేషం– ఒకానొకప్పుడు గ్రీకులు వ్రాసిన ఉటంకించబడిన 'టెర్మిలయ్' (TERMILAI) పద ఆవిర్భావం ఎలా జరిగిందీ పరిశీలించాల్సివుంటుంది. ద్రమిజ (DRAMIJA) అనేది క్రమపరిణామమే 'టెర్మిలయ్'. ద్రమిజ అనేపదం రెండురీతుల్లో పరిణమించింది. (1) ద్రమిజ దమిజ క్రమీణ ఇప్పటి 'తమిళ'గాను, ఇది దక్షిణదేశంలో–(2) ఉత్తర హిందూస్థానంలో ఆర్యుల్లో 'ద్రమిజ–ద్రమిల–ద్రావిడగా రూపాంతరం చెందటం. ఆర్యులరాకకు ముందు సింధునదీ పరీవాహక ప్రాంతాల్లో వలస ఏర్పరుచుకున్న మధ్యధరా సముద్ర ప్రాంతంనించి నివాసమేర్పరచుకున్న కొన్ని జాతులు, తెగలవారని పట్టణ నిర్మాణదక్షులై నాగరికతను వెలయించినవారుగా చరిత్రచే గుర్తించబడినవారు ఆర్యులరాకతో దక్షిణ ప్రాంతాలకు తరిమి వేయబడ్డారు కొంతమంది. ఆ విధంగా మన పూర్వులు ద్రావిడులుగా పిలవబడ్డారని భావించబడింది. తరువాత కాలక్రమేణా దక్షిణాదికి వలసలు వచ్చినవారు రాగా మిగిలినవారు ఆర్యులతో సత్సంబంధా లేర్పరుచుకుని వారూవీరనే భేదంలేకుండా ఒకేజాతిగా కలిసిపోయినట్లుగా చారిత్రకాధారాలు చాటి చెప్తున్నాయి. ఏది ఎలావున్నా అన్నిభాషలకు తల్లివంటి సంస్కృతభాష ప్రభావం కొద్దిమాత్రంగా ఉన్నా మిగతా దక్షిణాది భాషలమీద ప్రసరించినంత ఎక్కువగా ప్రసరించలేదు. దాని ప్రాచీనత్వాన్ని, ప్రత్యేక రీతుల్ని, పలుకుబడిని అనాదికాలం నుంచీ కాపాడుకుంటూ వచ్చిన ధనతంలో అతిశయోక్తి లేదు. కనుక తమిళనాడు 'తమిళంభూమి'గా తన ప్రత్యే

కతను, విశిష్టతను వెలువరుస్తూనే వుంది. ఇక్కడి ప్రజలు కష్టపడి పనిచేసేవారు. పట్టుదల, కార్యదీక్ష, దైవభక్తి కలవారు.

తమిళనాడుకు, తమిళభాష కెంత ప్రాచీన చరిత్రవుందో అంత వైభవోపేత మయిన చరిత్ర వుంది. పురాతన సంప్రదాయం, సంస్కృతీ వైభవాలకు కాణాచి. శోభస్కరమైన వారసత్వం ఉంది. ఈ రాష్ట్రం

భౌతికంగా :

స్వతంత్ర భారతంలో దక్షిణ ప్రాంతంలో తూర్పుదిశన అమరియున్నది. తూర్పున బంగాళాఖాతం, పడమర అరేబియా సముద్రం, కేరళ, కర్నాటక రాష్ట్రాలు, ఉత్తరాన కర్నాటక రాష్ట్రంలో కొంతభాగం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలతో ఆవరించ బడియున్నది.

భౌగోళికంగా :

ప్రాంతీయ విభేదాలను బట్టి రెండు సహజ విభాగాలుగా విడదీయవచ్చు. (1) తూర్పున కోస్తా ప్రాంతం, (2) ఉత్తరం నుండి పడమరవరకూ వ్యాపించిన పర్వతప్రాంత భూమి, పశ్చిమాన 80 కి.మీ. నుండి 160 కిలోమీటర్ల దూరంవరకూ పడమటి కనుమల పర్వతశ్రేణి సాగి వుంటుంది. సముద్రతలానికి 1220 మీటర్ల నుండి 2440 మీటర్ల ఎత్తువరకూ వివిధ శిఖరాల అమరిక వుంది. ఇది సహజంగా ఏర్పడిన పెద్ద కోటగోడగా వుంది. దక్షిణంగా ఏర్పడిన శ్రేణుల్ని ఆన్‌మలయ్ శ్రేణులుగా పిలుస్తారు. తూర్పున ఏర్పడిన పళనికొండల్లో ప్రసిద్ధమైన పర్వత విశ్రాంతి కేంద్రం కొడైకెనాల్ అమరివుంది. పడమటి కనుమల శ్రేణి అంతా పచ్చటి దట్టమైన సతత హరితారణ్యాలతో నిండి వున్నది. పర్వత పాలుతలాల్లోను, లోయ ల్లోను కావేరి, వైగై, తామ్రపర్ణి నదులు ఆవిర్భవించిన ప్రదేశాలున్నాయి. ఈ కొండల్లో నీలగిరి, ఆన్‌మలై కొండలు చాలఎత్తయినవి. నీలగిరిజిల్లాలో అతి పెద్దదిగా ఉన్నది దొడబెట్ట శిఖరం. ఎత్తు 2,640 మీటర్లు.

ఈ రాష్ట్రంలో ప్రవహించే నదులన్నీ చాలావరకు వర్షాధారిత మయినవి. పెద్దనదులుగా పరిగణించబడేవి, జీవనదులైనవి పాలారు, చెయ్యారు, పొన్నయ్యారు, కావేరి, మోయారు, భవాని, అమరావతి, వైగై, చిత్తర్, తామ్రపర్ణిలు. వర్షాకాలపు నదులుగా వెల్లార్, నోయిల్, సిరోలియార్, గుండార్, వైపార్, వాల్పారాయ్,

వర్షాలిలు. వీటన్నింటిలో రాష్ట్రంలో ప్రథమ గణ్యత, 760 కి.మీ. పొడవునా ప్రవహించేదిగా కావేరినదికి మాత్రమే। పడమటి కనుమల్లోని కూర్గు కొండల్లోనిది. అరేబియా సముద్రానికి దగ్గరిలోని బ్రహ్మగిరిలో పుట్టి, తంజావూరు జిల్లాలో బంగాళాఖాతంలో సాగరసంగమం చేసే ఈ మహానది ఒక బ్రహ్మాండమైన సారవంతమైన డెల్టాను ఏర్పరుస్తుంది.

సంగ్రహంగా రాష్ట్ర చరిత్ర :

ఈ ప్రాంతం మొత్తాన్ని, కేరళలో అధికభాగాన్ని కలిపి ముఖ్యంగా మూడు మహారాజు వంశాలు పరిపాలించాయి. అవి చేరులు, చోళులు, పాండ్యులు. వీరిలో చేర రాజులు కేరళలో అధికభాగాన్ని, ఇప్పటి తమిళనాడులోని కొద్ది భాగాన్ని పాలించారు. చోళులు, పాండ్యులు ప్రస్తుత తమిళనాడులో అధికభాగాన్ని పాలించినా ముఖ్యంగా తంజావూరు, తిరుచిరాపల్లి ప్రాంతాలు చోళుల అధీనంలోవుండే- మధురై, తిరునల్వేలి ప్రాంతాలమీద పాండ్యుల ముద్ర సాధికారికంగా ఉంది. చోళులు మొదట ఉరియ పూర్‌నించి తరువాత కావేరి పట్టణం నుంచి చోళమండలం పేరుగాగొన్న ప్రాంతాన్ని పాలించారు. పాండ్యులు మధురై నించి వారి ప్రాంతాన్ని పాలించారు.

ఇవపోతే తరువాత మహారాజ వంశంగా పేర్కొనదగింది పల్లవులు. క్రీ.శ. 4 శతాబ్దంలో కాంచీ పురానికి చెందిన వీరు బహుళ ప్రాబల్యంలోకి వచ్చారు. వీరి కాలంలో తమిళనాడుకు బహుదూరంగాఉన్న విదేశాలతో వర్తకం సాగించారు. సుమారు 400 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా రాజ్యపాలన చేసిన వీరికాలంలోనే మహర్షులు అనదగిన మహాకావ్య కర్తలుగా ప్రసిద్ధిచెందిన నయినార్లు (శైవాన్ని కీర్తించినవారు) ఆళ్వారులు (వైష్ణవాన్ని కీర్తించినవారు) ప్రభవించి సాహితీ సంస్కృతులకు జీవం పోశారు. 13వ శతాబ్దం వచ్చేసరికి పాండ్యరాజులు మహోన్నత స్థితికి చేరి అంతర్జాతీయ వ్యాపారరంగాన్ని సుప్రతిష్ఠితం చేశారు. తరువాత విజయనగర సామ్రాజ్యం వెలుగులోకి వచ్చి పాండ్యులు విజయనగర రాజుల చేతుల్లో ఓడిపోయారు. విజయనగర సామ్రాజ్య పతనానంతరం చిన్నాచితకా రాజులనేకమంది తమిళనాడును ఎవరి కందినంతవరకూ వారు పాలించారు. తరువాత ముస్లిము దండయాత్రల ప్రభావం ఎంతగా వున్నా మధ్య భారతంలోనూ, ఉత్తర భారతంలోను ఉన్నంత గాఢత ఇక్కడ లేదనే చెప్పాలి. కనుకనే అచ్చమైన ద్రావిడభాష సంస్కృతీ శిల్పాలు, దేవాలయాలు చెక్కుచెదరకుండా నిలిచివున్నాయి. ఈస్టు ఇండియా కంపెనీవారు 1639లో మద్రాసులో చొరబడ్డారు. దానితో సరికొత్త అధ్యాయం మొదలైంది.

క్రమేణ దక్షిణ భారతంలోని సింహభాగమంతా కలిసి మద్రాసు రాష్ట్రం క్రింద చేరి పోయింది. బ్రిటిష్‌వారి కబంధ హస్తాల్లో బందీకృతమై పోయింది.

తరువాత స్వతంత్రంవచ్చిన తరవాత ప్రత్యేక ఆంధ్రకు జరిగిన పోరాటంతో 1952లో ప్రత్యేక ఆంధ్ర ప్రాంతం విడిపోగా, 1956 నవంబరు 1న జరిగిన రాష్ట్రాల పునర్‌వ్యవస్థీకరణతో కేరళ, కర్నాటకల మధ్య తమిళనాడు కొన్ని ప్రాంతాలు ఇచ్చి పుచ్చుకోవటంతో సర్దుబాట్లుఅయిన పిదప ఇప్పటి సమగ్ర స్వరూపం ఏర్పడింది. 1960, ఏప్రిల్‌లో చిత్తూరు జిల్లాలోని 405 చ.మై భూప్రాంతాన్ని మద్రాసుకు అప్పగించబడింది. 1969 వరకు మద్రాసు రాష్ట్రంగా పిలవబడే ఈ ప్రాంతం పేరును అర్థవంతం చేస్తూ 'తమిళనాడు'గా మార్చబడింది. రాష్ట్ర ముఖ్య పట్టణం మద్రాసే.

పాలనాపరంగా ఒకే ఒక శాసనసభ.

రాష్ట్రము మొత్తం 20 జిల్లాలుగా విభజించబడింది.

చెంగల్‌పట్టు, కోయంబత్తూరు, ధర్మపురి, కన్యాకుమారి, మద్రాసు, మధురై, అన్నా (దిండిగల్), నీలగిరి, ఉత్తరఆర్కాట్, పెరియారు, పుదుక్కోట్టయ్, రామ్‌నాథపురం, కామరాజ్ (విరుధునగర్), పోన్‌ముత్తు రామలింగం (శివగంగై), సేలమ్, దక్షిణ ఆర్కాటు, తిరుచిరాపల్లి, తంజావూరు, తిరునల్వేలి, చిదంబరణ్ణార్ (ట్యూటికరిన్).

తమిళభాష చాలా ప్రాచీనమైనది. 2000 సంవత్సరాలపైగా పూర్వచరిత్ర గలిగింది- తిరువళ్ళువర్ రచించిన సూక్తులు తిరుక్కురళ్ భారతభారతిలో సముచిత స్థానం పొందింది. అతి ప్రాచీనకాలంలో తొలి కావ్యంగా శిలప్పదిగారం- ఇలంగో అడిగళ్ రచన భాష ప్రాచీన కాలంలోనే వికసిన సాహితీమందారంగా గుర్తించబడినది.

దేశానికి ఉత్తర సరిహద్దు ఉత్తుంగ హిమాలయగిరి శృంగాలు అయితే దక్షిణాన భారతదేశపు హద్దు మూడు వైపులా ఆవరించియున్న మూడు మహాసముద్రాలు కలిసేచోటు కన్యాకుమారి అగ్రం తమిళనాడులోచేరి ఉండటం గమనార్హం. ఈ దక్షిణపుకొన సరిహద్దు రాష్ట్రం-

వైశాల్యం : 1,30,058 చ.కి.మీ.

జనాభా : 5 కోట్లు దాదాపు.

రాజధాని : మద్రాసు.

# మద్రాసు

మద్రాసు ఒక మహానగరం. భారతదేశంలోని అంతర్జాతీయ ప్రతిపత్తి గలిగిన మహానగరములు నాలుగింటిలో ఒక ముఖ్యనగరం. తమిళనాడుకు రాజధాని. సుమారు 48 లక్షల జనాభాతో నిత్యం సందడిగా ఉండే ఈ మహానగరానికి చెన్నపట్టణం అనే నామాంతరం కూడా ఉంది. ఇది ఆంధ్రులకు చెందాలని పోరాటం జరిగింది. చెన్నయి అని తమిళంలో పిలవబడుతుంది.

సుమారు 300 సంవత్సరాల క్రితం కోరమాండల్ కోస్తాతీరంలో బంగాళాఖాతం సముద్రతీరానికి ఆనుకొని 'మద్రాస్ పటమ్' అనే కుగ్రామం. ఈ గ్రామానికి దగ్గరిలోనే చుట్టుప్రక్కల మరికొన్ని గ్రామాలు ఎగ్మోరు, వెపెరి, ట్రిప్లికేన్ (తిరువల్లికేణి) ఈనాడు మద్రాసు నగరంలో జనాజన సమ్మర్దాలు ప్రముఖ వ్యాపార కేంద్రాలుగా కొనసాగుతున్నాయి. ట్రిప్లికేన్‌లో అతి పురాతనమైన పార్థసారథి దేవాలయం వుంది. సముద్రతీరమున ఉన్నవనే జాలరులు నివసించే కుప్పం గ్రామంకూడా ఉన్నది. ఇక్కడి జాలరులు మహా సాహసికులుగా ప్రసిద్ధిచెందారు. సముద్రపు ఆటుపోటు సమయాల్లో కూడా వెరువక చేపలవేటకు వెళ్ళేవారు ఆనాటి కాలంలో మైలాపూరు పోర్చుగీసువారు స్థావరం ఏర్పరుచుకున్న చిరుపట్టణం. దాని ఛాయలు ఇంకా ఇప్పటికీ స్పష్టంగా కనబడుతూనే వున్నాయి.

నగరం ఇటీవలి కాలంలో అనంతంగా ఎదిగినా అతి ప్రాచీనకాలానికి చెందిన స్థాపికలు అనేకం. రెండువేల సంవత్సరాల క్రితం తమిళంలో మహర్షిగా ఎంచబడి తమిళ సాహితీరంగంలో పెద్దపీటవేసి కూర్చోబెట్టిన తరువళ్ళు వ్రాసిన ఎన్నటికీ మాయని తిరుక్కురల్ మహారచన లోకంలో ధర్మయుత జీవన విధానానికి రాచబాట పరచిన అమోఘమైన అమృత సూక్తులు ఇక్కడ ఉండే రచించారట.

క్రీస్తు శిలువకాలం నాటి సెయింట్ థామస్ ఏసుక్రీస్తు శిష్య మహాశయులు కేరళలో తొలిపాదం మోపి తరువాత ఇక్కడికివచ్చి ఒక చిరుకొండమీద చనిపోగా ఆ కొండే సెయింట్ థామస్ మౌంట్‌గా ప్రతీతి చెందింది. ప్రస్తుతం మీనంబాకం ఎయిర్‌పోర్టుకు సమీపంలో వుంది. ఒకానొకప్పుడు మైలాపూరులోని కొంతభాగం సముద్రం ఉప్పెన ముంచి వేసిందట. ఆ మునిగిపోయిన ప్రాంతంలో తొలినాటి క్రైస్తవ శకారంభ కాలంలోని చర్చికూడ ఉండేదట. దానికి ఇంగ్లాండు రాజు కింగ్ ఆల్‌ఫ్రెడ్ ది గ్రేట్ క్రీ.శ. 883లో తన దూతలను పంపినట్లున్నా, పర్షియా దేశ

వ్యాపారస్తులు ఒక క్రైస్తవ చర్చిని సెయింట్ థామస్ సమాధిమీద వెలయించి, ఒక ఆశ్రమాన్ని కూడా కట్టించారని ప్రతీతి. ప్రసిద్ధిచెందిన వెన్నిస్ యాత్రికుడు మార్కోపోలో ఈ నగరాన్ని దర్శించాడు.

బ్రిటిషువారు ఇక్కడికి రావటానికి ముఖ్యకారణం పట్టు రవసెల్లాలు మచిలీపట్నం, గోల్కొండల కంటే మన్నిక ఎన్నికైనవి ఇక్కడ చౌకగా లభ్యం కావటమే నంటారు-ఆంగ్లసేనాని కల్నల్ న్యూవెల్, చెంగల్పట్టు నాయకరాజు 1639లో బ్రిటిషు వారితో చేసిన వ్యాపార లావాదేవీలతో ఇక్కడికి రావటం సంభవించింది. చిన్నగ్రామమే కదా అని కారుచౌకగా ఆంగ్ల వ్యాపారాలకు కౌలుకు యివ్వటం జరిగింది. ఇక అప్పటి నుండి దాని స్వరూప స్వభావాలు అతిశీఘ్రగతిన మారిపోజొచ్చాయి. ఫ్రాన్సిస్‌డే, ఆండ్రూ గోగన్‌ల చొరవతో సెంట్ జార్జికోట కట్టించబడింది. మద్రాసు పూర్తి దక్షిణభారత మంతటినీ పొదువుతున్న ఒక సమగ్ర స్వరూపం అని చెప్పుకోవచ్చు.

నగరంలో రెండు ముఖ్య రైల్వే స్టేషను లున్నాయి. ఒకటి మద్రాసు సెంట్రల్ స్టేషను. ఉత్తర దిశనుండి రాకపోకలు సాగించే రైళ్ళు అన్నీ యిక్కడే ఆగి మరలా బయలుదేరు తుంటాయి. రెండోది ఎగ్మోరు రైల్వే స్టేషను. దక్షిణాదికి, కేరళకు, తమిళనాడులోని యితర ప్రాంతాలకు రాకపోకలు సాగించే రైల్వే కూడలి కేంద్రం. స్థానికంగా తిరిగే ఎలక్ట్రిక్ రైళ్ళు తాంబ్రం, కాంచీపురం, ఆపైన కొనసాగించే ప్రయాణపు రైళ్ళు బీచ్‌స్టేషను టర్మినస్ నుండి బయలుదేరతాయి. వయా ఎగ్మోరు వెళతాయి. ఇటీవల కొత్తగా ప్రారంభించి ఉత్తర మద్రాసు స్థానికరైళ్ళు గుమ్మిడి పూండి వరకు ఉన్నవి సెంట్రలు స్టేషను వరకూవచ్చి ఆగిపోతాయి. ఇది విజయవాడ -మద్రాసు రైలుమార్గం విద్యుదీకరణ జరిగిన తరువాత ప్రారంభించ బడిందీ సౌకర్యం.

మద్రాసు నగరంలో ముఖ్యంగా దర్శనీయమైనవి :

సెంట్ జార్జికోట, కోట మ్యూజియం (FORT MUSEUM), మెరీనాబీచ్, స్నేక్‌పార్కు, గిండేపార్కు, డీర్‌శాంక్చ్యుయరీ & చిల్డ్రెన్ పార్కు, ఎగ్మోరు మ్యూజియం, వళ్ళువర్‌కోట్టం, వండలూర్‌జూ, ముత్తుకాడు బోట్‌హౌస్ యాత్రికాకర్షణలుగా ఉన్న ఈ మహానగరంలో అడుగడుగున తమిళ సోదరుల ఆధ్యాత్మిక ప్రియత్వము, భక్తిభావం, సౌమనస్యం ప్రతిఫలించుతూ అనాదినుండి యిప్పటి వరకూ ద్రావిడ సంస్కృతి సంప్రదాయాలను ప్రస్ఫుటించే అనేక దేవాలయా లున్నాయి. వాటిలో ముఖ్యంగా తిరువత్తియూరులోని శివాలయం, జార్జిటౌనులోని కందస్‌కోయిల్, ట్రిప్లి

కేసులోని పార్థసారథి దేవాలయం, మైలాపూరు కపాలేశ్వరస్వామి ఆలయం, వడపళని లోని శ్రీమురుగన్ కోయిల్ (శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం), టి. నగర్‌లోని చెన్న కేశవాలయం, తిరువాన్మయూరు బీచ్‌లోని అష్టలక్ష్మి ఆలయం, తిరువేర్కాడు లోని కరుమారియమ్మ దేవాలయాలు సుప్రసిద్ధం చెందినవి. అడుగడుగునా శ్రీవిఘ్నేశ్వరస్వామి అన్నివీధుల్లోను చిన్నా, పెద్దా గుడులు అనేకంగా వుండి అన్నిచోట్లా దర్శనమిస్తారు. అత్యంత భక్తి ప్రపత్తులతో ప్రతివారునూ దోవలోని 'పిళ్ళయ్యార్' శ్రీ గణేశునికి గుంజీలు పెట్టి వెళ్ళటం గమనిస్తాము.

మొదటగా నగరంలోని ప్రధాన సిటీబస్సు కూడలి పారిస్ కార్నర్‌లోని హైకోర్టు భవనాల వద్దనుండి నగర సందర్శన మొదలు పెట్టటం మంచిది. చైనా బజారుగా ప్రసిద్ధిచెందిన నేతాజీ సుభాష్‌చంద్రబోసు రోడ్డు అటు వాల్‌టాక్సు రోడ్డు నుండి మొదలయి ఇటు పారిస్ కార్నర్‌వరకు విస్తరించివున్న అతి జన సమ్మర్దంగా వుంటుంది. ఈ వీధి అంతమయ్యేచోట అది ఉత్తర దక్షిణాలుగా పరుచుకుని వున్న బీచ్ రోడ్డుని తాకుతూ వుంటుంది. ఈ మూలమీదనే అమరియున్న హైకోర్టు, లా కాలేజి, మరి అనేక ఇతరకోర్టు భవన సముదాయం. ఈ భవన సముదాయపు ఈశాన్య దిశలో ఒక పెద్ద లైటుహౌస్ గోపురం వుంది. అయితే ప్రస్తుతం ఇటీవల 48 మీటర్ల ఎత్తున అమర్చబడినది. ఉపయోగంలోకి వచ్చిన తరువాత ఇది వాడటంలేదు. అయినా భవన సముదాయం మొత్తాన్ని పర్యావలోకిస్తూ సమున్నతంగా నిలుచుని వుంది. భవనాలన్నీ ఇండో-సార్సనిక్ నిర్మాణరీతుల్లో చక్కగా ఎర్రని యిటుకల్తో పటిష్ఠంగా కట్టించబడింది. మద్రాసు రాష్ట్రం ప్రజలను ప్రభావితం చేసిన అనేక చారిత్రాత్మక తీర్పులు ఇక్కడినుండే వెలువడ్డాయి. కట్టడం అనేక గుమ్మటపు శిఖరాలతో కనువిందు చేస్తుంది. నగరంలో ప్రధాన సిటీబస్సు కూడలి గనుక తప్పనిసరిగా మీ దృష్టిపథంలో పడకుండా వుండదు.

బీచ్‌లైను రోడ్డుమీదనే పారిస్ కార్నర్‌కు దగ్గరిలోనే దక్షిణంగా అమరియున్న —

సెయింట్ జార్జికోట :

ఈస్టిండియా కంపెనీవారు క్రీ.శ. 1640లో కట్టించబడింది. పూర్వం బ్రిటిషువారు కట్టినకోట. అధికార గృహం. అనాడు బ్రిటిషుసైన్యాలకి విడిది వసతి. ఈనాడు తమిళనాడు స్టేట్ సెక్రటేరియట్ కార్యాలయం, లెజిస్లేటివ్ అసెంబ్లి కార్యకలాపాలు జరిగే ముఖ్య ప్రదేశంగా ప్రాముఖ్యం వహించింది. ఇక్కడి జండా స్తంభం ఇండి

యాలోకెల్లా ఎత్తయినదిగా పరిగణించ బడుతుంది. 17,18 దశాబ్దాలలోని బ్రిటిష వారి నిర్మాణానికి గీటురాయిగా నిలిచిందీ కట్టడం. బ్రిటిషవారు తొలినాళ్ళ జ్ఞాపికలను క్లైవు కార్నరు, వెల్లస్లీహౌస్, సెయింట్ మేరీస్ చర్చి, ఫోర్టు మ్యూజియంలోను భద్ర పరచబడి ఉన్నాయి.

**ఫోర్టు మ్యూజియం :**

1944లో వ్యవస్థీకరించ బడింది. ఇందులో బ్రిటిషవారి రాజరికాన్ని వెలార్చే అనేక జ్ఞాపికలు, ఆయుధ విశేషాలు, ఆనాటి సైనికుల యూనిఫారములు మొదలైన వాటితోబాటు వారు వాడిన వెండిపాత్రలు వగైరాలతో బాటుగా అధునిక కాలానికి చెందిన అనేక తైలవర్ణ చిత్రాలు చూదదగినవి. వాటిలో ముఖ్యంగా రాబర్టుకెర్ పోర్టర్ రచించిన 'THE STORMING OF SERINGAPATNAM' చిత్రం దర్శ నీయం.

**సెయింట్ మేరీస్ చర్చి :**

చిత్రంగావున్న పైకప్పు బాంబుదాడుల కతీతంగా నిర్మించబడింది. దాదాపు 5 అడుగుల మందంలో నిర్మించిన ప్రహరీగోడలు. 17వ శతాబ్దపు ఆంగ్లికన్ నిర్మాణ నైపుణ్యానికి తార్కాణం. ఈ చర్చి వ్యూహ రచయిత విలియం డిక్సన్ మహాశయుడు.

**విక్టరీ వార్ మెమోరియల్ :**

అందంగా చక్కని చెట్లు, పూదోటలు పెంచిన వన వాతావరణంలో తీర్చిదిద్దిన బీచ్‌రోడ్డులో మరికొంత దూరంవెళితే అక్కడ ఒకరోడ్డు మొదటిలో ఈ వార్ మెమో రియల్ దర్శనమిస్తుంది. దీని కత్యంత చరిత్ర ప్రాముఖ్యత వుంది. ఒకప్పుడు తీర ప్రాంత సైనిక కాపలాకేంద్రం. మన్మధుని ధనస్సుగా పేర్కొనబడింది. మొదటి ప్రపంచ యుద్ధంలోను, రెండవ ప్రపంచ యుద్ధంలోను అసువులు బాసిన సైనికుల స్మరణార్థము, విజయానికి సంకేతంగాను నిర్మించబడిన కట్టడం. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలోను, ఇండో, పాకిస్తాన్ యుద్ధంలోను, ఇండో-చైనా యుద్ధాల్లోను ప్రాణాలు కోల్పోయిన వారి సంస్మరణలు కూడా ఉన్నాయి.

**మెరినా బీచ్ :**

ప్రపంచంలోని అతి పొడవాటి అందమైన బీచిగా 12 కి.మీ. పొడవునా

వ్యాపించి ఉన్న సుందర సముద్రతీరం. పట్టణానికి ఒక ముచ్చటయిన అలంకారం. సాయంకాలపు సిరెండ బంగారు రంగులీనే ఇసుక రేణువులమీద ప్రసరించి వింత కాంతు లొలకబోస్తుంటే — మహా గంభీర గర్జనల్తో ఉవ్వెత్తున ఎగసిపడే కడలి తరంగాల హోష, చలచల్లని సాగరతీర సమీరం మనసుల కాహ్లాదాన్ని కలిగిస్తుంటే, అల్లంత దూరంలో నింగి విల్లులావంగి నేలను ముద్దాడుతున్నట్లు, చూపు కానినంతమేర అనంతముగా గోచరించే వారిరాసుల విసిలకాంతుల మధ్య రంగరంగుల పతాకాలతో అక్కడక్కడా విడిసి లంగరువేసిన పెద్దనౌకలు ఏ చిత్రకారుడి రచనకు అందని అందాల వర్ణచిత్రంలా భాసిస్తుంటే సాగరతీర జలాలతో పోటీ పడుతున్నట్టుగా కాలక్షేపం కోసం సాయం సమయాల్లో విహారం కోసంవచ్చే జనరాసుల మధ్య చిన్ని చిన్ని గవ్వల దగ్గరనించి అనేక రకాల అమ్మకోటానికి వచ్చినవారి అంగళ్ళు, మధ్య మధ్యలో వెలసిన సంచార ఫలహారశాలలు, ఓహ్! ఒకటేమిటి ఎన్నో రకాలు, రక రకాలు బీచి అంతా పరుచుకుని సందడి సందడిగావున్న మెరీనాబీచ్ అందం వర్ణనాతీతం. అనేక రాజకీయ మహాసభలుకూడా ఇక్కడే జరుగుతుంటాయి. పిల్లలు, పెద్దలు ఆనందంగా ఆటవిడుపుగా వచ్చి మానసిక ప్రశాంతి కోసం, అలసిన మనస్సులకు, శరీరాలకు కాసింత విశ్రాంతిని వెదుక్కుంటూ వచ్చినవారికి లేదు అనకుండా దొరికే చోటు అంటే అతిశయోక్తి కాదేమో!

అణ్ణాస్క్వేర్ :

తమిళనాడు గాంధీ ప్రియతమ నాయకుడు, శ్రీ C.N. అణ్ణాదురైకి స్మారక చిహ్నంగా ఒక అందాల సుందరవనం నిర్మించి అందులో ఒక సమాధిని నిర్మించి ఆ మహామనిషిని ఆశయాలకు చ్యుతిలేదని తెలియ పరుస్తున్నట్లుగా నిత్యమూ వెలిగే జ్యోతిని వెలయింటారు. సమాధి ప్రవేశంవద్ద ఒక పెద్ద ఆర్చిని నిర్మించారు. ద్రావిడ మున్నేట్ర కళగం పార్టీకి అహరహమూ శ్రమించి మానవోన్నతికి మహితకృషిని సలిపిన మనీషిగా చిరస్మణీయుడు శ్రీ అణ్ణాదురై. ఇక్కడకు దగ్గరిలోనే ఆల్ ఇండియా అన్నా డి.ఎం.కె. నాయకులు, అన్నాదురై తరువాత తమిళనాడు రాజకీయ చరిత్రలో సుస్థిరస్థానా న్నేర్పరుచుకున్న వెండితెర వేలుపు శ్రీ M.G. రామచంద్రన్‌వారి భౌతిక కాయాన్ని కూడా ఇక్కడే ఖననం చేసి స్మారకము నేర్పరిచారు. ఆయన ఇటీవలనే దివంగతులైన సంగతి మనకందరకూ తెలుసు. అభిమానులు నిరంతరం సందర్శిస్తుంటారు. దాదాపు మెరినా మైలాపూర్‌లోని శాంతోమ్ చర్చివరకూ సాగి వుంటుంది.

బీచ్‌రోడ్డు వారనే తమిళనాడును అన్నివిధాల ప్రభావితం చేసిన చారిత్రిక

పురుషులు, రాజులు, ప్రాచీన కవులు వీరందరి శిలా విగ్రహాలున్నాయి. చిరస్మరణీయులైన వారందరినీ మన మనఃఫలకాల మీదినుండి చెరిగిపోకుండా, మననం చేసుకుందుకు వీలుగా ఆవిష్కరించబడినవి. ఎదురుగా శతాబ్దాల నుండి పేరుపొందిన ప్రెసిడెన్సీ కాలేజి, క్వీన్‌మేరీస్ స్త్రీల కళాశాల, వివేకానంద గృహం, యూనివర్సిటీ సెంటినరీ హాలు మొదలగు భవనాలు మరోవైపు అమరియున్నాయి. వీధి దక్షిణపు కొసన చక్కటి లైట్‌హౌసు అధునాతనంగా రూపొందించినది- 48 మీటర్ల ఎత్తున్న దానిని చూడవచ్చు. నగరమంతా కమనీయంగా ఒకే దృశ్యంగా కనబడుతుంది. ఒకవైపు మహాగంభీరమైన ఉదధి-మరోవైపు మహానగర దృశ్యపు పెన్నిది.

ఈ లైట్‌హౌసు ప్రతిరోజూ మధ్యాహ్నం 2 గం. నుండి 4 గం. వరకు మాత్రమే దర్శనీయం.

## ఎలియట్స్ బీచి :

మెరీనా అంత సందడిఉండదు. ప్రశాంత వాతావరణం- కొందరికి బీసెంటు నగర్‌లో ఉన్నది. ఇక్కడికి ఏకాంతం కోరుతూనే చాలామంది వస్తుంటారు. చడీచప్పుడు లేకుండా నిర్మలంగా ఉంటుంది. చక్కటిగాలి, సముద్రంలో స్నానానికి కూడా చాలా అనువుగా ఉంటుంది. ఇక్కడికి దగ్గరలోనే బీసెంటు నగర తీర సైకతాం మీదుగా సముద్రం వంక దృష్టిని సారించియున్న అష్టలక్ష్మి దేవాలయం చూడదగింది. మొత్తం ఎనిమిదిమంది లక్ష్మిరూపాలను ప్రాణంపోసి ఒక్కొక్క అక్కని ఒక్కొక్క అంతస్థులో సుప్రతిష్ఠితం చేసి, చివరి లక్ష్మీ స్వరూపం చేసేసరికి పూర్తిగా పైఅంతస్థు చేరతాము. పై అంతస్తు నుండి పారజూస్తే ఎదురుగా గంభీరమైన వారాసి దర్శనమిస్తుంది. అమ్మవారి పుట్టుక కూడా మహాసముద్రమే కదా। అయితే అది పాలసముద్రము. సిరులొసంగే శ్రీ మహాలక్ష్మి మనిషికి అన్ని రూపాలు కావలసినవే. మనిషి మనుగడలో ఈ అష్టలక్ష్ములు మంచి ప్రముఖపాత్రను వహిస్తాయనటంలో సందేహం లేదు. తప్పకచూచి అనుగ్రహం పొందవలసిందే। బీసెంటు నగర్‌కు బస్సులోగాని, ఆటో, టాక్సీలలోనూ వెళ్ళవచ్చు. నూతనంగా అభివృద్ధి చెందిన ఇండ్ల వరుసలు, విశాలమైన వీధులు ప్రశాంతత వెల్లివెరిసే రాజమార్గాలు.

## పిల్లల పార్కు :

గిండీలో వుంది. సరదాగా చిన్నపిల్లలు గడపటానికి అనువైన చక్కని పార్కు. ఇందులో వుయ్యాలలు, జారుడు బల్లలు మొదలగునవి పిల్లలు ఆనందంగా కేరింతలు కొడుతూ ఆడుకోడానికి వసతి. ఉల్లాసాన్ని కలిగించే ఏనుగు, పోనీ, ఒంటె

మొదలయిన సవారీలు, తమాషాగా ఉంటాయి. అక్కడక్కడా చెంగుచెంగున గంతులు వేసే లేళ్ళు, మరికొన్ని యితర జంతువులు, పక్షులు నయనానందకరంగా ఉంటాయి. ఏనుగ, పోనీ, మొదలయిన సవారీలు కని, ఆదివారాల్లో మాత్రమే లభ్యం. వీటన్నిటినీ మించి చక్కని ఆటస్థలం కూడా ఉంది.

గమనిక :

మంగళవారాలు సెలవు. మిగతా రోజుల్లో ఉ. 8-30 నుండి సాయంత్రం 5-30 వరకూ తెరచి వుంటుంది. సెలవు దినాలు కుటుంబంలోని అందరూ వచ్చి హాయిగా కాసేపు గడిపి వెళ్ళటానికి అనువుగా వుంటుంది.

స్నేక్ పార్కు (సర్పవనం) :

అక్కడ ఎన్నో రకాల పాములు, మొసళ్ళు, వూసరవెల్లులు, బల్లులు, తాబేళ్ళు పెద్ద, చిన్నవి అనేకం చూడగలం. సందర్శనాభిలాషులకు 10 గం. నుండి ఒక చక్కని డిమాన్ స్ట్రేషన్ కూడా ఉంటుంది. సర్పాల్ని ఈ సమయంలో అతి దగ్గరినుండి చూడటానికి అనుమతిస్తారు. ధైర్యంవుంటే మీరుకూడా ముట్టుకోవచ్చు. ప్రతిరోజూ ఉ. 8-30 నుండి సా. 5-30 గం. వరకు దర్శనీయం.

మహాత్మా గాంధీ, రాజాజీ, కామరాజ్ ల స్మారకములు :

జాతిపిత మహాత్మా గాంధీజీ, మొట్టమొదటి, ఆఖరి భారతీయుడైన గవర్నరు జనరలు-శ్రీ రాజాజీ. (సి. రాజగోపాలాచారి), స్వతంత్ర భారత నిర్మాతల్లో ఒకరైన అచ్చమైన స్వాతంత్ర్య యోధులు శ్రీయుతులు కామరాజ నాడార్ వారికి స్మారక చిహ్నాలు ఇక్కడ నిర్మించబడినాయి. గిండీలోని రాజ్ భవన్ దగ్గరనే ఆనుకుని ఒక ప్రత్యేకశైలిలో నిర్మించబడినాయి. తప్పనిసరిగా చూడదగినవి. స్వతంత్రం తరువాత తమిళనాడు రాజకీయ రంగంలో ప్రముఖపాత్ర వహించి జాతి నీరాజనాలందుకున్న మహనీయులు.

వళ్ళువర్ కోట్టం :

ఇటీవలే నుంగంబాక్కంలో చక్కని ఆడిటోరియం- తమిళజాతి- సాహితీ రంగంలో అద్భుతలయినవారు, 'తిరుక్కురల్' మానవ జీవన విధానాన్ని నిర్దేశించిన సూక్తులనేకంగా రచించి సాహిత్య నిర్మాతల్లో ప్రథమ తాంబూలం యివ్వతగిన ఋషులు అయిన శ్రీ వళ్ళువర్ గారిని సంస్మరిస్తూ నిర్మించబడిన మహామందిరం,

నిలువెత్తు విగ్రహం ఈ ఆలయంలోపల సంప్రతిష్ఠితమైనది. తిరువారూరులోని రథాన్ని దృష్టిలో ఉంచుకుని అదేవిధంగా భవననిర్మాణం జరిగింది. భవనం మొత్తం ఒక రథం ఆకారంలో నిర్మించబడింది. లోపలి గోడలమీద ఆ మహనీయుని సూక్తు లను చెక్కించారు. గ్రిడ్ నిర్మాణరీతిలో నిర్మించబడిన ఈ భవనంలో స్తంభాలే లేవు. ఆసియాఖండం మొత్తంమీద అతిపెద్దదైన ఆడిటోరియంగా గుర్తించబడింది. ఉ. గం. 7 నుండి సా. 7–30 వరకు దర్శనీయం.

## హార్టికల్చరల్ సొసయిటీవారి పుష్పవనాలు :

22 ఎకరాల్లో విస్తరించియున్న రకరకాల రంగురంగుల పుష్పాలు, లతా గుల్మములు, వృక్షములు పెంచబడియున్నాయి. 1835 లో మొదలుపెట్టి వ్యవస్థీక రించబడింది. సంఘం నర్సరీవారు అక్కడ విరిసిన పుష్పజాతుల విత్తనాలు, మొక్కలు అమ్ముతారు. ప్రతి సంవత్సరం పుష్పప్రదర్శనను నిర్వహిస్తారు. ఇది సెంట్‌జార్జి కెథెడ్రల్‌కు సమీపంలో ఉన్నది.

## నేషనల్ ఆర్టు గ్యాలరీ :

ఇండో–సార్సనిక్ నిర్మాణరీతుల్లో 1906 లో నిర్మించబడిన బహుచక్కని భవనం. చూస్తే ఇదే ఒక కళాత్మకమైన కట్టడంగా కనుపిస్తుంది. మొట్టమొదట ఈ భవనం విక్టోరియా మెమోరియల్ టెక్నికల్ ఇన్‌స్టిట్యూటుగా నిర్మించబడింది. అయితే 1951లో జాతీయ భవనంగా మార్చివేశారు. నేషనల్ ఆర్టు గ్యాలరీగా నామ కరణం చేశారు. ఇందులో క్రీ.శ. 10వ శతాబ్దంనుండి వున్న యిత్తడి, కంచు లోహ పాత్రలు చక్కని నగిషీల పనులతో ఉన్నవి ప్రదర్శలో చూడగలం. వీటితో పాటుగా 11వ శతాబ్దానికి చెందిన హస్తకళా నైపుణ్యానికి అద్దం పట్టిన అనేక వస్తు సామగ్రి, 16–18వ శతాబ్దాలకు చెందిన రాజస్థాన్, మొగలాయిల వర్ణచిత్రాలు, చిత్రపటాలు– దక్కన్ పెయింటింగులు మన భారతీయ చిత్రకారుల ప్రతిభను ఈ నాటికి శ్లాఘనీయంగా కొనియాడబడే విశేషాలుగా ప్రదర్శించబడుతున్నాయి. శుక్ర వారాలు సెలవు, ప్రభుత్వ సెలవు దినాల్లోకూడా మూసివేస్తారు. ఉదయం 8 గం. నుండి సా. 5 గం.లు వరకు దర్శనీయం. ఎగ్మూరు మ్యూజియం ఆవరణలోనే ఉన్నది.

గవర్నమెంటు మ్యూజియం :

1851లో వ్యవస్థీకరించబడిన ఈ మ్యూజియం నిజంగా భారతదేశం మొత్తం లోనే పేర్కొనదగినది. నిర్మాణం అంతా ఇండో-సార్సనిక్ రీతుల్లో జరిగిందే. విక్టోరియా మెమోరియల్ హాలుకంటే మరింత ప్రాచీనమైనది. ఇందులో ఒక్కొక్క విభాగంలో ఒక్కొక్క శాఖ. భూగర్భశాస్త్ర విభాగము, వృక్షశాస్త్ర విభాగం, మానవజాతి పరిణామ క్రియాశాస్త్ర విభాగం, శిల్పం, జంతుశాస్త్ర విభాగం ఒకటేమిటి అనేక శాఖలతో విరాజిల్లుతోంది. దాదాపు క్రీస్తు పుట్టిన దగ్గరనుంచి అనేక రకాలుగా మానవజాతి జీవనవిధానం, ఉపయోగించిన పనిముట్లు— పాతరాతి యుగంనుండి కొత్తరాతి యుగం వరకు. అమరావతి నగరంలోని బౌద్ధశిల్ప కళాఖండాలు— వగైరాలు అన్నీ చూడాలంటే పరిశీలనా దృష్టితో చూచేవారికి కనీసం ఒక పూట పడుతుంది. ప్రవేశించగానే మెట్లు ఎక్కేసి గాలరీ పైకిపోయే ముందుగా మన భారతీయ భాషలు పుట్టుక— సంస్కృతాది భాషలైన— తెలుగు, తమిళ, కన్నడ, మలయాళం భాషల పరిణామ క్రమంతోపాటు క్రీ. పూ. అశోకుని కాలంనాటి లిపి వగైరాలు ఎన్నో ఆసక్తికరమైన విషయాలు— పురాతన కాలంనుంచీ మానవుడు వాడిన ఆయుధం— రాయి—సానపెట్టడం దగ్గరనుండి ఇటీవలి బ్రిటిషు కాలంలోని తుపాకుల వరకూ సకలాయుధ విశేషాలు, నాణాలు, శిలాశాసనాలు, ఇలా రాసుకుంటూపోతే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. చూచి తీరవలసింది. కంచు పాత్రల శాఖలాంటి కొన్ని గాలరీలు బహుశా దేశం మొత్తంమీద విశేషంగా చెప్పుకోతగినవి. ఉ. 9 గం. నుండి సా. 5 గం. వరకూ దర్శనీయం. మద్రాసు వెళ్ళినవారు చూసి వచ్చామని చెప్పుకునే వచ్చిన కాలేజిగా అభివర్ణించబడేదికూడా ఇదే.

అడయారులోని మర్రిచెట్టు—థియొసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజం) :

మద్రాసు నగరములో చేరిన అడయారు నదీతీరంలో ఒక చక్కని తోట. తోటలో బుద్ధుని బోధనలను, బౌద్ధమత విశ్వాసాన్ని ఇనుమడించే పురాతన ఆలయం ప్రపంచంలో అతిపెద్దది విశాలంగా శాఖోపశాఖలై ఊడలు దించుకున్న మర్రిచెట్టు 40,000 చ.అ. పర్యంతం విస్తరించినది. ప్రశాంత తపోవనాన్ని జ్ఞప్తికి తెచ్చేదిగా చూపరుల కాశ్చర్యం కలిగిస్తాయి— వీటన్నిటిమధ్య సుమారు 90 సంవత్సరాల పూర్వం మేడమ్ బ్లావట్స్కీ, కల్నల్ ఆల్కాట్ నిర్వహణలో వ్యవస్థీకరించబడిన థియొసాఫి

కల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజము)ని చూడగలం. సందర్శనాభిలాషులకు సోమవారం నుండి శుక్రవారం వరకూ ఉ. 8 గం. నుండి 11 వరకూ మధ్యాహ్నం 2 గం. నుండి 5 గం. వరకూ తెరచియుంచబడుతుంది. శనివారంలో ఒకపూట, ఆది వారాలు సెలవులు. సొసైటీ భవనంలో అరుదైన తాళపత్ర గ్రంధాలు, చేతితో వ్రాయబడిన పాత ఫర్మానాలు వగైరాలు చూడవచ్చు. విజ్ఞానదాయకం.

### కళాక్షేత్రం :

1936 లో శ్రీమతి రుక్మిణీ అరండేల్ ప్రాచీన శాస్త్రీయమైన లలిత కళలను పునరుద్ధరించడానికి ఏర్పరిచిన దేవాలయం. భారతీయ కళలను అధ్యయనం చేసే వారు దేశ విదేశాలనుండి వచ్చి ఇక్కడ చేర్చుకుంటారు. అతి సమీపకాలంలో ప్రాచ్యకళాధ్యయన విశ్వవిద్యాలయంగా రూపొందించడానికి ప్రకృతి సహజ వాతావరణంలో బోధనావసతులకోసం 100 ఎకరాలస్థలం సేకరించి ఏర్పాటులు చురుకుగా జరుగుతున్నాయి. ఇందులో, శాస్త్రీయ నాట్యం, సంగీతాలతోపాటు వస్త్రములమీద వేసే డిజైనులు రూపొందించటం వగైరాలకు ప్రత్యేక అధ్యయన ప్రతిపత్తి కల్పించబడుతుంది. ఇదికూడా అడయారులోనే వుంది.

### రాజాజీ హాలు :

బ్రిటిష సామ్రాజ్య నిర్మాతగా వాసికెక్కిన రాబర్టుక్లైవు కుమారుడు ఎడ్వర్డుక్లైవు టిప్పుసుల్తానుమీద జరిపిన యుద్ధంలో విజయ సూచకంగా ఒక బ్రహ్మాండమైన హాలును నిర్మించారు. హాలుకు చుట్టూ చక్కని వృక్షములతో అందమైనపార్కు. గవర్నరుగారి నివాసమునకుద్దేశించబడి, తరువాత రాజప్రముఖులకు ఆతిథ్యం యివ్వటానికి తగిన వసతిగా రాజరికం ఉట్టిపడే విధంగా విలాసవంతంగా కట్టించబడింది. 1802 లో ఈస్టిండియా కంపెనీవారి వాస్తుశాస్త్ర నిపుణుడు, ఇంజనీరు అయిన గోల్డింగహామ్ వారు గ్రీకు దేవాలయరూపంలో నిర్మించబడి పొడవాటి పరచిన టెర్రేస్‌లతో బహుచక్కగా వుంటుంది. అతి ముఖ్యమైన ప్రభుత్వంవారు నిర్వహించే అనేక ఫంక్షనులకు ముఖ్యభవనంగా ఉపయోగించబడుతుంది. స్వతంత్రం వచ్చిన తరువాత రాజాజీ హాలుగా పిలువబడుతోంది.

దర్శనాభిలాషులు 10 గం. నుండి 6 గం. వరకు చూడవచ్చును.

### కన్నెమెరా లైబ్రరీ :

1851 లో స్థాపించబడింది. దాదాపు ఒక లక్షపైగా గ్రంథములున్నాయి.

కన్నెమెరా హోటలును ఆనుకునే కన్నెమెరా మ్యూజియం— పురాతన రాజులచే వాడబడిన ఆయుధ విశేషాలు, పాతనాణేలు, ఆభరణాలు, అనేక శిలా శిల్పాలు భద్ర పరచబడి వున్నాయి. ఎగ్మోరుకు చెందిన పాంథియన్ రోడ్డులో అమరియున్నది దర్శనీయం. రిప్పన్ భవనాలు సెంట్రలు స్టేషను పడమటి ప్రక్కనే పూనమల్లి-హైరోడ్డులో వున్నవి. ప్రస్తుతం మద్రాసునగర కార్పోరేషను ఆఫీసులున్నాయి. మద్రాసు మహానగరంలోని ఎలక్ట్రిక్ రైలుస్టేషను అయిన బీచ్ స్టేషనును ఆనుకుని ఉత్తరంగా అమరియున్నది హార్బరు.

మద్రాసు మహానగరం అంతర్జాతీయ నగరం. అన్నిమతాలవారు తమ విశ్వాసాల ననుగుణంగా ఆరాధించటానికి అన్ని మతాలకు సంబంధించిన ఆలయాలు ప్రార్థనా మందిరాలున్నాయి.

**హైందవాధ్యాత్మిక కేంద్రాలు :**

తిరువల్లిక్కేణి (ట్రిప్లికేన్) లోగల అనాది పార్థసారథి కోవెల చాల పెద్దది.

**శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళ కోవెల :**

ఉదయవర్ల సన్నిధి. ఈవెనింగ్ బజారు దగ్గరలో.

**శ్రీ కందస్వామి కోవెల :**

జార్జిటౌనులో ముఖ్యమైన ఆలయాలు.

**శ్రీ కపాలీశ్వరస్వామి దేవాలయం :**

మైలాపూరులో వున్నది. పెయ్యాళ్వారుల సన్నిధి. మాధవ పెరుమాళ్ళ సన్నిధి గలదు. పెరియాళ్వారుల అవతార స్థలంగా ప్రసిద్ధి.

**శ్రీ వడపళని అండవర్ దేవాలయం :**

ఇది శ్రీ కుమారస్వామి ఆలయం. తమిళనాడులో కుమారస్వామిని మురుగన్ అని అంటారు. ఆలయం గోపురం చాల పెద్దది.

**శ్రీ సాయిబాబా ఆలయం :**

షెనాయి నగరులోను, మైలాపూరులోను గలవు.

**అష్టలక్ష్మి దేవాలయం :**

బిసెంటు నగర్, మద్రాసు (ముందే ముచ్చటించటం జరిగింది)

శ్రీ కామాక్షీ అమ్మన్ కోవెల :

మాంగాడు.

మాతా కరిమరియమ్మన్ కోవెల :

తిరువేర్కాడు.

మూకాంబిక దేవాలయం :

కుండ్రత్తూరు, మాంగాడు.

ఆదిపరాశక్తి ఆలయం :

మేల్‌మరువత్తూరు.

శ్రీ అయ్యప్పస్వామి దేవాలయం :

రాజా అన్నామలైపురం.

శ్రీరాఘవేంద్ర స్వామి దేవాలయం :

తిరువళ్ళిక్కేణి (ట్రిప్లికేన్), మద్రాసు.

శివకేశవాలయం :

దక్షిణ ఉస్మాన్‌రోడ్డు, టి.నగర్, మద్రాసు, పాదుళం బస్సు స్టాండుకు అతి దగ్గరలో వుంది.

శ్రీరామకృష్ణ మఠం :

శ్రీకపాలీశ్వర స్వామి దేవస్థానానికి దగ్గరలోనే ఉన్నది. మానవసేవలోని మహాత్మ్యాన్ని గమనించి విద్యా ప్రచారం, కళాపోషణ, వైద్యసేవ, ప్రకృతి వైపరీత్యాలు జరిగినప్పుడు ప్రజలను ఇతోధికంగా ఆదుకుంటూ ఆధ్యాత్మిక ప్రచారంచేస్తూ హైందవ ధర్మాన్ని అక్షరాలా ఆచరించే నిస్వార్థ సేవాకేంద్ర శాఖ.

గౌడియా మఠం :

రాయపేట హైరోడ్డులోని లాయిడ్స్ రోడ్డులో వుంది మఠం. సంకీర్తనానంద గౌరంగ మహాప్రభు సంప్రదాయంకు చెందినది.

ముస్లిమ్ సోదరులకు ఆరాధనీయ స్థలాలు :

వాలజా మసీదు :

ట్రిప్లికేన్, మద్రాసు-5.

**వెయ్యిదీపాల మసీదు (THOUSAND LIGHTS MOSQUE) :**

మౌంట్‌రోడ్డులోనే ఆగే బస్సుస్టాండు పేరు- ఆయిరం విళక్కు, మద్రాసు-5

పెరియమేట్టులోని సిడెన్‌హామ్స్ రోడ్డు, మద్రాసు-6.

సర్వమతాలకు కేంద్రం- బహాయిస్ సెంటరు, 9, సారంగపాణి వీధి, T. నగర్. మద్రాసు-17.

**జైనాలయం :**

ఏసుక్రీస్తు మహాశయుని శిష్యుడు శిలువ కాలంలోనే యిక్కడకు వచ్చారు. అంటే క్రీస్తుశకం మొదట్లోనే ఇక్కడ క్రైస్తవ మతానికి పునాది ఏర్పడిందని చెప్ప వచ్చు. మనక క్రైస్తవ సోదరులకు-

**రోమన్ కాథలిక్కులకు :**

**సెయింట్ మేరీస్ కాథెడ్రల్ :**

No 2, ఆర్మేనియన్ వీధి, మద్రాసు-1.

**సెయింట్ థామస్ కాథెడ్రల్ బాసిలికా :**

నం. 24, శాంథోమ్ హైరోడ్డు, మద్రాసు-4

**ప్రొటెస్టెంటులకు :**

**సెయింట్ మేరీస్ చర్చి :**

సెయింట్ జార్జికోటలో సౌత్‌లైన్ వీధ్, (కామరాజర్‌రోడ్) మద్రాసు-9

**సెయింట్ ఆండ్రూస్ చర్చి :**

ఎగ్మోరు, మద్రాసు-8

అందరికీ మాత.

**వేలాంకణ్ణి చర్చి :**

బిసెంటు నగర్, మద్రాసు-90

ఇంకా ఎన్నెన్నో వున్నాయి. ప్రముఖ స్థలాలకు వెళ్ళినప్పుడు ఆయా మత స్థులు తమతమ భక్తి ప్రపత్తుల కనుగుణంగా పుణ్య స్థలాలను దర్శించి పునీతం కాగలరనే ఉద్దేశంతో ఇవ్వడం జరిగింది.

ఇవి కాకుండా ఉత్సాహవంతులు, యువకులను, ముదుసలులను విశేషంగా ఆకర్షించే వెండితెర కథానాయకులు ఎంతోమంది. మీ అభిమాన నటులను చూడాలని పిస్తే ఇండోర్ షూటింగు జరిగే స్టూడియోలన్నీ కేంద్రీకృతమైన వడపళనిలోవి ఏ స్టూడియోకైనా వెళ్ళి ముందుగా పర్మిషన్ పొంది చూడవచ్చు. స్టూడియోల్లో పేరెన్నికగన్న విజయా, వాహిని గార్డెన్స్, భరణి గార్డెన్స్, A.V.M., విక్రమ్, మొదలైన స్టూడియోలన్నీ అక్కడే వున్నాయి. తారల ఆదరణకు బాలాజీవారి ఫిలింగైడులో.

ఇటీవలనే రూపొందించబడిన V.G.P. గోల్డెన్‌బీచ్ రిసార్ట్, ఇరుంబత్కామ్, V.G.P. తరువాత ప్రత్యేకంగా దర్శించదగిన V.G.P. వండర్‌లాండులను దర్శించవచ్చు.

ప్రత్యేక సమాచారం :

గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు, 154, అన్నాశాలయ్.

సమయం: 9 గం. నుండి సా. 5 గం. వరకు.

ఆదివారాలు, జాతీయ సెలవు దినాలు మూసివేస్తారు.

గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు కౌంటరు.

ఎయిర్‌పోర్టు, అంతర్జాతీయ విమానాలు దిగే రోజుల్లో 24 గంటలూ అందుబాటులో వుంటుంది. మామూలు రోజుల్లో ఉ. 8.30 నుండి రా. 8.30 వరకు.

డిపార్టుమెంటు ఆఫ టూరిజమ్, సమాచార కేంద్రం.

గవర్నమెంటు ఆఫ్ తమిళనాడు,

a) సెంట్రల్ రైల్వే స్టేషను, మద్రాసు.
సమయం: ఉ. 7.15 నుండి రాత్రి 7.15 గం. వరకు.

b) ఎయిర్‌పోర్టు సమయం: ఉ. 8 గం. నుండి సా. 8 గం. వరకు.

ప్రయాణపు రిజర్వేషనులు :

విమానం :

ఇండియన్ ఎయిర్‌లైన్సు కార్యాలయం, నం. 19, మార్షల్ రోడ్డు.
ఉదయం 10 గం. నుండి సా. 6 గం. వరకు

రైలు :

మద్రాసు సెంట్రల్ స్టేషనువద్ద ఉన్న రిజర్వేషను భవనం.

మద్రాసు, ఎగ్మూరు స్టేషను.

రెండింటికీ సమయం: ఉ. 8.30 నుండి మ. 1 గం. వరకు విరామం. మరల 1.30 నుండి రా. 8 గం. వరకు. అన్ని తరగతులకూ.

బస్సు :

ప్రైవేటు బస్సుస్టాండు రిజర్వేషనులు: 10 రోజులు ముందుగానే తీసుకోవచ్చు

ముఖ్యమయిన ఎయిర్ లైన్సు ఆఫీసులు

కన్నెమరా హోటలు దగ్గరిలో అమరియున్నవి :

ఎయిర్ఇండియా & ఇండియన్ ఎయిర్‌లైన్సు, 19, మార్షల్స్‌రోడ్డు, ఎగ్మూరు.

ఎయిర్ లంకా: హోటల్ కన్నెమెరా ఎనెక్స్, బిన్నీస్‌రోడ్డు.

M.A.S—189, అన్నాశాలై.

సింగపూర్ ఎయిర్‌లైన్సు, 167, అన్నాశాలై,

ముఖ్యమయిన దేశాల దౌత్య కార్యాలయాలు

U.K. :

నం. 24, అండర్సన్‌రోడ్డు. ఫోన్: 473136.

U.S.A. :

జెమిని సర్కిల్, 220, అన్నాశాలై. ఫోన్: 473040

పశ్చిమ జర్మని :

22, కమెండర్ ఇన్‌చీఫ రోడ్డు. ఫోన్: 82125

జపాను :

60, స్పర్‌టాంక్ రోడ్డు. ఫోన్: 665594

నెదర్‌లాండ్స్ :

789, అన్నాశాలై. ఫోన్: 811566.

మద్రాసులో ఉండటానికి వసతులు :

1) వెల్‌కం గ్రూప్ పార్క్- షెరేటన్
132, ట్రిబాయిస్ రోడ్, ఫోన్ : 452525

2) అంబాసిడర్ పల్లవ
53, మౌంటియత్ రోడ్, ఫోన్ : 868584

3) హోటల్ అరుణ్
349, పూనమల్లి హైరోడ్, ఫోన్ : 421848, 421678, 421578

4) మద్రాస్ హోటల్ అశోక
33, పాంథియాన్ రోడ్ ఎగ్మూరు, ఫోన్ : 566877

5) హోటల్ అట్లాంటిక్
2, మౌంటెయత్ రోడ్, ఎగ్మూరు, ఫోన్ : 860461

6) హోటల్ బ్లూ డైమండ్
934. పూనమల్లి హైరోడ్, ఫోన్ : 665981/6

7) వెల్‌కం గ్రూప్ చోళ షిరటన్
10, కెథడ్రల్ రోడ్, ఫోన్ : 473647

8) హోటల్ కన్నెమర
బిన్నిస్ రోడ్. ఫోన్ : 860123

9) హోటల్ దాస ప్రకాష్
100, పూనమల్లి హైరోడ్, ఫోన్ : 661111

10) ఎవరెస్ట్
జయమన్షన్, 23, E.V.R రోడ్, ఫోన్ : 80772/8

11) హోటల్ గణపతి
103. నుంగంబాకమ్ హైరోడ్, ఫోన్ : 471859, 476088

12) హోటల్ గార్డెన్
68 A, పురస్వాకమ్ హైరోడ్, ఫోన్ : 661677/662165

13) హోటల్ గురు
69, మార్షల్స్ రోడ్, ఎగ్మూరు, ఫోన్ : 882041 (7 Lines)

14) హరిసన్స్ హోటల్
154/155, విలేజిరోడ్, నుంగంబాకమ్, ఫోన్ : 475271, 472577

15) హోటల్ యింపీరియల్
గాంధీ-ఇర్విన్ రోడ్, ఎగ్మూరు, ఫోన్ : 566176

16) హోటల్ కంచి
28, కమేండర్ ఇన్ చీఫ్ రోడ, ఎగ్మూరు, ఫోన్ : 471100

17) హోటల్ మద్రాస్ ఇంటర్నేషనల్
693, మౌంట్ రోడ్, ఫోన్ : 861811

18) హోటల్ మరీన్
9, కెథెడ్రల్ రోడ్, ఫోన్ : 470541 (10 Lines)

19) హోటల్ పామ్ గ్రోవ్
5, కోడంబాకం హైరోడ్, ఫోన్ : 471881/479218/477161

20) హోటల్ పికాక్
1089, పూనమల్లి హైరోడ్, ఫోన్ : 89081

21) హోటల్ పెనిన్సుల
26, G.N. రోడ్. టి. నగర్, ఫోన్స్ : 447770/440858

22) హోటల్ పిక్నిక్
1132, పూనమల్లి హై రోడ్, నియర్ సెంట్రల్ స్టేషన్, ఫోన్ : 39021

23) హోటల్ ప్రెసిడెంట్
16, డా॥ రాధాకృష్ణన్ రోడ్, ఫోన్ : 842211

24) హోటల్ రంజిత్
9, నుంగంబాకం హైరోడ్, ఫోన్ : 470521/479251

25) హోటల్ సవేర
69, డా॥ రాధాకృష్ణన్ రోడ్, ఫోన్ : 474700

26) హోటల్ సిల్వర్ స్టార్స్
6, పురస్వాల్కమ్ హైరోడ్, ఫోన్ : 664414

27) హోటల్ శ్రీలేఖ
49, మౌంట్ రోడ్, ఫోన్ : 840001/2/8•0582

28) హోటల్ శ్రీలేఖ ఇంటర్-కాంటినెంటల్
564, అన్నాశాలై, ఫోన్ : 453132

29) హోటల్ సింధూరి
24, గ్రీమ్స్‌లైన్, గ్రీమ్స్ రోడ్, ఫోన్ : 477187

30) హోటల్ సోనమ్ ఇంటర్ నేషనల్
7. స్ట్రింగల్ రోడ్, ఫోన్ : 563061

31) హోటల్ స్వాగత్
243, రాయపేట హైరోడ్, ఫోన్ : 868421/868486

32) హోటల్ తాజ్ కోరమండల్
17, నుంగంబాకం హైరోడ్, ఫోన్ : 4748[illegible]

33) టూరిస్టు హాస్టల్
ఆంధ్ర మహిళాసభ, 3 B, అడయార్ బ్రిడ్జిరోడ్, ఫోన్ : 416001

34) ట్రాన్సిట్ హౌస్,
26, వెంకటరామన్ స్ట్రీట్, టి. నగర్, ఫోన్ : 441846

35) ది ట్రిడెన్ట్
1/24, G.S.T. రోడ్, ఫోన్ : 4[illegible]847

36) ఉడిపి హోమ్.
1, హాల్స్‌రోడ్, ఎగ్మూరు, ఫోన్ : 5871[illegible]

37) ఉడిపి హోటల్ సుధా
97, పూనమల్లి హైరోడ్, ఫోన్ : 6[illegible]61

38) న్యూ విక్టోరియా హోటల్
3, కెన్నెట్ లైన్, ఎగ్మూరు, ఫోన్ : 587788

39) ఉడ్ లాండ్స్ హోటల్
10, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, ఫోన్ : 832160 (4 Lines)

40) న్యూ ఉడ్‌లాండ్స్ హోటల్
72/75, డా॥ రాధాకృష్ణన్ రోడ్, మైలాపూర్, ఫోన్ : 478111

41) యూత్ హాస్టల్
2nd ఎవెన్యూ, ఇందిరానగర్, ఫోన్ : 412882

ఇతర వసతులు

Y W C A :

Y W C A గెస్టుహౌస్

1086 పూనమల్లి హై రోడ్,

మెంబర్‌షిప్ ఒక్కొక్కరికి 2 రూ. అదనం, పాశ్చాత్య వంటలు చేసుకోడానికి అమరిక వున్నది.

రిజర్వేషన్లు : సెక్రటరీ.

Y W C A

కాంపింగ్ గ్రౌండ్ ట్రాఫిక్

Y W C A, 1086 పూనమల్లి హైరోడ్,

రిజర్వేషన్లు : సెక్రటరీ, ఇంటర్‌నేషనల్ గెస్టుహౌస్.

లహరి ట్రాన్సిట్ హాస్టల్

(30 సంవత్సరముల వయస్సులోపు స్త్రీలకు మాత్రం)

భారతీయ పద్ధతిలో వంటలు చేసుకోటానికి సౌకర్యం.

రిజర్వేషన్లు : హాస్టల్ సెక్రటరీ.

Y M C A :

ఎసప్లనేడ్

డార్మిటరీ

రిజర్వేషనులు : జనరల్ సెక్రటరీ.

యూత్ హాస్టల్

స్వయంగా వంటచేసుకొనుటకు/కారు, వాన్ పార్కింగ్ చేసుకొనుట సౌకర్యాలు

రిజర్వేషనులు : వార్డెన్.

విశ్వ విద్యాలయ సర్వీస్ సెంటర్

వసతి సౌకర్యం అంతర్జాతీయ విద్యార్థి పత్రములు ఉన్నవారికి మాత్రమే పరిమితం. గమనించగలరు.

రైల్వే రిటైరింగ్ రూమ్‌లు మద్రాసులోని సెంట్రల్, ఎగ్మూరు స్టేషన్లలో లభ్యం.

రిజర్వేషనులు : స్టేషన్ సూపరింటెండెంట్‌ను సంప్రదించవలెను.

## స్థానిక స్థల సందర్శనం కొరకు నిర్వహించబడే యాత్రలు

ప్రతిరోజు సమయం : సాయంత్రం 2 గం. నుండి 6 గం. వరకు. చార్జి రూ. 20/-

స్థలాలు :

1. పట్టణ సందర్శనము: సెంట్ జార్జికోట, మ్యూజియం ఆర్ట్‌గ్యాలరీ, వళ్ళువరుకోట్టం, గాంధీ మంటపం, స్నేక్‌పార్కు, కపాలీశ్వర దేవాలయం, మెరీనా బీచ్.

నిర్వహణ : 1. ఇండియా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.
రిజర్వేషన్స్ : రీజినల్ ఆఫీస్ (S), 29, విక్టోరియా క్రాస్, కెంట్ రోడ్.
2. తమిళనాడు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

2. ప్రతిరోజు సమయం: ఉదయం 7–30 గం. నుండి 6 గం. వరకు.
చార్జి : 35/- రూ. (డీలక్స్‌కోచ్) మరియు 45/- రూ. (A/C డీలక్స్ కోచ్)
స్థలాలు : కాంచీపురము, తిరుక్కళుకుంద్రం.
నిర్వహణ : ఇండియా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.
రిజర్వేషన్స్: పై విధముగా.

3. ప్రతిరోజు సమయం: ఉదయం 7 గం॥ నుండి సాయంత్రం 7–30 వరకు.
చార్జి : 35/- రూ. (డీలక్స్ కోచ్)
నిర్వహణ : తమిళనాడు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

4. ప్రతిరోజు సమయం: ఉదయం గం. 6–30 ని. నుండి సాయంత్రం గం. 8–30 ని. వరకు.
చార్జి : రూ. 90/- (డీలక్స్‌కోచ్), రూ. 120/- (A/C డీలక్స్ కోచ్) ప్రత్యేక దర్శనము సహా.

స్థలాలు : తిరుపతి

నిర్వహణ : ఇండియా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

రిజర్వేషన్స్: పైవిధముగా.

ప్రతిరోజు సమయం: ఉదయం 6 గం. నుండి సాయంత్రం 9-30 గం. వరకు.

చార్జి : రూ. 90/- (డీలక్స్ కోచ్), రూ. 120 (A/C డీలక్స్ కోచ్)

స్థలాలు : తిరుపతి

నిర్వహణ : తమిళనాడు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

రిజర్వేషన్స్ : పై విధముగా.

7 రోజులపాటు చూడదగినవి :

5. సమయం : శనివారము 7 గం. నుండి శుక్రవారము సాయంత్రం 6-30 గం. వరకు.

చార్జి : రూ. 630 (పెద్దవారికి), రూ. 530 (5-12 సం॥ లోపు పిల్లలకు) ఒక డబుల్ రూముతోపాటు

స్థలాలు : తిరుచ్చి, శ్రీరంగం, కొడైకెనాల్, మధురై.

నిర్వహణ : తమిళనాడు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

రిజర్వేషన్స్ : పై విధముగా

సమయం : శనివారము ఉదయం 7 గం. నుండి శుక్రవారము సాయంత్రం 6-30 ని. వరకు.

చార్జి : రూ. 700 ఒక రూముతో పాటుగా.

స్థలాలు : కన్యాకుమారి, సుచీంద్రం, తిరుచందూర్, రామేశ్వరం, తంజావూరు, మద్రాసు.

నిర్వహణ : తమిళనాడు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్.

రిజర్వేషన్స్: పై విధముగా.

7 రోజులపాటు దక్షిణదేశ యాత్ర :

సమయం : శనివారము ఉదయం 7 గం. నుండి శుక్రవారము 6-30 గం. వరకు.

చార్జి : రూ. 630 (పెద్దలకు), రూ. 580 (5-12 సం॥ లోపు పిల్లలకు) ఒక డబుల్ రూముతో పాటు రూ. 700 అయిన మరియొక సింగల్ రూమ్ కూడా వచ్చును.

స్థలాలు : బెంగుళూరు, సోమనాథపురం, శ్రీరంగపట్నం, బృందావన్ గార్డెన్స్, మైసూరు, ముదుమలై వన్యమృగ సంరక్షణా కేంద్రం, ఊటీ, కూనూరు, కోయంబత్తూరు, తిరువణ్ణామలై, మద్రాసు.

నిర్వహణ : తమిళనాడు టూరిజం డెవలప్‌మెంటు కార్పొరేషన్.
రిజర్వేషన్స్ : పై విధముగా.

## దేశంలోని అతి పెద్ద అంతర్జాతీయ నగరాలు నాలుగింటిలోను ఒక టయిన మద్రాసు మహా నగరంతో కలుపబడి ఉన్న అనేక యాత్రిక కేంద్రములకు రోడ్డు మార్గం

| గమ్యం | దూరం కి.మీ. | మజిలీలు |
|---|---|---|
| బెంగుళూరు | 334 | కాంచీపురం-71, చిత్తూరు-85, కోలార్-72, బెంగుళూరు-66. |
| చిదంబరం | 272 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనము - 31, విల్లుపురము-37, కిరణ్‌పూరు-37, వృద్ధాచలం-24, చిదంబరం-51. |
| హైదరాబాదు | 669 | నెల్లూరు-184, గుంటూరు-182, విజయవాడ-32, కోదాడ-96, హైదరాబాదు-175. |
| కాంచీపురము | 71 | నేరుగా. |
| కన్యాకుమారి | 693 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురము-37, పెరంబలూరు-106, త్రిచురాపల్లి-53, దిండిగల్లు-79, మధురై-63, విరుదునగర్-45, తిరునల్వేలి-106 కన్యాకుమారి-81, |

| | | |
|---|---|---|
| కొడై కెనాల్ | 479 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురం-37, పెరంబలూర్-106, త్రిచురాపల్లి-53, దిండిగల్లు-79, వత్తాల్‌కుందు-34, కొడైకెనాల్-47. |
| మధుర | 461 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురం-37, పెరంబలూరు-106, తిరుచురాపల్లి-53, దిండిగల్లు-79, మధుర-63 |
| మహాబలిపురం | 60 | నేరుగా |
| మైసూరు | 469 | కాంచీపురం-71, చిత్తూరు-85, కోలారు-73, బెంగుళూరు-66, మైసూరు-135. |
| ఉదకమండలం (ఊటి) | 610 | కాంచీపురం-71, వెల్లూరు-69, క్రిష్ణగిరి-119, ధర్మపూర్-48, శేలం-67, భవాని - 56, కోయంబత్తూరు-102, ఉదకమండలం-98. |
| పాండిచ్చేరి | 162 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, పాండిచ్చేరి-39. |
| రామేశ్వరం | 600 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురము-37, పెరంబలూరు-106, తిరుచురాపల్లి-53, దిండిగల్లు-79, మదుర-63, మానామదురై-47, రామేశ్వరం-92. |
| తంజావూరు | 334 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురం-37, పెరంబలూర్-106, పాలుపూర్-39, తంజావూరు-29, |

| | | |
|---|---|---|
| తిరుచురాపల్లి | 319 | చెంగల్‌పట్-58, మధురాంతకం-34, దిండివనం-31, విల్లుపురం-37, పెరంబలూర్-106, తిరుచురాపల్లి-53. |
| తిరుపతి | 143 | పొన్నేరి 39 ఊత్తుకోట 27 — పుత్తూరు 42 — రేణిగుంట 24 — తిరుపతి 11. |
| త్రివేంద్రము | 720 | చెంగల్ పట్టు 68 — మధురాంతకం 34 దిండివనం 31 - విల్లుపురం 37 — పెరంబలూరు 106 - తిరుచురాపల్లి 58- దిండిగల్లు 79 - మధుర 63 - తిరుమంగళం 19 - శివగిరి 85 — కుర్తాలం 55 త్రివేంద్రం 100 |
| వేదాంతగల్ | 92 | చెంగల్ పట్టు 58 — వేదాంతంగల్ 34 |

తమిళనాడులో ముఖ్యంగా ద్రావిడ శిల్పరీతుల్లో నిర్మించబడిన దేవాలయాలు ఉత్తరాదిన ఉన్నటువంటి ఆలయ కట్టడాలకు విభిన్న రీతిలో కనిపిస్తాయి. అధివసించియున్న దేవత గర్భాలయం కప్పుమీద కొన్ని అంతస్థులతో పిరమిడ్ ఆకారంలో గోపురం ఉంటుంది. దాన్ని విమానము అని అంటారు. ఈ గర్భగుడిని ఆవరించుకొని అనేక మండపాలు కూడా ఉంటాయి. కొన్ని దేవాలయాల్లో కోనేరులు, చక్కగా మెట్లు అమర్చిన స్నానఘట్టాలతో ఉన్నటువంటి నీటి తటాకాలు చోటుచేసుకొని ఉంటాయి. ఆలయాలన్నీ విశాలంగా పరచుకొని ఉంటూంటాయి. కొన్నింటిలో వేయి స్థంభాల మండపం కూడా ఉండటం కద్దు. అయితే స్థంభాలు వేయి ఉన్నవా లేవా అన్న సంగతి వదిలేస్తే కొండొకచో లెక్కకు తక్కువగా ఉన్నాగాని అది వేయి స్థంభాల మండపాలు లాగానే భావించబడుతుంది. ఇక్కడ లెక్కకాదు ముఖ్యం. కాని వాటి అమర్పు మనోజ్ఞంగా శిల్పకళకు మహోన్నతమైన స్థానం ఇచ్చి నిర్మించగలగడం నిజంగా హర్షించదగిన విషయం. ఇంత పెద్ద ఆవరణల్లో పరచుకొని ఉన్న దేవాలయాలు చుట్టూ ఒక ప్రహారీగోడ ఉండి ప్రహారీగోడ 2 కొనలను కలుపుతూ ఒక పెద్ద గాలిగోపురం క్రింద ప్రవేశద్వారం అమరి ఉంటుంది. ఈ గాలిగోపురం మీద అనేక రకాలయిన పురాణ గాథల శిల్పాలు, శృంగార శిల్పాలు మరెన్నో జంతువుల బొమ్మలు మనోజ్ఞంగా పొదగబడి ఉంటాయి. ముఖ్యంగా ఈ గోపురాలు అన్నీ

సమున్నతంగా ఉండి చుట్టుప్రక్కలా చూపు ఆనేనంత మేర వరకూ మనోహర దృశ్యావలోకనం చేయడానికి వీలుగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఈ ప్రవేశద్వార గాలిగోపురాలు 150 అడుగుల ఎత్తున ఉండి ఉంటాయి. వీనిమీద బొమ్మలన్నీ కూడా రంగురంగులతో పెయింట్ చేసి ఉండి ఒక విధమైన స్వప్న జగత్తులోకి వెళుతున్నామా అన్నంత భ్రాంతిని కలుగజేసేవిగా ఉంటాయి. ఇది గ్రీకుశాస్త్రీయమైన శిల్పాలను చేసి ఉన్నటువంటి రంగులను పోలి ఉంటాయి. ఇంత విశాలమైన ఆలయాలు కూడా పరిశుభ్రంగా, ప్రశాంత చిత్తతను కలుగజేసే ఉన్నత ఆధ్యాత్మిక భావోద్దీపన కలిగించేవిగా ఉండటం ఎంతైనా ప్రశంసించదగినది. ఆలయ ప్రాంగణంలో సంగీత నృత్య ప్రదర్శనం కనువుగా ఉండే నాట్యమందిరాలు, సభామండపాలు సామూహిక సంకీర్తనలు జరుపుకోడానికి వీలుగా ఉండేవిగా అమరి ఉంటాయి. ఈ అమర్పులు మానవ జీవన విధానంలో సమున్నతత్వాన్ని ప్రోదిచేయ వీలు గమనార్హం. ఈ దివ్యదేశాన్ని పరిపాలించిన రాజులందరూ దాదా వరకూ మతసామరస్యాన్ని కాపాడినవారే. చోళరాజుల కాలంలోగాని, పల్లవ కాలంలోగాని, పాండ్యుల కాలాల్లో గాని మధుర, తంజావూరు నాయక రాజులుగాని ఇతర మతాలమీద ఎంతో సహనాన్ని ప్రదర్శించిన దాఖలాలెన్నో చారిత్రకాంశాలు తెలియపరుస్తున్నాయి. అందుకు నిదర్శనంగా జైన, బౌద్ధమత, మహమ్మదీయ, క్రైస్తవ మతస్థులవంటి అన్య మతస్థుల ఆరాధనాలయాలు అనేక చోట్ల చోటు చేసికొని ఉండటమే తార్కాణం.

ముందుగా మద్రాసు మహానగర పరిసరాల్లోని యాత్రికాకర్షణలను పరిశీలించి దక్షిణాది కన్యాకుమారి వరకూ గల దివ్య దేశాలను, అందుండే ఆలయాలను గురించి ముచ్చటించుకుందాం.

## మద్రాసు నగర పరిసరాల్లో

### వెల్లూరు లేక రాయవెల్లూరు :

మద్రాసు నగరానికి 145 కి.మీ. దూరం. ఆంధ్రప్రదేశ్‌లోని తిరుపతి–బెంగుళూరు లేక మద్రాసునుండి బెంగుళూరు రైలులో కాట్పాడి స్టేషను దగ్గర దిగితే సుమారు 7 కి.మీ. దూరంలో ఉంటుంది. ఇక్కడ అమరియున్న దేశ విదేశాల్లో ప్రసిద్ధిగాంచిన పెద్ద ఆస్పత్రి వెంటనే మనసులో మెదులుతుంది. ఎక్కడా నయం కాని మొండివ్యాధులు, ఇక లాభంలేదు ఆఖరి ప్రయత్నం అని అనుకునే కేసులనేకం వ్యాధుల బారినుండి రక్షింపబడి జీవనప్రమాణాన్ని పెంచిన ఘట్టాలనేకం. ఈ

వూరిలో చరిత్ర ప్రసిద్ధి చెందిన కోట, జలకంఠేశ్వరాలయం చూడదగినవి. ఇక్కడే వెల్లూరు సెంట్రలు జైలు కూడా వుంది. ఈ వెల్లూరు విశేషాలు చూడబోయేముందు త్రోవలో ఉన్న తిరుత్తని, తిరువళ్ళూరు వగైరాలు కూడా చూడదగినవి.

**తిరువళ్లూరు :**

మద్రాసునుండి బస్సులనేకం కంజీవరం నుండి రైలుమార్గం వున్న చిన్న స్టేషను. బస్సు అయితే దేవాలయం ప్రక్కనేదిగవచ్చు. స్టేషనులోదిగేట్లయితే 4కి.మీ దూరంలో ఉంటుంది వూరు. ఇక్కడ అతి ముఖ్యమయినది.

**శ్రీ వీరరాఘవస్వామివారి దేవాలయం :**

స్వామి మహామహిమోపేతుడుగా తమిళనాడంతా ప్రసిద్ధి. ఈ చిన్న వూరు దాదాపు 30 వేల జనాభా వుంటుంది. స్వామివారికి మ్రొక్కుకుంటే అనేక మొండి వ్యాధుల నివారణకు మార్గం చూపగలరని గాఢ విశ్వాసం. స్వామివారు మనకు కన పడని అలౌలిక శక్తి రూపంలో ఉన్న డాక్టరు అని అంటారు. ఒక కథ ప్రకారం ఒక మహాముని 'సవిహోత్రుడు' అనే ఆయనకు దర్శనమిచ్చి ఇక్కడనే నిలిచి పోయినట్లు ప్రతీతి. ఆలయం ప్రక్కనే ఒక పెద్ద కోనేరు ఉంది. ఇందులో ఉన్న జలచరాలకు ఆహారంగా మరమరాలు, బెల్లం వేస్తుంటారు. ప్రతి అమావాస్య విశేష పర్వదినంగా భావించబడి ఉత్సవం జరుగుతుంది. ఆలయం చాల అనాదియైనది. గోడలమీద రంగు రంగుల కలయికతో అనేక పురాణ దృశ్యముల కథలు, భగవద్గీత మొదలైన శ్లోకాలు చిత్రించబడి ఉన్నాయి. భక్తులు మొక్కుబడి ఉన్నవారు స్వామివారి ధ్వజస్తంభం వద్ద మ్రొక్కుల మేరకు ఉప్పు, మిరియాలు భక్తితో సమర్పించి కర్పూరహారతి వెలిగిస్తారు. చైత్రమాస అమావాస్య, మాఘమాస అమావాస్య లలో బ్రహ్మోత్సవాలు కూడ జరుగుతాయి. అమ్మవారు కనకవల్లీ తాయారు. ఇక్కడికి దగ్గరిలోని తిన్ననూరు దివ్యదేశం చూడవచ్చు. తిరుమంగయాళ్వారు మంగళాశాసనం.

**తిరుత్తని :**

ఆరోహణమునకు అతిదగ్గరలో చిన్నకొండమీదగల శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయం. ఇది షణ్ముఖునికి ప్రసిద్ధి చెందిన ఆరు ఆలయాల్లో ఒకటిగా ప్రసిద్ధి. దాన్నే వెల్లమలయ్ అని కూడా అంటారు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిమీద అనేక భక్తిపాటలు రచించి కీర్తిగొన్న 'తిరుజ్ఞాన సంబంధర్' 'అరుణగిరి నాధర్' స్వాముల 'తిరుప్పుగల్' 'దేవారం' కీర్తనల్లో ఆలయ ప్రశస్తి మెండుగా కనబడు

తుంది. కొండ దిగువన 'కుమార తీర్థం' కొలను వుంది. కొండమీది కెక్కే మార్గ మధ్యంలో కుడి వైపున బ్రహ్మతీర్థం, దాన్ని ఆనుకుని బ్రహ్మలింగాలయం, వినాయ కాలయం కలవు. కొండపైనగల ఇంద్రతీర్థం స్వామి అభిషేకాదికాలకు వినియోగి స్తారు. 'శ్రీ పాదరేణు'గా ప్రసిద్ధి చెందిన చందనం సర్వవ్యాధి నిర్మూలక మని నమ్మిక. పెద్ద గంధపు సాన చూడగలం. స్వామివారికి అమూల్యమైన ఆభ రణ విశేషాలున్నాయి. ఎంతో పరిశుభ్రంగా, పవిత్రంగా ఉంచుతారు.

చోళంగిపురం :

దివ్య దేశాల్లో ఇది ఒకటి. అరక్కోణంకు దగ్గరిలో ఉన్నది. బస్సులో వెళ్ళ వచ్చు. గ్రహబాధలున్నవారు ఇక్కడి యోగానంద నృసింహస్వామి, యోగాంజనేయ స్వామి ఆలయములను దర్శించి ఒక్క ఘడియ నిర్మలధ్యానం చేస్తే చాలట- సర్వ బాధలనుండి విముక్తి కలుగుతుంది. అందుకే దీన్ని 'ఘటికాచలం' అని కూడా అంటారు. దర్శించదగినది.

వెల్లూరు లేక రాయవెల్లూరు :

దారిలో రెండు పవిత్ర పుణ్యక్షేత్రాల్ని దర్శించి వెల్లూరు చేరితే అక్కడ చూడదగిన విశేషాలు కోట, దేవాలయం, సెంట్రల్ జైలు, వెల్లూరు హాస్పటలు- (చివరి రెండూ అనుమతి పొంది దర్శించవలె—గమనించగలరు)

కోట :

దక్షిణాపథంలోగల ముఖ్యమయిన కోటల్లో ఇది ఒకటి. గోడలు ఎత్తుగా, మందంగా గట్టి రాతితో కట్టబడియున్నది. ఒక వంక పాలేరు నది ప్రవహిస్తుంది. కోట చుట్టూ దాటనాసికి శక్యంగానంత ఒక పెద్ద కందకం – కందకంలోకి నీరు 'సూర్యగుండం' నిరంతరం ప్రవహించే ఏర్పాట్లున్నాయి. ఈ కట్టడం ఆంధ్ర శిల్పి యైన శ్రీ చిన్నబొమ్మ నాయుడులు అనే ఆయన నిర్మాణ పర్యవేక్షణలో జరిగినట్లుగా తెలుస్తుంది. సుమారు 15 శతాబ్దపు కాలంలో నిర్మించబడి వుంటుంది.

కోటలో ఈశాన్య దిశగా విగ్రహంలేని దేవాలయం వుంది. అర్చనలు, ఆరా నలు లేవు. కాని కను రమణీయమైన శిల్పకళా నైపుణ్య విశేషంతో చూపరుల కాశ్చ ర్యం గొలుపుతూంది. చక్కని కళ్యాణ మండపం, పైకప్పు రాతిలో శిల్పచాతుర్యం- మధుర దేవాలయాల్లోని నరశిని పోలియున్నది. ఆలయం జలకంఠేశ్వరాలయంగా ప్రసిద్ధి. ఒకానొక సమయంలో మహమ్మదీయులు దండయాత్ర జరుపుతామని వెడి

రించితే ఆలయంలోని విగ్రహాన్ని తొలగించటం జరిగిందని చెపుతారు. అప్పటి నుండి విగ్రహంలేని ఆలయంగా ఉంటూనేవుంది. అయితే ఇటీవల కాలంలో ఆర్కి లాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారి ఆధ్వర్యంలో 1981 లో ఒక శివలింగ ప్రతిష్ఠ చేసి ఆలయమును సజీవంగా నిలిపి ఉంచటానికి తోడుపడ్డారు.

## క్రిస్టియన్ మెడికల్ కాలేజి హాస్పిటల్ :

లెక్కకు మించిన పడకల సౌకర్యాలతోను, అత్యాధునిక వైద్య పరికరాల తోను, ఉత్తమమైన చికిత్సా విధానంతో పేరుపొందినది. ఇక్కడికి చికిత్స నిమిత్తం మలేసియా, శ్రీలంక, మధ్య ఆసియా ప్రాంతాలనుండి కూడా వ్యయప్రయాసల కోర్చి వస్తుంటారు. ఇది 1800 సంవత్సరంలో ఒక అమెరికన్ మిషనరీ సంస్థ స్థాపించింది. 74 చర్చిలు ఈ వైద్యాలయాన్ని, విద్యాలయాన్ని నిర్వహణా భారంలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయట.

చక్కని అధునాతన చర్చి ఒకటి చూడదగింది. టిప్పుసుల్తాను మీద గెలిచిన అధిక సంతోషాన్ని పట్టలేక ధామ్సని చనిపోయాడట 1799 లో. ఆయన సమాధికి సమీపంలోనే నిర్మించబడింది. 1858 లో చరిత్రలో చోటు చేసుకొని 'వెల్లూరు మ్యూటినీ'లో పోయిన వారికి స్మారక చిహ్నాలున్నాయంటారు.

వెల్లూరులో ఉండటానికి గడియారం స్తంభం ఎదురుగా ఉన్న ఇండియాలాడ్జి, గాజా లాడ్జిలు వసతిగా ఉంటాయి. హాస్పిటలుకు దగ్గరలో ఉన్న హోటల్‌సుశీల్ కూడా వసతిగానే ఉంటుంది. మరికొంచెం శ్రీమంతులకి 'హోటల్ ఖన్నా'. ఎలాగు ఇంతదూరం వచ్చాం గనుక ఇక్కడి దగ్గరిలోనే ఉన్న అరుణాచలం– తిరువణ్ణామలై కూడా చూచిపోదాం.

## అరుణాచలం

ఇది ఒక గొప్ప శివక్షేత్రం. స్కాంద పురాణంలో క్షేత్ర విశేషాన్ని గురించి ప్రస్తావించబడివుంది. కొండ పాదమున కొంచెం ఎత్తు ప్రదేశంలో విశాలమైన పెద్ద దేవాలయం వుంది. నాలుగు పెద్ద పెద్ద గాలి గోపురాలున్నాయి. స్వామి పంచ లింగాల్లో తేజోలింగమై యున్నది. ప్రకృతి మాతకు హృదయ సదృశమైన ఈ అంబాగిరి లేక అరుణాచలం. బ్రహ్మ, విష్ణువులు అగ్నిమయమైన తేజో విరాజిత మైన లింగము ప్రత్యక్షంకాగా స్తుతించారు. మహా దేవుడు ప్రత్యక్షమయ్యాడు. దుర్నిరీక్షమయిన శివుని తేజస్వరూపాన్ని ఉపసంహరించి సర్వలోక హితార్థంగా

స్థావరలింగముగా మారుదని బ్రహ్మ, విష్ణుదేవులు కోరగా అరుణాచలముగా రూపొం దిందని పురాణగాథ. మూడు యోజనాలు విస్తీర్ణము గలిగి యున్న దీ అరుణాచల పర్వతం. ఉమాదేవి ఇక్కడ తపస్సు చేసి శివుని అర్థభాగమై అర్థనారీశ్వరి అయింది. ఇక్కడ కరికట్లాగమొసర్చిన పశుపక్ష్యాదులు సైతం కైలాసమును పొందు నని ప్రతీతి. ఆలయపు గాలి గోపురాల్లో ఒకదానిని శ్రీకృష్ణ దేవరాయలు కట్టించా రని ప్రతీతి. ఆలయ ఆవరణంలో ఒక వేయి స్తంబాల మంటపం ఉంది. తిరువణ్ణా మలై కార్తీక దీపోత్సవం ఘనంగా జరుగుతుంది.

శ్రీ రమణ మహర్షి ఆశ్రమం :

శ్రీ రమణమహర్షివారు నివసించింది. వచ్చిపోయే భక్తులు వలననే ఆశ్రమ స్వరూపం సంతరించుకున్నది. అరుణాచల పట్టణానికి 2 కి.మీ. దూరం లోపులో వుంది. మౌనవ్రతం అవలంబించే స్వామివారిని దర్శించినంత మాత్రముననే వారు కృపాదృష్టి పొందినంతనే భక్తులు అనుగ్రహం పొందినట్లుగా భావించి, తమ కోర్కెలు ఫలించిన దృష్టాంతములెన్నో ఉన్నాయంటారు. వారిని సందర్శించటానికి విదేశీ యులు సైతం వచ్చేవారట. భక్తులుండటానికి అనేక భవనాలు కూడా ఉన్నాయి. శ్రీ ప్రపంచాన్ని జాగృతం చేసిన మహారచయిత శ్రీ గుడిపాటి వెంకటచలం తమ జీవిత సంధ్యాసమయాన్ని ఇక్కడే గడిపారు. శ్రీరమణులవారి బోధనలు, తెలుగు, ఇంగ్లీషు, తమిళములలో ప్రచురించబడినవి. మహర్షి 14-4-1950 న సిద్ధిపొందారట. 'THE DEVINE CALL' అనే ఒక ఇంగ్లీషు మాస పత్రిక శ్రీవారి అమృతోప దేశములు ప్రచారంచేసే సారథి.

## తిరుక్కోవలూర్

తిరువణ్ణామలైనుండి 32 కి.మీ. దూరం పైగావున్న దివ్యదేశం. రామానుజ కూటం ఉంది. దాపులో పెణ్ణానది ప్రవహిస్తున్నది. ఆలయంలో త్రివిక్రమస్వామి, ఆయానార్ అమరియున్నది. పొయిగై, పూదత్తా, తిరుమంగ యాళ్వారుల మంగళా శాసనములు. రఘూత్తమస్వామివారి మధ్వసాంప్రదాయపు ఆశ్రమం చూడదగినవి. ఫాల్గుణ మాసంలో ఉత్తరతో మొదలయే పది రోజులు ఉత్సవం విశేషంగా జరుగు తుంది.

# శ్రీ పెరుంబుదూర్

మదరాసునుండి కంచీపురం వెళ్ళేత్రోవలోనే శ్రీ పెరుంబుదూరు తిరువళ్ళూరు నుండి నేరుగా వెళ్ళవచ్చు. సుమారు 16 కి. మీ. దూరం వుంటుంది. బస్సుల్లో వెళ్ళవచ్చు. ఇది విశిష్టాద్వైతమత సంస్థాపకులైన శ్రీ రామానుజాచార్యులవారి జన్మస్థలంగా ప్రసిద్ధి. దీన్నే 'భూతపురి' అనికూడా అంటారట. శ్రీ భాష్యకారుల దేవాలయం, మరి యితర ఆలయాలు దర్శనీయం. శ్రీ వైష్ణవులకు పరమ పవిత్రంగా భావించే పుణ్యస్థలం. చైత్రమాసంలో వచ్చే ఆర్ద్రా నక్షత్రం రోజున మహోత్సాహంగా ఉత్సవం జరుగుతుంది. అక్కడికి దగ్గరలోనే ఉన్న పూందమల్లి మొదపయాంరనన్, తిరుమళిశై, మధురాంతకం, పక్షి పెరుమాళ్ కోవెల దర్శించ నగును.

# కాంచీపురం, కంజీవరం - కంచి నామాంతరాలు

ఇది ఒక దివ్యదేశం- ముక్తిక్షేత్రంగా కొనియాడబడిన సప్తమోక్షదాయక పురులలో ఒకటిగా పురాణ ప్రసిద్ధి గలది. మద్రాసు మహానగరానికి సుమారు 75 కి. మీ. దూరంలో నైఋతిదిశగా చెంగల్పట్టు జిల్లాలో అమరియున్నది.

ఆ పేరు ఎత్తగానే పండుగలు వివాహాది ప్రత్యేక సందర్భాల్లో ధరించేవైభవోపేతమైన కంచిపట్టు చీరెలు మనస్సులో మెదులుతాయి. వెండిజరీలతో బంగారు రంగు రంగు నగిషీపనుల సోయగాలు అనంతం. విశేష ప్రఖ్యాతితో ఈ నాటికీ విరాజిల్లుతున్నాయి.

దీని ప్రాచీన ప్రశస్తి అశోక చక్రవర్తి నిర్మించిన స్తూపం తెలియపరుస్తుంది. క్రీ.శ. 7వ శతాబ్దంలోనే హ్యూయాన్‌సాంగ్ దర్శించిన ప్రదేశం. విద్యా వైజ్ఞానిక కేంద్రంగా జగత్ప్రసిద్ధమైనది. ఉద్దండ పండితులకు కాణాచి. నలందా విశ్వవిద్యాలయంలో బౌద్ధమతాచార్యుడిగా వాసికెక్కిన ధర్మపాలుడు కంచీ పురాగ్రేసరుడే.

కంచీపురం మూడు మహారాజ వంశాలపాలనలో మహోన్నతమైన దశలను అనుభవించింది. పల్లవులు, చోళులు, విజయనగర రాజుల వంశాల పరిపాలనల్లో ముఖ్యపట్టణంగా శోభిల్లింది. గొప్ప ఆధ్యాత్మిక కేంద్రం— విజ్ఞానుల ఆవాసం. మహాపండితులు, పరివ్రాజకులకు నిలయం. ఆదిలో పల్లవుల కాలంలో పటిష్ఠంగా వింపపడినఆలయాలనిర్మాణం.తరువాత తివారిలకాలంలో పునరుద్ధరణలు,అనేక యితర ఆలయాల నిర్మాణాలు, వివిధ దశల్లో అభివృద్ధి సోపానాలు చకచకా అధిగమించి ఈ

నాటికీ ప్రాచీన వైభవాన్ని మనకందరకు కనువిందు చేస్తుంది. ఒడలు పులకరింప జేస్తుంది. ఇక్కడ చుట్టుప్రక్కల ప్రదేశాలన్నిటినీ కలుపుకుంటే దాదాపు 1000 ఆలయాలున్నాయి. ద్రవిడ నిర్మాణ శైలికి మహోత్కృష్టమైన తార్కాణగా నిలిచింది ప్రదేశం అంటే అతిశయోక్తి కాదు. ఇటు శైవులకూ, అటు వైష్ణవులకూ సమాన ప్రతి ప్రత్తిగల ఆలయాలున్నందువలన హిందూ మతస్థులు శాఖా విభేదాలు మరిచి ఒక్క చోట కూడే ప్రదేశంగా గణ్యం. ఇక ఇక్కడి దేవాలయాల ప్రశస్తి. శివకంచి, విష్ణు కంచిగా రెండు భాగాలు. వానిలో శివకంచి పెద్దది.

ఏకాంబరేశ్వర దేవాలయం :

శివాలయం. పంచలింగాల్లో పృధ్వీలింగము. ఐదు ప్రాకారాలున్నాయి. ఆలయం అంకురార్పణ పల్లవులు చేశారు. దాని అభివృద్ధి క్రమంలో చోళులు, విజయనగరరాజులు ఇతోధికంగా పాల్గొన్నట్లుగా దాఖలాలున్నాయి. ఆలయం మొత్తం వైశాల్యం [illegible] ఎకరాలలో అమరియున్నది. ఆలయంలో 1000 స్తంభముల మంటపం వున్నది. దానికితోడు చుట్టూ అమర్చబడిన కోనేరు— ఒక పెద్దమామిడి చెట్టు ఉన్నాయి. ఆ చెట్టుక్రింద పార్వతి అమ్మవారు తపస్సు చేసినట్లు పురాణకథ. మొదటి ప్రాకారంమీద ఒక పెద్ద గాలిగోపురం— దానిని 1509 లో శ్రీకృష్ణ దేవ రాయలు కట్టించినట్లుగా ప్రతీతి. అందులోవున్న 13 తీర్థములలో సరస్వతీ తీర్థము ముఖ్యమయినది.

శ్రీ కామాక్షి అమ్మవారి దేవాలయం :

అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటిగా పరిగణించబడుతుంది. ముచ్చటగా మూడు గోపురాలున్నాయి. అమ్మవారి వాహనం సింహం ధ్వజస్థంభంమీద ఉన్నది. అమ్మవారు త్రినేత్రయై మహోగ్రంగా ఉండేదట. రెండు కండ్లను ఆదిపరాశక్తి వర్ణనలో సూర్య చంద్రులను ప్రతీకలుగా చెప్పబడి- మూడవ నేత్రం అగ్నినేత్రంగా భావించబడుతుంది. ఉగ్రమైన అమ్మవారి శక్తి నరబలులు కోరుతుండటం తత్శాంతి పరిహారార్థము ఆదిశంకరుల వారు తమ స్వహస్తాలతో శ్రీ చక్రమును స్థాపించినట్లుగా చెప్పుతారు. ఆ జ్ఞాపకార్థంగానే ఆదిశంకరుల ప్రతిమ కూడ ఆలయంలో ప్రతిష్ఠించబడింది. ప్రతి సంవత్సరం ఫిబ్రవరి—మార్చి మాసాల్లో జరిగే రథోత్సవం చాలా విశేషం. అసంఖ్యాకంగా యాత్రికులు భక్తులు పాల్గొంటారు. ఈ ఆలయానికి దగ్గరలోనే అమరియున్న వామన దేవాలయం చూడదగింది. బలిచక్రవర్తి దానమడిగిన వామనమూర్తి విశ్వాన్ని మొత్తాన్ని ఆక్రమించినట్టు చూపిస్తున్న విగ్రహం చాలా

పెద్దది. వామనుని ముఖం సరిగా కనబడదు. పైకి ఒక కర్పూరహారయంతో దీపం వెలిగించి పైకి పట్టుకొని చూపుతారు పూజార్లు.

## శ్రీ కైలాసనాథ ఆలయం :

7వ శతాబ్దంలో పల్లవ చక్రవర్తి రాజసింహుడు మొదలుపెట్టగా అతని కుమారుడైన 3వ మహేంద్ర వర్మ దానిని పూర్తిచేశాడు. పల్లవుల శిల్పావైదగ్ధ్యం పరిణతి పొందిన వైనం అక్షరాలా దీపించే పట్టనంగా చెప్పుకోవచ్చు. విశాలమైన సదవాలు, ఆవరణంలో స్తంభాలతో కట్టబడిన మండపాలు. అన్నిటినీ చుట్టుకొని వచ్చే ప్రహరీ గోడ, అనేక గోపురాలతో వెలసిన వైనం స్పష్టంగా కనపడుతుంది. బహుశా దక్షిణాది దేవాలయాల్లో తరువాతి తరాలలో వచ్చినవారు నిర్మించిన వాసిలోని వందలు వేల స్తంభాల్తో నిర్మించబడిన మండపాలకు పునాది అనుకోవచ్చు.

## చిన్నకంచి-వరదరాజస్వామి వారి దేవాలయం :

కొంచం ఎత్తుగావున్న హస్తిగిరి అనే గుట్టమీద అమరియున్నది. వైష్ణవాలయం. దీన్ని 'హస్తిగిరి' అనికూడా అంటారు విజయనగర రాజులు మహోన్నతమైన ప్రాకారాలు గోడలువేర్పరిచారు. లోపల అవతరించియున్న మూలవిరాట్టు శ్రీవరదరాజస్వామి. పైన వరదరాజస్వామి ఆలయం వుండగా క్రింద నృసింహస్వామివారి ఆలయం వుంది. వరదరాజస్వామి వారి ఆలయంలోని శతస్తంభ మండపం చూడదగినది. విశిష్ట కళా వైపుణ్యానికి మచ్చుతునక. మండపం మీద మూలలో ఒక గొలుసు వేళ్లాడుతూ వుంది. అది రాతితో చెక్కబడింది. ఆశ్చర్యం గొలిపే శిల్పాలు ఎన్నో. ఈ ఆలయమున వెండి బంగారు బల్లులున్నాయి. ఈ బల్లులను తాకితే బల్లి పడిన దోషం ఉండదని గట్టి నమ్మకం. స్వామివారికి అనేక వాహనాలు, నగలు వున్నాయి.

ఇక్కడ దగ్గరిలోనే కొన్ని జైన, బౌద్ధమఠములు, స్తూపములు, ఏకాంబరేశ్వర దేవాలయంలో చెక్కబడిన శిలా శాసనాలు చరిత్ర పరిశోధకులకు అత్యంతాసక్తికరం. అర్థశాస్త్ర రచయిత కౌటిల్యుడు ఇక్కడనే జన్మించాడని ప్రతీతి.

మే నెలలో జరిగే గరుడోత్సవం చాల విశేషం. శ్రీ త్యాగరాజస్వామి వారు 'వినతాసుత వాహనుడై వెడలెను-కంచి వరదు'డనే కీర్తనను ఈ ఉత్సవాన్ని దర్శించి పొంది తన్మయుడైనట్లుగా చెప్పుకొంటారు.

## శ్రీ వైకుంఠ పెరుమాళ్ళ ఆలయం :

8వ శతాబ్దంలో రెండవ నందివర్మ కట్టించి శ్రీ మహావిష్ణువుకు అంకితం చేశాడు. పల్లవుల శైలిలోని పరిపూర్ణత్వం ఈ ఆలయంలో చూడవచ్చు.

కాంచీ పురంలో దేవాలయాలు 108 గాను, చుట్టు ప్రక్కలగల దగ్గరిలోనే ఉన్న ఆలయాలు మొత్తం వేయికి మించి ఉంటాయని అంచనా. ఆసక్తి గలవారు అన్నీ చూడవచ్చు. చిన్న కంచి, పెద్దకంచిల్లో గలిసి తొండదేశపు 22 దివ్యదేశాలుగా గణించబడిన వాటిలో 14 కాంచీపురంలోనే ఉన్నవట.

కాంచీపురంలో హోటళ్ళు వగయిరాలు అందుబాటులోనే వుంటాయి.

ఎగ్మూరునుండి పెరుగేటి శైసులోగం ఎలక్ట్రిక్ రైలుమీద పల్లావరం 4 కి. మీ. దూరంలో దక్షిణదిశగా ఉన్న దివ్యదేశంగా పరిగణించబడే 'తిరునీర్మలై' అన బడే ఖండారణ్య క్షేత్రం దర్శనీయం.

దగ్గరిలోనే వందలూరులో విజయనగరరాజ వంశీయులచే కట్టించబడిన దేవాలయాలు దర్శనీయం. ఆసక్తి గలవారు చూడవచ్చు.

శింగపెరుమాల్ కోయిల్ :

వందలూరుకు 16 కి.మీ. దూరంపైగా వుంటుంది. విష్ణుక్షేత్రం. స్వామివారి కళ్యాణోత్సవం బాల విశేషం. వేలకొలదీ భక్తులు సందర్శిస్తుంటారు.

## మ హా బ లి పు ర ం

మదరాసు నుండి చెంగల్పట్టు బస్సులో వెళితే చక్కగా మహాబలిపురం, పక్షి తీర్థం (తిరుక్కాళి కుణ్ణ్రం) తిరుప్పోరూర్ మూడింటిని ఇంకా మరికొన్ని విశేషాలు చూడగలం.

మహాబలిపురమునకు మామల్లపురం అనే పేరు కూడా ఉంది. ప్రాచీన విశిష్టతను మరల మనస్సులోకి జ్ఞప్తికి వచ్చేటందుకే ఈ మామల్లపురం అనే పేరు. ఇది పల్లవుల కాలంలో కంచీపురం తరువాత రెండవ రాజధానీ నగరంగా ప్రసిద్ధి. ఇప్పుడు చాలా చిన్నవూరు. గుప్తసామ్రాజ్య పతనానంతరం విశేష చరిత్ర ప్రసిద్ధి గం దక్షిణాది రాజవంశం పల్లవరాజ వంశం. క్రీ.శ. 5వ శతాబ్దం నుండి 8వ శతాబ్దం వరకూ అత్యున్నత వైభవాన్ని అనుభవించిన వంశావళి. ఈ కాలంలోనే అనేక దేవాలయాలు, కోటలు మనోహరంగా రూపొందాయి. తమిళ సంస్కృతీ సాంప్రదాయ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయంగా భావించవచ్చు. ఇక్కడ శిల్పాలన్నీ తొలచబడిన గుహాలయాలు. అతి చక్కని జిలుగు నగిషీలు శిలలమీద వెలయించిన ఘనత, వారి మనోహర భావలహరికి అద్దం పట్టినవిగా ఉన్నాయి. ఇద్దరు నరసింహవర్మల కాలాల్లోను వానవత కళావైశిష్ట్యాన్ని పొదివి రాళ్ళమీద చెక్కించి కమనీయంగా చిరస్థాయి

నేర్పరిచారు. శిల్పాలు అత్యంత సాదాసీదాగా ఉన్నా కళావైశిష్యం మెచ్చుకోతగింది. చరిత్రాంశాలు పరిశీలిస్తే పల్లవవంశ రాజులు మొదటిగా జైనమతావలంబికులు గాను, తరువాత రెండవ మహేంద్రవర్మ కాలంలో శివభక్తులుగా మారినట్లున్నూ, తరువాత వైదికమతాన్ని అవలంబించినవారు విష్ణుభక్తులుగాను మారినట్లుగా తెలుస్తుంది. అయినా సర్వమత సామరస్యకులుగా చరిత్రలో స్థిరమైన పేరు పొందారు. ఈ గుహాలయాలను, తీర దేవాలయాన్ని దర్శించటానికి అనేకమంది విదేశీయులు గూడా ఆత్రుతగా వస్తారు. ముఖ్యంగా శిల్పాల్లో పురాణ కథలతోపాటు నాటి సాంఘిక వాతావరణాన్ని ప్రతిబింబించే గొల్లభామలు, శృంగార నాయికలు మరెన్నో గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబించే శిల్పాలు కమనీయంగా మలచబడ్డాయి. మహాబలిపురం ఇప్పటికీ శిలాశిల్పాలు సజీవ శిల్పసృష్టి చేస్తూనే వున్నాయి. ఇక్కడ ముఖ్యంగా ఆసక్తిని రేకెత్తించే శిలాశిల్ప దృశ్యాలుగా—

అర్జునుని తపస్సు, వరాహ మండపం, కృష్ణమండపం, మహిషాసురమర్దనీ గుహ, సముద్రతీర ఆలయం, పాండవుల రథాలుగా పిలువబడే 5 ఏకశిలా రథాలు చూడదగినవి.

### అర్జునుని తపస్సు :

ఒక పెద్దరాతి ముందుభాగాన్ని చదునైన చక్కని కాన్వాసు చిత్రమో అన్నట్లుగా మలచబడింది. హిమాలయోత్తుంగ శిఖరాలనుండి జారి ప్రవహించే పావనగంగా, భక్తసులభుడైన పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చేయటం ముఖ్యాంశమయినా, ఇతర దేవుళ్ళు, మనుషులు, జంతువులు, అతీంద్రియశక్తుల కాలవాలమైన అనేక స్వరూపాలు ఇక్కడ అమరియున్నాయి.

### వరాహ మండపం :

శ్రీమహావిష్ణువు అవతార విశేషంగా చెప్పుకొనబడే వరాహావతారంలో భూదేవి రక్షణార్థమై అనంత వారి రాసుల్లో నుండి రక్షించే దృశ్యం కమనీయం. ఈ చోటులోనే విష్ణువు వామనావతారం మరుగుజ్జు స్వరూపం కూడా చిత్రించబడింది.

### కృష్ణ మండపం:

ఇక్కడ శ్రీ కృష్ణ పరమాత్ముడు గోవర్ధనగిరి నెత్తి గోవులగాచిన వైనం శిల్పీకరించబడింది.

భాగవతం— మరో రాతిమీద భాగవత కథ శిల్పీకరించబడింది.

పంచ రథాలు :

7వ శతాబ్దంలోని రకరకాల ఆలయాల నిర్మాణాల్ని నిక్షేపిస్తూ నిర్మించబడిన ఏకశిలా రథాలు, పాండవుల రథాలుగా పిలవబడుతున్నా - పాండవుల కథకు వీటికి ఏవిధమైన సంబంధం కానరాదు.

సముద్రతీర ఆలయం:

ఈ తీరదేవాలయం అతి పురాతనమైనదని చెపుతారు. ఆలయ విమాన గోపురం బంగారు డోముతో ఉంది. దానిమీద సూర్యకాంతిపడి పరావర్తనం చెంది నావికులకు మార్గదర్శిగా ఉన్నదని అంటారు. ఆలయంలో 16 ముఖాలుగల శివలింగమున్నది. సముద్రపు ఉప్పు గాలికి చాలవరకు శిథిలం చెందింది. ఒకప్పుడు దేవాలయమంతా ఇసుకతో కప్పబడిన దానిని ప్రభుత్వంవారు 1911లో బయటకు తీసి జాగ్రత్తగా కాపాడుతున్నారు.

డాక్టర్ హంటర్, ఫెర్గసన్‌గారు మొదలైన పాశ్చాత్య మేధావులు వారి అమూల్యమైన అభిప్రాయాన్ని తెలిపారు. ఆలయ నిర్మాణం రాజసింహుని కాలమైన 7వ శతాబ్దపు మలిభాగంలో నిర్మించబడిందని ఒక వాదం. ఇక్కడ ఉన్న రెండు శిఖరాల క్రింద శివునికి, విష్ణువుకు రెండు ఆలయా లున్నట్లుగా తెలుస్తుంది. వీటిని ధర్మరాజ రథం శిల్పం తరువాత నిర్మించబడినట్లు తోస్తుందని అభిజ్ఞుల అభిప్రాయం.

సాళువకుప్పన్ :

ఊరిచివారనే ఒక రెండు కి.మీ. నడిస్తే సాక్షాత్కరించే గుహాలయ సముదాయం. దీని కవతల ఏర్పడిన ఇసుకతిన్నెల చాటున ఉంది గుహాలయ సముదాయం. వ్యాఘ్రముఖం ఆకారంలో చెక్కిన ద్వారం ముఖంగా లోపలికెళితే కనబడుతుంది ఆలయం.

మహాబలిపురంలో వసతికి కొన్ని చౌక హోటళ్ళున్నాయి. కాని అంత సౌకర్యంగా ఉండకపోవచ్చు. శ్రీమంతులకు మాత్రం మహాబలిపురానికి ఉత్తరంగా అమరియున్న టెంపుల్ బే అశోకా బీచ్ రిసార్టు, సిల్వర్ శాండ్స్ బీచ్ రిసార్టు, గోల్డెన్ సన్ బీచ్ రిసార్టు, ఐడియల్ బీచ్ రిసార్టు వగైరాలున్నాయి. అన్నీ వసతులతో తులతూగేవి.

చెంగల్పట్టు :

జిల్లా ముఖ్యకేంద్రం. విజయనగర సామ్రాజ్యకాలంలో కట్టించబడినకోట శిథి

లాలున్నాయి. బ్రిటిషువారిని అడ్డుకున్న దాఖలాలున్నాయి. సముద్రతీరంలో అందమైన కోవ్‌లాంగ్ బీచ్ వున్నది. ఇది జాలరుల నివాసస్థలం. ఇక్కడే అతి ఆధునికమైన ఫిషర్‌మన్ కోవ్ రిసార్టు హోటలు అతి ఖరీదయినది ఉంది.

## తిరుక్కాలి కుండ్రం (పక్షితీర్థం) :

మహాబలిపురం నుంచి 14 కి.మీ. దూరంలో ఉంది యాత్రాస్థలం. ఇక్కడ యాత్రికుల వసతి సౌకర్యార్థం సత్రాలున్నాయి. పక్షితీర్థం ఒక కొండమీద అమరియున్నది. కొండ క్రింద విశాలమయిన భక్తవత్సలేశ్వర దేవాలయం, త్రిపురసుందరి అమ్మవార్లకు ఆలయాలున్నాయి. ఆలయంలో లోపలగా దక్షిణంవైపున ఒక పెద్ద కళ్యాణమండపం వుంది. చిత్రశిల్పకళాశోభితం. దగ్గరలో శంఖుతీర్థం ఉంది. భక్తులు స్నానం చేసి దేవాలయానికి వస్తారు. 12 సంవత్సరాలకు ఒకసారి ఒక శంఖం పుడుతుందట. అందుకనే శంఖుతీర్థమని పేరు వచ్చిందని చెపుతారు.

కొండమీద వేదగిరీశ్వరాలయం వుంది. స్వామి వేదగిరీశ్వరుడు. అమ్మవారి పేరు చొక్కాలమ్మ. ఆలయాన్ని ఆనుకుని ఒక చిన్న వేదిక. అనాదికాలం నుండి సరిగ్గా 11 గంటల ప్రాంతంలో రెండు పక్షులు వచ్చి అర్చకుడు ఇచ్చే ప్రసాదమును భుజించి వెళుతుండటం అనేకమంది రికార్డుల్లో సైతం కనబడే వింత విశేషం. ఈ రెండు పక్షులూ చాల వృద్ధదశలో ఉన్నవి. గిన్నెలలో పెట్టిన పాయసాన్నమును భుజించి నీరు త్రాగి ఆలయం చుట్టూ మూడు ప్రదక్షిణాలు చేసి తిరిగి వెళ్తాయి. ఎన్ని వందల సంవత్సరాలనుంచి ఇలా వస్తున్నాయో తెలియరాని రహస్యం మనకందరికీ ఆశ్చర్యం. ఈ రెండున్నూ కాశీ విశ్వేశ్వర స్వామి వద్దకు వెళ్తాయని ప్రతీతి. పక్షులకు యాత్రికులు భోజనం పెట్టవచ్చును. ఈ దృశ్యం చూడటానికి యాత్రికులందరు ఒక హాలులో కూర్చుండి గమనించటానికి ఏర్పాటు వుంది.

ఇక్కడికి సమీపంలో నేగం తిరువిడవెందై, తిరుప్పోరూరు చూడవచ్చును. వీనిలో తిరుప్పోరూర్ సుబ్రహ్మణ్యస్వామిక్షేత్రం. పూర్వంలో మంచి శాసనాలు గూడా వున్నాయి. ఆలయానికి దక్షిణదిశలో శరవణతీర్థం యాత్రికులు స్నానం చేయటానికి అమరియుంది. ఇందు మాఘ బహుళ విదియ దినమున జరిగే తెప్ప ఉత్సవం చాల విశేషం. ఆ సమయంలో ఆలయమంతా విద్యుద్దీపాలంకారంతో శోభాయమానంగా వుంటుంది.

**మొసళ్ళ పెంపక కేంద్రం :**

మద్రాసు మహాబలిపురం లైనులోనే వుంది.

క్రమశః అంతరించిపోతున్న జాతి. ఇక్కడ ప్రత్యేకంగా మొసళ్ళను పెంచటమేగాకుండా వాటి సంతతిని వృద్ధి చేసేందుకు అనేక ప్రయత్నాలు జరుగుతున్నాయి. గుడ్లు పెట్టటం దగ్గిర్నుంచి పెరిగిన వాటివరకూ రకరకాల మొసళ్ళనీ గమనించవచ్చు.

**వేదాంతంగల్ పక్షి శరణ్యాలయం : (BIRD SANCTUARY)**

ఇక్కడ పక్షులను అవలోకించటానికి ఒక అబ్జర్వేటరీ టవరు ఉంది. వర్షాకాలం పూర్తవగానే అనేకమైన నీటి పక్షులు వచ్చి చేరుతుంటాయి. చూడటానికి సా. 3 గం. నుండి 6 గం. వరకు సరియైన సమయం.

చెంగల్పట్టునుండి దిండివనం అక్కడినుండి పాండిచ్చేరి వెళ్ళేవాళ్ళు పాండిచ్చేరి వెళ్ళవచ్చు. కాని దిండివనం ప్రయాణం దక్షిణంగా సాగించేట్లయితే ఒక చిన్న మలుపు. పశ్చిమంగా దాదాపు 25 కి.మీ. దూరంలో అమరియున్నది.

**జింజికోట :**

మూడువైపుల కృష్ణగిరి, చంద్రగిరి, రాజగిరి అనే పర్వతాలు పరివేష్టించి ఉన్నాయి. కోట రాజగిరి మీద ఉంది. కోట చాలా శిథిలావస్థలో ఉన్నది. ఒకానొకప్పుడు దేశింగు రాజు జింజి పరిపాలకుడు. ఇతన్ని కర్నాటక నవాబు ఓడించాడు. విజయనగర రాజ్య పతనంతో దక్కను సుల్తానుల వశమయి, తరువాత ఔరంగజేబు, తరువాత 1750లో ఫ్రెంచివారి వశమై 1761లో ఇంగ్లీషువారి వశమైంది. ఇంగ్లీషువారినుండి టిప్పుసుల్తాను తండ్రి అయిన హైదరాలి జయించాడు. తరువాత కాల క్రమేణా దాని ప్రాముఖ్యం తగ్గిపోయింది. శిథిలాల్లో హంపీ శిథిలాలను తలపింపచేస్తాయి. కోటలో కళ్యాణమంటపాలు, ఫౌంటెన్‌లు, ప్రేక్షకుల హాలు, ధాన్యపుకొట్లు, జింజి పిరంగి నగరాలు చూడదగిన విశేషాలు. దిండివనం నుంచి విళుప్పురం చేరి విళుప్పురంనుంచి కడలూరుచేరి పాండిచ్చేరికి దక్షిణంగా ఉన్న చిదంబరము చేరవచ్చు.

## చిదంబరము లేక చిత్రంబళము

తమిళనాడులోని ద్రావిడ రీతుల్లో నిర్మించబడిన దేవాలయాల్లో చిదంబరం ఒక మణిపూస. చిదంబరము అంటే విజ్ఞానాంబరము అని అర్థము. దక్షిణ

ఆర్కాట్‌లోని చిదంబరంకు ముఖ్యకేంద్రం. 13 హెక్టార్ల చదరంలో పరచుకొనిఉన్న ఈ ఆలయ సమూహము అతి పురాతనమైనదిగా ప్రసిద్ధి. అందులో ప్రళయతాండవం చేస్తున్న పరమశివుని విగ్రహం కలది చాలా పెద్దది. నలువైపులా 4 గోపురాలు ఉన్నాయి. ఉత్తర దక్షిణ గోపురాలు 49 మీ. ఎత్తున ఉన్నాయి. మిగతా 2 గోపురాల మీదా తాండవ నృత్యమాడే నటరాజస్వామి శాస్త్రీయ భంగిమలు 108 చెక్కించబడి ఉన్నాయి. ఆలయంలో విశేషంగా చెప్పుకోదగినవి నృత్యమందిరం. ఒక చిత్రరథాకృతిలోనున్న పెద్ద సభాభవనంలో మధ్య ఒక చిన్న మందిరంలో నటరాజ స్వామి విగ్రహం ఉంది అంతా తానై వెలసి ఉన్న భావం గోచరిస్తుంది. మరొకటి ముఖ్యమైనది వేయి స్థంభాల మంటపం. ఆలయ ప్రాంగణంలోని పార్వతీ దేవి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయాలతో పాటు శ్రీ మహావిష్ణువుకు అంకితమైన మరో ఆలయం ఉంది. శివకేశవులకు అభేదత్వమును కల్పిస్తూ శివుని దర్శించడానికి వెళ్ళిన వానికి విష్ణువు, విష్ణువును దర్శించడానికి వెళ్ళిన వానికి శివుడు కనపడుతూ సర్వజగత్తుకు భగవంతుడు ఒక్కడే అనే భావం మన మనస్సులో మెదిలేట్టు చేస్తుంది. అసలు చిదంబర రహస్యం అనే నానుడి ఎప్పట్నుంచో వాడుకలో ఉంది. అంతూ, దరి తెలియని విషయాన్ని చిదంబర రహస్యం అనడం పరిపాటి. ఇక్కడ ఈ ఆలయంలో కూడా పంచలింగాల్లో ఒక టైనటువంటి ఆకాశలింగంను చూడటానికి రుసుం చెల్లించి లోపలికి వెళ్ళినపుడు ఇది మనకి అనుభైకవేద్యమవుతుంది. ఆకాశలింగం అంటేనే దీనికి ఆకారం ఉండదు. ఆలయపు గోడలో బంగారు రేకుమీద యంత్రంతో బిగించబడి ఉంటుంది. దాని ఎదుట ఒక తెరవేసి ఉంటుంది. లోపలకు వచ్చిన తరువాత ఆ తెర తీసి చూపిస్తారు. అంటే: మనకు కనపడనిది చిదంబర రహస్యం అనుకోవాలి.

ఈ చిదంబరం 907 నుండి 1310 వరకూ చోళరాజుల రాజధాని. వీరచోళరాజ కాలంలోనటరాజ ఆలయం వ్యవస్థీకరించబడినట్లుగాఉన్నత పాఠాలు చెప్తున్నాయి. వీరచోళరాజు కాలం క్రీ. శ. 927నుండి 997వరకు. ఆలయ పట్టణం మధ్య నుండి 5 ప్రాకారాలు కలిగి ఉన్నది.మొదటి ప్రాకారంలోనే 4 సింహద్వారాల మీద గోపురములు ముందు చెప్పిన 4 గోపురాలు ఇవే. చిదంబరం నటరాజస్వామి వారి ఆలయంలో వేంచేసియున్న శ్రీ నందీశ్వరుని విగ్రహం చాలా పెద్దది ఒకటి యున్నది. దాని మెడయందు గంటలు, దానిపై జీను వగయిరాలు చూస్తే రాతితో చెక్కబడినది కాదు సజీవంగా ఉన్నట్లు అనిపిస్తుంది. హిందూ దేశాల్లో నందివాహనాలు అన్నింటిలోకంటే పెద్దది. శివగంగ వేయి స్థంభముల మంటపమునకు పడమటగా అమరి

యున్నది కోనేరు. దీనికి సువర్ణ కోనేరు అనే పేరు ఉన్నది. చక్కగా చెక్కిన రాతితో మెట్లున్నవి. పూర్వం ఒకానొకప్పుడు వర్మచక్రుడనే రాజు స్నానంచేస్తే అతన్ని బాధిస్తున్న కుష్ఠురోగం పోయిందని చెప్తారు. ఇంక సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయంలో చూడదగినది— పెద్ద నెమలి విగ్రహం స్వామివారి మయూర వాహనం. వినాయక దేవాలయంలోని వినాయకుని విగ్రహం హిందూదేశం మొత్తం మీదనే చాలా పెద్దది అంటారు. శిల్పులు ప్రతి అంగుళంలోనూ చూపిన నిపుణత్వం కౌశల్యము మనకు ఆశ్చర్యము, ఆనందాన్ని కలిగిస్తాయి. చిదంబర నటరాజస్వామి పండరీపురంలోని పాండురంగనివలె అనేకమంది భక్తులను, కవులను కాపాడి తనలో ఐక్యం చేసికొన్న భక్తసులభుడు. ఈయన లీలలను తిరువాచకమనే గ్రంథం పేర మణిక్కవచుడు అనే ఆయన వ్రాశాడు. స్వామి అనుగ్రహంతో ఇలా ఎంతో మంది మహాగ్రంథకర్తలు స్వామి అనుగ్రహాన్ని పొంది తరించారు. అనపాయచోరుడు అనేరాజు వైరాగ్యము పొందిన పిదప తన జీవిత శేషాన్ని ఆలయ ప్రాంగణంలోనే నడిపాడు. ఆయన గౌరవార్థం "జ్ఞానవాపి" అనే చిరు దేవాలయంకూడా ఉంది. ఇంకా చిదంబరంలో చూడదగినవి తిల్లైఅమ్మన్ దేవస్థానము శ్రీ రాజ అన్నామలై చెట్టియార్‌గారి పరిపోషణలో రూపుదిద్దుకొన్న అణ్ణామలై విశ్వవిద్యాలయము చూడ దగినది. చిదంబరంలోని శివాలయంలో ఉన్న తిరుచ్చిత్రకూటము ఒక దివ్యదేశంగా పరిగణించబడుతుంది. శ్రీ గోవిందరాజస్వామి పెరుమాళ్ళు, పుండరీకవల్లీ తాయారు, కుల, తిరుమంగయాళ్వార్ల మంగయాళ్వాన్రుం వైష్ణవులకు పవిత్రమైన క్షేత్రం.

**షియాళి :**

తిరుజ్ఞాన సంబంధర్‌వారి జన్మస్థానం. ఇక్కడ శివాలయం, విష్ణాలయం రెంటిని దర్శించవచ్చు. దీన్ని బ్రహ్మపురం అనికూడా అంటారు. తిరుజ్ఞాన సంబంధర్ జగద్గురు శంకరాచార్యులు తమ సౌందర్యలహరిలో కీర్తించిన మహానుభావులు. ఇక్కడికి అనతిదూరంలోనే తిరునాంగూర్, తిరువైకుంఠ విణ్ణగరం, వణ్ పురుషోత్తమం, శెంబోయుకోవెల్, తిరువెళ్ళిక్కుళం, తిరుమాణికుండం తలైచ్చంగాడు మొదలైన 14 దివ్యక్షేత్రాలున్నాయి. వీటన్నింటిలో ఆళ్వారుల మంగళాశాసనాలున్నాయి. దర్శించతగినవి.

**వైదీశ్వరం :**

దగ్గరిలోనే ఉన్న శివక్షేత్రం. తప్పక చూడవలసింది.

పిచ్చావరం :

సముద్రతీర విశ్రాంతి కేంద్రం. చిదంబరానికి తూర్పుగా 15 కి. మీ. దూరంలో ఉంది. పోల్టునోమా పురాతన పోర్చుగీసు, డచ్చిరేవు పట్టణం. తమిళనాడు టూరిజం డెవలెప్‌మెంటువారు ఒక యూత్ హాస్టలును నిర్మించారు. మంచి వసతిగా వుంటుంది. అక్కడే మెరైన్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ కూడా వుంది. సముద్ర నీటితో ఏర్పడిన ఒక జలాశయం. బోటు షికారుకి అనువైనది పిచ్చావరం. మంచి విహార యాత్రాస్థలం. ప్రక్కనే చిక్కని అడవికూడా వుంది. ఒక విలక్షణమైన అందాల ప్రోవు.

చిదంబరం పరిసరాల్లోనే 40 కి.మీ. దూరంలో కావేరి ముఖద్వారంలో అమరి యున్న పూర్వపు చోళరాజ్యంలోని ముఖ్యమయిన సముద్ర తీరపురేవు, అనాడు రోము నగరంతోను, మరెన్నో తూర్పు దేశాలతోను వర్తక వాణిజ్యాలు మహోన్న తంగా సాగించిన గొప్ప వ్యాపారకేంద్రం. చక్కటి బీచి కూడా ఉంది.

మాయూరం :

చిదంబరంనుండి దాదాపు 40 కి.మీ. వుంటుంది. తంజావూరు జిల్లాలోని మాయావరం తాలూకాకు ముఖ్యపట్టణం. పులిపుహారుకు దక్షిణాన వున్న టాంకో బారు- టౌన్ స్టేషనులో దిగితే శివాలయం వుంటుంది. ఆలయ ప్రాకారం శిల్ప ములో తలమానికమై చిదంబరంలోని ఒక ప్రాకారం తలపుకితెస్తుంది. కొంచం దూరంలోనే అంటే 3 కి.మీ. దూరంలో ఒక విష్ణాలయంకూడా వుంది. ఈలోపులో టాంకోబారులోని 1700 నాటి డేనిష్ లూథరన్‌చర్చి, డేన్స్ బోర్గుకోట- శిధిలావస్థ లోవున్నా చూడదగినవి. కొన్ని పాతవలసవారల భవనాలు ఇంకా మిగిలివున్నవి చూడవచ్చు.

మాయావరంనుండి కుంబకోణం వెళ్ళబోయేముందు బంగాళాఖాత తీరంలో ఉన్న కొన్ని ప్రదేశాలు చూడాలని అభిలాషవున్న వారికి మాత్రం ప్రత్యేకం.

కరైకాల్ :

ఒకానొకప్పుడు పాండిచ్చేరిలో చేరిందే! ఫ్రెంచివారి భవనాలు, పటాలాల క్యాంపులు వగైరాలు కనబడతాయి. చక్కటి కాథొలిక చర్చిఉంది. అయితే అక్క డంతా మహమ్మదీయులే!

దగ్గరిలోనే సముద్ర తీరంలోనే ముస్లిముల యాత్రాస్థలమైనది నాగూరు. అణ్ణై వేలాంకణ్ణి చర్చి, ఆరోగ్య వరప్రదాయినియైన పవిత్ర మాతగా కొనియాడబడే ఈ చర్చి రోమన్ కాథలిక్కులకు పుణ్యప్రదమైనది. కాని అన్ని కులాలవారూ, మతాల వారూ సమానంగా అర్చించి తమవ్యాధుల నుండి విముక్తమైనవారు తమకు ఏ అవయవమైతే స్వస్థత చేకూరిందో ఆ అవయవపు వెండి, బంగారు నమూనాలు తమ శక్తికొలది సమర్పించుకోటం పద్ధతి. సెప్టెంబరు 8న బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. [illegible] దగ్గిర P W D రెస్టుహౌస్ వుంది. ఆసక్తి గలవారు ఇక్కడ దర్శించవచ్చు. మాయూవరం నుండి కుంబకోణం మధ్యలో కొన్ని దివ్యదేశాలు.

కోర్నాడు :

పట్టణానికి దగ్గరలో ప్రసిద్ధియైన వానితోపాటు దివ్యదేశా లనదగిన తిరువళందూర్, తేరళందూర్— మహాకవి 'కంబన్' జన్మస్థలంగా ప్రసిద్ధి చెందినది వగైరా 4 దివ్య దేశములతోపాటు ఇతర పవిత్ర దేవాలయాలను చూడవచ్చు.

## కుంబకోణం

మదరాసు నుండి 66 కి.మీ. దూరం. దివ్యదేశాలు దర్శిస్తూవస్తే 'తిరునాగేశ్వరం' నుండి [illegible] కి.మీ. దూరం. అరసలార్—కావేరిలమధ్య నున్న పట్టణం. తంజావూరు జిల్లాకు చెందిన కుంబకోణం తాలూకాకు ముఖ్యకేంద్రం. 7వ శతాబ్దంలో చోళరాజులు పాలించిన దేశంలోనిది. పట్టణమంతా దేవాలయాలే ? శివాలయాలు–12, విష్ణ్వాలయాలు 4 అతిముఖ్యమైనవిగా పరిగణించబడినవి. తంజావూరు చుట్టుపక్కల గల అన్నిటికంటే ఇది చాలా ముఖ్యంగా దర్శనీయం. ఈ పదహారు దేవాలయాల్లో గూడా అతి ముఖ్యంగా చూడదగినవిగా ఉండేవి 4. అవి సారంగపాణి, కుంభేశ్వరస్వామి, రామస్వామి, నాగేశ్వర ఆలయాలు అతిముఖ్యమైనవి. వానిలో కుంభేశ్వరస్వామి ఆలయం మధురలో మీనాక్షి దేవాలయం తరువాత చెప్పుకోదగింది. కనుక ముందుగా–

### కుంభేశ్వరస్వామి ఆలయం :

ఇది శివాలయం. కుంభేశ్వరస్వామి–దేవేరి మంగళాంబిక ఆలయ ఆవరణంలో అష్టలక్ష్మి స్వరూపాలున్నాయి. (ఆది, వీర, విజయ, గజ, ధాన్య, ధన, సంతాన,

సౌభాగ్యలక్ష్మి రూపములు అష్టలక్ష్మి రూపముల వివరము) ఆలయం లోపలికి వెళ్ళాలంటే పెద్ద హాలుంది. గోపురం 40 మీటర్లు ఎత్తులో వుంటుంది. 10 అంతస్తులు. లింగోపరిభాగము కుంభమూతిలాగా వుంటుందిట. అందుచేత కుంభేశ్వరస్వామి పేరు సార్థకమయిందని అంటారు. ఇక్కడ 'మహామాఘం' అనే కొలనుంది. ఆ కొలనులో ప్రతి పన్నెండు సంవత్సరాల కొకసారి గంగాజల ప్రవేశం వుంటుందని ప్రతీతి. ఈ కొలను దగ్గర ప్రతి పన్నెండు సంవత్సరాలకి ప్రత్యేక ఉత్సవం జరుగుతుంది. పవిత్ర స్నానాలు జరుగుతాయి. దీన్ని 'మహామాఘి' ఉత్సవం అని అంటారు. బృహస్పతి సింహరాశిలో చేరినప్పుడు ఈ ఉత్సవం జరుగుతుంది. దేశంలో కుంభమేళా జరిగినప్పుడు ఎలా అయితే లక్షలాది ప్రజలు వస్తారో అలాగే ఈ వుత్సవానికి దేశం నలుమూలలనుండి వస్తారు. మహా పవిత్రంగా భావిస్తారు. పూర్వకాలంలో శ్రీకృష్ణ దేవరాయలు, అచ్యుతరాయలు మొదలగువారు ఇక్కడికి వచ్చి స్నానంచేసి పునీతులైనట్లు చెబుతారు.

### సారంగపాణి ఆలయం :

ఇది ఒక దివ్యదేశం. స్వామి సారంగపాణి పెరుమాళ్, కోమలవల్లి తాయారు అమ్మవారు, ఆళ్వారుల మంగళాశాసనం. పట్టణం నడిబొడ్డులో ఉన్నది. 12 అంతస్తుల గాలిగోపురం, 160 అ. ఎత్తున శిల్పనైపుణ్యం మహైశ్వర్యాన్ని కలిగించేదిగా ఉంది. నాయకరాజు నిర్మించినది. ఇతర ద్వారాల మీద 5 చిన్న చిన్న గోపురాలున్నాయి. రెండు రథాలున్నాయి. ఒకటి చాల పెద్దది. ఆలయంలోని వసంత మంటపం చూడదగినది. ఇంకా ఇక్కడ-

### రామస్వామి దేవాలయం :

కోదండరామస్వామి, సీతా, లక్ష్మణ, భరత శత్రుఘ్న సమేతంగా హనుమంతుడు సేవ చేయుమండగా నున్నట్లున్నాయి విగ్రహాలు. సాక్షాత్తూ శ్రీరామ పట్టాభిషేకంగా వర్ణించవచ్చు. స్తంభముల మీద దశావతార కథలు, రామాయణ గాథలు చెక్కబడియున్నవి. ప్రతి స్తంభము ఒకే శిలా నిర్మితం. రామాయణమంతా గోడల మీద చిత్రముగ చిత్రించబడి యున్నది. చాల విశేషం.

### చక్రపాణి దేవాలయం :

చక్రపాణిస్వామి, విజయవల్లి తాయరు గల వైష్ణవ ఆలయం. మాఘమాసంలో ఉత్సవం విశేషంగా జరుగుతుంది.

### నాగేశ్వరస్వామి ఆలయం :

ఆలయం చాలా పెద్దది. ఆవరణంలోని నటరాజ మండపం చూడ దగినది. శిల్పసంపద అమోఘం. స్వామి వారి లింగము చాల చిన్నదిగా వుంటుంది. సంవత్సరంలో [illegible] సూర్యకిరణాలు గోపుర గవాక్షం గుండా లింగముపైన ప్రసరించునట్లు అమర్చబడిందంటారు.

### కామకోటి పీఠము :

ఆదిశంకరులు అద్వైతమతాన్ని ప్రచారం చేయటానికి ఉద్దేశించబడింది. కంచిలో ఉండేదాన్ని తంజావూరు మహారాజావారి కోరిక ననుసరించి యిక్కడికి మార్చబడినట్లుగా చెబుతారు.

కుంభకోణంలో బ్రహ్మదేవాలయమున్నది. అతి అరుదైన విశేషం. తెలిసి కొని మరీ చూడదగింది.

ఇక్కడ పట్టువస్త్రాలు, రాగి, ఇత్తడి, కంచు సామానులకు ప్రసిద్ధి. కుంభ కోణం తమలపాకులు ప్రత్యేక ప్రఖ్యాతిని కలిగివున్నాయి.

కుంభకోణం చుట్టూ అనేక ఆలయాలు, దివ్య దేశాలున్నాయి.

### దరసురాం :

ఒక కొలను. ప్రక్కనే కావేరి స్వామిజలాలు ఈ కొలనులోకి ప్రవహిస్తాయి. స్వామి పేరు ఐరావతేశ్వరుడు. ఇక్కడి 'యమతీర్థం' సర్వపాపహారిణిగా పేరు.

దీనికిపైగా దివ్యదేశాలైన తిరుందనూరు, తిరుప్పుం బూదంగుడి, ఉత్రకిలియప్పన్ సన్నిధి, నాచ్చియారు కోవెల, నాథనకోవెల, కపిస్థలము, కూడలూరు దివ్యదేశాలను ఆసక్తిగలవారు దర్శించవచ్చును.

## తంజావూరు

తంజావూరు జిల్లా ముఖ్యకేంద్రం. ప్రస్తుతం సుమారు లక్షా నలభైఐదు వేల జనాభాతో వర్ధిల్లుతున్న పట్టణం. తంజం అనే రాక్షసుడు ఇక్కడ శ్రీ మహావిష్ణువుచే వధింపబడినాడు గనుక తంజావూరుగా పేరు సార్థకతను పొందింది. తమిళనాడులోని ధాన్యాగారంగా పేరు. పల్లవుల మాదిరిగానే తంజావూరు చోళులకు రాజధానిగా విల సిల్లింది. దక్షిణాదిన చోళ, చేర, పాండ్య రాజవంశాల మధ్య ఎప్పుడూ ఆధిక్యతతో

కోసం యుద్ధాలు జరుగుతూనే వున్నాయి. చోళులు రాజ్యానికి క్రీ.శ. 850 నుండి 13వ శతాబ్దం చివరిభాగం వరకూ పాలనలో వున్నారు. ఈ కాలంలో తమ సామ్రాజ్యాన్ని ఎంతో విస్తృత పరిచారు. సరిహద్దులు బొంబాయి-పూరిల మధ్య దక్షిణరేఖ విస్తరించి దక్షిణంగా శ్రీలంక, మలయా, సమత్రాదీవులకు కూడా విస్తరించినది. మహోన్నత వైభవాన్ని అనుభవించింది.

తంజావూరు చేరటానికి మదరాసు నగరంనించి మరి యితర ముఖ్య కేంద్రాలన్నిటినుండి రైలు, రోడ్డు మార్గాలున్నాయి. మద్రాసు నుండి 350 కి.మీ. దూరం. కుంబకోణం నుండి సుమారు 40 కి.మీ. ఉంటుంది. విజయనగర రాజుల ప్రతినిధులైన నాయకరాజుల అధీనంలో కొన్నాళ్ళుంది. తరువాత మహారాష్ట్రుల చేతిలోచిక్కి క్రమేణా అన్ని ప్రదేశాల మాదిరిగానే ఇదికూడా బ్రిటిషువారి కబంధహస్తాల్లోకి చేరింది. చోళరాజ వంశాల్లో మహాసామ్రాట్టులుగా రాజరాజ చోళుడు, రాజేంద్ర చోళుడు పేర్కొన దగినవారు. చోళులు మహానిర్మాణ దక్షులు. కళలను పోషించిన మహామహులు. ఎన్నో దేవాలయాలు వెలసినవి. ద్రావిడ సంస్కృతిని చిరస్మరణీయంగా చిరకాలం ఉండేట్లు శిలలమీద మలిచారు. వీరి కాలంలో కట్టినకోటలు, ఆలయాలు ఈనాటికీ తమ ప్రాచీన వైభవాన్ని వెలుగుతో నిలిపి ఉంచిందనడంలో సందేహం లేదు. తంజావూరు చుట్టుప్రక్కల పరిసరాల్లో తిరువాయూరు, తిరుకండియూరు, గంగయికొండ, చోళపురం, శ్రీరంగంలో అమరియున్న ఆలయ సమూహం-బహుశా దేశంలోకెల్లా పెద్దదిగా భావించబడుతూంది. తిరుచిరాపల్లి చోళుల కాలంలో రూపుదిద్దుకున్న ద్రావిడ శిల్పకళా వైశిష్ట్యానికి మచ్చుతునకలుగా నిలిచినవి తదుపరి ఎన్నో యితర ప్రదేశాల్లోని ఆలయ నిర్మాణాలకు పునాదులుకూడా. ఈ పరంపరలో ముందుగా తంజావూరులోని-

బృహదీశ్వరాలయం :

క్రీ.శ. 985-1014 సంవత్సరాల్లో పాలించిన రాజరాజచోళుడు నిర్మించాడు. చోళరాజుల వైభవమును మకుటాయమానంగా చాటిచెప్పిన నిర్మాణ వైదుష్యానికి గీటురాయి. అంతకుముందు నిర్మించబడిన దేవాలయాలు ఎక్కువ ప్రాధాన్యం బయటి ప్రాకారం ప్రవేశ ద్వారాల్లోని గాలిగోపురాలు సమున్నతంగా నిర్మించేవారు. ఆ సంప్రదాయపు రీతుల్ని అధిగమించి గర్భగుడిమీద విమానం ఉన్నతంగా అమర్చిన కట్టడపు రీతులకు నాంది పలికిన నిర్మాణం. ఆలయంలోని స్వామి బృహదీశ్వరస్వామి, అమ్మవారు బృహన్నాయికి. కోటలోనే నిర్మించబడింది. గర్భగుడిమీద అమర్చియున్న

శివలింగం స్వరూపంలో ఏకశిలా నిర్మితమయిన కలశం దాదాపు 81 టన్నుల బరువు గల బృహత్తర శిలా నిర్మాణం. దీన్ని పైకి తీసుకెళ్ళటానికి 6 కి.మీ. దూరంనించి ఏటవాలుగా నిర్మింపచేసిన వాలుతలం ద్వారా ఆలయ గర్భగుడి మీదికి మోసుకు వెళ్ళినట్లుగా చెప్పబడుతుంది. ఇటువంటి మహత్తరమైన పని యీజిప్టులోని పిరమిడ్‌ల నిర్మాణం సమయంలో ఉపయోగించిన టెక్నిక్ ప్రయోగింపబడిందని చెప్పుకుంటారు. ఈ విమాన గోపురం 216 అ. ఎత్తున వున్నది. ఇంత ఎత్తున గర్భగుడిమీద విమాన గోపురం అమర్చిన ఆలయాలు దక్షిణ భారతంలో చాలా కొద్ది మాత్రమే. అవికూడా చాలావరకు తంజావూరు జిల్లాలోనే, తంజావూరు పరిసరాల్లో వుండటం గమనార్హం.

ఈ ఆలయపు వాస్తుశిల్పి రామవర్మ కాంచీ పురమునకు చెందినవాడని ప్రతీతి. గోపుర శిఖరాగ్రంలో నాలుగువైపులా నాలుగు నందులు చెక్కించబడియున్నాయి.

ఆలయపు ఆవరణలో ఆగ్నేయ మూలగానున్న రెండు శిలానిర్మిత విఘ్నేశ్వర విగ్రహాలున్నాయి. ఒకటి కంచుమోత, రెండోది రాతిమోత వినిపిస్తాయి. విచిత్రం. తూర్పు ప్రాకారం వరండాలో ఒక నందివిగ్రహం విడిగా ఉన్నది. బహుశా గోపురం మీదికి ఎక్కించటానికి చేసినదయి ఉండవచ్చునని భావన.

మహానంది :

గర్భగుడి ముందర ఏకాండపు నల్లరాతితో చెక్కినది 18 అ. పొడవు, 12 అ. ఎత్తు, 7 అ. వెడల్పున 25 టన్నుల బరువుండేదిగా వున్న మహానందీశ్వర విగ్రహం చూడదగింది. శిల్పుల గణనీయమైన నైపుణ్యం చూపించబడింది. ఇంత పెద్ద నందీశ్వర విగ్రహాలు దేశం మొత్తంమీద ఎన్నికైన కొన్నిచోట్ల మాత్రమే చూడదగినవి.

ఇక్కడ శివ, విష్ణు దేవాలయాలు సుమారు 70 పైగా వున్నాయి. ఆలయంలో ఒక బుద్ధేశ్వరుని సమాధి వుంది. లింగ ప్రతిష్ఠ జరిగిన తరువాత లింగం కదులుతున్నట్లుండగా దానిని కదలకుండా స్థిరంగా వుండేట్లు చేశారని చెపుతారు.

ఒక మంటపంమీద 108 శివలింగాలున్నాయి. మంటపం గోడలమీద శివలీలలు చిత్రించబడి ఉన్నవి.

ఇక్కడి అమరియున్న సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయం 55 అ.ఎత్తు ఉన్నది. శిల్పకళా చాతుర్యాన్ని శ్లాఘనీయంగా ప్రతిఫలించే మండపం కమనీయం. దక్షిణాత్య

శిల్పమునకు తలమానికం, అలంకార ప్రాయమైనది. ఆలయం చుట్టూను, గర్భగుడి గోడలమీద శిల్పము చాలా స్పష్టముగా వుండి నిత్య నూతనత్వాన్ని వెలయింతుతుంది ప్రాకారానికి పడమరగా వున్న 'శివవనం' దానిలో శివగంగ అనే కోనేరు వున్నాయి. దక్షిణ ద్వారం వద్దగల వృక్షరాజం క్రింద అనేక నాగేంద్ర విగ్రహాలున్నాయి. ఆలయంలోకి హైందవేతరులకు ప్రవేశం లేదు.

రాజప్రాసాదాలు :

చక్కని శిల్పాలతో ఒప్పారే దర్బారుహాలు, మధ్యలో నొక వేదిక మీద ఛత్రపతి శివాజీ విగ్రహము చలువరాతి నిర్మితమైన దానిని చూడవచ్చు. నేలంతా చలువరాళ్ళు పరచియున్నవి.

మహారాష్ట్ర దర్బారు :

శిథిలావస్థలో ఉన్నది. మహారాష్ట్ర పాలకుల చిత్రాలనేకం వున్నాయి. వాటిలో శివాజీ మహారాజు, ఆయన అంతరంగికుల చిత్రాలు గూడ చూడవచ్చు.

సరస్వతీ మహాలు గ్రంథాలయం :

ఇది నిజంగా గీర్వాణవాణికి నిలయంగా చెప్పుకోవచ్చు. అనేక తాళపత్ర గ్రంథాలు భద్రపరచబడి ఉన్నాయి. సంస్కృత గ్రంథాలనేకం. ఈ పురాతన గ్రంథాలు ప్రాచీన విజ్ఞాన భాండారాలు. గ్రంథాలయపు గోడలమీద తంజావూరు రాజుల చిత్రపటాలున్నాయి. ఈ లైబ్రరీకి సమీపంలో అనేక రహస్య మార్గాలు, సొరంగ మార్గాలున్నాయని కోటలో నుండి బయటకు తీసికెళ్ళే దారు లున్నాయని ప్రతీతి. సొరంగపు గోడలు నున్నగా పాలీషు చేయబడి నట్లుంటాయి. అరుదైన వ్రాత ప్రతులు 30 వేలున్నాయట.

పురాతన ఆయుధాలు, రకరకాల కృపాణాలు, విచిత్రాయుధాలు విశేషంగా భద్రపరచబడి ఉన్నాయి. తూర్పు ద్వారంవద్ద 'తాసమొదు' అనే గడియారం ఉన్నది. దగ్గరలో అమర్చబడిన ఫిరంగిని గూడా చూడవచ్చు.

ఈ భవనంలోనేగల సంగీత మహలు శబ్దశాస్త్ర ప్రవీణుల వైదుష్యానికి గీటు రాయి. రాతిస్థంభాలు సప్తస్వరములు 'సరిగమపదనిస'లు తడితే చాలు వినిపిస్తాయి. చూడదగింది.

ఇక్కడ ప్రసిద్ధిచెందిన తంజావూరు పట్టువస్త్రాలు, తివాచీలు, లేసు వస్తువుల తయారీ పేరెన్నికగన్నది. పుష్పములకు కూడా ప్రసిద్ధి.

**హిందూ రాజు కట్టించిన క్రైస్తవ చర్చి :**

1799లో మరాఠా పాలకుడు రివరెండ్ C. V. స్క్వార్‌టిజ్ గౌరవార్థం కట్టించిన జ్ఞాపిక. దర్శనీయం.

**తంజావూరు పరిసరాల్లో :**

దగ్గరలో 5 కి.మీ. దూరంలో పెన్నా నదీ తీరంలో అమరియున్న దివ్య దేశం.

**కండియూర్ :**

ఉత్తరదిశన మరో 5 కి.మీ. దూరంలో రుద్రునికి కపాలమోక్ష మొసగించిన స్థానంగా ప్రసిద్ధి. ఇది మరియొక దివ్యదేశం. శివుని శాపము తీర్చిన స్వామిగా ప్రసిద్ధి.

**తిరువాడి లేక తిరువాయూర్ :**

తంజావూరునుండి 11 కి.మీ. దూరంలో నున్న శ్రీ త్యాగరాజ స్వామివారు నివసించిన స్థలం. భక్తి, ముక్తి, రక్తి నాదోపాసనలు వున్నవని లోకానికి చాటిన ప్రముఖ కర్నాటక సంగీత వాగ్గేయకారుల్లో ప్రప్రథమ స్థానాన్ని పొందిన శ్రీ త్యాగరాజస్వామి మహాభక్త శిఖామణి. కర్నాటక సంగీతానికి ఒక విశిష్ట స్థానాన్ని కల్పించినవి త్యాగరాజకృతులు. తమిళదేశంలో వున్నా స్వామి తెలుగువారి మణిమాణిక్యం. తెలుగుతల్లి మల్లెపూదండలోని పసివాడని పుష్పరాజం. తన రీతిని అరవలను పాటకులుగా తీర్చిదిద్దిన మహానుభావుడు. స్వామివారి కృతులు శిలలపై చెక్కి శాశ్వతత్వాన్ని కలిగించే ప్రయత్నం ఎంతయినా హర్షించదగినది.

పవిత్ర కావేరీ నదీతీరంలో అమరియున్న ఈ పట్టణములో అతి ముఖ్యమయింది శ్రీ త్యాగరాజ వారి సమాధి. పట్టణమంతా బ్రాహ్మణులే.

**చూడదగినవి :**

**పంచనాదేశ్వరాలయం :**

చోళరాజులు అభిమానంతో కట్టించిన దేవాలయం. చాల విశాలమైనది ఆలయ ఆవరణలో పెద్దమంటపం, వాహనశాల వున్నాయి. దేవాలయం నిర్మించటానికి తగిన ధనం కోసం నందీశ్వరుని పాదం క్రింద త్రవ్వితే లభ్యమగునని స్వామి ఒక ఋషికి స్వప్నంలో సాక్షాత్కరించి చెప్పారట. అదే విధంగా లభ్యమయిన ధనంతో ఈ ఆలయం నిర్మాణం జరిగింది. ఆ గుంటను కూడా ఇప్పటికీ చూపుతారు. శివపంచా

క్షరి జపించే ప్రత్యేక మంటపం ఒకటుంది. దానిని ముక్తి మంటపం అంటారు. ఇటువంటిది కాశీలో మాత్రమే వుంటుందిట.

### ధర్మాంబ దేవాలయం :

పై ఆలయానికి ఈశాన్య దిశన త్రిపురసుందరి అమ్మవారి దేవాలయం. ఇటీవల అనేక వ్యయప్రయాసలకోర్చి ఆలయ పునరుద్ధరణ చేశారు.

త్యాగరాజస్వామి వారి గృహం కూడా చూడవచ్చును. భక్తునకు శ్రీరామచంద్రుడు దివ్యసాక్షాత్కార మొసగిన చోటు కూడా వుంది. ఆ పవిత్రస్థలము అవశ్యం దర్శనీయం. ప్రతి సంవత్సరం—స్వామివారి జయంత్యోత్సవం కోలాహలంగా జరుగుతుంది. ఇక్కడ మహాగాయక విద్వాంసులు అనేక ప్రాంతాలనుండి వచ్చి ఉత్సవ సమయంలో పాల్గొని తమ కళను సార్థకం చేసికొని స్వామివారికి భక్తి నీరాజనాలు సమర్పిస్తారు.

### తిరువారూరు :

శివక్షేత్రం. తంజావూరు, నాగపట్టణంల మధ్య అమరియున్నది. స్వామి వాల్మీకనాదర్, అమ్మవారు కమలాంబిక. దేవాలయంలో ఉన్న పెద్ద పుట్టవలన ఈ స్వామికా పేరు సార్థకమాయెను. ఆలయంలో వేయి స్తంభాల మండపం వుంది. అసంపూర్తిగా నున్నదను భావాన్ని సమర్థిస్తూ పెద్ద పెద్ద రాళ్ళు అక్కడ పడవేసి ఉన్నాయి. ఆలయం వెలుపల పెద్దకోనేరు కమలాలయమనే పేరు. కోనేరు నడుమలో ఒక దీవి—దీనిలో దేవాలయం. పురాణ కథనొకదాన్ని ప్రతిబింపిస్తూ వున్న రాతి రథమును చూడగలం. మధ్యలో పిలుంచే మన్నారు గుడిలోని దక్షిణ ద్వారకగా పిలువబడే రాజమన్నార్ కోవెల కూడా దర్శించవచ్చు. మార్చి, జూన్ నెలల్లో ఉత్సవాలు విశేషంగా జరుగుతాయి. మన్నారులోని ఇతర దేవాలయాలు శివాలయాలు, విష్ణ్వాలయాలు గూడ దర్శించవచ్చు.

దగ్గరిలోనే 8 కి.మీ. దూరంలో 'తిరుకణ్ణమంగై' తిరుకణ్ణపురం, తిరుప్పులియూరు దివ్య దేశములు దర్శించవచ్చును—ఆసక్తిగలవారు. వీనిలో తిరుకణ్ణపుర దేవాలయం చాలా పెద్దది. శైవులకు, వైష్ణవులకు జరిగిన సంఘర్షణల కారణంగా కొన్ని విష్ణ్వాలయాలను పడగొట్టి శివప్రతిష్ఠచేయించే సమయంలో స్వామి తన యునికిని కాపాడుకున్న వైనం ఈ ఆలయంలో కనబడుతుందని ప్రతీతి. ఆలయం కూడా చాలా పెద్దది. సప్తప్రాకారాలు గలిగింది. ఇక్కడివరకు వచ్చిన తదుపరి నాగూరు, నాగపట్టణం కూడా చూడనగును.

### నాగపట్టణం :

తాలూకా ముఖ్య కేంద్రం, పురాతన ప్రసిద్ధిగల రేవు పట్టణం. మొదట డచ్చి వారు ఆక్రమించినది. తరువాత బ్రిటిషువారు వశం చేసుకున్నారు. ఇది ఒక దివ్య దేశంగా పరిగణించబడుతుంది. సముద్రపు బీచ్, లైట్‌హౌస్ వగయిరాలు గూడ చూడవచ్చును.

### నాగూరు :

సముద్రతీరంలో వున్న గ్రామం. ఇక్కడి నాగర్ మీరా సాహెబ్ దర్గా చాలా ప్రసిద్ధి చెందింది. దీనికితోడు రెండు హిందూదేవాలయాలున్నాయి. హజరత్ మిరా సుల్తాను సయ్యద్ షా హబ్దుల్ హమీర్ గొప్ప మహిమగల మహమ్మదీయ ఫకీరు. దర్గాకు 5 గోపురాలున్నాయి. దూరాన సముద్రం మీద వెళ్ళే నౌకలు సైతం ఆపి నమస్కరించి వెళతారట, దర్శనీయం. మహిమ తెలిసిన అన్ని మతాలవారు దర్గాను సేవించటానికి వస్తారు. నాగపట్టణం మీదుగా చేరదగినది.

### వేదారణ్యం :

సముద్రతీరంలో వున్న క్షేత్రం. ద్రావిడ భక్తశిఖామణి 'తైమన్నవర్' జన్మ స్థలం. గొప్ప దేవాలయం వుంది వేదములు స్వయంగా స్వామిని అర్చించినవట. అందువలన స్వామికి వేదారణ్యస్వామి అన్న పేరు గలిగింది. శ్రీరామచంద్రులవారు ప్రతిష్ఠించిన శివలింగముగల ఆలయం ప్రసిద్ధం. ఇక్కడే అగస్త్య మహర్షికి పార్వతీ పరమేశ్వరుల సాక్షాత్కారం జరిగినట్లుగా చెపుతారు. దర్శించదగిన పవిత్ర స్థలం. ఇక్కడకు దగ్గరిలోనే 'నలువేదపతి' అనే వేదములవతరించిన పవిత్రక్షేత్రం. మార్గ శిర మాసంలో వేదావతరణ జరిగిన దినమున ఉత్సవం జరుగుతుంది. ఇక్కడినుండి అరంతాంగి జంక్షను చేరాలి. మార్గమధ్యంలో గల తిల్లై విలాగం సేవించుకుని అరం తాంగి చేరవచ్చును. అరంతాంగిలో దిగి పుదుక్కోట బస్సులో వెళ్లాల్సి వుంటుంది. మధ్యలో ఒక హిందూ దేవాలయం, శివక్షేత్రం ఆసక్తిగలవారు దర్శించగలరు. ఇక్క డనేగల నందీశ్వర దేవాలయం- ఆలయ ప్రాంగణంలో ఒక స్తంభంమీద అష్టభుజ వీరభద్ర విగ్రహం మరికొన్ని పురాణకథ శిల్పములు, హిందూరాజుల చిత్రపటములు వగైరాలుగల మంటపములుచూడగలరు. శిల్పం ఎప్పుడూ నిత్యనూతనంగాకనపడుతూ ఆశ్చర్యానందాన్ని కలిగించును.

**పుదుకోట్ట :**

ఒకానొకప్పటి పుదుకోట్ట సంస్థానానికి ముఖ్యపట్టణం. స్టేషన్నుండి 2 కి.మీ. దూరం వుంటుంది. చూడదగినవిగా 11-12 శతాబ్దాల ప్రాంతంలో బౌద్ధులు, జైనులు నివసించినట్లు దాఖలాలున్నాయి. రాజభవనాలు, ఆనందబాద్‌తోట, తిరుగోకర్ణం మ్యూజియం వగయిరాలు దర్శనీయం.

**తిరుగోకర్ణం :**

ఒక చిన్న గుట్టమీద నిర్మించబడింది. స్వామిని భగదారనాద్ అని అంటారు. మ్యూజియంలో అనేకమయిన జంతు కళేబరాలు, శిలలు, ప్రాచీన ఆయుధ విశేషాలు, ఆభరణాలు వున్నాయి. ఇక్కడికి 20 కి.మీ. దూరంలో జైన, బౌద్ధులు నివాసమున్నట్లు తెలుపుతూ గల అవశేషాలున్నాయి. చూడవచ్చు.

# శ్రీ రంగం

ఇది యొక దివ్యదేశం. తిరుచినాపల్లి జంక్షను నుండి బస్సులో ప్రయాణించి చేరవచ్చును. చుట్టూ కావేరినది పరివేష్టించి యున్న ద్వీపం. విష్ణ్వాలయం బహుశా దేశంలోకెల్లా పెద్ద ఆలయంగా గణించబడింది. అక్కడ వసించియున్న ముఖ్య దైవం శ్రీరంగనాథస్వామి. శ్రీ మహావిష్ణువు నిరంతర నిద్రుడై అనంతశయనుడైన స్వామి. శ్రీరంగము ఒక చిన్న పట్టణం. వైష్ణవులకు 108 దివ్యదేశాల్లో ఇది ప్రధానమైనది. కావేరినది పైన ఒక పెద్ద వంతెన తిరుచినాపల్లికి శ్రీరంగమును కలుపుతుంది. ఆలయం సప్త ప్రాకారములుగల విశాలమైన ఆలయం. 21 గోపురాలున్నాయి. ఆలయం బహుశా చాలవరకు 14-17 వ శతాబ్దాల మధ్య నిర్మాణం జరిగినట్లు తెలుస్తుంది. దీని నిర్మాణంలో అనేక రాజవంశాల హస్తములు కలగలిపియున్నవి. చేరులు, పాండ్యులు, చోళులు, హోయసలులు, విజయనగర రాజులు క్రమ పరిణామంలో ఆలయాభివృద్ధికి అనేక విధముల తోడు పడినారు. ప్రాకారాంతర్భాగాల్లో అనేక యితర దేవతానివాసాలకాలయమైంది. విజయనగర రాజ్య పతనానంతరం ముస్లిము సోదరులకు కూడా ఆరాధనీయ స్థలమైంది. అయితే యిప్పుడు గర్భ గుడి ప్రాంగణంలోకి హైందవేతరులకు ప్రవేశంలేదు. కట్టడం మహాద్భుతమైంది. గర్భగుడిలో ప్రవేశంలేదు అని హైందవేతరులు బాధపడవలసిన పని లేదు అంటారు దర్శించివచ్చిన విదేశీయులు మొదటి నాలుగు ప్రాకారములలోను అక్కడ నివసించే

అర్చకులు, బ్రాహ్మణులు నివాసముంటారు. అనేక సత్రాలున్నాయి. దుకాణాల్లో అన్ని వస్తువులు దొరుకుతాయి. తీర్థవిధులు నిర్వర్తించదగిన క్షేత్రంగా ప్రసిద్ధి. స్వామివారికి తలనీలాలు యివ్వటం పరిపాటి.

ఆలయ ప్రశస్తి :

శ్రీరంగం భూలోక వైకుంఠం. క్రీస్తు పూర్వం అలెగ్జాండరు దండయాత్రకు పూర్వమే ఆలయమున్నట్లుగా చారిత్రకాధారాలు తెలుపుతున్నాయి. ఆలయ చరిత్ర సుమారు 4000 సంవత్సరాల వెనక్కు తీసుకెళ్తుంది. శ్రీరంగనాథుడు చోళరాజులకు ఆరాధ్యదైవము, కులదైవం. శ్రీ రామానుజాచార్యులువారు ఇక్కడ నివసించినట్లుగా ప్రతీతి.

గర్భగుడిచుట్టూ ఉన్నది ప్రథమ ప్రాకారంగా చెప్పుకోవచ్చు. గర్భాలయంపైనున్న విమానం బంగారు మలాము చేయించబడియున్నది. ఈ విమానము ప్రణవాకారమై సప్తవేద శృంగాలతో విలసిల్లుతూంది. బంగారు పనులు చాలవరకు 'జటవర్మ సుందర' అనే పాండ్యరాజు 13వ శతాబ్దంలో చేయించినట్లుగా తెలుస్తుంది. ప్రదక్షిణ గోడలో 108 దివ్యదేశముల స్వాముల చిత్రాలు చిత్రించబడి యున్నాయి. గర్భగుడి కెదురుగా అద్దాలు గదితో విరాజిల్లే చందనమండపంవుంది. 2వ ప్రాకారం 7వ ప్రాకారం వరకు అనేక దేవతలకు ఆలయాలున్నాయి. స్వామివారికి ఆభరణాలు చిత్ర విచిత్రములైన పనితనంతో విరాజిల్లుతూ అమూల్యమైనవిగా పరిగణించబడి వున్నాయి. స్వామివారి ఆభరణ విశేషాల్లో తులలేని వజ్రమొకటి ఉండేదని, దానిని ముష్కరులైన విదేశీయుడు తస్కరించాడని చెపుతారు. ప్రాకారాలన్నిటిలోను అనేక మంటపాలు వివిధ రీతుల శిల్పాలతో విరాజిల్లుతూవుంది. పాదరక్షలు 4వ గోపురం వరకు పరవాలేదు. తరువాత పాదరక్షలు తీసివేయాలి. దాని కెదురుగా గోడమీదికెక్కి పట్టణం, ఆలయం మొత్తం పూర్తిగా దృశ్యమానంగా కనబడేవైనం చూడటానికి ప్రాకారపుగోడ ఎక్కటానికి టిక్కెట్టుకొని ఎక్కిచూడవచ్చు. దేవాలయమంతా తిరిగి చూడటానికి ఒక రోజుపైగా పడుతుంది. స్థల పురాణము, క్షేత్ర మహాత్మ్యంను తెలిపే పుస్తకాలు అమ్ముతారు. ప్రతి సంవత్సరం విధిగా నిర్వహించే రథయాత్ర గొప్పవిశేషం. 4వ ప్రాకారంలోనే 940 స్తంభాలుగల మండపం వేయిస్తంభాల మండపంగా పిలవబడేది వుంది.

మహారాజులు తమశక్తియుక్తుల కొలదీ ఆలయానికి అనేక కానుకలు సమర్పిం

చారు, ఆరాధించారు. పాండ్యరాజు దాదాపు ఏనుగెత్తు బంగారం సమర్పించారని ప్రతీతి, ప్రిన్స్ ఆఫ్‌వేల్స్ దొరవారు దర్శించి ఒక పెద్ద బంగారు పాత్రను సమర్పించారట. ఆలయ మహాత్మ్యమును గూర్చి అనంతుపైనా శక్తి చాలదేమో ! ఈ ఆలయంలో తెలుగు నాయక రాజుల ప్రసక్తి ప్రశస్తి వుంది. వారిచే అనేక చిత్రాలు చిత్రించ బడియుండినట్లుగా తెలుస్తుంది. ఆలయ ప్రాకారాల్లో రామానుజ కూటాలనేకం అమరియున్నాయి.

ఆలయ నిర్మాణం ఆనాటి నిర్మాణ వైచిత్రికి, మనోభావనా శబలతకు, శిల్ప కళావైభవానికి యుగాలు మారినా వన్నె తగ్గని శోభలతో అలరారుసట్లుండటం నిర్మాణ శిల్పుల పనితనానికి గీటురాయిగా ఇప్పటికీ నిలిచి నిత్యనూతనంగా వెలుగొందే ఈ ఆలయాన్ని ప్రతి భారతీయుడు ఒకసారిచూచి తలయూచి జన్మసాఫల్యం పొందిన అనుభూతిని పొందదగిన దివ్యప్రదేశం.

ధనుర్మాసంలో వచ్చే ముక్కోటి ఏకాదశికి గొప్పఉత్సవం జరుగుతుంది. భూలోక వైకుంఠద్వార దర్శనాలు చేసినట్లుగా భావించుతారు భక్త యాత్రికులు.

పుష్యమాసంలో, మాఘమాసంలో స్వామివారి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుగుతాయి. దగ్గరిలోని నృసింహస్వామి దేవాలయంకూడా దర్శనీయం.

**జంబుకేశ్వరం :**

శ్రీరంగం విష్ణుక్షేత్రం, ప్రక్కనే వెలసిన శివక్షేత్రం. శ్రీరంగంలోని ఆలయానికి దీటురాగలది అని ప్రతీతి. చాలా అనాది దేవాలయం. శిల్పంలో శ్రీరంగం కంటే ఎక్కువేనని చెప్పవలసివుంటుంది. , ఆలయం పంచ ప్రాకారాలతో ఒప్పియుంటుంది. గర్భాలయం వెనుక ఒక నేరేడు చెట్టువుంది. గర్భాలయంలో నిరంతరం ఊరేనీటి ఊట ఉంది. నేరేడు వృక్షమును జంబూ వృక్షమని అంటారు. శివుడు బ్రహ్మహత్యా పాతకమునుండి విముక్తికోసం ఈ చెట్టుక్రింద వుండి తపస్సు చేసినట్లుగా చెపుతారు. కనుక ఈ స్వామికి పేరు సార్థకమయింది. అమ్మవారిపేరు అఖిలాండేశ్వరి. 3 వ ప్రాకారంలో గల ధ్వజస్తంభం వద్దగల మంటపం నాలుగు స్తంభాలు విచిత్ర శిల్పాలతో శోభిల్లుతుంది. మిగిలిన ప్రాకారాల్లో ఇండ్ల వరుసలు, భూములు, జాగీరులు ఇచ్చిన శాసనాలు అనేకం సమాచారాన్నిచ్చే వాటిని గమనించవచ్చు.

# తిరుచునాపల్లి

జంబుకేశ్వరానికి చాలా దగ్గర. కొద్ది కి.మీ. దూరం మాత్రం ఉంటుంది. పొట్టిగా ట్రిచ్చి, తిరుచ్చి అనికూడా అంటారు. చరిత్రప్రసిద్ధి చెందిన పట్టణం. జిల్లా ముఖ్యకేంద్రం. తంజావూరు నించి 58 కి.మీ. దూరం. మద్రాసు నగరం నించి 401 కి. మీటర్లు. పట్టణం 6 లక్షల జనాభాతో నిత్యం సందడిగా వుంటుంది. మద్రాసు నగరం నుంచి విమాన సౌకర్యంఉంది. రోడ్డు, రైలుమార్గాలద్వారా ప్రధాన పట్టణాలన్నింటికి కలుపుకొస్తుంది.

తిరుచ్చిలోగుండా ఉయ్యకొండం, కొరయారు, కొండమురుట్టి నదులు ప్రవహిస్తుండగా కావేరినగరంచుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. కావేరి బ్రిడ్జినిదాటి నగరంలో ప్రవేశిస్తుండగానే రాక్‌ఫోర్టు మైదానం మీది గుట్టమీద ఒక్కసారిగా 83 మీటర్ల ఎత్తున నిల్చి చూస్తుంటుంది. ఇది ఒక గిరిదుర్గం. గుట్టను చుట్టుకుని పైకి వెళ్ళేందుకు మెట్లు వరుసనుంది. రెండోవరుసమెట్లు రెండు పెద్ద మంటపాల్లోకి దారితీస్తుంది. రెండు శతస్తంభ మంటపాలు. అధివసించిన ముఖ్యదేవత మాతృభూతేశ్వరస్వామి అమ్మవారు సుగంధి కుంతలాంబిక. తమిళంలో మాతృభూతేశ్వరుని తాయుమానవర్ అని అంటారు. గర్భగుడి బజారు లెవెలుకి 83 మీటర్లు ఎత్తు. సముద్ర మట్టానికి 503 అ. ఎత్తు. విస్తృత శివాలయం. ప్రధాన ఆలయం చేరటానికి ముందే శ్రీ గణేశాలయం వుంది. చాలా ప్రసిద్ధి చెందింది. శివ సంబంధమైన లీలలు అనేక చిత్రాలుగా చిత్రీకరించబడి వున్నవి. ఆలయం 11వ శతాబ్దానికి చెందిన పల్లవ రాజులు ఈ ఆలయనిర్మాణం చేశారని ప్రతీతి. కొండ కొమ్మునించి చూస్తే తిరుచనాపల్లి పట్టణం, కొబ్బరితోటలమధ్య సమున్నతంగా అమరియున్న శ్రీరంగ గోపురం దృశ్యమానంగా కనబడుతాయి.

కొండ క్రింద పెద్ద కోనేరు ఉన్నది. మధ్యలో ఒక మంటపం. దీనికి సమీపంలోనే ఆంగ్లసామ్రాజ్య నిర్మాత రాబర్టు క్లైవు నివసించిన బంగళావుంది. దానిలో ఒక కాలేజీ నడుపబడుతోంది.

చూడదగినవిగా ఇంకా టౌనుహాలు, నబాబుల భవనాలు, దగ్గరిలోనే ఉన్న చందా సాహెబ్ సమాధి మొదలయినవి దర్శనీయం.

ఆగస్టు మాసంలో ఈశ్వరునకు, వినాయకునికి ఉత్సవాలు జరుగుతాయి. యాత్రికులు విశేషంగా పాల్గొంటారు. తిరుచినాపల్లి వెండి, బంగారు నగలు, వస్తువులు నగిషీలకు మంచిపేరు.

ఇక్కడికి దగ్గరిలో అమరిన అన్బిల్, తిరుప్పేరునగరం. కదంబనూర్, తిరువెళ్ళరై, ఉరైయూర్, నార్తమలై, సత్యగిరి, తిరుక్కోట్టియూర్- శ్రీరామానుజులు స్వార్థమయిన మోక్ష ప్రయోజనాన్ని సైతం వీడి సర్వప్రజలకు ఆలయ గోపురం పైకెక్కి తిరుమంత్రమును విశదపరిచిన స్థలం— పురాణ కాలంలో హిరణ్యకశిపుని బాధలు పడలేక దేవతలందరూ ఇక్కడే సమావేశమయి సభ చేసినందున ఈ ప్రదేశానికి గోష్ఠీ పురమని నామము సార్థకమయినది— మొదలయిన దివ్యదేశాలను సందర్శించిరావచ్చు. కొంత వ్యయప్రయాసలతో కూడినపని. పుష్కలంగా సమయ వినియోగం చేయగలవారు మాత్రమే అన్నీ చూడగలరు. ఇక్కడినుండి కూడా మధురై జంక్షను చేరితే ఒకలైను రామేశ్వరం వైపుకి, మరోలైను మధురవైపు వెళతాయి. ప్రస్తుతం మనం మానామదురైనుండి ఈశాన్య దిశగా ప్రయాణించి రామనాద్ మొదలయిన క్షేత్రములను దర్శించి- తరువాత మధురై లైను విచారమునకు వెళదాము. ఇవి రెండూ ఒకదానికొకటి వ్యతిరేక దిశలో వుంటాయి కనుక ఈ వెసులుబాటు తప్పనిసరి. ఒక వైపునించి వెళుతూ మరోవైపు నుండి వచ్చేటపుడు కలుపుకుని రాగల అవకాశము చూచుకొనేది. కనుక ఇప్పుడు-

## రామనాడు (రామనాథపురం) :

జిల్లా ముఖ్య కేంద్రము. ఇక్కడి నుండే రామేశ్వరం పందాలదాడి మొదలు.

రామనాడులో చూడదగినవి అట్టే ఏమీ లేకపోయినా కొన్ని విశేషాలుమాత్రం గ్రహించతగినవి. రామనాడు రాజా శ్రీ వివేకానందస్వామి విదేశయాత్రానంతరం అభిమాన పురస్కారంగా స్వాగతించి తత్ చిహ్నముగా నాటించిన ఒక స్తంభము, పాతవి, కొత్తవి రాజభవనాలు. శ్రీరామచంద్రుడు గుహుని రాజ్యాభిషిక్తుని చేసిన శిల ఒకటుందట. ఈ సంతితి వారిని 'సేతుపతులు' అంటారట. మరో విధంగా మార్వాయలు అనికూడా అంటారు. ఇక్కడికి దగ్గరిలోనే గల-

## దర్భశయనం :

రామనాడు నుండి దాదాపు 10 కి.మీ. దూరం. ఇక్కడినుండి సముద్రం 5 కి.మీ. దూరం. సీతాపహరణం తరువాత సీతమ్మ జాడ తెలుసుకుని రావణ సంహారార్థం కపిసేనలను లంకమీది కురికించటానికి సేతుబంధన సేయ సమకట్టిన శ్రీరామచంద్ర ప్రభువునకు సముద్రుడెంతకూ దారీయలేదు. ప్రభువుకు కోపంవచ్చింది. బాణం ఎక్కుపెట్టాడు. భయ భ్రాంతుడైన సగరుడు ప్రత్యక్షమయ్యాడు. ఉపాయ మెరిగించాడు. వారన యోధులచే సేతుబంధనం జరిగింది. ఆ సమయంలో ఈ

చోటు దర్భశయనముపై పడుండియున్న సుందరమూర్తి నీలమేఘ శ్యాముడు శ్రీరామచంద్ర ప్రభువు తన్ను దగు లక్ష్మణుని చేరియున్నటువంటి పవిత్రమైనచోటుగా ప్రసిద్ధి. సాధారణంగా రామేశ్వర యాత్రచేసి తిరిగి వచ్చేటప్పుడు దర్శించే ఆచారం వుంది. రామేశ్వరయాత్ర పూర్తిచేసినట్లు కొంత తతంగం జరపటం కూడా కద్దు. ఇది ఒక దివ్యక్షేత్రంగా పరిగణన. ముందు సముద్రస్నానం పూర్తిచేసికొనివచ్చి దేవాలయంలో శయనమూర్తియైన శ్రీరాముని సేవించాల్సివుంటుంది. ఆలయం దగ్గర లోనే గొప్ప రావిచెట్టొకటివుంది. ఋషీశ్వరులు తపస్సు చేసిన చోటుగా ప్రసిద్ధి. అనేకమంది సంతానార్థులై చేసిన ఎన్నో నాగ ప్రతిష్ఠలు కనబడతాయి. రామేశ్వర యాత్రలో ఈ క్షేత్రదర్శనం తరువాతి అంశంగా పెట్టుకోవాలి. ముందు రామేశ్వర యాత్ర పూర్తిచేసుకోవటం ఎంతయినా సముచితం. తోవలో—

దేవపట్టణం— లేక నవపాషాణం :

శ్రీరామునిచే నవగ్రహ దేవతానుగ్రహమునకై ప్రతిష్ఠించిన నవ గ్రహముల రూపములైన తొమ్మిది పాషాణ స్తంభములు. సముద్రంలో 100 గజముల దూరంలో ఉన్నవి. ఒడ్డుననున్న కోనేటిలో స్నానంచేసి పవిత్రులై నవగ్రహముల పూజకు వెళ్ళాలి. పండాలు ఈ కార్యక్రమం దగ్గరవుండి చేయిస్తారు. కానీ చార్జీలు దక్షిణలు దండిగానే తీసికొంటారు. నవపాషాణం నుండి రామనాద్‌వచ్చి రామేశ్వరం యాత్ర సాగించాలి.

# రా మే శ్వ ర ం

## జ్యోతిర్లింగములలో ఒకటి

దేశంలోని చతుర్ధామాల్లోని మొదటి ధామంగా భావించబడుతుంది. ఈనాలుగు ధామములలో దేశం నలుమూలలా చుట్టివేసినట్లే. మొదటిది రామేశ్వరం, రెండవది ద్వారక, మూడవది పూరీ జగన్నాథ్, 4వది- బదరీనాథ్ ధామం. ఉత్తరాన కాశీ వెళ్తామని ఎన్నిసార్లనుకున్నా పరవాలేదట. కాని దక్షిణాదిన రామేశ్వరం వెళ్తామని అనుకొని వెళ్ళకపోతే మహాపాతకమట. మీ మనస్సులోకి వెళ్దామనే సంకల్ప మాత్రంగానే మన పితృదేవతలు మన రాకకోసం స్వర్గంలో నిరీక్షిస్తారట. కనుక ప్రతివారూ కనీసం ఒక్కసారైనా కాశీ క్షేత్రాన్ని దర్శించవలె. మొదటగా కాశీ వెళ్ళి గంగాజలం తెచ్చి రామేశ్వరంలోని శ్రీ రామలింగేశ్వరుని అర్చించితే గాని జన్మ సాఫల్యంగాదు.

ప్రతి భారతీయుడూ చేయదగినపని యని మా భావం. రామేశ్వరం దర్శించటానికి దేశం నలుమూలల నుండి అన్ని రాష్ట్రాల నుండి రావటం గమనించగలం.

వసతులు :

అన్ని సంప్రదాయాల వారికి సత్రాలున్నాయి. వూరు చిన్నదైనా సముద్ర మధ్యంలో నున్న ద్వీపమైనా అన్ని వస్తువులు దొరుకుతాయి. రాజులుమారి, రాజ్యాలు మారినా మారనిదొక్కటే ; అదే రామేశ్వరం. సింహద్వారం 100 అ. ఎత్తున వుంటుంది. ద్వీపం 400 చ.మై. వైశాల్యంలో కొబ్బరి, తాడిచెట్లతోను, బాబుల్ పొదల తోను దివ్యద్వీపంగా శోభిల్లుతూంది.

ఇక్కడ చూడదగినవి- చూడవలసినవి- శ్రీరామనాథస్వామి లేక రామేశ్వర దేవాలయం. స్వామి రామలింగేశ్వర స్వామి. అమ్మవారు పర్వతవర్ధనిదేవి. కోదండ రామస్వామి ఆలయం, గంధమాదన పర్వతం చూడదగినవి.

ఈ చోటునే అరేబియా సముద్రం, బంగాళాఖాతం కలిసే చోటు.

రామేశ్వర దేవాలయం :

ఆలయ నిర్మాణం దాదాపు క్రీ.శ. 12వ శతాబ్దంలో మొదలయి తరువాత అనేక రాజవంశాలు అనేక రీతుల అభివృద్ధి పరచినట్లుగా తెలుస్తుంది, పురాణకథగా రామాయణ కథాకాలంలో కథప్రకారం సీతమ్మవారిని లంకేశుడు చెరబట్టి తీసికొని వెళ్ళిన తరువాత, అమ్మవారి జాడ కనుగొని లంకాధిపతి రావణుని సంహరించివేశాడు శ్రీరాముల వారు. రావణుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుని చంపినాడు గాన బ్రహ్మ హత్యాదోషము అంటింది శ్రీరాములవారికి. అప్పుడు శివలింగ ప్రతిష్ఠ చేయవలసిందిగా పెద్దలు సలహా యిచ్చారు శ్రీరామచంద్రుల వారికి. వెంటనే ప్రియభక్తుడైన వాయు పుత్రుడు హనుమంతుని హిమాలయాల్లోని కైలాసగిరి యందున్న శివలింగమును తెమ్మని పంపారు. వాయువేగ మనోవేగాల్తో వెళ్ళాడు హనుమ. ముహూర్తం దగ్గర పడుతోంది. హనుమ జాడలేదు. అప్పుడు సీతమ్మవారు తన స్వహస్తాలతో సైకత లింగమును తయారు చేసింది అక్కడిక్కడే. సీతారాములు శివలింగ ప్రతిష్ఠ జరిపారు. అంతలోనే హనుమ కైలాసగిరి నుండి వచ్చాడు శివలింగముతో. హనుమంతుని చిన్న బుచ్చకుండా అదికూడా ప్రతిష్ఠించారు సీతారాములు. మొదట హనుమతెచ్చిన లింగము పూజించబడింది. శ్రీరాముల వారిచేత ప్రతిష్ఠించ బడినది జ్యోతిర్లింగము- శ్రీరామ లింగేశ్వరుడని పిలుస్తారు- శ్రీరామ భక్త హనుమాన్ తెచ్చినది శ్రీ కాశివిశ్వేశ్వర లింగం.

రాళ్లోనే అమరియున్నవి. ఆలయం వెలుపల, పరిసర ప్రదేశాల్లో మరో 21 తీర్థాలు న్నాయి. చాలావరకు గంధమాదన పర్వతానికి వెళ్ళివచ్చే దారిలో వున్నాయి.

దేవస్థానంలో గొప్ప విలువగల ఆభరణాములు వివిధ రాజవంశీయులు సమర్పించిన వెన్నో ఉన్నవి. గంధమాదన పర్వత మార్గంలోగల తీర్థస్నానములు, తీర్థవిధుల నిర్వహిస్తూ చేయబడేవాటికి ముందుగా మాట్లాడి తరువాత అనుసరించటం ఎంతయినా మంచిది.

రామేశ్వర పరిసరాల్లో దర్శించదగిన క్షేత్రాలు—

గంధమాదన పర్వతము :

రామాయణ యుద్ధకాండంలో దీనికి విశిష్ట ప్రాధాన్యత ఉంది. హనుమంతుడు లంకకు వెళ్ళటానికి, శ్రీరాములవారు తన వానర సైన్యమును నడిపించినది కూడ ఇక్కడి నుండే. శ్రీరాముల వారు రావణ వధానంతరం లింగప్రతిష్ఠను గూర్చి ఆలోచించినదిక్కడేనట. రెండస్థుల ఈ దేవాలయం ఎక్కితే రామేశ్వర ద్వీపం దృశ్యమానంగా కనబడుతుంది.

ఇంకా— ఏకాంత రామేశ్వరాలయం, నంబనాయకి అమ్మన్, సీతాగుండం, విల్లోరిని తీర్థము, భైరవతీర్థం (పాంబన్‌లో) కోదండరాముని కోవెల వగయిరాలు దర్శించతగినవి.

ధనుష్కోటి :

1964లో వచ్చిన తుఫానులో మిగిలింది కోదండరామ స్వామి ఆలయం మాత్రమేనట. ఇది ఒక ద్వీపం. ఇక్కడే రావణుని తమ్ముడు విభీషణుడు శరణు జొచ్చినచోటు. యుద్ధానంతరం వానరులు నిర్మించిన సేతువును పగుల గొట్టారట ఇక్కడ. శ్రీరాములవారు బాణముతో కొట్టగా వంతెన విచ్చిపోయి రత్నాకరము, మహోదధి రెండున్నూ కలిసిపోయాయట. ధనుస్సుచే పగులగొట్టటంచేత ధనుష్కోటి అనేపేరు సార్థక మయిందంటారు. ఇక్కడ 108 గాని, 36 గాని సముద్రస్నానాలు చేయాలని అంటారు. భరద్వాజ మహర్షి నిర్ణయానుసారంగా చాంద్రాయణ వ్రతఫలం గలుగుతుందని నమ్మిక.

రెండు సముద్రాలు కలిసేచోట యిసుకను తీసికొని రామేశ్వరంలో 3 భాగాలు చేసి పూజించాలట. 2 భాగాలు దానంచేసి 3వ భాగం జాగ్రత్తగా పదిలంగా పట్టుకు వెళ్ళి ప్రయాగలో త్రివేణి సంగమంలో సమర్పించాలట. ఇక్కడ చేసిన దానం కోటి రెట్ల ధిక ఫలమట.

ధనుష్కోటి వయిరు :

స్టీమర్లువచ్చి ఆగుతాయి. ఒకవైపున రైలు ఆగినది. రెండోవైపున స్టీమరు ఆగుతుంది. ఒకదానిలో నుంచి మరొక దానిలోనికి సరుకులు మార్చిడి చూడవచ్చు.

తలైమన్నార్ :

శ్రీలంకకు ఇక్కడినుండే స్టీమరు ప్రయాణం. అయితే శ్రీలంకలో పరిస్థితులు సరిగా లేనందున ఇటీవల ఈ మార్గాన్ని మూసివేయటం జరిగింది. పరిస్థితులు బాగుపడాలి.

రామేశ్వరం నుండి మానా మధురై జంక్షనుకు వచ్చి మదురై ప్రయాణం చేయవలసివుంటుంది. ఇప్పుడు మదురై నుండి రెండవవైపు క్షేత్రాలన్నీ చూచుకుంటూ హిందూమహాసముద్రపు దక్షిణాగ్రమైన కన్యాకుమారి అగ్రముతో వివరణ ముగించుదాం. అందువలన మొదటగా-

# మ దు రై

కాంచీపురం మాదిరిగానే మదురై కూడా చాల పురాతన ప్రశస్తిగల పట్టణం. తమిళనాడులో మదరాసు మహానగరం తరువాత రెండవ పెద్ద నగరం. మీనాక్షిదేవి నివాసం. పాండ్యరాజులరాజధానిగా విలసిల్లిన ఈ అనాదిపట్టణం ఆనాడూ,ఈనాడూ సరిసమాన ప్రతిపత్తిగల శాఖతో జిల్లా ముఖ్యకేంద్రమై వెలుగొందడం నిజంగా గొప్ప విషయం. ఒక గొప్ప పవిత్రస్థలమే గాకుండా మంచి సందడిగల వ్యాపార కేంద్రం. సంస్కృతి సాంప్రదాయాల కాణాచి. కౌటిల్యుని అర్థశాస్త్రంలో మధురై నగర ప్రసక్తి వుంది. వస్త్రాలు, ముత్యాల వ్యాపారం బహు జోరుగా సాగించిన వైనం సుప్రసిద్ధం. క్రీస్తు పూర్వం నుండే విదేశాలతో వర్తక వాణిజ్య సంబంధాలున్నాయని చరిత్ర దాటి చెబుతుంది.

అల్లాఉద్దీన్ ఖిల్జీ మదురై పట్టణాన్ని దండయాత్ర చేసి దోచుకున్న వజ్ర, వైడూర్య విలువైన బంగారు నగలను దాదాపు 500 మురుగులను తరలించుకుని పోవటానికి 6000 ఏనుగులు, కొన్ని వేల గుర్రాలు వెంటబెట్టుకుని వచ్చాడట. అంతటి సిరులు దోచుకున్నా ఇంకా వన్నె తరగని పట్టణం. పాండ్యరాజుల పాలన క్షీణదశకు చేరుకున్న తరువాత విజయనగర సామ్రాజ్యంలోకి చేరిపోయింది. తరువాత మదుర నాయక రాజుల పాలనలో వుంది.

మద్రాసునుండి, త్రివేంద్రంనుండి విమాన సౌకర్యాలున్నాయి. అన్ని ప్రధాన నగరాలకు రైలు, బస్సు మార్గాల కలయిక వుంది.

**మీనాక్షీ దేవాలయం :**

ఇక్కడ ముఖ్యంగా చూడదగింది. ఆలయం నగరంనడిబొడ్డున అమరివున్నది. అద్భుతమైన శిల్పనైపుణ్యం మరెక్కడా కానరాదు. మదురై పేరు రావటానికి ఒక కథ వుంది.

ఒకానొకప్పుడు కారడవి. శివుడు తపస్సు చేసికోటానికి ఏర్పాటులో ఇంద్ర ప్రేరితమై మార్పు చెందింది. కళ్యాణపురరాజుకు ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో ఈ ప్రదేశంలో పరమేశ్వరుడు అమృతం చొలికిస్తున్నట్లుగా కనబడింది. ఈ ప్రదేశాన్ని తన రాజధానిగా చేసికొని 'మధుపుర' మని పేరు పెట్టుకుని కాల క్రమేణా మదుర అయిందని ఒక కథ. దానికి తోడు మీనాక్షి పార్వతిదేవి అవతారం సుందర నయనాక్షి మీనాక్షి. రాజుగారికి ఏకైక అందాల బాలిక, రాజు సింహాసనం ఎక్కిన మహిళా మహారాజ్ఞి. చుట్టుపక్కల కోరమీసాలుగల మగటిమి రాజులు కన్నెర్ర చేసి ఆడది-అబల గదాని కాలుదువ్వారు రాజ్యం మీద దండెత్తారు. అశ్వాన్నధిరోహించి మహారాజ్ఞి మీనాక్షి రూక్షణ వీక్షణాల్తో విసిరే ఖడ్గ ధాటికి ఒక్కరూ నిలబడలేకపోయారు. ఆమె శతృచ్ఛేదనంలో మునిగి ఆవేశంగా యింకా 'ఎవరూ ఎవరూ' అంటూండేసరికి చెరగని చిరునవ్వుతో ఒక యువకుడు నిలుచున్నాడట. అతడే శివుడు. సుందరేశ్వరుడు. తన జన్మరహస్యం స్ఫురించిన మీనాక్షి అమ్మవారు తాను పార్వతీదేవి అంశగా మదిలో గుర్తించినదై తరువాత వివాహం చేసుకొన్నారు.

మీనాక్షి ఆలయంలోనే శివాలయం ఒకటుంది. అది సుందరేశ్వరాలయం.

ఒక వింత సర్పము తిరుగాడి ఒకచోట చుట్టచుట్టుకుని పడుకుందిట. చుట్టచుట్టుకుని పడుకున్నచోటు గర్భగుడి నెలయించి సర్పము తిరుగాడినంతమేర ఒక హద్దుగా ఏర్పడి మిగతా ఆలయం నిర్మాణం జరిగిందని ఒక కథ.

ఏది ఏమయినా మీనాక్షి సుందరేశ్వరుల ఆలయం ద్రవిడ శిల్ప నైపుణ్యానికి పరాకాష్టగా నిలిచిన సజీవ నిదర్శనం. ఆలయం దీర్ఘచతురస్రంగా కొంతరల్లోవున్నా కనబడటం మాత్రం నలుచదరం ముక్కగా కనబడుతుంది. వేయి స్తంభాల మండపంలోను, అమరియున్న 9 గోపురాల్లోను శిల్పకళ తృక్లింతగా నాట్యమాడింది. మండప స్తంభాలమీద మలచిన అతి సున్నితమైన శిల్పాంతు ఒకదానికొకటి సంబంధమేలేదు. ప్రతిదీ దేనికదే సాటి. వింతయైన సోయగాల కొత్తదనం ప్రతి అంగుళం

కోసం ప్రత్యేకించబడింది. ఇక్కడ వుండే రాతి స్తంభాలు సంగీత స్వరాలు సుస్వరంగా పలుకుతాయట. ఇదొక్కటే కాదు. ఇంకా కొన్ని మండపాలున్నాయి. ఒకదాన్ని ఆనుకొని వున్నది పద్మసరోవరం- ఇంద్రుడు స్నానం చేసిందట- అక్కడ వుంది. ఈ కొలనులో నీరు త్రాగిన ఎంతోమందికి మధుర కవితాగానం కరతలామవుతుంది. ఒకనాడు ఎన్నో కవులు వ్రాసిన కావ్యాలకు ఇక్కడ ఈ కొలనులో పరీక్ష పెట్టేవారట. కావ్యం తేలిందంటే విలువైనదనీ, మునిగితే పనికిరానిదని తేల్చేవారట. స్తంభాలమీద పురాతన కవీశ్వరుల చిత్రాలు 24 మందివి చూడగలం.

పూర్తిగా నిర్మించినది- అందే ఆ కాలంలో తరువాతగా వెలసింది తిరుమల నాయకుని మండపం. 20 అడుగుల ఎత్తున 124 స్తంభాల మోపుతో కట్టించబడింది. స్తంభాలమీద అనేక చిన్నచిన్న శిల్పాలు, ఒకదాని కొకటి పొంతనలేకుండా మంచి వెరైటీ. తరువాత కాలంలో దండయాత్ర జరిపిన మానిక్ కాఫర్ కొంతమేరకు నష్టాన్ని కలిగించాడు.

**తిరుమల నాయకుని భవనం :**

ఇండో సార్సనిక్ రీతిలో ఒక విలక్షణ శైలిలో నిర్మించబడింది. దీనికి స్వర్గవిలాసమని పేరు. ఇటుక సున్నంతో కలబోసి కట్టిన పైకప్పుకు దూలాలు వగైరా లేకుండా కట్టబడింది. ఎలా నిలిచిందో తెలియని పరమ రహస్యమైన ఇంజనీరింగు నైపుణ్యాన్ని ఇముడ్చుకుని పొదువుకున్న సుందర సౌధం. అవశ్యం దర్శనీయం. దర్బారు మహల్, స్నానపు గదులు అనేక ఇతర మహల్లు ఉన్నాయి. జిల్లా ముఖ్యకార్యాలయం ఇందులో ఉంది.

**మరియమ్మన్ కోళం లేక తెప్పకోళం :**

పెద్ద చెరువు- అందులో ఒక లంక. దానిమీద ఎత్తయిన గోపురాలు, ప్రాకారాలతో నిర్మించబడిన దేవాలయం. ప్రతి సంవత్సరం తెప్పోత్సవం జరుగుతుంది. వత్తుల లక్ష దీపాలకు పైగా వెలిగిస్తారట. ఉత్సవాన్ని తిలకించటానికి యాత్రికులు అనేకంగా వస్తారు. దీని నిర్మాణం కూడా తిరుమల నాయకుడే చేయించాడని ప్రతీతి. ఉత్సవం జనవరి-ఫిబ్రవరిల్లో తిరుమల నాయికుని జన్మదినోత్సవంగా జరుపుతారని ప్రతీతి.

# మదురై చుట్టుప్రక్కల

## తిరుప్పరంకుండ్రం :

కార్తికేయుని [శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి-(మురుగన్)] ఆరు ప్రసిద్ధ క్షేత్రాల్లో ఇది యొకటి. ప్రవేశంలో 48 స్తంభాలున్న ప్రాంగణంతో ఒక గుహలోకి తీసుకెళుతుంది. మదురకు 10 కి.మీ. దూరంలో ఉంది. 'నక్కీనార్' అనే భక్తుని జన్మస్థలం.

## అళగర్ కోయిల్ :

ఇది యొక దివ్యదేశం. విష్ణ్వాలయం. ఈశాన్యదిశగా 18 కి.మీ. దూరంలో ఉన్నది. ఆలయం వెనుక వెన్నుగా 8000 అడుగుల ఎత్తున ఒక అందమైన చిన్న కొండ ఉన్నది. కొండమీద చక్కటి నీటి ఊట వుంది. స్వామి కల్లోలగర్ సుందర స్వామి. కోతులు విశేషంగా వుంటాయి. చిత్రా పౌర్ణమికి అళగర్ నుండి మదురలోని వైగై నదికి తీసికొని రాబడి అక్కడ ఐదు దినములుంటారట.

ఇంకా ఇక్కడ తిరుక్కూడల్, తిరుమోగూర్, తిరుత్తంగాళ్ దివ్య దేశములను దర్శించవచ్చు. శ్రీవిల్లి పుత్తూరు ఇది యొక దివ్యదేశం. శివకాశి స్టేషను నుండి అయితే 31 కి.మీ. దూరం. తాలూకా ముఖ్యకేంద్రం. వైష్ణవ భక్తుడు పెరియాళ్వారు, ఆండాళ్ళమ్మవారు జన్మించిన పుణ్యస్థలం. విల్లి అనే చెంచుదొర నిర్మించింది గాబట్టి శ్రీవిల్లి పుత్తూరు అనే పేరు వచ్చిందని అంటారు. వూరిలో ఎత్తయిన గాలిగోపురంతో ఆలయం వుంది. శ్రీరంగనాధుడు, ఆండాళ్ళమ్మ, గరుడాళ్వారు నిలుచుని వుంటారు. శేషశాయియై పరుండిన శ్రీరంగనాధుని ఆలయం ఉంది. ఏప్రిల్ మాసంలో రథోత్సవం జరుగుతుంది. వేలకొంది యాత్రికులు వస్తారు. ఆషాఢం, భాద్రపదం, మార్గశిర మాసాల్లో గూడ ఉత్సవాలు జరుగుతాయి.

శ్రీవిల్లి పుత్తూరు దగ్గరిలో తిరుమల తిరుపతి వెంకటాచలపతి శాఖగా చెప్పుకొనబడే తిరువన్నామలై ఒకటి వుంది. శ్రీ వేంకటేశ్వరుని దివ్యమంగళ విగ్రహం చూడవచ్చు. తరువాత నేతపనితో ప్రసిద్ధి చెందిన రాజపాళెం తరువాత శంకరనాయిర్ కోవెల-శివక్షేత్రం దర్శించుకుని-

# తెన్ కాశి

జంక్షను చేరాలి. తెన్ అంటే దక్షిణదిశ అని అర్థము. శివక్షేత్రం కనుక తెన్‌కాశి అనే పేరు సార్థకం అయింది. చిత్రానదీ తటంలో ఉన్నది. ఇక్కడ చూడ వలసినది సేవించదగినది 15వ శతాబ్దంలో నిర్మించబడిన కాశీవిశ్వనాథాలయం. తరువాత రెండు శతాబ్దాల అనంతరం గోపురం ఎందువలనో అగ్ని ప్రమాదమునకు గురియైనట్లుగా తోస్తుంది. శిల్పనైపుణ్యం మధుర దేవాలయాల్లోని శిల్పాలకు దీటు రాగలవిగా చెప్పుకోవచ్చు. లోపల అమ్మవారి ఆలయం కూడా ఉంది.

కుర్తాలం – జలపాతం :

ఇక్కడికి దగ్గరే ; మంచి ఆరోగ్య కేంద్రంగా ప్రసిద్ధి. జూన్‌నుండి అక్టోబరు ప్రాంతాల్లో అయితే జలధారలు సమృద్ధిగా వుంటాయి. ఎండాకాలమయితే ధారే కన బడకపోవచ్చు. చిత్రానది నీరు సుమారు 50 అ. ఎత్తునుండి క్రిందకు దుముకుతూ పడుతుంది. ఇక్కడి నీళ్ళలో ఉన్న ఖనిజ లవణాలవల్ల నూనెజిడ్డు సైతం సబ్బు రాసుకున్న విధంగా పోతుందట. ప్రకృతి కడురమ్యంగా ఉండి చక్కని ఆరోగ్య కేంద్రంగా విలసిల్లుతూన్న ఈ చోట శివాలయం వుంది. స్వామికి కుర్తాళేశ్వరుడు అని పేరు. అమ్మవారు నిరేణునాదవాణి. ఇక్కడికి దగ్గరిలోనే మౌనస్వామివారి ఆశ్రమం వుంది. ఆశ్రమంలో శ్రీ కోదండరామస్వామివారి ఆలయం, దత్తాత్రేయ, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, వినాయక ఆలయా లున్నాయి. స్వామివారు ఆంధ్రులు. మౌనవ్రతంలో 30 సంవత్సరాలు గడిపి 1944లో సిద్ధిని పొందారు. పడమటి కనుమల కొండల నానుకొనియున్న ఆశ్రమం సుమారు 15 ఎకరాల విస్తీర్ణంలో చక్కని కొబ్బరి అరటి తోటలతో వుండి ప్రశాంత వాతావరణం మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

# పాపనాశనం

అంబా సముద్రం స్టేషనులోదిగి ఆగ్నేయంగా కొద్ది కిలోమీటర్లు పర్వతాల మధ్యగా రమణీయమైన ప్రకృతి సౌందర్యంతో విలసిల్లే ప్రాంతంలోని రోడ్డు ప్రయాణంచేసి చేరవచ్చు. ఊరిలో అగస్త్య మహర్షి దేవాలయం దర్శనీయం.

తామ్రపర్ణి నదీ తీరంలో ఒక శివాలయం వుంది. ఆలయంలోని అదిదేవతకు పాపనాశేశ్వరుడు, అమ్మవారు లోకేశ్వరి. ఆలయం నుండి నదిలోకి మెట్లున్నవి. దిగి స్నానం చేయవచ్చును. పాపనాశనము నుండి పర్వతాల గుండా వెళ్ళే రోడ్డుమీద సుమారు 4 కి.మీ. ప్రయాణంతో కళ్యాణతీర్థ జలపాతం చేరగలుగుతాము. కార్తీక మాసంలోను, మాఘ మాసంలోను యాత్రికులు అసంఖ్యాకంగా వస్తుంటారు. 100 అడుగుల ఎత్తునుండి కిందకు ఏకధారగా పడే జలపాత దృశ్యము నయనమనోహరం. కుడిప్రక్కగా ఒక గుహవుంది. అందులో విఘ్నేశ్వరుని ప్రతిష్టించారు. ప్రక్కనే అగస్త్యతీర్థము, సీతారామ లక్ష్మణులు, శివపార్వతుల, అగస్త్యమహర్షి మొదలయిన వారి విగ్రహాలు ఒక పెద్దరాతితో చెక్కబడియున్నాయి.

కొట్టంతల డాము, తామ్రపర్ణి నదిమీద హైడ్రో ఎలక్ట్రిక్ సప్లయి కేంద్రం, డాముకు అవతలప్రక్కగా కుడిప్రక్కగా సుమారు 8 కి.మీ. బహు స్వల్పప్రయాసతో నడిచివెళితే బాణతీర్థ జలపాతం చేరతాము. ప్రకృతి తన సౌందర్యాన్ని స్వేచ్ఛగా పరిచినచోట, ప్రశాంత వాతావరణంలో కొద్దిసేపు భగవద్ధ్యానం చేసికొంటే చాలు జన్మ చరితార్థమౌతుంది.

గమనిక :

బాణతీర్థమునకు వెళ్ళేటప్పుడు తెలిసినవారు దారి చూపే వారుంటే వెళ్ళటం మంచిది.

ఇక్కడికి దగ్గరలో దుర్గమారణ్యం ఒకటుంది. వన్యమృగాలు యధేచ్ఛగా విహరించేచోటు. ఏనుగులు, ఎలుగులు గుంపులు గుంపులుగా సంచరిస్తుంటాయి. ఇది కల్లిడైకురిచ్చిఅనే స్టేషను సమీపం. 10 కి.మీ. దూరంలో తిరుకురన్‌గుడి అనే దివ్య దేశం దర్శించవచ్చును. దగ్గరలో కొండపైనగల నంబి సన్నిధిక్షేత్రం. ఓపికవుంటేనే వెళ్ళటం మంచిది. అయితే ఒంటరిగా మాత్రం వద్దు. తిరుమంగైయాళ్వారు పరమ పదించినచోటు. పంచనంబుల క్షేత్రం- తిరుమంగై యాళ్వారుల మంగళా శాసనం.

తిరునల్వేలి :

జిల్లా ముఖ్య కేంద్రం. తామ్రపర్ణికి పశ్చిమ భాగంలో వుంది. పట్టణ మధ్య భాగంలో నెల్లియపార్ స్వామి ఆలయంవుంది. మదుర నాయికవంశ రాజుల స్థాపకులు శ్రీ విశ్వనాధనాయకులు పునర్నిర్మించిన దేవాలయం, ఆలయం పెద్దది. వేయి స్తంభాల

మంటపం, సంగీత స్తంభములు, శిల్పము దర్శించ దగినవి. మధుర దేవాల శిల్ప రీతుల్లో మలచబడింది.

శ్రీవైకుంఠము :

దివ్యదేశంగా ప్రసిద్ధి పట్టణం తామ్రపర్ణి నదీతీరంలో ఉంది. పట్టణంలోని వైకుంఠనాథ దేవాలయం చాలా సాదాసీదాగా వుంటుంది. కాని ఇది సుమారు 4000 సంవత్సరాల అనాది దేవాలయమని ప్రతీతి. అమ్మవారి పేరు వైకుంఠవల్లి తాయారు తామ్రపర్ణి నదీతీరంలోనే ఒక శివాలయం కూడా ఉంది. దర్శనీయం. చైత్రమాసంలో ఉత్సవం జరుగుతుంది. ఇక్కడే- దగ్గరిలో 5 కి.మీ. లోపు.

ఆళ్వారు తిరునగిరి దివ్యదేశం :

ఇదికూడా తామ్రపర్ణి నది ఒడ్డునే ఉంది. సత్రాలు, భోజనశాల లున్నాయి. నమ్మాళ్వారు 12 సం. చింతచెట్టు తొర్రలో సమాధియందున్న దేశమట. చూడదగినవిగా ఆలయం- ఆలయం వెనుకగల చింతచెట్టు. ఈ చెట్టు తొర్రలోనే ఏకదీక్షగా ధ్యాననిష్ఠలో వుండి తమిళవేదాన్ని ధారాళంగా పద్యరూపంలో శ్రీ మహావిష్ణువుని స్తుతిస్తూ చెప్పారట. ఈ చెట్టుక్రింద భాగంలో ఒక ఎత్తయిన వేదికను ఏర్పాటుచేసి అందులో 108 దివ్యదేశాల్లోని పెరుమాళ్ళను చిత్రించారుట. యాత్రికులకు బెరడు, చింతాకులు, పవిత్ర ప్రసాదముగా యిస్తారు.

ఇక్కడికి దగ్గరిలోని యితర దివ్యదేశాలు రెట్టైయితిరుపతి, తిరుక్కుళందై, తిరుప్పేరై, తిరుక్కోళూర్, వరగూముగై, తిరుప్పుళంగుడి మొదలగు దివ్యదేశాలు దర్శించి- శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి దేవాలయం-

తిరుచ్చందూరు చేరగలం-

## తిరుచ్చందూరు

సముద్రాన్ని ఆనుకొనియున్న పెద్ద పట్టణం. వసతికి అనేక సత్రాలున్నాయి. ఆలయం వేయి సంవత్సరాలకు పూర్వమే వుందని ప్రతీతి. ఆలయం లోపలి ప్రాకారాలు శిల్పవైభవాన్ని చాటుతున్నాయి. తూర్పు ప్రాకారమును సముద్ర తరంగాలు తాకుతూ వుంటాయి. స్వామి శివార్చనాపరుడై ఒకచేత జపమాల, రెండవచేతిలో

పుష్పమును ధరించి భక్తి మార్గాన్ని బోధిస్తున్నట్లుంటారు. ఇక్కడ కొబ్బరి కాయలు పీచులేకుండా వుండాలిట. ఆలయ ప్రాకారాల్లోనే 24 తీర్థాలున్నాయట. 'నావికణర్' అంటే ఒకబావి వుందట. సముద్రానికి 40 గ. దూరంలోనే ఉంది. కేవలం ఆరంగుళాల కైవారంలో ఉన్న ఈ బావిలో తీర్థము మాత్రం తియ్యటి మంచి నీరు. మిగతా 23 తీర్థాల్లోనివి ఉప్పునీరే! సముద్ర స్నానమెప్పుడైనా చేయవచ్చు.

వైశాఖ, మార్గశిర మాసాల్లో విశేషోత్సవాలు జరుగుతాయి. తిరుచ్చందూరు గ్రామంలో ఒక శివాలయంగూడ వుంది. ఇందులో 16 స్తంభాల మంటపం- అందులో అనేక శాసనాలు చెక్కియున్నాయి. తిరుచ్చందూరు నుండి మరల తిరునల్వేలి వచ్చి అక్కడి నుండి నాంగునేరి, నాగర్‌కోయిల్ వెళ్ళే మార్గంలో-

## తోతాద్రి :

వానమామలై, నాంగునేరి, శ్రీదరమంగయ్‌గా పిలవబడే క్షేత్రం వుంది. ఇక్కడే తోతాద్రినాథ దేవాలయం వుంది. ఇక్కడ స్వామివారి విగ్రహం తీసేటప్పుడు దెబ్బ తగిలిందట. అందుకని స్వామివారికి దబ్బాలకొలది నూనె అభిషేకం చేస్తారు. ఈ అభిషేకించిన నూనెను సోమసూత్రం నుండి తీసి రెండు బావుల్లో పోస్తారు. యాత్రికభక్తులు ఈ నూనెను కీళ్ళనొప్పులకు వాడతారు. నూనెసీసాలు అమ్ముతారు. దేవాలయానికి ముందుగా రామానుజ సాంప్రదాయంలో జియ్యరు మఠం వుంది. స్వామివారికి అందమైన పుష్పవనం, ఒంటె ఉన్నాయి. ఇక్కడినుండి-

## నాగర్‌కోయిల్ :

నాగేశ్వరుని కోవెల చూడదగినది. నాగరాజస్వామి భూమిమట్టంలో స్వయంభువుగా ఉంటారు. గర్భాలయంలో స్వామి ప్రక్కనే నీటిఊట ఉంది. ఆ నీటినే అర్చకులు తీర్థంగా యిస్తారు. ఊటలో కొంత ఇసుకగూడా చేరి ఉంటుంది. దాన్ని ప్రసాదంగా యిస్తారు. ఇందులో ఒక విశేషముందిట. మొదటి ఆరునెలలూ తెల్ల యిసుక, రెండవ ఆరుమాసాలూ నల్లయిసుక వస్తుందట. ఇదెక్కడి చిత్రమో! సత్యమో మరి! ఆలయం ఎదురుగా ఒక చిన్నకొలనుంది. దానిలో యాత్రికులు స్నానం చేస్తారు, నాగర్‌కోయిల్‌లో దానిమ్మ పండ్లు చౌకగా విరివిగా దొరుకుతాయట.

నాగర్‌కోయిల్‌కు దగ్గరిలోనే తిరువణ పరిశారం, తిరువట్టూరు దివ్యదేశాల్ని చూచి కన్యాకుమారి అగ్రమునకు చివర మజిలీ ఆలయం చూదాము.

# శుచీంద్రం

పళయార నదీతీరంలో ఉన్నది. దేవేంద్రుడు తపస్సు చేసి పాపవిముక్తుడైన చోటుగా ప్రసిద్ధి. వూరు కూడా పెద్దది. ఇంతకుముందు తిరువాన్కూరు సంస్థానంలో చేరియుండేది. సత్రాలు మిగిలిన వసతులు అన్నీ వున్నాయి. చూడదగినది స్థానేశ్వరాలయం. స్వామిని స్థానమలయ పెరుమాళ్ళు అని అంటారుట. మొదటి ప్రాకారంలో ఏడంతస్థుల గోపురం ఉంది. యాత్రికులు ఆచారాన్నిబట్టి చొక్కాలువిప్పి వెళ్ళాల్సి వుంటుంది. ఈ క్షేత్రం చుట్టుప్రక్కల పెద్ద అరణ్యముండి అందు అత్రి, అనసూయ మహర్షులు తపస్సు చేసుకొన్న స్థలమని ప్రతీతి. ఇక్కడ సర్వమతుల సమన్వయాన్ని కాపాడుతూ— త్రిమూర్తులు వేరుకాదనీ స్వరూప మొక్కటేనని బోధిస్తూ బ్రహ్మ విష్ణు మహేశ్వరు లేకరూపమున ఇక్కడ వెలసియున్నారు. లోపలఉన్న గదుల్లో పూర్వ విశేషాలు వ్రాయబడి యున్నాయి. స్వామి అభిషేక జలం భూమిలో అంతర్థానమై కన్యాకుమారియొద్ద స్థానతీర్థంలో సముద్రంలో కలుస్తుందట. నీరుతీసివ పిదప యిసుకతీస్తే నీరు బయటకు వస్తుంది. ఉప్పగా ఉండదు. తీయగా వుంటుంది. కన్యాకుమారి, స్థానేశ్వరుల వివాహము నిశ్చయించబడింది— కాని ఆ వివాహం కాలేదు. ఇద్దరూ బ్రహ్మచారులుగానే ఉన్నారు. కళ్యాణ మంటపము, సంగీతస్థంబాలు మ్రోగించి చూడవచ్చు.

మరుత్తువ మలై :

లక్ష్మణ మూర్ఛనుండి లేవదీరటానికి సంజీవ పర్వతం హనుమంతులవారు దూరంగా విసరగా ఇక్కడొక ముక్కపడింది. అదే యీ మరుత్తువమలై. ఇక్కడ ఈ కొండమీద అనేక వనమూలికలు, దివ్యౌషధాలు లభిస్తాయని నమ్మకం.

# కన్యాకుమారి అగ్రము

స్వతంత్ర భారతదేశానికి దక్షిణపు కొన—అగ్రము. శుచీంద్రం నుండి పద మటి కనుమలు ఎత్తుతగ్గి, చిన్న గుట్టలుగా మారి కన్యాకుమారి దగ్గరకి వచ్చేసరికి మైదానంగా ఉంటుంది. ఇది దేశాన్ని మూడువైపులా క్రమ్మియున్న మూడు మహా

సముద్రాలు కలిపే మహత్తరమైన చోటు. రెండు మహా సముద్రాలను వేరుచేస్తూ హిందూ మహాసముద్రం ముందుకు చొచ్చుకుని వస్తుంది. ప్రపంచంలో మరెక్కడయినా ఉందో లేదో తెలియదు కాని ఇక్కడ మాత్రం నిత్యసత్యం– సాయంకాలం పౌర్ణమి రోజుల్లో అస్తమిస్తున్న సూర్యబింబాన్ని, ఉదయిస్తూన్న చంద్రబింబాన్ని ప్రక్కప్రక్కనే చూడగలిగే అతిగొప్ప సన్నివేశం— మూడు సముద్రాలు కలిసి ఉవ్వెత్తున ఎగసిపడే అలల్లో మిళితమై మెరిసే సంధ్యారుణకాంతులు గగనాన ప్రతిఫలించే తీరులు చూస్తేచాలదా జన్మసాఫల్యం?। అందించదా జీవితాంతం చిరకాలం గుండెల్లో గూడుకట్టుకుని ఉండే ఆనందానుభూతి? ఈ మహత్తర దృశ్యాన్ని కనులారా చూడటానికి ఎన్నెన్ని దేశాలనుండి, ఎంతెంత దూరంనించి, వ్యయానికీ, ప్రయాసకీ ఓర్చి వస్తున్నారు ప్రజలు। ఇది ఎంతో అనాదినుండీ అతి పవిత్రమైన స్థానంగా విశేషంగా ప్రశంసించబడి ప్రస్తుతించబడి ఉన్నది.

## కన్యాకుమారి ఆలయం :

సముద్రపు టొడ్డున భారతదేశ పుణ్యక్షేత్రం. మూడు సముద్రాలు ముమ్మూర్తులై ఆదిపరాశక్తి అవతార విశేషమయిన అమ్మవారి పాదపూజ చేస్తున్నాయా అన్నట్లు ఉంటుంది. పదహారేండ్ల బాలిక స్వరూపంలో దుష్టులకు దుర్నిరీక్ష్యయై, భక్తులకు ప్రసన్న సౌకుమార్యంతో మాతృదృక్కులతో ఉన్నట్లుగా కన్పిస్తుంది. ఈ అవతారం వెనుక బాణాసుర వృత్తాంతం పురాణకథగా చెబుతారు. వీరబలగర్వోన్నతుడై చెలరేగిన దుష్టబాణాసురుని వధించుటకు మాత పార్వతీదేవి ఈ అవతారం దాల్చిందని, అది స్థానికంగా వున్న రాజకుమారిగా ప్రభవించి యుక్తవయస్సు రాగానే ఆమెకు వరాన్వేషణ మొదలయిందనీ, అంతలోనే ఆమె తన అవతారపు విశేష ఉనికిని తెలిసికొని శుచీంద్రంలో తపస్సులో నిమగ్నమయిన స్థాణేశ్వరుని వచ్చి తనను పరిగ్రహించవలసిందిగా రాయబార మంపినదట. స్థాణేశ్వరు దందులకు ఒప్పుకొన్నాడు. ముహూర్తం నిర్ణయమైంది. కారణ జన్మురాలైన మాత పార్వతి వివాహమాడితే దుష్టరాక్షసుని దునుమాడటానికి ఈ అవతారంలో కుదరదు. కనుక ఈ వివాహాన్నెలాగైనా తప్పించాలి. ముహూర్తం సమయానికి పరమశివుడు యోగసమాధిలోకి వెళ్ళేట్లుగా నారదుడు యుక్తిపన్నాడు. యుక్తి ఫలించింది. ఇంతలో బాణాసురుడు కన్యయొక్క అందాన్ని గురించివిన్నాడు. ఆమెను తనకివ్వమని వత్తిడి తెచ్చాడు. కోట ద్వారంలోకొచ్చి ప్రేలాపన మొదలెట్టాడు. ఎవరూ దరిచేర

సాహసించలేదు. అప్పుడు 16 సంవత్సరాల బాలికయైన రాజకుమారి బయటికివచ్చి బాణాసురుని సంహరించింది. ముహూర్తం దాటిపోయింది. పరమశివుడు యోగనిష్ఠలో అలా గేపుండిపోయాడు. కన్యాకుమారి కన్యగానే మిగిలిపోయింది. పరమశివుడు. స్థానేశ్వరుడు ఇంకావస్తాడని ఎదురుచూస్తూనే ఉంది. ఆలయం అంత పెద్దది కాక పోయినా విగ్రహం బహుసుందరమైంది. అమ్మవారికి అనేక మణులు మాణిక్యాలు, వజ్రవైడూర్యాలు పొదిగిన ఆభరణాలెన్నో ఉన్నాయి. వాటిలో మహాప్రకాశమాన మైన నాగమణి ఉంది. ఉత్సవసమయాల్లో మాత్రమే అలంకరిస్తారు. మిగతా రోజుల్లో అయితే నావికులను తప్పుదోవ పట్టిస్తుందేమోనని భద్రంగా తీసి దాచిపెడ తారు. అసలు ఆలయం అత్యంత పురాతనమైంది. పురాతన శిథిలాలమీద మరల పునర్నిర్మాణం జరిగింది. అదే యిప్పటి ప్రస్తుత ఆలయస్వరూపం. బాణాసురుని విజయాన్ని పురస్కరించుకుని అమ్మవారికి దసరా శరన్నవరాత్రులు మహావైభవో పేతంగా ఉత్సవాలు జరుగుతాయి.

### వివేకానంద రాక్ మెమోరియల్ :

సముద్ర తీరంనుండి కొంచం అవతల ఒక చిన్నకొండ సముద్రంలోంచి పైకి చూస్తుంది. అక్కడ శ్రీ వివేకానందస్వామి కూర్చుని ధ్యానం చేశారట. ఆ ప్రదేశంలో ఒక అందమైన స్మారకచిహ్నం వెలిసింది. సందర్శకులు అక్కడికి చేరిన ప్పుడు అక్కడ కొద్దిసేపైనా సరే ధ్యానం చేయటం పరిపాటి. ఆ సర్వేశ్వరుడు తన యనుగ్రహం మనమీద సర్వదా ప్రసరించుగాక.

## తమిళనాడులో ఇంకా ఇతరంగా చూడదగిన యాత్రికాకర్షణలు

### ఆరోగ్య విశ్రాంతి కేంద్రాలు – పర్వత విశ్రాంతి కేంద్రాలు :

### కొడైకెనాల్ :

మదురైనుండి 120 కి. మీ. దూరంలో వాయువ్యదిశలో అమరియున్నది. అతి దగ్గరి రైల్వే స్టేషను కొడైకెనాల్ రోడ్డు. కొడైకెనాలుకు 80 కి.మీ. దూరం

ఉంటుంది. ప్రతినిత్యం బస్సులు తిరుగుతుంటాయి. సముద్రమట్టానికి సుమారు 2,140 మీటర్ల ఎత్తున అమరియున్న పర్వతారణ్యప్రాంతం. పక్షుల కలకూజితాలు మనకు కనుల విందు అయిన సంగీత మాధుర్యాన్ని అందిస్తుందే ప్రశాంత వాతావరణం మనస్సుకు హాయిగొలిపే వాతావరణం మరిచిపోలేని మధురమైన అనుభూతి. కాలక్షేపానికి ప్రక్కనే ఒక చక్కని సరస్సుంది. సరస్తీరంలో పచ్చటి వృక్షాలు, లతలు గుబురు పొదలలో విరిసిన వసంతం హరివిల్లులాగా వుంటుంది. చక్కగా పరిరక్షించబడుతున్న గోల్ఫ్‌కేంద్రం ఒకవైపు, అంబరాలను చుంబించే రాతి స్తంభాలు, పరిచిన పచ్చని తివాచీలాగా వున్న లోయ ప్రాంతం, కొంచం క్రిందుగా వెండిజలతారులా ప్రవహించే జలపాతాలు పిటికితోడు ఆధ్యాత్మికోద్దీపనం కలిగించే కురింజ ఆండవర్ ఆలయంగం యాత్రిక ఆకర్షణలుగానూ, బహువిధ పుష్పలతా తరుగుల్మాలతో ఒప్పే పుష్పవనాలు ఎటుచూచినా కనులకింపైన దృశ్యాలే, కమనీయ కావ్యానంద అనుభూతులే. అందుకే కాటోలు సినిమాల్లో సైతం ప్రణయసన్నివేశాల్లో కాశ్మీరుతో పోటీపడే కొడైకెనాలుగూడ చోటు చేసుకుంటుంది తరచుగా.

ఇక్కడికి దగ్గరిలోనే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆరు ఆలయాల్లో ఒక్కటిగా ప్రసిద్ధి చెందిన మురుగర్- పళని ఆండవర్ కోయిల్ తప్పనిసరిగా చూడదగింది. వైగైనదీతీరంలో ఆనకట్టకు అల్లంతదూరంలో అనుగ్రహించే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు శ్రీవల్లీ దేవసేనా సమేతుడై తన మయూరవాహనం వెన్నంటి సేవించగా భక్తులకు అభయమొసంగే వరప్రసాది మనచెంతనే ఉన్నాడు.

యేర్కాడు :

సేలంకు దగ్గరిలో సెర్వారాయిన్ కొండలమీద సుమారు 1600 మీటర్ల ఎత్తులో అమరియున్న మరో సరోవరతీరం, చక్కని అరణ్యప్రాంతం— పర్వత లోయ. ఇక్కడ మనకు ఆహ్లాదాన్ని కలిగించే కమ్మని టీ తోటలూ, కాఫీ తోటలూ, పెద్ద సరోవరం, పర్వతాగ్రాల్లో కమనీయ దృశ్యాలందించే మరెన్నో కింకకేంద్రాలు- మనకోసం వేచివున్న ప్రత్యేకతలు.

ఊటీ :

దీన్నే ఉదకమండలం అనికూడా పిలుస్తారు. పర్వత విశ్రాంతి కేంద్రాలన్నిటికీ మకుటధారియైన మహారాణి సదృశం. దక్షిణాదిన ఊటీ చల్లని విశ్రాంతి కేంద్రమని తెలియని వారుండరంటే అతిశయోక్తికాదు. వెచ్చగా ఆవిర్లెత్తే పడమటిగాలి వీచే ప్రదేశాలవారు ఎండలతో దిమ్మతిరిగే వారి ఊహాలోకపు స్వప్నజగత్తు. నీలగిరి కొండలులో అమరియున్నది. కొండలు నీలంగా ఉంటాయని గాబోలు నీలగిరి అనే పేరు సార్థకమయింది. సముద్ర మట్టానికి దాదాపు 7,500 అడుగుల ఎత్తున అమరియున్న చల్లని ప్రదేశం. ఇక్కడ ఆకర్షణలుగూడ చెట్టు శిఖరం, ఊటీ అందాల సరస్సు, టైగర్‌హిల్ మొదలయిన వాటితోపాటు కూనూరురోడ్డు హాయలు.

కూనూరు :

ఊటీనుండి 19 కి.మీ. ఉంటుంది. సముద్రమట్టానికి 1800 మీటర్ల ఎత్తున అమరిఉన్న పర్వత విశ్రాంతికేంద్రం. వన మధ్యంలో అమరియున్న లేడికన్నింగ్ సీటు, టిప్పుసుల్తాను కోటశిధిలాలు, పట్టణం నడిబొడ్డునవున్న సిమ్స్‌పార్కు, జలపాతాలు, విహార యాత్రాకేంద్రాలు ఎన్నెన్నో.

కోటగిరి :

ఊటీనుండి 28 కి. మీ. దూరం ఉంటుంది. కోటగిరి అతి ప్రాచీనమైనది. సెయింట్ కాథరీన్ జలపాతం, ఎల్క్ జలపాతం, శంఖాకారంలోఉన్న రంగస్వామి శిఖరం మనోహర దృశ్యాల నందించే కీలక ప్రాంతాలుగా ప్రసిద్ధి. ఇవే గాకుండా వన్యమృగ సంరక్షణా కేంద్రాలు మరిన్ని :-

## కాలిమెరి వైల్డ్ లైఫ్ శాంక్చ్యురి :

తంజావూరు జిల్లాలోని కరైక్కాల్ దగ్గరిలో ఉన్న కాలిమెరి నల్లజాతులకి ప్రసిద్ధి. ఇక్కడ కోకొల్లలు. మచ్చలజింక, ఫ్లెమింగో నీటి పక్షులు, ఇంకా అనేక వలస పక్షులు, అడవిపంది మొదలయిన అడవి జంతువులతోపాటుగా ఒకే సారి 80,000 ఫ్లెమింగో పక్షులను ఒక్కసారిగా చూడవచ్చు. నవంబరు నుండి జనవరిలోగా చూడటానికి మంచి అనువైనకాలం.

## ముండాంతురై టైగర్ శాంక్చ్యుయరీ :

కేరళ రాష్ట్రానికి సరిహద్దులో అమరియున్నది ప్రాంతం. అంబాసముద్రం రైల్వేస్టేషను అతిదగ్గరది. జనవరి నుండి సెప్టెంబరు వరకు దర్శనీయం. వసతికి ఫారెస్టు రెస్టుహౌస్ వుంది.

## అన్నామలై వైల్డ్ లైఫ్ శాంక్చ్యుయరీ :

ఇదికూడా తమిళనాడు, కేరళ పర్వత సరిహద్దుల్లోనే వుంది. కోయంబత్తూరు పొల్లాచీల నుండి బస్సులున్నాయి. మీకు స్వాగతం పలికేది పరాంబికులం డామ్. ముఖ్యాకర్షణగా ఏనుగులు, డీర్, పెద్దపులి, చిరుతపులి మొదలయిన భయంకర మృగాలను చూడవచ్చు. వసతికి ఫారెస్టు రెస్టుహౌస్ వుంది.

మద్రాసు దగ్గరిలో గిండీ డీర్ పార్కు వగైరాలు దర్శించదగినవి.

---

శ్రియఃకాంతాయ కళ్యాణ నిధియే నిధయేఽర్థినామ్।
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్
శ్రీ వేంకటాచలాధీశం శ్రియాఽధ్యాసిత వక్షసమ్.
శ్రితచేతన మందారం- శ్రీనివాస మహంభజే.

మంగళమ్–మంగళమ్–మంగళమహాత్.

శ్రీ శ్రీ శ్రీ

సర్వేజనా స్సుఖినో భవంతు



# ఏ రాష్ట్రాలను ఏ యే కాలాల్లో సందర్శించాలి ?

అక్టోబరు నుండి మార్చి వరకు చూడదగిన ప్రాంతములు :-

పంజాబు,

హర్యానా,

ఢిల్లీ,

ఉత్తరప్రదేశ్,

రాజస్థాన్,

గుజరాతు,

బీహార్,

ఒరిస్సా,

పశ్చిమబెంగాల్.

కేరళ :— నవంబరు నుండి ఏప్రిల్.

పాండిచ్చేరి – తమిళనాడు :— నవంబరు నుండి మార్చి.

కర్ణాటక :— అక్టోబర్ నుండి ఏప్రిల్.

మహారాష్ట్ర :— సెప్టెంబరు నుండి మార్చి.

మధ్యప్రదేశ్ :— అక్టోబర్ నుండి మే మరియు ఏప్రిల్.

జమ్ము, కాశ్మీర్ – హిమాచల్ప్రదేశ్ :— ఏప్రిల్ నుండి అక్టోబరు.

జమ్ము, కాశ్మీర్ :— శీతాకాలంలో డిసెంబర్ నుండి జనవరి.

హిమాచల్ప్రదేశ్ :— శీతాకాలంలో డిసెంబరు నుండి ఫిబ్రవరి.

అండమాన్ – నికోబార్ :— డిసెంబర్ నుండి ఏప్రిల్.

అక్టోబరు నుండి మే :— గోవా, లక్షద్వీప్, మేఘాలయా, అస్సాం, అరుణాచల్ప్రదేశ్, మిజోరాం.

సిక్కిం :— మార్చి నుండి మే.

నాగాలాండ్ :— నవంబర్ నుండి మార్చి.

మణిపూర్ :— నవంబర్ నుండి మే.

త్రిపుర :— సెప్టెంబరు నుండి మార్చి.

—|o|—

# యాత్రకు బయలుదేరే ముందు ఈ ఫారం పూర్తి చేసుకోండి

సాధారణంగా పుణ్యనదుల్లోను, సముద్ర తీరంలోను స్నానం చేసేటప్పుడు హిందూ సాంప్రదాయాన్ననుసరించి తీర్థవిధులుగా పితృతర్పణాలు వగయిరాలు చేయడం పరిపాటి. ఆ సమయంలో ఎవరెవరి వంశాల్లో వారి పితృదేవులు, పూర్వులను, రక్తసంబంధీకులను కనీసం 3 తరాల వరకు స్మరించవలసి ఉంటుంది. సదాచార సంపన్నులు ఆయా ప్రదేశాలకు వెళ్ళినపుడు అన్నీ గుర్తుండక పోవచ్చు. వంశవృక్షంలోని పూర్వులు జ్ఞాపకం ఉండకపోవచ్చు. కనుక ఈ ఫారమును ముందుగా పూర్తి చేసుకొని వెళ్ళడం ఎంతయినా యుక్తం. గతించిన వారి పేర్లు మాత్రమే వ్రాసుకోవాలి.

| ప్రాధాన్యతా క్రమంలో | సరియగు సంస్కృత పదం | గోత్రం | గతించిన వారి పేరు |
|---|---|---|---|
| తండ్రి | పితరం | | |
| తాత | పితామహం | | |
| ముత్తాత | ప్రపితామహం | | |
| తల్లి | మాతరం | | |
| తండ్రి తల్లి | పితామహిం | | |
| తాత తల్లి | ప్రపితామహిం | | |

| ప్రాధాన్యతా క్రమం | సరియగు సంస్కృత పదం | గోత్రం | గతించిన వారి పేరు |
|---|---|---|---|
| సవతి తల్లి | సాపత్నీ మాతరం | | |
| తల్లి తండ్రి | మాతామహం | | |
| తల్లి తాత | మాతుః పితామహం | | |
| తల్లి ముత్తాత | మాతుః ప్రపితామహం | | |
| తల్లి తల్లి | మాతామహీం | | |
| తల్లి తండ్రి తల్లి | మాతుః పితామహీం | | |
| తల్లి తాత తల్లి | మాతుః ప్రపితామహీం | | |
| తన భార్య | ఆత్మ పత్నీం | | |
| కొడుకు | సుతం | | |
| అన్న లేక తమ్ముడు | భ్రాతరం | | |
| పెదతండ్రి లేక పినతండ్రి | పితృవ్యం | | |
| మేనమామ | మాతులం | | |
| కూతురు | దుహితాం | | |
| అక్క లేక చెల్లెలు | భగినీం | | |
| కూతురు కొడుకు | దౌహిత్రం | | |
| మేనల్లుడు | భాగినేయకం | | |

| ప్రాధాన్యతా క్రమం | సరియగు సంస్కృత పదం | గోత్రం | గతించిన వారి పేరు |
|---|---|---|---|
| మేనత్త | పితృష్వసారం | | |
| పెదతల్లి లేక పినతల్లి | మాతృష్వసారం | | |
| అల్లుడు | జామాతరం | | |
| అక్క చెల్లెండ్ర పెనిమిటి | భావుకం | | |
| కోడలు | స్నుషాం | | |
| మామగారు | శ్వశురం | | |
| భార్య అన్న లేక భార్య తమ్ముడు | శ్యాలకం | | |
| మతగురువు | స్వామినం | | |
| తండ్రి లేక ఉపనయనం చేసినవారు | గురుం | | |
| తనచే సదరినొందిన దిక్కు లేనివారు | రిక్థినం | | |

ఓం...తత్...సత్...ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః శ్రీ గురుభ్యో నమః

# జీవ బ్రహ్మైక్య రాజయోగ సారామృతము

ఈ మహాకావ్యము యావత్ప్రజల హృదయాలలో చిరస్మరణీయముగా నిలచి, దిశదెసల వ్యాపించి వేనోళ్ళ కొనియాడబడుచున్నది. ఈ మహా గ్రంథము అజ్ఞాన తిమిరాంధకారబంధురమైన యీ లోకమునకు కనువిప్పు అన్న దృఢ విశ్వాసముతో, బహు శ్రమాధికమైన కృషితో లోక కళ్యాణార్థం ముద్రించుట జరిగినది. ఈ అమూల్య గ్రంథము సమాజమునకు బహు ప్రయోజనకారి. సకల రోగములను నివారించు శతకోటి ప్రక్రియలతో, చదివినకొద్ది భక్తిభావము, మనిషిని మనిషిగా తీర్చిదిద్దే తేజస్సు... కోపతాపములను విసర్జించే దివ్యౌషధంగా భక్తిరసప్రదాయకమైన ఈ గ్రంథము ఉపయోగపడును. పవిత్రమైన మనస్సుతో, భగవత్ స్వరూపులైన భక్తులతో ధ్యాన సంద్రమున లీనమై, కామక్రోధ మద మాత్సర్యాదులు విసర్జించి లోక కళ్యాణార్థం కలియుగంబున ఉద్భవించిన మహానుభావులు అగుదురనియు, సమస్త భక్త జనవాహిని ఈ గ్రంథమును చదివి భక్తిపారవశ్యంతో తరింపగలరనియు, తరించి మోక్ష మొందు రీతులలో లిఖించిన ఈ కళాఖండమును క్రమశిక్షణతో ప్రతి ఒక్కరు చదివి బంధువులకు, బంధు మిత్రులకు వినిపించి, ప్రోత్సహించి దయార్ద్రహృదయు లగుదురనెడి ప్రగాఢ విశ్వాసముతో ముద్రించడమైనది.

వరాహమిహిరాచార్య ప్రణీత

# బృహజ్జాతకము

## (ప్రాచీన జ్యోతిష గ్రంథము)

విపులమైన తెలుగు తాత్పర్య సహితము

జాతక, సిద్ధాంత, ముహూర్తభాగములు అని మూడు భాగములుగా జ్యోతిష శాస్త్రము చెప్పబడెను ఈ గ్రంథము జాతకమునకు సంబంధించినది. విశేషప్రచారములో నున్నది. ఈ గ్రంథమును చదువనిదే జాతక ఫలితములు చెప్పుటఅసాధ్యము. దీనిని వరాహమిహిరాచార్యుడు రచించెను. ఈ మిహిరాచార్యుడు భోజమహారాజుయొక్క ఆస్థానములో "నవరత్నము" లను పండితులలోనివాడు. అనగా కాళిదాసు యొక్క సమకాలికుడు. సూర్యోపాసకుడు. ఈయన ఆ కాలములో గ్రీసు, ఈజిప్టు, అరబ్ దేశములకుకూడా వెళ్ళి, అక్కడి జ్యోతిశ్శాస్త్ర పద్ధతులు కూడా బృహజ్జాతకములో వివరించెను. జాతకములలో పట్టుచుండు రాజయోగములు ఏకగ్రహ, ద్విగ్రహ, త్రిగ్రహాదియోగములు వివరముగా తెలిపెను.

జాతక ఫలితములు తెలుసుకొనుటలో - యీ శాస్త్రముతో సమానమైన గ్రంథము వేరొకటిలేదు—

జాతక భాగములో యీ గ్రంథము విశేష ప్రాముఖ్యమైనది యగుటచే మేము వేసిన ప్రథమ ముద్రణ ప్రతులన్నియు స్వల్పకాలములోనే అమ్ముడైనవి. పాఠకుల సూచనల మేరకు మరల యీ గ్రంథము పండితులచే పరిష్కరింపచేసి ప్రథమ ముద్రణలోగల లోపములను సవరించి యీ ద్వితీయ ముద్రణలో లోపములు లేకుండ శుద్ధ ప్రతి ప్రచురించి ఆంధ్ర మహాజనులకు అందజేయుచున్నాము.

వెల : రు. 60-00

వలయువారు :

# బాలాజి బుక్ డిపో,

పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్

మెయిన్ బజార్ * విజయవాడ.520 001.